# కాకతీయసంచిక

జగత్యాం వసుధా భాతి తస్యా మేకశిలాపురీ।
కాకతీయాన్వయ స్తత్ర తస్మిన్ రుద్రనరేశ్వరః॥

(ప్రతాపరుద్రీయం)

సంపాదకుడు


## మారేమండ రామారావు ఎం. ఏ. బి. ఇడి.

మదరాసు విశ్వవిద్యాలయ పరిశోధక విద్యార్థి 1928—1930.

గ్రంథకర్త — భారతీయ విద్యాచరిత్రము : శ్రీమధ్వాచార్యచరిత్రము.

Etc.



ప్రకాశకులు:

ఆంధ్రేతిహాసపరిశోధకమండలి

రాజమహేంద్రవరము.

**1935**




[ వెల. రు. /5.

(తపాలఖర్చుగాక)

# ఆంధ్రేతిహాసపరిశోధకమండలి.

---

తెనుగుప్రచురణములు:-

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | రాజరాజసంచిక | వెల రు. | 5—0—0 | తగ్గింపుధర రు. | 3—0—0 |
| 2. | కళింగదేశచరిత్ర | | 7—8—0 | ,, | 5—0—0 |
| 3. | కాకతీయ సంచిక | | 4—0—0 | | |

ఈ మూడు పుస్తకములు నొకేసారి కొనువారికి తగ్గింపుధరల కీయబడును.

(పోష్టుఖర్చులు ప్రత్యేకము)

ఆంగ్లప్రచురణములు:-

QUARTERLY JOURNAL
OF
THE ANDHRA HISTORICAL RESEARCH SOCIETY.

Vols. I VIII Nett. Rs. 35.
(Except Vol. No. I Part. 2.)

Original Price per set Rs 52/-
Reduced ... 35/-.

---

పుటలు. ౧౩౯—౧౭౬, అకారాది సూచికలు రెండును, విషయసూచి కాక
మొదటి భాగము ౧౨ పుటలును సుజనరంజనీ ముద్రాశాలయందును,
మిగిలిన భాగము రాజా ఎలెక్ట్రిక్ ప్రెస్ నందును ముద్రింపబడినవి.

కాకతీయ సంచికా సంపాదకీయ సంఘము.

శ్రీయుత రాళ్ళబండి సుబ్బారావుగారు ఎం. ఏ. ఎల్.టి.; శ్రీయుత మారేమండ రామారావుగారు ఎం.ఏ.బి.ఇ.డి. (సంపాదకులు); శ్రీయుత చిరావూరి ఆత్మారాంగారు బి.ఏ.బి.ఎల్; శ్రీయుత ఓకుమళ్ళ అచ్యుతరావుగారు ఎం.ఏ.,ఎల్.టి. (ఎడమనుండి కుడివైపుకు)



శ్రీయుత సురవరం ప్రతాపరెడ్డిగారు
బి.ఏ.బి.ఎల్.



శ్రీయుత ధర్మవీర్ వామన నాయక్ గారు జాగీర్దార్ (చారిత్రిక ప్రదర్శన ప్రారంభకులు)



శ్రీయుత పింగళి వెంకటరామా రెడ్డిగారు దేశముఖ్ (కాకతీయ సభాహ్వాన సంఘాధ్యక్షులు)



ప్రొఫెసరు శిరుగూరి హనుమంతరావుగారు ఎం. ఏ. ఎల్. టి. (కాకతీయసభాధ్యక్షులు)



శ్రీయుత మాంపాజు రామకోటేశ్వర రావుగారు (ఆహ్వానసంఘ ముఖ్య కార్యదర్శులు).

# పోషకులు—విరాళములు

| | |
|---|---|
| శ్రీమంతు మహారాణీ శ్రీశ్రీశ్రీ ఆదిలక్ష్మీదేవమ్మ బహద్దరు వారు గద్వాలసంస్థానాధీశ్వరులు. | రు. 500 0-0 |
| శ్రీ రాజాబహదూర్ వెంకటరామారెడ్డిగారు ఓ. బి. ఇ. రిటైర్డుపోలీసుకమీషనరు, హైదరాబాదు. | (O. S) 200-0-0 |
| శ్రీయుత ధర్మవీర్ వామననాయక్ గారు, జాగీర్దారు, హైదరాబాదు. | (O. S) 50-0-0 |
| శ్రీయుత పింగిలి వెంకటరామారెడ్డిగారు, దేశముఖ్, హైదరాబాదు. | 50-0-0 |
| శ్రీయుత ముక్త్యాల వెంకటకృష్ణయ్య గారు. | (O. S) 50-0-0 |

# కాకతీయసంచిక — విషయసూచిక

---

♦ ఈగుర్తుగలవి పద్యవ్యాసములు.

# అనుబంధము — విషయసూచిక

## వాఙ్మయము.



## శాసనములు.

# చిత్రపటముల వివరము

# సంపాదకీయవిజ్ఞాపనము.

రాజమహేంద్రవరమున సుమారు పండ్రెండు సంవత్సరములనుండియు ఆంధ్రేతిహాస పరిశోధకమండలివారు చరిత్రపరిశోధనకార్యమును నిర్వహించుచుండుట యాంధ్రలోకమునకు జిరపరిచితమైన విషయమే. ఈమండలివారు 1923 వ సంవత్సరమున రాజరాజపట్టాభిషేకవర్ధంతిని, 1927 వ సంవత్సరమున కళింగదేశవర్ధంతిని జరపి రాజరాజకళింగసంచికలను బ్రకటించి యున్నారు. అటుపై గాకతీయోత్సవమును జరపి తత్ఫలితముగ గాకతీయసంచికను బ్రకటింప వలెనని వారు 1931 డిశంబరునెలలో నిశ్చయించిరి.

## సంపాదకీయసంఘము.

కాకతీయసంచికకు నేను సంపాదకుడుగను, శ్రీయుత జయంతి రామయ్యపంతులు, రాళ్ళబండి సుబ్బారావు, టేకుమళ్ళ అచ్యుతరావు, భావరాజు వేంకటకృష్ణారావు గార్లు సంపాదకీయసంఘసభ్యులుగను నియమింపబడితిమి. పిమ్మట నేనును అప్పటి మండలికార్యదర్శియగు శ్రీయుత సుబ్బారావుగారును హనుమకొండ హైదరాబాదు పట్టణములకేగి కాకతీయోత్సవమును గాకతీయరాజధానులగు హనుమకొండ వరంగల్లు నగరములలో జరపుటకు వలయు బ్రయత్నములను జేసితిమి. ఈయుత్సవము 1932 వ సంవత్సరము ఏప్రిలు నెలలో జయప్రదముగ జరగినది. మండలివారి యాహ్వానము నంగీకరించి కొందరు పండితు లుత్సవమునకు వచ్చి కాకతీయుల చరిత్రమునకు సంబంధించిన వ్యాసములను పద్యములను జదివిరి. మరికొందరు చక్కని యుపన్యాసముల నొసంగిరి. ఉత్సవసమయమునకే పదునాలుగు వ్యాసములు మాకు జేరినవి. శ్రీయుత రామయ్యపంతులుగారు దేహానారోగ్యమువలన సంచికాసంపాదకీయవర్గమున నుండజాలమని తెల్పుటచే వారి స్థానమున హైదరాబాదు వాస్తవ్యులును చరిత్రకోవిదులు నగు శ్రీయుత సురవరము ప్రతాపరెడ్డిగారిని మండలివారు సభ్యులుగ నెన్నుకొనిరి. 1933 వ సంవత్సరమున మండలి కార్యనిర్వాహకవర్గమున జరగిన మార్పుననుసరించి యప్పటి సంయుక్తకార్యదర్శులగు శ్రీయుత వడ్డాది అప్పారావు, చిర్రావూరి ఆత్మారాంగార్లును సంపాదకీయ వర్గమున సభ్యులైరి. 1934 వ సంవత్సరము ఏప్రిలు నెలలో శ్రీయుత అప్పారావుగారు తమ సంయుక్త కార్యదర్శిత్వమునుండి విరమించుటవలనను, శ్రీయుత భావరాజు వేంకటకృష్ణారావుగారు మండలిలోనుండి తమ సభ్యత్వమును వదలుకొనుటవలనను సంచికాసంపాదకీయ వర్గమునుండి వారి స్థానములు ఖాళీయైనవి. మిగిలినవారు తుదవరకును సంచికాకార్యమును నిర్వహించిరి.



కీ. శే. మహారాజా శ్రీ సీతారామ భూపాల్ బహద్దరువారు గద్వాలసంస్థానాధీశ్వరులు.




G.P. Press.

శ్రీ రాజా వెంకటరామారెడ్డి బహద్దరువారు. ఓ. బి. ఇ.
పోలీసు కమీషనర్, హైదరాబాదు.

## ముద్రణము

కాకతీయోత్సవమునయిన పిమ్మట మరికొన్ని గద్య పద్య వ్యాసములును, శాసనములును చేరినవి. 1932 వ సంవత్సరము జూలై నెలలో సంచికాముద్రణ మారంభింప బడినది. సెప్టెంబరునెలలో నేనును శ్రీయుత రాళ్ళబండి సుబ్బారావుగారును హైదరాబాదునకు బోయి శ్రీరాజా వెంకటరామారెడ్డి బహద్దరు ఓ. బి. ఇ. వారిని దర్శించి వారిద్వారా శ్రీశ్రీశ్రీ గద్వాల మహారాణీ సాహెబా వారి దర్శనము చేసి సంచికకై వారి సాహాయ్యమును వేడితిమి. విద్యాపోషకులు నుదారహృదయులు నగు శ్రీవారు మండలి చేయుచున్న పరిశ్రమ ననేక విధముల బ్రశంసించి రు 500 ల విరాళమును దయచేసిరి. శ్రీ రాజా వెంకటరామారెడ్డి బహద్దరు వారును రు 200 (O. S) ల విరాళమొసంగి మండలిపై దమకుగల యవ్యాజానురాగమును బ్రకటించిరి. పిమ్మట మహాఘనత వహించిన శ్రీ నైజాం ప్రభుత్వమువారి యార్క్షశాఖవారు నాయభ్యర్థనమును మన్నించి ముద్రణార్థ మమూల్యములగు బ్లాకులను బంపిరి. 1933 వ సంవత్సరము జూలై నాటికి కాకతీయసంచిక 200 పుటలును, ముప్పది బ్లాకులును ముద్రింపబడినవి.

అందుపై గొందరుప్రముఖులు బంపెదమని వాగ్దానము జేసిన వ్యాసములకొరకును శ్రీ శ్రీ శ్రీ గద్వాల మహారాణీసాహెబావారు బంపెదమనిన వారి సంస్థానచరిత్రముకొరకు నాలుగుమాసములు వేచియుండవలసివచ్చెను. అనుబంధములో చాలభాగము నీలోపున బూర్తి చేసితిమి. పిమ్మట అక్టోబరునెలలో శ్రీ శ్రీ శ్రీ మహారాణీసాహెబావారి యాహ్వానముపై నేను గద్వాలకేగి, పరిశోధనాపూర్వకముగ వారి సంస్థానచరిత్రమును రచించివచ్చుటచే మరి యారు మాసముల యాలస్య మయ్యెను. అప్పుడుగాని యాచరిత్రసారాంశమును సంచికలో ముద్రింప వీలుపడలేదు. అప్పటికి హైదరాబాదునుండి గోల్కొండపత్రికా కార్యాలయమువారును, మదరాసునుండి భారతిపత్రికా కార్యాలయమువారును మరికొన్ని బ్లాకులను బంపియుండుటచే వానిని ముద్రించితిమి.

ఇంతలో మండలి కార్థికముగ గొన్నిచిక్కులు దటస్థించినవి. దీనికితోడు ముద్రణాలయమును మార్చవలసివచ్చెను. ఈకారణములచే గొంతయాలస్యమైనది. 1934 వ సంవత్సరము జూలై నాటికి సంచికమూలమును, అనుబంధమును బూర్తియైనది. అటుపై ముద్రింపవలసిన "అకారాది సూచిక" లను నేనే తయారుచేయవలసి వచ్చినది. ఈకార్యముయొక్క స్వభావమునుబట్టియు, నేను కార్యాంతరములచే దరచుగ గ్రామమున లేకుండుటవలనను మరికొంత యాలస్యమైనది.

వ్యాసములు.

ఈసంచికలో ప్రకటింపబడిన వ్యాసములనుగూర్చి కొన్నిమాటలు చెప్పవలసియున్నవి. చరిత్రాత్మకములగువానిలో "కాకతీయులచరిత్రము" అను నావ్యాసము మదరాసువిశ్వవిద్యాలయమున పరిశోధక విద్యార్థిగనుండినపుడును, పిమ్మట హైదరాబాదు లక్ష్మణరాయ పరిశోధకమండలివారి శాసనములను జూచినపుడును నేను సేకరించిన విషయముల నాధారముగ జేసికొని వ్రాయబడినది. అందుజేర్కొనబడిన నైజాంరాష్ట్రశాసనములు చాలభాగ మనుబంధమున జేర్పబడినవి. శ్రీయుత గోర్టి వెంకటరావుగారి వ్యాసము ప్రతాపరుద్రునినాటి దేశపరిస్థితులను స్పష్టీకరించి, మహమ్మదీయుల వ్రాతలనుండి యాంధ్రదేశముపై తురుష్కులొనర్చినదండయాత్రలనుగూర్చి దెలియనగు విశేషాంశముల నెన్నిటినో దెల్పుచున్నది. "కాకతీయులు — కళింగము" అను శ్రీయుత సోమశేఖరశర్మగారి యమూల్యమగు వ్యాసము "కళింగసంచిక" నుండి పునర్ముద్రితము. శ్రీయుత దూపాటి రమణాచార్యులవారు "కాకతీయుల చరిత్రము — విశేషాంశములు" అను వ్యాసమునందు నైజాంరాజ్యమున చిరకాలమునుండియు తాముజేయుచున్న శాసనపరిశోధనాఫలితములగు నూతనాంశముల నెన్నిటినో పేర్కొనియున్నారు.

స్థానికచరిత్రములకు సంబంధించిన వ్యాసములు మూడీసంచికలో ముద్రింపబడినవి. శ్రీయుత పింగిలి వెంకటేశ్వరరావుగారి "హనుమకొండస్థానికచరిత్రము" ప్రాచీనగాథలను, చారిత్రకాంశములను సమన్వయించి వ్రాయబడినది. మౌల్వీసయ్యద్ అహమ్మదుల్లాసాహెబ్ గారి "ఓరుగల్లుచరిత్ర" మహమ్మదీయచరిత్రకారుల వ్రాతల ననుసరించి నిర్మింపబడినది. ఉర్దూభాషలోనున్న యీవ్యాసము శ్రీయుత ప్రతాపరెడ్డిగారిచే భాషాంతరీకరింపబడినది. శ్రీయుత శే. రాఘవాచార్యులుగారు "ప్రతాపచరిత్రము" అను వ్యాసమునం దాపేరుగల రెండు గ్రంథములందును గన్పించు వ్యత్యస్తవిషయములను జర్చించి వానిని శాసనాదిచారిత్రక ప్రమాణములతో సమన్వయించి యీగ్రంథముల మూల్యమును నిర్ణయించియున్నారు.

ఈసంచికలో వాఙ్మయమునకు సంబంధించిన వ్యాసము లారు గలవు. శ్రీయుత నిడుదవోలు వెంకటరావుగారు క్రీ. శ. 1100-1350 నడుమగల వాఙ్మయయుగమునకు గాకతీయయుగమని పేరిడి, యందుండిన కవులనుగూర్చియు సంగ్రహముగ వ్రాసియున్నారు. "కాకతీయాంధ్రభాషాసేవ" యనువ్యాసమున శ్రీయుత దూపాటి శేషాచార్యగారు శాసనములనుండి తెలియనగు గొందరుసంస్కృతాంధ్రకవులనుగూర్చియు, ప్రతాపరుద్రునికాలపు గవితల్లజులను గూర్చియు నమూల్యాంశములను వెలిబుచ్చియున్నారు. "పాలకురికిసోమనాథకవి" నిగూర్చి శ్రీయుతబండారు

శమ్మయ్యగారు వ్రాసిన వ్యాసము విశేషపరిశోధనాఫలితము. క్రీడాభిరామకర్తృత్వమును గూర్చిగల వివిధాభిప్రాయములను జర్చించి శ్రీయుత ఓసుమళ్ళఅచ్యుతరావుగారు తమవ్యాసమున వల్లభరాయనికర్తృత్వము నిరూపించినారు. శ్రీయుత మేడేపల్లివెంకటరమణాచార్యులు వారు "ప్రతాపరుద్రీయము" అనువ్యాసమున నాపేరుగల యలంకారగ్రంథముయొక్క సారస్వతప్రాశస్త్యమును బ్రశంసించి యందలి చారిత్రికాంశములను వివరించియున్నారు. "కాకతీయులు—ద్రవిడవాఙ్మయము" అను శ్రీయుతసోమసుందరదేశికరుగారివ్యాసమును, "కాకతీయనాణెములు" అను శ్రీయుతగోపాలాచార్యులవారివ్యాసము నాంగ్లమున మండలివారి త్రైమాసికపత్రికలో బ్రకటింపబడి నాచే నాంధ్రీకరింపబడినవి.

ఈసంచికలో సాంఘికవిషయములకు సంబంధించిన వ్యాసములు నాల్గుగలవు. "విద్యానాథునికాకతీయాన్వయ నిరూపణము" అను వ్యాసమున శ్రీయుత రుద్రరాజ నరసింహరాజుగారు కాకతీయులు క్షత్రియేతరులనువాదమును బ్రతిఘటించి, వారుక్షత్రియులనుటకు ప్రతాపరుద్రీయమునుండి యాధారములను జూపి, యత్వర్కేందుకులత్వమును క్షత్రియత్వమునుటకుపపత్తులను జేర్కొనియున్నారు. "కాకతీయులురెడ్లు" అను శ్రీయుత బి. కృష్ణమూర్తిగారివ్యాసము కాకతీయకులమునుగూర్చిగల రెండవవాదమును దెల్పుచున్నది. "కాకతీయులునాటిసాంఘికచరిత్ర" యనుశీర్షికగల రెండు వ్యాసములలో శ్రీయుత అంబడి సుబ్బరాయచెట్టిగారును, శ్రీయుత సురవరము ప్రతాపరెడ్డిగారును శాసనవాఙ్మయాద్యాధారములనుండి దెలియనగు కాకతీయసామ్రాజ్యమునందలి మతసాంఘికార్థికనైతిక పరిస్థితులను, వాణిజ్యవ్యవసాయములస్థితిని జక్కగ వర్ణించియున్నారు.

వివిధాంశములకు సంబంధించిన మరిమూడు వ్యాసము లీసంచికలో గలవు. అందు "కాకతీయరాజ్యము - భౌతికస్వరూపము" అను శ్రీయుత రాళ్ళబండి సుబ్బారావుగారి వ్యాసమున నీరాజ్యపుటెల్లలును, భౌతికసంపద, శీతోష్ణస్థితి, పంటలు, వాణిజ్యము మున్నగునవి వర్ణింపబడినవి. కాకతీయప్రతాపరుద్రదేవునికాలమునం దుద్భవించి, నాటినుండియు విద్యాపోషణమునకు బేరెన్నికగాంచి, నేటికి నాంధ్రసంస్థానములలో నగ్రగణ్యమై యలరారుచున్న గద్వాలసంస్థానచరిత్ర మదేపేరుగల వ్యాసమున క్లుప్తముగ నాచే వర్ణింపబడినది.

ఇవిగాక నీసంచికలో గాకతీయరాజులగు ప్రోలరాజ గణపతిదేవ రుద్రాంబా ప్రతాపరుద్రాదులను బ్రశంసించు పద్యవ్యాసము లారు గలవు.

మాయభ్యర్థనమును మన్నించి రు. 500 ల మహావిరాళము నొసంగిన శ్రీ శ్రీ శ్రీ గద్వాల మహారాణీసాహెబావారికిని, తమంతటదామే రు. 200 ల విరాళము నొసంగి మాకనేకవిధముల నుపకారముల నొనర్చిన శ్రీరాజా వెంకటరామారెడ్డి బహద్దరు ఓ. బి. ఇ. వారికి నితరదాతలకును మాకృతజ్ఞతాపూర్వక వందనములు. ఈసంచికలో ముద్రించుటకై బ్లాకుల నెరువొసంగిన శ్రీనైజాం. పురాతత్త్వశాఖవారికిని, గోల్కొండ భారతీపత్రికాధిపతులకును, ఆంధ్రసాహిత్యపరిషత్తువారికిని, ఏకశిలానగరదుర్గపు ప్లానును దయతో నొసంగిన వరంగల్ తాలుక్దారువారికిని, స్థానికశిల్పముల ఫొటోలను బంపిన కాకతీయమహోత్సవాహ్వాన సంఘమువారికిని, కాకతీయసభాధ్యక్షోపన్యాసమును తెలుగుజేసియిచ్చిన శ్రీయుత మాడపాటి హనుమంతరావుపంతులుగారికిని మండలివారు మిక్కిలి కృతజ్ఞులు. అమూల్యములగు [illegible]వ్యాసములను బంపిన పండితవర్యులకు మావందనములు. ఈసంచికా సంపాదకసంఘసభ్యులవారికిని, ముఖ్యముగ ముద్రణాకార్యమున నాకనేకవిధముల తోడ్పడిన నామిత్రులు శ్రీయుత రాళ్ళబండి సుబ్బారావుగారికిని, అనుబంధములో జేర్పబడిన శాసనములలో గొన్నిటిని [illegible]తో నొసంగిన శ్రీయుత దూపాటి రమణాచార్యులవారికిని, ఉపోద్ఘాతవ్యాసమును భాషాంతరీకరించి యిచ్చి మరియు ననేకవిధముల సహాయముజేసిన నామిత్రులగు శ్రీయుత సురవరము ప్రతాపరెడ్డిగారికిని నాకృతజ్ఞతాపూర్వక వందనములు.

సంచికా ముద్రణము నోర్పుతో నిర్వహించి తోడ్పడిన రాజన్ ముద్రణాలయాధికారులకును, సుజనరంజనీ ముద్రణాలయాధికారులకును నేను మిక్కిలి కృతజ్ఞుడను.

అనివార్యములగు కారణములవలన నీసంచికాప్రకటన మాలస్యమగుటయు, నిందుగొన్ని తప్పులుపడుటయు జరిగినవి. సహృదయులగు పాఠకమహాశయులీప్రమాదములను మన్నింతురుగాక!

రాజమహేంద్రవరము.
15-3-1935

మారేమండ రామారావు, ఎం. ఏ. బి. ఇ. డి.
సంపాదకుడు.

యు, దేశీయవాణిజ్యమును సుకరముగ నొనర్చియు, భూముల పరిమాణమును సస్యసమృద్ధి ననుసరించియునే సుంకముల నేర్పరిచియు, సస్యభాగములను గృహయోగ్యములుగ నొనర్చియు నీచక్రవర్తు లనేకవిధముల దేశక్షేమమునకై పాటుపడియుండిరి. కాకతీయులనాటి కేంద్రస్థానికప్రభుత్వవిధానములును గ్రామపరిపాలనావిధులు ననేకశతాబ్దములకాలము వర్ధిల్లి నేటికినిఁ గాంచనగుచున్నవి. ఇటునటువన నేల సర్వవిధములను గాకతీయచక్రవర్తుల పరిపాలనాకాలమున నాంధ్రుల కీర్తి ప్రతాపము లెల్లెడలను వ్యాపించినవి. అట్టి యీచక్రవర్తుల చరిత్రను బ్రకృతోపలబ్ధములగు చారిత్రకాధారముల సాహాయ్యమున సంక్షేపముగ లిఖించుటయే యీ వ్యాసముయొక్క ముఖ్యోద్దేశము.

## II ఆధారములు.

శాసనములు:— కాకతీయులచరిత్ర రచనకుఁ దగినయాధారములు పెక్కులు గలవు. వానిలో శాసనములు ముఖ్యములైనవి. ఇయ్యవి చాలవరకు బ్రిటిష్‌గవర్నమెంటువారిదక్షిణహిందూదేశశాసన నివేదికలలో నుదహరింపబడినవి. కొన్నిమాత్రము ఇండియన్ ఆంటిక్వారీ, ఎపిగ్రాఫియా ఇండికా, దక్షిణహిందూదేశ శాసనసంపుటములు మున్నగు గ్రంథములలో సమూలములుగను సవ్యాఖ్యానములుగను బ్రకటింపబడియున్నవి. ఇవిగాక హైదరాబాదునుండి వెలువడు సుజాత పత్రికలో నైజాంరాష్ట్రమునందలి కొన్ని యపూర్వ శాసనముల నాంధ్రపరిశోధకమండలివారు ప్రచురించియున్నారు. ప్రకృతమున లక్ష్మణరాయ పరిశోధకమండలి యన బరగు నీమండలివారివద్ద నింక ననేకములగు శాసనములయొక్క ప్రతిబింబములు గలవు. హైదరాబాదు ప్రభుత్వమువారి యార్కి శాఖచే ఉప్పరపల్లి, పాలంపేట, కొటగిరిశాసనములు ప్రకటింపబడియున్నవి. ఈశాసనము లన్నియు సందర్భానుసారముగ పేర్కొనబడినవి. దిఙ్మాత్రముగ గొన్నిటి చారిత్రక ప్రామాణ్యముమాత్ర మిచ్చట వివరింపబడుచున్నది. మోటుపల్లి, పాకాల ఏకామ్రనాథ, పిల్లలమఱ్ఱి శాసనములు కాకతీయుల వంశక్రమమును నిర్ణయించుటకును, పిల్లలమఱ్ఱి, నాగులపాడు, పాలంపేట, రామప్ప శాసనములు రేచర్లవంశీయుల చరిత్రమునకును, మాల్కాపురశాసనము తాత్కాలిక మత పరిస్థితులను దెల్పుటకును, మోటుపల్లి వారంగల్లు శాసనము లాకాలపు టార్థికస్థితిని నిర్ణయించుటకు నుపయోగించుచున్నవి.

వాఙ్మయము:— శాసనములకంటె బిమ్మట గాకతీయచరిత్రరచనమున కెక్కుడుగ దోడ్పడునవి సంస్కృతాంధ్రవాఙ్మయములు. ఇందు ప్రతాపరుద్రచక్రవర్తి యాస్థానకవిగ నుండిన విద్యానాథుడు రచించిన "ప్రతాపరుద్రయశోభూషణ" మను నాలంకారికగ్రంథ మగ్రగణ్యము. ఈగ్రంథకర్త నిజనామ మగస్త్యుడనియు విద్యానాథు డనునది కేవలము బిరుదమనియుఁ గొందఱ అభిప్రాయపడియున్నారు. ఇట్టి యూహకు "జాతోస్మ్యగస్త్యః కిము" అను నొక శ్లోకభాగము మాత్ర మాధారము. ఈగ్రంథమునుండి యనేక చరిత్రాంశములు దెలియనగుచున్నవి. నాయకప్రకరణమునందు కాకతి యను దుర్గ యేకశిలానగరేశ్వరులకుఁ గులదేవతయనియు గాకతీయకుల "మర్త్యార్కేందుకుల" మనియు; ముమ్మడంబా

మహాదేవరాజులు ప్రతాపరుద్రుని దల్లిదండ్రులనియు, నాతడు యువరాజుగ నుండగనే నా జ్యభారమును వహించె ననియు, జెప్పబడి యున్నది. కావ్యప్రకరణమునుండి కాకతీయులకు వరాహముద్ర యుండెడిదనియు, రుద్రదేవుడనునది రుద్రాంబికకు వ్యావహారికనామమనియు, రుద్రాంబ గణపతిదేవుని కేకమాత్ర పుత్రికయనియు, నాతని యాజ్ఞచే నామె దౌహిత్రుండగు ప్రతాపరుద్రుని బుత్రునిగ బరిగ్రహించె ననియు, నాతడు యువరాజుగ నుండి యనేక విజయముల నందెననియుఁ దెలియుచున్నది. ప్రతాపరుద్రీయమునకుఁ బిమ్మట పేర్కొనదగిన సంస్కృతగ్రంథము గంగాంబ రచించిన "మధురావిజయము". దీని యనంతారికలో నీ కవయిత్రి యేకశిలానగరమునఁ బ్రసిద్ధిగాంచిన యగస్త్య, విశ్వనాథ, నరసింహ, మల్లికార్జునాది గీర్వాణకవులను బేర్కొనినది. ఉదారరాఘవ నిరోష్ఠ్య రామాయణాది సత్కల్లభ్యములగు గ్రంథములుగూడ తాత్కాలిక గీర్వాణభాషావైదుష్యమును నిరూపించుచున్నవి. ఆంధ్రవాఙ్మయమునఁ గాకతీయచరిత్రరచనమున కెక్కుడుగ దోడ్పడునది వల్లభామాత్యకృతమగు "క్రీడాభిరామము." దీని కర్తృత్వము వల్లభకవిదిగాక శ్రీనాథునిదని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చెప్పుచున్నారు. అది యెటులున్నను కాకతీయులనాటి సాంఘిక చరిత్రమును దెల్పునెడ నీగ్రంథ మద్వితీయము. నాటి యేకశిలానగర విభాగములు, ప్రజలలోని విభేదములు, నాకాలపు మతాచార వ్యవహారములు, ప్రజాసామాన్యము కాలక్షేపము నొనర్చు విధములు, రాజధానియందలి దేవాయతనములు మున్నగు విశేషాంశము లీ గ్రంథము నుండి దెలియనగుచున్నవి. శ్రీనాథుని పల్నాటి వీరచరిత్రమునుండి యాకాలమునం దొదవిన సాంఘికమతపరిణామములును, పద్మనాయక వంశోత్పత్తియు సువేద్యము లగుచున్నవి. మారన "మార్కండేయపురాణము" నఁ బ్రతాపరుద్రుని యాశ్రితుడగు నాగయగన్న మంత్రి యొక్కయు నాతని వంశము యొక్కయుఁ బ్రశంసగన్పడుచున్నది. "భాస్కర రామాయణము" నుండి భాస్కరమల్లికార్జునయయ్యలార్యులను నాంధ్రకవిపుంగవుల నామములును, ప్రతాపరుద్రుని యశ్వసైన్యాధ్యక్షుండగు సాహిణిమారుడు నాతని వంశక్రమమును దెలియుచున్నవి. మతగ్రంథములుగూడ కాకతీయచరిత్రాన్వేషణమున నెక్కుడుగ నుపకరించుచున్నవి. వానిలో "శివయోగసార" మగ్రగణ్యము. ఇయ్యది కొలనిగణపతిదేవకృతము. కాకతీయసేనానులలో నగ్రగణ్యులై, తుదకు రాజబంధువులుగూడనై సామ్రాజ్యమూలస్తంభులై యొప్పిన యిందులూరివారి వంశచరిత్రము నీగ్రంథము సవిస్తరముగఁ దెల్పుచున్నది. రెండవ ప్రోలరాజునుండి ప్రతాపరుద్రునికాలమువరకు నీవంశజు లమాత్యులుగ నుండిరి. వారిలో సోమన, అన్నయ, రుద్రుడు ననువారలు ముఖ్యులు. సోమమంత్రి గణపతిదేవచక్రవర్తి కాలమున గొలని సీమను గళింగమును జయించెను. అన్నయదేవుడు మూలక్షిలబలమున కధిపతియై బేతవోలు ఓంచెర్ల, రాజమహేంద్రివరము మున్నగు దుర్గముల నేలుచు, కళింగరాజులను, పాండ్యులను తురకలను జయించి, ప్రతాపరుద్రుని పినతల్లియగు రుయ్యాంబను బెండ్లియాడి మోరుగల్లు మొదలు సింహాచలమువరకునుఁ గల భూభాగమునకు బ్రతినిధిపాలకుడుగ నుండె

ను. ఇటీగాక శివయోగసారమునుండి రుద్రాంబిక గణపతిదేవునికి కూతురనియు, ప్రతాపరుద్రుని తలిదండ్రులు ముమ్మడంబామహాదేవరాజు లనియు విశేషముగ దెలియుచున్నది. "గురుమల్లికార్జునపండితారాధ్యచరిత్రము" నుండియు పాల్కురికి సోమనాథుని గ్రంథములనుండియు తాత్కాలిక శైవమతప్రాబల్యము స్పష్టమగుచున్నది. అప్పయార్యుడను జైనకవి రచించిన "జినేంద్రకల్యాణాభ్యుదయము" నుండి యాకాలమున కాకతీయప్రతాపరుద్రుని నిష్పక్షపాత విద్యాపోషకత్వము రూఢి యగుచున్నది.

స్థానికచరిత్రములు:—గడచిన శతాబ్ది మధ్యభాగమున కల్నల్ మెకంజీ యను దొర మనదేశమునందలి వివిధభాగములలో ప్రజాసామాన్యముయొక్క స్మృతి పథమునం దున్న పూర్వరాజుల చరిత్రములను గ్రామవృత్తాంతములను సేకరించి వ్రాయించి యుండెను. అందు వివిధప్రదేశములందున్న శాసనములకుం గూడ నకళ్ళు జేర్పబడినవి. చరిత్రరచనమున కీస్థానికచరిత్రము లమూల్యసాధనములుగ నున్నవి. ఇందలి విషయము లనేకము లితరప్రమాణములకు సరిపడుచు ననన్యసాధ్యములగు సమస్యలను నిర్ణయించుటకుం దోడ్పడుచున్నవి. అరువదినాలుగు సంపుటములుగల యీచరిత్రము మదరాస్ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున భద్రపరుపబడి యున్నది. ఎలియట్ అనుదొర సంగ్రహించిన యొక శాసనసంపుటమునం గూడ గొన్ని యపూర్వశాసనములు గలవు.

వంశచరిత్రములు:— ఆంధ్రదేశమున రాజ్యమేలిన యనేక రాజవంశముల చరిత్రములు కర్ణాకర్ణిగ దేశమం దెల్లెడలను వ్యాపించియున్నవి. ఇయ్యవి చాలవరకు మెకంజీ దొరచే వ్రాయింపబడియున్నవి. ఇందు గాథలు పురాణములు పెక్కు లున్నను చరిత్రరచనకుం దోడ్పడు రత్నములు గొన్ని గలవు. కాకతీయచరిత్రమున కుపయోగించు వంశచరిత్రములును గాథలును, బెక్కులు గలవు. వీనిలో ఏకశిలానగరవృత్తాంతము, తెలుగురాజుల చరిత్రము, కలియుగరాజుల చరిత్రము, ప్రతాపరుద్రుని సంగతి, కాకతీయరాజ వంశావళి, సిద్ధేశ్వరచరిత్రము, సోమదేవరాజీయము, ఒంటిమిట్ట కరిణాలకైఫీయతు, అనుమకొండ ఏకశిలానగరమును పాలించిన రాజుల వంశావళులు చర్యలు, ప్రతాపరుద్రుని వంశావళి, రాజ్ఞాసము నను తెలుగుగ్రంథములును, కుమారరామునచరిత్ర, ఎనిదారి సోదరరామునచరిత్ర యను కన్నడగ్రంథములును మిగుల ముఖ్యములైనవి.

శిల్పము:— దేవాలయ, ప్రాసాద, తటాక, దుర్గాది వాస్తువులనుండి తాత్కాలికుల శిల్పకళాకౌశలము వ్యక్తమగును. ఓరుంగల్లు, హనుమకొండ, రామప్ప, పాలంపేట, పానగల్లు, పిల్లలమర్రి మున్నగు స్థలములందలి మహోన్నతదేవాలయములు కాకతీయులనాటి నిర్మాణకళ నభివర్ణించుచున్నవి. అందలి సుందరశిల్పములనుండి యాకాలమునం గలమతాభిరుచి, సంగీతనర్తనకళల కొసగబడుచుండెడి యాదరము, తాత్కాలికవస్త్రభూషణాదులు మున్నగు విశేషాంశములును దెలియుచున్నవి.

దేశచరిత్రములు:— కాకతీయులచరిత్రము సమగ్రముగ నింతవరకు నెచ్చటను విశేషముగ గానరాకున్నది. ఆంధ్రచరిత్ర పరిశోధనమునకు మార్గదర్శులగు శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగారి "యాంధ్రుల చరిత్రము" లోని

ద్వితీయభాగమునం దప్పటికిఁ బ్రకటింపబడిన సాధనముల యాధారమున కాకతీయుల చరిత్రము లిఖింపబడియున్నది. కె. వి. యస్. అయ్యరుగారి "పూర్వదక్కను చరిత్రము" నందొక ప్రకరణమున కాకతీయుల ప్రశంస గలదు. కాని యియ్యది కేవల మప్పటికిఁ బ్రకటితములైన శాసనములను మాత్రము ననుసరించి వ్రాయబడియుండుటచే నసమగ్రముగ నున్నది. ఇతరదేశములయొక్కయు చరిత్రములలో సందర్భానుసారముగ గాకతీయుల ప్రశంస కొంతగలదు. భాండార్కరుగారి "ప్రాచీన దక్షిణచరిత్రము"ను ఫ్లీటుదొరగారి "కన్నడ రాజవంశ చరిత్రము"ను, డాక్టరు కృష్ణస్వామిఅయ్యంగారి "దక్షిణ హిందూదేశము, మహమ్మదీయ విజేతలు" అను గ్రంథమును, ఎల్లియట్ డౌసన్ అనువారి "హిందూదేశ చరిత్రము"ను అట్టివే. ఇవిగాక కాకతీయ సేనానుల సంతతివారలై ప్రకృతమున జమీందారులుగ నున్న వెలమ రెడ్డి కులజుల వంశచరిత్రములు గొన్ని గలవు. పద్మనాయక చరిత్రము, వెలుగోటివారి వంశావళి, సురభి వంశావళి, రెడ్డికుల నిర్ణయచంద్రిక మున్నగున ట్టివి.

వ్యాసములు:— చరిత్ర పరిశోధకులు గొందరు యాదృచ్ఛికముగ గాకతీయచరిత్రము సంబంధి కొన్ని యంశములను జర్చించి యుండిరి. ఇవి యన్నియు పత్రికాముఖమున బ్రకటితములై యున్నవి. వానిలో నాంధ్రసాహిత్య పరిషత్పత్రికలో శ్రీ జయంతి రామయ్య, నీలాద్రి రాజుగార్లొసఁగిన కాకతీయుల నిర్ణయచర్చయు, ఆంధ్రపత్రికోగాది సంచికలోని శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి "రెండవ ప్రతాపరుద్రునినాటి యార్థిక పరిస్థితు"లను వ్యాసమును, శ్రీ శేషాద్రిరమణ కవులు భారతీ యుగాదిసంచిక, సుజాత, గోల్కొండ పత్రిక మున్నగు వానిలో వ్రాసిన వివిధ వ్యాసములును గాకతీయ చరిత్రాన్వేషులకమూల్య సౌకర్యము నొసగూర్చుచున్నవి.

ఇంతవరకును వెలువడిన శాసన వాఙ్మయాది ప్రమాణములను, నైజాంరాష్ట్రమున లక్ష్మణరాయ పరిశోధక మండలివారిచే సేకరింపబడిన యపూర్వ శాసనములను ఆధారముగ జేసికొని కాకతీయుల రాజకీయ చరిత్రమును సంక్షేపముగ నేను రాజమహేంద్రవరాంధ్రేతిహాసపరిశోధక మండలివారి త్రైమాసిక పత్రికలో బ్రకటించి యుంటిని.

ఇంతవరకును గాకతీయ చరిత్రమునకుఁగల చారిత్రిక ప్రమాణములను పేర్కొని యుంటిమి. వీని ప్రత్యేక ప్రామాణ్యము సందర్భానుసారముగ సూచింపబడును. ఇక వీని యాధారమున దెలియునగు కాకతీయుల చరిత్రము వివరింప బడుచున్నది.

## III కాకతీయు లెవరు?

కాకతీయు లెవరు యెచ్చటివారలు నను నవి కాకతీయ చరిత్రమున ముందుగ బరిష్కరింపవలసిన ముఖ్య సమస్యలు. ఈ విషయములను గూర్చి దెల్పు నాధారములను బరిశీలించినచో ననేకవిధములు దోచుచున్నది అయినను వానిలో ముఖ్యములగు వానినే నను మనమాలోచింప వలసియున్నది. ప్రతాపరుద్ర చక్రవర్తి కంకితమొనర్పడిన ప్రతాపరుద్రీయమను నందు కాకతియను దుర్గాశక్తి యేకశిలానగరేశ్వరులకుఁ గులదేవతయనియు, నామెనారాధించుటచే నావంశీయులు కాకతీయు లనబరగిరనియు జెప్ప

బడియున్నది. ఏకశిలానగరము సందాకాలమున గాకితమ్మ గుడియుండెడిదని క్రీడాభిరామము దెల్పుచున్నది.[1] కాకతియన్న గుమ్మడితీగెయనియు, నొక రాజాంతఃపురమును శత్రువులు నాశనమొనర్చు సమయమునందొక బాలుడు దైవవశమున గృహమునుండి వెలువడి యొక గుమ్మడితీగెలో జిక్కుకొని శత్రువుల బారినుండి దప్పెననియు, నాతడు ప్రాయమునందు సంస్థానాధీశ్వరుడయ్యెననియు, నాతని సంతతివారెల్లరును దమ వంశమును రక్షించిన గుమ్మడితీగెను గౌరవించుటకై కాకతీయులమని చెప్పుకొనుచుండెడివారనియు సనితల్లి కలువచేరు శాసనము వలనఁ దెలియుచున్నది.[2] ఇదియంతయు నొకగాథవలె గన్పట్టినను బ్రమాణాంతరముల నుబట్టి యిందుకొంతయైన నుపయోగ్యమగు నంశమున్నట్టుల దోచుచున్నది. కాకతీయ రాజులలో పూర్వులు జైనులుగ నుండినట్లు దెలియుచున్నది. వారి రాజధానులగు హనుమకొండ వారంగల్లు ప్రాంతములలో నేటికిని జైనశిల్పములును కట్టడములు ననేకములుగలవు. రాజులవలె నయ్యవిగూడ గాలక్రమమున శైవమును బరిగ్రహించినవి. జైనశిల్పశాస్త్రమును సావధానముగ బరిశీలించినచో గాకతీయులఁగూర్చి విశేషాంశములుగొన్ని వెలువడగలవు. హేమచంద్రుడను నాతడు "అభిదానచింతామణి", "త్రిషష్టిశలాకా పురుషచరిత్రము"లను గ్రంథములలో జైనతీర్థంకరులయొక్కయు వారి కొవచారికులుగనుండు యక్షయక్షిణుల యొక్కయు లక్షణములను జేర్కొనియున్నాడు. నేమి యనునాత డిరువదిరెండవ తీర్థంకరుడు. ఆతనికి "కూష్మాండిని" యను యక్షిణి శాసనదేవి.[3] శ్వేతాంబర జైనులీమెను "అంబికా" యనిపిల్చెదరు. వారిశాస్త్రము ననుసరించి యీమెకు నాల్గుచేతులును, రెండు కుడిచేతులలో నొకదానిలో మామిడిపండ్ల గుత్తియు మరియొకదానిలో పాశమును, యెడమచేతులలో నొకదానియందంకుశమును మఱియొకదానియందొక శిశువు నుండవలెను. దిగంబరగ్రంథముల ననుసరించి యీమె తొడలపై నానుకొని నడిగొనిద్దరు శిశువులుండవలయును. కూష్మాండమనగా గుమ్మడి యని యర్థము. కలువచేరు శాసనమందలి గుమ్మడితీగెకును రాజశిశువునకును గల సంబంధమునకును జైన శిల్పములందలి కూష్మాండినీ నామకయక్షిణికిని యామెవద్దనుండు శిశువులకును సన్నిహితమగు సామ్యము గన్పడుచున్నది. "కాకతి" యను మాటకుగూడ గుమ్మడితీగెయనియే యర్థము. శాసనములలో కాకతీయ శబ్దమునకుఁ గాకతి, కాకత్య, కకెతి, యనురూపాంతరములు గాంచనగుచున్నవి. గాన "కాకతి" యను వంశనామము కేవలము గుమ్మడితీగ నుండి యుద్భవించెననుటకంటెను, కూష్మాండినియను జైనశాసనదేవి వలననే గలిగెననుట సమంజసముగనుండును. అయినచో గాకతీయులు మొదట జైనులుగనుండిరని ధ్రువపడుచున్నది. దిగంబరులే కూష్మాండినీనామము నుపయోగించి శ్వేతాంబరులాదేవి

1 కాకతమ్మకు సైదోడు యేకవీర.
2 ఆం. సా. ప. పత్రిక. IV. పే. 90—112
3 I. A. for 1903. P. 459,

నంబికయని బిలచుటచే గాకతీయులు మొదటిశాఖకే చెందియుండవలయును. రెండవ ప్రోలరాజు మొదట జైనుడుగ నుండినను పిమ్మట శైవమతము నవలంబించెను. ఆతని సంతతివా రందరును శివభక్తిపరాయణులై యుండిరి. గాన రాజమహేంద్రివగ రెడ్డిరాజవంశోద్భవుడై 15 వ శతాబ్దమునందుండిన యాసితల్లి కాలమునకే గాకతీయుల జైనమతావలంబనావిషయము సంపూర్ణముగ విస్మృతమైయుండి కూష్మాండి ప్రశంస యడుగంటియుండుటచే గాకతీయను కూష్మాండమను నర్థము మాత్రము బరిగ్రహింపంబడి యొకగాధ ప్రచురణలో నుండియుండును.

ఇంతవరకును గాకతీయులాదియందు జైనమతావలంబులని జెప్పియుంటిమి ఇకపై వీరలెచ్చటివారలను విషయమును నిర్ణయింపవలసి యున్నది.

ప్రాచీన గాధలనుండిగాకతీయులనుమకొండ ప్రాంతమునకు వలసవచ్చిరని దెలియుచున్నది నైజాం రాష్ట్రములోని గంగాపురమునకును వీరికిని సంబంధము గన్పించుచున్నది. కాకతి బేతిరాజు కొఱవిదేశమునం బ్రతిష్ఠింపబడియెనని యొక శాసనమునుండి దెలియనగును. 10 వ శతాబ్దినాటి యొక తూర్పు చాళుక్యశాసనమునం గాకతీయుల ప్రశంస గానవచ్చుచున్నది.[4] ఈతామ్రశాసనము నించుక పరిశీలింపవలసి యున్నది. వేంగీచాళుక్యరాజగు రెండవ అమ్మరాజు తన పదునొకండవ రాజ్య సంవత్సరమున దనసవతి తమ్ముడగు దానార్ణవుని వేంగీదేశముపైం బ్రతినిధిం జేసి తాను కళింగదేశముపై దాడివెడలెను. అట్టి సమయమున గుండియ రాష్ట్రకూటుని మనుమడును, ఎఱియ రాష్ట్రకూటుని కుమారుడునగు గుండ్యన లేక కాకర్త్యగుండ్యన యను నాతని ప్రేరణచే నతవాటి విషయాధివాసుల కుద్దేశింపబడినది పై పేర్కొనబడిన దానశాసనము. అమ్మరాజు రాజ్యారంభమునుండి యీశాసనకాలము క్రీ. శ. 956 అగుచున్నది. కాకతీయప్రశంసగల శాసనములలో నిదియే మొట్టమొదటిది గుండ్యనపేరున కుపసర్గగనుండిన "కాకర్త్య" యను పదము కాకత్య, కాకత, కాకతి, కాకెతియను రూపాంతరములకు సరిచేయుట సమంజసముగ నున్నది. గుండ్యన తండ్రితాతలకు నామాంత్యమున "రాష్ట్రకూట" యని యుండుటయు నితని పేరునకు కాకర్త్య యను నుపసర్గ యుండుటయు చిత్రముగ నున్నవి. రాష్ట్రకూట యను నామాంత్యపదమును రెండువిధములుగ నన్వయింప వచ్చును. ఈగుండియ యెఱ్ఱయయనువారలు రాష్ట్రకూటవంశీయులుగనుండి కాకర్త్యగుండ్యన కాలమునం దాంధ్రదేశమున వేంగీచాళుక్యసామంతులుగ స్థిరపడియుండవలెను.[5] లేదేని "రాష్ట్రకూట" యనునది ప్రాయికముగ దామ్రశాసనములలో "రాష్ట్రకూట ప్రముఖాన్ సర్వాన్ కుటుంబినస్సమాహూయ" యనుచోట గాంచెడు నొక యుద్యోగమైనను గావలెను. అటులయినచో స్థానికచరిత్రములలో గాంచెడు రెడ్డి,

4 C. P. No. 1 of 1916—17 & E. R. 1917. P 117.

5 కాకతీయులు మొదట రెడ్లుగ నుండిరను నొక యభిప్రాయము గలదు. రాష్ట్రకూట, రట్ట, రడ్డి, రెడ్డి పదములు రూపాంతరములని భాషాశాస్త్రజ్ఞు లభిప్రాయపడుచున్నారు. పై యుత్పత్తి, గుండయ యనువారలును, అందుచే కాకతిప్రోలరాజాదులునుగూడ రెడ్లే యనియును దెలుపుచున్నది. ఇందువలన గాకతీయులు మొదట రెడ్లు తరువాత కమ్మవారైరనను శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగారి వ్రాతలకు బాధ కలుగుచున్నది.

కరణము మున్నగు గ్రామోద్యోగులలోని రెడ్డికిని శాసనములందలి రాష్ట్రకూటునికిని సంబంధముగాని సామ్యముగాని యుండవలెను. దీనిననుసరించి గుండ్యనయునాతని పూర్వులును రెడ్లుగ నుండియుందురను శంక వొడముచున్నది. గుండ్యన రాష్ట్రకూట పదమును విడనాడి కాకర్త్యయను నుపసర్గను గృహనామమునకు సరియగునటుల బరిగ్రహించుటకుఁ గారణమేమియో తెలియదు. సాధారణముగ గృహనామములు నివాసస్థానముల నుండియే బరిగ్రహింపఁ బడుచుండును. పిల్లలమఱ్ఱి బేతిరెడ్డి, వెల్నాటికులోత్తుంగ చోడ గొంకరాజు, ఓరుగంటి ప్రతాపరుద్రదేవమహారాజు మున్నగు నామములిందులకుఁ దార్కాణములు. అటులనే కాకతీయపదమునకు సరియగుపదమే నామముగా గల గ్రామమేదైన నున్నదియాయని చూచినచో మనకు మైసూరు రాజ్యమునఁ "గాకతి" యనునొక గ్రామము గన్పడుచున్నది.[6] దీనినుండి గుండ్యనయు నాతని పూర్వులును మొదట నీకాగతిగ్రామమునం దుండెడివారనియు నీతడాగ్రామ నామమునే బరిగ్రహించెననియు దోచుచున్నది.[7] ఈతని ప్రేరేపణ ననుసరించి చాళుక్యభూపాలకుడొకదానము నొసఁగెనని యీగుండ్యన విశేషప్రతిభాశాలియనియు నెక్కుడు పలుకుబడి గలవాడనియు స్పష్టమగుచున్నది. ఈ ప్రాబల్యము ననుసరించియే యీతడు గృహనామమును గ్రహించి కొంతవ్యక్తిత్వమును జూపియుండెనని యూహింపవచ్చును. కాన కాకతీయవంశమున కీగుండ్యనయే మూలపురుషు డనఁదగును. ఈతని కాలము క్రీ. శ. 950. ప్రాంతమయి యుండును.

ఈ 10 వ శతాబ్ది మధ్యభాగమునుండి 11వ శతాబ్ది మధ్యభాగపు మొదటి ప్రోలరాజు కాలమువరకును కాకతీయుల ప్రశంస యేమియు గన్పించుటలేదు. అయినను తాత్కాలిక వేంగీచాళుక్య చరిత్రమునుండి దాని నూహించుట కవకాశము గలుగుచున్నది. క్రీ.శ. 970-973 ల నడుమ నంతఃకలహములతోడను రక్తపాతములతోడను రెండవ అమ్మరాజు రాజ్య మంతమునందెను. ఇట్టిసమయమున గాకర్త్యగుండ్యనయు విజృంభించి విశేషాధికారమును సంపాదించియుండును. అమ్మరాజునకుఁ బిమ్మట బాడపుడు వేంగిసింహాసనము నాక్రమించి క్రీ. శ. 999 వరకును రాజ్యమేల శక్తివర్మచే నాసంవత్సరమున రాజ్య

6 ఈగ్రామ మాంధ్రదేశపు సరిహద్దులకు సమీపమునం దున్నది.

7 ఈయూహ కేవలము "కాకర్తి" యను వంశనామమునకును "కాగతి" యను గ్రామమునకును గల సామ్యముపైననే యాధారపడియుండునది. నిదర్శనములగు నితరప్రమాణములు దొరకనంతవరకు దీనిని విశ్వసింపవలను పడదు. చోళులు మొదట దాక్షిణాత్యులగు నంతే పిమ్మట నాంధ్రదేశమున స్థిరపడి యాంధ్రులయినటులే కాకతీయులును దత్తమండలప్రాంతమునందలి రాష్ట్రకూటవంశజులై యుండి రెండవఅమ్మరాజు కాలమునాటి కాంధ్రదేశమున స్థిరపడి యాంధ్రులయి యుండవచ్చును. కర్ణాటకదేశమునందలి కల్యాణీచాళుక్యవంశజులగు విష్ణువర్ధనాదుల సంతతివారలు కొన్ని పురుషాంతరములకుఁ బిమ్మట దమ కర్ణాటకోత్పత్తిని మఱచి "జన్మభూమిశ్చళుక్యానాం దేశో వేంగీతి విశ్రుతః" యని చెప్పుకొనియుండుటయు పై యూహకు మఱియొక దార్కాణము. ఏదియెటులున్నను తెలంగాణాప్రాంతమున రాజ్యాధికారమును నెఱపి యనంతవిఖ్యాతిగాంచిన చక్రవర్తులుగ నుండిన ప్రోలరాజాదులుమాత్ర మాంధ్రులనుట నిర్వివాదాంశము.

భ్రష్టత నందింపబడెను.[8] ఇంతవరకును గుండ్యన జీవించియుండకపోయిన నాతని సంతతివారైన నాతనిచే స్థాపింపబడిన స్వాతంత్ర్యమును పెంపొందించియుండురు.

## IV కాకతీయుల వంశావళి.

కాకతీయశాసనములు ప్రాయికముగ రెండవప్రోలరాజునుండియే వంశావళిని బేర్కొనుచున్నవి. కొలదిశాసనములుమాత్రమే మంతకు పూర్వముండిన వారి ప్రశంసను జేయుచున్నవి. కాకతిరుద్రుని హనుమకొండశాసనమునందాతనికిఁ బూర్వము బేతరాజును ప్రోలరాజు నుదహరింప బడియున్నారు.[9] గణపతిదేవుని నాటిపకామ్రినాధ చేబ్రోలు శాసనములలో[10] నొక త్రిభువనమల్ల బేతరాజుగాంచే నగుచున్నాడు. ప్రకృత చరిత్రకారులీ బేతరాజే కాకతీయవంశమునకు మూలపురుషుడని తలంచుచున్నారు. కాని యీయూహ సరియైనదికాదు. కాకతీయవంశ వృక్షమునింకను రెండుపురుషాంతరముల వెనుకకు జరుపుటకు దగినయాధారము లగపడుచున్నవి. క్రీ. శ. 1244. నాటిదగు మోటుపల్లి శాసనమందలి 73—86 పంక్తులలో నొకప్రోలరాజు నాతనిపుత్రుఁడు త్రిభువనమల్లుడు నాతని తనయుఁడు ప్రోలరాజును పేర్కొనబడియున్నారు.[11] వీరిలో మొదటిప్రోలరాజు కేసరీతటాక నిర్మాతయని విశేషించి పేర్కొనబడి యుండుటచే నిందలినామక్రమము సరియైనదియేయని స్పష్టమగుచున్నది. ఈశాసనములందలి త్రిభువనమల్లుడును చేబ్రోలుశాసనమందలి త్రిభువనమల్ల బేతరాజునుగూడ ప్రోలరాజునకుఁ దండ్రిగనే చెప్పబడియుండుటచే వారిర్వురు నొక్కరేయని యూహింపవచ్చును. అటులైనచో నీ త్రిభువనమల్లాభిదుడగు బేతరాజునకుఁ దండ్రిగ బేర్కొనబడిన మఱియొక ప్రోలరాజెవ్వడు? ఆతనిప్రశంస మఱియెచ్చటనైనను గలదా? యనుప్రశ్నలు బయల్వెడలును. నైజాంరాష్ట్రమునందలి కొన్ని యపూర్వశాసనముల యాధారముపై నీప్రశ్నలకు సమాధానముఁజెప్ప వలనుపడుచున్నది. వారంగల్లుజిల్లా కాజీపేటగ్రామమందలి యొకశాసనము దుర్జయవంశీయుఁడగు బేతరాజు కొడుకు ప్రోలరాజుచేసిన ధర్మమునుఁ దెలుపుచున్నది.[12] అచ్చటిదే మఱియొకశాసనము శ్రీమన్మహామండలేశ్వర కాకతీయబేత

---

8 The History of Rajahmundry' in J. A. H. R. S. IV, V, VI by Mr. B. V. Krishna Rao.

పాలంపేటశాసనము— 36-38 పంక్తులు ||

9. 19 శ్రీమద్రుద్రనరేశ్వరస్య సుమతేర్వంశావలిం
20 వర్ణయే|| శ్రీమ త్త్రిభువనమల్లో రాజా కాకత్య వంశసంభూతః|
24 .........|| తత్పుత్రః ... ... ... ...
25 ... ... ... ... .... ప్రోలో
26 రాజ ఇతి .... ... ... ... ... .... I. A. XI. p. 10.

10 I. A. XXI. P. 197. E. I. VI. P. 142

11 E. I. XII. P. 188.

12 దుర్జయకులాబ్ధిచంద్ర స్సత్యా ధీనస్సకల బేతనరేం
ద్రః || తత్పుత్రః ప్రోలనృపః ........ 11—13 పంక్తులు

రాజు నాతనితండ్రి మహామండలేశ్వర ప్రోళరసను పేర్కొనుచున్నది.[13] ఈ రెండు కాజీపేటశాసనములనుండియు దెలియనగు వంశక్రమము పై మోటుపల్లి చేబ్రోలుశాసనములందలి వంశక్రమమునకు సరిపడుచున్నది. దీనిని మఱియొకప్రమాణముకూడ బలపఱచుచున్నది. నైజాంరాష్ట్రమునందలి పిల్లలమఱ్ఱి, పాలంపేట యను రెండుగ్రామము లందలి శాసనములనుండి కాకతీయ రెండవప్రోలరాజు సైన్యాధిపతియగు కామసేనానికిఁ బ్రపితామహుడగు బమ్మసేనాని చోళులతోఁ బోరి యొకకాకతివల్లభునికి వీరలక్ష్మీవివాహమును ఘటించెనని దెలియుచున్నది.[14] దీనినుండి బమ్మసేనాని కాకతి బేతరాజునకుఁ పూర్వపు వాఁడేయనియు నాతని యేలికయగు కాకతీయ రాజన్యుడు బేతరాజు తండ్రియగు ప్రోలరాజేయనియు నూహింప నగుచున్నది.

పై చర్చనుండి ప్రోలరాజు, బేతరాజు, రెండవప్రోలరాజు ననువారలు కాకతీయ వంశమున మొదటిపురుషాంతరముల నుండిరని స్పష్టముగుచున్నది రెండవ ప్రోలరాజునకు రుద్రదేవుడు మహాదేవుడు నను నిర్వురు పుత్రులుండినటు లనేకశాసనములు దెల్పుచున్నవి. మహాదేవ రాజునకుఁ బుత్రుడు గణపతిదేవుడు. ఈతనికిఁ బురుషసంతానమేమియు లేక రుద్రాంబికయను కూతురుమాత్రము గలిగినటుల విద్యానాథుని "ప్రతాపరుద్రీయ యశోభూషణము" నుండియు ననేకశాసనములనుండియుఁ దెలియుచున్నది.[15] రుద్రాంబికకు ముమ్మక్కయుమ్మక్క యను నిర్వురు తనయలు బుట్టిరి.[16] వారిలో ముమ్మడంబకుఁ బ్రతాపరుద్రదేవుడు జన్మించెను.[17] పై విషయములనుండి కాకతీయ వంశవృక్షము నీక్రిందివిధమునఁ బేర్కొనఁదగును

---

13 ......శ్రీమన్మహామణ్డలేశ్వరం కాకతీయ బేతే
శసం తిన్నత ద్దైమహీమండలేశరం ప్రోళలసప. 16—19 పంక్తులు

14 శ్రీమత్పద్మజ పాదపద్మయుగళాల్లోకత్రయాభ్యర్చితా దబ్జాభ
తే విపులేకులే నరవరో బమ్మాభిధానో భవత్। యః కాంచీ
నగరీకవాటహరణం కృత్వా ప్రచండాహవ క్రీడశ్చోడన
రాధిపస్య కృతవాన్మాన ద్రుమోన్మూలనం॥ 10—13 పంక్తులు॥ పిల్లలమఱ్ఱిశాసనము.
Hyd. Arch. Series No. 3. lines 31—38. ఈవిషయము "Recherla family" యను J. A. H. R. S. vol V; pt. 3. P. 139—150. లోని వ్యాసమున చర్చింపఁబడియున్నది.

15 పురాకిల గణపతినామ్ని మహారాజే దుహితృమాత్రసంతానే కదాచిద్దైవ
యోగేన కాలపరిపాకము పేయుషి ... ... ... ప్ర॥ రు॥

16 రుద్రాంబిక రెండవకూతు రుమ్మక్కదేవియని ప్రాచీనచరిత్రములలో చెప్పఁబడియున్నది. శివయోగసారమునం దీమె రుయ్యాంబ యని పేర్కొనబడినది.

17 అసపిత రుద్రమాంబికకు పౌత్ముజ నాబొగడందు
నా ముమ్మడయ్యకు మహాదేవరాజానకు నాత్మ
జాడైన ప్రతాపరుద్రు ... ... ... శి॥ యో॥ సా॥




## V కాలనిర్ణయము.

వంశక్రమమువలెనే కాకతీయరాజుల కాలనిర్ణయము గూడ బహు సమస్యాన్వితమై యొప్పుచున్నది. పూర్వరాజన్యులకాల మింతవరకును సునిర్ణీతమై యుండలేదు. గణపతిదేవుడు క్రీ. శ. 1199—1260 ల నడుమను 1260—1296. మధ్య రుద్రాంబికయు నామెకుఁ బిమ్మట నామెదౌహిత్రుడగు ప్రతాపరుద్రదేవ చక్రవర్తి 1296—1323. లనడుమను రాజ్యమేలిరని ప్రకృత చరిత్రకారుల యభిప్రాయమై యున్నది.[18] హనుమకొండ శాసనము క్రీ. శ. 1162. నాటిదగుటచే 1160. ప్రాంతముననే రుద్రదేవుడు రాజ్యమునకు వచ్చియుండునని కొందఱుపండితు లభిప్రాయపడుచున్నారు. నైజాంరాష్ట్రమునందలి శాసనములను బరిశీలించినచోఁ బ్రకృత పరిగణము సరియైనది కాదనియు, రుద్రదేవునికిఁ బూర్వపు వారల కాలమునుగూడ నిర్ణయింప వీలగుననియుఁ దేలుచున్నది.

సౌకర్యార్థమై ప్రతాపరుద్రుని నుండియే కాలనిర్ణయమునుఁ బరిగణింతము. ఈచక్రవర్తి తనమాతామహియగు రుద్రాంబిక క్రీ శ. 1296లో మరణించినపిమ్మట రాజ్యమునకు వచ్చెనని చరిత్రకారులు విశ్వసించి యున్నారు కాని యీక్రిందిశాసనములనుండి యీతడు క్రీ. శ. 1290. నుండియే రాజ్యపరిపాలనమునఁ బాల్గొనుచుండినటులఁ దెలియుచున్నది.[19]

(1) శా. శ. 1212లో చోడమల్లిదేవమహారాజను సామంతునిచేఁ జేయఁబడిన ధర్మమునుఁదెల్పు దర్శిశాసనము.[20]

(2) శా. శ. 1212. నాటి మల్యాల శాసనము.[21]

(3) శా. శ. 1214 నాటి కల్లీపల్లి, గణపవర శాసనములు.

అదేవిధమున నీచక్రవర్తి రాజ్యాంత్య సంవత్సరముఁగూడ మార్పునందఁజేయు శాసనమొకటి కృష్ణామండలమునఁ గన్పట్టుచున్నది.

---

18 ఈ సందర్భము నాంధ్రుల చరిత్రము ద్వితీయభాగము (పే 245) లో గణపతిదేవుడు క్రీ. శ. 1199—1260 ల నడుమను, రుద్రాంబ 1261—1295 లనడుమను, (పే. 297) ప్రతాపరుద్రుడు1295—1321 వఱకును (పే. 325) రాజ్య మేలిరని వ్రాసియున్నారు.

19 “ధీశోయం యువరాజ ఏవవహతి శ్రీవీరరుద్రోధురాం” అను శ్లోకభాగమున విద్యానాథుడు గూడ నీవిషయమునే జెప్పియున్నాడు.

20 Nel. Ins. D. 6. Ins. Ced. Dist. 105

21 E. R. 204 of 1899 & 173 of 1905

22 Ibid 126 of 1897 నైజాంరాష్ట్రమునందలి పానగల్లు గణపవరము మానూరు శాసనములు క్రీ. శ. 1291, 1292, 1294. లకుసరియగు కాలముల నొసంగుచున్నవి.

దానినుండి క్రీ. శ. 1326 వ సంవత్సరమునం బ్రతాపరుద్రచక్రవర్తి యోరుగల్లు పట్టణంబున రాజ్యము చేయుచుండగా నాతనియొక్క క్షత్రియుడగు రుద్రసేనాని చేసినధర్మము తెలియనగుచున్నది.[23] కాన ప్రతాపరుద్రుడు క్రీ. శ. 1290—1326 ల నడుమ రాజ్యమేలెనని స్పష్టము కాగలదు.

అటులనే రుద్రాంబిక రాజ్యకాల నిర్ణయమునుగూడ మార్పుచేయ వలసియున్నది. క్రీ. శ. 1261 లో రుద్రాంబిక రాజ్యకాలమున వేయబడిన మాల్కాపుర శాసన మీరాజ్ఞని యామెతండ్రియగు గణపతిదేవునింగూడ నాసంవత్సరమునం బేర్కొనుచున్నది. ఇటుల తండ్రికూతు లొకేకాలమున రాజపదమున నుండుటయును, క్రీ. శ. 1260 నుండియే రుద్రాంబిక రాజ్యమేలుచుండెనని నిరూపించు నితరశాసన ప్రమాణము లభించుటయు సమాలోచించి పై మల్కాపుర శాసనమును బ్రకటించిన శ్రీజయంతి రామయ్య పంతులుగారు గణపతిదేవుడు క్రీ. శ. 1260 లో రాజ్యమును త్యజించియుండునని యభిప్రాయపడి యున్నారు.[24] పై జాంరాష్ట్రమునందలి బూరుగుగడ్డలోని యొకశాసనము పై సమస్యకు స్పష్టముగు నుత్తరము నొసంగుచున్నది. అందు క్రీ. శ. 1258 లో రుద్రాంబిక భృత్యుడొకడు ఆరాజ్ఞి రాజ్యకాలమునందొక ధర్మమునుం జేసెనని చెప్పబడి యుండుటచే నీమె యీశాసనకాలమునకే (క్రీ. శ. 1258 నాటికే) సింహాసనమునకు వచ్చెనని తెలియుచున్నది[25] దీనినుండి క్రీ. శ. 1248—1261 ల నడుమ గణపతిదేవుడును రుద్రాంబికయునుం గలసి రాజ్యమేలుచుండిరని స్పష్టమగుచున్నది గణపతి తన యేకమాత్రి దుహితకు రుద్రదేవుడనం బురుషనామమిడి యామెననేక రాజ్యాంగకార్యములం బాల్గొనం జేయుచుండెనని చెప్పు ప్రతాపరుద్రీయము దానిని బలపఱచుచున్నది. ఇట్టి సంయుక్త పాలనము కాకతీయచరిత్రమునందింకొకసమయమునంగూడ గాంచనగుచున్నది. 1290—1296 ల నడుమ రుద్రాంబికయుం బ్రతాపరుద్రుండునుం గూడ నిటులే పరిపాలించియున్నారని యింతకుమున్నే నిరూపింపబడి యున్నది. గాన గణపతి దేవుని రాజ్యాంత్య సంవత్సరము క్రీ. శ. 1261 యని తేటపడుచున్నది. ఈరాజన్యునిదగు నొక త్రిపురాంతక శాసనము క్రీ. శ. 1183 లో నీతని 62 వ రాజ్యసంవత్సరమున వేయబడియున్నది దీనినుండి గణపతి దేవుడు క్రీ. శ. 1198 కి సరియగు శా. శ. 1120 లో కాకతీయ సింహాసనము నధిష్టించెనని తెలియుచున్నది.[26] ఈతని తండ్రియగు మహాదేవరాజు కాలమును నిర్ణయించుటకు బ్రత్యక్ష ప్రమాణము లేమియులేక గణపతిదేవుని రాజ్యారంభ

---

23 మఱియును హంపీనృసింహస్వామికి వెనుక వైపున గల యొకశిలపై క్రీ. శ. 1326 లో నీచక్రవర్తి యాశ్రితుడగు నొక రెడ్డిచే లిఖింపబడిన దానశాసనము రెడ్డికులనిర్ణయ చంద్రిక 89—90 పుటలలో పేర్కొనబడినది.

24 J. A. H. R. S. V pt. IV. The Malkapur Ins. of Rudradeva.

25 ...స్వస్తిశ్రీమన్మహామండలేశ్వర కాకతీయ రుద్రదేవమహారాజులు పృథివీరాజ్యము సేయుచుండగాను............... ...........దేవకీపుత్రదా నులు స్వస్తిశ్రీ శుభశకవర్షములు ౧౧౮౦. పడమర — 3-7 పంక్తులు

26 E. R. 196 of 1905

కాలమును ఆతని పెదతండ్రియగు రుద్రదేవుని రాజ్యాంతకాలము నాధారముగ నై యున్నవి. నైజాంరాజ్యములోని పిల్లలమఱ్ఱి గ్రామమందలి యొక శాసనము శా. శ. 1117 లో రుద్రదేవుడు రాజ్యమేలుచుండగా నామిరెడ్డి యొసర్చిన ధర్మమును దెలుపుచున్నది.[27] ఇటుపై రుద్రదేవుని శాసనములు గానరాకుండుటచే నిదియే యాతని రాజ్యాంత్యవత్సరమని బరిగణింపవలసి వచ్చుచున్నది. అటులయినచో మహాదేవరాజు రాజ్యకాలము క్రీ. శ 1195—1198 ల నడుమ నయియుండును. ద్రాక్షారామ శాసనములలో నొకదానియందు శా. శ. 1080 లో రుద్రదేవుని ప్రశంసగలదు.[28] ఇంతకుం బూర్వపు శాసనములు గన్పింపకుండుటచే నిదియే యాతని రాజ్యారంభకాలముగ బరిగణింపవచ్చును. ఇటుపై కాలనిర్ణయమొనర్చుట కష్టసాధ్యముగనున్నది. రెండవ ప్రోలరాజు ప్రశంస క్రీ. శ. 1117 నాటి అనుమకొండ శాసనమునను,[29] నైజాంరాష్ట్రమునందలి క్రీ. శ. 1119 నాటి మాటేరుశాసనమునందును, 1915 సం॥ దక్షిణదేశ శాసన నివేదికయందలి క్రీ. శ. 1115 నాటి మఱియొక శాసనమునను గన్పడుచున్నది.[30] గాన నీతడు క్రీ. శ. 1115—1158 ల నడుమ రాజ్యమేలియుండునని చెప్పవచ్చును. ఇటుపైని పురుషాంతరమునకు ముప్పది సంవత్సరముల వంతున లెక్కించి కాకతి బేతరాజు 1085—1115 ల నడుమను మొదటిప్రోలరాజు 1050—1085 ల నడుమ రాజ్యమేలిరని యూహింపవలసియున్నది. అప్పుడు కాకతీయరాజుల రాజ్యకాలము లీ క్రిందివిధమున నుండును.

| | |
|---|---|
| మొదటి ప్రోలరాజు | 1050—1085 |
| కాకతి బేతరాజు | 1085—1115 |
| రెండవ ప్రోలరాజు | 1115—1158 |
| రుద్రదేవుడు | 1158—1195 |
| మహాదేవరాజు | 1195—1199 |
| గణపతి దేవుడు | 1199—1261 |
| రుద్రాంబిక | 1258—1296 |
| ప్రతాపరుద్రుడు | 1290—1326 |

## VI. కులనిర్ణయము.

కాకతీయుల కులనిర్ణయమునుగూర్చి యిదివరలో ననేక వాదోపవాదములు ప్రబలియుండినవి.[31] కొందరు పండితు లీ రాజులు క్షత్రియులనియు మఱి కొందరు వీరలు చతుర్థకులజులనియు నభిప్రాయపడియున్నారు. ప్రాయికముగ శాసనములలో వీరలు కాకతీయులనియు, వీరిది కాకతీయకులమనియు చెప్పబడియున్నది. కాని గణపతి దేవునినాటి మోటుపల్లి, పాకాల, కాంచీవరశాసనములలో నీరాజులు క్షత్రియులుగను సూర్యవంశీయులుగను పేర్కొనబడియున్నారు.[32] బస్తరు సంస్థా

27 నిరువదిపంబునిధి కష్టిశాంతాం పృథ్వీమిమాంశాసతి రుద్రదేవే. పంక్తి 5—6
శకవరుషములు ౧౧౧౭. పం. 11—31.

28 S. I. I. IV, No. 1107

29 E. I. IX, p. 256

30 E. R. 316 of 1915

31 J. A. H. R. S. IV, pt. 3. "Some interesting facts about the Kakatiyas" అను వ్యాసము.

32 Ep. Ind, XII, p 188. Hyd. Arch. Series No. 4.
Ind. Ant XXI, p. 197.

నమునందలి కొన్ని శాసనములలో రాజా దిక్పాలదేవుడు కాకతీయ వంశజుడనియు నా వంశము చంద్రవంశమనియుఁ దెల్పబడి యున్నది.[33] ప్రాచీన వంశచరిత్రలలో గూడ నీరాజన్యులు చంద్రవంశీయుఁడగు మాధవవర్మ సంతతివారలుగ చెప్పబడియున్నారు. ప్రతాపరుద్రీయ గ్రంథకర్తయగు విద్యానాథకవి కాకతీయాన్వయ "మర్త్యార్కేందుకుల" మని వర్ణించియున్నాడు. కాకతి రుద్రదేవునినాటి యనుమకొండ శాసనమును లిఖించినకవి "శ్రీమద్రుద్ర నరేశ్వరస్య సుమతేర్వంశావలిం వర్ణయే" యని చెప్పియు, "శ్రీమత్త్రిభువన మల్లోరాజా కాకత్యవంశ సంభూతః" యని ప్రారంభించియున్నాడు.[34] ఇది యిట్లుండ కాకతీయరాజుల సామంతులయొక్క శాసనములనుండియు, వారి సన్నిహిత బాంధవ్యములనుండియు, వారలు జన్మచే క్షత్రియులుగారనియు, చతుర్థాన్వయులేయనియు దెలియుచున్నది. కాకతీయ శాసనములలోనే వారు దుర్జయుని సంతతివారని యున్నది.[35] ఇట్టి దుర్జయవంశీయు లనేకులు చతుర్థాన్వయులై యుండి 12, 13 శతాబ్దములలో నాంధ్రదేశము నేలిరి. వీరందరకును గాకతీయులకును సన్నిహిత బాంధవ్యము లుండినటుల శాసనములనుండి తెలియుచున్నది. కొండపడమటి బుద్ధరాజును నంబయయును దుర్జయులు.[36] కాకతీయ గణపతిదేవుని సోదరియగు మేలాంబిక దుర్జయవంశీయుడును నతవాటి బుద్ధరాజు కుమారుడునగు రుద్రునిఁ బెండ్లియాడెను.[37] ఈ గణపతిదేవుని పుత్రికయగు గణపాంబ దుర్జయాన్వయుఁడగు కోటబేతరాజున కొసంగబడియెను.[38] వీనినుండి చతుర్థాన్వయులతో సంబంధములను నెఱపిన కాకతీయులుగూడ నదేకులమునకుఁ జెందినవారై యుందురని తెలుచున్నది. దక్షిణపాదులోని నాగనాథాలయమాదలియొక శాసనమున రెడ్డిశబ్దవాచ్యుడో కదు ప్రతాపరుద్రునికిఁ బుత్రుడుగా పేర్కొనబడి యున్నాడు. స్థానిక చరిత్రములు జుట్టయలంక గొంకారెడ్డియను నాతఁడొ కాదయ్యన కింకొక తనయుడని దెల్పుచున్నవి. నైజాం రాష్ట్రములోని బూదపుర గ్రామమునందలి యొక శాసనము మొదట నాలుగు వర్ణము లుండిన వనియు, వానిలో నాల్గవది జగత్ప్రసిద్ధమగువంశమనియు, నందు గాకతీయులు జన్మించిరనియుఁ జెప్పుచున్నది[39] ఇదే విషయమును మల్యాలగుండ దండాధిపుని భార్య పద్మమాను పురమున వేయించిన శాసనముగూడ దెలుపుచున్నది.[40] గాన నీ ప్రమాణముల యాధారముపై గాక

---

33 Inscriptions of the Buster State Ep. Ind. IX. p. 163.

34 19—20 పంక్తులు  35 పైమోటుపల్లి, పాఖాలశాసనములు.

36 Ep. Ind. VI, p. 268 and 269.  37 E. R. 204 of 1904. Ep. Ind, VI, p. 159.  38 Ep. Ind VI, p. 84.

39 ……………చత్వారో జగతిఖ్యాతా
స్తతో వర్ణాస్సమంతతః। ………తేషాం మహీయమహి
మం మహితస్తురీయో వర్ణశ్రియః ప్రభవభూమి……………
……………………………………
ప్రశస్తమ సీత్తత్రాపి కాకతీయకులం మహత్. 17—23 పంక్తులు॥

40 సుజాతా 1927 సంపుటము పే 86.

తీయులు చతుర్థాన్వయులేయనియు వారికి క్షత్రియత్వము కేవల ధాత్రీపతిత్వ సంజ్ఞకమేయనియు చెప్పవలసి యున్నది

## VII మొదటి ప్రోలరాజు

(1050—1080)

ఈ మొదటిప్రోలరాజు సేనాని యొకఁడు కాంచీనగరముపై దాడివెడలి చోళరాజునకు పరాభవమొనర్చి యానగర కవాటమును హరించి తనయేలికయగు కాకతివల్లభునకు విజయలక్ష్మీ వివాహమునొనర్చెనని పిల్లలమర్రి, పాలంపేట శాసనములనుండి తెలియవచ్చుచున్నది. ఈవిషయము కాకతీయచరిత్రమునకు చాలముఖ్యమైనది. కాకతీయుల కాలమును నిర్ణయించునెడ నీమొదటిప్రోలరాజే పై కాకతివల్లభుడని చెప్పియుంటిమి. గుండ్యన నామమునకుఁగల కాకర్త్యపదమును యీప్రోలరాజునకుఁగల "కాకతివల్లభ" యను విశేషణము నీయిర్వురు నొకేవంశములోనివారని చెప్పుచున్నవి. ఈప్రోలరాజెచ్చట రాజ్యమేలెను, యీతనికి గాంచీపుర చోళులతో వైరమునకుఁగారణమెద్ది యను విషయములను నిర్ణయింపవలసి యున్నది. ఇట్టియెడ గూడ బూర్వమువలెనే వేంగి చాళుక్యవంశచరిత్రమే మనకు తోడ్పడగలదు. మహాభారత కృతిభర్తయగు చాళుక్యరాజరాజు క్రీ. శ. 1060 లో మరణించినపిమ్మట వేంగిదేశమునందల్లకల్లోలమయ్యెను. ఆతని రాజ్యకాలముననే గోదావర్యుత్తర, పశ్చిమోత్తర భాగముల నల్లరులు చెలరేగినవి. పిమ్మట నాతనిపుత్రుడును, చోళరాజునకు దౌహిత్రుడును కులోత్తుంగాభిధుడుగ జరిత్రవిఖ్యాతి నందినవాడునగు యువరాజరాజేంద్రుఁడు వేంగీదేశమున కధిపతియయ్యెను. ఇదేసమయమున చోళరాజ్యాధీశుఁడుగూడ మరణించెను. సామ్రాజ్యనిర్మాణ కాంక్షియు, మహదుత్సాహ సంపన్నుడునగు నీచాళుక్యరాజేంద్రుఁడు పైతృకమగు వేంగిరాజ్యమునుఁ దనపినతండ్రియగు నేడవ విజయాదిత్యునికొసంగి తాను ద్రవిడదేశ సింహాసనము నధిష్టించుటకు దగుప్రయత్నము లొనర్చుచుండెను. ఆంధ్రదేశమున బ్రతినిధిగ నియమింపబడిన యీవిజయాదిత్యుడు తనకుమారుగ దనకుమారుడగు రెండవ శక్తివర్మను వేంగిదేశపాలకునిగ నియమించి దాను పశ్చిమచాళుక్య సామ్రాజ్యాంతర్భూతమును స్వరాష్ట్రమునగు నలంబవాడికిఁజనియెను. ఇదియిట్లుండ దక్షిణదేశమున గతించిన రాజేంద్రచోడుని దాయాదియగు వీరచోడుడు ద్రవిడదేశ సింహాసనమునాక్రమించి వేంగిదేశముపై దండెత్తుటకై బ్రయత్నము సల్పుచుండెను. ఇంతలో వేంగిపాలకుడగు రెండవశక్తివర్మ యకాలమరణమునందెను. వెంటనే వీరచోడుదాంధ్రదేశముపై దండెత్తెను. నలంబవాడినుండి స్వదేశసంరక్షణార్థమై విజయాదిత్యుడేతెంచుసరికి వేంగిదేశము శత్రుజనపరివేష్టితమై యుండెను. ఆంధ్రదేశమునంతటిని గబళింపనుకించుచుండిన యీచోళదావానలమును బరిమార్ప ననేకభూపాలురు యేకమైరి, విజయాదిత్యుడు దనకుమిత్రులగు బశ్చిమచాళుక్యులయొక్కయు, బంధువులగు కళింగగాంగులయొక్కయు సాహాయ్యము నభ్యర్థించెను. యువరాజ రాజేంద్రుడుగూడ నీసమయమున వారింజేరి నాయకత్వమును వహించెను. ఇంతియగాక నీమహాక్లిష్టసమయమునందనేకులగువీర పురుషులు రాజేంద్రునికిఁ దోడ్పడిరి. ద్రాక్షారామశాసనములలో నిట్టిసామంతులు నాయకు

లును చేసినన్నే హాప్రతిజ్ఞలుగాం చనగుచున్నవి. తుదకు వీరచోడుడు పరాభూతుడై స్వరాష్ట్రమునకు మరలెను.

కాకతి బేతరాజు అనుమకొండ ప్రాంతమును రాజ్యమేలెనని శాసనములనుండి స్పష్టపడుచున్నది. మొదట నాతడు కొఱవిదేశమును[41] నిమ్మట పశ్చిమచాళుక్య సామంతుడుగ సబ్బిమండలమును బాలించెను.[42] ఈతనితండ్రియగు మొదటిప్రోలరాజుకూడ నాభూభాగమునకే యధిపతియై యుండునని యూహింపవచ్చును. పై విభాగములు రెండును నైజాంరాష్ట్రమునందలి వారంగల్లు మండలమునందున్నవి. చాళుక్యభీముని నాటి యొకశాసనమునుండి వేంగిసామ్రాజ్యము కొఱవిదేశమువఱకును వ్యాపించియుండెనని దెలియుచున్నది.[43] వీనినిబట్టి చాళుక్యరాజరాజు రాజ్యాంతకాలమునకుఁ గాకతీయులు వేంగిదేశమునకు బశ్చిమోత్తరదిశను స్థిరపడి క్రమక్రమాభివృద్ధినందుచుండిరని యూహింపవచ్చును. అట్లయినచో నచ్చట రాజ్యమేలుచుండిన మొదటిప్రోలరాజునకు దూరమునందున్న కాంచీపుర చోళులతో వైరము పొసగుటెట్లు? ఈప్రశ్నకు పై వివరించిన వేంగిచాళుక్య చరిత్రము సమాధానము నొసంగుచున్నది. ఆంధ్రదేశముపై దాడివెడలిన చోళరాజులలో వీర రాజేంద్రుఁడే కడపటివాడు. ఈదండయాత్రా సందర్భమునం దనేకులగు స్థానిక పాలకులు చాళుక్యులకు సహాయముగ జోళుల నెదిర్చియుండిరి. మొదటిప్రోలరాజు కాలమీదండయాత్రలు జరిగిన సమయమునకు సరియగుచున్నది.[44] వేంగిదేశము నాక్రమించిన పిమ్మట చోళులు కాకతీయ రాజ్యమునే గబళింపవలసి యుండును. ఈ కారణములను బట్టి మొదటి ప్రోలరాజుగూడ నీ వేంగియుద్ధమున బాల్గొనియుండును. పరాభూతుడై స్వరాష్ట్రమునకు మఱలుచుండిన వీరచోడుని కాకతీయ సైన్యాధ్యక్షుడగు బమ్మసేనాని కాంచీపురము వరకును వెంబడించి యాతని నచ్చట మఱియొకసారి పరాభవించి యుండును. ఈయుద్ధము జరిగిన యనతి కాలమునకే యువరాజ రాజేంద్రుడు దక్షిణదేశ సింహాసనము నధిష్ఠించెను. ఇంతలో వేంగీ పరిపాలకుడుగ నుండిన విజయాదిత్యుఁడుగూడ గతించుటచే రాజేంద్రుడే కులోత్తుంగ చోళుడను పేరిట ద్రవిడాంధ్రదేశముల రెండిటినిఁ బరిపాలింపజొచ్చెను. చక్రవర్తి సుదూరమునందుండుటచే నాంధ్రదేశమును దాతని తనయులు ప్రతినిధులుగ పరిపాలించుచుండిరి. ఈ ప్రాతినిధ్యము నామమాత్రముగ నుండినది. రాజపుత్రుల ధ్యానమంతయు రాజధానీ నగరముపైననే యుండుటచే వేంగీదేశము నందనేక సామంత రాజవంశములు దలలెత్తి స్వరాజ్య విస్తరణార్థమై యొండొరులతో బోరాటములు సల్పమొదలిడినవి. ఈసందర్భమున గోదావరి కుత్తరము నందుండిన కాకతీయులు తమ

41 అరిణ్ణనిబొట్ట బేతవను ధాధిపు జేకొని వానివైరి ను
ద్ధ్రితిమునజంపి యాకొఱవిదేశమునందు బ్రతిష్ఠచేసి. గూడూరుశాసనము- 13-16 పంక్తులు.

42 ...............కాకతిబేత నరేంద్రునం జగం పొగడె చాళుక్యచక్రి చరణం సలెకా
జేసి తత్ప్రసాదదిం బగెగొళె సబ్బిసాయిరమనైలిసి.........
"అనుమకొండ శాసనము—Ep. Ind IX. p. 256 32—35 పంక్తులు"

43 కొఱవినుండి తీసిన యీశాసనము యొక్క ప్రతిబింబము హైదరబాదు లక్ష్మణరాయపరిశోధక మండలివారివద్దగలదు.

స్వాతంత్ర్యమును సుస్థిరముగ నెలకొల్ప నవకాశ మొదవెను.

మొదటి ప్రోలరాజునుగూర్చి యింతకంటెను విశేషము లేమియు దెలియరావు. ప్రాచీనవంశచరిత్రములలో ననుమకొండను పాలించిన పూర్వరాజులలో బేతరాజునకు ముందుగ నొక భువనైకమల్లుని ప్రశంస గావించుచున్నది. బేతరాజునకు పశ్చిమచాళుక్య సామంతతయును త్రిభువనమల్ల బిరుదము నుండినట్లు శాసనములనుండి తెలియుచున్నది. ఈ బిరుదము పశ్చిమచాళుక్య చక్రవర్తులలో సుప్రసిద్ధుండగు నాఱవ విక్రమాదిత్యునిది. ఈతనికిఁ బూర్వుఁడితని సోదరుఁడును భువనైక మల్ల బిరుదాంకితుఁడునగు మూఁడవ సోమేశ్వరుఁడు రాజ్యమేలెను. కావునఁ బట్టి కాకతీయ త్రిభువనమల్ల బేతరాజువలెనే యాతని తండ్రియగు మొదటిప్రోలరాజుగూడ చాళుక్య (సోమేశ్వరునికి) సామంతుఁడుగనుండి, భువనైక మల్ల బిరుదమును వహించియుండెనేమోయని సందేహము గలుగుచున్నది. కాని బేతరాజు విషయమునందువలెనే ప్రోలరాజు విషయమునందిట్టి యూహను బలపఱచు శాసనప్రమాణ మేమియు లభింపకుండుటచే నీ యూహయందలి నిజానిజములను భావి పరిశోధనమూలముననే నిశ్చయింపవలసి యున్నది.

## VIII త్రిభువనమల్ల బేతరాజు

(1080—1115)

కాకతి బేతరాజు చరిత్రమును నిర్ణయించుటకింతవరకు నాతని కాలమునాటిదగు ననుమకొండకన్నడశాసనము ముఖ్యమగు నాధారముగ నుండినది. ప్రాచీన వంశ చరిత్రములందలి విషయములు కేవల కల్పితములుగ నున్నవి పూర్వోదాహృతమగు నైజాం రాష్ట్రములోని గూడూరు గ్రామమునందలి యొక శాసనము బేతరాజునుగూర్చి కొన్ని ముఖ్యాంశములను వెలువరుచున్నది. ఈతనితండ్రి కాలమునకే కాకతీయులు గోదావరీ నదికిఁ బశ్చిమోత్తరమున స్థిరపడి యుండిరని యిదివఱలో జెప్పియుంటిమి. వీరలీభాగమునకు నూతనాగతులగుటచేతనో లేక మొదటి ప్రోలరాజు మరణించునప్పటికే బేతరాజు బాలుఁడుగనుండుటచేతనో మఱియే కారణమువలననో కొందరు శత్రురాజులు చేరి బేతరాజును రాజ్యభ్రష్టునిఁ జేసిరి. అప్పుడు [illegible]ఁడగు నెఱ్ఱన యనునాతఁడీ శత్రువులను జయించి బేతరాజును [illegible]దేశమునఁ బ్రతిష్ఠించెను. ఎఱ్ఱనభార్యయగు కామసాని పల్లవరాయుఁడును, భాస్కరచక్రవర్తి, కాడవనాయకుఁడును నున్నగు బేతరాజు శత్రువులను నిర్జించి యాతని రాజును గాకతివల్లభునిఁ జేసెను. ఈ విషయములు [illegible]డును పై గూడూరు శాసనమునుండి తెలియుచున్నవి. ఇందలి శత్రురాజులనుగూర్చి విశేషము లేమియుఁ దెలియుటలేదు. ఎఱ్ఱనయు నాతని భార్యయు గూడ బేతరాజునకు సాహాయ్య మొసర్చిరి. భర్త యుండినప్పుడు భార్యరణరంగమున గెలిచి [illegible]. దీనినుండి మొదటిసారి [illegible] విదేశము బేతరాజునకు [illegible] నాతఁడు దానిని గోలుపోవ నెఱ్ఱన దానినాతనిఁ దిరిగి బ్రతిష్ఠించెననియు, ఎఱ్ఱన చనిపోయిన పిమ్మట బేతరాజునకు దిరిగి శత్రువులవలని యపాయమొదవుటచే నెఱ్ఱనభార్య కామసాని యీమారి యాతనికి బాసట యయ్యెననియు నూహింపవలసి యున్నది. బేతరాజు శాసనములింకను గొన్ని నైజాంరాష్ట్రమునఁ గలవు.

వానిలో నాతనికి స్వాతంత్ర్యసూచకములగు బిరుదములుండి సామంతచిహ్నములు లేమియు లేకుండుటచే నీతడు పైవివరింపబడిన కష్టములను గడచిన పిమ్మట కొంతకాలము స్వతంత్రముగ బరిపాలించెనని స్పష్టమగుచున్నది. వారంగల్లుజిల్లాలోని కాజీపేట యందలి శాసనములనుండి బేతరాజునకు "దుర్గయకులాబ్ధిచంద్ర, చలమర్తిగండ, మహామండలేశ్వర, అనుమకొండపురవరేశ్వర" యను బిరుదములుండినటుల దెలియుచున్నది. పశ్చిమచాళుక్యచక్రవర్తియగు త్రిభువనమల్లవిక్రమాదిత్యుని కాలమున జాళుక్యసామ్రాజ్య మెక్కుడుగ విస్తరించి పడమట కల్యాణీనగరమునుండి తూర్పున వేంగీదేశమువఱకునుగూడ వ్యాపించినది. ఈచాళుక్యవాహినీవిజృంభణమునకు మధ్య కాకతీయరాజ్యమడ్డువచ్చెను. ఈసందర్భమున బేతరాజు దూరమాలోచించి విక్రమాదిత్య చక్రవర్తిశరణుజొచ్చి యాతని యనుగ్రహమున సహస్రగ్రామపరిమితగు సబ్బిమండలమును బడసెను. ఈతని మంత్రియగు వైజదండాధినాథుడే యీసంధానమునకు గర్తయని యనుమకొండ శిలాశాసనమునుండి తెలియుచున్నది. ఆశాసనమునందీరాజు పరమమాహేశ్వరుడని చెప్పబడియున్నది. బేతరాజునుగూర్చి యింతకు మించియేమియు దెలియరాదు.

## IX రెండవ ప్రోలరాజు.

### (1115—1158)

త్రిభువనమల్ల బేతరాజునకుబిమ్మట నాతని తనయుడగు రెండవప్రోలరాజు కాకతీయ సింహాసనము నధిష్టించెను. తండ్రివలె నీతడు గూడ కొంతకాలమువఱకును బశ్చిమచాళుక్యులకు సామంతుడుగ నుండెను. ఆఱవ విక్రమాదిత్యుని రాజ్యాంత్యభాగమున చాళుక్యులకు దక్షిణమున చోళులనుండియు హొయసలులనుండియు నొత్తిడి కలిగెను. మహాయోధుడును, ప్రజ్ఞాశాలియు నగు ప్రోలరాజు యదనును గ్రహించియు, చాళుక్యసామంతుల యన్యోన్యవైషమ్యముల నాలోకించియు స్వాతంత్ర్యసంపాదనమునొనర్ప బ్రయత్నించెను. ఈసందర్భమునందీతని కనుమకొండరాజ్యపరిసరప్రదేశములందలి వివిధ చాళుక్యసామంతులతో ననేక యుద్ధములు సంభవించియుండెనని. అనుమకొండ రుద్రేశ్వరాలయమునందలి శాసనము కాకతిప్రోలరాజు విజయములను ప్రత్యర్థులను దెల్పుచున్నది. పూర్వకాకతీయచరిత్రమునకిది మూలస్తంభమనదగు నీశాసనమున ప్రోలుని మమస్తటంపజితుండదలి కాకతీయప్రత్యర్థుల నొకవిధముగ నిర్ణయించియున్నారు.[45] ప్రోలునిశత్రువులలో తైలపదేవుడు, గోవిందరాజు, గుండరాజు, జగద్దేవుడు ననువారుండిరి.

హస్త్యారోహణచతురుడగుచు, చాళుక్యమండలికుడగు తైలపదేవుని క్షణములో బంధించియు, భక్త్యనురాగములచే ప్రోలరాజు విడిచిపుచ్చెను. ఈతైలపదేవుని బశ్చిమచాళుక్యచక్రవర్తియగు మూడవ తైలపదేవునితో సమన్వయించి, యాతడు యువరాజుగ నుండినపుడే ప్రోలరాజుతో యుద్ధము జరిగియుండవలెననియు లేనిచో ప్రోలునికి సుదీర్ఘమగు రాజ్యకాలముండియుండవలెననియు కీల్హారుపండితు డభిప్రాయపడియున్నాడు. కాకతీ

---

45 I. A. XI. p. 272 లోని గణపేశ్వరశాసనమున గూడ నీప్రోలరాజు ప్రత్యర్థుల ప్రశంసగలదు.

ప్రోలుడు నలుబదిమూడు సంవత్సరములు రాజ్య మేలియుండెనని యిటకు మున్నే నిరూపింపబడి యున్నది. ఇటీవల దొరకిన నైజాంరాష్ట్ర శాసనముల నాధారముగ జేసికొని యాతడు యువరాజ తైలపదేవునే యోడించెనని చెప్ప వలను పడుచున్నది. నల్లగొండ జిల్లాలోని పానగల్లు గ్రామమునందలి శాసనమొకటి పశ్చిమ చాళుక్య చక్రవర్తి యగు విక్రమాదిత్యుని నాతని తనయుడగు తైలపదేవునిఁగూడ పేర్కొనుచున్నది. మహబూబ్ నగర్ జిల్లాలోని నెక్కొండ గ్రామమునందలి యొక శాసనమున త్రిభువనమల్ల విక్రమాదిత్యుని రాజ్యకాలమున కుమార తైలపదేవుడు సకుటుంబముగ రాజధాని కొడూరునుండి వచ్చి చాళుక్య విక్రమ శకము 46 లో నెక్కొండలో నొక ధర్మము చేసెనని చెప్పబడియున్నది.[16] ఇందలి కాలము క్రీ. శ. 1122 అగును. పానగల్లు నెక్కొండ శాసనములనుండి విక్రమాదిత్యుని రాజ్యాంత కాలమున నాతని తనయుడగు కుమార తైలపదేవుడు నైజాంరాష్ట్రములోని మహబూబు నగర నల్లగొండ జిల్లాలను రాజప్రతినిధిగ నేలుచుండెనని స్పష్టమగుచున్నది. అనుమకొండ శాసనమున ప్రోలరాజు తైలపదేవుని భక్త్యనురాగములచే విడిపించెనని చెప్పబడియున్నది. ఇట్టు దలచినచో తైలపుడు స్వతంత్ర రాజుగనే యుండినచో తైలపునియెడ నిట్టి భావము ప్రోలరాజున కుండెనన నొప్పదు. గాన నీయుద్ధము విక్రమాదిత్యుని రాజ్యకాలమునఁ 1122—1127 ల నడుమ జరిగియుండెననియు నాతని యెడగల భక్తివలననే ప్రోలుఁడు చేతికిఁ జిక్కిన శత్రువును విడిచిపుచ్చెననియు చెప్ప వలెను.

కాకతిప్రోలుని రెండవ ప్రత్యర్థి గోవింద రాజు. ఆతని నీ కాకతీయ రాజన్యుఁడు యుద్ధమున నోడించి యాతఁ డేలుచుండిన లుంపాక విషయమును ఉదయరాజున కిచ్చెనని యనుమకొండ శాసనమునఁ జెప్పబడియున్నది.[47] పై శాసనమునందలి గోవిందరాజును, విక్రమాదిత్యుని దండనాథుఁడుగనుండి ద్రాక్షారామాది స్థలములలోని శాసనములవలనఁ దెలియనగు దండనాయక గోవిందరసయు నొక్కరే యై యుందురు. ఆంధ్ర చరిత్రకారులీతఁడు బెజవాడ దగ్గరనున్న కొండపల్లిదుర్గపాలకుఁడనియును శ్రీ శేషాద్రిరమణకవు లీతఁడు వరంగల్లుజిల్లాలోని నేలకొండపల్లి ప్రాంతపాలకుఁడనియు నభిప్రాయపడుచున్నారు.[48] ప్రోలరాజు కాలముననే కాకతీయ రాజ్యవిస్తరణ మారంభమయి యుండెననియు, నాతని ప్రత్యర్థులందరు ననుమకొండ పరిసర ప్రాంత పాలకులేయనియు నిదివరలోఁ జెప్పియుంటిమి. ఈ యభిప్రాయము ననుసరించి గోవిందరాజు నేలకొండపల్లిని పాలించుచుండెనని చెప్పుటయే సమంజసముగ గన్పట్టుచున్నది.

మఱియును కాకతిప్రోలుఁడు మంత్రికూట

46 ఈ శాసనములు రెండును లక్ష్మణరాయపరిశోధక మండలివారివద్ద గలవు. నాటి నకళ్ళు శుక్లసంవత్సర చైత్రమాస భారతి 533 పేజీలో శ్రీ శేషాద్రి రమణకవులచే ప్రకటింపబడియున్నవి.

47 Ibid

48 Ibid. క్రీ. శ. 1120—24 ల నడుమ వేంగిదేశమునం దధికారము నెఱపిన గోవిందరసయు నీ నేలకొండపల్లి పాలకుడగు గోవిందరాజు నొక్కరేయని చెప్పవచ్చును. ఆస్థానమే కేంద్రముగ నీతడు వేంగిదేశమునుగూడ నేలియుండవచ్చును.

నగరాధిపుడగు గుండరాజును నిర్జించి యాతనిని గొరిగించి మరియు వక్షముపై దనలాంఛనముగా వరాహముద్రను వేయించి విడిచిపెట్టెను. పిమ్మట నాగులపేరరాజు భీతుడై సమరమునకు దిరిగి యాహ్వానింపఁబడియు, తననగరమునకుఁ బరుగెత్తిపోయెను. పూర్వచరిత్రకారులీ మంత్రకూటనగరమును బ్రిటిష్ కృష్ణామండలమునందలి మంతెనగ్రామముతో సరిచేసియుండిరి. కాని యాగ్రామము హనుమకొండ రాజ్యమునకుఁ జాల దూరమున నుండుటచే నీసమన్వయము పొసగనేరదు. నైజాంరాష్ట్రమునఁ గోదావరీ తీరమున నున్న మంత్రికూటమని విఖ్యాతిగాంచిన మంథనిగ్రామముకలదు. తత్పరిసరప్రాంతముల గుండరాజుపేరిటఁ గట్టబడినగ్రామము లనేకములుగలవు. గాన నీమంథనియే యనుమకొండశాసనములోని మంత్రికూటమని చెప్పవలసియున్నది.[49] పాలంపేటకు సమీపమునను న్న రామప్పగుడులశాసనమునుండి కాకతిప్రోలుని యామాత్యులలో నొకఁడగు రేచర్లకామసేనాపతి యుద్ధరంగమున మంథన్యగుండరాజునుఁ జంపి యితరశత్రువులనుఁ బారదోలెనని తెలియుచున్నది. ఇయ్యది కాకతిప్రోలుని విజయమునకుఁ బిమ్మట జరిగిన వృత్తాంతమై యుండును.[50]

రెండవప్రోలుని ప్రత్యర్థులలో గడపటివాడు జగద్దేవుడు. ఈతడనేక మండలీకులతో గూడి యనుమకొండనగరమును ముట్టడింపగా నతిత్వరితముగఁ దేశపుఁ బ్రోలరాజు పలాయితునిఁ జేసెనని యనుమకొండశాసనమునఁ జెప్పబడియున్నది. పూర్వచరిత్రకారులీ జగద్దేవుడు మైసూరురాష్ట్రమునందలి పొట్టుపాంబుచ్చపురపాలకుడై త్రిభువనమల్లాభిధుడై యుండెనని నిర్ణయించియుండిరి.[51] కాని యావిషయము నంగీకరింప వలనుపడదు. ప్రోలునికాలమునఁ గాకతీయరాజ్యము మైసూరువరకును వ్యాపించియుండలేదు. మధ్యమార్గమునందనేక పశ్చిమచాళుక్య సామంతులుండగా ప్రోలుఁడంత దూరదేశపాలకునితో వైరము పూనుట సమంజసముగా గన్పడదు. నైజాంరాష్ట్రమునందలి నల్లగొండజిల్లాలోని గణపేశ్వరగ్రామమునందలి యొకశాసనమొక జగద్దేవునిఁ బేర్కొని యాతనియనంతరము కాకతిప్రోలుడా భూభాగమునకు రాజయ్యెనని తెలుపుచున్నది. కరీంనగరమండలమందలి నగునూరులోని మఱియొకశాసనమున దొమ్మరాజు, జగద్దేవుడు, మేడరాజు ననువారలు యెనుబదివేల సైన్యమును గెలిచిరని చెప్పబడియున్నది. పైపేర్కొనిన జగద్దేవుని సహాయులిర్వురును కాకతిప్రోలరాజు తనయుఁడగు రుద్రునిచే పరాభూతులైనటు లనుమకొండ శాసనమునుండి తెలియుచున్నది. కరీంనగరజిల్లాలోని వేములవాడగ్రామమునందలి శాసనమునుండి "ప్రోలవాకకులతిలకు" డ

49 ఫ్లీటు, కృష్ణశాస్త్రి ప్రభృతుల యభిప్రాయములను గాంచునది

50 యుద్ధేయేన మహాబలేన నిహతో మంథన్యగుండాధిపః॥

Hyd. Arch. Series No. 3 43—46 పం॥

51. ఆంధ్రులచరిత్రము రెండవభాగము 157 పేజీలో నీజగద్దేవుడు పొట్టుపుంబుచ్చపురాధీశ్వరుడనియు నాతడు విక్రమాదిత్యునకిని రెండవజగదేకమల్లునికిని సామంతుడనియు నందువలనఁ బ్రోలరాజుపై దాడి వెడలెనని యచట చెప్పబడియున్నది. కాని మైసూరునకును అనుమకొండకును నడుమ బహుదూరముండుటచేతను, తెలంగాణమునందే యొక జగద్దేవుడు కాకతిప్రోలునిచే నిర్జింపబడెననుటకు శాసనప్రమాణము గన్పడుచుండుటవలనను యాంధ్రచరిత్రకారుల యూహ సరియైనది కాదని స్పష్టమగుచున్నది.

గు మహామండలేశ్వర జగద్దేవుడు క్రీ. శ. 1109 ప్రాంతమున లేములవాడనుండి రాజ్యమేలుచుండెనని తెలియుచున్నది.[52] పై ప్రమాణముల నాధారముగఁ జేసికొని ప్రోలునిప్రత్యర్థియగు జగద్దేవుడు లేములవాడ ప్రాంతిపాలకుఁడగు నొకచాళుక్యసామంతుడని నిర్ణయింపవచ్చును.

పశ్చిమచాళుక్య చక్రవర్తియగు నాఱవ విక్రమాదిత్యుడు మరణించిన యనతికాలమునకే కాకతిప్రోలరాజు విజయయాత్రల నొనర్చి రిపుజనభీకరుడై తాత్కాలికరాజన్యులలో నగ్రగణ్యుడై, స్వతంత్రుడై, భావికాకతీయాంధ్ర సామ్రాజ్యమునకుఁ బునాదుల నేర్పఱచెను. విక్రమాదిత్యునికిఁ బిమ్మట రాజ్యమునకు వచ్చిన మూడవసోమేశ్వరుడాంధ్రరాజులతో యుద్ధమొనర్చెను.[53] బహుశః యీయాంధ్రరాజు ప్రోలుడేయైయుండెననియు, దీనజయించియే యీతడు స్వతంత్రస్థాపన మొనర్చెననియు నూహింపవచ్చును. కాకతిప్రోలుని కీర్తిచంద్రికలు క్రీ. శ. 1150 నాటికె దిగంతములకు వ్యాపించియుండినవి. తాత్కాలిక చాళుక్యచక్రవర్తియగు మూడవ తైలపుని రాజ్యకాలమున చాళుక్యసామ్రాజ్యము విచ్ఛిన్నముగా జొచ్చెను. అందలిప్రాచ్యభాగములన్నియు నిదివరకె కాకతీయులాక్రమింప మంత్రియు దండనాధుడునగు కళచురిబిజ్జలుడు చక్రవర్తిని రాజ్యచ్యుతునిఁజేసి కళ్యాణి సింహాసనము నాక్రమింప యత్నించుచుండెను. క్రీ. శ. 1158 లో బిజ్జలునిచే సహితుఁడై ప్రోలరాజు కల్యాణి రాజ్యనాశనము నందాతనికి దోడ్పడి, తన మార్గమును నిష్కంటకముగ నొనర్చుకొనియెను.[54]

ఇటులీ రాజన్యుడు స్వబాహుబలముచే ననేక భూభాగములను దనరాజ్యమునఁ గలిపికొనెను. ఈతని జీవితాంత్యమెట్లయియుండెనో స్పష్టముగఁ దెలియుటలేదు. ప్రాచీనవంశ చరిత్రలయందాతడు ప్రమాదవశమునఁ దన పుత్రుఁడగు రుద్రునిచే చంపబడెనను విషయము గాంచనగుచున్నది. ప్రమాణేతరరాహిత్యతచే నీయంశము విశ్వసనీయముగ గన్పట్టుటలేదు. ద్రాక్షారామ శాసనములలో నొకదానియందు వెలనాటి వంశీయుడగు రెండవ చోడరాజు "కాకతిప్రోల నిర్దహను"ఁ డని పేర్కొనబడియున్నాడు.[55] ఈతడు తన తండ్రియగు రెండవ గొంకరాజునకుఁ బిమ్మట క్రీ. శ. 1163—1181 ల నడుమ రాజ్యమేలియుండెను కాకతి ప్రోలరాజు క్రీ. శ. 1158 లో మరణించియుండెనని యిదివరలోఁ జెప్పియుంటిమి. దానినుండి రెండవ గొంకరాజు రాజ్యకాలమున కాకతి ప్రోలుడు వెలనాటిపై దాడివెడలెననియు నా సందర్భమున గొంకరాజు పుత్రుఁడును, యువరాజునగు చోడుడు, ప్రోలరాజుతో బోరి యాతనిఁ జంపియుండెననియు నూహింప నగుచున్నది.

ఉద్యోగులు—శాసనములనుండి కాకతి ప్రోలుని యుద్యోగులు కొందరు తెలియనగుచున్నారు. ఈతని మంత్రులలో త్రిభువనమల్ల బేతరాజుకడ మంత్రిగనుండిన వైజదండాధినాధుని పుత్రుడగు బేతనయొక్కడు. మహా

52. శుక్లచైత్రి భాగ 535 వ పుట
53 Bhandarkar— Early History of the Dekkan. 3rd. Edn. p. 322
54 Bombay Gazetteer vol. I, pt. II. p. 222, p. 458. FF. 2 & p. 462
55 S. I. IV. No. 1242.

విద్వాంసుఁడును, ధర్మశీలుఁడునగు నీమంత్రి భార్య మైలమ యనునామె యనుమకొండపై కడలాలయ వసతిని నెలకొల్పెను.[56] వారంగల్లు జిల్లా మాటూరు గ్రామమునందలి యొక శాసనమునుండి మల్లెనాయకుడను మహాసామంతుఁడొకడు తెలియవచ్చుచున్నాఁడు. వేంగీ దేశమునందలి చెలికిపుర వాస్తవ్యుఁడును, సుప్రసిద్ధ బ్రాహ్మణవంశీయుఁడునగు గంగాధరుఁడను మంత్రికూడ ప్రోలరాజు నౌద్యోగిక వర్గమున జేరియుండి రాచనగరునకు రక్షకుఁడుగనుండెను.[57] రేచెర్ల వంశజుఁడగు కామచమూపతిని గూర్చి యిదివఱకే చెప్పియుంటిమి.

కట్టడములు:—ప్రోలరాజునాటి కట్టడములలోనెల్ల ననుమకొండ పద్మాక్షీ దేవాలయము ముఖ్యమైనది. ప్రస్తుత మనుమకొండయని పిలువబడు నగరమునకు పశ్చిమమున నొక పర్వతపంక్తిగలదు. అందిరుపార్శ్వములను రెండు వరుసల కొండలుగలిగి తూర్పు పడమరలకు వ్యాపించియుండు కనుమయొకటిగలదు. తూరుపుదిశ నున్నతమగు శిలాద్వారమున్నది. ద్వారము నంటుచు నెడమవైపున నొక పెద్ద కొండ కలదు. కుడివైపున ద్వారమునుండి యొక దట్టమైన మట్టిగోడ యనతిదూరమున నున్న మఱియొక కొండను చేరుచున్నది. ఇయ్యవి ప్రాగ్భాగమునఁ గాంచనగు దృశ్యములు. ఈకొండల వరుసకును దీనివెనుకనుండు మఱియొక దానికిని నడుమ సుమారు రెండు మూఁడు ఫర్లాంగుల దూరముండును. శిలాద్వారమునంటి దక్షిణముగనున్న కొండకావల కొంత విడిభూమియును, పిమ్మట నొక త్రికోణాకృతిగల పర్వతమును గలవు. దీనినంటి మఱియొక యెత్తైన కొండగలదు. ఈకొండనుండి శిలాద్వారమునకు పశ్చిమభాగమున మరియొక బలమగు మంటిగోడ గాంచనగును. ఇయ్యది శిలాద్వారమున కుత్తరమునన్నున్న కొండనంటియుండెడు పద్మాక్షికొండ యని పిలువబడు మఱియొక కొండను చేరుచున్నది. ఈవిధమున నప్పటి యనుమకొండ నగరము నాలుగు పర్వతముల చేతను, రెండు బలిష్ఠములగు మట్టిగోడలచేత నావరింపబడియుండెను. ఈ రెండవ వరుసలో నుత్తరదిశనున్న కొండపైననే పద్మాక్షీదేవాలయముగలదు. కొండక్రిందుగ పద్మాక్షీగుండమను నొక కోనేరున్నది. దానిప్రక్కనుండి కొండపైకి మెట్లుగలవు. ఇతర కాకతీయ నిర్మాణములవలె మహోన్నతమును, స్నిగ్ధద్వారప్రాకార స్తంభసంయుతమును, సుందర శిల్పవిభూషితమును గాక నీయాలయము సంకుచితముగనున్నది. గర్భాలయమును దానినంటి నామమాత్రమగు నొక ముఖమంటపమును మాత్రమిచట గాంచనగుచున్నవి. ఆలయ గోపురము పైన పద్ధతిననుసరించి మెట్లుమెట్లు గట్టబడియున్నది.[58] ఈయాలయమున కెదురుగనే. ప్రోలరాజునాటి కన్నడశాసనముగల. దాన కడలాలయ బసది యను నీయాలయము 42 వ చాళుక్య విక్రమ సంవత్సరమునఁ గట్టబడినటులఁ జెప్పబడి యున్నది.

పైకడలాలయకును ప్రస్తుతమిందు బూజింపబడుచున్న పద్మాక్షీదేవికిని గల సంబంధమేమి

---

56 E. I. IX, p. 256.

57 చనువుమెయి నగరిలోదగు పనులెల్లను బెంపు మోసి బతికించుచు
కరీంనగర్ శాసనము- 41—43 పం॥

58 ఏకశిలానగరమునందలి స్వయంభు, విష్ణు, వేంకటేశాలయగోపురములుగూడ నీవిధముననేయున్నవి.



హనుమకొండ పద్మాక్షి ఆలయము నందలి యక్షుడు.



హనుమకొండ పద్మాక్షి ఆలయమునందలి పద్మాక్షి విగ్రహము.

మో తెలియుటలేదు. శాసన పరిశోధకు లీ కడలాలయ యను దేవియైన శాసనదేవులలో జేరిన యంబికగనో లేక పద్మావతిగనో యుండునని వ్రాసియుండిరి.[59] కడలాలయ యను కన్నడ పదము 'సముద్రమునుండి బుట్టిన'దను నర్థము నిచ్చునుగాని పద్మావతి యను నర్థమును దెల్పుటలేదు. ఈయాలయమునందు ప్రకృత మారాధింపబడు దేవి పద్మాక్షియని పిలువబడుచున్నది. ప్రాచీన చరిత్రములు గూడ నామెకదే నామము నొసంగుచున్నవి. 12 వ శతాబ్దమున నెలకొలుపబడిన కడలాలయ ప్రకృత పద్మాక్షీదేవిగ నెటుల మార్పుజెందెనో తెలియుటలేదు. సులేకియును శాసన పరిశోధకుల యభిప్రాయమునననుసరించి యీదేవి నంబిక యనుటకును, పద్మావతియనుటకును గూడ వలనుపడుటలేదు. ఇందలి గర్భాలయమును బ్రవేశించినతోడనే యితరాలయముల వలె నెదురుగ నేమియు గానవచ్చుటలేదు. ఎడమవైపున గోడగ నమరిన యొకశిలపై నాగజైన తీర్థంకరుని విగ్రహమును దాని కిరుపార్శ్వములను యక్ష యక్షిణీ విగ్రహములు నున్నవి. ఇందలి యక్షిణి ద్విభుజయై పద్మాసనాసీనయై యున్నది. ఈమెయే ప్రకృతమున బద్మాక్షిగ బూజింపబడుచున్నది. ఇరువది రెండవ తీర్థంకరుని శాసనదేవియగు నంబికకు సింహాలాంఛనమును, కుడిచేతులు రెంటిలను మామిడిపండ్లగుత్తియు, పాశమును, యెడమ చేతులలో నొకశిశువును అంకుశము నుండవలెను. గాని యీ పద్మాక్షి యంబిక గాదు. ఇరువదిమూడవ తీర్థంకరుడగు పార్శ్వనాథుని యక్షిణి పద్మావతి. ఈమెకు హంసలాంఛనమును, చతుర్భుజములు నుండవలెను. దిగంబరజైన శిల్ప శాస్త్రానుసారమీమె శిరోపరిభాగమున మూడు పడగల సర్పము ఛత్రమువలె నుండవలెను. శ్వేతాంబరజైనుల గ్రంథములనుండి యీదేవి కుర్కుట సర్పవాహనయనియు కుడిచేతులలో కమలమును, పాశమును యెడమచేతులలో ఫలమును అంకుశమును ధరించి యుండుననియు దెలియుచున్నది.[60] ఈపద్మావతీ వర్ణనము ప్రకృత పద్మాక్షీదేవికి సరిపోవుటలేదు. పై చర్చనుండి ప్రకృతమారాధింపబడు దేవి మైలమ నెలకొల్పిన కడలాలయ కాదని తేలుచున్నది. ఆలయమధ్యమున వేదికగాని తదుపరి దేవతా విగ్రహమును వాని చిహ్నము లైనను గానరాకుండుటచే నీయాలయమునందు మొదట ప్రతిష్ఠింపబడిన విగ్రహ మేకారణమునో స్థలాంతరమునకు గొనిపోబడి యుండెననియో లేక నియ్యది కడలాలయ బసదికాదనియో చెప్పవలసియుండును. ఆలయమున కెదురుగ నొకచిన్న శాసనముండుటయు దాని ప్రక్కనే యొక శిలపై మైలమయొక్కయు నామె భర్తయొక్కయు విగ్రహములు నిర్మింపబడియుండుటయు రెండవయూహ కెడమిచ్చుటలేదు. అట్లయిన నిందలి కడలాలయ యేమయ్యెనను సమస్య పొడమును. దానికి క్రింది విధమున సమాధానము నొసంగవచ్చును. శాసనపండితులు లీ కడలాలయ యంబికయై యుండునని యూహించిరని యిదివరలో జెప్పియుంటిమి. ఈయంబికకు "కూష్మాండినీ" యని మఱియొక పేరుగలదు. కాకతి కూష్మాండ శబ్దములకు గుమ్మడితీగతో సంబంధముగలదు. కాకతియను దుర్గాశక్తినారాధించువారుగాక

59 I. A. XXI, p. 257

60 Ibid for 1903, p. 459. Cf. Ibid for 1927, p. 23

కీలములు. అంబికయను దేవి దుర్గారూపము దానినిబట్టి కాకతీయులే యంబికాభక్తులని స్పష్టమగుచున్నది. ఏకశిలానగరేశ్వరులకుం గులదేవతయగు నీకాకతమ్మకు ఆనగరమున సుప్రసిద్ధమగు దేవాలయముండెనని క్రీడాభిరామాదులనుండి తెలియనగును. వారంగల్లు ప్రాంతమునందు మొదట జైనమతమును, పిమ్మట శైవమతమును బ్రబలి, జైనకట్టడములను శిల్పములను శైవనిష్ఠులుదీసనకొట కుం బ్రతిష్ఠనిదర్శనము లనేకము లగుపడు చున్నవి. కాకతి రెండవ ప్రోలరాజు మొదట జైనుడుగనుండి పిమ్మట శైవుడయ్యెను. క్రీ॰ శ॰ 1150–58 ల నడుమ బసవేశ్వరుడా సన్నిహిత వీరశైవప్రబోధము సేతదుముం జేవి చ్చూచియే యిటలోనొసర్చియుండును. ప్రోలుని పుత్రుండగు రుద్రదేవుడు మహాశైవుడై యనేక శివ, భైరవ, శక్త్యాలయములను నిర్మించెను. ఇట్లు శైవమతి మోర్గల్లు ప్రాంతము లకెత్తించిన కాలమున జైనులనేక విధముల హింసింపఁబడి వారికట్టడములు పాడుచేయఁ బడినట్లు ప్రాచీనచరిత్రములలోఁ జెప్పఁబడి యున్నది. ఈసందర్భముననే రెండవప్రోలుడో లేక రుద్రుడో యీయనుముకొండ గుట్టమీద మునందలి యంబికావిగ్రహమును గెడలించి నూతన్నిర్మితమగు నేకశిలానగరమున నొక రమ్యహర్మ్యమున కాకతియను పేరం బ్రతిష్ఠించి యుండునని దోచుచున్నది. అనంతర మీమెయే కాకతమ్మయని ప్రఖ్యాతి నంది యుండును.

ఆలయమున కుత్తరమున రెండుపెద్దశిలలు గలవు. వానిలో మొదటిదానిపై నొకజైనవిగ్రహమును తచ్ఛిరోపరిభాగమునందొక విస్తృతసప్తముఖనాగమునుంగలవు. ఇయ్యది యిరు వదిమూడవ తీర్థంకరుడగు పార్శ్వనాథుని విగ్రహము. ఈశిల్పమునకుప్రక్కనొక ధ్యానస్థుడైన విగ్రహమును, దత్పార్శ్వమున సపత్నీకుడగు నొకభక్తుడును చిత్రింపబడియున్నారు. ప్రాయికముగ వీరిర్వురును మంత్రిచేతనయ్యు నాతని భార్య మైలాంబికయు నై యుందురు. రెండవశిలలో నధోభాగమున రెండుగుహాలు నిర్మింపబడియున్నవి. ఇయ్యవి భిక్షువులకుధ్యానయోగార్థమై యుండునోపును.

శాసనాంతరములనుండి రెండవప్రోలరాజు జగత్కేసరియను నొకతటాకమును నిర్మించెనని తెలియుచున్నది. ప్రాచీనశివచరిత్రములలో నేకశిలానగరమునకు ప్రోలునిర్మించిన [illegible] లం జెప్పబడియున్నది. ఈవిషయమున నిక్రింద గాథ గాంచనగును—

ఒకనాడనుముకొండ నగరమునకు [illegible] డములనుగ నిదచ్చబండ్లలో నొకటి నగరసమీపమున నొకరాయికిందగిలి జోరిగిలపడెను. వారు [illegible] రులకాశ్చర్యమొదవ నాశిల భిన్నమై యందుండి దివ్యతేజోమయమగు నొకశివలింగముద్భవించెను. తలక్రిందులయిన యాబండియిరుసు దేదీప్యమానమగు స్వర్ణముగ మారెను. చాకలి చేసివార్తనాలకించి విద్వజ్జనపరివారాదులంగూడి ప్రోలరాజాప్రదేశమునకేగి యాదేవునింగాంచి, పండితవర్యులాతనికి స్వయంభుదేవుడనియు, స్వర్గవేదియనియు నామములొసగ, దానచ్చోట నొకసుందరదేవాయతనము నిర్మించెను.

ఈగాథయంతయు సత్యముగాకుండినను కాకతిప్రోలుడు స్వయంభుదేవాలయాది పూర్వ కాకతీయ దేవాలయములను నిర్మించెననుటకు, పద్మాక్షీయాలయము నయ్యవి యనేకవిధములంబోలి యుండుటయే నిదర్శనము. విష్ణుకుండ, వీరభద్రగుడి, మున్నగు నేకశిలానగరదుర్గము





హనుమకొండ పద్మాక్షి ఆలయమువద్ద బండపైనున్న జైనవిగ్రహములు.



హనుమకొండ సహస్రస్తంభ దేవాలయము—మంటపము.



హనుమకొండ సహస్రస్తంభ దేవాలయము—ప్రధానాలయము.

...ఁదలి యాలయములీ సందర్భముననే నెల కొల్పఁబడియుండవలెను. కాకతిరుద్రునినాటికి ప్రదేశమున చేబ్రోలునగిరమొకటి యున్నటుల శాసనములనుబట్టి తెలియుచున్నది. ఏ కారణములచే ననుమకొండలోని పద్మాక్షి, సిద్ధేశ్వరాలయములును, ఏకశిలానగిరమునందలి స్వయంభు కేశవాలయములును గూడ ప్రోలరాజు కాలముననే నిర్మింపబడినవని తోచుచున్నది.

## X రుద్రదేవుఁడు.

ప్రోలరాజుకుమారులలో నగ్రజుండగు రుద్రదేవుఁడు రాజ్యమునకువచ్చునప్పటి కాంధ్రదేశమునందలి పరిస్థితులు విపరీతములుగనుండెను. తూర్పుతీరమున వెలనాటివంశీయుల ప్రాభవ రెండవచోడరాజు కాలమునకు పరమావధిని గాంచి, యనంతరమున క్షీణింపదొడంగెను. దక్షిణపశ్చిమముల నాంధ్రచోడులు కొణిదెన పొత్తపి మున్నగు స్థలములబబలి వెలనాటిపై దాడికలపొచ్చిరి. నెల్లూరుచోడులు దక్షిణ ...జ్యాంగివిషయములంబాలించి ప్రాముఖ్యత సందనారిరి. గోదావరికి దక్షిణమున కోలనివంశీయులును ఉత్తరమున తూర్పుగాంగులును రాజ్యమేలుచుండిరి. అనుమకొండరాజ్యమునకుఁ బశ్చిమోత్తరమున లింగాయతులు గళచురిరాజ్యము నంటిమొందించిరి. ఉత్తరమునుండి యాదవులుగూడ రాజ్యమును విస్తరించుకొనుచుండిరి. ఒకప్పుడుపశ్చిమచాళుక్యులకు సామంతులుగ నుండిన మండలేశ్వరులెల్లరును స్వతంత్రులై పరస్పర కలహములకు లోనై యుండిరి. ఈవిధమున దక్షిణాపథమంతయు నల్లకల్లోలములకులోనై నిరుపమబాహుబల సంపన్నుడును, నిర్మాణకర్మనిరతుఁడునగు నొకవ్యక్తికై మొగముచూచుచుండెను.

విజయములు:— రుద్రదేవుఁడు మహా ప్రతాపియు గొప్పదక్షుఁడు యుండెను. సింహాసనమునకు వచ్చినవెంటనే యీతనికి పెద్దాయుద్ధములుగనబడెను. వానిలోఁ ... తనపై ప్రతాపరాజు ... యితరసామంతులను ..., రెండవది తనతండ్రి మరణమునకుఁ గారకులగుచుండు వెలనాటిరాజులపై జరిగినదని యనుట. ఈతని ... కార్యములను గూర్చి సవిస్తరముగ నెరవేర్చెను. రుద్రదేవునిచే నిర్జింపబడిన శత్రురాజులలో దొమ్మరాజు మేడరాజు, మైలగిదేవుఁడు, భీముఁడు, చోడోదయుడు, ముఖ్యులుగనుండిరని యనుమకొండ శాసనమునందే తెలియుచున్నది. ఈశాసనము క్రీ. శ 1162 నాటిది. అప్పటికే మైలపదేవుఁడు రుద్రదేవుని భయమువలన దివంగతుఁడయ్యెను. క్రీ. శ. 1158 లో రాజ్యచ్యుతుఁడై అన్నగిరికి పలాయితుఁడైన మూఁడవతైలపదేవుఁడే యీతడని స్పష్టమగుచున్నది.

దొమ్మరాజువిషయ మింతవరకును జరిత్రమునకుఁ దెలిసియుండలేదు. రెండవప్రోలరాజు దిగ్విజయములను వర్ణించుసందర్భమునం దీ దొమ్మరాజును జగద్దేవునుఁగలసి యొకశాసనమునఁ బ్రశంసింపబడిరని చెప్పియుంటిమి. జనసామాన్యమునంగల గాథలలో నీతఁడు నైజాం రాష్ట్రమునందలి ధర్మపురినుండి గోదావరీతీరమునందలి భద్రాచలము వరకునుగలభూమి కేలికగఁ బ్రశంసింపబడుచున్నాడు. ఈతనిజయించుటచేఁ గాకతిరుద్రుని రాజ్యము ప్రకృతగోదావరీ మండలమందలి యుత్తరదిశను వ్యాపించెను.

మేడరాజుకూడ చరిత్రమున కపరిచితుఁడై యుండినవాఁడు. పాఖాలతాలూకాగోవిందాపు

మ్ములోని క్రీ. శ. 1127 నాటియొకశాసనము నందే యీ మేకరాజు మాధవవర్మవంశజుండగు దుగ్గిరాజపుత్త్రుఁడని తెలియుచున్నది. ప్రాయికముగ నీతఁడు వోరంగల్లుమండలములోని కురుసపట్టణము గోదావరీనది నడుమగలదేశమునకధిపతియై యుండును.[61]

మైలగిదేవుని పూర్వచరిత్రకారులు యాదవరాజగు మల్లుగితో సరిచేసియుండిరి కాని యిట్టిది యనుమకొండ శాసనము నందలి విషయములకు విరుద్ధముగ నున్నది. మైలగిదేవుని జయించి కాకతిరుద్రుఁడు పోలవాసదేశమును స్వాధీన మొనర్చుకొనెను. అనుమకొండ కనతిదూరముననే జగత్యాల తాలూకాలో నొక మైలగి గనవచ్చుచున్నాఁడు. ఆ తాలూకాకు నేటికిని "పోలాసా" యను నామముగలదు. గాన నీతఁడే రుద్రదేవుని ప్రత్యర్థి యని చెప్పవలెను.[62]

అప్పటి మండలికు లందరిలోను భీమరాజు మిగుల బలవంతుఁడు. కేవల స్వార్థాభిలాషియై యాతఁడు మాతుస్సపత్నీరతత్వమునకు సగ్రిడ వధకును గూడ వెనుదీయ కుండెను. అతి దురుషఁగు నీతఁడాశాపిశాచమునకు లొంగి చాళుక్యసింహాసనమునుసహితమాక్రమింప దొడఁగెను. ఈదుర్వినీతుని చరిత్రము నాలకించి రుద్రదేవుఁడు చతురంగబలములతోఁగూడ భీముని రాజధానియగు వర్ధమానపురముపై దాడి వెడలి దానిని ముట్టడించెను. కాకతీయుల దాడి కోర్వఁజాలక భీముఁడు సకుటుంబముగ నడవులకుఁ బాఱిపోయెను. రుద్రదేవుఁడంత వర్ధమానపురము నాక్రమించి, దానిని సమూలముగ నాశమొనర్చి తన్మధ్యమునం దొక గొప్పతటాకమును నిర్మించెను. వోరంగల్లునకు సుమారు 50 మైళ్ళ దూరమునం దున్న వడ్డె మరిగ్రామ మీవర్ధమానపురమై యుండవచ్చును. నైజాంరాష్ట్రమునందలి మామిళ్ళపల్లిగ్రామములోని యొక శాసనము వర్ధమానపురచోళవంశము నభివర్ణించుచున్నది. దానినుండి కలికాలచోళుని వంశమున గోకర్ణుఁడును, అతని కుమారాదిత్యుఁడును, అతనికి భీము గోకర్ణు లనువారలును జనించిరని తెలియుచున్నది.[63] ఈశాసనము క్రీ. శ. 1118 లో, అనగా ననుమకొండశాసనమునకు 44 సంవత్సరములు పూర్వము రచింపబడినది. ఇందలి భీముఁడు ననుమకొండశాసనమునందలి భీముఁడు నొక్కరే యయియుందురు. ఆంధ్రదేశమున వర్ధమానపురమునఁగూడ నొక చోళవంశ ముండె ననియు, కాకతీయులకు నాంధ్రచోళులకు నిదియే ప్రథమసంగర మనియు నీ సందర్భమున గమనింపవలసియున్నది.

కాకతిరుద్రదేవుని ప్రత్యర్థులలో చోడోదయుఁడను నాతఁడు మఱియొకఁడు. రుద్రదేవుఁడీతని యెడ సామము నవలంబించి[64] యాతని పుత్త్రిక యగు పద్మావతినిఁ బెండ్లియాడెను. ఇటీవల బయల్వెడలిన గొన్ని శాసనముల యాధార

---

61 శుక్లచైత్రభారతి. 537 వ పేజీ. శ్రీ శేషాద్రిరమణకవు 'అనుమకొండ' శాసనమును పేరట రచించిన వ్యాసము. నేను వీరియూహల నామోదించుచున్నాను.

62 Ibid

63 Ibid

64 శ్రీ శేషాద్రిరమణకవులచే రచింపబడిన "పద్మావతి" యను నవల యాచారిత్రాత్మకవిషయముల కెల్ల రమ్యముగ మనోగతముల నొనర్చుచున్నది.

ణ్మున నీ చోడోదయుని వ్యక్తిత్వమును నిగ్గయింప వలనుపడుచున్నది. క్రీ॥శ॥ 1162 నాటి జటచర్లశాసన మొకటి కరికాలవంశజు డగు మహామండలేశ్వర కందూరి ఉదయన చోడ మహారాజుయొక్క సుంకాధికారులను పేర్కొనుచున్నది. ఈతని ప్రశంస 12 వ చాళుక్య విక్రమ కాలమునాటి కొలనుపాక శాసనమునను, క్రీ. శ. 1125 నాటి నేలకొండపల్లి శాసనమునను గూడ గానవచ్చుచున్నది.[65] ఈతడే యనుమకొండ శాసనములోని చోడోదయుడని స్పష్టముగ చెప్పవచ్చును. పై పేర్కొనిన ప్రతిపక్షులను జయించి, రుద్రదేవుడు పరిసర ప్రాంతమును నిష్కంటకము నొనర్చుకొని, ప్రకృత తెలింగానా ప్రాంతమునెల్ల తన యేలుబడి లోనికిఁ దెచ్చెను.

అటుపిమ్మట నీతడు తన దృష్టిని వెలనాటిపైఁ బ్రసరింపజేసెను. ఈతడీ రాజ్యమును జయించెననుటకు శాసన ప్రమాణము లనేకములు గలవు. అనుమకొండ శాసనమున రుద్రదేవుని రాజ్యము దక్షిణదిశను శ్రీశైలము వరకును వ్యాపించెనని చెప్పబడి యున్నది. త్రిపురాంతక క్షేత్రమునఁ గూడ నీతని శాసన మొకటి గలదు. ఇంతకుఁ బూర్వమీ ప్రదేశములు రెండును వెలనాటి రాజుల యధీనము నందుండినవి. గోదావరీ మండలమునందలి ద్రాక్షారామమున క్రీ. శ. 1158 నాటిదగు [illegible]టియొక శాసనము రుద్రుని కాలమునాటిది గలదు. దాన నీతని మంత్రియగు ఇనగాల బ్రమ్మిరెడ్డి ధర్మ మభివర్ణింపబడి యున్నది.[66] అచటనే క్రీ. శ. 1168, 1186 లనాటి శాసనములు మఱిరెండు గాననగుచున్నవి.[67] వెలనాడు వంశీయుల రాజ్యమీ ప్రాంతమునకుఁ గూడ వ్యాపించి యుండెనని యితర శాసనములనుండి తెలియుచున్నది. పై విషయములనెల్ల గమనించినచో క్రీ. శ. 1158 లో రెండవ ప్రోలరాజు రణనిహతుఁడయిన పిమ్మట రుద్రదేవుఁడు కొంతవరకు వెలనాటి యుత్తరభాగముపై దాడి వెడలెననియు, క్రీ. శ. 1162 లో (అనుమకొండ శాసనకాలము) రెండవసారి దండు వెడలి శ్రీశైల త్రిపురాంతక ప్రాంతములను జయించెననియు నూహింపవచ్చును. ఆతడు క్రీ. శ. 1168 నుండియు ననగా వెలనాటి రెండవ చోడరాజు కాలమునుండియు పూర్వ తీరము నలజడి పఱచుచుండెను. ఉత్తరమున కొలని రాజులును, దక్షిణమునఁ దెలుగు చోడులును, ప్రబలి వెలనాటి వంశీయుల యధికారమును ధిక్కరించుట యీ కాకతీయ విజృంభణమునకుఁ బ్రోద్బలము నొసంగియుండును. మూడవ గొంకరాజు కాలమున వెలనాడులో నుపద్రవములు ప్రబలి యరాజక మెక్కుడయ్యెను. క్రీ. శ. 1186 వఱకుఁ బిమ్మట నీతని విషయమేమియు దెలియకుండుటయు, నీతని తనయుఁడగు పృథ్వీశ్వరుడు గోదావరి శాఖల రాజ్యమేలియుండుటయు, క్రీ. శ. 1186 నాటిదే కాకతిరుద్రుని శాసనమొకటి ద్రాక్షారామమున గన్పించుచుండుటయు నంతకుఁ బూర్వ మనేకసార్లు కాకతీయులు వెలనాటిపై దండెత్తియుండుటయు నాలోచించి చూడ మూడవ గొంకరాజును గాకతిరుద్రదేవుడు క్రీ. శ. 1186 లో రణరంగమున నెదుర్కొనెననియు దాన గొంకరాజు నిహతుడగుటచే నాతని పుత్త్రుఁడు పిష్టపురమునకుఁ బాఱిపోయెననియు నూహింప

65 ఈశాసనముల ప్రతిబింబములు హైదరాబాదు లక్ష్మణరాయపరిశోధక మండలివద్ద నున్నవి.

66 S. I. I. IV No. 117. 67 Ibid Nos. 1095 & 1135.

వెలనుపడుచున్నది.[68] ఆటుపిమ్మట విజృంభించినకోట, నతవాడి మున్నగు వంశములతో కాకతీయ గణపతిదేవుని కేర్పడిన వైవాహిక సంబంధములకు రుద్రదేవుడే స్వతంత్ర రక్షకార్థమై, బునాదుల నేర్పరచి యుండును. ఈ వెలనాటి యుద్ధముల మూలమునఁ గాకతి రుద్రుడు కేవలము పితృవధకుఁ బ్రతీకార మొనర్చుటయేగాక స్వరాజ్యమును బ్రకృత గోదావరీ కృష్ణా మండలముల లోనికిఁ గూడ వ్యాపింపఁ జేయగలిగెను.

ఆశ్రితులు—శాసనములందును వాఙ్మయమునను రుద్రదేవుని యుద్యోగులును సామంతులు ననేకులు పేర్కొనఁబడియున్నారు. ద్రాక్షారామ శాసనములలో నొకదానినుండి యినగాల బ్రహ్మిరెడ్డియను నొకమంత్రి తెలియవచ్చుచున్నాఁడు. తన రాజ్యకాలముననే రుద్రదేవుఁడు ఓరుగల్లుపురమును రాచనగరునుఁ గట్టించి ఇందులూరి వంశీయులగు పినమల్లన పెదమల్లన యను నిర్వురు సోదరులను మంత్రులుగ నియమించి యచ్చట రాజకార్యములను నెరవేర్చుచుండెనని శివయోగసారమునఁ జెప్పబడియున్నది.[69] రెడ్డికులజులగు రేచెర్ల వంశీయులీ కాలమునఁ గడుఁ బ్రసిద్ధి కెక్కియుండిరి. వీరిలో నొకఁడగు కామచమూపతి రెండవ ప్రోలరాజునకుఁ దక్షిణహస్తమై యొప్పియుండెను. ఆతని తనయులగు బేతిరెడ్డి, కాటరెడ్డి, నామిరెడ్డి యనువారలు రుద్రదేవుని కాలమున వాసికెక్కియుండినటుల శాసనములనుండి తెలియుచున్నది. బేతిరెడ్డి బిరుదములనుండియు, నాతని భార్య యెఱుకసానమ్మ చేసిన ధర్మప్రశంసనుండియు నాతడు మహాశూరుఁడుగ గన్పట్టుచున్నాడు. ఈతని కాలమును నిర్ణయించుటకుఁ గొన్ని యాధారములున్నవి. క్రీ. శ. 1195 నాటి యొక శాసనమున నామిరెడ్డికి వంశానుగతములగు బిరుదములేమియు లేకుండుటయు, క్రీ. శ. 1203 నాటి మఱియొక శాసనమునందయ్యవి గాంచనగుటయు, నాతనియగ్రజుడగు బేతిరెడ్డికా బిరుదములన్నియు నుండుటయుఁ జూడ నీ బేతిరెడ్డి క్రీ. శ. 1195—1202 ల నడుమ మరణించి యుండునని తోఁచుచున్నది. మహావీరుడగు నీతడు యుద్ధకర్మనిరతుడును, యోధశిఖామణియునగుఁ గాకతిరుద్రుని దండాధినాథులలో నొకడై యుండి యాకాలపు యుద్ధములలో నెల్ల బాల్గొని యుండెననుట నిర్వివాదాంశము.[70] క్రీ. శ. 1195 లోనే యీకాకతిరాజన్యుఁడు

68 J. A. H. R. S. V. pt, 2 లోని "Velnadu chiefs'' అను వ్యాసమున నీవిషయము జర్చించియుంటిని.

"The fact that Guru Mallikarjuna Panditaradhya cursed the Velnadu ruler at Chandavolu and that he was a contemporary of Kakati Rudra might be taken to support this view of Kakatiya connection with the fall of the Velnadu rulers''.

69 గీ. మతివాని సత్పుత్రికులు పెదమల్లవిభుడు, పిన్నమల్ల ప్రభుండన పృథివి బరగి
కాకతీయ్య మహారాజ్యకర్తయైన, రుద్రమహారాజ సచివులై రూఢిమనిరి.
తరళ. అనుమకొండపురంబుగాదని యావిభుండిల నోరుగ, ల్లనపురంబు ఘటించి యచ్చటి కచ్చుగా నరుదెంచి యు
మ్మనుజనాథుడు నాయకత్వము మల్లమంత్రికి చిన్నమ, ల్లనకు భాండి పెద్దసంపత్తి నాతఁడంబున నిచ్చెఁగా.
||శివయోగసారము||

70 J. A. H. R. S. V, pt. 3 లోని "రేచర్ల వంశము" అను వ్యాసమును జూడునది.

దేవగిరియాదవులతో ఘోరముగఁ బోరి రణరంగమునఁ బ్రాణములు బాయుటయు, నదేసంవత్సరమునకుఁ బిమ్మటఁ బేతిరెడ్డిప్రశంస గానరాకుండుటయుఁ జూడ నీతఁడుకూడఁ దనయేలిక వలెనే స్వదేశసంరక్షణార్థమై యాదవనిశితధారలకుఁ దన ప్రాణము నాహుతిగనొసంగెనని స్పష్టమగుచున్నది. ఈతనియనంతరము నాఁడు రెడ్డి పిల్లలమఱ్ఱి యామనగల్లుప్రాంతముల కధిపతియయ్యెను. ఈతఁడు ధర్మకార్యాభినిరతుఁడై దేవాలయ తటాకాది నిర్మాణములఁ గాలక్షేపము చేయుచుండెను. ఈసోదరులలో మధ్యముఁడగు కాటిరెడ్డి ప్రశంసయేమియు గానరాకుండుటచే నాతఁడు సామాన్యముగనే తనజీవితమును గడపియో లేక బేతిరెడ్డికన్న ముందుగనే మరణించియో యుండును. ఈకాటిరెడ్డిపుత్రుఁడగు రుద్రసేనాని యాంధ్రసేనానులలో నెల్ల బ్రసిద్ధుఁడును, కాకతిరాజ్య సంరక్షకులలో నగ్రగణ్యుఁడునై యాంధ్రలోకమునకు మహోపకారమునొనర్చి కీర్తి నందియుండెను. ఈరుద్రసేనాని కాకతిరుద్రునికాలమున యువకుఁడుగనుండి యాతని రాజ్యాంతకాలమునకు ప్రౌఢవయస్కుఁడై విజృంభించెను. నైజాం రాష్ట్రమునందలి కరీంనగరమునందలి యొక శాసనమునుండి కాకతిరుద్రునివద్ద గంగాధరుఁడనునొక బ్రాహ్మణమంత్రిగూడ నుండెనని తెలియుచున్నది. ఈతఁడు రెండవప్రోలరాజు కాలమున రాచనగరులో నొకయుద్యోగిగనుండి రుద్రదేవునికాలమున మంత్రిపదవిని సముచిత లాంఛనములనుఁ బొందెను. ధర్మచిత్తుఁడును మహాభక్తుఁడునగు నీమంత్రిసత్తముఁడు హిడింబాశ్రమము, నగరూరు, అనుమకొండ మున్నగుచోటుల ననేకదేవాలయములనుఁ బుష్పవాటికలను నిర్మించెను. ఈకాలమున బౌద్ధపూజ సామాన్యముగ జరుగుచుండెను. అందుచే నీమంత్రి బుద్ధదేవునకుఁగూడ నొకయాలయమునుఁ గట్టించెను.

వాఙ్మయము:— కాకతిరుద్రదేవుని రాజ్యకాలము కాకతీయాంధ్రసామ్రాజ్యమునకేగాక భాషావిద్యాభిపోషణమునకుఁగూడ బునాదులనిర్మించెను. సంస్కృతాంధ్రములయందు సమానపాండిత్యముగల యీరాజచూడామణి మహారసికుఁడై యనేకవిద్వాంసుల నాదరించుటయేగాక స్వయముగా గ్రంథరచనము నొనర్చియుండెను. ద్రాక్షారామ శాసనములలో నొకదానినుండి యీతనికి "విద్యావిభూషణుఁ" డను బిరుదముండెనని తెలియుచున్నది. ఈతఁడు సంస్కృతమున రచించిన "నీతిసార" మను గ్రంథమును బద్దెనకవి "నీతిశాస్త్రముక్తావళి" యనుపేరిటఁ దెనిగించెను.[71] అంతియగాక సుప్రసిద్ధశైవాచార్యుఁడును, మహావిద్వాంసుఁడునగు మల్లికార్జునపండితారాధ్యుఁడు నాతనిశిష్యుఁడును, వీరశైవమతప్రవర్తకాగ్రగణ్యుఁడు నగు పాల్కురికి సోమనాథుఁడునుగూడ కాకతిరుద్రదేవునకు సమకాలికులై యుండి యాతనియాదరణముఁ బడసియుండిరి. ఈకవిపుంగవులు కర్ణాటాంధ్రములలో రచించిన గ్రంథరాజము లాంధ్రదేశమున శైవమతము వ్యాపించుటకెక్కుడుగఁ దోడ్పడెను. వీరశైవమతావేశపూరితులై యనేకులగు కర్ణాటకకవు లాంధ్రభాషను, ఆంధ్రకవులు కర్ణాటకమునుఁగూడ గ్రంథములను రచించుచుండుటచే మతవాఙ్మయ విషయములలో కర్ణాటాంధ్రులకుఁ జేకూరిన పొందిక యీకాలమునం దేర్పడుట కవకాశముగలిగెను.

71 ఆంధ్రులచరిత్రము 2 వ భాగము పేజీ 172—173.

పల్నాటియుద్ధము:— కాకతీయ చరిత్రమునకు రుద్రదేవుని రాజ్యకాలముననే పూర్వపీఠిమున జరిగిన పల్నాటియుద్ధము మిగుల ప్రఖ్యాతమైనది. సవతిపిల్లల భేదములకు జరిగిన యీ యుద్ధకాలము మహాసంక్షోభము గాన గూర్చి వెలనాటిరాజులు మిన్నగువారల యదృష్టములను తారుమారొనర్చెను. ఈయుద్ధము ననేక కవులుకీర్తించి యుండిరి. వానిలో శ్రీనాథుని పల్నాటివీరచరిత్ర మగ్రగణ్యము. పదకొండవ శతాబ్దపు టంత్యభాగమున నుండి పండ్రెండవ శతాబ్ది ప్రారంభమునను హైహయవంశీయు లనేకు లాంధ్రదేశమున వెలనాటి ప్రాంతమున స్థిరపడి పశ్చిమచాళుక్యులకు సామంతులుగ చిన్నచిన్న రాజ్యముల నేర్పరచుకొనిరి. కాలక్రమమున వీరలు ప్రబలులగుటచే వెలనాటి రెండవ చోడరాజు సంతతివాడు తన పుత్రికయగు మైలమను హైహయుడగు అనుగురాజున కిచ్చి వివాహమొనర్చెను. ఈ సంబంధము వలన అనుగురాజు పల్నాటి కధిపతియై గురిజాలనుండి పరిపాలింప సాగెను. ఈతనికి మైలమవలన నలగామరాజును ఇతర భార్యలవలన మఱికొందరు సుతులు నుద్భవించిరి. అనుగురాజునకు రేచెర్ల బేతిరెడ్డి కుమారుడు దొడ్డానాయుడు మంత్రిగనుండెను. కొందరు పండితులీ బేతిరెడ్డిని పిల్లలమర్రి శాసనములలోని బేతిరెడ్డితో సమన్వయించి వంశవృక్షమును సరిచేయుటకై యసంబద్ధములగు ననేక నిర్ణయములను జేసియుండిరి. ఇట్టియూహలు సరియైనవి కావనియు, నీపద్మనాయక వంశమునకు మూలపురుషుడుగ బరిగణింపబడు బేతిరెడ్డియును, రేచెర్లయనునింటిపేరుగలిగి పిల్లలమర్రి ఆమనగల్లు ప్రాంతముల నభివృద్ధినందిన వంశమున బేర్కొనబడు బేతిరెడ్డియు నొక్కరు గాదనియు నిరూపించి నైజాంరాష్ట్రమునందలి గార్లగ్రామమునందున్న యొక శాసనమునుండి తెలియునగుచు నీ పల్నాటి యుద్ధకాలముననే యుండిన రేచెర్ల బేతిరెడ్డియే పద్మనాయక కుల ప్రతిష్ఠాపకుడనియు నేనిదివరలో సూచించియుంటిని. అనుగురాజును దొడ్డానాయుడును మరణించినపిమ్మట వారిపుత్రులగు నలగామరాజును, బ్రహ్మనాయుడును రాజును మంత్రియునైరి. రాజ్యమునకు వచ్చిన కొలది కాలమునకే నలగాముడు స్వాభిమానపూరితయు, తంత్రజ్ఞయు నజ్ఞాతోద్భవయు నగు నాయకురాలను నొక లావణ్యరాశి విలాసములకులోనయ్యెను. రాణికిని దనసవతి సోదరులయెడ మత్సరమును బుట్టించెను మంత్రియగు బ్రహ్మనాయుడీ యన్యాయ ప్రవర్తనము నుగ్గడించి రాజును సన్మార్గమునకు మరల్ప యత్నించుటలో నాతనికి నాయకురాలితో వైషమ్య మేర్పడియెను. మహాభారత యుద్ధమునందువలె నీసందర్భమున గూడ నిరువంకలవారును కోడిపందెముల మూలమున దమ తగవును బరిష్కరింప నిశ్చయించిరి. మాయోపాయముచే నాయకురాలు దన కోడిని గెలిపించి బ్రహ్మనాయుని నాతని పక్షము వారగు నలగాముని సవతి తమ్ముల నేడుసంవత్సరములు రాజ్యమువిడిచి యుండునటులొనర్చెను. ఈమితిగడచినపిమ్మట బ్రహ్మనాయుడు సవతిపిల్లలతరపున నర్ధరాజ్యమునడుగగా నలగాముడు వార్తదెచ్చిన రాయబారిని జాడింపించివైచెను. అంత నిరుపార్శ్వములవారికిని కారెమపూడివద్ద నొకఘోర సంగ్రామము జరిగెను. ఈసందర్భమున కాకతి రుద్రదేవుడు నలగామరాజునకు సహాయముగ వేయిగుఱ్ఱములనంపెననియు, కోటవంశీయుడగు

రెండవ కేతరాజు నాయకురాలిపక్షమున నొక గాయబారమును నడపెననియుఁ దెలియనగుచున్నది. కారెమపూడి యుద్ధమునం దనేకవీరు లిరుపార్శ్వములను మడసియుండిరి. అంతియగాక నాయకురాలు దానుస్వయముగ రణరంగమునఁ బ్రాకెను. తుదకుబ్రహ్మనాయఁడు జయించియు తనపక్షమునందలి రాజపుత్రులందరును సమసియుండుటచేఁ జేయునదిలేక నలగామరాజునుక్షమించి తిరిగిరాజ్యమున కభిషిక్తునిఁజేసెను. ఈయుద్ధము క్రీ. శ. 1176–1182 నడుమ, నసగా వెలనాటి రెండవచోడరాజు రాజ్యాంత్యమునను మూడవగొంకరాజు రాజ్యారంభకాలమునను జరిగియుండెను. ఈసందర్భమునం దనేకమండలికులు స్వతంత్రులై వెలనాటివారి యధికారమును ధిక్కరించిరి. ఈపరిస్థితులను గమనించుచుండిన కాకతిరుద్రదేవుడు క్రీ. శ. 1186లో వెలనాటిపై దండెత్తి మూడవగొంకరాజును వెలనాటివంశమును నాశమొనర్చి, సరిహద్దులలోనుండిన నతవాటిరాజులతో దాంపత్యమును నెలకొల్పి స్వరాజ్యమునకు మరలెను. స్నేహితుఁడగు నలగామరాజు రుద్రునకు మిత్రుడని యిదివరకే చెప్పియుంటిమి. ఈవిధమున నీపల్నాటి యుద్ధపరిణామముగ వెలనాటివంశపతనమును, వివిధమాండలికవిజృంభణమును, గాకతిరాజ్య విస్తరణమును సమకూడినవి.

సాంఘిక పరిణామములు:— రుద్రదేవుని రాజ్యకాలమునఁ దాత్కాలిక సాంఘికవిభాగములం దనేకమార్పులు గలిగినవి. కాకతీయ రాజ్య మూలస్థంభులై, యద్వితీయస్వామిభక్తిపరాయణులై, యనేక సమరవిశ్రుత విశాల యశోవిలాసులై, సకల రాజ్యాంగ నియోగ పాలకులై రొప్పి, ఏకశిలానగర సామ్రాజ్య మంతరించిన వెంటనే స్వతంత్ర రాజ్య సంస్థాపనమొనర్చి, రెడ్డిరాజులకును, సంగమవంశీయులకును, దుర్జయులకును, బ్రతిపక్షులై నిలచి, య[illegible]కళింగాంధ్రా సా[illegible]తమునం దాంధ్ర గౌరవ దీపకను బ్రత్యుద్ధరించిన పద్మనాయక వీరులీ కాలముననే ప్రాముఖ్యత నందిరి. వీరి యుత్పత్తినిగూర్చి పితాపురము, బొబ్బిలి, జటప్రోలు, వెంకటగిరి జమీందారుల వంశ చరిత్రములనుండియు, శ్రీనాథుని పల్నాటివీర చరిత్రము నుండియు, వల్లభామాత్యుని క్రీడాభి రామమునుండియు, పద్మనాయకచరిత్రమను దాళపత్ర గ్రంథము నుండియు, విశేషాంశములు దెలియనగుచున్నవి. పై వంశ చరిత్రములలో పద్మనాయ కోత్పత్తిని గూర్చి రెండు గాథలు గాంచనగుచున్నవి. వానిలో మొదటిది వారలొకప్పుడు క్షత్రియులుగనుండియు మహాపద్మునిచే చిరకాలము ఖైదునందుంచబడి కులోచిత సంస్కారములను మఱచి, బందీవిముక్తులైన పిమ్మట నేమియుఁదోచకపద్మనాయకులమని చెప్పుకొనుచు, కర్మహీనులై శూద్రప్రాయులై యుండిరనునది. రెండవగాథ ననుసరించి వీరలు మహావిష్ణువుయొక్క పాదపద్మమునుండి బుట్టినవాయకులగుటచేఁ బద్మనాయకులై రని తెలియుచున్నది. పద్మనాయక చరిత్రమున వీరుల యుత్పత్తినిఁగూర్చి బ్రశంస చేయరాదనియు, వారిలోఁ గొందరు రెడ్లును, గొందరు లక్కనాయకులును, మఱికొందరు కొంకణులునై యుండిరనియు, నూరిలోని నీరంతయు వరదనీటఁజేరి మహానది యైనటుల వారందరును మహావీర్యముచేఁ బద్మనాయకులై రనియుఁ స్పష్టముగఁ జెప్పబడియున్నది. వీరి యౌన్నత్యమునకుఁ గాకతీయరాజుల సమాదరణముఁగూడ బ్రబల

కారణమయ్యెను. అదే గ్రంథమున వెలమవంశము రెడ్డిసంతతికి మారొక్క విడఁబడియెనని చెప్పఁబడియున్నది. మఱియొకచో వెలమవారు రెడ్లనుఁ ద్యజించి [illegible] కలిసినట్లు యున్నది. పల్నాటివీరపురుషాగ్రగణ్యుఁడగు బ్రహ్మనాయఁడువీరవైష్ణవుఁడై యుండి యొకసాంఘిక సంస్కారము నొనర్చెను. వివిధ జాతులకుఁ జెందిన వీరులనందర నొకచోఁ జేర్చి యాలేఁడు వారల కన్యోన్య భోజనాది సంబంధము నేర్పరచి, జాతిభేదములను మఱచి సోదరబృందమువలె వారల నంచరింపఁజేసెను. పల్నాటి వీర చరిత్రమునుండి యిట్టివారిలో కన్నమనాయఁడను నొక పంచముఁడును, అనపోతను నొక బ్రాహ్మణవీరుఁడును, గొల్ల, కుమ్మరి, చాకలి మున్నగు నితరజాతుల వార లనేకులును, బ్రహ్మనాయని బలములలో నుండినటులఁ దెలియుచున్నది. దానినుండి పద్మనాయక వంశము వివిధవర్ణములలోని యోధపురుషుల సంమిశ్రణమువలన నేర్పడిన మహావీరవంశమని స్పష్టమగుచున్నది. ఈవిషయమున వీరిని రసపుత్రవీరులతోఁ బోల్చదగును. బ్రహ్మనాయనికి బాదన్న లేక పద్మన్నయను నగ్రజుఁడుండెను. వీరులకెల్ల బ్రహ్మన్నయే నాయకుఁడైనను నామమాత్రమున కాతని యగ్రజుఁడగు పద్మన్నను నాయకునిగ నొనర్చి యటుల పద్మన్న నాయకుఁడుగ నుండినవారగుటచే వారందరును బద్మనాయకులని ప్రసిద్ధి జెందియుందురు.

మహాశూరులునుఁ గేవలశస్త్రోపజీవులు నగు నీపద్మనాయకవీరులు పలనాటి యుద్ధానంతరము కర్తవ్యముగానక తమ్ముఁబోషించి యుచితోద్యోగమునొసంగు నేలికలేకయు, వివిధవర్ణములవారిచేఁ గులభ్రష్టులుగఁ బరిగణింపబడియు, శోచనీయమగు నవస్థకులోనైరి. ఈసమయమున వీరలనాదరించి వీరిని వీరకృత్యముల నియోగింపఁజాలునంతటి యార్థికరాజకీయ ప్రాపకముగలవారలు కాకతీయరాజులు తప్ప నితరులెవ్వరును లేకుండిరి. రుద్రదేవుని రాజ్యాంతకాలమున నాతనికిఁ దేవగిరియాదవులతో మహారణమొదవెను. ఆతనియనంతర మాతనిసోదరపుత్రుఁడగు గణపతిదేవ చక్రవర్తి పద్మనాయకులయెడ నెక్కుడభిమానమునుఁ జూపియుండెను. దీనినుండి రుద్రదేవుఁడే తనయాదవ యుద్ధములలో నీపద్మనాయక వీరుల నియోగించియుండెననియు నందలి యుపయోగమునుఁ గాంచియే గణపతిదేవుఁడు గూడ వారియెడ నెక్కుడాదరమును జూపెనని యూహింపనగును.

మతము:— కాకతిరుద్రుని రాజ్యకాలమున మతవిషయికములగు మార్పులుగూడ జరిగినవి. క్రీ. శ. 1158లో రెండవప్రోలరాజు కలచురివంశజుఁడగు బిజ్జలునకుఁదోడ్పడ నాతఁడు పశ్చిమచాళుక్య చక్రవర్తియగు మూఁడవ తైలపదేవుని రాజ్యచ్యుతుని జేసెనని యిదివఱలోఁ జెప్పియుంటిమి. అటుపైనయిదారు సంవత్సరములలో బిజ్జలుఁడు కళ్యాణనగరమున స్వతంత్రపాలనము నారంభించెను. అంతవరకును జైనమతము ప్రాముఖ్యతనందియుండెను. ఈసమయమున దక్షిణదేశమున శ్రీరామానుజాచార్యుని వైష్ణవమతము సుస్థిరముగ నాటుకొని తాత్త్వికబోధనమునకు మతావేశము [illegible]డఁ దోడ్పడ శీఘ్రముగ నెల్లెడలను వ్యాపింపఁజొచ్చెను. పల్నాటిసీమలో వీరాగ్రగణ్యుఁడగు బ్రహ్మనాయుఁడొనర్చిన సంఘసంస్కరణ మీవీరవైష్ణవ ప్రాబల్యఫలితమే. ఇటుల వైష్ణవమత మొకవంకను జైనధర్మము మరియొకవంకను వ్యాపించుచుండ, నూత్నవినిర్మిత శైవమ

రాజ్యమున గళ్యాణీనగరమునందొక మతోద్ధారకుండు బయల్వెడలెను. ఈతడే మహావీరుడగు బసవేశ్వరుడు ఈతనిబోధనలచే శైవమతమొకనూతన వికాసమునుగాంచెను. జనబాహుళ్యము జైనవైష్ణవ మతములవంకకు బోవుచుండగ నడ్డి వారిని శైవులఁజేయుట యీతనికి బ్రధానోద్దేశ్యమైయుండెను. గాన నీతడు తనబోధనలను సులభసాధ్యములుగను జనాకర్షకములుగను జేసెను. పూర్వము దక్షిణదేశమునందు నాయనారులున్నగు మహాభక్తులచే బ్రచారముచేయబడిన శైవము కేవల జ్ఞానభక్తిమార్గములచేతనే సాధ్యమయినదిగనుండెను. పిమ్మట శ్రీశంకరాచార్యుడు బ్రస్థానత్రియములను దాసికాధారములుగ నేర్పఱచి దానిని సంస్కరించెను. వేదోక్తములగు గర్మకాండల నాచరించి మనస్సంయమమునంది వేదాంతాధ్యయన మొనర్చి సరియగు నాధ్యాత్మికజ్ఞానము నలవడ జేసికొని బ్రహ్మోపాసన చేయుట బహుకష్టసాధ్యముగ నుండెను. దీనిని గ్రహించియే వీరవైష్ణవులు కేవల భక్తిమార్గమునుబూని, కర్మకాండనుసంకుచితమొనర్చి, జాతిభేదములేక నెల్లరకును వైష్ణవదీక్ష నొసగుచు, బ్రజాసామాన్యమునకు మహోపకారమొనర్చిరి. బసవేశ్వరుడుగూడ నీయాదర్శమునే యనుసరించి సనాతనకర్మకాండకు మూలాధారములగు వేదములను, దత్సంప్రదాయప్రవర్తితములగు వర్ణభేదములను త్యజించెను. మఱియు నీతడు శేషించిన శైవుల యాదరమునుగూడ నందుటకై శ్రీశంకరుని సిద్ధాంతములను, ఆకాలమున బ్రబలముగనుండిన భక్తితత్త్వమునుగూడ దనబోధనలలో జొప్పించెను. మాత్మవినిర్మిత మగు నీమత మితర మతములననేక సంగ్రామములఁ జేయవలసియుండు ననియు నట్టియెడ వేదధిక్కారమొనర్చుదీనికి బ్రమాదము వాటిల్లుననియు,నందువలన నీమతమవిచ్ఛిన్నముగ నడచుటకు దగిన యావేశమును శక్తియు నవసరములనియును, గ్రహించి బసవేశ్వరుడు తనమతావలంబనము నొక వీరకార్యముగను,దద్వ్యాపనము నొక వీరధర్మముగనొనర్చెను. ఈవిషయమున వైష్ణవులు జైనులయెడ నుపయోగించిన రీతి నీతడును భేదదండోపాయములను విధించెను. మఱియు నీతడు భక్తి, వైరాగ్య, ప్రపత్తులకు విశేషార్థమును ఘటించి దేహచ్ఛేదన నయనోత్పాటనాది సాహసకార్యముల నాచరించుటను గూడ ననుమతించెను. దీనివలన భక్తి సాత్త్వికముగను జ్ఞానజనితముగ నుండుటకు మారుగ నీమతమున కేవల మావేశరూపము దాల్చెను. ఇట్లుల బసవేశ్వరుడు బోధించినమతము వీరశైవమని ఖ్యాతి నొందినది. ఇందలి ముఖ్యసిద్ధాంతము లీక్రింద పేర్కొనబడినవి:—

శివుడే పరమదైవము. భక్తియే యాతనిం జెందుట కత్యుత్కృష్టమైనమార్గము. ఉపవాసములచే దేహము కృశించును. అవయవములను తుదకు కంఠమును గూడ ఛేదించుటచే గల్గు నమితమగు బాధనుసహితము లెక్కచేయకుండునంతటివాడే నిజమైనభక్తుడు. అట్టివాడే శివునితో నైక్యమునంద నర్హుడు. శివభక్తులలో జాతిభేదములు లేవు. ప్రతివారును గురువులవలన దీక్షను గైకొని శివపంచాక్షరిని జపించుచు లింగపీఠార్చనముఁ జేయుచు శివచిహ్నముగు లింగమును దేహమున ధరింపవలయును. జంగములను పరమశివునిరూపములుగ గుర్తించి పూజింపవలెను. పరదేవతాస్మరణము నన్యమతసంపర్కమును గర్హ్యములు.

అసతికాలముననే వీరశైవమతమతివ్యాప్తి నందినది. మతావేశపూరితులై శైవులు జైనులనుహింసించి, వారిగ్రంథముల నగ్నిబడవైచియు, వారికట్టడములను నాశనముఁజేసియు ననేకధముల జైనమతమును విధ్వంసమొనర్చిరి. మఱియొకవంక మల్లికార్జునపండితారాధ్యుడు, పాల్కురికి సోమనాథుడు మున్నగు బండితకవిశ్రేష్టులీమతమును బ్రచారమొనర్చి యనేకగ్రంథములను రచింపుచుండిరి. బౌద్ధమతమువలె నీమతముగూడ దేశభాషలలోనే బ్రచురింపబడుటచే గన్నడాంధ్రభాషలభివృద్ధినంది, ప్రబంధములు, కావ్యములు, పురాణములు, ద్విపదలు, పాటలు మున్నగు ననేకరూపముల నాభాషావాఙ్మయములు వర్ధిల్లినవి. ఈకాలమునందాంధ్రకవులు గన్నడమునను గన్నడకవులాంధ్రమునను గూడ గ్రంథములను రచింపుచుండుటచే నీరెండుభాషలకును సన్నిహితమగు సంబంధమేర్పడెను. బసవేశ్వరునికిఁ బిమ్మట వారలు మతచర్చలోఁ దమకుఁ గల్గు వేదబాహ్యత్వబాధను దొలగించుకొనుటకై బహువిధముల బ్రయత్నించి, వైదికవాఙ్మయమునుండియు బురాణములనుండియు గొన్నిభాగములనుగైకొనియు, నూతనముగ నాగమములను సృష్టించియు, నీవీరశైవమును సంస్కరించి సుస్థిరము నొనర్చిరి. ఇటుల కళ్యాణీనగరమునం దుద్భవించిన యీమతతరంగ మాంధ్రభూభాగమును గూడ చేరెను. ఈసంపర్కమువలననే కాతికరుద్రదేవుడు పరమమాహేశ్వరుడై యనేక సుందరశివాలయములను నెలకొల్పెను.

రాజధాని:— రుద్రదేవునికాలమునఁగూడ ననుమకొండనగరమే రాజధానిగ నుండెను. ఈతని కాలమునం దనేక దేవాలయములును, రమ్యహర్మ్యములును నిర్మింపబడుటచే నానగర మతిసుందరముగ నొప్పుచుండెను. రెండవ ప్రోలరాజు కాలమున నిప్పటి పద్మాక్షియాలయముచుట్టు నున్న లోయలోమాత్రముండిన యనుమకొండనగరము రుద్రదేవునికాలమునకు కొండలచుట్టును రెండు మూడు ఫర్లాంగుల దూరము వ్యాపించియుండును.[72] రాజధానీనగరమున జనసమ్మర్ద మెక్కుడగుటఁజేసి రుద్రదేవుడు ఓరుగల్లునగరమునుగూడ రాజకార్యనిర్వహణమునకై యుపయోగించుచు, దాను జయించిన శత్రునగరములందలి జనులనెల్ల నోరుగల్లులో నివసింపజేసి, వారి సౌకర్యమునకై యం దనేక విభాగములను నిర్మించెను. ఇట్టి శూరాగ్రణి యగు రాజుపాలనమునందుండి దేశ మేవిధమైన పీడ నెఱుంగక సంపూర్ణశాంతి నందియుండుటచే వివిధ విద్యలు, కళలు నభివృద్ధినంద నవకాశ మొదవెను. దీనికి శైవమత విజృంభణము దోడగుటచే నత్యద్భుత శిల్పకళాభినిరతి బయల్వెడలెను. హనుమకొండయందలి సహస్రస్తంభదేవాలయాభిధమగు రుద్రేశ్వరాలయము తాత్కాలికాంధ్రుల నిర్మాణశిల్పకళావైభవమును వేనోళ్ళ జాటుచున్నది

ఈరుద్రేశ్వరాలయము దక్షిణాభిముఖమై రెండు విభాగములుగ నిర్మింపబడియున్నది. దీనిచుట్టును బలిష్టమగు నొక నావరణమును నిర్మించి దాని దక్షిణదిశ నొక ద్వారమును, తూర్పున మరియొక దానిని గల్పించి, నైజాం ప్రభుత్వమువా రీజీర్ణదేవాలయము నతి భద్రముగ గాపాడుచున్నారు. దక్షిణద్వారమునుండి యీ యావరణమును బ్రవేశించినచో మన

72 అనుమకొండరుద్రేశ్వరాలయములోని శాసనమం దీనగరవర్ణనముగలదు.



దాక్షారామ భీమేశ్వరాలయము.



బోధాన్ దేవాలయము—మసీదుగా మార్చబడినది.

By Courtesy of H. E. H. The Nizam's Archaeological Department.

ను ప్రవేశమంటపము మాత్రము గన్పించును. ఇయ్యది భూమట్టమునకు 3 లేక 4 అడుగుల యెత్తుగ నున్న యొక శిలావేదికపై నిర్మింపబడి బహు స్తంభములతో గూడియున్నది. ఇందుపయోగింపబడియున్న రాళ్ళన్నియు తెల్లని రేణువుగల్గు "యిసుకరాళ్లు" (White sandstone) గ నున్నవి. ఒక సోపానపంక్తి నధిరోహించి మంటపప్రారంభమున కేగినతోడనే పెక్కు స్తంభములపై నిర్మింపబడిన రెండు వసారాలిరుపార్శ్వములను గన్పట్టును. వాని నడుమ ప్రథమద్వారము గలదు. ఇందుపై దూలముపై గజలక్ష్మి విగ్రహము చెక్కబడియున్నది. ఈ ద్వారమును దాటి 16 స్తంభములపై నిర్మింపబడిన యొక చతురశ్రమును చేరుదుము. ఇందలి యధోభాగమున మధ్యగా మూడు నాలుగంగుళముల యెత్తుననాలుగు శిలాస్తంభముల నంటి యొక వలయము గలదు. ఈ చతురశ్రమునందలి స్తంభములన్నియు నుపరిభాగమున మాత్రము కొలదిగ చెక్కబడియున్నవి. దీనికి తూర్పువైపున మూడు నాలుగడుగుల యెత్తున నొక వసారా గలదు. దీనిని జేరుటకు సోపానములు గలవు. ఇయ్యది పురాణశ్రవణాదులం జరుపుటకును యితర సమావేశములకు ననుకూలముగ నున్నది. అదేవిధమున పడమటివైపున గూడ నొక వసారా గలదు. ఇది యన్నివైపులను దెఱువబడియున్నది. మధ్యనుండు వేదినిబట్టి యిది యొక చిన్నయాలయముగ నుపయోగింపబడెనేమో యని తోచుచున్నది. అటులైనచో నిది తెరువబడియుండుటకు గారణము దెలియుటలేదు. చతురశ్రమున నుత్తరమునంగూడ, దక్షిణమునందువలెనే యొక ద్వారమును, దాని కిరుపార్శ్వములను రెండు వసారాలును గలవు. అచ్చటనుండి యొక మెట్లవరుసను దిగి ప్రవేశమంటపమును దాటుదుము.

ఈమంటపమునకును రుద్రదేవాలయమునకును నడుమ నొక వేదిక గలదు. దాని మధ్యభాగమున నీలశిలావినిర్మితమును, సుందర శిల్పకళావిరాజమానమును నగు నొక చెక్కిన నంది యుత్తరాభిముఖముగ నెలకొల్పబడియున్నది. దీనికి ముందు వెనుకల నిరుపార్శ్వములను గూడ సోపానములు గలవు. ఈ నందివేదికను దాటి యుత్తరముగ నేగినచో యాలయ ముఖమంటపసోపానము లున్నవి. ఆలయమంతయు ప్రవేశమంటపమువలెనే నక్షత్రాకృతి గల (Starshaped) శిలావేదికపై నిర్మింపబడియున్నది. ఈవేదిక యంచునకును ఆలయకుడ్యములకును నడుమ చుట్టును కొంత స్థలము విడువబడియున్నది. ఆలయమునందలి భూమట్టము వేదికనుండి 7 లేక 8 అడుగుల యెత్తున నున్నది. నంది కెదురుగ నొక సోపానపంక్తి గలదు. దీని కిరుపార్శ్వముల నొక యేనుగయు నొక నందియు నున్నవి. ఈమెట్లనెక్కిపోయినచో నాలుగు స్తంభములపై నిర్మింపబడిన యొక ప్రాంగణము గలదు. దానికి వెనుక నిరుపార్శ్వములను రెండు వసారాలు గలవు. వాని మధ్యనుండు ద్వారమును దాటి యేగినచో నొక చతురశ్రము ప్రవేశింతుము. ఈ గాలయమును నీలశిలలచే గట్టి, ప్రతి స్తంభమునందును సుందరమగు నగిషీపనిని చూపియుండిరి. ప్రవేశమంటప మెంత సామాన్యముగ నున్నదో యీ యాలయమంత సుందరముగ నున్నది. ఈచతురశ్రము నాలుగు మహా బలిష్ఠములగు నీలశిలా స్తంభములపై నిర్మింపబడి యున్నది. వీనియందలి శిల్పకళను గాంచి తీరవలెగాని వర్ణించుట కలవి గాజాలదు. అధోభాగ

మున స్తంభముల నంటుచు నొక వలయము 4, 5 అంగుళముల యెత్తున నిర్మింపబడియున్నది. ఉపరిభాగమున కప్పుపై గూడ నత్యద్భుతమగు శిల్పము గాంచనగును. క్రింద నున్న యీవలయమునకు సరియగునటుల కప్పుపై నొక చతురశ్రము గలదు. దాని లోభాగమున నొక చతుష్కోణమును, దానిలోపల నొక చతురశ్రమును, దానికి లోభాగమున నింకొక చతుష్కోణమును, దానిలోపల నొక దానిలో నొకటిగ రెండు వలయములును గలవు. ఈచతుష్కోణ చతురశ్రములలోభాగమున కోణముల కెదురుగ చేక్కని కవచముఖములు చెక్కబడియున్నవి. వలయములలో లోపలిదానిమధ్య నొక దేవీవిగ్రహము చెక్కబడియున్నది. ఆమె కాయుధసహితములగు పది చేతులు గలవు. ఈవిగ్రహము చిన్నదియై, భూమట్టమునకు పది పదునై దడుగుల యెత్తునం దుండినను నేత్రాద్యవయవములుగూడ చూపరులకు స్పష్టముగ నగపడుచున్నవి. ఈ ప్రథమవలయమునకు జుట్టును రెండవ వలయమునంటియు, గజములు, అశ్వములు, లొట్టిపిట్టలు మున్నగు జంతువులును వానిపై రౌతులతో చెక్కబడియున్నవి. ఈచతురశమును చేరి యిరుపార్శ్వములను రెండు సన్నని వసారాలును వానివెనుక పార్శ్వాలయములును గలవు. వీనిలో పడమటిప్రక్కనుండు వసారా పైకప్పు లోపలిభాగమున నొక షట్కోణమును దానిమధ్య నొక పద్మమును గలవు. వసారా నంటియే పార్శ్వాలయము గలదు. దీని ముఖద్వారము రెండు స్తంభములకు నడుమ బిగింపబడియున్నది. ఈ స్తంభములకును ద్వారమునకును నడుమ రెండుప్రక్కలను రెండు చేక్కని కోతనగిషీ పని (Sieen work) గల శిలాభాగములు గల వీనివలన సౌందర్యమేగాక యాలయాంతగమునకు వెలుతురుగూడ వచ్చుట కవకాము గల్పింపబడినది. ద్వారబంధమునగూ చేక్కని నగిషీపని గలదు. క్రిందిభాగమ నిరువురు ద్వారపాలకులు గలరు. పైభామున కడుగుభాగమున 9 కలువమొగ్గలవ నున్న శిఖరములు గలవు. దీని పైభాగము యాలయోపరిభాగము నంటుచు నొక చక్కని శిల్పఖండము బిగింపబడియున్నది. ఇందలి మధ్యభాగమున మహిషాసురమర్దనీ విగ్రహమును, ఇరుపార్శ్వములను పరివారమును, వారి కిరుపార్శ్వముల నారోహకసహితములగు రెండు మకరములును, రాతిలో కోయబడియున్నవి. ఈద్వారమును దాటినచో యొక చిన్న ముఖమంటపము గలదు. ఇందలి గోడలపైనను ద్వారమునను గూడ ననేక విగ్రహములు చెక్కబడియున్నవి. వీరందరును ఋషులో లేక భక్తగణములో యని తోచుచున్నది. ఈ మంటపము నంటియున్న గర్భాలయమున నొక వేదికపై శివలింగమున్నది. అటులనే చతురశ్రమునకు దూర్పుభాగమునగూడ నొకచిన్న వసారాయును దానినంటి మఱియొక పార్శ్వాలయము నున్నవి. కాని దీనికిని పశ్చిమాలయమునకును కొన్ని భేదములు గన్పించుచున్నవి. ఈప్రాగాలయ ముఖద్వారమునకును దానికిరుపార్శ్వములనున్న స్తంభములకును నడుమ నేమియు శిల్పము లేక తెరపిగ నున్నది. ఇందలి ముఖమంటపాంతర్భాగము సుందరతరముగ జెక్కబడియున్నది. గర్భాలయమునందలి వేదికను బట్టి యందలివిగ్రహ మొకదేవిదో లేక విష్ణువో యైయుండవలెనని తోచుచున్నది. పీ

గోపురశ్రీమునకు నడుమ నుత్తరదిశకు వ్యాపించి యొకసన్నని వసారానంటి రుద్రేశ్వరగర్భాలయము గలదు. ముఖద్వారము చక్కని రెండుద్వారములనడుమ నున్నది. ఇందలి పైదూలముమీఁద మధ్యగనొక శివవిగ్రహ మున్నది. ఆయుధసహితములగు నష్టహస్తములను, వంచిన యొకకాలుపై మఱియొకదాని నడ్డముగ నాని యుండుటను, కొంచెము ప్రక్కకు వంగిన శరీరమును,జూడ నీవిగ్రహము దక్షిణదేశమునందలి నటరాజవిగ్రహమును జ్ఞప్తికి దెచ్చుచున్నది. దీనికిరుపార్శ్వములను రెండు మకరములును వానిపై రెండు చిన్నవిమానములును గలవు ద్వారమున కిరుపార్శ్వములను స్తంభములవరకును వ్యాపించి కోతనగిషీపనిగల శిలాఖండములుగలవు. పడమటిభాగమునందొక గణపతివిగ్రహమున్నది. ఈద్వారమును దాటినచో పార్శ్వాలయము లందువలె నిచ్చటగూడ నొక ముఖమంటపమున్నది. అందతిసుందరములగు శిల్పములుగలవు. దీనివెనుక గర్భాలయముగలదు. అందు వేదికమాత్రము గాంచనగుచున్నది. ఈ ప్రధానాలయమునకును పార్శ్వాలయములకును నడుమ కోణములందలి ప్రదేశము తెఱువబడియున్నది. నీలాశిలామయమగు నీయాలయమున వెలుతురుచక్కగ వచ్చుటకై యిట్టియేర్పాటు చేయబడియుండెనని తోచుచున్నది. ఈయాలయ బహిర్భాగమందలిగోడ వంకె వంకెలుగ నిర్మింపబడియున్నది దానిలో ననేకవిధములగు శిల్పవిశేషములుగలవు. ఈభాగము నాలయోపరిభాగమునుగూడ ప్రవేశమంటపము నందువలెగాక మూయబడి యున్నవి. ఈ యనన్యశోభావిలాసమగు దేవాయతనమున కుపరిభాగమునం దసమానసౌందర్యముఁ గలిగి మహోన్నతములగు గోపురము లుండియుండవలెను [illegible]మున్నందిప్పుడు మూఁడు చిన్నదిబ్బలు మాత్రము [illegible]పైనఁ గన్పించుచున్నవి. రుద్రేశ్వరాలయమునకుఁ బ్రాగుత్తరమున నొకపుష్కరిణియును బ్రాగ్భాగమునందొక చిన్నమంటపమునుఁ గలవు. ఈమంటపస్తంభములలో నొకదానినాని యొకనీలశిలపై నొక చెక్కని శాసనముగలదు. ఇదియే చరిత్రప్రసిద్ధమగు ననుమకొండ శాసనము. దీనినుండియే రెండవప్రోలరాజు యొక్కయు, నాతనితనయుఁడును రుద్రేశ్వరాలయ నిర్మాతయునగు గాకతిరుద్రునియొక్కయు, దిగ్విజయములును, రుద్రేశ్వరాలయ నిర్మాణకాలమునుఁ దెలియుచున్నవి.

రుద్రుని మరణము:—ఇటులు దుర్నిరీక్ష్యతేజోవంతమై విరాజిల్లుచుండిన యాంధ్రసామ్రాజ్యమునుజూచి దేవగిరియాదవు లసూయాగ్రస్తులై యనుమకొండపై దాడివెడలిరి. రుద్రదేవుడు నసమానపరాక్రమమున వారినెదుర్కొనెను. గాని విధివశముచే యుద్ధరంగమునం దసువులనుబాసెను. యాదవరాజగు జైతుగి యొకయాంధ్రరాజును పశువుగ నుపయోగించి యొకనరమేధము నొనర్చెనని హేమాద్రి తనవ్రతఖండమునఁ జేర్కొనియున్నాఁడు.[73] పైటాను శాసనమునుండి యీరాజు మఱియొకయాంధ్రరాజును జంపి యాతనితనయునిఁ జెఱపట్టెనని తెలియుచున్నది.[74] కాకతిరుద్రునికి నంతానమేమియు లేకుండుటచే నాతఁడు పైశాసనమునందలి యాంధ్రరాజు గాజా

73 Bhandarkar - Early History of the Dekkan. (3rd Edn.) p. 243
74 Ep. Ind. III, p. 113.

లదు. గాన హేమాద్రిపేర్కొనిన తెలుగురాజే రుద్రదేవుఁడేయని తేలుచున్నది. క్రీ. శ. 1197 నకుఁబిమ్మట రుద్రదేవుని ప్రశంస గానవచ్చుట లేదని యిదివరలో జెప్పియుంటిమి. గాన నీ యాదవ దండయాత్రయు దత్ఫలితమగు రుద్రదేవుని మరణము నానంవత్సరముననే జరిగి యుండునని స్పష్టమగుచున్నది.

## XI మహాదేవరాజు.

### 1195—1198

కాకతిరుద్రుని మరణానంతర మాతని తమ్ముఁడగు మహాదేవరాజు కాకతీయసింహాసనము నధిష్ఠించెను. ఈతని చరిత్రమును గూర్చి ప్రత్యక్షప్రమాణము లేమియు దెలియుటలేదు. ప్రాచీన చరిత్రములలో నీతఁడు తన యన్నకాలముననే రాజ్యము నాక్రమించుటకై ప్రయత్నించెననియు, రుద్రదేవుఁ డాతని మన్నించెననియుఁ జెప్పబడియున్నది. ఓరుగల్లు కోటలోని స్వయంభుదేవాలయమున కెదురుగనున్న యొక శిలాఖండముపైనున్న శాసనమున మహాదేవరాజున కుపమన్యుమునియనునాత డొకఁడు సాయచేముసెనని వ్రాయబడియున్నది. కాని దానిని గూర్చి వివరము లేమియు దెలియరావు. క్రీ. శ. 1198 లో దేవగిరి యాదవరాజగు జైతుగి యనునాతఁడు ఆంధ్రదేశముపై దండెత్తివచ్చెను. అంత నాంధ్రులకును యాదవులకునొక ఘోరయుద్ధము జేరుగ నందు జైతుగి మహాదేవరాజును జంపి యాతని తనయుఁడగు గణపతిదేవుని జెరగొని దేవగిరికి మరలెను.[75] ఇంతకంటెను మహాదేవ రాజును గూర్చిన విశేషములేమియుఁ దెలియుటలేదు.

## XII గణపతిదేవ మహారాజు.

### 1198—1261

కాకతీయరాజన్యులలో నగ్రగణ్యుఁడగు గణపతిదేవుని రాజ్యకాల మాంధ్రదేశ చరిత్రమునకు వెలలేని యొక భూషణమువంటిది. ఈచక్రవర్తినాటి త్రిపురాంతక శాసనమునందు శా. శ. 1182వ సంవత్సరమీతని 62 వ రాజ్యసంవత్సరమని చెప్పబడియుండుటచే నీతఁడు శా. శ. 1120కి సరియగు క్రీ. శ. 1198 లో కాకతీయరాజ్యమున కేలికయయ్యెనని యిదివరలో చెప్పియుంటిమి. కాని యీతని మొట్టమొదటిశాసనము క్రీ. శ. 1209 లో, ననగా నీతనిపదియవ రాజ్యసంవత్సరమునాటిదిగా నున్నది.[76] ఈపది పదునొకండు సంవత్సరములను గణపతి యేమిచేయుచుండెనను సమస్యకు యాదవచరిత్రము సమాధానము నొసంగుచున్నది. యాదవగామచంద్రదేవుని పైఠాన్ శాసనమునుండి జైతుగి గణపతిపై దయగల్గియాతనిని బందీవిముక్తునిఁ జేసి స్వరాజ్యమునకు బంపెనని తెలియనగును.[77] దీనినుండి క్రీ. శ. 1198—1209ల నడుమ గణపతిదేవుఁడు దేవగిరిలో బందిగనుండి 1209లో తిరిగి స్వరాజ్యమునకు వచ్చెననియు, నాతని రాజ్యకాలముమాత్రము 1198 నుండియే బరిగణింపబడియెననియు దెలియుచున్నది.

గణపతిదేవుని రాజ్యము క్లిష్టములగు పరిస్థితులలో నారంభమాయెను. మహాదేవరాజు

75 Ep. Ind. III, p. 113: J.B.B.R.A.S. XV, p. 386: I. A. XI, p. 197.
76 E. R. No. 196 of 1905.
77 I. A. XXI, p. 197 also I. A. XIV, p. 314

కాలము జేయుటయు, నాతనితనయుఁడును గాకతీయరాజ్యమున కనంతరవారసుఁడు నగు గణపతిదేవుడు శత్రులచే జిక్కుటయు, దేశమున కెక్కుడనర్థమును గల్పించినవి. శత్రురాజులనేకులు నూతనముగ బయలువెడలిన యీ కాకతీయరాజ్యమును సమూలముగ నాశమొనర్చి, రెండవప్రోలరాజును రుద్రదేవుడును దమ కొనర్చిన పరాభవములకు బ్రతీకార మొనర్చు నుత్సాహముతో ననుమకొండ రాజ్యముపై దాడివెడలిరి. మఱికొందరు సామంతులీయదనున స్వాతంత్ర్యము బ్రకటించిరి. కానియాంధ్రులయదృష్టవశమున నవక్రవిక్రములగు గాకతీయసేనానులు, దేశభక్తియు, రాజభక్తియు బురికొల్ప వైరివాహిని నడ్డగించిరి. ఇట్టివారిలో గాకతీయ సామ్రాజ్యమూల స్తంభము లననొప్పు రేచర్లవంశీయులగ్రగణ్యులు. రేచర్లరుద్రసేనాని కాలాంతరుద్రుడై నాగతిభూపాలుడు మున్నగు నీప్రత్యర్థి భూపాలురందఱిని, కాకతీయసామ్రాజ్యము నకాలప్రళయజలధి మగ్నముగాకుండ రక్షించి, బందీవిముక్తుఁడై యేతెంచిన గణపతిదేవున కొసంగెను దీనికి పాలంపేటశాసనము ప్రమాణము.[78] రుద్రాంబిక నాటి యొక త్రిపురాంతకశాసనమున బొప్పదేవుడను నొక సేనాని గణపతిదేవునికి గూడ నాశ్రితుడైయుండి, గొంటూరి నాగదేవుని దునిమి, యితరులగు ననేక శత్రువులను బరిమార్చెనని చెప్పబడియున్నది[79] పాలంపేట శాసనమునందలి నాగతిభూపాలుడు నీ నాగదేవుడు నొక్కరే యనియు, గొంటూరనునది ప్రకృత గుంటూరునగర మనియు నూహింపవచ్చును.

ఇటులీయుపద్రవములనుండి బయలువెడలి కాకతీయరాజ్యము గణపతిదేవుని కరగతమగు సరి కాంధ్రదేశము శిథిలములగు పరిస్థితులకు లోనయియుండెను. క్రీ॥ శ॥ 1186 లో రుద్రదేవుడు వెలనాటి మూడవ గొంకరాజును రాజ్యచ్యుతుని జేసిననాటినుండి[80] క్రీ॥ శ॥ 120౪ వరకును గల కాలమున తూర్పుతీరమునందనేక విధములగు రాజకీయపరిణామము లొదవినవి వెలనాటిరాజుల ప్రతిభ యణగినతోడనే వేంగిదేశమునందమరావతీప్రాంతమున కోటవంశీయులును, మడపల్లెలో నతవాడి వంశమును, సారసిపురమున కొలనినాయకులును, గుడిమెట్టనుండి చాగివంశీయులును విజృంభింపసాగిరి. కృష్ణానదీ ముఖద్వారమునందలి ద్వీపమునందయ్యవంశీయులు ప్రబలియుండిరి.[81] గోదావరి కుత్తరభాగమున వేంగిదేశమునుండి పలాయితుడైన పృథ్వీశ్వరుడను వెలనాటిరాజు క్రీ॥ శ॥ 1196 ప్రాంతమున పిఠాపురమున స్థిరపడెను. ఇంకను కొంచె ముత్తరమున కళింగగాంగు లుండిరి. వేంగిదేశమునకు దక్షిణమున పొత్తపి, నెల్లూరు మున్నగు స్థలములనుండి తెలుగుచోళులు విజృంభించి మహాపరాక్రమమున ద్రవిడదేశరాజ్యాంగములం గూడ బాల్గొనుచు నెక్కుడు ప్రాముఖ్యత నందుచుండిరి. ఇది యిట్లుండ ననుమకొండ రాజ్యమునకు వాయువ్యమున హొయసలులును, దక్షిణమున చోళులును, ఉత్తరమున దేవ

78 Hyderabad Archaeological series No. 3. Palampet Ins. lines 50—60. 79 E. R. No 194 of 1905

80 J. A. H. R. S. Vol. V, pt. ii. లోని "The Velnadu chiefs" అను నా వ్యాసమును జూచునది.

81 ఆంధ్రుల చరిత్రము 2 వ భా. పే. 249—25)

గిరియాదవులును రాజ్యవిస్తరణమునకై ప్రయత్నించుచుండిరి.

కాకతీయసింహాసనము నధిష్ఠించినతోడనే గణపతిదేవుడు తనదృష్టిని వెలనాటివంకకు మరల్చెను. ఇందులకు రెండుకారణములుగలవు. మొదటిది, తన పెదతండ్రియగు రుద్రదేవుడు జయించిన భద్రాచలమునుండి వెలనాడువఱకు నుగల భూభాగమునం దనేకులగు రాజులు ప్రబలుట. రెండవది, గాంగవంశజుల యిక్కట్టులు. క్రీ. శ. 1202 నాటికి గాంగులకు తురుష్కులతోఁ బోరు ఘోరముగ జరుగుచుండెను. ఒకవేళ నాగాంగులు పరాజితులైనచో యవను లాంధ్రదేశమునుఁ గబళింప నవకాశ మేర్పడును. గాన దూరదర్శియు రాజ్యతంత్రజ్ఞుడునగు గణపతిదేవుడు తూర్పుతీరమును సత్వరమున రక్షింపవలెనని గ్రహించెను. గణపతిదేవుని కళింగవిజయమును నిర్ణయించుటకు శాసనములెక్కుడుగ దోడ్పడుచున్నవి. వెలనాటిలోని యీతని శాసనములు కొన్ని క్రీ. శ. 1213—1214 నాటివిగ నున్నవి.[82] ఈతని సేనానియగు రేచెర్లరుద్రుని యాశ్రితుడగు రాజయనాయకుని ద్రాక్షారామ శాసన మొకటి క్రీ. శ. 1212 నాటిదిగ నున్నది. దీనినుండి గణపతిదేవుని వెలనాటి విజయము క్రీ. శ. 1212—13 లలో ప్రారంభమయ్యెనని స్పష్టమగుచున్నది. మహానీతిమంతుడగు నీ చక్రవర్తి కేవల యుద్ధములవలననే దనయభిలషితమును నెఱవేర్చుకొని యుండలేదు. అంతకంటెను శాశ్వతములగు విధముల నీతడు తనయధికారమును వెలనాటను బాదుకొల్పెను. కోటవారును, నతవాడివంశజులును స్థానికులలో ప్రబలులుగనుండిరి. వీరి సాహాయ్యమునందు నుద్దేశ్యమునఁ గణపతిదేవుడు తన కూతురగు గణపాంబను కోట బేతరాజునకిచ్చియు,[83] తన సోదరియగు మేలాంబికను నతవాటి బుద్ధరాజుకొడుకగు రుద్రునకు నిచ్చియు వివాహములుఁజేసెను.[84] పిమ్మట నీత డయ్యవంశీయుల నెదుర్కొనెను. కృష్ణాముఖద్వారమున క్రొయ్యూరను గ్రామమునం దయ్యవంశమునబుట్టిన భీమనాయకుడను నాతడుండెను. జల్లయ, నారయ, సూరయ, యను నీతనిపుత్రులు వెలనాటిరాజుల కాశ్రితులై విశేష ప్రఖ్యాతిని గాంచియుండిరి. వారిలో నారయ కృష్ణాముఖద్వారప్రాంతమున కధిపతియై యుండెను. ఈతనికి పినచోడి నాయకుడను నొక కుమారుడు నాతనికి నారమ, పేరమయను తనయులును, జాయపనాయకుడను పుత్రుడునుండిరి. గణపతిదేవుడు వెలనాటిపై వెడలినకాలమునకు జాయపనాయకుడు మహాశూరుడని ప్రఖ్యాతిగాంచియుండెను. గణపతి యీతని నోడించియు, నీశూరుని దనసామ్రాజ్య నిర్మాణకార్యమునం దుపయోగించుకొను నుద్దేశ్యమున నీతని సోదరీద్వయమును బరిణయమాడి, జాయపనాయకునిఁ దన గజసైన్యముల కధ్యక్షునిగ నియమించెను.[85] ఇంతటినుండియు నాసేనాని గజసాహిణిజాయపనాయకుండన

---

82 E. R. Nos. 107 of 1897 and 717 of 1921.

83 E. I, III. p. 94. చూడుము E. R. Nos. 261 & 262 of 1897 లలో కోట వంశీయుడగు రెండవ బేతరాజు భార్యలలో కాకతీయవంశజయగు నాగమయను నామె పేర్కొనబడియున్నది. ఈమెకును గణపతి మున్నగు కాకతీయరాజులకును గల సంబంధ మెట్టిదో తెలియుటలేదు.

84 E. R. No. 204 of 1903. E. I, IV, p. 159.

85 E. I. III, p. 84.

ప్రఖ్యాతివహించి కాకతీయుల దక్షిణదేశ దిగ్విజయములం దెక్కుడుగ బాల్గొనియెను. పిమ్మట గణపతిదేవుడు కొలనిమండలికులపై దాడివెడలెను. ఈవంశీయులు వెలనాటిరాజులకుఁ బ్రక్కలోని బల్లెమువలెనుండి తద్రాజ్య పతనమునకు గారకులై యుండిరి. గణపతికాలమునకుఁ గేశవనాయకుడను నాతడు సారసిపుర పరిసరములనెల్ల జయించి విఖ్యాతివడసి యుండెను. ఈతనికిని గాకతీయులకునుఁ జరిగిన సంగ్రామమునుఁగూర్చి వివరములు "శివయోగసార"మను శైవగ్రంధమునుండి తెలియవచ్చుచున్నవి. ఇందులూరి వంశజుడును, గణపతిదేవుని యమాత్యులలో నొకడు నగు సోమయమంత్రి కొలనిపురమను సారసిపురమును ముట్టడించి, కేశవనాయకుని జయించి, యాతనిసంస్థానమును స్వాధీనము చేసికొనెను. ఇంతటినుండియు నీయిందులూరి వంశముఁ గొలనివంశమని ప్రఖ్యాతిఁ గాంచెను.[86] ఇంతటితో గణపతిదేవుని వెలనాటివిజయము పూర్తి యయ్యెను. ఇయ్యది క్రీ. శ. 1212—1235 లనడుమ జరిగియుండును.

కళింగవిజయము:—వెలనాటి నీవిధమున స్వాధినము జేసికొనిన పిమ్మట గణపతిదేవుడు తనదృష్టిని కళింగముపై మరల్చెను. అచ్చటి పరిస్థితులుగూడ నీకాకతీయ విజృంభణమునకనుకూలము గనే యుండినవి. కళింగ గాంగరాజగు మూడవ యనంగభీముడు (1211—1238) తనతండ్రి కాలమునుండియు కళింగము నలజడిపఱచుచుండిన యవనులతోఁ బోరుచుండెను. కాని దాక్షారామమునందలి కొన్ని శాసనములనుండి క్రీ. శ. 1230 నాటికి పరిస్థితులు మారినట్లు తెలియుచున్నది. శా. శ. 1152—1155 ల నడుమ ననంగభీముడు నాతని సేనానియగు జగసాజునందు జేర్కొనబడియున్నారు.[87] ఈసేనాని వేంగిదేశమును జయించెనని చెప్పబడి యుండుటచే క్రీ. శ. 1225 ప్రాంతముల గణపతిదేవుడనుమకొండకు మరలినపిమ్మట క్రీ. శ. 1230 ప్రాంతమున నీగాంగసేనాని వేంగిపై దండువెడలెననియు, నీసంవత్సరముననే కాకతీయుల కళింగదేశ విజయము ప్రారంభమయ్యెననియు నూహింపవచ్చును. శాసనములును శివయోగసారము నీసందర్భమునం దెక్కుడుగ నుపయోగించుచున్నవి. కొలనిపుర విజయమున ప్రఖ్యాతిగాంచిన సోమయమంత్రి కోదులనాటి నిజయించి, గోదావరినిదాటి, మన్య ప్రాంతము లనాక్రమించి, ఓరుగల్లునుండి సముద్రతీరము వరకునుఁగల ప్రదేశమునంతటి నాక్రమించెనని శివయోగసారమునఁ దెల్పబడియున్నది.[88] ఈ విజృంభణము 1230 లోని గాంగులదండయా

86 లీలఁగొలని మండలీకుల వెలదోలి । గొలనివీడు దానుగొనుట చేసి
కాకతీయుడైన గణపతి యందను గొలని సోమనయ వెలసెజగతి. (శివయోగసారము.)

87 S. I. I. IV Nos. 1360 & 1339.

88 చ॥ ఇలకుఁ బ్రసిద్ధమౌ గొలను కేళిలాపురి తూర్పుదిక్కునన్
గలిగిన భూములెల్ల గొని గర్వముమై కే(ర)ళాదిమండలీ
కులనవలీలదోలి మరిగోదులనాడును గొల్చివీడు నా
వెలసిన దుర్గముల్గొనుచు వేగమె గోతమిదాటి యమ్మలన్.

క॥ మాడియు వెందులుగొనియును । దాడెము పన్నెండు మన్నియముల సాధించి దా
నాదేశలింగము పేరుతు । గూడిన భుజిగొనియెను సోమకులముఖ్యుఁడొగిన్,

త్రిల కుత్తరమై యుండనోపును. కాకతీయు లింకొకతూరిగూడ గళింగమున బ్రవేశించినటుల గణపతిదేవునినాటి యుప్పరపల్లి శాసనము దెల్పుచున్నది.[89] అందు రుద్రుని యాశ్రితుడగు రాజయనాయకుడు బొక్కేరలో వీరభటావళిని వధించి, యుదయగిరినిసాధించి, ద్రాక్షారామ భీమేశ్వరు నర్చించెనని చెప్పబడియున్నది.[90] బొక్కెరగ్రామ మిప్పటికిని గంజాము మండలమునందలి అస్కాతాలూకాలో నున్నది. ఉదగిరి నెల్లూరు మండలములోని యుదయగిరితో సమన్వయింప బడినదిగాని యీస్థలముగూడ గళింగదేశముననే యుండునని తోచుచున్నది. కళింగదేశ ప్రశంసను జేయుసందర్భమున నెల్లూరి మండలములోని గ్రామప్రశంస సమంజసముగ గన్పట్టదు. ఇంతటితోఁ దృప్తినందక గాకతీయ సేనానులు మూడవతూరి కళింగముపై దాడివెడలిరి. గజసాహిణి జాయపనాయకుని యాశ్రితుడగు హేమాద్రిరెడ్డి యనునాతడీ విషయమున నెక్కుడు శౌర్యపరాక్రమములఁ జూపినటుల శాసనముల నుండి తెలియుచున్నది. ఈ విజయములు క్రీ. శ. 1235—1253 లనడుమ జరిగియుండును. 1254 ప్రాంతమున కాలపనాయకుడనునాతడీ కళింగభాగమునకుఁ బాలకుడుగ నుండెను.[91] ఈకాలమునుండి ప్రతాపరుద్ర చక్రవర్తి రాజ్యాంతమువరకు నీభాగము కాకతీయుల స్వాధీనముననే యుండి కాకతీయ సామ్రాజ్యమునకొకమర్మస్థానముగ నుండెనది.[92]

తెలుగుచోళులను జయించుట:—గణపతిదేవచక్రవర్తి తనసేనానులు కళింగదేశమును జయించుచుండిన సమయమున దాను దక్షిణదిశకు వెడలెను. తెలంగాణమును, దక్షిణకళింగమును, వేంగిదేశమును స్వాధీన మయిన పిమ్మట నీతనికి శేషించిన యాంధ్రభూభాగముఁ నంతను గూడ జయింప నిచ్ఛపొడమెను. గుంటూరు, నెల్లూరుమండలములును దత్తమండలములు నీకాలమున తెలుగుచోళుల పరిపాలనమునకు లోనై యుండినవి. 7, 8, 9, శతాబ్దములలో రేనాటిని బాలించిన యీచోళులు 10, 11, శతాబ్దములలో రాజ్యచ్యుతులై సామాన్య సేనానులుగనుండి పశ్చిమ చాళుక్యులకు లోనై యుండిరి. కాలక్రమమున వీరలు కడపమండలములోని పొత్తపిలోను, గుంటూరు మండలమునందలి కొణిదెనయందును, నెల్లూరను స్థిరపడిరి. పండ్రెండవ శతాబ్దాంత్యభాగమునను, పదమూడవశతాబ్ది ప్రారంభమునను నెల్లూరిశాఖ ప్రాముఖ్యత నందెను. అందలి తిక్కనృపతి మహాశూరుడై మండలికుల ననేకులజయించి, దక్షిణదేశ రాజ్యాంగములఁ బాల్గొని, చోళ పాండ్య హొయసల వంశీయులతోఁ బోరి, యనేకవిధముల తనప్రతిష్ఠను పెంపొందించు కొనియెను. గణపతిదేవుని కాలమున కాతని తనయుఁడగు మనుమసిద్ధి నెల్లూరు సీమకు బరిపాలకుడుగ నుండెను. అటులే పొత్తపినాటికి ఒప్పిలి సిద్ధి యధిపతిగనుండెను. కొణిదెనశాఖలోని చోడ

89 Hyd. Arch. Series No. 3 P. 16.

90 S. I. I. IV Nos. 1045 & 1252. 91 Ibid 602.

92 మఱియు నీకళింగవిజయ ప్రశంస గణపతిదేవుని నాటి మోటుపల్లి, ఏకామ్రనాథ, పాఖాల యున్నగు శాసనములందును, కాకతీయ సామంతుల శాసనములగొన్నిటియందునుఁ గూడగలదు. ఈసందర్భమున ఆం. వి. ప. మండలివారి కళింగ దేశచరిత్రమునందలి "కాకతీయులు కళింగము" అను శ్రీయుత మల్లంపల్లి సోమశేఖర శర్మగారి వ్యాసము విశేషాంశములను దెల్పుచున్నది.

మల్లిదేవ చోడునును, కన్నరదేవునిఁగూడ నీకాలపువారలే. నెల్లూరుమండలములోని శాసనములనుండి క్రీ. శ. 1218. నాటికి ఒంగోలు పొదిలి, దర్శితాలూకాలు గణపతిదేవుని యధీనమునందుండి నటుల తెలియుచున్నది [93] క్రీ.శ. 1224. నాటికి పొత్తపి పాలకుడగు ఒప్పిలిసిద్ధిని జయించి గణపతిదేవు డాతనిని దనప్రతినిధిగ నియమించెను. [94] ఈ సందర్భమున నీ చక్రవర్తి అద్దంకి పాలకులగు నొకమహారాష్ట్ర సామంత కుటుంబమునుఁ గూడ జయించెను. శాలంకాయన గోత్రుడును చక్రనారాయణ బిరుదాంకితుడు నగు మాధవదేవుడు క్రీ. శ. 1240-45 ల నడుమ నద్దంకిని బాలించుచుండెను. క్రీ శ. 1240 నాటియొక శాసనము నందీతడు గణపతిదేవునికి సామంతుఁగ బేర్కొనబడియున్నాడు.[95] ఈతని యనంతర మీతనిపుత్రుడు సింగళదేవుడు క్రీ. శ. 1247 వరకు[96] నటుపిమ్మట నాతని సోదరుడగు సారంగపాణిదేవుడు నద్దంకిని పాలించిరి. ఈసారంగపాణి నెల్లూరి మనుమసిద్ధి నృపాలునితో నిరంతరమును బోరుచుండెనని తిక్కన సోమయాజి కృత నిర్వచనోత్తర రామాయణమునుండి తెలియుచున్నది. మనుమసిద్ధిని స్వాధీన పఱచుకొనిన పిమ్మట,ననగా సుమారు క్రీ శ. 1250 ప్రాంతమునగణపతిదేవు డీతనిని జయించియుండును.[97] సుమారు క్రీ. శ. 1245 నాటికి గణపతిదేవుడు పొత్తపి, కొణిదెనపాలకులను, అద్దంకి పాలకులను జయించెను. ఇంకను నెల్లూరు దనకు వశముగాకుండుటచే నాతడు సమయమునకై వేచియుండెను. ఇట్టియెడ మనుమసిద్ధి నృపాలునికి దాయాదులగు నక్కన బయ్యనలను వారలతో వైరము సంభవించి, యాతడు వారలచే రాజ్యభ్రష్టుడు గావింపబడెను. ప్రాచీనచరిత్రములలో నీసందర్భమున మనుమసిద్ధి నృపాలు నకాశ్రితుడగు తిక్కన సోమయాజి యేకశిలానగరమునకేగి గణపతిదేవునిఁ దన పాండితీ ప్రకర్షచే మెప్పించి, యాతడు తనయేలికకు సాయముచేయు నట్లేర్పరచెనని చెప్పబడియున్నది. ఇందలి నిజానిజము లెట్లున్నను, మనుమసిద్ధికి సాహాయ్యమొనర్చుట దనకు లాభకరముగ నుండుటచే గణపతిదేవుడు నెల్లూరుపై దాడి వెడలి, యక్కన బయ్యనల నోడించి, మనుమసిద్ధిని తిరిగి విక్రమసింహపురీ సింహాసనమునఁ బ్రతిష్ఠించెను.[98] ఇయ్యది సుమారు క్రీ శ. 1245 ప్రాంతములఁ జేఱిగియుండును.[99].

తెలుఁగు చోళులను జయించు సందర్భమున గణపతిదేవునికి దత్తమండలము నందలి కాయస్థవంశీయులతో వైరమేర్పడియెను. ఈ వంశమునఁ బుట్టిన గంగయసాహిణి శూరశిఖామణియై యుండెను. ఈతడు మొదట నెల్లూరు పురపాలకులలో నగ్రగణ్యుడగు చోళతిక్క నృపాలుని సేనాధ్యక్షుడుగ నుండెననియు,నాతనికిఁ బిమ్మట స్వతంత్రుడయ్యెననియు తెలియుచున్నది. ఇట్టియెడ తిక్కరాజు మరణానంతర మాతని తనయుడగు మనుమసిద్ధికి నీగంగసాహిణికిని శాత్రవమేర్పడెననియు, తుదకు మనుమసిద్ధి యీకాయస్థుని నిర్జించెననియు నిర్వచనోత్తర రామాయణమునుండి తెలియుచున్న

93 Nel. Ins. O. 45. 94 E. R. 1900 P. 20 and 183 of 1899.
95 Nel. Ins. O. 76.
96 పైసంపుటము నందలి చందలూరు శాసనమును గాంచునది. 97 Ibid సారంగపుర శాసనము.
98 E. R. 69 of 1922.
99 E. R. 1900 P. 20 లోఁగూడ గణపతిదేవుని యాంధ్రచోళ విజయముప్రకటింపగలదు.

ది. గణపతిదేవుడు కూడ నీ గంగయసాహిణిని జయించి నటులనేక శాసనములనుండి తెలియుచున్నది. బహుశః దానికి గారణము, తను మసిద్ధి దాయాదులచే దఱుమబడిన పిమ్మట నీకాయస్థపాలకుడు స్వతంత్రుడై యాంధ్ర చోళరాజ్యము నలజడి పఱచుటయేమై యుండును. క్రీ. శ. 1250 నుండియు గంగయ గణపతిదేవునికి సామంతుడుగ బేర్కొన బడుచుండుటచే నీతడు 1245—1250 ల నడుమ కాకతీయులకు సామంతుడయ్యెనని తోచుచున్నది. గంగయను జయించుటచే గణపతికి నాతడు పాలించుచుండిన కడప మండలములోని పులివెందలతాలూకా నుండి మైసూరు రాజ్యమునందలి చింతామణి తాలూకా వరకునుఁగల విశాలభూభాగమంతయు స్వాధీనమయ్యెను.[100] మఱియు నీచక్రవర్తి గండికోట, ములికినాడు, రేనాడు, సకిలినాడు, ఏరువనాడు, పొత్తపినాడు మున్నగు దత్తమండల ప్రాంతములనెల్ల జయించి వానిపై గంగయసాహిణిని దనకు బ్రతినిధిగ నియమించెను.

ఇట్లు 1250వ సంవత్సరమునాటికి గణపతిదేవుడు ప్రకృతనైజాం రాష్ట్రమునందలి తెలంగాణా ప్రాంతమునంతటిని, తూర్పుతీరమున గంజాం మండలము మొదలు నెల్లూరువరకును, దత్తమండలముల నన్నిటిని, గూడ స్వాధీనముగావించుకొని కాకతీయ సామ్రాజ్యమును నిర్మించెను. దుర్నిరీక్ష్యతేజోవంతమై యలరారుచుండిన యీ మహాసామ్రాజ్యమున కీసమయమున నేక శిలానగరము రాజధానిగ నొప్పుచుండెను. బేతరాజు కాలమునుండియు గాకతీయులకు అనుమకొండపురము రాజధానిగ నుండినది. గణపతిదేవుని కాలమున క్రీ. శ. 1253 వరకు నాపట్టణమే కేంద్రస్థానముగ నుండినట్లు దెలియుచున్నది.[101] కాని క్రీ. శ. 1254 నాటి యొక శాసనమున గణపతి యోరుగంటిపుర వరాధీశ్వరుడని పేర్కొనబడియుండుటచే[102] నాసంవత్సరముననే యీ చక్రవర్తి తన రాజధాని నేక శిలానగరమునకు మార్చుకొనెనని స్పష్టమగుచున్నది.

దక్షిణదిగ్విజయము:—గణపతిదేవుడు దక్షిణదేశముపై గూడదాడివెడలియుండెను. అందులకు రెండు కారణముల నూహింప నవకాశము గలదు. మొదటిది విజిగీషామనీష. రెండవది తనకు సామంతులుగ నుండిన చోళులనుదాక్షిణాత్యు లలజడిపఱచుట. ఈ రెండవకారణము నఱయుటకు దక్షిణదేశ చరిత్రము మిక్కిలి తోడ్పడుచున్నది. పండ్రెండవ శతాబ్దాంత్యమున మూడవ కుళోత్తుంగుడు చోళరాజ్యమును పాలించుచుండెను. ఈతడు పరాక్రమహీనుడగుటచే ననేకులగు సామంతులు స్వతంత్రింప దేశ మల్లకల్లోలములకు లోనయి యుండెను. పాండ్యులు, హొయసలులు, తెలుగు చోళులు, పల్లవుడగు కొప్పెరుంజింగడు మున్నగు వారలు దమ యన్యోన్య కలహములలో చోళరాజును పణముగ నుపయోగించుచుండిరి. తెలుగుచోళులు కాంచీపురము నాక్రమించి తొండమండలమును బరిపాలింపసాగిరి. అంత కుళోత్తుంగుడీ యాంధ్రచోళులను నిర్జించి తతి

100 ఆంధ్రులచరిత్రము—భా 2 పే. 260.

101 E. R. Nos. 273, 195, 223 of 1905-6.
Nel. Ins. O. 28.

102. E. R. 231 of 1905

మిచ్చెను. ఇంతలో నాతని సామంతుడగు కొప్పెరుంజింగ డాతని నిర్జించి బందీకృతునిం జేసెను. ఈచోళరాజునకు మామయగు హోయసల నరసింహుడు దక్షిణమున కేతెంచి పెండమంగళమను చోట కొప్పెరుజింగని నోడించి తన యల్లుని బందీవిముక్తునిం జేసెను. అతని యనంతర మాతని తనయుడగు హోయసల సోమేశ్వరుడు ద్రవిడదేశమునందలి కన్ననూరున నిల్చి, చోళరాజ్యమును చక్కబఱుప జొచ్చెను. అంత నెల్లూరు పాలకుడును మహాశూరుడును మనుమసిద్ధినృపాలుని దండ్రియు నగు తిక్కరాజు వీరసోమేశ్వరునిపై దండెత్తి యాతనినిర్జించి చోళస్థాపనాచార్యు డయ్యెను. తిక్కరాజు మరణానంతరము మనుమసిద్ధి రాజగుటయు నాతని నక్కనబయ్యనలు పదభ్రష్టు నొనరించుటయు గాంచి, యిటుపై దెలుగు చోళులవలన భయములేదను ధైర్యమున పాండ్యులు వీరసోమేశ్వరుని కొప్పెరుంజింగని జయించి కాంచీపురము నాక్రమించిరి. ఆదేసమయమున కొప్పెరుంజింగడు తొండమండలమునుండి యాంధ్రచోళులను దఱిమెను.[103] ఇంతటితో దృప్తినందక యాతడాంధ్రదేశమున వేంగీమండలమునకు గూడ నేతెంచెనని దాక్షారామ శాసనములనుండి తెలియుచున్నది.[104] కాని యీ పల్లవరాజును గణపతిదేవుని సామంతులతి సులభముగ నిర్జించిరి. పై శాసనములలో నొక దానియందు "అవన్యవనోద్భవ, కాళకవతి" యన్నగు బిరుదములుగల యొకరాజు "కాకతి పతి"కి ధర్మముగ కాళకమహోత్సవమును జరుపనేర్పఱచెనని చెప్పబడియున్నది.[105] పై బిరుదములు రెండును కొప్పెరుంజింగని యితరశాసనములలో గనవచ్చుచుండుటచే నాతడే దాక్షారామశాసనములలో బ్రశంసింపబడెనని చెప్పుట కాక్షేపమేమియు లేదు. దాననే "గణపతి మహారాజ స్వాజ్ఞాంప్రవర్తయతాం" అనియును, "కాకతిః (గణపతి పదారవింద) మధుకరాయమాణ మానసేన" యనియు నుండుటచే నీకొప్పెరుంజింగడు కాకతీయ గణపతిదేవచక్రవర్తిచే నిర్జింపబడెనని స్పష్టమగుచున్నది. ఈ వృత్తాంతమంతయు క్రీ.శ. 1249 లో జరిగియుండును. కాంచీపురము నాక్రమించిన పాండ్యులను శిక్షించుటకై గణపతిదేవుడు తన మంత్రులలో నొకడగు సామంతభోజుని బంపియుండెను. ఈతడు దనయేలిక యాజ్ఞానుసారము కంచికిపోయి పాండ్యులను బారదోలెనని యీతని యేకామ్రనాథాలయ శాసనమునుండి తెలియుచున్నది.[106] కాని మఱుసటి సంవత్సరముననే యనగా క్రీ. శ. 1250 లో పాండ్యులు తిరిగి కాంచీపురముపై దండెత్తి యచ్చటి కాకతీయసేనానిని పాఱదోలి, నెల్లూరును ముట్టడించి, మనుమసిద్ధిని జయించి యచ్చట వీరాభిషేకమొనర్చిరి.

అంత్యదశ:—గణపతిదేవు డీపరాభవము

103 430 of 1902.

104 E. I. VII P. 67 లో కొప్పెరుంజింగడు తనరాజ్య ముత్తరమున దాక్షారామమువరకును వ్యాపించెనని చెప్పుకొనియున్నాడు.

105 S. I. I. IV Nos. 134? A & C.

106 Nel. Ins. Vol. III P. 830 No. 16.
E. R. No. 32 of 1891.
Idib 118 of 1894.

నకుఁ బ్రీతికారకమై యుపర్చినటు లగపడదు. ముదిమి యేదానికిఁ గారణమైయుండెను అది యునుగాక నీతనికి బురుషసంతాన మేమియు లేక రుద్రాంబిక యొకమాత్ర పుత్రికయై యుండుటచే నీతడు తనయనంతరము గాకతీయ సామ్రాజ్యము విచ్ఛిన్నము గాకుండుటకై యేర్పాటులఁ గావించుకొనుచుండెను. ప్రజలకును సామంతులకు నామెయందు గౌరవ విశ్వాసములు పెంపొందుటకును, ఆమె పురోభివృద్ధి నభిలషించియు, నీత డామెకు పురుషోచిత కృత్యముల నేర్పుచు నామెను రాజ్యాంగములఁ బాల్గొనజేయుచుండెను. ఇందులకు విద్యానాథుని ప్రతాపరుద్రీయమును, క్రీ శ. 1258 నుండియు నీరుద్రాంబ పరిపాలనా కార్యమును నెఱవేర్చుచుండెనని ముందువివరించి నవిషయమును బ్రబలనిదర్శనములు. మఱియును గణపతిదేవుఁడు వాస్తవముగ నేబదిరెండు సంవత్సరములు (1209—1261) రాజ్యమేలెను, అంతకుబూర్వ మీతడు పదిసంవత్సరములు దేవగిరిలో బందిగనుండెను. ఈతడు రాజ్యమునకు వచ్చునప్పటికి బాలుడుగ నుండెనని యెచ్చటను జెప్పబడకుండుటచే నాకాలమున కీతడు యువకుడుగ నైననుండి యుండును. దానిని బట్టి యీతడు పాండ్యులు కాంచీనగరమును రెండవతూరి యాక్రమించునప్పటికి డెబ్బది సంవత్సరముల వయస్సున నుండెనని యూహింపనగుచున్నది. గణపతిదేవుడు శైవుడు. తుదికాలము నందాతనికి గోళకీమఠాచార్యుల సంపర్కమబ్బుటచేతను వారి కీతడు పెక్కు దానధర్మములనుజేసి, తన చరమకాలము నాధ్యాత్మిక చింతతో గడిపి ఎనుబది యవ సంవత్సరమున దివంగతుఁడయ్యెను.[107]

ఆశ్రితవర్గము:— (1) పిల్లలమఱ్ఱిరెడ్లు. వీరి నిజమైన వృత్తాంత మింతవరకును చరిత్రకారులకు దెలిసియుండలేదు.

కాకతీయరాజుల కాలమున విశేష ప్రఖ్యాతి గాంచిన దీవంశము. ఇయ్యది రేచర్ల వంశ మనిగూడ బేర్కొనబడి యున్నది. చరిత్రమున నీనామముగల వంశములు రెండు పరిచితములుగ నున్నవి. వానిలో నొకటి "రేచర్ల" యను పదము గృహనామముగనుంచిన రెడ్డివంశము. రెండవది "రేచర్ల" గోత్రముసముద్భవించిన పద్మనాయకవంశము. చరిత్రకారులు గొందరీరెండు వంశములు నొకటేయను భ్రమకులోనై, యనేక ప్రమాదములకు బాల్పడిరి. పిల్లలమఱ్ఱి, నాగులపాడు, దోసపాడుమున్నగు నైజాం రాష్ట్రగ్రామములందలి శాసనము లీప్రమాదములను సరిచేయ దోడ్పడుచున్నవి. వానిలో "పిల్లలమఱ్ఱి రేచర్ల బేతిరెడ్డి" "రేచర్ల నామిరెడ్డి" "రేచర్ల కాటిరెడ్డి" మున్నగు నామము లీవంశీయులు రెడ్లనియు, వారికి రేచర్ల గృహనామమనియు జెప్పుచున్నవి. (cf కోటకేతరాజు, కాకతిగణపతి, ఇందులూరి అన్నయ etc.) ఇక పద్మనాయక వంశీయులకు "రేచర్ల" యనునది గోత్రనామ మనుటకుఁగూడ సిద్ధమగు శాసనప్రమాణముగలవు. ఈసందర్భమున నైనవోలు శాసనమును, అనపోతానాయకుని రావకొండ శాసనమును, మాదానాయకుని యుమామహేశ్వర శాసనమును బేర్కొన దగియున్నవి. ఈ రేచర్లవారి చరిత్రమును వ్రాయుపట్ల చరిత్రకారులు మఱియొక పొరపాటునుఁ గూడ జేసికొనియుండిరి. రెడ్డిపద్మనాయక వంశము

107 ప్రాచీన వంశచరిత్రము లీవయస్సునే చెప్పుచున్నవి.

లకుఁగల వ్యాఖ్యానముఁ గ్రహింపఁ జాలక ధార లీరెండువంశములకు నొకే వంశవృక్షము నునిర్మింపఁ బ్రయత్నించి యసమంజసములగు ననేక సిద్ధాంతముల నొనర్చిరి.

పిల్లలమఱ్ఱి ప్రాంతముపై కాకతీయసామంతులుగనుండి యధికారమును నెఱపి, మహాశూరులును, మహాదాతలు నని పేరువడసిన యీ రెడ్డికులజుల చరిత్రమును దెలిసికొనుటకు తెలంగాణమునందలి శాసనములే ముఖ్యాధారములుగనున్నవి. పాలంపేట శాసనముగూడ నీవిషయము నందగ్రగణ్యము. పై శాసనములలో చాలభాగము కొత్తగ లభించిన వేయగుటచే నిక్రింద వాని సారాంశమొసగబడుచున్నది:—

(1) పిల్లలమఱ్ఱి శాసనము:— బ్రహ్మపాదములనుండి బుట్టిన యొక వంశమున బమ్మసేనాని యుదయించెను. అతడు చోడరాజు మానద్రుమమును నాశమొనర్చి కాంచీనగరీ కవాటమును హరించెను. పిమ్మట "ముచ్చ" యను నాతడు బుట్టెను. అతని బుత్రుడగు కాటిరెడ్డి కాచాంబికను బరిణయ మయ్యెను.

(2) పిల్లలమఱ్ఱి శాసనము:— పద్మజపాదపద్మములనుండి బుట్టిన వంశమున బమ్మ, ముచ్చ, కాటయనువార లుద్భవించిరి. కాటయకుమారుడు కామయ. కాచాంబిక యాతని భార్య. వీరికి "బేత" యను నాత డుదయించి ఎఱ్ఱక్కయను నామెను చేపట్టెను.

(3) పిల్లలమఱ్ఱి శాసనము:— మహాసాధ్వియగు నెఱకసానికిఁ బుత్రుఁడు మల్ల యను నాతడు. శా.శ. 1180 లో పిల్లలమఱ్ఱి గ్రామము నందెఱకసాని యెఱకేశ్వరునిఁ బ్రతిష్ట చేయించెను.

(4) పిల్లలమఱ్ఱి శాసనము:— నామిరెడ్డి కాచాంబికలకు సుతుడును, ఐతాంబికా వల్లభుడునగు నామిరెడ్డి గణపతిదేవమహారాజు దయచే నధికారమునుఁ బొందెను.

(5) నాగులపాడు శాసనము:— నామిరెడ్డికిని అయితాంబికకును బుత్రుడగు మండలిక కాటిరెడ్డి గణపతిదేవ మహారాజు రాజ్యకాలమున శా. శ. 1156 లో తనపేరను దనతల్లిదండ్రులపేరను దేవప్రతిష్ఠలఁ గావించెను.

(6) పిల్లలమఱ్ఱి శాసనము:— అయితాంబికా నందనుడగు రేచెర్ల కామిరెడ్డి శా. శ. 1180 లో నొకధర్మముఁ జేసెను.

(7) నాగులపాడు శాసనము:— రక్తాక్షి సంవత్సరమున గణపిరెడ్డి మఱ్ఱెడ్డి యనువారలు తమతల్లి కామసానికిని దండ్రి కామిరెడ్డికిని బుణ్యముగా నొకధర్మముఁ జేసిరి.

(8) నాగులపాడు శాసనము:— కామయ నామయ మల్లయ లనువారలు కాటిరెడ్డి, పారసాని యను తమ తలిదండ్రుల బుణ్యమునకై పెక్కుదానములను జేసిరి.

(9) పాలంపేట శాసనము:— కాంచీపురమున వీరలక్ష్మి పరిగ్రహణము నొనర్చినవాడు బమ్మసేనాని. కాటచమూపతి యాతనివంశమునఁ బుట్టెను. మంధన్యగుండాధిపునిఁ జరిమార్చిన కామసేనాని యాతనికిఁబుత్రుడు. ఈతనికిని కామాంబికకును, మహాశూరుడగు రేచెర్ల రుద్రసేనాని యుదయించెను.

(10) పిల్లలమఱ్ఱి శాసనము:— గణపతిదేవ మహారాజునకుఁ బుణ్యముగా రేచెర్ల రుద్రరెడ్డి యొకధర్మము జేసెను.

(11) పిల్లలమఱ్ఱి శాసనము:— శా. శ. 1124 లో పిల్లలమఱ్ఱి గ్రామమున రేచెర్ల నామిరెడ్డి దనపేరిట నామేశ్వరదేవుని బ్రతిష్టించెను.

(12) పిల్లలమఱ్ఱి శాసనము:—శా. శ. 1117 లో రుద్రదేవుని రాజ్యకాలమున దత్ర సాదాసిడత రాజ్యలక్ష్మీవిలాసుండగు నామిరెడ్డి మూడు దేవతాప్రతిష్ఠలం జేయించెను.

పై శాసనములనుండి[108] యీరెడ్డిసామంతుల వంశవృక్షము నీక్రిందివిధమున నిర్ణయింపవలసివచ్చుచున్నది.




ఈవంశవృక్షరచనమును గూర్చి కొన్నియభిప్రాయభేదములు గలవు. పాలంపేటశాసనమునందలి రుద్రసేనాని నీవంశమునం జేర్పవలనుపడదని శ్రీశేషాద్రిరమణకవుల యభిప్రాయమై యున్నది. ఆశాసనమునందలి వంశక్రమమున ముచ్చసేనాని ప్రశంసలేకుండుటయు, నామిరెడ్డికి బేతిరెడ్డిగాక నింకొక సోదరుడు కాటాభిదుండిన ట్లితరప్రమాణములనుండి తెలియకపోవుటయు వారుజూపెడి కారణములు. కాని మూడు నాలుగు పురుషాంతరములకుం బూర్వముండిన యొక పూర్వీకుని నామమును విస్మరించుటొక గొప్పలోటుగాదు. ఇతరుల కీర్తిశౌర్యములను గొనియాడిన యీవంశీయుల శాసనములు ముచ్చసేనానిం గూర్చి విశేషముగ ప్రశంసింపకుండుట జూడ బహుశః యీతడు కాలముననే గతించెనో, లేక సా

108 పైశాసనముల ప్రతిబింబములు హైదరాబాదు ఐతిహ్యరాయపరిశోధకమండలివారిచే సేకరింపబడి "సుజాత" పత్రికలో గొంతవరకును ప్రకటింపబడినవి, మిగిలినవానికి నేను వ్రాసిన మూలములనుండి యథాపాఠము వ్రాయబడినవి.

సామ్యమునుబట్టి వీరు సోదరులని గనిపెట్టు యుండవలెనని తోచుచున్నది. కాకతీయశాసనము లనేకములు వంశక్రమమును రెండవప్రోలరాజునుండియే ప్రారంభించుచున్నవి. పెక్కింట మహాదేవరాజుస్మరణము గూడ గనవచ్చుటలేదు. అటులనే పల్లవచోళశాసనములలో గూడ గొందరు పూర్వికుల నామములు విడువబడియున్నవి ఇందుచే శ్రీ శేషాద్రిరమణకవుల రెండవయభ్యంతరము గూడ సరియైనదికాదని తోచుచున్నది. నామిరెడ్డి శాసనము లందెచ్చటను బేతిరెడ్డి తన సోదరుడని చెప్పుకొనియుండలేదు తలిదండ్రుల నామసామ్యములనుబట్టియే వీరిర్వురును సోదరులని చెప్పవలసియున్నది. అదేవిధమున కాటిరెడ్డి గూడ వీరికి సోదరుడనుటలో నాక్షేపమేమియు లేదు. ఇది యిట్లుండ పాలంపేట పిల్లలమఱ్ఱిశాసనములలోని వంశములు రెండు నొక్కటే యనుటకు యీరెండు తెగలశాసనములకును బమ్మసేనాని ప్రశంస సామాన్యముగనున్నది. ఈసందర్భమునంగూడ శ్రీశేషాద్రిరమణకవులు భిన్నాభిప్రాయము నొసంగియున్నారు. రుద్రునివంశకర్తృత బమ్మసేనానియనియు, నామిరెడ్డి పూర్వికుడు భీమసేనానియనియు వారి మతము. నేను పూర్వికుని పేరొకను పిల్లలమఱ్ఱిశాసనమును స్వయముగ జూచియుంటిని. అందతని నామము "బమ్మాభిధానో" యని స్పష్టముగా లిఖింపబడియున్నది. ఈకారణములవలన పైనొసంగబడిన పిల్లలమఱ్ఱి రెడ్లవంశవృక్షము సరియైనదనియే నావిశ్వాసము.

ఇందు బమ్మసేనాని మొదటి ప్రోలరాజుకాలమునందుండి కాంచీపుర చోళులను జయించి ప్రఖ్యాతివడసెను. కామచమూపతి రెండవప్రోలరాజు ప్రబలశత్రుర్ధియగు మంథన్యగుండాధిపుఁ దునిమెను. బేతిరెడ్డి కాకతిరుద్రునికి క్షీణభుజపై యొప్పి దన యేలికతో రణరంగమున ప్రాణములను బాసెను. అతని తమ్ముడగు నామిరెడ్డి గణపతి కాలమున విశేషముగ దానధర్మములజేసియు, ననేక దేవాలయములను గట్టించియు వాసికెక్కియుండెను. గణపతి బందిగనుండిన సమయమున, వైరిరాజులు కాకతీయ రాజ్యముపై దండెత్తి వచ్చినపుడు, వారల నెదుర్కొనినవారిలో నీనామిరెడ్డి ప్రశంసయేమియు గానరాదు. గాన నీతడు తన యన్నవలె మహాశూరుడుగాక సాత్వికవర్తనుడై యుండెనని దోచుచున్నది క్రీ.శ. 1202 కు పిమ్మట నీతని ప్రశంస గనవచ్చుటలేదు. రేచర్ల రుద్రసేనాని నాగతిరాజు మున్నగు శత్రురాజుల నిర్జించి, కాకతీయ రాజ్యము నెటుల గణపతిదేవుని కర్పించెనో యింతకు బూర్వమే చెప్పియుంటిమి. కాకతిరాజ్యభారధౌరేయుండను బిరుద మీతనియెడ సార్థకమైయొప్పెను. మహాశూరుడగు నీసేనాని యనుచరుడగు రాజెయనాయకుడు గణపతిదేవుని కళింగవిజయములలో నెక్కుడుగ బాల్గొనెను. రుద్రసేనాని యనుమకొండలో నొక రుద్రేశ్వరుని బ్రతిష్ఠచేసెను. ఈవంశపు ప్రాబల్యమింతటితో నంతరించెను. రుద్రసేనానికి దరువాతి వారందరును గణపతిదేవుని కాలముననే వశించియుందురు క్రీ. శ. 1235 కి పిమ్మట నీవంశీయుల ప్రశంసయేమియు గన్పడుటలేదు.[109]

౩. మల్యాలవారి వంశము:— రేచర్ల కీర్తి వాక్యముగు రెండవ కాకతీయ సామంత

109 J. A. H. R. S. V, pt 3 లోని "Recherla Family" అను వ్యాసము చూడుడు.

సంగము మఱియొకటిగలదు. ఈ వంశచరిత్రము ప్రాచీనమగు పద్మనాయక చరిత్రము నుండియు, నాధునికములగు "వెలుగోటివారి వంశావళి" "సురభివంశావళి" మున్నగు వెలమవారి చరిత్రములనుండియు దెలియనగుచున్నది. పిల్లలమఱ్ఱి శాసనములలోని రేచర్ల రెడ్డి వంశమును, యీపద్మనాయకులవంశమును భిన్నములని యిదివరకే చెప్పియుంటిమి. పద్మనాయక చరిత్రకారులీ వ్యత్యాసమును గ్రహింపకపోయిరి. మఱియును పిల్లలమఱ్ఱివంశీయులందరును రెడ్డి శబ్దవాచ్యులుగను, పద్మనాయక రేచెర్లవంశీయులు నాయక శబ్దాభిధులుగను గన్పడుచున్నారు. ఇట్టి వ్యత్యస్తములగు నీరెండు వంశములనొకే వంశమని భ్రమచే పై వంశచరిత్రకారు లనేకప్రమాదములకులోనైరి. మఱియును, వారు పల్నాటివీర పురుషులలో నగ్రగణ్యుడగు బ్రహ్మనాయుని, పద్మనాయక రేచర్లవంశమునకు మూలపురుషుడుగ బేర్కొనఁ బడిన బేతాళనాయనిని, పిల్లలమఱ్ఱి శాసనములలోని బేతిరెడ్డిని గలిపి యొకనిగ నిర్ణయించిరి. ఇది కేవలమును చరిత్రవిరుద్ధము. ఇందు మూడుచరిత్రాత్మకములగువిషయములు గలవు. వానిలో మొదటిది మొదటి ప్రోలరాజునుండియు కాకతీయసామంతులుగ నుండిన పిల్లలమఱ్ఱిశాసనములందలి రెడ్లు. వీరు గణపతిదేవునికిఁ బిమ్మట గానరారు. రెండవది పల్నాటి యుద్ధమున బ్రహ్మనాయుని సంస్కారాభిలాషచే వివిధ జాతుల నుండి యనేక శూరు లాకర్షింపబడి, కేవల శౌర్యోపజీవులగు పద్మనాయకుల కులముగ నేర్పడుట. మూడవది గణపతిదేవుని కాలమునసే యీ పద్మనాయకులు కాకతీయరాజుల యాదరణకుఁ బాత్రులగుట. ఈప్రత్యేకములగు విషయములను సమ్మిశ్రితముజేయుట తగదు. వెలమవంశ చరిత్రకారుల వ్రాతలకు రెండవ యభ్యంతరము పై వంశములలోని బురుషనామములపై నాధారపడి యున్నది. పిల్లలమఱ్ఱి వంశమునందలి బేతిరెడ్డికి మల్లారెడ్డియను బుత్రుడొక్కరుడు మాత్రముండెను. పల్నాటివీరుడగు బ్రహ్మనాయని పుత్రుడు బాలచంద్రుడు. పద్మనాయకవంశకర్తగ బేర్కొనబడిన భేతాళనాయనికి ప్రసాదాదిత్యనాయుడు, రుద్రనాయుడు ననువారలు బుత్రులై యుండిరి. దీనినుండి బ్రహ్మనాయుడు బేతిరెడ్డికాడనియు, బేతిరెడ్డి భేతాళనాయకుడు గాడనియు స్పష్టమగుచున్నది.

పై చర్చనుండి రేచర్లగోత్రియులగు నీ వెలమ వంశీయుల చరిత్రము నీక్రింది విధముగ నిర్ణయింపవచ్చును. ఈ రేచర్లగోత్రియులు పల్నాటియుద్ధమునకుఁబిమ్మట నేర్పడిన 17 పద్మనాయక గోత్రియులలో నొక్కరు. ఈవంశమునకు భేతాళనాయకుడు మూలపురుషుడు. క్రీ. శ. 1240-50 ప్రాంతముల పిల్లలమఱ్ఱి రెడ్లప్రతిభ యంతరించిన పిమ్మట నీపద్మనాయకులు కాకతి గణపతిదేవుని గొలువునఁ జేరి, యాతని దిగ్విజయముల యందసమాన పరాక్రమముఁ జూపి, యాతని గౌరవాదరములకుఁ బాత్రులైరి. ఈభేతాళనాయకునిఁ దరువాత వారిచరిత్రము రుద్రాంబికా ప్రతాప రుద్రుల చరిత్రములలోఁ బేర్కొనఁబడును. [110]

2 కాయస్థవంశము:—ఇందలి మొదటివాడగు గంగయసాహిణిఁగూర్చి గణపతిదేవుని యాంధ్రచోళ విజయములలో దెల్పియుంటిమి. ఈతనికి గండపెండేర బిరుదమును,

110 సౌకర్యార్థమీ పద్మనాయక వంశీయుల యొక్కయు వారియేలికలగు కాకతీయనృపాలుర యొక్క—

మాండలిక బ్రహ్మరాక్షస, రక్కస గంగ యను బిరుదములు నుండెడివి స్థానిక చరిత్రములనుండి యీసేనాని యెక్కుడు మతాభిరతిగల వాడనియు, గద్వాలు మండలము నందనేక పుణ్యకార్యముల నొనర్చెననియు దెలియుచున్నది. ఒకప్పుడాతని రాష్ట్రమును కాంచీపురమునుండిభీమయదేవ సిద్ధయదేవులను వారలలజడి పెట్టుప, గంగయకు దాయాదియగు జన్నిగదేవుడను నాతడు వారల నెదిర్చి, యోడించెను.[111] గంగయకు నామదేవ పండితుడను నొక బ్రాహ్మణమంత్రి విశేష సాహాయ్యము నొసర్చుచుండెను.[112]

3 అయ్యవంశము :— ఇందలి జాయప నాయకుని నిర్జించి యాతనిని గణపతిదేవుడు దన గజసైన్యముల కధ్యక్షుంజేసికొనెనని వెలనాటిపై జయముల నభివర్ణించునెడ జెప్పియుంటిమి. ఈసేనానికి చక్రవర్తి చేబ్రోలునొసగెను.

4 మల్యాలవంశము :— ఈవంశీయులు గూడ గణపతిదేవుని కాలము నందెక్కుడు ఖ్యాతినందియుండిరి. వీరి చరిత్రమును రచించుటకు నైజాం రాష్ట్రమునందలి యీక్రిందిశాసనములు మూల్యమగు సాహాయ్యము నొసంగుచున్నవి:—

1 కొండిపర్తి శాసనము:— దుర్జయాన్వయమున మల్యాలవంశమున దన్నపనాయకుడును, ఆతనికి సజ్జసేనాపతియు, నాతనికి కాచము యందు కాకతిరుద్రదేవుని సచివుండగు నొక పుత్రుడును, ఆతనికి బొల్లమవలన పోతయ, చౌండసేనాని యను నిర్వురు సుతులు జనించిరి. గణపతిదేవుని సైన్యాధ్యక్షుడుగ నుండిన చౌండసేనాని చౌండపురమను నగ్రహారమును, చౌండసముద్రమను తటాకమును, కొండిపర్తి నగరమున చౌండేశ్వరాలయమును నిర్మించి, యాయాలయముపై నొక హేమకలశమును నిల్పెను ఈచౌండసేనాని భార్య మైలమ.

2 కొండిపర్తి శాసనము;— పూర్వపు-మల్యాలవంశమున దన్నసేనాపతియు నాతనికి సజ్జసేనానాథుడు నాతనికిం గాటచమూపతియునుం బుట్టిరి. శా. శ. 1 62 లో నా కాటచమూపతి రుద్రేశ్వర ప్రోలేశ్వరులకు ధర్మములం జేసెను. ఈతడు గణపతి నృపతి శ్రీపాద పద్మషట్చరణుడు.

3 బూదపుర శాసనము :— కాకతీయ గణపతిదేవునకుం దక్షిణభుజముగ నొప్పుచుండినవాడును, కాచాంబికా కాచనయాధినీశులకుం దనయుడును, గోనవంశసంజాతయగు కుప్పాంబికకు భర్తయునగు మల్యాలగుండయ క్రి. శ 1181 లో బూదపురమున నొక తటాకమును నిర్మించెను.

4 బూదపుర శాసనము :— మల్యాలవంశమున దన్నసేనాపతి జనించెను. ఆతనికి కాచసేనాపతిం బుత్రుడు. ఆతని వంశమున గుండ

యు నామములివిః మునఁ జేర్పఁదగును.

1 పురుషాంతరము — బేతనాయకుడు, గణపతిదేవుడు.
2 ,, ప్రసాదాదిత్యుడు — రుద్రమనాయకుడు, } రుద్రాంబ.
3 ,, వెన్నమనాయకుడు — సిబ్బిరాయుడు, }
4 ,, ఎఱ్ఱనాచానాయకుడు, నల్లనాచానాయకుడు, సింగమనాయకుడు, } ప్రతాపరుద్రుడు.
5 ,, వెన్నమనాయకుడు, యాచమనాయకుడు. }

111 E. R. No. 208 of 1905. 112 Ibid No. 231.

దండాధినాథు డుదయించెను. [113]

పై శాసనములనుండి కాటచమూపతి, చౌండచమూపతియు, మల్యాలగుండయయు నొకే వంశమునకు జెందిన వారని తెలియుచున్నది. దుర్గయకులమునకు జెందిన యీమల్యాలవంశీయుల వంశవృక్షమీ క్రిందివిధముగ నిర్ణయింపవచ్చును :—




ఇందు గుండడు రుద్రమదేవికాలమునకూడ జీవించియుండెనని పై శాసనముల నుండియే దెలియుచున్నది.

5 సేవుణ వంశము :— వీరి చరిత్రమును గణపతిదేవుని నెల్లూరు దండయాత్రల వర్ణించునెడ జెప్పియుంటిమి.

6 ఇందులూరి వంశము :— ఈవంశీయులు రెండవప్రోలరాజు కాలమునుండియు కాకతీయుల కామిత్రులుగ నుండిరి. గణపతిదేవుని వెలనాడు కళింగ విజయములలో నీవంశజుడగు సోమమంత్రిజూపిన పరాక్రమ మగ్రగణ్యము. [114]

7 ఆంధ్రచోడ వంశము ;— ఇందలిపౌత్రవిశాఖకుజెందిన యొప్పిలిసిద్ధి గణపతిదేవుని సామంతుడుగ నుండి కొంతకాలము వెలనాటికిని నెల్లూరు మండలమునకును బ్రతినిధిగనుండెను. కౌశికసశాఖకు జెందిన కన్నరదేవచోడుడను నాతడు గణపతిదేవునిపై న్యాధ్యక్షుడై యుండినటులొక నందలూరు శాసనమునుండి దెలియుచున్నది.[115]

—గణపతిదేవుని యుద్యోగులు.—

మేచయనాయకుడు— ఈత డేకశిలాపురీపాలకుడై గణపతిదేవుని యనుగుదలవరిగ నుండెను [116]

తిక్కచమూపతి— మంత్రియు సేనానాయకుడును.

పోతన— మరియొకమంత్రి బ్రాహ్మణుడుగా నుండనోపును. ఈతడు సూర్యదేవుడను కవికాశ్రయ మిచ్చెను. [117]

దోచిరాజుగణపామాత్యుడు.

పోలరాజు— తంత్రపాలుడు. ఈతని తనయులగు ఎక్కినాయుడు, రుద్రనాయుడు, పినరుద్రినాయుడుననువారలుగూడ గణపతిదేవుని కొలువునందుండిరి. వారలు పద్మనాయకులై యుందురు. [119]

భాస్కరమంత్రి. [120]

సివిరిఅన్నయ— చక్రవర్తికి సర్వాధికారి.[121]

113 ఈశాసనములు హైదరాబాదు లక్ష్మణరాయ పరిశోధకమండలి వారివద్దనున్న ప్రతిబింబములను జేసు వ్రాసి మూలములనుండి గ్రహింపబడినవి.

114 ఈ సందర్భమున శివయోగసారము నారయదగును.

115 E. R. No. 805 of 1922.

116 cf. మారన మార్కండేయ పురాణము, కృత్యాది.

117 E. R. No. 530 of 1925. 118 Ibid 203 of 1899 &. 245 of 1905

119 Ibid 330 of 1915. 120 Ibid 405 121 Ibid 537 of 1925

శ్రీమన్ గోవిందనాయకుడు— మహాప్రధాని.

దామనామాత్యుడు—కార్యభరణుడు[122]

బయ్యనాయకుడు—మహాప్రధాని. ఈతనికి పెదగణప, నల్లగణప, జగదాలముమ్మడి, యనుముగ్గురు పుత్రులుండిరి వారిలో గడపటియాతడు తనపేరిట నొకతటాకమును నిర్మించి, కాకతి గణపతిదేవుని పేరుగా దానియొద్ద నగంగాపురమును గట్టించెను.

వీరలుగాక నింకను మల్లిదేవ సిద్ధయదేవులను నాంధ్రచోడవంశీయులును, అల్లాడ పెమ్మయదేవుడను పల్లవరాజును, గణపతిదేవుని సామంతులుగనుండిరి. శాసనములనుండి నూవుల మంచిరాజు, దేవరాజుననునిర్వురు మంత్రులు గూడ దెలియనగుచున్నారు.

ఆర్థికపరిస్థితులు:—గణపతిదేవుని కాలమునందాంధ్రదేశమున వాణిజ్యము ప్రబలియుండెను. ముఖ్యముగ విదేశములతోడి వ్యాపారము సురక్షితముగా నడచుటకై యాతడు వేలానగరమును మోటుపల్లిలో కొన్ని కట్టుదిట్టములను జేసెను. అప్పటివరకును ఆ రేవునకుఁ జేరు నావికులను తీరమండలీకుల నుండి రక్షణ మొసంగు వారలెవరును లేకుండుటచే నా చక్రవర్తి వారికాభయము నొసంగెను. మఱియు నితరదేశములవర్తకులా రేవునకు వచ్చుచు, దన పాలనము నందుండిన యాంధ్రదేశముతో వాణిజ్యమును నెఱపుటకై యాతడు సాధారణముగ విదేశవాణిజ్యముపై విధింపఁబడు పన్నులను తీయించివైచెను. శ్రీగంధము,పచ్చకర్పూరము ముత్యాలు, దంతము, పట్టునూలు, పవడము మిర్యాలు, మున్నగువానిపై నొక నియమిత ద్రవ్యమును సుంకముగ నేర్పరచెను. ఈ నియమములను పాలించుటకై సిద్ధయదేవుడను సేనాని మోటుపల్లికిఁ బాలకునుగ నియమింపబడెను.

మఱియును వారంగల్లులోకోటకుపోవుమార్గమున ఖాన్ సాహెబ్ తోటవద్ద నొక రాతిపై గలశాసనము నుండి[123] గణపతిదేవుని కాలమునందాంధ్రదేశమున నీ క్రిందిసరకులు వర్తకమున కనుకూలముగ నుండినవనియు, వానిపై నీ క్రిందివిధముగ స్థలసుంకములు వసూలు చేయబడు చుండెడివనియును దెలియుచున్నది.

నీలి—మూడకు రెండువీసాలు.
పోకలు—లక్కకు పాతిక.
కూరగాయలు—బండికి పాదిక.
మామిడి, కొబ్బరి—etc.
నూవులు, గోధుమలు / పెసలు, వడ్లు, జొన్నలు } బండికి మానెడు.
ఉప్పు—బండికి పదిపెడుకలమానెడు.
ఆవాలు, Etc కొలభండాలు—మూడ పాదిక.
తగరము, సీసము, రాగి—తులముకు 1ఫలము.
చందనము—తులం 1కి 1 ఫలము.
కర్పూరము—పీళ 1కి 2 చిన్నాలు.
జవాది—మూకపటుక.
కస్తూరి—100 చిన్నాల 1కి 2 చిన్నాలు.
పట్టునూలు—తులం 1కి చిన్నము.

ఇవిగాక మంజిష్టము, చందనము, ముత్యము, రుద్రాక్షు, గాటపూసమున్నగు మనోభాండాలంమును, పసుపు,ఉల్లి, జాజు,కంద, పెసలము మున్నగు, దుంపదినుసు లందు గూడ నాకాలమున వర్తకము జరుగుచుండెడిది.

122 Ibid 383 of 1924.

123 ఆ|| రా|| స|| మండలిఖారిశాసన మునకు చేయవ్రాసిన వకళమునుండి సంగ్రహింపబడినది.

పై పేర్కొనబడిన వాణిజ్య సుంకములు గాక మాగామ యను మఱియొక పన్నును ఉప్పుపై నొకపన్ను నాకాలమున వసూలు చేయబడు చుండెనని శాసనములనుండి తెలియుచున్నది.

మతము:—కాకతిరుద్రదేవుని పరిపాలనమునందు గురుమల్లికార్జున పండితారాధ్యుడు మున్నగు మహాశైవుల బోధలచే నాంధ్రదేశమున వీరశైవమతము వ్యాపించెనని దెల్పియుంటిమి. దానిని బల్నాటివీరచరిత్రము గూడ బలపఱచు చున్నది. అలరాజేను వీరుని గూర్చి యిటు లున్నది.

విరజాజి మల్లెలు విభూతిపత్రి
లింగని కారీతి బూజలు చేసి
పిలుమని జంగాల బిలిపించెరాజు
వచ్చిరి అప్పుడు పుణ్యజంగాలు.

దానినుండి 12వ శతాబ్దాంత్యమునకే యీపరిస్థితు లుండెనవని దెలియనగును. పల్నాటియుద్ధమునందధిక ప్రఖ్యాతివహించిన బ్రహ్మనాయుడు వైష్ణవ మతావలంబియనియు, నాతడు బసవేశ్వరుని వలెనే కులభేదములను పాటింపక సమస్తజాతుల వారిని వైష్ణవమతము నవలంబింపజేయు చుండెననియుం జెప్పబడియుండుటచే, నాకాలమున వైష్ణవమతము కూడ ప్రబలియుండెనని స్పష్టమగుచున్నది. జైనులు కూడ నీకాలమునందుండిరనియే చెప్పవలెను.

గణపతిదేవుని కాలమునందాంధ్రదేశమునకంతకును జోలముఖ్యమగు నొక సంస్థ యీదేశమునం బాదుకొల్పం బడెను. మల్కాపురశాసనమునుండియు, రుద్రాంబిక నాటి యొక తామ్రశాసనమునుండియు [124] నాకాలమున గోళగి మఠశైవాచార్యులు మన దేశమునకేతెంచి యెక్కుడు రాజాదరణమునుం బడసిరని తెలియుచున్నది. ఈమఠముయొక్క చరిత్ర యీక్రిందివిధముగ నున్నది.

భాగీరథీ నర్మదా నదులకు మధ్య దహాలమండలము గలదు. అచ్చట దూర్వాసగోత్రియుడును, సిద్ధిసంపన్నుడును, మహాశైవుడునగు సద్భావశంభువను నాతడుండెను. ఈతడు కళచురిరాజునకు దీక్షాగురుడగుటచే నా రాజతనికి 3 లక్షలగ్రామములను దానముచేసెను. అంత నాగురువుగోళగి యను మఠము నొకదానిని నిర్మించి యాగ్రామములను దానికి వృత్తిగానిచ్చెను. ఆతని పుత్రుడు సోమశంభువను నాతడు శైవాచార పద్ధతిని రచించెను. అతనికి వామశంభువు పుట్టెను. ఈతడును కళచురిరాజులకు గురువుగ నుండెను. ఇటులీ మఠమునం దనేకులగు శిష్యులును, ప్రశిష్యులునుండిరి. వారిలో శక్తిశంభువునకు కీర్తిశంభువనునాతడు శిష్యుడయ్యెను. ఇట్టివీరు గౌడ రాఢ కేరళ దేశాధీశులకుం గురువులైరి. వారిలో ధర్మశంభువునకు విశ్వేశ్వరదేశికుడు పుట్టెను. ఇతడు చాల ప్రఖ్యాతి నందియుండెను. చోళమాళవరాజు లీతని శిష్యులు. కళచురి కాకతీయరాజుల కీతడు దీక్షాగురుడు మహావిద్వాంసుడగుటచే నీతడు గణపతి విద్యామండపము నందధ్యక్షుడుగ నుండెను. [125] ఈతనికి గణపతిదేవుడు వెలనాటను కంద్రవాటి విషయమున, కృష్ణానదికి దక్షిణమునందు మందరమను గ్రామమును దానము చేసెను. ఆతని పుత్రిక యగు రుద్రాంబ వెలగపూడి నిచ్చెను. అంత నీ విశ్వేశ్వరశివు డచ్చట విశ్వే

124 ఇయ్యది ఆంధ్రసాహిత్యపరిషత్తునొద్ద గలదు. ప్రకటింపబడినట్లు తోచదు.

125 ఈవిశ్వేశ్వరశివుడే పురుషార్థసారమును రచించిన శివదేవయ్యయని కొందరిమతము.

శ్వరగోళగి యను నొక మఠమును, విశ్వేశ్వ రాలయమును, సత్రము నొకటి దానిని గట్టించెను. ఇచ్చట విద్యార్థులకును, శివయోగులు నాగంతులకును భోజనాది సౌకర్య మేర్పరుప బడెను.[126]

ఈ గోళగీమఠమునకు దక్షిణదేశమునందనేక శాఖలుండినవి. ఇట్టివి పుష్పగిరి[127] త్రిపురాంతకము నను నాంధ్రభాగములందును, ద్రవిడదేశమున తిరుప్పరన్‌కున్రం, దేవికాపురము నను స్థలము లందు నుండెడివి.

కట్టడములు :— రాజ్యాంగమునందువలెనే గణపతిదేవుని రాజ్యకాలము శిల్పకళకును భవననిర్మాణమునకును మిగుల ముఖ్యమైనది. దేశమునం దంతటను సువిశాలములగు ననేక కట్టడము లపూర్వమగు రీతిని నిర్మింపబడినవి. ఇట్టి శోభ నాంధ్రదేశ మిదివరలో గాంచియుండ లేదనుటలో నతిశయోక్తి లేదు. ఈకాలపు శిల్పములను బరిశీలించినచో నాటి యాంధ్రుల నిర్మాణకళానైపుణ్యము వ్యక్తమగుచున్నది. కొందఱు పండితులు కాకతీయుల కళ చాళుక్యకళ కనుకరణమే యని యభిప్రాయపడియున్నారు. స్థూలదృష్టి కియ్యది సరిగనే యున్నను సవిమర్శముగ జూచినచో నిందనేక వ్యక్తిక వ్యత్యాసములు గాంచనగుచున్నవి. ఏకశిలానగరము, రామప్ప, పిల్లలమఱ్ఱి, కొండిపర్తి మున్నగు ననేక స్థలములలో గణపతిదేవుని కాలమున సుందరదేవాలయములు నిర్మింపబడినవి. ఇవి యన్నియు సామాన్యముగ నొకేవిధముగ నున్నవి. రామప్ప తటాకమున కనతిదూరమునం దున్న యా దేవాలయము కాకతీయశిల్పశిఖామణి యన నొప్పుచున్నది. దాని యౌన్నత్యము చూపరులకు విస్మయము గొల్పుచున్నది. భూమిపై నుండి సుమారుపదియడుగుల యెత్తున నక్షత్రాకృతిగల వేదికపై నీ మహోన్నతమగు దేవాలయము నిర్మింపబడియున్నది. దాని బహిర్భాగమంతయు నత్యంతరమణీయముగ జెక్కబడి యున్నది. ఆలయమున కెదురుగ మహోన్నతమగు గోపురమును, సుందర శిల్పవిరాజమానమగు ద్వారము నుండినవనియచ్చటిశిథిలములు దెల్పుచున్నవి. ఇందలి ముఖమంటపము చెక్కని శిలాస్తంభములచే నావరింపబడియున్నది. ఇయ్యవి సర్వవిధములను హనుమకొండ సహస్రస్తంభదేవాలయమునందలి స్తంభములను బోలి బహ్వి యంగుళమునను జెక్కబడి యున్నవి. స్తంభములకును పైదూలములకును నడుమనుండు సంధిశకలములు వర్ణనాతీతములుగ నున్నవి. హంపీవిజయనగరమునందలి విఠలదేవాలయమునందువలె (Cf. కల్యాణ మంటపము) నీ శకలములపై మనోహరములగు మూర్తిశిల్పములు గలవు. యక్షయక్షిణీవిగ్రహము లిం దగ్రగణ్యములు. నీలశిలావినిర్మితములగు నియ్యవి సుస్నిగ్ధములై చూపరులకు సజీవములవలె గన్పట్టుచున్నవి. ఈ యాలయము పైకప్పునందలి లోభాగమున ననేక వరుసలలో తామరమొగ్గలు నిర్మింపబడినవి. ప్రవేశమంటమునందలి గోడలపై భాగమునం దుత్సవములును, విచిత్రములగు ననేక దృశ్యములు గలవు. వీనినుండి యాకాలపు టాంధ్రుల దుస్తులు నాభరణ విశేషములును దెలియుచున్నవి. ఇందొక భాగమున సంగీతసభలును, వివిధములగు నృత్యములును గూడ చెక్కబడియున్నవి. గణపతిదేవుని సేనానులలో నగ్రగణ్యుడగు జాయసేనాపతి

126 ఇందునుగూర్చి విశేషాంశములకు మల్కాపురం శాసనమును జూడవలెను.

రచించిన నాట్యశాస్త్ర మిచ్చట నీవిధమున జిత్రింపబడినదని గొందరు బండితుల యభిప్రాయము. ఈరామప్పదేవాలయమున కొక మైలు దూరమునం దింకొక సుందరమగు జీర్ణాలయము గలదు. ఇయ్యది యెఱ్ఱని యిసుకరాతితో నిర్మింపబడియున్నది. ఆలయము వెలుపలి వసారాల పైకప్పు లోభాగమున వరుసలు వరుసలుగ తామరమొగ్గలు చెక్కబడియున్నవి. ఆలయము వెలుపలి గోడలపై బురాణములనుండి యనేక చిత్రములు చిత్రింపబడియున్నవి. ఈయాలయములు రెండును విజయనగరసామ్రాజ్యాధీశులచే నిర్మింపబడిన యాలయముల నీవిషయముల బోలియున్నవి. గణపతిదేవునికాలమున నిర్మింపబడిన యాలయము లన్నియు నిదేవిధమున మహోన్నతములును శోభావంతములు నైయున్నవి.

ఏకశిలానగరదుర్గమునుగూడ గణపతిదేవుడనేకవిధముల సంస్కరించెను. ప్రాచీనచరిత్రములనుండి రుద్రాంబికకాలమునకే యీ దుర్గముచుట్టును రాతిగోడయుండెనని దెలియుచున్నది. బహుశః దీనిని గణపతిదేవుడే నిర్మించియుండును. ఇంతియగాక నీతడు శిలాప్రాకారమునకు లోభాగమునం దొక యిటికగోడను గూడ గట్టించెను. దీని లోభాగముననే రాజప్రాసాదము లుండెడివి. ఈయిటికగోడపై రక్షకభటులు లుంచబడిరి. రాత్రింబవళ్ళు వారలు దానిని జాగరూకులై రక్షించునటు లేర్పాటులు జేయబడినవి.

ఏకశిలానగరదుర్గమునందలి మనోహరములగు ద్వారములనుగూడ గణపతిదేవుడే నిర్మించెనని గొందరి యభిప్రాయము. ఈనాలుగు ద్వారములు నొక జీర్ణమంటపమునకు సమీపమునం దున్నవి. వీనిమధ్య నొక యాలయ ముండెడిదని చెప్పబడుచున్నది ఈవిషయము నచ్చటి భూమిని ద్రవ్వి పరిశోధించిన గాని నిర్ణయింప వలనుపడదు. ఈసుందరద్వారములు ప్రతాపరుద్రచక్రవర్తిచే నిర్మింపబడియుండునని దోచుచున్నది.

## XII రుద్రాంబ.

(1258—1296)

కాకతీయ గణపతిదేవ చక్రవర్తికిం బిమ్మట రుద్రమదేవి రుద్రదేవమహారాజను పేరిట నేకశిలానగర సింహాసనము నధిష్ఠించెను. ఈమెకును గణపతిదేవునికిని గల సంబంధమునుం గూర్చి యిదివరలో నభిప్రాయభేదములుండినవి. ఈక్రింది ప్రమాణములనుండి యామె గణపతికి భార్యయను వాదమొకటి ప్రబలియుండినది.

(1) వెనీసుదేశ యాత్రికుఁడగు మార్కో-పోలోయను నాతడు మోటుపల్లిని దర్శించి, యచ్చటి నియమముల నేర్పరచిన గణపతిదేవుని శ్లాఘించి యాకాలమున నందానిభార్య రాజ్యమేలుచుండెనని వ్రాసియున్నాడు.[128]

(2) విద్యానాథకృతమగు ప్రతాపరుద్రీయమునకు వ్యాఖ్యానమును వ్రాయుచు, కుమారస్వామి "పురాకిల కాకతికుల సంభూతే గణపతినామ్ని మహారాజే కాలపరిపాకము పేయుషి తన్మహిషీరుద్రమదేవీ నామరాజ్ఞీ" యనిపేర్కొని యున్నాడు.

(3) సోమదేవరాజీయమునుండి గణపతి యాదవరాజునోడించి యాతని కూతురగు రు

---

127 E. R. No. 272 & 323 of 1905.
128 Yule—Morco Polo Vol, II P. 361.

ద్రమ్మను ద్వాహమాడెనని తెలియుచున్నది

(4) హిందూదేశచరిత్ర సంగ్రహమున లక్ష్మణరావుగారును, Colonel Haig అనునాతడు మఱియొకచోట నిటులే దెలంచిరి.

పై వానిలో మార్కోపోలో వ్రాతలకు సరియైన నిర్ణయము వేరు. అతడు ప్రజాసామాన్యము నందలిగాథల నాధారముగ జేసికొనెను. కుమారస్వామి వ్యాఖ్యానము మూలమునకు విరుద్ధమగుటచే నప్రామాణ్యము. ప్రాచీన చరిత్రములు సందేహాస్పదములు. రుద్రమ గణపతిదేవునికిఁ గూతురనుటకీ క్రింది ప్రబల ప్రమాణములు గలవు.[129]

(1) గణపతి నృపతి స్స్వస్య నరపతి శతపోషక స్సోభూత్ (39 పంక్తి)

రుద్రదేవీసమ దధూచ్చరణ్యా సర్వభూభృతాం। గంభీరాన్మహతస్తస్మాల్లక్ష్మీ రత్నాకరాదివ॥

(మాల్కాపురశాసనము 41&42 పంక్తులు)

(2) స్వస్తి శ్రీకాకతీశో గణపతినృపతి స్తస్య సారుద్రమాంబా। (కోటగిరి తామ్రశాసనము॥)[130]

(3) తస్మాత్ శ్రీగణపతినామధేయో సంజజ్ఞే। జాతా తస్య పయోనిధేరివరమా... శ్రీరుద్రదేవీసుతా (కొలనుపాక శాసనము॥)[131]

(4) తవమాతా శివాస్సాక్షాద్దేవో గణపతిః పితా॥ (ప్రతాపరుద్రీయము)

(5) శ్రీగణపత్యధీశః। స్ఫురజ్జయ శ్రీమతి రుద్రభూపతీ తదాత్మజా కుర్వతి రాజ్యమున్నతం॥ (పానుగల్లు శాసనము)[132]

(6) పితర్యుపరతే తత్ర ద్వాదరక్షదక్షిణాం క్షితిం। వీరరుద్రమదేవీతి దుహితా మహీం తాం... ॥

(అనితల్లికలువచేరు శాసనము)

(7) వెండియు గణపతి ధరణీశ మండలు... పుత్రి రుద్రమహిదేవి కొగిస (శివయోగసారము)

రుద్రాంబిక కుటుంబమును గూర్చి కూడ కొన్ని సందేహము లుండినవి. ఈమె భర్త నామమెట్టిదో యింతవరకును సరిగ నిర్ణయింపబడియుండలేదు. ద్రాక్షారామ శాసనములలో నొక దానియందు మల్లదేవు డొకడు గణపతిదేవుని కల్లుడుగ జేర్కొనబడియున్నాడు. గురుజాడ శ్రీరామమూర్తిగారీతనిని పిఠాపురమున 13వ శతాబ్దమున బాలించిన విష్ణువర్ధన మల్లపునిగా నిర్ణయించియున్నారు. కాని యీతని కాలము 1202-12 గ నుండుటచేతను, పై శాసనము క్రి. శ. 1175 నాటిదగుటచేతను, రుద్రమ కాలము 1258-1296 అగుటచేత నీ నిర్ణయము ప్రమాదకరమని స్పష్టమగుచున్నది. వీనినన్నిటిని జర్చించి యాంగ్ల చరిత్రకారులు రుద్రాంబికభర్త యొక్క సామంతమండలీకుండై యుల్లరిక ముండెననియు, యౌవనమున నే గతించెననియు, నూహించుటకు బాధకములేవని వ్రాసియున్నారు.[133] E. R No. 740 of 1920 లో రుద్రాంబిక చాళుక్యవీరభద్రేశ్వరుని భార్యయని చెప్పబడియున్నది. ఇదివరలో చెప్పబడిన కొలనుపాక శాసనము నందు చాళుక్యవంశమణియు, నిందుశేఖరనరాధిపుని జ్యేష్ఠపుత్రుడు

---

129 Hultzsch in I. A. 1892, P. 198.
Sewell Antiquities I. P 74 & 75.
E. R. Nos. 94 of 1917 & 740 of 1920.

130 Hyd. Arch. Serices No. 3.

131 & 132 వీనిమాతృకలు లక్ష్మణరాయపరిశోధకమండలి వారివద్దగలవు.

133 ఆం. చరిత్రము 2 భా. పే. 306-308.

నగు వీరభద్రుడు రుద్రాంబిక భర్త యనియు, నాతడు 30ని వర్తనములనేలను దానము చేసె ననియు తెలువబడియున్నది.[134]

పరిపాలనము:—రుద్రమ గణపతిదేవుని కేకమాత్ర దుహిత. ప్రాచీన చరిత్రముల్లో నీమె యెనుబది సంవత్సరములు జీవించెనని చెప్పబడియున్నది. ఆది కాలమునం దీమె తన మనుమని రాజ్యాంగముల పాల్గొన జేయుటయు, తాను క్రీ. శ. 1258 నుండియు, పరిపాలనాకార్యము నెరవేర్చుటయు జూడ, ఈ చరిత్రము తీవిషయమున విశ్వాసనీయము లని తోచుచున్నది. క్రీ॥ శ॥ 1254 లో నీమె కూతురు ముమ్మక్కకు ప్రతాపరుద్ర దేవుడు జననమందెను. 1258—1296 నడుమ 40 సం॥గలవు. పౌత్రదర్శనము గల్గుట కీమెకు 1258 నాటికి ముప్పది నలువదియేండ్లైన నుండవలెను. దానిని బట్టి రుద్రమ క్రీ॥ శ॥ 1220-1225 ల నడుమ జన్మించెనని యూహింపవచ్చును. ఈమెకు బుత్రికోదయమైన వెంటనే భర్తమృతినంది యుండును. దానంజేసి తనయనంతరమీామెయే కాకతీయసామ్రాజ్యమున కధిపతిగావలసియుండుటచే, గణపతిదేవు డీమె కవసరమగు రాజకీయ శిక్షణమునొసంగెను. ఆతడీమెకు "రుద్రదేవు"డను బురుషనామమిడి యుద్ధములందు సహితము పాల్గొన చేయుచుండెనని ప్రతాపరుద్రీయము నుండియు, రుద్రదేవమహారాజనుపేరిటనామె క్రీ.శ. 1258 నుండియు రాజ్యతంత్రమును నెఱపుచుండెనని శాసనములనుండియు, దెలియుచున్నది.

రుద్రమదేవి సింహాసనమునెక్కిన వెంటనే యాంధ్రదేశము నొక్కసారిగ ననేకపరిశయము లావరించినవి. త్రిపురాంతకమునందలి కొన్ని శాసనములనుండియు, కాకతీయసేనాధ్యక్షుల బిరుదములనుండియు నీ కాలమున వైరిరాజులనేకులు కాకతీయ సామ్రాజ్యవు దక్షిణదిశ నలజడి పఱచిరని దెలియుచున్నది. అట్టివారిలో మూడవ కులోత్తుంగచోడుడొకడు.[135] ఆంధ్రచోడుడగు సిద్ధయదేవచోడుని,[136] కులోత్తుంగునిం గూడ రుద్రమ్మసేనాని త్రిపురాంతకుడు నిర్జించెను. అతని దమ్ముడగు నంబదేవుడు ఎఱవమల్లి దేవచోడుడు, కేశవదేవుడు, సోమిదేవుడు, అల్లుగంగు, మల్లికార్జునుడు, దామోదరుడు మున్నగు వారలజయించెను.[137] పిమ్మట నీసేనాని, గణపతిదేవుడొనర్చిన పరాభవమునకు ప్రతీకారమొనర్ప నేతెంచిన కొప్పెరుంజింగని దఱిమివైచి,[138] విద్రోహమొనర్చిన సామంతుడగు మనుమ గండగోపాలుని శిక్షించియు, కాంచీపురపాలకుడగు విజయగండగోపాలుని యుద్ధమునుండి బలాయితునింజేసియు,[139] గాకతీయసామ్రాజ్యము నకాలప్రళయమునుండి గాపాడెను.

ఈసామంతులయొక్కయు దాక్షిణాత్యులయొక్కయు నుపద్రవము లడంగిన వెంటనే యుత్తరమునుండి యాదవులు దండెత్తివచ్చిరని తెలియుచున్నది. 1220—1270. నడుమ దేవగిరిరాజ్యమును బాలించిన మహాదేవరాజునుంగూర్చి ప్రశంసించుచు హేమాద్రి తన వ్రతఖండమునందు "ఇత్థంవినిశ్చిత్య తతోబిభీ

134. 1930-31, ఉ గాదిసంచికనుగూడ జూడునది. ఈచాళుక్య వీరభద్రునిగూర్చి విశేషాంశము లేమియు దెలియుటలేదు.

135 E. R. 196 & 201 of 1905. 136 E. R. 175 of 1905.

137 E. R. 168 of 1905. 138 E. R. 170of 1905 and 480 of 1902.

139 E. R. 168, 173, 174, 242 & 268 of 1905.

ఈశాసనములనుండి యీవిషయమై విశేషాంశములు దెలియుచున్నవి.

తైరంధ్రైః పురంధ్రీనిహితా నృపత్వే" యని వ్రాసియున్నాడు. (cf. రాజప్రశస్తి 14 శ్లో॥) పై గ్రంథమునందలి యవతారికలోని 52వ శ్లోక మగు

"యస్తస్యైవరణే జహారకరిణ
స్తత్వంచశస్త్రాదికాః।
యస్తత్యాజవధూనధాదుపరత
స్తథ్యాభుజాంరుద్రమాం".

అను శ్లోకము నాధారముగ జేసికొని భాండార్కరు పండితుడు ఆంధ్రులు మహాదేవరాజు నకుఁ భయపడి స్త్రీని దమకేలికగ నొసర్చిరని యు, నంత నాత డాంధ్రదేశముపై దండెత్తి వచ్చి యుద్ధమున రుద్రాంబిక నోడించి పంచరత్నములను, నేనుగులను, పంచశస్త్రసాధనములను హరించి, యామెను స్త్రీయగుటచే ప్రాణములతో విడిచిపుచ్చెననియు వ్రాసియున్నాడు.[140] ప్రాచీనవంశ చరిత్రములలో నీప్రశంస యింకొకతీరున గనవచ్చుచున్నది. రుద్రాంబికకు హరిహరుడు మురారిదేవుడునను నిద్దరు సవతికొడుకులుండిరట. స్వార్థపరులై వీరలు యాదవులతో కుట్రలు చేసి, దేవదర్శనార్థమై మహారాజ్ఞి నగరు వెడలిన యదనున దుర్గము నాక్రమించిరట. రాజభక్తిపరాయణులగు పౌరులయొక్కయు సేనానులయొక్కయు సాహాయ్యముచే రుద్రమ వీరినోడించెనట. వెంటనే యామె దూరదర్శియగుటచే నేకశిలాదుర్గమును బాగుచేయించెను. అనతికాలముననే యాదవులు దండెత్తిరా నామె మహాశౌర్యము జూపియు, పరివారమునకెక్కుడుత్సాహము గల్గించియు, నీశత్రువులను బరిమార్చెనట. ఈ యిరుపార్శ్వముల వారి గాథలయందు నెంతనిజముండినను, కాకతీయులకీ యుద్ధమువలన విశేషముగ నష్టమునగూడియుండి యుండలేదనుట సత్యము.

క్రీ. శ. 1290 నాటికే వయసు ముదిరిన దగుటచే నీమె తన మనుమడగు ప్రతాపరుద్రుని రాజ్యాంగమున నియోగించుచుండెను. తన తండ్రియగు గణపతిదేవుని యాజ్ఞచే నీమె మనుమని తనతండ్రి జీవితకాలముననే దత్తతచేసికొనెను.

ఈమె రాజ్యమునందొక నేమియు నుపద్రవములు లేకుండుటచే శాంతి యెల్లెడలనుఁ బ్రబలజొచ్చెను. రాజనీతిజ్ఞులును, శౌర్యసంపన్నులు నగు మంత్రిసేనాధ్యక్షాదులు సామ్రాజ్యమును నిర్వహింపుచుండ నీమహారాజ్ఞి ప్రజాహితకరములగు ననేక సత్కార్యముల నొనర్చుచుండెను. ఈమె యొసంగిన దానములకును, నిర్మించిన యగ్రహార వాపీకూప తటాకాదులకును లెక్కలేదు. ప్రజలకీమె యెడ దమకుఁగల గౌరవ విశ్వాసములఁ జూపుటకునై "అంబాల" యను గ్రామముల ననేకముల నిర్మించిరి. ఎల్లరకు నీమె "అంబ"యై జగదంబ యన నొప్పుచుండెను.

సేనానులు:— (1) కాయస్థులు:—రుద్రాంబకాలమునకు గంగయసాహిణిమరణించియుండుటచే నాతని గౌరవములకు జన్నిగదేవుడు పాత్రుడై గండికోట ప్రాంతమున కధిపతి యయ్యెను. ఈతడు కులోత్తుంగచోడుని, సిద్ధయదేవ చోడుని జయించెనని యిదివరలో జెప్పియుంటిమి. జన్నిగదేవుడు వీరశైవుడు. శాంతపూర్వశివదేవునికిఁ శిష్యుడు. ఈతడు క్రీ. శ. 1270 ప్రాంతమువరకును జీవించియుండెను.

పిమ్మట త్రిపురాంతకాంబ దేవులు దత్త

140 Erly History of the Deccan (3rd Edn.) P. 225.

మండలములకు బాలకుడైరి. త్రిపురాంతకుడు కమ్మనాడు, ములికినాడు, పొత్తపినాడు మున్నగు నాడులను పాలించుచుండెను. కడప మండలమునందలి మహాధిపతియగు నఘోర శివాచార్యుని నితడు శిష్యుడు. మొదట ధువ్వూరును, బిమ్మట వల్లూరు నితని రాజధానులు. ఈసేనాని శ్రీశైల త్రిపురాంతక దేవాలయములకుం బెక్కు ధర్మముల నొసర్చియుండెను.

అంబదేవమహారాజు త్రిపురాంతకుని సోదరుడు. కాయస్థ వంశజులలో నీతడగ్రగణ్యుడు. మహాశూరుడును, నిరుపమపరాక్రమమునగు నితడు రుద్రాంబిక రాజ్యాభిషేకానంతర మాంధ్రదేశముపై దండెత్తివచ్చినశత్రువులనెల్ల నిర్జించెను. ఈతనికి రాయసహస్రమల్లుడను బిరుదముండెను. కేవల ధైర్యముననేగాక నీతనికి పరిపాలనా క్రమమునంగూడ నెక్కుడు నైపుణ్య ముండినది. సామ్రాజ్యపు టార్థిక స్థైర్యమునకై యీతడు తనపరిపాలనము నందుండిన భూమినెల్ల కొలిపించియు, పన్నుల నేర్పరచియు ననేకసంస్కరణముల నొసర్చెను.

2 రేచెర్లవంశము:—ఈవంశము నందలి రెండవ ప్రరుషాంతరమునకుజెందిన దామానాయుడు, ప్రసాదాదిత్య నాయుడు, రుద్రమనాయుడు ననుకుమారులు రుద్రాంబకాలమునం బ్రసిద్ధికెక్కియుండిరి. వీరిలో ప్రసాదాదిత్యుడగ్రగణ్యుడు. ఈతనికిం 'గాకతిరాజ్య ప్రతిష్ఠాపనాచార్య' బిరుదముండినటుల పద్మనాయక చరిత్రమునుండి తెలియుచున్నది. బహుశః యీతడు యాదవులతోడి యుద్ధములలో నెక్కుడుగ బాల్గొనియుండును. స్థానికచరిత్రములలో నీతనింగూర్చి యొకవింతగాథ గలదు. పురుషవేషముతో నుండిన రుద్రమ యొకకన్యకను బరిణయమాడెనట. నిజము తెలసినపిమ్మట నాకన్యపడు దుఃఖమును సహింపజాలక నీసేనాని రుద్రమను జెంపి, యామెస్థానమున బ్రతాపరుద్రుని యేలికనొనర్చెనట. ఇది కేవల మవిశ్వసనీయము.

3 ఇందులూరివంశము:—మనుమగణపతి, అన్నయదేవుడు, రుద్రుడు నను నీవంశీయులు రుద్రమకాలమున ఖ్యాతిగాంచిరి. వీరిలో అన్నయ సుప్రసిద్ధుడు. కాకతీయ సామ్రాజ్యమున కాయువుపట్టువలె నుండు దక్షిణకళింగము నితడు పాలించుచుండెను. రుద్రాంబిక తన రెండవ కూతురగు రుయ్యమ్మదేవి నీతనికిం బరిణయ మొనర్చుటనుబట్టి యీతని ప్రాముఖ్యత దెలియుచున్నది.

4 గోనగన్నారెడ్డి:—ఈతడు వర్ధమానపురమునుండి కాకతీయ సామ్రాజ్యపు పశ్చిమభాగమునెల్ల బాలించుచుండెను. ఈసేనాని యనేక వైరివీరులం దమించెననియు, ఆదోని, తుంబుళ, మానువ మున్నగు దుర్గములను జయించెననియు రాచూరు శాసనమునుండి తెలియుచున్నది.

5 నాగదేవుడు:—అంబదేవుడు మనుమగండ గోపాలుని జయించిన పిమ్మట పాకనాటిసీమకీ నాగదేవు డధిపతిగనుండెను. ఈతని భార్య మల్లమాంబిక గణపతిదేవుని తలవరియగు మాచెయనాయకునికి పుత్రిక. మారన మార్కండేయ పురాణమును గృతినందిన ప్రతాపరుద్రుని కాశ్రితుడుగనుండిన గన్నమంత్రి కీతడు పితామహుడుగ నుండును.

6 సామంత పోతినాయకుడు:—ఈ సేనాని క్రీ. శ. 1277 లో రాచూరులో నొకయాలయమును నిర్మించి యనుమకొండ నాడులో

నొక గ్రామమును దానము చేసెను. [141]

7 పర్వతనాయకుడు:—ఈతడు మహారాజ్ఞి కంగరక్షకుడుగ నుండెను. [142]

8 అదిదమ్మ:—మీసరగండ బిరుదాంకితుడగు నా సేనాని మనుమగండ గోపాలుని జంపెను. [143]

9 వల్లనాయకుడు:— రాజనగర రక్షకుడు

10 పట్టసాహిణి దాది గన్నమ నాయకుడు:—ఈతని శాసనములు గొన్ని గుడిమెట్టలో గన్పడుచుండుటచే నీతడు వెలనాటిపై యధికారిగ నుండెనని తోచుచున్నది.

11 దాది సోమయ సాహిణి:— గన్నమ నాయకుని పుత్త్రుండు. ఈతడు రుద్రాంబ రాజ్యాంత్యభాగమున బ్రసిద్ధికెక్కినవాడు.

సామంతులు:— 1 ఆంధ్ర చోళులు— సింగయదేవ గడిదేవుడను నెల్లూరిపాలకుడు. క్రి. శ. 1267 నాటిశాసనము నందురుద్రమకు సాంతుడని పేర్కొనబడి యున్నది. (ఎదురురాళ్ళ పాడు శాసనము)

2 సేవుణవంశము:—శ్రీమన్మహా మండలేశ్వర మాధవదేవుడు.

3 బద్దెన:—ఈమండలేశ్వరుడు నీతిశాస్త్ర ముక్తావళీగ్రంథకర్త. కృష్ణానదికి దక్షిణమునందొక చిన్నసంస్థానమున కధిపతి.

రాజధాని:—రుద్రాంబ యేకశిలానగర దుర్గము ననేక విధముల సంస్కరించెనని ప్రాచీన చరిత్రములనుండి తెలియుచున్నది. అంతకు బూర్వమేయుండిన రాతి గోడకు లోభాగమునందామె మెట్లను గట్టించెను. ఇందుచే శత్రువులు దుర్గమును ముట్టడించినపుడు లోపలివారలు సులభముగ నారాతిగోడపై కేగి వారిపై నాయుధములను బ్రయోగింపవలను పడును. దుర్గముచుట్టునుండు నితరకార్యములనుగూడ నీమె సంస్కరించెను. దుర్గమును విస్తరించి యీరాజ్ఞి దానిచుట్టును భూమిగోటన్నుగట్టించి యొక లోతైన యగడ్తనుదవ్వించి గోడపై నెన్నియో బురుజులను వేయించెను. దీనికనిమిది గౌనులును బదునారు దిడ్డులునుంచేబడినవి. పుట్టకోటకును రాతికోటకునుగూడ నటులే నాలుగుగౌనులు నెనిమిది దిడ్డును గట్టబడినవి. అట్టుపై నీగోడలను రక్షించుటకై కొమ్మకు యిద్దరును, బురుజుకు యేబదిమందిని, గౌనుకు నైదువందల మందియు, దిడ్డికి నూర్గురును రక్షకభటులు లేర్పఱుపబడిరి.

## XIV ప్రతాపరుద్రదేవుడు.

(1290—1326)

జన్మాదికము :—ప్రతాపరుద్ర చక్రవర్తి జననకాలమింత వరకును నిర్ణయింపబడియుండ లేదు. కాకతీయుచరిత్రమునకు మిగుల ముఖ్యమగు నీసమస్యను బరిష్కరించుటకు వలయు నాధారములు కొలదికాలమునకు బూర్వము వరకును లభించియుండలేదు. బ్రిటీషు దొరతనమువారి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము నందలి కొన్ని ప్రాచీనవంశ చరిత్రలమూలమునను, కొన్నిసంవత్సరములకు బూర్వము మదరాసు శాసన నివేదికలలో నుదహరింపబడి, యిటీవల రాజమహేంద్రవరాంధ్రేతిహాస పరిశోధకమండలి వారి పత్రికలో సమూలముగఁ బ్రకటింపబడిన మాల్యాపుర శాసనమూలమున, నీచక్రవర్తి జన్మకాలమును నిర్ణయిం

141 E. R. No. 67 of 1915.
142 Ibid 130 of 1917.
143 Ibid 170 of 1905.

ప వీలగుచున్నది. కాకతీయరాజుల చరిత్రము నుదెలుపు ప్రాచీనగ్రంథము లనేకములు గలవు. వానిలో నేకశిలానగర వృత్తాంతము, తెలుగురాజుల చరిత్రము, ప్రతాపచరిత్రమును ముఖ్యములైనవి. ఈచరిత్రములు ప్రతాపరుద్రచక్రవర్తి జననకాలమునుగూర్చి పరస్పర విరుద్ధములు నవిశ్వసనీయములు నగు విషయములను దెలుపుచున్నవి. ఉదాహరణమునకై వాని నిట పొందు పఱచుచున్నాము—

"......అబ్దాలుండు అయిదువర్షంబులు రుద్రమదేవులు దమ అంకపీఠంబున కూర్చొనచేయుటయు..................పదారవయేట విశాలాక్షియున్నగు రాజకన్నెలను పదారుగురను పెండ్లిచేసి తదనంతరంబున శ్రీమత్ప్రతాపరుద్రుని సింహాసనాసీనుంజాయవలయునని రుద్రమదేవులు శివదేవయ్యకు వప్పనచేసి ఆరుద్రమదేవి 38 యేండ్లు రాజ్యముపాలించి తాను శివలోకంబునకు యేగెను. యిది వఱకు శాలివాహనశకవరుషంబులు 1215."

(ప్రతాపచరిత్రము)

దీనినుండి శా. శ. 1215 కయిదేండ్లకు పూర్వమే, యనగా శా.శ 1210 కు సరియగు క్రీ.శ. 1288 వ సంవత్సరమున ప్రతాపరుద్రచక్రవర్తి జన్మించియుండెనని తెలియుచున్నది.

"దశమాససంపూర్ణమైన శా. శ ౧౧౬౬ అనగా నందనసంవత్సర చైత్రశు ౫ గురువారము రోహిణీనక్షత్రమున............".

(ఏకశిలానగర వృత్తాంతము.)

"దశమాసంబులు సంపూర్ణంబులైన శా. శ. ౧౧౬౦ అగు ఆనందసంవత్సర చైత్ర శు౫ గురువారము రోహిణీనక్షత్రమున......"

(తెలుగురాజుల చరిత్రము).

ఈవిధమున నీప్రాచీన చరిత్రములనుండి శా. శ. 1210, 1166, 1160 సంవత్సరములు ప్రతాపరుద్రుని జన్మసంవత్సరములుగ దెలియనగుచున్నవి. వీనినిఁ ప్రత్యేకముగ విమర్శించిగాని పరిగ్రహింపవలనుపడదు. క్రీ.శ. 1290 నుండియు ప్రతాపరుద్రుడు రాజ్యపాలనము నర్పుచుండినటుల శాసనప్రమాణము గన్పడుచుండుటచేతను, అంతకు పూర్వవత్సరముననే యాతడు జన్మమందియుండుట యసంభవమగుటచేతను, శా. శ. 1210 వ సంవత్సరమును పరిత్యజింపవలసి యుండును ఏకశిలానగర వృత్తాంతమునందలి నందనసంవత్సరము 1166 వ శకసంవత్సరమునకు సరిపడక 1214 నకు సరియగుచున్నది. శా. శ. 1166. క్రోధిసంవత్సరమునకు సరిపడుచున్నది. కాని యప్పటి చైత్రశుద్ధపంచమి గురువారముగాక మంగళవారమగుచున్నది. అటులనే తెలుగురాజుల చరిత్రమునందలి యానందసంవత్సరము 1160 వశకమునకు సరిగాక 1176 కు సరియగుచున్నది. "ఇండియన్ ఎఫిమెరిస్" అను కాలనిర్ణయ గ్రంథమునుండి పై కాలములకు సరియగు క్రీస్తుశకకాలము క్రిందివిధమునఁ దెలియనగుచున్నవి. [144]

1 ఆనంద చైత్రశుద్ధ పంచమి=25 మార్చి 1254 సంవత్సరము.

2 శా.శ. 1160 చైత్రశు ౫=23 మార్చి 1238.

3 నందన చైత్రశుద్ధ పంచమి=24 మార్చి 1292.

4 శా.శ. 1166 చైత్రశు౫ =15 మార్చి 1244.

ఇటు లీనాలుగు జననకాలములును 1288-

144 L. D. Swami Kannu Pillai—The Indian Ephemeris Vol. IV.

1292 లకు నడుమగల యేబదినాలుగు సంవత్సరముల వ్యత్యాసమునకు లోనై యుండుటచే వానిలో దేనిని పరిగ్రహించుటకును వలను పడకున్నది.

మాల్కాపురశాసన మీసందర్భమున నెక్కుడుసహాయ్యము నొసగునని యిదివరలో చెప్పియుంటిమి. ఈశాసనము క్రీ. శ. 1261వ సంవత్సరమునం గాకతీయ గణపతిదేవచక్రవర్తియు నాతనికూతురగు రుద్రాంబయు గోళగీమఠశైవాచార్యున కొసర్చిన దానమును దెలుపుచున్నది. ఇందలి కాకతీయవంశాను వర్ణనము మనకు ప్రకృతమునం దవసరమయినది. ఈ శాసనమునందలి 52—54 పంక్తులిట్లున్నవి.[115]

"యస్యాః కాకతివంశమౌక్తికమనేః
శ్రీరుద్రదేవ స్సుతా—
స్తస్యాః కిం కథయామ వైభవమత
శ్రీరుద్రదేవ్యా పరం"

పైపంక్తులనుండి శాసనకాలమగు క్రీ. శ. 1261. నాటికి రుద్రమదేవికి రుద్రదేవుడను నొక కుమారు డుండెనని తెలియుచున్నది. ప్రాచీన వంశావళులలో నీమహారాజ్ఞికిఁ బురుషసంతాన మేమియు లేకుండెననియు, ముమ్మక్క, యుమ్మక్కయను నిర్వురు తనయలు మాత్ర ముండిరనియు చెప్పబడియున్నది. విద్యానాథునిచే రచింపబడి, ప్రతాపరుద్రదేవుని కంకితమొనర్పబడిన "ప్రతాపరుద్రీయ యశోభూషణము"నఁ బ్రతాపరుద్రుడు ముమ్మడంబ కుమారుడనియు,[146] రుద్రాంబిక తనతండ్రి యాజ్ఞ ననుసరించి దౌహిత్రునిఁ బుత్రునిగ పరిగ్రహించెననియు దెలుపబడి యున్నది.[147] శాసనమునందలి రుద్రదేవుడు ప్రతాపరుద్రుడే యని పై విషయములనుండి స్పష్టమగుచున్నది. గణపతిదేవచక్రవర్తి క్రీ. శ. 1260. లోనే మరణించెనను ప్రస్తుత చరిత్రకారుల యభిప్రాయము నీమాల్కాపుర శాసనము ఖండించి, యాతడు క్రీ. శ. 1261. లో గూడ జీవించి యుండెనని నిరూపించుచున్నది. ఈశాసనము ను ప్రతాపరుద్రీయము తోడను, ప్రాచీన చరిత్రములతోడను సమన్వయించినచో, క్రీ. శ. 1261. వ సంవత్సరమునకు పూర్వమే రుద్రాంబిక సంతానయోగ్యావస్థను దాటియో లేక విగతభర్తృకగనో యుండెననియు, నప్పటికే యామెపుత్రికయగు ముమ్మడంబకుఁ బ్రతాపరుద్రదేవుడు జన్మించియుండి దత్తస్వీకారార్హమగు వయస్సు నందియుండెననియు, తన తనయయగు రుద్రాంబిక మరణానంతరమునఁ గాకతీయసామ్రాజ్యము విచ్ఛిన్నమగుట నిచ్ఛింపక, గణపతిదేవుడు తనజీవితకాలముననే యామెచే దౌహిత్రునిఁ బుత్రునిగ పరిగ్రహింపజేసెననియు, నూహింపనగుచున్నది. ప్రతాపరుద్రుఁడు గణపతిదేవుని తుదికాలమునకు యుక్తవయస్కుఁడేయై యుండినచో, రాజనీతిజ్ఞుడగు నాచక్రవర్తి యీతనినే తనయనంతరమునఁ గాకతీయరాజ్యమున కభిషిక్తునిఁ జేసియుండును అతడట్లొనర్పక విద్యానాథుడు వేర్కొనినట్లుల రుద్రాంబకు 'రుద్రదేవు' డను బురుషనామ మిడియు,[148] నామెను రాజ్యాంగ నిర్వహణమునఁ బాల్గొనజేసి, దౌహిత్రుని బరిగ్రహింపజేయుటయు, గణపతిదేవ రుద్రాం

145 J. A. H. R. S. Vol. 4 IV pt 3 & 4 P 154.

146 విష్ణోర్మాతాదను మహితా ముమ్మడంబాత్పతీయే॥

147 స్వీకృతేపుత్రభావేన దౌహిత్రేపాజ్ఞయాజ్ఞయా॥

148 రుద్రఇతివ్యవహారః కృతః, ప్ర॥ రు॥

బికాదుల శౌర్యధైర్యాదికముల నభివర్ణించి యుండిన మల్కాపురశాసనము ప్రతాపరుద్రుని నామమును మాత్రము దెలిపి యూరకుండుటయుజూడ, ప్రతాపరుద్రుడు క్రీ. శ. 1261 సంవత్సరమున బాలుడై యుండెనని స్పష్టమగుచున్నది. ప్రాయికముగ పదిసంవత్సరములు దాటకమున్నె దత్తస్వీకారము జరుపబడును. గాన నీతడు సుమారు క్రీ. శ. 1250—52 సంవత్సరములలో జననమంది యుండునని మల్కాపుర శాసనాధారముపై నూహింపవలసి యుండును.

ఇంతకుముందు ప్రాచీన చరిత్రములనుండి దెలియనగుచున్న విగ నేర్కొనబడిన కాలములలో క్రీ. శ. 1254వ సంవత్సరము పైనూహించినకాలమున కించుమించుగ సరిపడుచున్నది. అటులయినచో క్రీ. శ. 1261లో గణపతిదేవుడు మరణించునాటికి ప్రతాపరుద్రుడేడేండ్లబాలుడయి యుండును. ఇయ్యది మన మొనర్చినయూహ కనుకూలముగనే యున్నది. గాన నిర్దుష్టములగు ప్రమాణవిశేషములు బయల్వెడలి యితోధికములగు హేతువులనొసంగి యీయూహను ఖండించువరకును ప్రతాపరుద్రదేవ చక్రవర్తి శా. శ. 1176 ఆనంద సంవత్సర చైత్ర శు. 9 గురువారమునకు సరియగు క్రీ శ. 1254 సంవత్సరము మార్చి నెల 25వ తేదీని జననమందెనని చెప్పవలసి యుండును.

ప్రతాపరుద్రుని తలిదండ్రులఁ గూర్చియు నితరబంధువులఁ గూర్చియు కొంచెముగ జర్చింపవలసియున్నది. ప్రాచీనచరిత్రము లీతని తల్లి రుద్రాంబికతనయయగు ముమ్మక్కదేవి యని తెలుపుచున్నవి. ప్రతాపరుద్రీయ మీ విషయమును బలపఱచుచు నీక్రిందిశ్లోకములలో నాతనితండ్రి మహాదేవాభిధుండని చెప్పుచున్నది—

"మహాదేవాజ్జాత స్నపున రవనీభృద్దుహితరి॥"

"విష్ణోర్మాతా తదను మహితా ముమ్మడంబా తృతీయా॥"

'శివయోగసార' మను ప్రాచీన శైవగ్రంథము గూడ పై విషయమునే పేర్కొనుచున్నది [149]

"అకుపిత రుద్రమాంబికకు నాత్మజనా బొగడందు ముమ్మడయ్యకు మహాదేవరాజునకు నాత్మజుడై ప్రతాపరుద్రు......"

ఈమహాదేవరాజెవ్వరో నిర్ణయించుట కింతవరకును సరియైన యాధారములు గానరావు. దక్షిణహిందూదేశ శాసనసంపుటములోని కొన్నిశాసనములలో సర్వలోకాశ్రయ, విష్ణువర్ధనాది బిరుదాంకితుండును, చాళుక్య వంశీయుఁడును, నిడుదప్రోలు పాలకుఁడునగు నొకమహాదేవరాజు గాంచనగుచున్నాడు. ఈతడు శా. శ. 1218—1228లగు క్రీ. శ. 1296—1306 సంవత్సరములనడుమ రాజ్యమేలియుండెను. [150] ప్రతాపరుద్రునితండ్రి యీతడే యనుటకుఁ గొన్నియభ్యంతరము లున్నవి. చాళుక్యాన్వయుఁడగు వీరభద్రునికిని గాకతీయ రాజపుత్రికయగు రుద్రమదేవికిని గూతురగు ముమ్మడంబ[151] తానును చాళుక్యాన్వయుఁడగు మహాదేవరాజు నుద్వాహమగుట విహితముగ గన్పట్టుటలేదు. అదియునుఁగాక ప్రతాపరుద్రుని జన్మకాలమగు క్రీ. శ. 1254

149 "సుభాషి" 1928 అక్టోబరుసంచిక.

150 S. I. I. IV Nos. 735. E. R. 510 & 511 of 1892.

151 ఆ॥ ప॥ మండలివారి కొలనుపాక శాసనము.

సంవత్సరమునకును, చాళుక్య మహాదేవరాజు నాటి క్రీ శ. 1296 నకును నడుమ నలుబది రెండు సంవత్సరముల వ్యత్యాసము గనపడుచున్నది. ఈతఁడే ప్రతాపరుద్రుని తండ్రియై యుండి, యాతని 10 లేక 16వ రాజ్యసంవత్సరమువరకును జీవించియే యుండినచో, నాతని ప్రశంస యించుకంతయు తాత్కాలిక శాసన వాఙ్మయాదులలో గన్పడకుండుట చిత్రముగ నున్నది. ప్రాచీనవంశ చరిత్రములలో బ్రతాపరుద్రదేవున కన్నమదేవుఁడను సోదరుఁ డొకఁడుండెనని చెప్పబడియున్నది. దీనిని బలపఱచు నాధారము లింకేమియు గానరావు. బస్తరు రాజ్యమునందలి దంతేశ్వరమునఁగల క్రీ. శ. 1703 నాటి రాజాదిక్పాలదేవుని యొకశాసనమునం దొక యన్నమరాజు సోమవంశీయుడగు నర్జునుని సంతతివాడుగను, గాకతీయుడుగను పేర్కొనబడియున్నాడు.[152] ఈతనిఁ దమపూర్వికునిగ బరిగణించు బస్తరురాజులు గూడ దాము గాకతీయులమనియే చెప్పుకొనుచున్నారు. కాని యీ యన్నమరాజు ప్రాచీనచరిత్రములందలి యన్నమదేవుఁడనుటకు దంతేశ్వరశాసనమునందలి కాలము ప్రతిబంధకమగుచున్నది. క్రీ. శ. 1703 లో నుండిన దిక్పాలదేవునికీయన్నమరాజునకును నడుమ నెనిమిది తరములు గలవు. దీనినుండి యన్నమరాజు పదునైదవ శతాబ్దమున నుండెనని తెలియుచున్నది. ఈ కాలమునకును ప్రతాపరుద్ర చక్రవర్తి కాలమునకును నూరు సంవత్సరముల యంతర మున్నది. గాన ప్రతాపరుద్రుని తండ్రినిగూర్చియు సోదరునిఁగూర్చియు భావిపరిశోధనల మూలమునగాని నిశ్చయముగ నేమియు నిర్ణయింప వలనుపడదు ముఖ్యముగ నిజాంరాష్ట్రమునందలి శాసనవాఙ్మయాదికములఁ బరిశోధించినగాని యీ విషయములు విస్పష్టములు కాఁజాలవు.

ప్రకృతమునఁ జరిత్రకారులు క్రీ. శ. 1296 వ సంవత్సరమున రుద్రాంబ మరణింపగాఁ బ్రతాపరుద్రదేవు డామె యనంతరమునఁ గాకతీయ సింహాసనము నధిష్ఠించెనని యభిప్రాయపడుచున్నారు.[153] కొన్ని ప్రమాణ విశేషముల యాధారముపై నీయూహ సరికాదని నిరూపింప వీలగుచున్నది విద్యానాథ కవి ప్రతాపరుద్రదేవుడు యువరాజుగనుండగనే రాజ్యభారమును వహించి యనేక దేశములను జయించెనని వ్రాసియున్నాడు.[154] చరిత్రకారు లీ వ్రాతలను కేవల మలంకారికములుగ బరిగ్రహించి వానిని చారిత్రక దృష్టితో బరిశీలింపకుండిరి. వీనిని విమర్శించి యన్యప్రమాణములతో సరిచేసి చూచినచో నీ చక్రవర్తి క్రీ. శ. 1296. వ సంవత్సరమునకుఁ బూర్వమే పరిపాలనము నారంభించియుండెనని తెలియనగుచున్నది. ఆంధ్రదేశమునందలి శాసనములు పెక్కు లీ యూహను బలపఱచుచున్నవి. అట్టివానిలో నీ క్రిందివి ముఖ్యములు.

1. శా. శ. 1212 (క్రీ. శ. 1290.) లో చోడమల్లిదేవమహారాజను సామంతునిచేఁ జేయబడిన ధర్మమును దెలుపు పన్నశాసనము.[155]
2. శా. శ. 1212 (క్రీ. శ. 1290) లో

152 Ep. Ind. IX P. 165.
153 Historical Sketches of Ancient Dekkan—K. V. S. Iyer.
ఆంధ్రులచరిత్రము 2 సంపుటము.
154 ధీరోయం యువరాజఏవ వహతి శ్రీవీరరుద్రో ధురం।
155 Nel. Ins. D. 6.

బొల్లము రెడ్డియును నాతడు కాకతీయ రుద్రకుమారుని రాజ్యకాలమునం దొసర్చిన ధర్మమును దెలుపు మల్యాలశాసనము.[156]

3. శా. శ. 1214 (క్రీ. శ 1292) నాటి కుమార రుద్రదేవునికాలపు కొళ్ళపల్లి శాసనములు.[157]

4. శా. శ. 1214 (క్రీ. శ. 1292) లో నొక మహామండలేశ్వరకుమారరుద్రదేవుని బెక్కల్లు గణపవర శాసనము.[158]

పై శాసనములనుండి ప్రతాపరుద్రదేవుడు క్రీ. శ. 1290 నుండి 1295 వఱకును తనమాతామహియగు రుద్రాంబకు రాజ్యపరిపాలనమున దోడ్పడుచు క్రీ. శ. 1296 లో నామె మరణించిన పిమ్మట కాకతీయ సింహాసనము నధిష్టించి, యాంధ్రసామ్రాజ్యము నేల నారంభించెనని తెలియనగుచున్నది.

రాజకీయ చరిత్రము:— క్రీ. శ. 1290 వ సంవత్సరమునుండియు ప్రతాపరుద్రదేవుడు తనమాతామహియగు రుద్రాంబికకు రాజ్యాంగనిర్వహణమునం దోడ్పడు చుండెననియును, యువరాజుగ నుండినపుడే యాతడనేక దేశములను జయించి ప్రసిద్ధిగాంచియుండెననియు నిదివరలో చెప్పియుంటిమి. క్రీ శ. 1296 వ సంవత్సరమున రాష్ట్రమతల్లియగు రుద్రమదేవి కాలముచేయుగా నామెచేపుత్రుడుగ బరిగ్రహింపబడిన ప్రతాపరుద్రదేవుడు డేకశిలానగరమున కాకతీయ సింహాసనము నధిష్ఠించి యాంధ్రసామ్రాజ్యపట్టభద్రుండయ్యెను. కొన్ని ప్రాచీన చరిత్రములయం దీతని రాజ్యాభిషేకముం గూర్చియొక వింతగాథ గనవచ్చుచున్నది. రుద్రాంబ పురుషవేషమును బురుషనామమును ధరించుటయేగాక "రుద్రదేవమహారాజ"నుపేరిట నుద్వాహమగుటకై సత్కులసంజాతయగు నొక కన్యకనుం గూడ రావించెనట. కొన్ని దినములకు బిమ్మట నీ సంగతిని గ్రహించియు, నాకన్యక యనుభవించుచుండిన యాశాభంగమును దుఃఖమును గాంచియు, పద్మనాయక వీరుడును సుప్రసిద్ధకాకతీయ సేనానియునగు ప్రసాదాదిత్యనాయుడు, వేసారి వయసుగడచిన రుద్రాంబికను రాజ్యచ్యుతం జేసి, యామెమనుమడగు ప్రతాపరుద్రుని గాకతీయసింహాసనమున గూర్చుండ జేసెనట. తనరాజ్యకాలమున ప్రతాపరుద్రచక్రవర్తి పద్మనాయకులకొసంగిన ప్రత్యేక గౌరవమర్యాద లీగాథకు కొంతబలము నొసంగుచున్నవి. అయినను ప్రబలతరములగు ప్రమాణములు లభ్యములగువరకు నీ విషయమును విశ్వసింపనలవుపడదు.

ప్రతాపరుద్రచక్రవర్తి రాజ్యాభిషిక్తుడయిన యనతి కాలమునకే యొకవిప్లవము జరిగినటు లీకాలపుశాసనములనుండి తెలియుచున్నది. వానిలోనొకటి చక్రవర్తిసేనానులలోనొకడగు "అదిదమ్మ"యను నాతడు నెల్లూరుపై దండెత్తి యాంధ్రచోడుని జంపెనని చెప్పుచున్నది. మఱియొక శాసనమునుండి యంబదేవుడను కాయస్థసామంతుడు మనుమగండ గోపాలునికి మిత్రుడని తెలియుచున్నది. ఈరెండు విషయములను సమన్వయించినచో క్రీ. శ. 1296—98 ల నడుమ నంబదేవుని సాహాయ్యమున గాకతీయ సామంతుడగు మనుమగండ గోపాలుడు తిరుగుబాటుచేసెననియు నాదిద

156 Ins. Ced. Dist. No. 105.
157 E. R. 204 of 1899.
,, 173 of 1905,
158 ,, 126 of 1897. నైజాంరాష్ట్రమున ఓరుగల్లు, మానుకోట మున్నగు స్థలములగూడ నటులే క్రీ. శ. 1292—1296 నడుమ వేయబడిన శాసనములుగలవు.

మ్మసేనాని యానిష్లవము నణంచెననియు నూహింపనగుచున్నది.

ప్రతాపరుద్రచక్రవర్తి యాంధ్రసామ్రాజ్యాధినాథుడయిన సంవత్సరమున ఢిల్లీరాజ్యమున కల్లాయుద్దీను ఖిల్జీ యేలిక యయ్యెను. యౌవనమున నుండగనే యీతురుష్కరాజు క్రీ. శ. 1294 లో దేవగిరిపై దాడివెడలియాదవులను నిర్జించి యమూల్య ధనరాసులను సేకరించియుండెను సింహాసనమున నధిష్టించినపిమ్మట నీతనికి దక్షిణాపథమును జయించు నభిలాష జనించెను. తదనుసరణముగ నాతడు క్రీ. శ. 1309లో బహువిస్తృతమును, సస్యశ్యామలమును, బహుజనాకీర్ణమునగు నీభూభాగమును జయించుటకునై, వంగదేశమార్గమున నొక సైన్యము నంపియుండెను. కాని యీతురుష్కసైన్యము కళింగప్రాంతమున, గాంగవంశీయులచే నోడింపబడి ఢిల్లీకి మఱలవలసివచ్చెను.[159] దీనినిసరకుచేయక యనతికాలముననే యల్లాయుద్దీను మాలిక్ నాయబ్ కాఫర్ అను సేనానాయకుని విశేషబలములతో దక్షిణాపథమున కంపెను. ఇంతకుమున్నె క్రీ. శ. 1294 లో మహమ్మదీయులప్రభావమును జేవిచూచియున్న దేవగిరియాదవు లీసమయమున మహమ్మదీయుల కనేకవిధముల సాహాయ్య మొనర్చి యాత్మరక్షణ మొనర్చుకొనిరి. చారులచే నీయుపద్రవమునుగూర్చి దెలిసికొని ప్రతాపరుద్రచక్రవర్తి దనసేనానులలో నగ్రగణ్యులగు మేచయనాయకుడు, బెండపూడియన్నయ మున్నగువారల ననంఖ్యాకములగు బలములతో నుత్తరదిశకు బయనముచేసెను. ఈకాకతీయ సేనానాయకులు గోదావరీతీరమునకేగి, రేవులనెల్ల సంరక్షించి, తురుష్కులరాకకై యెదురుచూచుచుండిరి[160] శత్రువులెప్పటికిని రాకుండుటచే వారు గోదావరీనదిదాటి నా[illegible] తదూరమేగునరికి మహారణ్యమునబడి వచ్చుచుండిన యవనవాహిని వారికెదురయ్యెను. దానినిగాంచి యాంధ్రవీరులత్యుత్సాహమున బ్రతిఘటింప నొకఘోరసంగ్రామ మిరుపార్శ్వములవారికిని జరిగెను. రుద్రమనాయుడు విజృంభించి శత్రుమారణ మొనర్చుచుండగ నాంధ్రుల ప్రతాపమునకు దాళజాలక తురుష్కులు పలాయితులైరి.

ఈవిజయవార్త నాలకించి యోరుగల్లునగర పౌరులు నాంధ్రసామ్రాజ్యమంతయు నానందవార్ధి నోలలాడిరి. ఉత్తరమునకేగిన విజయసేనలింకను మఱలియుండలేదు. ఆంధ్రవిజయోత్సవములింకను ముగిసియుండలేదు. ఇంతలో దక్షిణమున గండికోటదుర్గప్రాంతముల నొకవిద్రోహము బయల్వెడలెను. ఇంతకుపూర్వము మనుమగండ గోపాలుని యొక్క రాజ్యము నాక్రమించుకొని తిరుగుబాటుచేసియుండిన త్రిపురాంతకాంబదేవులను కాయస్థసామంతులు చక్రవర్తి యేమఱియుండిన యీసమయమున మఱల కతూరి విజృంభించిరి. ఇంతలో నాంధ్రసైన్యము లుత్తరదిశనుండి రాజధానీనగరమునకు మఱలివచ్చుటచే చక్రవర్తి యాబలములను, సోమయనాయకుడు, గుండయనాయకుడు, పోచయనాయనింగారు మున్నగు నాయకులతో

159 ఆంధ్రులకును మహమ్మదీయులకును జరిగిన యీసంగ్రామములను గూర్చి నప్రశంస మహమ్మదీయ చరిత్రకారుల వ్రాతల యందును ప్రతాపచరిత్రాదులందును గూడగలవు. పైరెండువిధములగు ప్రమాణములునుగూడ పక్షపాతముతో వ్రాయబడినవియే. గానవందలి నిజానిజముల నితరచారిత్రకాంశముల మూలముననే నిశ్చయింపవలసియున్నది.

160 కాకతీయసామ్రాజ్యము గోదావరి కావలగూడ విస్తరించియుండెను.

గండికోటకు బయనముచేసెను. పూర్వమువలెనే కాకతీయసైన్యములీ విద్రోహమునణంచి విజయలక్ష్మి నిఁ జేపట్టినవి. క్రీ. శ. 1303—4 లో జేరిగిన యీసమరమునకుఁ బిమ్మట నంబదేవాదుల ప్రశంస గన్పింపకుండుటచే వారలీసమరమున సమసియుందు రని యూహింప నగుచున్నది. ఆసంవత్సరమునకుఁ బిమ్మటగండికోటలోసోమయనాయకునిశాసనములు గన్పించుచుండుటయు, స్థానికచరిత్రములలో కాయస్థులు తిరుగుబాటుచేసిరని చెప్పబడియుండుటయు నీయూహను బలపఱచుచున్నవి.[161]

క్రీ. శ. 1304లో మఱియొక యుపద్రవముగూడ సంప్రాప్తమయ్యెను. తమకుఁ జన్మశత్రువులగు నాంధ్రులు యవనుల నవలీలగ నిర్జించి స్వేచ్ఛగనుండ తాముమాత్రము వారలకు లోబడియుండుటకు లజ్జించి దేవగిరియాదవులు క్రీ. శ. 1303 లో దాము ఢిల్లీసుల్తానుకు చెల్లింపవలసిన కప్పమును పంపుట మానివైచిరి. ఈయవిధేయతను దండించుటకై యల్లాఉద్దీను క్రీ. శ. 1306లో మాలిక్ కాఫర్ను మఱియొకతూరి దేవగిరిపై కంపెను. మహాశూరుఁడును, విజయకాంక్షియునగు నీసేనాని యాదవులను శిక్షించుటతోఁ దృప్తినొందక, తనపూర్వపరాజయ కళంకమును బాపుకొనుటకై యోరుగల్లు సామ్రాజ్యముపై గూడ దాడివెడలెను. నాల్గుమాసములైనను గడువకుండగనే క్లిష్టసమయమున నేతెంచిన యీద్వితీయ తురుష్క దండయాత్రాసమాచారము నాలకించి యాంధ్రులు విస్మితులైరి. అయినను సహజమగు ధైర్యమునువీడక ప్రతాపరుద్రచక్రవర్తి రాజధానీనగరమున నితరప్రాంతములనుండిన సేనలను ప్రోత్సహించి శత్రుసంహారమునకుఁ బురికొల్పెను. అంత నాంధ్రబలము లత్యుత్సాహముతో నుత్తరమునకేగి సరిహద్దులను దాఁటునరికే మహమ్మదీయులు ప్రత్యక్షమైరి. ఏమఱిపాటున నాంధ్రులపైఁ బడి నఱుమూడి సునాయాసముగ విజయమునందు ధైర్యముతో నేతెంచుచుండిన తురుష్కసైన్యముల నొక్కసారిగ మార్కొని, చక్రవర్తి నుండి విన యుత్సాహవాక్యములను స్మరించుకొనుచు, స్వదేశసంరక్షణార్థమై యాంధ్రవీరులు ప్రాణములకు తెగించి పోరుచు, శత్రువులను చిందరవందర చేయసాగిరి. చేయునదిలేక మాలిక్ కాఫర్ హతశేషులగు వారలతో యుద్ధమునుండి విరమించి దేవగిరిమార్గమును బట్టెను.[162]

ఈద్వితీయవిజయ మాంధ్రులకుఁ బూర్వాధికసంతోషము నొనగూర్చెను. చక్రవర్తియు నితరులునుగూడ నింతటితోనాంధ్రులకుఁ దురుష్కులపీడ తొలగిపోయెననితలంచిరి. విద్రోహములెల్లనమూలముగ నిర్మూలింపబడియుండినవి. గాననీవిజయమునకుఁ బిమ్మట నాంధ్రసామ్రాజ్యమునునూతనోత్సాహ ముదయించెను. శాంతిసౌఖ్యములెల్లెడలనుఁ బ్రబలినవి. ప్రజలు తమతమ కార్యముల నుత్సాహముతో నిర్వర్తించుకొనుచుండిరి. ఈసమయమునఁ జక్రవర్తి కించుక విశ్రాంతికలిగెను. మహావిద్వాంసుడును,

161 Local Records— 'Gandikota.'

162 మహమ్మదీయ లీసమయమునఁ దమకేవిజయముసంప్రాప్తమయ్యెనని వ్రాసియున్నారు. అదియేనిజమైనచో నాంధ్రసామ్రాజ్య మీసంవత్సరముననే కూలియుండవలసది. గాన నీయుద్ధసందర్భమునఁ బ్రతాపచరిత్రమే విశ్వసనీయముగ గన్పడుచున్నది.

ప్రాజ్ఞుడునగు నీతడు కాలమును వ్యర్థముచేయక విజ్ఞానికాభివృద్ధికై పాటుపడ నారంభించెను. కత్తి చేబట్టి యుద్ధరంగమునఁ బ్రవేశించి శత్రు లలాటములపై విజయాక్షరములను లిఖించి యుండిన యాంధ్రవీరు లీసమయమున రుధిరార్ద్రములగు నాయుధములకించుక విశ్రాంతినొసంగి, కలమునుచేపట్టి సాహితీరంగమునం దద్వితీయులై పునఃప్రదర్శించి యపూర్వవిజయముల నందసాగిరి. జాతిమతవయోభేదములెంచక నెల్లరును శారదోపాసన మొనర్చుచుండ, శిల్పనాట్యాది కళావిశేషములును, వేదాంత జ్యోతిషాదిశాస్త్రములును, కావ్యనాటకాది సారస్వతాంగములును విశేషాభివృద్ధినందినవి. సంస్కృతాంధ్రకవులనేకులు చక్రవర్తి యాస్థానమునఁ జేరి యాతని గౌరవమర్యాదలనంది యనేక గ్రంథరాజములను రచింపుచుండిరి. గణపతిదేవ చక్రవర్తికాలమున విశ్వేశ్వర శివాచార్యునిచే నలంకరింపబడియుండిన విద్యామంటప మనేక కవిప్రవరులచేఁ గిక్కిరిసియుండ, నిరంతరమును విద్యావ్యాసంగములచ్చటఁ జరగుచుండెను. విజయనగరాధీశుఁడగు కృష్ణరాయలవలెనే ప్రతాపరుద్రచక్రవర్తియు నీవ్యాసంగములందు పాల్గొని సహజపాండిత్యమును రసజ్ఞతను జూపుచు, గుణాగుణనిర్ణయ మొనర్చుచు ననేకవిధముల నన్నివిద్యల నాదరించుచుండెను.

ఇటు లాంధ్రసామ్రాజ్యమంతయు విద్యావ్యాసంగమునమునిగియుండి, కలనైనను శత్రుపీడయనుదానినిగాంచి యెఱుంగకుండిన సమయమున నుత్తరదిశనుండి యొకయకాలప్రళయ మాసన్నమగుచుండెను. దక్షిణాపద విజయకాంక్షాపీడితుఁడగు నల్లాయుద్దీనునకు వరుసగ రెండుపర్యాయములు తనసైన్యము లాంధ్రులచే పరాభవింపబడుట యధైర్యము నొదవజేయుటకుమారుగ నధికోత్సాహమును గలిగించి కార్యదీక్షను శతాధిక మొనరించినది. దీనికి దేవగిరిరాజుల కుటిలనేకవిధముల తోడ్పడినవి. తమకాజన్మశత్రువులగు నాంధ్రులు స్వతంత్రముగనుండుటయు, తురుష్కుల ననేకమారులు నిర్జించుటయు, దామునిరంతరము యవనుల బారికి గురియగుచు వారలకు దాస్యము చేయవలసి వచ్చుటయుఁ గాంచి యసూయనంది దమశత్రువులను గూడ దామనుభవించుచుండిన దుస్థితిఁ బాల్పడచేయు నుద్దేశ్యముతో నాంధ్రులు విద్యాకలాపమున మునిగియేమఱియుండిన సమాచారము నతిత్వరితముగ యాదవులు సుల్తానునకెఱింగించిరి. సమయమునకై వెదకుచుండిన యల్లాయుద్దీనీ వార్తనాలకించి మహోత్సాహమునంది, తనబలములనెల్ల రావించి, వారల నధికముగఁ బ్రోత్సహించి, క్రీ. శ. 1309 లో మాలిక్ నాయబ్ కాఫర్‌ను వాని కధిపతిఁ జేసి తెలింగానాపై దండువంపెను. ఈ తృతీయ మహమ్మదీయ దండయాత్రను 'అమీర్ ఖుస్రూ' యను తురుష్క చరిత్రకారుఁడీక్రింది విధమున వర్ణించి యున్నాఁడు.[163]

"మంత్రియగు మాలిక్ కాఫరు తెలింగానాపై దండువెడలెను. అతని సైన్యములు మజిలీల వెంబడి ప్రయాణము చేయుచు, మసూద్ పురమున రెండుదినములు విశ్రమించి యరణ్యముల తోడను, విషమశిలా పరివృత పర్వతములతోడను నిండి యుండిన దుర్గమ ప్రదేశముల నతికష్టముతో నరకయాతననుభవించుచుఁ దాటి, యూజుబెనము

163 Elliot & Dowton—History of India Vol III. P, 81.

లలో సుల్తానుపురమునుఁ జేరినవి. అచ్చట నాలుగు దినములుండి, పదుమూడుదినముల లో ఖందర్‌నగరమున కేతెంచి తురుష్కులట నొకపక్షమువరకును విశ్రమించిరి. ప్రళయమారుతమువలె చెలరేగి సర్వనాశన మొనర్చుచు, పర్వతముల నధిరోహించి నదుల నతిక్రమించి యేతెంచుచుండిన యీసైన్యములకు నర్మదానది యొక్క జలప్రళయము వలె గన్పట్టెను. దానిని దాటిన యెనిమిది దినములకు మహమ్మదీయులు దేవగిరిరాజ్యములోని నీలకంఠ్ అను పట్టణమునుచేరిరి. అచ్చట రెండు దినములు మాత్రముండి తమ యాత్రనుసాగించి పూర్వాధికములగు కష్టములకులోనై వారలాంధ్రదేశపు సరిహద్దుననున్న శిరిపురమును గాంచిరి. ఇచ్చటఁ దురుష్కులు విజృంభించి యథేచ్ఛముగ జనులను హింసించియు, గృహములను సస్యములనుఁ గాల్చియు, శిరిపురదుర్గమును జయించిరి. అట నుండి మూడుదినములలో కునర్బాల్ దుర్గమునుజేరి యటుపై నోరుగల్లు మార్గమునుఁబట్టిరి ఆనగరము సమీపించిన పిమ్మట మాలిక్ కాఫరు యిర్వురు సేనానులను నలుబదిమంది విలుకాండ్రతో ననుమకొండకేగి పరిస్థితులను గమనించి వచ్చుటకై నియమించెను. అటుపై నతి కాలముననే తురుష్కులా పట్టణము నవిడిసిఁ యోరుగల్లును ముట్టడించిరి.

ఓరుగల్లు దుర్గపుబహిఃప్రాకారము మృన్నిర్మితమే యయినను యవనుల యుక్కుబల్లెములకు సహితము లొంగనంతటి బలిష్ఠముగ నుండెను. వారి యాగ్నేయాస్త్రముల నుండి నిర్గమించిన లోహగోళములు లాగోడలకుఁ దగిలి తిరిగి వారిసైన్యములవంకకే ప్రతినిర్గతములగు చుండెడివి. రాత్రిభాగమున నేమఱుపాటున దుర్గము నన్నివైపులనుండియు నొకేసారిగ ముట్టడింప వీలగుకీతిని, హిందూసైనికుల యాగ్నేయాస్త్రములకుఁదనవారలు గుఱికాకుండు విధమునను, తురుష్కసైన్యములు వేర్వేఱుస్థలములలోనుండునటులేనేర్పాటుచేయబడెను. ప్రధానసేనానాయకుని శిబిర మోరుగల్లు దుర్గప్రధాన ద్వారమున కెదురుగఁ గల్పింపబడ నితరశిబిరములు సూదిమొనదూర్చుటకైన నెడములేనంతటి దగ్గరగ దుర్గముచుట్టును వేయబడియుండినవి 12546 గజముల చుట్టుకొలతగల యాదుర్గము చుట్టునుండిన ప్రదేశమున 1200 గజముల కొక విభాగమునంతునుఁ దురుష్కబలము లేర్పఱుపబడినవి. పరిసర ప్రాంతములఁదుండిన వృక్షములనెల్ల గూల్చియవనులు తమశిబిరముల చుట్టునొక కంపగోటనిర్మించుకొనిరి. రాత్రివేళ 'బనక్‌దేవ్' అనునాతడు కతిపయ హిందూబలములతోఁ దురుష్క శిబిరమునఁ బ్రవేశించి యుద్ధముచేయ శత్రులాతనిని ససైన్యముగఁ బరిమార్చిరి. తెల్లవారిన తోడనే యుద్ధము ప్రారంభింపబడెను.

మాలిక్ కాఫరు నాజ్ఞ ననుసరించి తురుష్కులు తమయగ్నిగోళములను దుర్గాంతరము నకంప మొదలిడిరి. మఱికొందరు కోటబురుజులను మించెడి యౌన్నత్యముగల క్రమంచెలను నిర్మించి, వానినుండి శతఘ్నులఁ బ్రయోగించి శత్రువులను హింసింప,నితరులు మట్టిని బోసి కోటగోడనంటియుండిన యగాధముగు కందకమును పూడ్ప యత్నించుచుండిరి. పిమ్మట వారలు బండరాళ్ళతో భేదించి దుర్గద్వారమును స్వాధీనము చేసికొనిరి. రంజాను నెల 11 వ రోజున దురుష్కులు హిందువులు

తముపై గురిపించుచుండిన శిలావర్షమును లెక్కసేయక తామింతకుఁబూర్వమే సిద్ధపఱచికొనియుండిన నిచ్చెనలపై కోటగోడ కెగఁబ్రాకి, మూఁడుదినములు హోరాహోరిగఁబోరి, మట్టిగోడను మూఁడు బురుజులను స్వాధీన మొనర్చుకొనిరి. అటుపై వారికి యగాధమగు కందకముచే నావరింపబడినయొక శిలాప్రాకారము గన్పించెను. అయినను వెనుదీయక వార లమితోత్సాహముతో నాకందకము నీది రాతిగోడ నెగఁబ్రాకి యతిశౌర్యముఁజూపి శిలాప్రాకారముపై నుండిన యొకబురుజు నాక్రమించిరి. దీనిని జూచి విగతధైర్యుడై లడ్డర్ దేవుడు[164] తురుష్కనాయకునితో సంధియొనర్చుటకై రాయబారముసంపెను. తాను వారికి లోబడుట యొప్పుకొని యారాజు బంగారముతో నిర్మింపబడిన తన ప్రతిమకు మెడచుట్టు నొక స్వర్ణ శృంఖలమునుంచి వారికడకంపెను. తురుష్క సేనాని యంతటితోఁ దృప్తినందక రాయలు తన సర్వస్వమునుఁ దురుష్కుల కీయవలెనని యాజ్ఞాపించెను. చేయునదిలేక రాయలు రాత్రియంతయు శ్రమపడి యనేక ధనరాసులను సేకరించి యుదయమున గుర్రములు నేనుఁగులు మున్నగువానితో వానిని మాలిక్ కాఫర్ నొద్దకుఁ బంపించెను. పిమ్మట రాయలు ప్రతివత్సరమును జి జి యా పన్ను నిచ్చునటు లేర్పాటుచేసి యాతడు తన్ను మోసగింపకఁ దనసర్వస్వము నర్పించెనని రూఢిచేసికొ క్రీ. శ. 1310. సంవత్సరము మార్చినెల 16వ తారీఖున పదివేలలొట్టిపిట్టలు మోయలేక మోయుచుండునంతటి ధనమును వెంటబెట్టుకొని మాలిక్ కాఫరు ఓరుగల్లునుండి బయనమయ్యెను."

పై నుదహరింపబడిన మహమ్మదీయ చరిత్రకారుని వర్ణనమునుండి యనేకనూత్నాంశములు తెలియవచ్చుచున్నవి. అందలి దుర్గప్రశంసనుండియు, దానిని వశపఱచుకొనుటకై తురుష్కులొందిన శ్రమనుండియు, తాత్కాలికాంధ్రుల దుర్గనిర్మాణకౌశలము విదితమగుచున్నది. మహమ్మదీయులు శతఘ్నులను, రాళ్ళనువిసరుమంచెల నుపయోగించుచుండ, నాంధ్రులు ధనుస్సులతోడను రాళ్ళతోడనుఁబోరియుండిరి. దీనినుండి యుద్ధసాధనము లవిషయమునఁ దురుష్కులే ప్రబలముగనుండిరని తెలియుచున్నది. ప్రతాపరుద్రచక్రవర్తి వారికొసంగిన ధనరాసులును, వారియెడఁజూపిన విధేయతయు మహమ్మదీయ చరిత్రకారుడు పేర్కొనినంతటి మహత్తరములుగ నుండియుండకుండినను, ఆంధ్రులేమఱిపాటునఁ దముపైబడి, ప్రాణములకుఁ దెగించి యమితోత్సాహముతో పోరుచుండిన తురుష్కులదాడి కోర్వఁజాలక, దుర్గాంతరమునఁ బంధింపబడియుండి, వెలుపలనుండినవారి సాహాయ్యమునంద నశక్తులై, గత్యంతరములేక మహమ్మదీయులతో సంధి చేసికొనినమాట వాస్తవము. దేవగిరిరాజగు రామచంద్రునివలెనే ప్రతాపరుద్ర చక్రవర్తి గూడ దాత్కాలికశాంతికొఱకై కొంతద్రవ్యమును మాలిక్ కాఫరునకొసంగి, సంధిచేసికొనెను. ఇందుకుఁ బ్రతికూలములుగనున్న ప్రతాపచరిత్రాదు లీవిషయమున విశ్వసింపఁదగినవికావు.

ప్రతాపరుద్రదేవు డుత్తరమునఁ దురుష్కులతో సంధిచేసికొని విశ్వప్రయత్న మొనర్చి వారిని బంపివైచి యాంధ్రసామ్రాజ్యమున కాలప్రళయమునుండి రక్షించుచుండిన సమ

164 తురుష్కులు ప్రతాపరుద్రుని 'లడ్డర్ దేవ్' అని పేర్కొనిరి.

యమున దక్షిణదిశనుండి యొక కష్టమాపన్నమయ్యెను. క్రీ. శ. 1311 లో పాండ్యులు కాంచీపురముపై దాడివెడలి యచ్చటి కాకతీయ సామంతుఁడగు వీరగండ గోపాలునిఁ దఱిమి యానగరము నాక్రమించిరి. రుద్రాంబిక కాలము నుండియు నాంధ్రులకు లోబడియుండిన యానగర మన్యాక్రాంతమగుటకోర్వఁజాలక చక్రవర్తి పద్మనాయకసేనానులలో సుప్రసిద్ధుఁడగు నెఱ్ఱదాచానాయనిఁ బాండ్యుల గర్వమణంచుటకై దక్షిణమునకంపెను. ఈసేనాని మహాపౌరుష పరాక్రమములఁజూపి పాండ్యుల నోడించి వారల స్వర్ణసింహాసనమును, అఱచేతి ప్రమాణముఁగల యొకపచ్చను గైకొని, యేకశిలానగరమునకు మఱలి విజయలక్ష్మితో బాటు వానినిఁగూడ దన యేలికకు సమర్పించెను. దీనికి మెచ్చి చక్రవర్తి యెఱ్ఱదాచానాయనికి "పంచపాండ్యదళవిభాళ" "కాంచీకవాటచూఱకాఱ" యను బిరుదముల నొసఁగి విశేషముగ గౌరవించెను.[165] ఈకాంచీపుర దండయాత్రలో నిందులూరి రుద్రదేవుఁడు గూడ బాల్గొనెను.[166]

క్రీ. శ. 1313 సంవత్సరము నాటికి దేశమునందంతటను శాంతి నెలకొల్పబడియెను. విశ్వసనీయులగు ప్రతినిధులు సరిహద్దులనెల్ల గాపాడుచుండిరి. చక్రవర్తి తురుష్కుల కెక్కుడుధనము నొసంగియుండుటచేతను, వరుసగనుద్భవించిన సామంతవిప్లవముల నణంచుటకు విశేషధనము వ్యయమయియుండుటచేతను, సామ్రాజ్యకోశము నీరసించెను. శత్రుపీడితులై యుద్ధములచే నలజడిపడియుండిన ప్రజలను సుంకములను వృద్ధిచేసి యధికముగ బాధించుటకు బ్రతాపరుద్రచక్రవర్తికి మనసొప్పకుండెను. సామ్రాజ్యపుటార్థికస్థితిని, దనకోశాగారమును యెట్లుల నభివృద్ధి చేసికొనవలెనో నిశ్చయింపఁజాలక చక్రవర్తి డోలాయమానమానసుఁడై యున్నసందర్భమున దక్షిణభాగమున రెండువిపరీతములు జరిగినవి. పాండ్యుల పీడవదలినను కాంచీనగరమున కింకొక సంకటము సంభవించెను. కేరళదేశపాలకుఁడగు రవివర్మయనునాతఁడా నగరమును ముట్టడించి వీరగండగోపాలునిఁ దఱిమి కంచినాక్రమించెను. ఇదేసమయమునఁ జక్రవర్తి యితరజాతులవారినిఁద్రోసిపుచ్చి పద్మనాయకులనే రాజ్యాంగనియోగముల కధికారులుగ నియమించుటచే, గినుకవహించి తమకు వైరులగు వెలమలయెడను, వారినాదరించి దమ్మవమానపరచిన చక్రవర్తియెడనుఁ బగదీర్చుకొనుటకై యన్నమరెడ్డిమున్నగు రెడ్డిసామంతులు గండికోటదుర్గమునఁ జేరి కాయస్థులను, వడ్డిరాజుల నుద్బోధించి యొకప్రబల విద్రోహము నొనగూర్చిరి. క్రీ. శ. 1313 వఱకును గండికోటలో సోమయనాయకుని శాసనములుండుటచేతను, 1315 నుండియు నచ్చట గొంకారెడ్డి రాజప్రతినిధిగ నుండుటచేత[167] నీవిప్లవము క్రీ. శ. 1314లో జరిగెనని తెలియుచున్నది. ఇటులొకేసారిగ నుద్భవించిన యీరెండుసమస్యలను జక్రవర్తి యతిశీఘ్రముగను చక్కని దూరదృష్టితోడను, బరిష్కరించెను. పాకనాటికధిపతిగనుం

165 "సింగభూపాలీయ" మునందును, ప్రాచీనచరిత్రము లందు నీవిషయము గాంచనగుచున్నది.

166 గీ|| వీరమారవసుందర విక్రమేశ, బల్లహుని సాదగిన పంచపాండ్యరాయ
మానమర్దనుండయ్యె బ్రహ్మాణ్యరాజు, భద్రవిభవుండు నన్నయ రుద్రవిభుఁడు||
(శివయోగసారము)

167 cf. L. R. Gandikota.

...మహావీరుడగు ముప్పిడినాయకునిఁ గాంచీనగరమునకేగ నియమించి తాను స్వయముగ గండికోటపై కేగెను. అచ్చటి విప్లవమును సత్వరముగ నుపశమింపజేసి ప్రతాపరుద్రదేవు డనేకములగు సంస్కరణముల నా ప్రదేశము నందొనర్చెను. సామ్రాజ్య దక్షిణదిశను బలపఱచుకొనుటకును, దనయార్థికస్థితి నభివృద్ధి జేసికొనుటకును గూడ చక్రవర్తి కిందుమూలమున నవకాశ మేర్పడెను. రాజాజ్ఞచే ప్రకృత కడప కర్నూలు మండలము లందలి యడవులన్నియు నిర్మూలింపబడి యచ్చటి భూమి కృషి యోగ్యముగ నొనర్పబడినది. సామ్రాజ్యమునందలి వివిధ భాగములనుండి జను లనేకులిటకు వలసవచ్చి, చక్రవర్తిచే వృత్తులను బడసి యనేకములగు గ్రామములను నిర్మించిరి. అపుడు ప్రతాపరుద్రదేవుడు విశ్వసనీయులగు వారలను రాజధానినుండి రావించి వారి నీప్రాంతమున కధిపతులుగ నియమించెను.[168] ఇట్టి వారిలో అనుమకొండ అన్నువెంక, విడెము రుద్రయ మున్నగువారు ముఖ్యులు.[169] ఇదే సమయమున దక్షిణము కేగిన ముప్పిడి నాయకుడు కేరళ రవివర్మను జయించి, కాంచీనగరమును స్వాధీనము చేసికొని, యాంధ్రచోడ వంశీయుడగు మానవీరు నటరాజ ప్రతినిధిగ నెలకొల్పెను.[170]

ఈవిజయమునకు బిమ్మట చక్రవర్తి పుణ్యక్షేత్రములను దర్శింపనేగెను. ప్రాచీనవంశ చరిత్రలును, స్థానికచరిత్రములునుగూడ నీవిషయమును దెల్పుచున్నవి. శ్రీశైలత్రిపురాంతకాదియాంధ్రభూములను జూచి, యటుపై నీచక్రవర్తి దక్షిణదేశమున కాంచికేగి, యటనుండి శ్రీరంగజంబుకేశ్వరముల వరకును గూడ నేగెను. జంబుకేశ్వరము నందలి శివాలయములో నొక శాసనమున నేకశిలాపురపాలకుడగు ప్రతాపరుద్రదేవుడు ప్రశంసింపబడియున్నాడు. ఇతరవిషయములుగల యాందలిభాగము గోడలోని కిమిడ్చబడియున్నది. ఈప్రశంసనుబట్టి గాకతీయచక్రవర్తి యింతవరకును వచ్చియుండెనని యూహించుటకు దాత్కాలిక దక్షిణదేశపరిస్థితు లవకాశము నొసంగుచున్నవి. అప్పటికాప్రాంతమున బ్రబలురగు ప్రత్యర్థు లెవ్వరును లేకుండిరి. చోళరాజులప్రతిభ క్షీణించి వార లదృశ్యులైరి. పల్లవరాజగు కొప్పెరుంజింగడు మరణించెను. పాండ్యులలో జటావర్మన్ సుందరునికి దరువాతవచ్చినవారలు దుర్బలులై యుండిరి. ఈకారణమునుబట్టి ప్రతాపరుద్రదేవుడు జంబుకేశ్వరమున దన విజయధ్వజమును నాటెననియే యూహింపవచ్చును. ఈసందర్భము నందీతడు ప్రకృతమైసూరు రాజ్యమునందలి కొన్నిభాగములందు గూడ వీరవిహారమొనర్చెనని తెలియుచున్నది. అందలి తుంకూరు తాలూకాలోని యొకశాసనమునందు, నవలక్షధనుర్ధరాధీశ్వరుడును, మహారాష్ట్రకళింగసౌరాష్ట్రఘూర్జరవరహాటకర్ణాట ద్రవిడతుళు దేశములను జయించినవాడునగు గాకతీయ ప్రతాపరుద్రదేవుడు, శివగంగపర్వతాగ్రమున కేగి యచ్చట బుణ్యోదకమున స్నానాదికము

168 Karnul Dt. Manual, Sec 3.
కర్నూలు మండల చరిత్రము, కిమ్మూరు కైఫీయతు,

169 నైజాంరాష్ట్రములోని మానూరు గ్రామమునందలి యొక శాసనమున వీరిప్రశంస గలదు.

170 E. P. Ind. VII లోని అరుళాల పెరుమాళ్ శాసనము.

నొసఁగి, యనంతపురమను గ్రామము నగ్రహారముగ దానమొసంగెనని, చెప్పబడియున్నది.[171] ప్రాచీనచరిత్రములు ప్రతాపరుద్రదేవుడు తీర్థయాత్రావ్యాజమున రామేశ్వరమునకు నేగెనని చెప్పుచున్నవిగాని, యట్లనుటకితర ప్రమాణములేమియు గానరావు. ఇంతవరకును చెప్పఁబడిన విషయములనుండి చక్రవర్తిజేసిన యీసంచారము కేవలమాముష్మికబుద్ధిచేతనే గాదనియు, దన్మూలమున సామ్రాజ్యమునంతటి నొక్కసారి పరిశీలించి, వలయుచోట్ల కట్టుదిట్టములను జేసికొని, యథాసాధ్యముగ ధనము నుపార్జించుకొనుట గూడ నాతని ముఖ్యోద్దేశ్యమనియు స్పష్టమగుచున్నది

“కోయి లొలుగు” అను ద్రవిడకావ్యమునుండి యీకాలమున జరగిన మఱియొక ముఖ్యవిషయము దెలియుచున్నది. 1314–15 ప్రాంతములం దొరిస్సాపాలకుఁడగు కపిలేంద్రగజపతియాంధ్రదేశముపై దాడివెడలి యేకశిలానగరమును ముట్టడించెనట. కాని దీనివలని యుపద్రవమేమియు గలుగలేదు. రాజభక్తిపరాయణులును, శౌర్యధనులు నగు గాకతీయాంధ్రయోధులీయోఢ్రుల నతిసులభముగ దఱిమియుండిరి. ‘కాకతీయరాజ్యప్రతిష్ఠాపక’ ‘రాయబందీవిమోచక’ మున్నగు బిరుదములు గలవారలు దేవరినాయనింగారు మేచయనాయనింగారు మున్నగు సేనాను లనేకులు ప్రతాపరుద్రదేవుని గొలువునందుండిరి.[172]

క్రీ. శ. 1318 నాటికి జక్రవర్తి రాజధానికి మరలియుండెను. ఈసంవత్సరము కాకతీయ చరిత్రమున నాంధ్రదేశచరిత్రమునను గూడ మిక్కిలి ప్రతిభావంతమైనది. ఎల్లెడల నాంధ్రులు విజయమునందిరి. సామ్రాజ్యమున విద్యలును గళలు నభివృద్ధి నందుచుండినవి. మఱిరెండు వత్సరములలో నాంధ్రులు గర్ణాటకులను సహిత మరికట్టిరి. అదియెట్లన[173] క్రీ. శ. 1319–20 ప్రాంతముల కాకతీయ సామ్రాజ్యపు దక్షిణదిశనున్న కంపిల రాజ్యమును రామనాథరాయ లేలుచుండెను. అతని తనయుఁడగు కుమారరాముఁడు నిర్వక్రపరాక్రముఁడై సొరగల్లు, బాదామి, హానగల్లు, మున్నగు దుర్గములను జయించి, హొయసల రాజగు మూడవ బల్లాలుని ముప్పు తిప్పల బెట్టుచుండెను. అంతటితో దృప్తినొందక హొయసల రాజ్యమును సమూలముగ జయించు నుద్దేశ్యముతో కుమారరాముఁడు ప్రతాపరుద్ర చక్రవర్తి సాహాయ్యము నభ్యర్థించుచు రాయబారమంపెను. ఈ జైత్రయాత్ర యక్రమమగుట వలనను, హొయిసలులు దనకు మిత్రులగుటచేతను ప్రతాపరుద్రదేవుఁడీ యభ్యర్థనమును నిరాకరించెను. అంతనా కంపిల రాజపుత్రుఁడు కాకతీయదుర్గమగు ముద్గల్లును ముట్టడించియు, “వీరరుద్రనగండ” “మూరు రాయరగండ” మున్నగు బిరుదములను గల్పించుకొనియు, నాంధ్రదేశాధీశ్వరు నవమానించెను. ఈయవినయతను శిక్షించుటకై జక్రవర్తి పద్మనాయకసేనానియగు రేచర్ల సింగమనాయకుని, మంత్రిశేఖరుఁడగు బెండపూడి యన్నామాత్యుని, కంపిల

171 E. P. Carn. Vol. XII. P. 4

172 E. R. No. 72 of 1929 – 30

173 Q. J. M. S. XX. Pt. 2, 3, 4 లోని “కుమార రామనచరితె” యను గన్నడగ్రంథము నుండి యీవిషయ మెఱుంగనగుచున్నది.

కంపెను. [174] అటజరగిన యుద్ధమున గంపిల బలములకే విజయము గల్గినను, దధీశుడగు కుమారరాముడు సింగమనాయకునితో సంధిచేసికొని యాతనికి 6000 గుఱ్ఱముల నిచ్చెనట. ఈవిషయము విశ్వసనీయముగ గన్పడదు. విజయమునందిన వారలు సంధిచేసికొనుట యాచారముగాదు. అందునను కుమార రాముని వంటి మహాశూరుని కదియుచితముగాదు. నిర్జితులు విజేతలకు గానుకలొసంగుదురుగాని, దామే వానిని బరిగ్రహించుటయును. అదియును గాక ప్రతాపరుద్రునిపై నంతటి క్రోధమును బూనిన రాముడు సమరజయియైనచో నాంధ్రసామ్రాజ్యమున విశేష భాగమును గూడ జయించియేయుండును. అతడటు చేయకుండుట యటుండ, క్రీ. శ. 1319 వరకు నెన్నియో స్థలముల నాక్రమించిన యాతడీ సంవత్సరమునుండి క్రీ. శ. 1327 వరకు, ననగా గాకతీయసామ్రాజ్య మస్తమించిన నాలుగు సంవత్సరములవరకునుగూడ నిర్వ్యాపారుడై యుండెను ఈ కారణములను బట్టి పై యుద్ధమునం దాంధ్రుల కేవిజయము సిద్ధించెనని స్పష్టమగుచున్నది.

క్రీ. శ. 1320 లో నాంధ్రసామ్రాజ్య నాశమున కంకురార్పణ మొనర్పబడెను. కంపిలపైకేగిన సైన్యము లింకను మరలియుండలేదు. చక్రవర్తియు ప్రజలునుగూడ నీ కర్ణాటక విజయోన్మత్తులై నిర్భయులై యుండిరి. ఇంతలో నుల్కవలె నుత్తరమునుండి మహమ్మదీయులు దండెత్తి వచ్చుచుండిరను వార్త వినవయ్యెను. రాజధానీనగరమునందుండిన బలములను జక్రవర్తి యుద్ధమునకై సిద్ధముజేయు చుండు సమయమున దక్షిణదిశనుండి ప్రోలయవేమారెడ్డి మున్నగువారలు ధరణికోటకేగి, స్వాతంత్ర్యము బ్రకటించిరను దుర్వార్త యేతెంచెను. ఇయ్యది ప్రతాపరుద్రదేవుడు పద్మనాయకుల యెడజూపినపక్షపాతమునకును, దనకు గండికోటలో నొనర్చిన పరాభవమునకును రెడ్లొనర్చిన ప్రతీకారము. అతిశీఘ్రముగ జక్రవర్తి కొన్ని సైన్యములను ధరణికోటకు బంపెను. కాని ప్రోలయవేముడీ బలములను సులభముగ నిర్జించి వినుకొండదుర్గమును జేరి పరిసరప్రాంతముల నాక్రమించి యధికారము జేయసాగెను.

ఈసమయమునం దాంధ్రుల మనోబలములుత్తరదిశను కేంద్రీకరింపబడినవి. ఏమఱిపాటున నొక్కుమ్మడిగ బయల్వెడలిన మహమ్మదీయప్రళయవాహిని నెదుర్కొనుటకే యెల్లరును బ్రయత్నించుచుండిరి. ఇంతకు ముందు క్రీ. శ. 1309 లో దురుష్కుల తృతీయదండయాత్ర జరిగినది. నాటినుండి క్రీ. శ. 1320 వరకును గల కాలమున ఢిల్లీరాజ్యమునం దెన్నియో మార్పులు జరిగినవి. 1316 లో అల్లా ఉద్దీన్ మరణింప, నాతని సేనానాయకుడుగ నుండి దక్షిణదేశమును జయించిన మాలిక్ కాఫర్ విజయగర్వాంధుడై ఢిల్లీసింహాసనము నాక్రమింపయత్నించి, తుదకు నిహతుడయ్యెను. అటుపిమ్మట ముబారక్ ఖిల్జీ రాజ్యమునకు వచ్చి 1320 లో హత్యచేయబడెను. అతని వెనుక

174 శ్రీనాథుడు భీమఖండోద్ఘాతమునందు యన్నమంత్రిని
“ఘాటివిఘటిత కర్ణాటకోద్యాన దవగ
యవన సంహారవిలసత్ కాలాగ్ని యనగ
.........................
నెల్ల బలశాలి ప్రోలయయన్నకాం...” యని ప్రశంసించియున్నాడు.

'ఖుస్రూఖాన్' అను సామంతుడు 'ఘాజీబేగ్ టుగ్లక్' అను నామముతో సింహాసనమధిష్ఠించెను. అనతికాలమునకే యీసుల్తాను తన జ్యేష్ఠపుత్రుడగు 'అలుఫ్‌ఖాన్'ను తెలింగాణమును జయించుటకై దక్షిణదిశ కంపెను. కాకతీయాంధ్రసామ్రాజ్యమును నిర్మూలించి, దక్షిణహిందూదేశస్వాతంత్ర్యమును భంగపఱచిన యీతురుష్కదండయాత్రను జియాఉద్దీన్ బారనీ యను మహమ్మదీయచరిత్రకారు డీక్రిందివిధమున వర్ణించియున్నాడు.[175]

"సుల్తానువలని భయముచేతను, ఉల్ఘుఖానుని పౌరుషపరాక్రమములను వినియు, భీతులై, లద్దర్‌దేవ్ మున్నగువారలు రాజధానీనగరమునకు బజ్వేడి యందు దాగికొనిరి. తురుష్కులు ఓరుగల్లు దుర్గపుమట్టిగోడను ముట్టడించిరి. ఉల్ఘుఖాను దేశమును దోచియు, ప్రజలను బీడించియు, రాష్ట్రమునల్లరిచేయుడని తనసైనికుల కాజ్ఞాపించెను. అనేకమంది హిందువులు మట్టిగోడను, శిలాప్రాకారమును రక్షించుచుండిరి. కాని తురుష్కుల ప్రతాపమునకు దాళజాలక వారిలో ననేకులు సమసిరి. మట్టిగోడ తురుష్కులచే నాక్రమింపబడినవెంటనే లద్దర్‌దేవుడు సంధికై రాయభారము నంపెను. కాని ఉల్ఘుఖాను దండుల కంగీకింపక దుర్గమును రాయలనుగూడ స్వాధీనముచేసికొనన్ నిశ్చయించుకొని, యుద్ధమును సాగించెను. ఈసమయమునం దురుష్కశిబిరమునందొక కలవరము జనించెను. తాను ఢిల్లీనుండి బయల్వెడలినప్పటినుండియు నచ్చటి సమాచారము లేవియు నీతురుష్కసేనానాయకునకు దెలియవయ్యెను. అట్టిసమయమున సుల్తాను కాలముచేసెననియు, నోరుగల్లును ముట్టడించుచుండినసైన్యములు నిస్సహాయములైనవనియు నొకప్రబలమగువదంతి బయల్వెడలెను. దీనికి మహమ్మదీయనాయకుల పరస్పరకలహములు తోడగుటచే తురుష్కసైన్యము లొక్కసారిగ చెల్లాచెదరైనవి. చేయునదిలేక వారినాయకుండును ఢిల్లీమార్గమును బట్టెను. దైవికమగు నీప్రతిహతమునకు సంతసించి యాంధ్రులు దుర్గమునుండి వెలువడి తురుష్కుల వెన్నంటి వారి ననేకవిధములం బీడించిరి. స్వల్పపరివారముతో నుల్ఘుఖానుడు దేవగిరిం జేరి, ప్రాణసంరక్షణము జేసికొనగల్గెను."

పై వ్రాతలనుండి యీసందర్భమున దురుష్కులకు మఱియొకతూరి పరాభవము జరిగెనని స్పష్టమగుచున్నది. ఏకశిలానగర మప్పుడే బాగుచేయంబడియుండుటచే శత్రువులు దానిని భేదింపజాలకుండిరి. ఆంధ్రులును ముందుగనే యీదండయాత్రను గూర్చి యెఱింగియుండి యుద్ధమునకు సంసిద్ధులై యుండిరి. ఈయుద్ధమునుగూర్చి ప్రాచీనచరిత్రములు దెలుపువిషయములు విశ్వసనీయములుగ గన్పడుచున్నవి. సాహిణిమారయ్య, మహాకాళి దొర, కొల్లిపాకసిద్ధయ, కొలనిరుద్రుండు మున్నగు వీరు లీసమయమునందద్వితీయపరాక్రమము జూపియుండిరి.

ఈవిజయము తిరిగి యాంధ్రులను సంతోషాంధులను గావించినది. ఇంతవరకును మహమ్మదీయుల పూనికను గాంచియు, పరాజయానంతర మతిత్వరితముగనే మరల దండెత్తివచ్చువారియుద్ధపద్ధతుల నెఱింగియుగూడ, నాంధ్రులు విజయాంధులై భావిపరిస్థితుల నించు

175 Barani—Tarikh-i-Firozshahi—Elliot. p. 231

కేనియు నాలోచింపరైరి. వినాశకాల మాసన్నమగుటచేతనే వారల కిట్టి విపరీతబుద్ధి పొడమియుండును. సరిహద్దులలో సమర్థులగు వీరుల నుంచి, శత్రుశత్రుత్వమును మఱచి దేవగిరి యాదవులతో దాత్కాలిక మైత్రిని జేసికొని, వారలనుగూడ దురుష్కులను నిర్జించుటలో నర్పి, ప్రతాపరుద్రచక్రవర్తి యప్రమత్తుడై యుండినచో, దక్షిణహిందూదేశమున గాకతీయసామ్రాజ్య మింకను కొంతకాలము బ్రబలి యుండును. కాని దైవ దుర్విపాకమునఁ జేసి చక్రవర్తి హ్రస్వదర్శియై యీక్లిష్టసమయమునం దేమఱియుండెను.

ఢిల్లీపట్టణమున సుల్తానీపరాజయవార్త నాలకించి నిరుత్సాహితసందర విశేషబలముల రావించి దేవగిరిదుర్గమున నున్న తన తనయునికడ కంపి, యీపర్యాయము తప్పక తెలింగానా పాలకుని బందిగ గొనితెమ్మని యాజ్ఞాపించెను. క్రీ. శ. 1320 నుండి 1321 యుత్తరభాగము వరకు నింతకు పూర్వపు యుద్ధము జరగియుండెను నాల్గుమాసము లైనను గడువకమునుపే క్రీ. శ. 1322 మొదటిభాగమున ఉల్గుఖాను చక్రవర్తి పంపిన యీబలములతో తిరిగి యాంధ్రదేశముపై దాడివెడలెను. ఈయాత్రను చరిత్రకారుడగు బారనీ యిటుల వర్ణించి యున్నాడు:

"సుల్తాను నాజ్ఞననుసరించి రాజపుత్రు డాంధ్రదేశమున బ్రవేశించి, బీదరుదుర్గమును స్వాధీనము చేసికొని, తత్పాలకుని బందిగ జేసెను. అతిత్వరితముగ నాత డోరుగల్లునకేగి సులభముగ మట్టిగోడను వశపఱచుకొనెను. తోడనే లద్దర్ దేవుడు సకుటుంబపరివారముగ నాతనికి స్వాధీను డయ్యెను, అంతట ఉల్గుఖానుడు రాయలను విశేషధనరాసులను మాలిక్ బేదర్, ఖ్వాజాహాజీయనువారి రక్షణమున ఢిల్లీనగరమునకుఁ బంపునను చేసి, ఓరుగల్లునకు "సుల్తాన్ పూర్" అనుపేరిడి, తెలుగుదేశమునంతటిని జయించెను." [176]

జియాఉద్దీన్ బారనీ యాంధ్రసామ్రాజ్యపతనము నింతలఘువుగ బరిష్కరించినను వాస్తవ మింకొకవిధముగ నుండినది. క్రీ. శ. 1322 లో నారంభింపబడిన యీయుద్ధము క్రీ. శ. 1323 వరకును జఱగియుండెను. ఆంధ్రసామ్రాజ్య పతనమునకు కేవలమును తురుష్కుల కార్యదీక్షయు యుద్ధనైపుణియు నేగాక యితరకారణములుగూడ నుండినవి వానిలో మొదటిది యాంధ్రుల దృష్టిమాంద్యము. రెండవది వారియందలి కలహములు. సామ్రాజ్యము జీవన్మృత్యుసమస్యకు లోనై యుండిన సమయమున బోలయవేమాది రెడ్డికులజు లొనర్చిన రాజద్రోహము మొదటిప్రమాణము. ఇంతటితోఁ దృప్తినందక రెడ్లు సంగ్రామము ఘోరముగ జరుగుచుండిన సమయమున మత్సరపిశాచపీడితులై యొక దుష్కార్యము నొనర్చిరటులు ప్రాచీనవంశచరిత్రములనుండి తెలియుచున్నది. యుద్ధరంగమున శౌర్యమును స్వామిభక్తిని జూపుటకు మాఱుగ, నింకను జక్రవర్తిబలములలోనుండిన రెడ్లు తమ మేధాబలముల స్వార్థపఱచి స్వామి నాశము నొనగూర్చిరి. పద్మనాయకవీరు లద్వితీయముగఁ బోరుచు శత్రుసంహార మొనర్చుచుండ, ప్రోలయవేమాదుల స్వాతంత్ర్యప్రకటనము నాలకించి, రెడ్డికులజులు బొబ్బారెడ్డి యాధిపత్యమునఁ దురుష్కులతో కుట్రచేయ మొదలిడిరి. మహమ్మదీయులనుండి కొంతధనమునుగైకొని

176 Ibid

వార లొకనాటి యుద్ధమునం దాంధ్రులపక్షమున యుద్ధముచేయకుండుటకై యొడంబడిక చేసికొనిరి. తాము రంగమునం దుండకుండినచో యుద్ధభారమంతయు బద్మనాయకులపై బడుననియు, తురుష్కుల నెదుర్కొని వార లతి త్వరితముగ నశింతురనియు, నిటుల ప్రత్యర్థులు నశించినపిమ్మట దాము చక్రవర్తి గౌరవాదరముల నేకభోగ్యములుగ ననుభవించి యవనుల ననాయాసముగ నిర్జింపవచ్చుననియు నీరెడ్లు తలంచియుందురు మఱునా డుదయమున యుద్ధమారంభమయినవెంటచే దమ యొడంబడిక ననుసరించి బొబ్బారెడ్డిమున్నగువారలు యుద్ధభూమినుండి సుమారము నిష్క్రమించిరి. తమదేశమును దమయేలికను, రక్షించుటకై ప్రాణములను లక్ష్యముచేయక మైమరచి పోరుచుండిన పద్మనాయకవీరు లీ విషయమును గమనింపరైరి. మహావాహినివలె దురుష్కసైన్య మాంధ్రవీరులపై బడుటనుగాంచి, ప్రతాపరుద్రచక్రవర్తి జాగుచేసినచో బ్రమాద మొదవునని యెంచి, మదగజారూఢుడై శేషించినయల్ప పరివారముతోగూడి యుద్ధరంగమున బ్రవేశించెను. ఇట్టిమహాసమయమున కీవరకే సుసిద్ధుడై యుండిన తురుష్కసేనాని, యోధులెల్లరును మైమరచియుండిన సమయమున గొంతసైన్యముతో నొక్కసారి గం జక్రవర్తిపై బడి, యాతని స్వల్పపరివారమును జెండాడి యాతని బందిగజేసెను. ఈ వార్త యింకను సైనికులకు దెలియకమునుపే ఉల్లుఖాను రహస్యమార్గమున విశ్వసనీయులగు సేనానాయకుల రక్షణమున బ్రతాపరుద్రదేవుని ఢిల్లీనగరమున కనిపెను. ఇంతటితో గాకతీయ సామ్రాజ్యభాను డాంధ్రమండలమునం దస్తమించెను. పద్మనాయకవీరులు విజయలక్ష్మిని జేపట్టి, స్వదేశమునకు బోవుచుండిన తురుష్కులతో పోరుట నిష్ఫలమని యెంచి యూరకుండిరి. బొబ్బారెడ్డి మున్నగువారలతిశీఘ్రముగ నడచిన యీ వ్యాపారము నంతయుగమనించి దమ యకార్యమునకు బశ్చాత్తప్తులై తురుష్కులపై బడిరి. కాని యిట్టి రాజద్రోహులు దేశమునం దుండగూడదను నుద్దేశ్యముననోయన దురుష్కులు వారినెల్లరను నిశ్శేషముగం బరిమార్చిరి. ఈ విధమున పదునొకండవ శతాబ్ది మధ్యభాగమున నుదయించి సుమారు మూండు శతాబ్దముల కాలము దుర్నిరీక్ష్యుడై తేజరిల్లిన కాకతీయభానుడు దైవోపహతులగు నాంధ్రుల బుద్ధిమాంద్యమును, రెడ్డిపద్మనాయక వైమనస్యములునను నీలమేఘావృతుడై, క్రీ. శ. 1323 వ సంవత్సరమునం దురుష్కకాళరాత్రిలో విలీనుడయ్యెను.

ప్రతాపరుద్రదేవుడు తురుష్కులచే బందిగగొనిపోబడుటతో నీతనిచరిత్ర మంతమయ్యెనని చరిత్రకారులు దలంచుచున్నారు.[177] కాని యాచక్రవర్తి క్రీ. శ. 1326 లో గూడ రాజ్యమేలుచుండెనని యూహించుటకు గొన్నియవకాశములు గలవు. ప్రాచీనవంశచరిత్రములలో నీతడు ఢిల్లీనగరమున కేగినపిమ్మట సుల్తా నీతని ననేకవిధముల బహూకరించి, తిరిగి యాంధ్రదేశమున కంపెననియు, ననతికాలముననే ప్రతాపరుద్రుండు గోదావరితీరమున దేహమునం జాలించెననియు చెప్పబడియున్నది. ఆంధ్రదేశమున బ్రబలము

177 ఢిల్లీనగరమునకు గొనిపోబడుచుండిన లద్దర్ దేవుడు మధ్యమార్గముననే మరణించెనని మహమ్మదీయులు వ్రాసియుండిరి—Vide—Elliot, III p. 367. ఇది గొప్పకల్ల.

గ. వ్యాపించియున్న మఱియొక గాథనుండి ప్రతాపరుద్రుని మంత్రులలో నొకఁడగు యుగంధరుడనునాతడు శిష్యులతోఁగూడి ఢిల్లీనగరమునకేగి పిచ్చివానివలె నటించి, యద్వితీయ మేధాశక్తిని గనుపఱచి రత్నపరీక్షామిషపై సుల్తానును, బందిగనుండిన ప్రతాపరుద్రునిఁ గూడ, గంగానదిపై గట్టబడియుండిన యొక యోడపై కేతెంచునటులొనర్చి, రహస్యముగ నాయోడను దరలించి, సుదూరమేగినపిమ్మట నొకనిర్జనస్థలమున సుల్తానుని విడిచిపుచ్చి, ప్రతాపరుద్రదేవుని యాంధ్రనగరికి గొనితెచ్చి తిరిగి కాకతీయసింహాసనమునఁ గూర్చుండఁజేసినని తెలియుచున్నది.[178] పైగాథలయందలి వాస్తవ మెటులున్నను వానికి బలము నొసగునాధారములు కొన్ని లభ్యములగుచున్నవి. దేవగిరిపాలకుఁడగు రామచంద్రదేవుడిటులనే తురుష్కులచే బందిగగొనిపోబడియు స్వదేశమునకు పంపబడియుండెను. చక్రవర్తి సేనానులలో నొకడగు రేచర్లసింగమనాయనికి "రాయబందీవిమోచక" యను బిరుదునామ ముండెను. చక్రవర్తి క్రీ. శ. 1323 లో దక్క నిదివరకెన్నడును బందియై యుండలేదు. ఏకశిలానగరపాలకుఁడగు నాగయగన్నమంత్రి "నీతియుగంధరు"డని పేరు గాంచి యుండెను. అదియునుగాక క్రీ శ. 1326. వ సంవత్సరమున ప్రతాపరుద్రదేవచక్రవర్తి రాజ్యముచేయుచుండెనని రెండుశాసనములనుండి తెలియుచున్నది. వానిలోనొకటి రుద్రసేనానిధర్మమునుఁ దెలుపుచున్నది.[179] మఱియొకటి హంపీక్షేత్రమునందొకరెడ్డి యొనర్చిన దానమును ప్రశంసించుచున్నది[180] వీనినుండి ప్రతాపరుద్ర చక్రవర్తి యేకారణముచేతనో క్రీ. శ. 1323 కు బిమ్మట నాంధ్రదేశమునకు దిరిగివచ్చి క్రీ. శ. 1326. వ సంవత్సరము వఱకును రాజ్యమేలుచుండెనని స్పష్టమగుచున్నది. ఈతడు బందీవిముక్తుడై యాంధ్రదేశమునకు మరలిన విధము భావిపరిశోధనలమూలమునఁ దప్పక వెలువడునని మావిశ్వాసము.

విద్యాపోషణము:—కాకతీయ సామ్రాజ్యము కేవలము రాజకీయ వైభవమునకు నార్థిక భాగ్యమునకునేగాక వాఙ్మయాభివృద్ధికిఁగూడ నెక్కుడు పేరెన్నికఁ గాంచియుండెను. కాకతిరుద్రునిచే నారంభింపబడిన విద్యాపోషణము గణపతిదేవ రుద్రాంబికలచే పెంపొందింపఁబడి ప్రతాపరుద్ర చక్రవర్తికాలమునకు విశ్వవిఖ్యాత మయ్యెను. ఆంధ్రవాఙ్మయమునకు రాజరాజ మనుమసిద్ధి ప్రతాపరుద్ర కృష్ణరాయాదులు మూలస్తంభములు. ఏకశిలానగరము పదునాలుగవ శతాబ్దమున విద్యానిలయమై యొప్పెను. స్వయముగ మహావిద్వాంసుడును రసజ్ఞుడునైన వీరరుద్రుఁడు గీర్వాణాంధ్రకవుల నెందరినో దనయాస్థానమునఁజేర్చి వారిచే భాషాపోషక మూల్యాలంకారముల ననేకముల నిర్మింపజేసెను. ప్రతాపచరిత్రాది ప్రాచీనచరిత్రము లీతనికాలమునం దభివృద్ధి నందుచుండిన సంగీత, నాట్య, జ్యోతిష, కావ్య, నాటకాది వివిధవిజ్ఞానములఁగూర్చి వేనోళ్ళఁజాటుచున్నవి. అయినను మన దురదృష్టవశమున నాకాలపుఁ గవిపుంగవుల గ్రంథములెన్నియో బ్రిక్రృతమున లభింపకున్నవి. య

178 ఈ గాథననుసరించియే 'ప్రతాపరుద్రీయ'మను నాంధ్రనాటకము రచింపబడినది.

179 E. R. No. 308 of 1915.

180 రెడ్డికుల నిర్ణయచంద్రిక, పే. 88—89.

ధాలభ్యములగు నాధారముల నుండి యీ చక్రవర్తి కాలమునం దీక్రింది గీర్వాణాంధ్రకవు లేకశిలా నగరమునం దుండినటులఁ దెలియుచున్నది.

శాకవెల్లి మల్లికార్జునభట్టు:— ఈతడొక సుప్రసిద్ధ సంస్కృతకవి. "శాకల్యమల్లః" యను నామాంతరముగల నీతడు "నిరోష్ఠ్య రామాయణము"ను రచించెను. వైష్ణవగురు పరంపరావృత్తాంతములలో నీకవి సుప్రసిద్ధ వైష్ణవ సిద్ధాంత ప్రతిపాదకుడగు వేదాంతదేశికుని తనయుఁడగు వరదదేశికునికి సమకాలికుఁడుగ జెప్పఁబడియున్నాఁడు. ప్రసంగరత్నాకరమను గ్రంథమునుండి యీ మల్లికార్జునభట్టు విజయనగర రాజగు హరిహరరాయల యాస్థానమునఁ గూడ నుండెనని తెలియుచున్నది. ఈతని గ్రంథములలో నిపుడొక "యుదారరాఘవ"మే లభ్యమగుచున్నది. అందలి యంకాంత పద్యములనుండి యీతని తండ్రిపేరు మాధవుఁడనియు, "శాకల్య" లేక "శాకవెల్లి" యనునది యీతని గృహనామమనియు దెలియనగుచున్నది.

విద్యానాథుఁడు:— ఈ సంస్కృతకవినామము వాఙ్మయముననేగాక చారిత్రక ప్రపంచమునఁగూడ శాశ్వతముగ నుండగలదు. ఈతని 'ప్రతాపరుద్ర యశోభూషణము' నుండి కాకతీయచరిత్రమున కద్వితీయ ప్రాముఖ్యతగల యనేకవిషయములు తెలియనగుచున్నవి. ఏతద్గ్రంథరచననుగూర్చి ప్రాచీనవంశ చరిత్రములలో నీక్రిందిగాథ గలదు.

'ప్రతాపరుద్రుని కీర్తివైభవములను కవి కాపోషణమును విని యీకవి యాచక్రవర్తినిఁ ప్రధానముగఁజేసి యొకయలంకార గ్రంథమును నిర్మించి, చక్రవర్తిని దర్శించుటకై యేకశిలానగరమున కేతెంచెను. అచ్చట నారాజు తురుష్కులచే బందిగఁగొనిపోఁబడెనని వినియు, హతాశుఁడుగాక, నాతనిఁగాంచుటకై తురుష్కశిబిరమున కేగెను అంత నెక్కుడుప్రయాసమునకోర్చి యేతెంచిన యీకవికుంజరునిఁ జక్రవర్తి మిగులనాదరించి యాతనిగ్రంథమును సావధానముగ నవలోకించెను. వస్తుప్రాశస్త్యమును గ్రహించియు, తననిస్సహాయస్థితికి వగచి చక్రవర్తి కవితోనిట్లనియెనట— కవీంద్రా! దీనుడను, అన్యాక్రాంతుడనగు నన్నాశ్రయించి నాగుణముల స్తుతించుటచే నీకగులాభమెయ్యది. నీగ్రంథమును స్వతంత్రుడను శ్రీమంతుడునగు నింకొకరాజన్యునికిఁ గృతియొనర్చి దానినీలేమిని బాపుకొనుము.'' అప్పుడు కవి చక్రవర్తి రసజ్ఞతకుమెచ్చియు నాతని సత్ప్రయోజకతకై విచారించి "ఓయీ! ప్రతిపంక్తి యందును నిన్నేలెగుల బెట్టితిని, దానినింకొకనిఁ జేర్చ నెటులసాధ్యమగు''నని బదులుపల్కెను. అంత బ్రతాపరుద్రుఁడాతని నోదార్చి తన ముద్రాంగుళి నొసంగియు "విద్యానాథు''డను బిరుదము నొసంగియు నాతనిఁగౌరవించెనట—

పైగాథయందలి వాస్తవ మెటులున్నను, విద్యానాథకవి ప్రతాపరుద్రచక్రవర్తి యాస్థానమునం దగ్రస్థానము నలంకరించియుండెననియు, నాతడు చక్రవర్తి పూర్వులచరిత్రము నామూలాగ్రముగ నెఱింగియుండెననియు నాతని యలంకార గ్రంథమునుండి స్పష్టమగుచున్నది. అందలి యొకశ్లోకము నాధారముగఁ జేసికొని కొందరుపండితులీతని నామ మగస్త్యుడనియు, విద్యానాథుడనునది బిరుదనామ

మనియు నభిప్రాయపడుచున్నారు.[181]

అగస్త్యుడు:—ఈకవి సంస్కృతమునఁ బాలభారతమును రచించెను. ప్రతాపరుద్రుని యాస్థానముననే యుండిన విశ్వనాథకవికితడు మాతులుడు.[182] మధురావిజయమునం దగస్త్యుఁడు డెబ్బదినాల్గు కావ్యములను రచించెనని చెప్పబడియున్నది.[183]

గంగాధరకవి:—ఈతడు సుప్రసిద్ధపండితకుటుంబమున జన్మించెను. సిద్ధనాథుని పుత్రుడు. మహాభారతకథను నాటకరూపమునరచించి ప్రసిద్ధికెక్కెను.[184]

నరసింహకవి:—ఈతఁడు నాటకాలకు రచయితలలో సుప్రసిద్ధుఁడు. ఈకవిగ్రంథములలో కాదంబరీనాటకము ప్రకృతమునఁ గాంచనగుచున్నది.[185] ఈతని తండ్రి గంగాధరకవి.

విశ్వనాథుడు:—ఈతడొక నాటకరచయిత. ఈతనికృతులలో సౌగంధికాపహరణమను నొక వ్యాయోగము మాత్రము లభించుచున్నది.[186]

---

181 ఈవిశ్వనాథుడు సుప్రసిద్ధ సంస్కృత గ్రంథవ్యాఖ్యాతయు మహామహోపాధ్యాయుడును కోలాచల మల్లినాథసూరియని శ్రీ శేషాద్రిరమణకవుల యభిప్రాయము. నా[illegible] రచించిన రామాయణచంపూవ్యాఖ్యానములోని వ్యాఖ్యాతృవంశవర్ణనములోని
"కోలాచలమ్మన్వయదుగ్ధసింధుర్మల్లినాథో మహాయశాః।
శతావధానవిఖ్యాతో వీరరుద్రాభివర్ణితః॥"
అను శ్లోకము వీరిప్రమాణము. (చూ రజతోత్సవసంచిక — [illegible] — పే 22)

182 నాటకస్యాస్య కవే రుదార మధురా ఇత్యత్ర చిత్రాంకితము
ప్రఖ్యాతస్సకలాసు విద్యాసు గుణిషు శ్రీమానగస్త్యః సుధీః
వేదశ్చంద్రముఖీ కరాంగుళి దళాసంగక్వణద్వల్లకీ
వాచోయుక్తి పహోక్తిదర్శకః సుధాజన్మా స యన్మాతులః॥ "సౌగంధికాపహరణము"

183 చతుస్సప్తతి కావ్యోక్తి వ్యక్త వైదుష్యసంపదే।
అగస్త్యాయ జగత్యస్మిన్ స్పృహయేత్కో న కోవిదః॥ "మధురావిజయము"

184 సుమస్తమపరం వ్యాసం గంగాధరమహాకవిం।
నాటకచ్ఛద్మనా దృష్టాం యశ్చక్రే భారతీ-కథాం॥ "మధురావిజయము"
జానాత్యేవహియద్భవాన్ కవికులం సత్యైర్యదభ్యర్హితం
నిత్యంసన్నిదధాతి సాభగవతీ యస్మిన్గిరాం దేవతా।
తత్రాసీత్కుల సిద్ధనాథతనయో గంగాధరః పండితః
బాహుశ్రుత్య విశేషవిశ్రుత యశస్సాహిత్యసాహిత్యభూః॥
"కాదంబరీనాటకము"

185 తస్యైషమధ్యమః పుత్రో నరసింహ ఇతీరితః।
విశ్రుతస్సరు కర్తాస్య కృతేఽస్య వధారయ॥
"కాదంబరీనాటకము"

186 సూత్రధారః—అద్యఖలు రాజ్ఞాప్రతాపరుద్రేణ
సంభావితై రశేషవిద్యాపారసార్వజ్ఞ [illegible]రేయమ
తిభిః సభాసద్భి రాహూయమాన మాదిష్టోఽస్మి—
విశ్వనాథ ఇతిఖ్యాత కవిరస్తి యదుక్తయః
అకాబ్బనమరత్నం చ విదుషాం కర్ణభూషణం॥
"సౌగంధికాపహరణము"

చిరంసవిజయీ భూయాద్విశ్వనాథ కవీశ్వరః।
యస్యప్రసాదాత్సార్వజ్ఞం సమింధే మాదృశేష్వపి॥ "మధురావిజయము"

వీరభల్లటదేశికుఁడు:— ఈకవి యనేకశాస్త్రములలో బాండిత్యము గలిగియుండెను.[187]

అప్పయార్యుఁడు:— ఈతఁడొక సుప్రసిద్ధ జైనకవి. శాలివాహనశకము 1241 వ సంవత్సరమున (20 జనవరి 1310) మాఘశుద్ధ దశమీ యాదివారమునా డీకవి "జినేంద్రకళ్యాణాభ్యుదయ" మనుగ్రంథమును రుద్రకుమారుని రాజ్యకాలమున నోరుంగల్లు నగరమునఁ బూర్తి చేసెను. ఈతఁడు పుష్పసేనాచార్యుని శిష్యుఁడు. స్థానికచరిత్రములందును ప్రాచీన వంశ చరిత్రములందునుఁ గూడ ప్రతాపరుద్రుఁడు జైనులను హింసించెనని చెప్పబడియున్నది. ఈజైనసంస్కృతకవి యాచక్రవర్తి రాజధానీనగరమున వసించుచు ప్రశాంతముగ గ్రంథరచన మొనర్చుటబట్టి పై యూహ యవిశ్వసనీయ మేమోయని తోఁచుచున్నది. అంతియగాక ప్రతాపరుద్రచక్రవర్తి కవితాపోషణము జాతిమతభేదములను బాటింపక కేవలగుణమునే బరిగ్రహించెననిగూడ యీ యప్పయార్యుని చరిత్రము నిరూపించుచున్నది.[188]

ఈచక్రవర్తి కాలమునం దాంధ్రకవులనేకు లాదరింపబడియుండిరి. చక్రవర్తి ననుసరించి యాతని సామంతులుఁగూడ నదేవిధమున విద్యాపోషణము నొనర్చుచుండిరి.

త్రిపురాంతకుఁడు:— సామాన్యముగ 'తిప్పన' యని వ్యవహరింపఁబడు నీకవి యనేక సంస్కృతాంధ్ర గ్రంథములను రచించెను. ఏకశిలానగరమున నాకాలమునందుండిన సాంఘిక నైతిక పరిస్థితుల నభివర్ణించుచు నీతఁడు సంస్కృతమున "ప్రేమాభిరామ" మనురచింప, వినుకొండ వల్లభామాత్యుఁడు దానిని "క్రీడాభిరామ"మను పేరిటఁ దెనిగించెను.

మారన:— కవిబ్రహ్మయగు తిక్కనసోమయాజికీతఁడు శిష్యుఁడు. ఈకవి యాంధ్రమున "మార్కండేయపురాణము"ను రచించి ప్రతాపరుద్రచక్రవర్తి సేనానులలో నొక్కఁడగు నాగయగన్న మంత్రికంకితము చేసెను.

భాస్కరకవి:— సుప్రసిద్ధాంధ్ర గ్రంథమగు భాస్కరరామాయణ మీతని పేరనే బరగుచున్నది. ఆగ్రంథమును రచించిన వారిలో నీతఁడగ్రగణ్యుఁడు. దీనికిఁ గృతిభర్త చక్రవర్తి యశ్వదళముల కధిపతియగు సాహిణిమారుఁడు. కొందఱు పండితు లీతనిఁ దిక్కనసోమయాజికిఁ బితామహుఁడగు మంత్రి భాస్కరునితో సరిచేయుచున్నారు. కాని 12 వ శతాబ్దమధ్యభాగమునందుండిన యామంత్రిశేఖరుఁడు 13 వ శతాబ్దితుదిభాగమునను 14 వ శతాబ్దిమొదటిభాగమున నుండిన సాహిణిమారుని యాస్థానమునందుండుట పొసగనేరదు. భాస్కరకవి యొక్కయరణ్యకాండమును మాత్రమే రచించియుండెను. ప్రతాపచరిత్రాదులు సాహిణిమారునితోఁగూడ భాస్కరుఁడును చక్రవర్తి కాలమునం దుండినట్లు పేర్కొనుచున్నవి. కవితాప్రశస్త్యముఁ బట్టి యీతనికి తరువాత కవులు తిక్కనవారితో సరియగు స్థానము నొసంగినట్లనేక గ్రంథములనుండి తెలియుచున్నది. భాస్కరకవికి, రామాయణమునందలి యితర భాగములను వ్రాసిన మల్లికార్జునకవి పుత్రు

187 ఇతీవం ధ్యామాస వీరభల్లటదేశికః।
ప్రతాపరుద్రదేవస్య సన్నిధా సర్వశాస్త్రవిత్॥

188 Catalogue of Sanskrit and Prakrit Manuscripts in C. P. & Berar Hiralal, p.XX X V II.

డును, కుమారరుద్రుడు శిష్యుడును, అయ్యలార్యుడు మిత్రుడును నై యుండిరి. ఇటులు పుత్రమిత్రభాతృలతో గూడి భాస్కరరామాయణమును రచించి యీకవి యాంధ్రలోకమునకు మహోపకారము నొనర్చియుండెను.

ఏకామ్రనాథుడు:— ఈతడుగూడ ప్రతాపరుద్రచక్రవర్తియాస్థానమునందుండెనని యీతడు రచించిన ప్రతాపచరిత్రమునుండి తెలియు చున్నది. ఈయంశము విచారణీయము.

సేనానులు:— కాకతీయాంధ్ర సామ్రాజ్యమును మధ్యయుగమునందలి యాంధ్రుల ప్రతిభావిశేషమును, శూరశిఖామణులును స్వామిభక్తిపరాయణులునగు సేనానులపై నాధారపడియుండెను. సింహాసనము నధిష్ఠించిన యేలిక స్త్రీయైనను అసమర్థుడైనను, పరిపాలకుడు సామ్రాజ్యమునం దుండకుండినను గూడ నీ యోధాగ్రేసరులును, ప్రజ్ఞాసముద్రులగు మంత్రివరులును జేరి, యాంధ్ర సామ్రాజ్యము నవిచ్ఛిన్నముగ గొనసాగించుచుండిరి. అందువలననే సామ్రాజ్యవిస్తరణ మొకవంకను, శత్రురాజవిద్రావణ మింకొకప్రక్కను, జరుగుచుండినకాలమునం గాకతీయ సామ్రాజ్యమున శాంతివాతావరణ ముండుటయు, కవితాశిల్పాది విజ్ఞాన మభివృద్ధి నందుటయు, సంభవించినది. రాజ్యక్షేమమునే దమక్షేమముగను, స్వామి కార్యధురంధరత్వమే తమ స్వార్థమునను నెంచి, శాశ్వతకీర్తి నందియుండిన ప్రతాపరుద్రచక్రవర్తికాలపు మంత్రి సేనానాయకాది యుద్యోగుల చరిత్ర మీప్రకరణమునం జర్చింపబడుచున్నది.

నాగయగన్నమంత్రి:— కమ్మకులజుం డగు నీసేనాని యేకశిలానగరమునకుం బాలకుడుగ నుండెను. ఆంధ్రకవుల చరిత్రమునందీ గన్నమంత్రి మడికిసింగనకవిచే బద్మపురాణమునుం గృతినందిన కందనమంత్రికిం బితామహుడగు గణపతిమంత్రికి సోదరుడని చెప్పబడియున్నది. మారనకవి తనమార్కండేయ పురాణమునందీ గన్నమంత్రి చతుర్థకులజుడని చెప్పియుండుటచే నీతడు నియోగి బ్రాహ్మణుడను కవిజీవితకారుని యభిప్రాయము సరియైనది కానటుల దెలియుచున్నది. గన్నమంత్రి తననిరుపమ యుద్ధనైపుణిచే బ్రతాపరుద్ర చక్రవర్తినుండి యధికార విశేషమును వడసెను. ఈతనికి మేచయనాయకుడు, ఎల్లయనాయకుడు ననునిర్వురు సోదరులుండిరి. వారిలో మేచయ చక్రవర్తికి మహాధికారిగ నుండెను. వెలనాటను రాజప్రతినిధిగ నుండిన సుప్రసిద్ధ సేనానియగు దేవరినాయనింగారీతని పుత్రుండు.

ఇందులూరి అన్నయ:— ఈతడు ప్రతాపరుద్రచక్రవర్తియధికారవర్గమునం దగ్రగణ్యుడు. శివయోగసారమునందీతని గీర్తిశౌర్యము లభివర్ణింపబడి యున్నవి. గణపతిదేవరుద్రాంబికలకు మంత్రియు దండనాథుడు నై యుండిన కొలని సోమయమంత్రి తనయుడగు గన్నమంత్రికిని గౌరమకు నీతడు జన్మించెను. మహాశక్తిసంపన్నుడగు నొక యోగిపుంగవుని కీతడవతారము. మోపూరిరాజులనుగెల్చి రాయచౌహత్తమల్లబిరుదమును, పెక్కుదుర్గములను గొనుటచే స్థలగిరివనదుర్గజలకోటమల్ల బిరుదము నీతడు బొందెను. తురకలతోడి యుద్ధములయం దద్వితీయపరాక్రమమును జూపి చక్రవర్తిమన్ననలను బడసెను. అదియుగాక నాబ్రాహ్మణమంత్రి రుద్రాంబిక ద్వితీయపుత్రికయగు రుయ్యాంబను బెండ్లాడెను. ఐదులక్షల కాల్బలమున కధిపతియై యీతడు సింహాచలమునుండి యోరుగల్లు వరకును గల

ప్రదేశము నేలెను. కళింగదేశాధీశ్వరు డీతని బాహాదర్పమునకు దాళజాలక బలాయితు డయ్యెను. ఈమంత్రి కళింగమునందలి మహేంద్రగిరిమొదలు దక్షిణమున గృష్ణానదివరకును గల ప్రదేశమునం దారామతటాకాది ప్రతిష్ఠ లన్నిటినో జేసి దేశప్రజాహితము నభివృద్ధి పఱచెను. తన యేలుబడిలో నుండిన దుర్గము లందు బంధుల నొందరినో యధిపతులుగ నియమించి యీతడు రాజత్వము ననుభవించు చుండెనని తెలియుచున్నది.

ఇందులూరి రుద్రుడు:—ప్రతాపరుద్ర చక్రవర్తి సేనానులలో నీతడు గడుఁబ్రసిద్ధి నంది సామ్రాజ్యమునకు మూలాధారమై యుండెను. ఈతడు బ్రాహ్మణుడు. ఈతడు గన్నమంత్రికి మల్లమాంబిక యందుజన్మించెను. శివయోగసార మీతడు సకలాగమప్రాజ్ఞు డని దెలుపుచున్నది. ప్రతాపరుద్రచక్రవర్తి పంపున ద్రవిడదేశమునకేగి పంచపాండ్యులను జయించెను. ఓలచెర్ల, కంచెర్ల, తుని, చేబ్రోలు, దేవపురము, సూరవరము, రాజమహేంద్రవరము, కొరుముసూరు, చామెర్లకోట, బెండపూడి, పిఠాపురము మున్నగు స్థలములందలి దుర్గము లీతనిచే జయింపబడినవి. బాహత్తరి దుర్గనాయక, నాయగదావిళ్ళి, రాయచౌహత్తిమల్ల, కాళింగరాయవిభాళ యను బిరుదము లీతని కుండెడివి.

బెండపూడిఅన్నామాత్యుడు:-ఈతనిమను మడును, వీరభద్రారెడ్డిమంత్రియునగు నన్నమంత్రికిఁ దన భీమపురాణమునుఁ గృతియొసంగు సందర్భమునఁ శ్రీనాథుడీ యన్నామాత్యునిఁ బ్రశంసించి యున్నాడు. దానినుండి యీమంత్రిశేఖరుఁడు చక్రవర్తి గజబలంబుల కధ్యక్షుడనియు నాంధ్రరాజ స్థాపకుండనియుఁ బ్రతాపరుద్రునికిఁ దక్షిణ భుజమనియు, యవనులపాలిటి కాలాగ్నిహోత్రుఁ డనియునుఁ దెలియుచున్నది. క్రీ. శ 1319. ప్రాంతమునఁ గాకతీయులకును, కంపిల రామునికినిఁ జేరిగిన యుద్ధము నందీతడు పాల్గొని యుండెను. బహుశః నీమంత్రిప్రవరుడు తురుష్కులతోడి యుద్ధములలో నిహతుడయి యుండును.

ముప్పిడి నాయకుఁడు:—ఈతడొక సుప్రసిద్ధ సేనానాయకుఁడు. వెలమకులజుడని తోచుచున్నది. మహ్మదీయు లుత్తరదిశనుండి దండెత్తిన సమయమున దాక్షిణాత్యులు కాంచీనగరముపై బడి యచ్చటి కాకతీయ సామంతుఁడగు మనుమగండ గోపాలునిఁ బారదోలి యానగరము నాక్రమింప, నీసేనాని చక్రవర్తి పంపున దక్షిణమున కేతెంచి పాండ్యులజయించి, యాంధ్రసామంతునిఁ దిరిగి కాంచీనగరమునఁ బ్రతిష్ఠించెను. రెండవతూరి కేరళదేశాధీశ్వరుఁడగు రవివర్మ యీమనుమగండ గోపాలునిఁ జంపి కాంచి నాక్రమింప ముప్పిడినాయకుఁ డాతనిఁగూడ నిర్జించి, మానవీరుని కాంచీసింహాసనమునఁ గూర్చుండఁ జేసెను. శాసనములనుండి యీసేనాని పాకనాడును, తొండమండలమునుఁ బ్రతాపరుద్రునికిఁ బ్రతినిధిగ పాలించుచుండినటుల దెలియుచున్నది. ఈతని అరులల్ పెరుమాళ్ శాసనమునుండి యీతని తండ్రి నాగినాయఁడనియుఁ దల్లి గంగసానమ్మ యనియు, నీతడు క్రీ. శ. 1316. లో మానవీరునిఁ గాంచిలో నభిషిక్తునిఁ జేసెననియు స్పష్టమగుచున్నది.

సాహిణి మారుడు:—ప్రతాపరుద్ర చక్రవర్తి యాస్థానమునందలి ముఖ్యోద్యోగులలో

నీతఁడు ముఖ్యుఁడుగ బ్రాచీన చరిత్రములలో పేర్కొనబడి యున్నాఁడు. చక్రవర్తి యశ్వదళములీతని స్వాధీనమునందుండెడివి. ఈతనికి సుప్రసిద్ధాంధ్ర గ్రంథమగు భాస్కరరామాయణము కృతిసేయబడి యున్నది. సాహిణిమారుని పూర్వికులఁగూర్చి కొన్ని సందియములు గలవు. పై గ్రంథమునందలి యయోధ్యకాండలోని యాద్యంతములనుండి బుద్ధయ కాచాంబికయను వారలీతని తలిదండ్రులని తెలియుచున్నది. కవిజీవితకారు లీతని వంశవృక్షము నీక్రిందివిధమున నిర్ణయించి యున్నారు.

కోసకాట ధరణీశుఁడు
|
రుద్రుడు
|
బుద్ధరాజు
|
విఠ్ఠల ధరణీశుఁడు
|
బుద్ధరాజు
|
సాహిణిమారుడు

కాచవిభుడు. విఠల రాజునను నిర్వురు సోదరులు ద్విపదకావ్యమగు రంగనాథరామాయణమునురచించి, తమతండ్రియగు బుద్ధారెడ్డి కంకితమొనర్చియుండిరి. సాహిణిమారుడును బుద్ధారాజు కొడుకయియుండుటచే నాతఁడీ రామాయణ రచియితులకు సోదరుడని చెప్ప వలసి యుండును. కవిజీవితకారులు మారుని తండ్రియు బుద్ధారెడ్డియు నొక్కరు కారని యభిప్రాయపడియున్నారు. ఆంధ్రచరిత్రకారు లివిషయమునుచర్చించుచు, రంగనాథరామాయణ రచయితలుఁ సాహిణిమారునంతటి ప్రఖ్యాతసేనాని దమకు సోదరుడైయైనచో నాతని దప్పక బ్రశంసించియేయుందురనియు, వారలటు చేయకుంటయె నీసంబంధము సరియైనది కాదనుటకుఁ బ్రమాణమనియు, నభిప్రాయపడియున్నారు. ఈవిషయమును భావిపరిశోధకులవలన నేనిర్ణయింపవలసియున్నది.

కాయస్థసేనానులు:— కాకతీయచక్రవర్తులకుసుప్రసిద్ధవీరవంశములను దమకొల్వునందిడికొని పోషించుచుండు టాచారమైయుండెను. అట్టివానిలో నీకాయస్థకుటుంబము మిగులముఖ్యమైనది. గంగసాహిణియను నాతడు గణపతిదేవచక్రవర్తి కాలమున పానుగల్లునుండి మార్జవాడివఱకునుఁగల భూభాగమునంతటిని సామంతుడుగఁ బాలించుచుండెను. ఆతనియనంతరమున జన్నిగదేవుఁడు ములికినాడు, పొత్తపినాడు, గండికోటమున్నగు ప్రాంతములనేలుచు, రుద్రాంబికకుదక్షిణభుజముగనుండెను. ఆమహారాజ్ఞకాలముననుఁ బ్రతాపరుద్రదేవుని కాలమునను త్రిపురాంతకాంబదేవు లనునాతని సోదరులు వాసికెక్కియుండిరి. వీరిలోనంబదేవుడు ప్రఖ్యాతుఁడు. శాసనములనుండియు స్థానిక చరిత్రములనుండియు గూడ నీతడాకాలమునందనేక సామంతపాలకులపై దనయధికారమును నెరపుచుండెననియు, దూరమునందుండిన దేవగిరియాదవులు గూడ నీతని యనుగ్రహమునభిలషించియుండిరనియు, దెలియుచున్నది. ఈతని యాజ్ఞానుసారము పెద్దనాయకుఁడను నతడు పొత్తపినాడులోని భూముల నన్నిటినికొలిపించి, యనేకవిధముల విభజించి వానిపై పన్నుల నేర్పఱచినటుల స్థానికచరిత్రములనుండి దెలియుచున్నది. క్రి. శ. 1304. ప్రాంతమున వీరలు ప్రతాపరుద్ర చక్రవర్తిపై తిరుగుబాటు చేసిరి. గుండయ నాయకుడును, మాచయ నాయకుఁడును, వీరి విద్రోహము నణంచిరి. క్రీ. శ. 1304 నకుఁబిమ్మట వీరినా

మనులు గన్పడకుండుటచే వీరలాసంవత్సరమున సమసియుందురని తోచుచున్నది వీర శైవ మతావలంబులగు నీసోదరులు శ్రీశైల త్రిపురాంతకాది దేవాలయములకుఁ బెక్కు ధర్మముల నొనర్చియుండిరి.

రేచెర్లవంశీయులు:—కాకతిరుద్రుని కాలమునఁ బ్రబలిన యీవంశము తరువాతి చక్రవర్తులకాలమున విశేష విఖ్యాతి నందెను. ప్రతాప రుద్రదేవుడు పద్మనాయకులనే రాజ్యాంగ నియోగముల కధిపతులఁ జేసియుండుటచే పద్మనాయకులగు నీవంశమువారీ చక్రవర్తి కాలమునఁదమశౌర్యసంపదలతోడు రాజాశ్రయమునుగూడ నందియుఁడిరి. ఈకాలమున బ్రకృత నైజాంరాష్ట్రమునందలిరాచకొండ ప్రాంతమును ఎఱ్ఱదాచానాయుడు నల్లదాచానాయుడు నను నిర్వురుసోదరులు, రాజప్రతినిధులుగఁ బాలించుచుండిరి. పాండ్యులు దక్షిణమున నొత్తిడికలుగజేయుచుండిన సమయమున నీయెఱ్ఱదాచానాయుడు చక్రవర్తి పనుపున వారిపై దాడివెడలి, వారల నోడించి, ధనకనకవాహనాదులఁ గొల్లగొని తనయేలికకర్పించెను. సంతుష్టుడై చక్రవర్తి యాతనికి "పంచపాండ్యదళవిభాళ" "కాంచీకవాట చూఱకాఱ" యను బిరుదములనొసంగెను. ఎఱ్ఱదాచానాయుని దాయాది యగు సింగమనాయుడు గూడ నీచక్రవర్తి కాలమునఁ ధైర్యసాహసములకుబ్రఖ్యాతి కెక్కియుండెను. దేవర కొండప్రాంతమునకుఁ బ్రతినిధిగనుండిన యీతడు క్రీ. శ. 1319 లో జేరగిన కంపిలయుద్ధమున బేడపూడి యన్నామాత్యునితో బాల్గొనియుండి కాకతీయ బలములకునాయకుడుగ నుండినటులొక కన్నడలిఖితగ్రంధమునుండి తెలియుచున్నది.

పైనుదహరింపబడిన వారలేగాక ప్రతాపరుద్రచక్రవర్తి కాలమున సోమయవెంక, బమ్మనాయనింగారు, అన్నయపెగ్గడ, రుద్రనాయకుడు, మాయిదేవులెంక, మున్నగు ననేకులగు సేనానులుండిరి. శాసనములనుండియు స్థానికచరిత్రములనుండియు నీక్రిందిప్రతినిధులు సామ్రాజ్యమునందలి వివిధభాగముల నేలుచుండినటులఁ దెలియుచున్నది.

| | | |
|---|---|---|
| కోలనిరుద్రుడు, | ఏకశిలానగర సింహాచలమధ్యదేశము | |
| అన్నువెంక | మెదక్ సీమ | 1294 |
| చేకొటి కొమ్మయ | కమ్మనాడు | 13¡2 |
| కామయ బొప్పనింగారు | ,, | 1304-11&13-23 |
| గొంకారెడ్డి | ములికినాడు, పొత్తపినాడు | 1309-23 |
| త్రిపురాంతి కాంబదేవులు | ,, | 1291-04 |
| పోతయసాహిణి | పాకనాడు | |
| గుండయనాయకుడు | కమ్మనాడు | 1299-11 |
| సోమయ వెంకంగారు | వెలనాడు | 1290-04 |
| మాచయనాయనింగారు | ,, | 1304-08 |
| దేవరినాయునింగారు | ,, | 1308-19 |
| ముమ్మడివట్టయ | పెదకల్లుసీమ | 1319 |
| ముప్పిడినాయకుడు | పాకనాడు, తొండమండలము | 1294-17 |

రాజ్యపరిస్థితులు:—ఆదినుండియుఁ గాకతీయరాజులు దేశవిస్తీర్ణము నెక్కుడుచేసియు, శత్రువులను విద్రోహుల నణంచియు, వాణిజ్యాదుల నభివృద్ధి పఱచియు, దేశమునందెల్లపుడును శాంతిని ప్రబలజేసియు, ప్రజాక్షేమమునకై పాటుపడు చుండుటచే నాంధ్రదేశమునఁ బ్రజలుశాంతిసంతోషముల నోలలాడుచు, దమయార్థికజీవనము నభివృద్ధి పఱచుకొనుచుండిరి. దానఁజేసి తాత్కాలి కాంధ్రదేశము సస్యసమృద్ధమనియు మహదైశ్వర్యయుత మనియు దేశదేశములను ఖ్యాతివడసియుండెను. గణపతిదేవచక్రవర్తి కాలమునకే

ఇట్టి యుత్కృష్టదశనంది యీదేశము రుద్రాంబా ప్రతాపరుద్రుల కాలమునం దధికశోభావంతముగ నుండెనని యనేక ప్రమాణములనుండి తెలియుచున్నది.

కేంద్రప్రభుత్వమునకు చక్రవర్తియే యధిపతిగ నుండెను. స్వేచ్ఛాధికారమును గలిగి యుండియు నాతడు ధర్మశాస్త్రానువర్తియై ప్రజానుకూల్యము నాసించుచు వారియసంతుష్టికి వెఱచుచుండెను. వివిధరాజ్యాంగ విషయముల నాతనికి తోడ్పడుచుం బరిపాలనా విధానమును నిర్వర్తించుట కనేకప్రధానులును మహాప్రధానులు నుండిరి. రాజకీయ నియోగమునకు వలెనే చక్రవర్తి సర్వసైన్యములకును నియంతయై యనేక సమయములలో స్వయముగ యుద్ధరంగముల కేగుచుండినను, సేనానాయకాద్యనేకోద్యోగులుగల సైనిక నియోగమొకటి ప్రత్యేకముగ నుండెడిది. ఇదియగాక నాకాలమున డెబ్బదియేడు రాజ్యాంగనియోగము లుండెడివనియు నొక్కొక నియోగమున కొక్కొకనాయకు డధిపతిగ నుండెననియుం బ్రాచీనవంశ చరిత్రములనుండి తెలియుచున్నది.[189] ఈనాయకులును, వివిధరాష్ట్రములందలి ప్రతినిధులును సామంతులును చక్రవర్తికి లోనై యాతని యాజ్ఞానుసారము మెలగుచుండిరి.

పరిపాలనా సౌకర్యమునకై దేశమంతయు ననేక విభాగములుగ విభజింపబడి యుండెను. అట్టివిభాగములలో నాడు, సీమ, స్థలము, గ్రామము మున్నగునవి ముఖ్యములు. కమ్మనాడు ములికినాడు, పొత్తపినాడు, పాకనాడు వెల్నాడు మున్నగు నాడులును, గండికోట సీమ కొరుకొండసీమ మొదలగు సీమలును, పెల్నాటిస్థలము పింగళిస్థలము గుడివిండాల స్థలము మొదలగు స్థలములు నాకాలమునం దుండినటుల శాసనములనుండి తెలియనగుచున్నది. ఒక్కొకనాటిపై నొక్కొకరాజప్రతినిధియుండెను. వీని నియమించుటలో చక్రవర్తియొక్క దూరదృష్టిగలిగి యుండెను. దక్షిణదేశమునకు ద్వారమువలె నుండు గండికోట సీమకు మహాశూరుడును రాజభక్తిపరాయణుడునగు పట్టసాహిణిసోమయనాయకుడు నతనికిం బిమ్మట చక్రవర్తి తనయుడగు[190] జుట్టయలెంకాగొంకరెడ్డియును ప్రతినిధులుగ నియమింపబడి యుండిరి. అటులనే యుత్తరదిశను కళింగగాంగరాజ్యమునంటి యుండిన సింహాచలప్రాంతమునకు చక్రవర్తి తన పినతల్లిభర్తయు,[191] రాజనీతిజ్ఞుడునగు బెండపూడి యన్నామాత్యునిం బ్రతినిధిపాలకునిగ జేసెను. నూతనముగ నడవులనిర్మూలించి నిర్మింపబడిన కర్నూలుజిల్లాలోని గ్రామములపై విశ్వాసనీయులగు నేకశిలానగరవాసుల నీ ప్రతాపరుద్రదేవుడు పాలకులం జేసెను.[192]

ఇతరస్థలములందలి ప్రతినిధుల నొకచోటి

189 ప్రతాపచరిత్రము నందీకాలమునం 77 నియోగములుండెడివనియును ప్రతాపరుద్రుడు వానికి 77 గురు పద్మనాయకులను నాయకులుగ నియమించి యన్యజాతినాయకులను తొలగించెననియు చెపబడియున్నది.

190 స్థానిక చరిత్రము లీసంబంధమును పేర్కొనుచున్నవి. వానిలో నిట్టివే కొన్ని శాసనములుకూడ గానవగుచున్నవి. వీని విశ్వాసార్హతను భావి పరిశోధకులు స్పష్టీకరింపవలసియున్నది.

191 ప్రతాపచరిత్రమునం దీవిషయము చెప్పబడియున్నది. విమర్శనీయము.

192 L. R. Kurnool.

నుండి మఱియొకచోటికి తఱచుగ మార్చును, దానును న్యాయముగ వారి ప్రవర్తనలను చారుల ముఖమునఁ గన్గొనుచు నీతడనేకవిధముల నౌద్యోగికసామర్థ్యము నభివృద్ధిపరచుచుండెను. స్థానికోద్యోగులందరును యుద్ధసమయములలో తమసేనలతో గూడ దేశసంరక్షణార్థమై చక్రవర్తి సాహాయ్యమున కేగుచుండిరి.

సామ్రాజ్యమంతటికిని గ్రామపరిపాలనము మూలస్తంభముగ నొప్పుచుండెను. దేశము ప్రశాంతముగ నుండినను, ఘోరయుద్ధములు జరిగినను కేంద్రరాష్ట్రీయ పాలకులు పరివర్తనమందినను, గ్రామజీవిత మవిచ్ఛిన్నముగ సాగుచుండెను. రెడ్డి, కరణము, తలారి, మున్నగువారలు గ్రామమునందలి ముఖ్యోద్యోగులు. వీరుగాక పన్నులను విధించుటకై ఆయగాండ్లును, వాణిజ్యముపైనను యెగుమతి దిగుమతులపైనను సుంకములను విధించు స్థలసుంకాధికారులును గూడ నుండిరి.[193] వీరు దీనికి ప్రతిఫలముగ జాతికట్టు మాన్యములును కొన్ని సమయములలో ధాన్యమును గూడ నొసంగబడుచుండెడివి. ప్రతిగ్రామమునందును లెక్కలలో గ్రామపరిమితి, గ్రామాదాయము, గ్రామసరిహద్దులు, పన్నులులేని భూములు, తోటలు, చెఱువులు, మున్నగు ననేకవివరములు వ్రాయబడుచుండినటుల స్థానికచరిత్రములనుండి తెలియుచున్నది.[194]

శాసనము లాకాలమునందలి యార్థికపరిస్థితులను గూర్చి యనేక విశేషములను తెలుపుచున్నవి. భూపరిమితి గడ, తూము, పుట్టి, మఱ్ఱు, మున్నగువాని లెక్కను పరిగణింపబడుచుండెడిది. సాధారణముగ వరిచేలను తూముల వంతునను మెరకభూములను పుట్లుగను, పరిగణించుటప్పటియాచారమై యుండినటుల దేవరినాయనింగారి శాసనములనుండి తెలియుచున్నది. నివర్తనమనునది మఱియొకకొలత. భూమియంతయు నీరు నేల వెలిపొలమునని విభజింపబడియుండెను.[195] వ్యవసాయము విశేషముగ చెఱువులపై నాధారపడి యుండుటచే నాకాలపు రాజులును సామంత ప్రభువులును, ధనికులును పాఖాలరామప్ప తటాకములవలె పెద్దపెద్ద జలాశయములను నిర్మించుచుండిరి.[196] పన్నులు సాధారణముగ ధాన్యరూపముననే వసూలు చేయబడుచుండెడివి. నీరు నేలపై పన్నునకు "కోరు" అనియు వెలిపొలమైనచో "పుట్టిపహిండి" యనియు పేర్లుండెడివి. ఇవిగాక కానుక, చిల్లర, పుల్లరి, సుంకము, అంగటి ముద్ర సుంకము, నను నితరములగు పన్నులు గూడ గ్రామములలో వసూలుచేయబడుచుండెడివి.[197]

రాజులకు కృషిమూలముననే గాక వాణిజ్యమునుండియు విశేషాదాయము వచ్చుచుండెడిది. ఆకాలమున సామ్రాజ్యమునందలి

193 E. R. 630 Of 1911.

194 స్థానిక చరిత్రములలో ప్రతి గ్రామచరిత్రమున నీ వివరములను గాంచనగును.

195 దక్షిణహిందూదేశ శాసన సంపుటములందలి శాసనాంత్య భాగములను జూచునది.

196 జగత్కేసరి చౌండసముద్రము వంటి జలాశయములను గూర్చి నైజాంరాష్ట్ర శాసనములలోని రేచెర్ల వంశీయుల పిల్లలమఱ్ఱి నాగులపాడు శాసనములను, దక్షిణహిందూదేశ శాసనములను జూచునది.

197 Nel. Ins. O. 58, 89, Kurnool Dt. Manul See. II Ep. Ind. V. p. 23.

ఈకాలపు టార్థికపరిస్థితులను శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు 1926 నాటి ఉగాది సంచికలో నొక వ్యాసమున ప్రశంసనీయముగ వర్ణించి యున్నారు.



ముక్త్యాల వెంకటకృష్ణయ్యగారు.

వివిధభాగములకు వర్తకసామగ్రులు దున్నపోతులు యెడ్లు గాడిదలు మున్నగువానిపై నెగుమతి చేయబడుచుండెడివి. ఓరుగల్లుమున్నగు ప్రధానవర్తకస్థానములలో నొక్కొక్కజంతు వృషభమోయబడు సరకున కింతయనియును, వర్తక సామగ్రి యొక్క విలువను బట్టియు సుంకము భేదించుచుండెను. ఇయ్యది సాధారణముగ గ్రామమునకుఁ బ్రవేశించునపుడు వర్తకుల వద్దనుండి వసూలు చేయబడుచుండెను.

కాకతీయ చక్రవర్తుల నాణెములు మిక్కిలి మనోహరములుగనుండెడివి. వానిపై నొకనందియు, దానికిరుపార్శ్వములను రెండు చామరములును గన్పించుచున్నవి ప్రతాపరుద్రచక్రవర్తి మాడలను బంగరు నాణెములను, పణములను వెండినాణెములను, ముద్రింపించెను.[198] ఇవిగాకఁ బ్రతాపమాడలను ప్రత్యేక స్వర్ణనాణెములున్నటుల పావులూరి మల్లనకవి పేర్కొనియున్నాడు. సామంతప్రభువులుగూడ ప్రత్యేకముగ నాణెములను నిర్మించుకొనుచుండిరి. కాంచీనగరము రాజధానిగ తొండమండలమునేలుచుండిన కాకతీయ సామంతుడగు గండగోపాలుడు "గండగోపాల మాడ"లను నాణెములను ముద్రించినటుల శాసనముల నుండి తెలియుచున్నది.

ప్రతాపరుద్రచక్రవర్తి తనప్రజల యార్థికాభివృద్ధికై యనేకవిధములఁ బ్రయత్నించి యుండెను. అరణ్యావృతములును గృషిదుస్సాధ్యములునగు కర్నూలుమండలమునందలి యనేక భూభాగముల నాతడు గృషియోగ్యముల నొనర్చెను. మహమ్మదీయులతో యుద్ధములవలనఁ దన ప్రజలకొదవిన నష్టములను బాపుటకై యీతడీప్రాంతమునందలి యడవులను నిర్మూలింపజేసి యచ్చట పెక్కుగ్రామములను నిర్మించెను. స్వయముగ నాదుర్గమప్రదేశములకేగి కొచ్చెర్లకోట దుర్గపరిసరములం దిరుగపకేతినాయడనునాతనిచే దూపాడను గ్రామమునునిర్మింపచేసి, నందికోటకూరను నూతనగ్రామమునకు కల్యాణీవాస్తవ్యుడగు సిరిసింగరాజు నధికారిగ నియమించెను. అటులనే చక్రవర్తి యాజ్ఞననుసరించి విడెము కొమ్మయ అనుమకొండ అన్న వెంక మున్నగువారలు పాలమఱ్ఱి,వనమాలపాడు, దామగట్లమొదలగు పెక్కు గ్రామములనిర్మించిరి. ఈభాగములకు జనుల నాకర్షించుటకై చక్రవర్తి బ్రాహ్మణుల కగ్రహారములను, శ్రోత్రియములను, దానముచేసియు, కాపులకు పన్నులు లేకుండగనే వ్యవసాయము చేసికొనుట కనుజ్ఞనిచ్చియు, ననేకవిధములఁ బ్రయత్నించి యుండెను.[199]

ఏకశిలానగరము:—ప్రస్తుతము నైజాంరాజ్యమునందొక మండలమునకుఁ గేంద్రస్థానమై, ఓరుగల్లు, ఒరంగల్లు అను నామాంతరములఁ గలిగి, యాంధ్రనగరియని విఖ్యాతినందియుండిన యేకశిలానగరము కాకతీయాంధ్రసామ్రాజ్యము మహోన్నత దశయందుండినపు డాంధ్రరాజధానియై యుండెడిది. సుస్థిరప్రాకారావృతము సుందరదేవాలయ సంయుతమునగు నీజీర్ణనగర దుర్గ మీకాలమునఁగూడ చూపఱులను విస్మయావిష్టచేతస్కులఁ జేయుచున్నది. అట్టిచో ప్రతాపరుద్రాది చక్రవర్తులకాలము నందీనగర వైభవమనుపమమై ఢిల్లీసామ్రాజ్యాధీశునికిఁ గూడ నసూయాశ్చర్యములను గల్పించెననుట యిసుమంతయు నతిశయోక్తి కానే

198. Elliot— Coins of South India p. 85

199. L. R. Kurnool.

రదు. అదృష్టవశమున నీమహానగరమునందలి జీవితవిధానములఁ గూర్చియు నిందలి నిర్మాణములఁ గూర్చియు వాఙ్మయమునఁ గొన్నివర్ణనములు మనకు లభ్యము లగుచున్నవి. విశేషించి యిచ్చటి జీర్ణదుర్గమునందింకను దేవాలయములు, శిల్పములు, ప్రాకారములు మున్నగు ప్రాచీనశిథిలములు గాంచనగుచున్నవి. పై ప్రమాణముల మూలమున నీ ప్రకరణమునం దేకశిలానగర చరిత్రము సంగ్రహముగ చర్చింప బడుచున్నది.

ప్రారంభమునఁ గాకతీయులకు వారంగల్లుకు నాలుగుమైళ్ళ దూరమునందున్న హనుమకొండ రాజధానిగ నుండెడిది. ఇచ్చటినుండియే త్రిభువనమల్ల బేతరాజును, కాకతిప్రోలుడు నాతని తనయుడగు రుద్రదేవుడును రాజ్యమేలియుండిరి. గణపతిదేవ చక్రవర్తిగూడ యీనగరమునుండియే చాలకాలము రాజ్యముచేసెను. అనుమకొండ రాజ్యము కాకతీయ సామ్రాజ్యముగ బరిణమించినపిమ్మట నేకశిలానగరమునకు రాజధాని మార్పబడియెను. ఈసంఘటనము జేరగి యాంధ్రనగరీ భావిభాగ్యోదయ మయినకాలమును నిర్ణయింప వీలగుచున్నది. శా. శ. 1174. నాటి యొకశాసనము గణపతిదేవు డనుమకొండనుండి రాజ్య మేలుచుండినటుల దెలుపుచున్నది.[200] కాని 1176 వశకసంవత్సరమునందలి యింకొక శాసనమునం దాతని రాజధాని యోరుగల్లుపట్టణమని చెప్పబడియున్నది.[201] దానినిబట్టి యా చక్రవర్తి శా. శ. 1174—76లకు సరియగు క్రీ. శ. 1252—1254ల నడుమ తనరాజధానిని మార్చినటుల స్పష్టమగుచున్నది.[202]

అంతకుఁ బూర్వమునుండియే యీనగరము ప్రసిద్ధిజెందియుండెను. కాకతిరుద్రుఁడు దనవిజయయాత్రలలో ననేకపట్టణములను నాశమొనర్చి వానిపేరిట నేకశిలానగరమునం దనేకభాగములను నిర్మించి పరాజితరాజ్యములందలి ప్రజల నందునివసింపఁజేసెను. రేచర్ల రుద్రసేనాని నాగతిరాజాది శత్రురాజులఁ జయించి దక్షాపనార్థ మోరుగంటను రుద్రేశ్వరాలయమును నిర్మించెను. ఈయోరుగల్లు పట్టణ నిర్మాణముఁగూర్చి ప్రతాపచరిత్రాదులీక్రిందిగాథను దెలుపుచున్నవి.

ఒకనాడనుమకొండకుఁ దినుబండములఁ గొనితెచ్చు బండ్లలోనొకటి నగర సమీపమునం దొక రాతికి దగిలి తలక్రిందులయ్యెను. అందలి యినుప పట్టియొకటి యాశిలకుఁదగిలి స్వర్ణముగ మారిపోయెను. ఈ విషయము దెలియవచ్చినతోడనే కాకతిప్రోలరాజు విద్వజ్జనముల తోడను పరివారముతోడ నావ్రదేశమునకేగి యాతాతినుండి దేదీప్యమానమగు నొక

---

200 E. R. 195, 223 & 273 of 1905—06 NEL. Ins. O. 28

201 E. R. 231 of 1905.

202 యింతకుమున్నే యేకశిలానగరము రాజధానిగ నుండెనేమోయను సందేహమును గొనిప్రమాణములు గలిగించుచున్నవి. అందుమొదటిది శివయోగసారములోని యొకపద్యము. అందుగాకతిరుద్రదేవుని బ్రశంసించుచు గవియిటుల వ్రాసియున్నాడు.

తరల|| అనుమకొండపురంబుగాదని యావిభుండిల నోరుగ
ల్లనపురంబు ఘటించి యచ్చటి కచ్చుగానకుడించి,

కొండపయాధారము నైజాంరాష్ట్రమునందలి బెక్కల్లుగ్రామములోని శాసనము ఇంను శా. శ. 1117 కు సరియగు క్రీ. శ. 1195 లో రుద్రదేవు డోరుగల్లునుండి రాజ్యమేలుచుండెనని చెప్పబడియున్నది. ఈశాసనపు ప్రతిబింబము శ్రీదూపాటి రమణాచార్యులవారివద్ద నున్నది. దీనినిసాకు



వరంగల్లుకోట——ఏకశిల.

[ By courtesy of H. E. H. The Nizam's Archaeological Department. ]

లింగ ముద్భవించుటఁగాంచెను. వెంటనే రాజాస్థలమునందొక మహోన్నత దేవాలయమును నిర్మింప నద్దేవుడు స్పర్శవేదియనియు, స్వయంభూదేవుఁడనియుఁ బేరుగాంచెను. అతిశీఘ్రముగ జనులా ప్రదేశమునకు వలసవచ్చుటచే నచ్చట నొక నగరమేర్పడియెను. అదియే ఓరుగల్లు పట్టణము.

గణపతిదేవుడు క్రీ. శ. 1254-56 నడుమనే కశిలానగరమును రాజధానిగ నొనర్చి నప్పటినుండియు నీగరము దినదినాభివృద్ధినందుచుండెను. ఆతడీనగరము చుట్టనొక లోతైన యగడ్తను త్రవ్వించెను. రుద్రాంబిక యిచ్చోటి శిలాసోపానములను, కోటలోపలి రాజభవనముల చుట్టునొక యిటుకగోడను నిర్మింపజేసెను. శిలా ప్రాకారమున కావలనుండిన మట్టిగోడపై నీమహారాష్ట్ర బురుజులు, దిడ్డిమున్నగు వానిని గట్టించి, గోడలపై నెల్ల రక్షకభటులు గావలియుండునటు లేర్పఱచెను. ప్రతాపరుద్రచక్రవర్తికాలమునం దీనగరము దివ్యభవనములతోడను, సువిశాల రాజమార్గములతోడను, సుందరదేవాలయములు, మనోహరములగు నుద్యానవనములతోడను, విరాజిల్లుచుండెను.[203] నిరుపమమగు నిట్టినగరమునఁ గవితల్లజులు భాషాయోషను లాలింపుచుండ, శిల్పులు తత్కృష్టజీవితాదర్శముల బ్రదర్శించి విజ్ఞానమును వెదజల్లుచుండ, ప్రజలు నిర్భయులై యనేకవిధములగు నుత్సాహకార్యములఁ బ్రొద్దుపుచ్చుచు, నానందాబ్ధినోలలాడుచుండిన యీ మహానగర మాకాలమున ఢిల్లీ సులతానునకే సంభ్రమాశ్చర్యములఁ గలిగించెననుటలో నతిశయోక్తియించుకైన నుగానరాదు. ప్రతాపరుద్రచక్రవర్తి కాలమునం దీనగరమునందుండిన విభాగములఁగూర్చియు, నిచ్చటి సాంఘిక జీవితమునుగూర్చియు, వల్లభామాత్యకృతమగు "క్రీడాభిరామ"మను గ్రంథమునుండి యనేక విశేషములు తెలియనగు చున్నవి.[204]

క్రీడాభిరామము వల్లభామాత్య కృతమని యాగ్రంథముననే పేర్కొనబడియున్నది. ఈకవి క్రీ. శ. 15. వ శతాబ్దమునందుండెను. ఈతనిగ్రంథము సంస్కృతమున త్రిపురాంతకకవి రచించిన "ప్రేమాభిరామ"మునకు భాషాంతరీకరణము. ఈత్రిపురాంతకుడును ప్రతాపరుద్రచక్రవర్తి కాలమునందుండినటుల పేర్కొనబడిన త్రిపురాంతకుడును, రావిపాటి తిప్పనయు నొక్కరేయని పండితుల యభిప్రాయము. గాన ప్రేమాభిరామమునందు ప్రతాపరుద్రుని కాలమునందుండిన యేకశిలానగర వర్ణనముండెననుట స్పష్టము. దాని భాషాంతరీకరణమగు క్రీడాభిరామమునఁగూడ నావిషయ

203 వల్లభామాత్యకృతమగు 'క్రీడాభిరామము' నందును మహమ్మదీయ చరిత్రకారుల వ్రాతలయందు నీప్రశంసగలదు.

204 ఈగ్రంథము త్రిపురాంతకకవి సంస్కృతమున రచించిన 'ప్రేమాభిరామము' నకు తెనుగుసేత గ్రంథమున వినుకొండ వల్లభరాయడీగ్రంథమును గూర్చెననియున్నది. కాని కొందరుపండితులు ముఖ్యముగ బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు శ్రీనాథకవి యీనాటకమునురచించెనని చెప్పుచున్నారు. దీనిని కొంతకాలముక్రిందట శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు ప్రకటించిరి. 1928 లో శ్రీశాస్త్రిగారు ప్రత్యంతరములనుబరీక్షించి మూలము నేర్పఱచియు, నీగ్రంథమునందలిపద్యములకును వృత్తమునకును సరియగు శ్రీనాథుని పద్యవృత్తములను గ్రోడీకరించి శ్రీనాథ కృతికర్తృత్వ నిర్వాహకమగు నుపోద్ఘాతమును జేర్చియు, మఱియొకప్రతిని ప్రకటించియున్నారు.

మే విశేషముగనుండునని స్పష్టమగుచున్నది. శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు దీనికర్తృత్వము వల్లభకవిది గాదనియు శ్రీనాథునిదేయనియు దమక్రీడాభిరామ పీఠికలో వ్రాసియున్నారు. ఇదియెట్లున్నను ప్రతాపరుద్రునికి సమకాలికుడగు కవి తాత్కాలిక రాజధానీపరిస్థితుల నభివర్ణించుచు రచించిన గ్రంథమునకిది భాషాంతరీకరణ మగుటచే క్రీడాభిరామము కాకతీయచరిత్రమునకు మిగుల ముఖ్యమైనది. మంచనశర్మ, టిట్టిభసెట్టి యనునిద్దరు మిత్రులుండిరి. వారిలో బ్రాహ్మణుడగు మంచనకు ఓరుగల్లులోని యార్యవాటమునగల కామమంజరి ప్రేయసియైయుండెను. కార్యాంతరాసక్తులై యన్యస్థలములదిరిగి మంచన దన మిత్రునితోగూడి యోరుగల్లునకు మరలివచ్చెను. వీరిద్దరునొక యుదయమున నగరమును ప్రవేశించి యందందు దిరుగుచు, నందలివిశేషములు గాంచుచు, రాత్రికి ప్రియాసమావేశమునకై యొకసాంకేతిక స్థలమునకుజేరిరి. వారలు గాంచిన దృశ్యములు, వారేగిన మార్గమును మనకు ప్రకృతమున మిగుల ముఖ్యములగుటచే వానినించుక వర్ణింపవలసియున్నది.

నగరబాహ్య ప్రదేశమున నిద్రించుచుండిన మిత్రులిద్దరును ప్రభాతసమయమునలేచి కాల్యకృత్యంబుల దీర్చికొనిరి. అప్పటికే సూర్యోదయమయ్యెను. ఇచ్చటినుండియే వారి కోరుగంటిపుర సౌధములు గన్పించినవి. అంత వారుపురంబు ప్రవేశించి వెలిపాళెముకట్టకడపట మేదరవాడకేగిరి. అచటవారికి మేదరకాంతయు, ఋతుస్నానార్థమేతెంచుచుండిన యొక చండాలాంగనయు గన్పించిరి. అటనుండి ముందునడచుచు వారు కర్ణాటాంగనం గాంచిరి. ఇటనుండియామిత్రులువాట్టమార్గమును బట్టిపోయిరి. అటులేగగా వారికి మైలసంతలో సుసరభేత్తను మందునమ్మ యువతిగన్పించెను. ఆపైనవారలు వెలిపాళెపు మధ్యప్రదేశమున హాలికవాటిలో నొకపామరభామను గాంచి, ముందునకేగి, వీథివిటంకమునందొకగంధర్వాంగనం గాంచి యింకను ముందునకేగి జూదమును, అటుపై నోరగ్రంతలో సంపెగనూనెనమ్ము కరణకాంతను, గానులకన్నెనొకరుకను జూచిరి. ఇచ్చటి కుత్తరంబున పువ్వులంగోరణములతోను, హంసలు మున్నగువానితోను, శోభిల్లుమందు మోహరివాడకేగి యచ్చటనొకకుట్రపువాసి జూచి, యావాడనుదాటి యుత్తరముగానేగి, యూరిర్చుట, పసుపునూరుటయు గాంచి ముందునకేగిరి. అప్పటికామిత్రులిద్దరును బాహ్యకటకపేథ నిటంకముల నతిక్రమించిరి. ఇచ్చటినుండి వారు లోపలియగడ్తను, ఆకోశముననుండుగోడను, క్రొక్కెరసిమునించిన వంకెదారిను, బంగారు తలుపులుగల సింహద్వారమును జూచి యచటి రథాశ్వశకటాదులనుండి దప్పుకొనుచు క్రమముగ వానినిదాటి లోభాగమునం బ్రవేశించిరి. అటుపై బహారుసమ్మర్దమగు రాజబాటను వదలి, వారు క్రంతత్రోవయగు నాలువరిక్రిందితోవగా నడిగిరి. అంబోవుచుండ వారలకు బల్మాటి వీరుల యాలయ మెదురయ్యెను. ఇచ్చటికి గొన్నియడుగుల దూరముననే ఏకవీరాగారముండెను. దీనిని దాటి బవనీడు, మాలెత, కాపుటాలు, జక్కులపురంధ్రి, అక్కలు మున్నగు వారల గాంచుచు జేని, మంచన టిట్టిభులు మైలారు దేవాలయము నచ్చటి సాహసకార్యములను గాంచిరి. ఇంకను, ముందలకేగి యటనుండి యామిత్రులు భైరవ, చముడేశ్వరీ వీరభద్ర బుద్ధదేవాలయములను, ముసానమ్మ,



నగునూరు దేవాలయము.

[By courtesy of H. E. H. The Nizam's Archaeological Department]

క్రొమురు సామయ్య, పాండవులు మున్నగువారల గుహలను, కొంచెము దూరముగా బ్రకాశించుచుండిన కేశవస్వయంభూదేవాలయములను జూడగలిగిరి. అటుపైని మిత్రులొక భైరవాలయమున కేగిరి. ఇప్పటికి మధ్యాహ్నమయ్యెను. రాజప్రాసాదమునుండి పదియారుఘడియలు వినవచ్చినవి. ఆకలిగొన్నవారై మిత్రులు భోజనమునుగూర్చి చింతించుచుండ నచటికి సమీపమునందుండిన బ్రాహ్మణవాడలో బూటకూటిండ్లు గుడిచివచ్చుచుండిన బ్రాహ్మణులొకరు వారికెదురయ్యెను. వారినుండి వృత్తాంతంబు రసి ముందునకేగుచు మిత్రులొక పుష్పోద్యానికం గనుగొనిరి. అటుపై వారు వేశ్యవాటికం బ్రవేశించిరి. అచ్చట బ్రతాపరుద్ర ధరణీంద్రుని ప్రాత్రి గోష్ఠీపాత్రీభూతసాహిణియగు మాచల్దేవియను వారాంగన గాంచి యామెతో గొంత బ్రసంగించిరి. అటునుండి నేగుచు నామిత్రులు గాంధారి యను మఱియొక వేశ్యగృహమును జొచ్చిరి. మంచనశర్మ దనపూర్వప్రేయసియగు నామెతోడను, నామెగూతురగు మదనరేఖతోడను గొంతప్రొద్దు పుచ్చెను. అటనుండి "వెడలి పచ్చమడికె నాల్గుగడియలంత ప్రొద్దుగలుగంగ నడుపీథి బోయి బోయి" పాముల యాటను, మేషయుద్ధమును, కోళ్ళపోరును, జూచి, "యటబోవుచు నాదక్షిణంబున" మనుమావతీ మదాలసలను వేశ్యల యిండ్ల గొంత విశ్రమించి చేనిరి. ఇప్పటికి సూర్యాస్తమయమయ్యెను. తమ సాంకేతికసమయము దగ్గరించుచుండుటచే నామిత్రులు, వేశ్యవాటికను, వీథి విటంకమునతిక్రమించి, వేగముగ నేగ నిశ్చయించి బయల్వెడలిరి. అట్టుల వేశ్యవాటి ననతిక్రమించి వారొక భైరవాలయద్వారమునం గొందరు విటులలో బయల్వెడలిన, దగవును దీర్చి జనచుండ రాత్రివచ్చెను. అయ్యది సుప్రసిద్ధమగు గోధూళికాలగ్నమగుటచే నామిత్రులిర్వురు నార్యవాటికం బ్రవేశించి "రథ్యాముఖశివచత్వరప్రాసాదమంటపంబులు విలోకించుచు" నేగిరి. అటనొక తమ్మళీసాని యింటికేగి మంచనశర్మ తనరాకను గామమంజరి కెఱింగించి, వీరభద్రేశ్వరాలయము వెనుక బ్రాహ్మణ బావియందు సంధ్యవార్చి, సుఖాసీనులై, ప్రియాగమము నెదురుజూచుచు, మిత్రునితో బ్రసంగించుచుండెను. ఇదియే మనకు బ్రకృతమునం గావలసిన కథాభాగము.

శ్రీదాభిరాముని పై మిత్రులిర్వురు నేగిన మార్గమే దిశనుండి యేదిశకేగెనో సమగ్రముగం జెప్పబడలేదు. కొన్నిస్థలముల మాత్రమే యూహింపగలము. దానిం బట్టి యుదాహృతములగు పురిభాగముల యునికిని నిర్ణయింపవలెను.

అంతకుం బూర్వ మాంధ్రనగరీ దుర్గపు బరిస్థితావస్థ నించుక వర్ణింపవలసి యున్నది. ఏకశిలానగర మిప్పటి వరంగల్లున కొక మైలు దూరమునందున్నది. కోటకు వెలుపల నొకమట్టి గోడయున్నది. అందునాలుగు ద్వారములున్నను పశ్చిమమున మాత్ర మొకశిలానిర్మితమగు ద్వారముగలదు. కోటలోనికిం బోవలెనన్నచో దీనిని దాటియే పోవలెను. దీని పైభాగమున నిటుకలతో నిర్మింపబడి గుండ్రని పిల్లగోడ యున్నది. నిర్మాణపై ఖరిని జూడ నియ్యది తురుష్కులచే గట్టబడినటులున్నది. ఈ ద్వారమునుం దాటి కొంతదూరమేగినచో శిలాప్రాకారముం గాంచనగును. గోలకొండ, భువనగిరి మున్నగు దుర్గములయందువలె నిచ్చటంగూడ నీ శిలాప్రాకారము మిక్కిలి బలిష్ఠముగ నున్నది. ఇందలి శిలల నతిక్రమించుటకు సున్నమువయో

గింప బడియుండలేదు. పెద్ద పెద్ద బండల నొక వైపు నున్నగఁజేసి, యొకదానిపై నొకదానినుంచి, వాని కిరుపార్శ్వములను చిన్న చిన్న శిలాఖండములఁబెట్టియు, నొకదానినింకొక దానిలోనికి దొలిచి దూర్చియు, నొకవరుసనునిర్మించిరి. ఆపై వరుసలోననేకములగు చిన్న రాళ్ళనుంచి, తిరిగి మూడవదానిలో పెద్దరాళ్ళనునిర్మించియుండిరి. ఇట్టి ప్రాకారములను, రెంటినిసుమారు రెండున్నర గజములదూరమున నిర్మించి వానినిసువిశాలమగు ఫలకములచేగలపియుండిరి. ఈవిధమునరథగజతురగపదాతివర్గము నడచినను చలింపని బలిష్ఠమగు నొక ప్రాకార మేర్పడియెను. ఈనిర్మాణపద్ధతికి Cyclopean Masonry యనిపేరు. ఈశిలాప్రాకారమునకు లోపలి భాగమున గోడనంటి యంతయెత్తునకు నేగు నొక శిలాసోపానపంక్తి కలదు. గోడ వెలుపల నచ్చటచ్చటఁ గన్పించు గోతులు కందకమునందలి భాగములైయుండ నొప్పును. ఈగోడకు పశ్చిమమున నందొక చేక్కడని ద్వారముగలదు. దాని కిరుపార్శ్వములను క్రింది భాగమున రెండుమకరములుగలవు. ద్వారములోని మార్గమతివక్రముగనున్నది. అందలిదూలములపైనను, గోడలోనిరాళ్ళపైననుఁ గూడ చేక్కడని నగిషీపనిగాంచేనగుచున్నది. రాతిగోడలో భాగమున గోటకు బశ్చిమదక్షిణముగగోడకు సమీపముగ "ఎర్రల్ గుడి"యనిపిలువబడు వీరులగుడిగలదు. ఈద్వారమునకెదురుగ "ఖుషీ మహల్"అని పిలువబడునొకవిశాలభవనముగలదు. ఇయ్యది మార్గమునకుఁగుడిభాగమునందున్నది. ఇచ్చటనుండికొంచెముదూరమేగినచో నొకజీర్ణమంటపము గానఁనగును. విశేషశిల్పకళానైపుణిఁజూపునీ మంటపమునందలి భాగములు చూపఱులకువిస్మయమునుఁగొలుపుచున్నవి. దీనికి నాల్గువైపులను దేదీప్యమానములును మనోహరములునగు నాలుగు మహోన్నత ద్వారములు గాంచేనగుచున్నవి. ప్రాచ్యశిల్పకళాభిజ్ఞుఁడగు ఫెర్గుసన్ పండితుఁడు వీనిని సాంచీస్థూపమునందలి ద్వారములకు సరిపోల్చియున్నాడు. కజిన్స్ అను నింకొకపండితుడు "ఈ ద్వారములు శిథిలములుగాక నితరభవనములతోఁగూడి యుండినపుడు గుజరాత్‌లోని సిద్ధమాత్ర దేవాలయమునకు సరియైయుండెడివనుటకు సందియములేదు" అని వ్రాసియున్నాడు.[205] వీనికించుక దక్షిణ పశ్చిమమున శంభుగుడిగలదు. ఈయాలయోపరిభాగము మెట్లుమెట్లుగ గట్టబడి, జైననిర్మాణమువలె గన్పడుచున్నది. దీనికిఁ దక్షిణముగ మేడ్రాయర్ గుడియున్నది. ఇది యొక వీరశైవాలయ మయియుండును. రోడ్డున కుత్తరమునను, జీర్ణమంటపమునకుఁ బ్రాగుత్తరముగను, వీరభద్రాలయము గలదు. ఇందలి గర్భాలయ ద్వారమున కిరుపార్శ్వములనుండిన ద్వారపాలకులిపుడు నేలపై పొఱలుచున్నారు. ప్రాఙ్ముఖమగు నీయాలయపు ముఖమంటపమున పదియారు స్తంభములున్నవి. కట్టడముసామాన్యమైనది. రోడ్డునకుఁ దుదిభాగమున, కోట తూర్పుద్వారమునకు సమీపమున విష్ణుగుడి యున్నది. ఒకప్పుడు మహావైభవము నంది యుండినయీదేవాలయ మిప్పుడు మహాదైన్యముగు నవస్థ ననుభవించుచున్నది. దీనికిఁ బశ్చిమమున వెంకటేశ్వరాలయమున్నది. ఇందు చేక్కడనిశిల్పము గాంచేనగుచున్నది. దుర్గమునకు ప్రాగ్దక్షిణభాగమున, శంభుగుడి కెదురుగ, రోడ్డునకుఁ గుడిభాగమునందొక యున్నత

205 Cousens—Autiquities of the Nizam's Dominions.

మగు శిలగలదు. దీనిపై నొకవిశాలమగు ముఖమంటపముగల దేవాలయమున్నది. దీని పై భాగమున శతఘ్నుల నుంచుటకనువగు దిన్నెలు కట్టబడియున్నవి. దుర్గమధ్యమునం దుండి త్వరితముగఁ జూపఱుల మనముల నాకర్షించు నీశిలారాజమునుండియే యీపట్టణమున కేకశిలానగరమను నామమువచ్చియుండును.

ఇంతవరకును క్రీడాభిరామమునుండి యేకశిలానగరమును గూర్చి తెలియు విషయములను పేర్కొని,ప్రకృతదుర్గమునందలి భాగములను వర్ణించియుంటిమి. ఇటుపై నాగ్రంథమున బేర్కొనబడిన భాగములను బ్రకృతదుర్గమున సరిపోల్చవలసియున్నది. టిట్టిభశెట్టియు మంచనశర్మయు సూర్యోదయమునుగాంచి వెలిపాళెము కట్టకడట మేదరివాడను బ్రవేశించిరి. అట్లనుటచే వారు పూర్వాభిముఖులై బశ్చిమమునుండి దూర్పున కేగియుండురని చెప్పవచ్చును. వారనుసరించిన మార్గము మైలసంత, హాళికవాటి యనువానినిదాటి యుత్తరముగా మోహరివాడకేగి, యటనుండి యుత్తరముగానేగి, బాహ్యకటకమునుదాటి, సింహద్వారముగుండా శిలాప్రాకారము నతిక్రమించి, యాలువరి క్రిందిత్రోవగానేగి, వీరుల గుడికి బోయినది, దానినుండి రాతిగోడలోని సింహద్వారమునకు సమీపముననే వీరులగుడి యుండెననియు, ద్వారమునకు దక్షిణముగ బాహ్యకటకమునందు మోహరివాడ, వెలిపాళెమునుండి నవనియు స్పష్టమగుచున్నది. ప్రకృతదుర్గమునందు శిలాప్రాకారపు బశ్చిమ ద్వారమునకు సమీపముననేవీరులగుడి (ఎర్రల్ గుడి)గలదు.అందువలనవీరులగుడియొక్క స్థితిని బట్టి మంచెనటిట్టిభు లిర్వురును బశ్చిమమునుం డియే ఏకశిలానగరమును బ్రవేశించిరని చెప్పవలెను. ద్వారమునుదాటగనే పై మిత్రులు ప్రక్కదారినేగిరి. వారుమొదటజూచిన వీరుల గుడి ద్వారమునకు దక్షిణమునందున్నది. గాన మిత్రులు దక్షిణముగ మరలియుందురు. శిలాప్రాకారము కొంతదూరము మాత్రము బశ్చిమముగనేగి యటుపై బూర్వదక్షిణముగ దిరిగి క్రమముగ దూర్పునకేగును. వీరుల గుడినుండి ముందునకేగుచు నావిటద్వయము ను ఏకవీరా, చముడేశ్వరీ, భైరవ, మసానమ్మ, కుమారస్వామి, పాండవులు మున్నగు దేవతల గుళ్ళనుజూచి యుండుటచే వారిదారి గూడ బూర్వదక్షిణముగనే యుండవలెను. అటకు దక్షిణమున తురకలమసీదుండెను. కొంతదవ్వుల కేశవ శ్రీస్వయంభూనికేతనములుం డినవి, ప్రస్తుత శంభుగుడి, విష్ణుగుడియునే పై యాలయములు, ఇయ్యవి రెండునుఁ బశ్చిమ ప్రాగ్దిశలనున్నవి. అనగా మైలారుదేవళమున నిలచి దక్షిణదిశకుదిరిగి మశీదును, తూర్పున కుదిరిగి విష్ణుమందిరమును, బశ్చిమముగా దిరిగి స్వయంభు దేవాలయమును నామిత్రులు జూచియుందురు. ఇటనుండియే వారఱాంధ్రాధీశుమోసాలపై మోసిన రెండెన్మిదులను వినిరి. ఈరాజప్రాసాద ముత్తరదిశ నుండవలెను. దీనినుండి వీరులగుడికిబిమ్మట మైలారు దేవాలయము ముఖ్యవిశ్రమ స్థానమనియు న చటకే దక్షిణమున మశీదును, దూర్పున కేశవనికేతనమును, ఉత్తరమున రాజప్రాసాదమును, పశ్చిమమున శంభుగుడియు నుండెడివని యు, స్పష్టమగుచున్నది. పిమ్మట నామిత్రులు బ్రాహ్మణవాడలో భుజించి, వేశ్యవాటికకేగిరి. ఇవిరెండును గోటదక్షిణ భాగమునం దుం

డవలెను. వేశ్యవాటికనుండి బయల్వెడలి యావిటులు భైరవాలయమును, రథ్యాముఖ సంచత్వర పరిపాలనములను విలోకించి యాగస్యహాటికం బ్రవేశించిరి. పిమ్మట మంచన వర్ణనయున్న వీరభద్రాలయము వెనుక భావిలోపల ధ్వసమయ్యెను. ఇప్పటి దుర్గమున శంభుగుడికి సమీపమున ప్రాగుత్తరముగ వీరభద్రాలయమున్నది. శంభుగుడి ద్వారము దూర్పునకుగల దు. దీనికి దక్షిణముగనే 'మేడరాయన్ గుడి' యను నొకయాలయమున్నది. దీనినిబట్టి కోట దక్షిణభాగము నందున్న వేశ్యవాటికనుండి యుత్తరముగా భైరవశంభుదేవళముల ప్రక్కగా బోవుమార్గము నీమిత్రులనుసరించిరనియు శంభువీరభద్రాగారముల చుట్టునుండిన ప్రదేశము అర్యవాటికయనియు స్పష్టమగుచున్నది.

పై సమన్వయమునుండి 14వ శతాబ్దమునాటి యేకశిలానగరదుర్గవిభాగములను, అందలి సాంఘికజీవితము నీక్రింది విధమున నిర్ణయింపవచ్చును.

(1) బాహ్యకటకము:—ఇయ్యది రాతిగోడకును మట్టిగోడకును మధ్యనుండు భాగము. ఇందు మోహరివాడ, వెలిపాళెమునను రెండు విభాగములుండెడివి. వెలిపాళెము కట్టకడపట, ననగా మట్టిగోడనంటి మేదరివాడ యుండెడిది. ఈమట్టిగోడ వెలుపల నొకయగడ్త యుండెను. ఇందుండిన జలమును వెలిపాళెములోని మేదరులు, ఛండాలురు మున్నగువారు స్నానాదులకై యుపయోగించుకొనుచుండిరి. ఈభాగమున గర్ణాటదేశీయులు గూడనుండిరి. మేదరివాడకు ప్రాగుత్తరముగ మైలసంతగలదు. ఇటుపై వెలిపాళెము మధ్యగా హోళికవాటి యుండెడిది. ఇందు కర్షకులుండిరి. పాడిపంటలు సమృద్ధిగనుండుటచే నిచటిస్త్రీలు గుమ్మములముందుగ పిడకల నెండించుచుండిరి. ఇంతవరకు నొకపెద్దబాటయుండినది. అటుపైన, అనగా, వెలిపాళెము ప్రాగుత్తరమున జనులు జూదము మున్నగు వానితో ప్రొద్దుబుచ్చుచుండిరి. ఈప్రదేశమున కుత్తరమున మోహరివాడగలదు. ఇది వేశ్యలుండెడి స్థలము. అలంకారాడంబరమును, శృంగారమునిచ్చట సర్వసామాన్యముగ నుండెడివి.

(2) సింహద్వారము:—శిలాప్రాకారమున బశ్చిమదిశను మోహరివాడకుత్తరమునందున్నది. ఎత్తగురాతిగోడచుట్టును, మిక్కిలిలోతైన యగడ్తయుండెడిది. పాముమెలికలవలె వంకరయైన దారిద్వారమును జేర్చును. ద్వారమున కుంగల పెద్దతలుపులు బంగారుతో చేయబడినవి. ఈమార్గమంతయు రథఘోటకశకటకరటియూథములచే బహుసమ్మర్దముగనుండెను.

(3) దేవాలయములు:—ఆకాలమున వీరపూజ బ్రచారములో నుండుటచే నొర్గల్లులో వీరులగుడి యుండెడిది. ఈయాలయము ముందరజేరి నాయకులు తాళవాద్యములతో పల్నాటివీరుల చరిత్రమును బాడుచు ప్రజల కుత్సాహము నొనగూర్చుచుండిరి. ఏకశిలానగరమున బ్రజాసామాన్య మేకవీరాదేవిని బూజించుచుండిరి. ఈమెకు ముండపాక, పెనుబాక, మాహురము, నాగివరము, పోలాస యను చోట్లగూడ నాలయము లుండెడివి. ఈమె జమదగ్నిముని భార్యయవతారమని తెలియుచున్నది. ఈయాలయమున కెదురుగ నిలచి యొకబవనీడు వాద్యములతోగూడ బరశురాముని కథను బాడుచుండెను. కామవల్లీ మహాదేవియను కామేశ్వరి నభీష్టావాప్తికై యప్పటిజను లారాధించుచుండిరి. మైలారుదేవుడుగూడ జనసామాన్యమున కిష్టదైవతము.



వారంగల్ కోట—సింహద్వారము.

By Courtesy of H. E. H. The Nizam's Archaeological Department.



వారంగల్ కోట — జీర్ణమంటపము.

By Courtesy of H. E. H The Nizam's Archaeological Department.

లలో నొక్కడుగ నుండెను. ఈతనిని భైరవునితో సమముగ బూజించుచు నీతనియెదుట భక్తులావేశపరులై యనేక సాహసకార్యముల నాచరించుచుండిరి. వీరలుగాక భైరవుడు, బయచేన్నాశక్తి, వీరభద్రేశ్వరుడు, బౌద్ధదేవుడు, ముసానమ్మ, కుమారస్వామి, పాండవులు మున్నగు దేవతలాకాలమునం దోరుగల్లు నగరిలో నారాధింపబడిరి. ఆట కేశవ స్వయంభుదేవులకు హేమశిఖరములుగల యాలయ రాజము లుండెడివి.

(4) గడియారము:— మహోన్నతమగు నాకతీయరాజ ప్రాసాదమునం దొకగడియారము నుండెడిది. గడియారమనగా నేటి కాలమునందువలె యాంత్రికముగాక ఘడియలు కొట్టబడు స్థలమని యర్థము. ఈ కాలపుశాసనములనుండి దేవాలయములలో గూడ నిట్టి గడియారము లుండెడివని తెలియుచున్నది. ఘటికాభమునందులు చెంబెనమినులను వినిరట. అనగా నదియారు ఘడియలగును. ఇట్లు నేటికిని సంస్థానములలో గంటలుకొట్టు నాచారము గలదు.

(5) పూటకూటిల్లు:— ఇయ్యది బ్రాహ్మణవాడలో నుండెడిది. దారి నడచువారికి వంటయిండ్లనుండి వచ్చు తాళింపువాసనలు నోరూరజేసెడివట. ఈవాడలోని పూటకూటింట భుజించువారలు పైకమీయవలసి యుండెను. ఒక రూకకు కప్పురభోగివంటకము, కమ్మని గోధుమపిండి వంట, గుప్పెడుపంచదార, అప్పుడేకాచిన నెయ్యి, కొమ్మరటి పండ్లు, నాలుగైదు సంజుళ్ళు, చక్కని పెరుగుమున్నగు పదార్థములతో దృప్తికరముగ భోజనమ్ము పెట్టబడుచుండెడిది. ఇట విటులకు దగు నేర్పాట్లుగూడ గావింపబడు చుండెడివి.

(6) వేశ్యవాటిక:— ఇయ్యది యలంకారముగను శృంగారమయము నాట్యశాలగ నుండెడిది. శృంగారమయమున్నగు సుగంధద్రవ్యములు విరివిగ నిట వాడబడుచుండెడివి. ప్రతాపరుద్ర ధరణీశోపాత్త గోష్ఠీప్రతిష్ఠాపరిణయు, మహావిభవోపేతయునగు మాచల్దేవియను వారాంగన యుండెడిది. ఆమె విలాసముగ చిత్రశాలా ప్రవేశమొనర్చుచుండెను. ఈ కాలమున వేశ్యలలో ముఖ్యులు గిడ్డి కాన్పత్తి నవలంబింపబోవు పడుచుల 'కన్నెము జాచుట' యను నొక వేడుకను జరుపుటాచారముగ నుండెడిది. అప్పటి వారి శాసనముల మద్యపానము జేయుచుండిరని గీతాభిరామము నుండి తెలియుచున్నది. అదేగ్రంథము నుండి యీ వారస్త్రీలకుగొన్ని నియమములుండెడివనియు, వేశ్యలోనున్న మోహములను విచారించి, వగలాడిన స్థానములను విడిచి ట్రై విటులను చోరులను గ్రామ్యులను ... ఆచారమై యుండెననియు తెలియుచున్నది.

(7) వినోదములు:— ఇంతవరకును ఓరుగల్లులో లభ్యములగు వినోదములను జేర్కొనియుంటిమి. ప్రజాసామాన్యమునుగూడ ననేక విధములగు వినోదములను గల్పించుకొనుచుండిరి. వెలిపాళెమున ... గాలక్షేపముగ నుండెడిది. కోటలో భాగమున నిట్టివి మఱికొన్ని యుండెడివి. అచ్చట సాములవాండ్రు నాగస్వరమును బట్టుచు పాముల నాడించుచుండిరి. మఱికొందరు మేషయుద్ధములును, కోళ్ళపోరును జరుగుచుండెడివి. వీని వీక్షించుచు బందెముల నొడ్డుచు జనులమితోత్సాహము నందుచుండిరి.

ఇటుల ప్రతాపరుద్ర చక్రవర్తి కాలమునం దోరుగల్లుపట్టణ మపూర్వశోభాయుతమై, వివిధ

వినోదముల కాలవాలమ్మై, ఢిల్లీనగరమున కెన దై యొప్పుచుండెను.

విజయనగర నిర్మాణము:—ప్రతాపరుద్ర చక్రవర్తితో గాకతీయసామ్రాజ్యమస్తమించినపిమ్మట నాంధ్రదేశమునందుద్భవించిన రాజ్యములలో దక్షిణ పశ్చిమమున నెలకొల్పబడిన విజయనగరరాజ్యము గూడ చేరియుండెనని ముందుచరిత్రమున జెప్పి యుంటిమి. రెడ్డి పద్మనాయక సామ్రాజ్య స్థాపకులవలె నీవిజయనగరనిర్మాతలు గూడ గాకతీయాంధ్రసామ్రాజ్యాంత్యకాలమునం దేకశిలానగరమునం దుండియుండిరనియు,నీనూత్న సామ్రాజ్యమాంధ్రసామ్రాజ్యమే యనియు మావిశ్వాసము. విజయనగర రాజ్యోత్పత్తిని గూర్చియు, తన్నిర్మాణక్రమమును గూర్చియు ననేకు లనేక విధముల నభిప్రాయపడియున్నారు. ఇంతవరకు నందలి వాస్తవము నిర్ణయింప బడియుండలేదు. ఈసమస్యను చర్చించినగాని ప్రతాపరుద్రచక్రవర్తియొక్కయు, తాళ్ళికాంధ్రుల యొక్కయు ప్రతిభావిశేషముల నెఱుంగి వలను పడదు.

విజయనగరరాజ్యోత్పత్తిని చర్చించునెడ మూడు విశేషములు ముఖ్యముగ గమనింపదగియున్నవి. కొన్ని ప్రమాణములనుండి తద్రాజ్యస్థాపకు లాంధ్రదేశమునుండి వలస పోయిరనియు, నాంధ్రరాజ్యమునే వారలు తుంగభద్రాతీరమున నెలకొల్పిరనియు, తుదకు వారలు గాకతీయులకు సన్నిహితబంధువులనియును గూడ దెలియు చున్నది. దీని నాంధ్రోత్పత్తివాదమని పిలువ వచ్చును. దక్షిణదేశపు పరిశోధకపండితులీ వాదమునకుగల ప్రమాణములను విశ్వసింపక, విజయనగరనిర్మాతల నబడు సోదరులు హొయసలరాజసామంతుల నియు, హొయసల బల్లాలునిచేతనే విజయనగరము నిర్మింప బడెననియు పేర్కొనుచున్నారు. దీనిని హొయసలోత్పత్తివాదమని చెప్పనగును. ఇటులుండగర్ణాటకపండితులు కంపిల రాజ్యము తురుష్కుల వశమయినపిమ్మట హతశేషులగు నిర్వురు సోదరులు తురుష్కసామంతులుగనుండి, క్రమముగ స్వతంత్రించి, విజయనగరమును నెలకొల్పిరని వాదించుచున్నారు. ఇయ్యది కర్ణాట కోత్పత్తివాదమని పేర్కొనదగును. ఈ వాదములందలి వాస్తవము నెఱుంగుటకు వీనినించుక సవిమర్శముగ బరిశీలింపవలసియున్నది.

హొయసలోత్పత్తి:—డాక్టరు కృష్ణస్వామిఅయ్యంగారు, లూయిూరైస్, కృష్ణశాస్త్రి మున్నగు పండితులు క్రీ. శ. 1327. లో తురుష్కులు ద్వారసముద్రమును వశపఱచుకొనినపిమ్మట హొయసల రాజగు మూడవ బల్లాలుడు తన రాజధానిని దక్షిణదేశమునందలి తిరువణ్ణామలై దుర్గమునకు మార్చుకొని, తన యుత్తరపు సరిహద్దును రక్షించుటకునై తుంగభద్రాతీరమున విజయనగరమును నెలకొలిపి, హరిహరుడను సామంతుని దత్పరిపాలకునిగ నియమించెనని యభిప్రాయపడియున్నారు. [206] హీరాస్‌పండితు డీయభిప్రాయమును విపులీకరించి యీవాదమునకు ప్రత్యేక వ్యక్తిత్వము నేర్పఱచెను. వారి వాదమునందలి యీక్రింది ముఖ్యాంశములను గమనింపనగును.[207]

(1) న్యూనిజ్ అను పోర్చుగీస్ యాత్రి

206 Ep. Carn. VI Intr. P. 21. A. S. R. 1909—1910 P. 160
South India & her Mahammadan Invaders P. 171, 181—182.
207 Beginnings of Vijayanagar—Rev. H. Heras. ఈపుస్తకమునుండియే రానొగ్గారి యభిప్రాయములు గైకొనబడియున్నవి.

కుని వ్రాతలనుండి మొదట తురుష్కులచే బందిగ గొంపోబడి, పిమ్మట వారిచే విడువ బడిన యొకనిచే విజయనగరము నిర్మింపబడె నని తెలియుచున్నది. మూడవ బల్లాలుని విషయమున నియ్యవి వర్తించుచున్నవి. ఈతడు తన పుత్రుడగు వీరవిజయవిరూ పాక్షుని పేరిట విరూపాక్షపట్టణమను నొక నగరమును తుంగభద్రాతీరమున నిర్మించెను. ఇదియే విజయనగరము, తన్నిర్మాత మూడవ బల్లాలుడు.

(2) న్యూనిక్ పేర్కొనిన పూర్వవిజయ నగరరాజుల నామముల నీ క్రిందివిధమున సమన్వయింపవలెను.

| న్యూనిక్. | హీరాస్. |
|---|---|
| దేవరావ్ — | మూడవ బల్లాలుడు |
| బుకారావ్ — | మొదటి హరిహరుడు |
| పురియెరి దేవరావ్ — | మొదటి బుక్కరాజు |
| అజారావ్ — | రెండవ హరిహరుడు |

(3) బతకూరు మున్నగు దుర్గములలో సన్నిహితకాలముననే బల్లాలునియొక్కయు హరిహరునియొక్కయు ప్రశంస గానసగు చుండుటచేతను, హరిహరునివంశమునను హొయసల సామంతుడగు దాదికేశవనాయ కుని వంశమునను మల్లిఖార్జు నాదినామము లనే కులు గన్పించుచుండుటచేత, నారెండువంశము లునొక్కటే యగుట వల్లను, హరిహరాదులు హొయసలులయెడ ననేక విధముల దమ కృతజ్ఞతను జూపుచుండుటచేతను, హరి హరుడు నాతని సోదరుడగు బుక్కరాజును హొయసల సామంతులని చెప్పనగును.

హొయసలబల్లాలుడు తిరువణ్ణామలె దుర్గ మునకు తన రాజధానిని మార్చియుండెనను టకు సరియగుప్రమాణములు గానరావనియు, క్రీ. శ. 1327 నుండియు నాతడు పెక్కుస్థల ముల పరిభ్రమించుచు, 1330 లో నాదుర్గము నుండి వెడలి, 1341 వఱకు నచ్చటికి తిరిగివచ్చి యుండలేదనియు, ద్వారసముద్రము నాతడు విడనాడక 1335—41 ల నడుమ నచ్చటనే నివసించియుండెననియు, శాసనప్రమాణముపై డాక్టరు వెంకటరమణయ్యగారు నిరూపించి యున్నారు. తురుష్కుల దాడికోర్వజాలక బలాయితుడైయుండిన బల్లాలుడు క్రీ. శ. 1327 నకు పిమ్మట తురుష్క రాజ్యమున జేరియుండిన తుంగభద్రాతీరమున విజయనగర మును నిర్మించుట యసమంజసమనిగూడ వారు జూపియున్నారు.[208] హీరాస్‌గా రను కొనినటుల న్యూనిజ్ వ్రాతలు బల్లాలునికి వర్తింపవు. ఆతడు తురుష్కులచే బందీకృతుడై సంహరింపబడియెను. అట్టిచో నాతని విముక్తియు రాజ్యస్థాపనము నసంభవములు. పై పండితుని రాజనామసమన్వయము భాషా పరిణామమునకు విరుద్ధముగ నున్నది. నిర్దుష్ట మగు స్యూయల్ పండితుని సమన్వయము దీనియందలి దోషమును జూపుచున్నది.

| న్యూనిజ్ | హీరాస్ | స్యూయల్ |
|---|---|---|
| దేవరావ్ | 3వ బల్లాలుడు | 1వ హరిహరుడు |
| బుకరావ్ | 1వ హరిహరుడు | 1వ బుక్కరాజు |
| పురియెరిదేవరావ్ | 1 వబుక్కరాజు | 2వ హరిహరుడు |
| అజారావ్ | 2వ హరిహరుడు | |

అనతికాలమున నొకేస్థలమున బల్లాల హరిహరుల ప్రశంస యుండినంత మాత్రమున

208 Madras Christian College Magazine [illegible] 1930.

వారికి స్వామిసేనకిన్యాయము నాపాదింపలేగి దు. శాసనములందెచ్చట నీవిషయము తెలుపబడి యుండలేదు. అదియునుగాక మల్లినాథుడు, బుక్కరాజు మున్నగు వారలు హొయసలులతో పోరియుండినట్టుల శాసనములనుండి తెలియుచుండుటచే హరిహరుడు బరకూరు మున్నగు దుర్గములయందు బల్లాలునితోపోరి, వాని నాక్రమించుకొనియెనని స్పష్టమగు చున్నది.[209] కేవల నామసామ్యమునుపై నాధారపడు హీరాస్‌గారి వాదము కూడ ప్రమాదకరమే. 11,12,13 శతాబ్దములలో నాంధ్రదేశము నేలిన రాజవంశములలో నేకులు రుద్ర, గణపతి, మహాదేవ, రాజేంద్ర, భీమనామాభిదు లుండిరి. అంతమాత్రమున. గొలనిగణపతిని గాకతీయ గణపతి దేవచక్రవర్తిగను, కొలనిరుద్రుడు, నతవాటి రుద్రుడు రేచెర్ల రుద్రుడు మున్నగువారిని కాకతి రుద్రునిగను సమన్వయింప నగునా? ఈ యభిప్రాయము లన్నియు నిట్టులుండ, హొయసలోత్పత్తి వాదమునకు మూలస్తంభులగు హీరాస్‌గారొక స్వల్ప ప్రమాణమును సమన్వయింపజాలక తమ యుక్తివాదమును తామే ఖండించుకొని యుండిరి. కర్ణాటకమునందలి యొక శాసనమున "దిగ్విజయానంతరము బుక్కరాజు తుంగభద్రాతీరమున విజయనగరమును నిర్మించి, యందు భవనములు రాజమార్గములు మున్నగువానిని నెలకొల్పె" నని చెప్పబడియున్నది. ఈ శాసనముపై వ్యాఖ్యానము చేయుచు హీరాస్‌గారిందలి విషయములు వాస్తవములు కావనియు, నింతకు పూర్వము బల్లాలుడు నిర్మించియుండిన నగరమున బుక్కరాజు భవనాదికముల నిర్మించి, దాని నభివృద్ధిపఱచెనని యన్వయింపవలెనని యు వ్రాసియున్నారు. అయినను వారింకొకచో నీ వ్రాతలయందలి దోషమును గ్రహించి, యీ యభిప్రాయము సరికాదనియు, బుక్కరాజే విజయనగరమును నిర్మించెననియు తమ యభిప్రాయమును సరిచేసికొనియున్నారు.[210] పై విమర్శనుండి హొయసలోత్పత్తివాదము నందలి వాస్తవ ప్రామాణ్యములు స్పష్టములగు చున్నవి.

ఆంధ్రోత్పత్తివాదము-ఇక రెండవదగుదీనిని బరిశీలింపవలసి యున్నది. ఈ విషయమున నీ క్రింది పండితుల యభిప్రాయములు నితరప్రమాణములును ముఖ్యములు—

(1). విజయనగర చరిత్రకారులగు బి.సూర్యనారాయణరావుగారు "యీసోదరులు తమగురునగు విద్యారణ్యుని సాహాయ్యమున క్రీ. శ. 1336 లో నీనగరమును నిర్మించి" రని వ్రాసియున్నారు.[211]

(2) "ఈసోదరు లేకశిలానగరాంధ్రరాజ్యమునుండి పలాయితులైరని చెప్పుటకు బ్రబల నిదర్శనము లున్న"[212] వని వి. ఏ. స్మిత్తు పండితుని యభిప్రాయము.

(3) స్యూయల్‌పండితుడు "విశేషమతావేశముగల కురుబవంశీయులగు నిద్దరు సోదరులు క్రీ. శ. 1323 వఱకు నోరుగల్లున కోశాగారోద్యోగులుగ నుండి, తద్రాజ్యపతనానంతరము ఆనెగొందికి జేరి, యా సంస్థానముగూడ తురుష్కులకు వశమగుటచే తాము వారికి

209 Ibid. 210 Beginnings of Vijayanagara "Conclusions."
211 Never to be-forgotten Empire. P. 24.
212 Smith—oxford history of India (1923 Edn.) P. 201.

లోనే, పిమ్మట విజయనగరమును నిర్మించి స్థిరపడి" రని వ్రాసియున్నాడు.[213]

(4) క్రీ. శ. 1807 లో రామప్పవర్మ యను బ్రాహ్మణునివద్దనుండి తుళువవంశీయుల చరిత్రమును సంగ్రహించిన బచ్నన్ అను నాతడు "వారలాంధ్రవంశీయులు. ఈ బ్రాహ్మణుని వద్ద గల 'విద్యారణ్యశిక్ష' యను గ్రంథమున హుక్క, బుక్క యను సోదరులు ప్రతాపరుద్రుని కోశాధ్యక్షులుగనుండి, పిమ్మట విజయనగరమును నిర్మించిరని చెప్పబడియున్నది" యని విశదపఱచి యున్నాడు.[214]

(5) "ఓరంగల్లునుండి పాఱివచ్చిన యిర్వురుసోదరులు తమ గురువగు విద్యారణ్యుని సాహాయ్యమున విజయనగరమును నిర్మించి" రని కల్నల్ విల్కున్నదొర యభిప్రాయము[215]

(6) మొదటి బుక్కరాజు కోడలగు గంగాంబ తన 'మధురావిజయము' న వ్రాసిన సంస్కృతకవుల బ్రస్తుతించి పిమ్మట నగస్త్య, విశ్వనాథాది యేకశిలానగర కవికుంజరులను పేర్కొనియుండెను.

(7) 17-వ శతాబ్దిలో రచింపబడిన "రాజకాలనిర్ణయము" నను, కేలడి బసవకృతమగు "శివతత్త్వరత్నాకరము" ననుగూడ నీసోదరు లోరుగల్లు నివాసులనియు, ప్రతాపరుద్రుని కోశాధ్యక్షులనియు పేర్కొనబడి యున్నది.[216]

(8) కాకతీయాంధ్ర సామ్రాజ్య మంతరించిన యనతికాలమునకే యాంధ్రదేశమున కేతెంచిన జియాఉద్దీన్ బారనీ యను మహమ్మదీయ చరిత్రకారుడు "సులతాను తనకు బ్రతినిధిగ గంపిలరాజ్యమున కంపిన సామంతుడు ఓరుగల్లు రాజగు కన్నానాయకునకు సమీపబంధువు" అని వ్రాసియున్నాడు[217]

పై వివరింపబడిన (6)—(8) అంశములు చాల ముఖ్యములైనవి. మధురా విజయమునందలి కవిప్రశంసనుండి హరిహరాదులోరుగల్లున దాముండిన కాలమున గాకతీయ ప్రతాపరుద్రదేవుని గీర్వాణాంధ్ర కవితాపోషణమును సవిస్తరముగ గాంచియుండి, తాము నూతనముగ నెలకొల్పిన విజయనగర రాజ్యమునం దాంధ్రగీర్వాణభాషల కెక్కుడు ప్రోత్సాహము నొసంగియుండిరని స్పష్టపడుచున్నది. మొదటి హరిహరరాయలు నాచన సోమనాథున కొనర్చిన గౌరవ మీయంశమునకు దార్కాణము. బారనీ పేర్కొనిన కన్నానాయకుడు ప్రతాపరుద్ర చక్రవర్తి పిమ్మట నోరుగల్లునేలి మహమ్మదీయుల బ్రతిఘటించిన కృష్ణనాయకుడే యని చెప్పనగును. ఆతడు ప్రతాపరుద్రుని పుత్రుడని పేర్కొనబడి యున్నాడు.[218] హరిహర సోదరుల కీతనితో సమీపబాంధవ్యముండెననినచో వారలు కాకతీయరాజబంధువులని చెప్పవలసివచ్చును. ఇట్టి నిర్ణయము విజయనగర సామ్రాజ్య మాంధ్రసామ్రాజ్యమనియు, దానితో గాకతీయులకును, విశేషించి ప్రతాపరుద్ర చక్రవర్తి కెక్కుడు సంబంధముండె

213 Sewell—Forgotten Empire P. 23.
214 Never—to-be-forgotten-Empire P. 25 ff 1.
215 Wilks—Historical sketches of South India vol I. P. 13-14.
216 Mackenzie Mss. No. 23-1-12 శివతత్త్వరత్నాకరము' 4 కల్లోలము' 12 తరంగము 30-31 శ్లోకము
217 Elliott & Dowson-History of India as told by her own historians vol. III. 218 Ibid.

సనియుజూపి, యీ ప్రకరణారంభమునం దొనర్చిన నిర్ధారణమును బలపఱచుచున్నది.

కర్ణాటకవాదము- ఇక మిగిలినది మూడవదగు ఇందలి విషయములేవియు నాంధ్రోత్పత్తివాదమునకు ప్రతికూలములుగాక దానిని విశదీకరించుచున్నవి. ఈ వాదమునకు "కుమారరామనచరితె" "పరదార సోదర రామనచరితె" "బల్లాల రాయనయుద్ధ" యను కన్నడ లిఖిత గ్రంథములును[219] "రాజకాలనిర్ణయ" మను సంస్కృత లిఖిత గ్రంథమును ముఖ్యాధారములు. వీనినుండి దెలియదగిన ముఖ్యాంశము క్రీ. శ. 1323 లో నేకశిలానగరసామ్రాజ్య మంతరించిన పిమ్మటను, క్రీ. శ. 1335 లో విజయనగరము నిర్మింపబడుటకును, పూర్వముగల హరిహరాదిసోదరుల చరిత్రము. మహమ్మదీయు లోరుగల్లు నాక్రమించిన పిమ్మట నాసోదరులు కురువంశీయుడును, గంపిలరాజ్యపాలకుఁడు నగు రామనాథుని యాస్థానమున కేగిరి. వీరి తండ్రియగు సంగముడాగ్రంథములలో 'అళియసంగమ' 'భావసంగమ' యని పిలువబడుచు రామనాథుని యల్లుడుగ గన్పడుచున్నాడు. ఈసోదరు లిచ్చటగూడ కోశాధ్యక్షపదవులనే యుండి, యోరుగల్లున నిర్వహించినభారమునే నిర్వహించిరని "భాండారదహుక్క, భాండారదబుక్క" యను వాక్యములనుండి తెలియుచున్నది.

క్రీ. శ. 1327 లో తురుష్కులు కంపిలపై దండెత్తి, రామనాథుని సపరివారముగ బరిమార్చి, హతశేషులను ఢిల్లీకి బందీలుగ గొనిపోయిరి. ఈఖైదీలలో హరిహరుడు నాతని సోదరుడునుగూడ నుండిరి. ఈ నూతనముగ జయించిన కంపిలరాజ్యమునకు సులతాన్ నొక తురుష్కసేనానాయకుని ప్రతినిధిగ నియమించెను. కాని యనతికాలముననే ప్రజలాతని నచ్చటనుండి తరిమివైచిరి. అంత చేయునదిలేక సుల్తాను కారాగారమునందుండిన పూర్వ రాజోద్యోగులగు నాసోదరుల నిర్వురను రావించి, వారిలో నొకరిని రాజుగను, మఱియొకనిని మంత్రిగ నొనర్చి, తనకు సామంతులుగ గంపిలరాజ్యము నేలుడని బంపించెను. న్యూనిజ్ యను పోర్చుగీస్ యాత్రికుని వ్రాతలుగూడ నిదేవిషయమును దెలుపుచున్నవి. పిమ్మట నాసోదరులు విదేశీయులగు నాదురుష్కుల నెదిర్చి, ప్రాచీనహైందవప్రతిభావిశేషమును బునరుద్ధరింప గల యొక సామ్రాజ్యమును నెలకొల్ప సంకల్పించుకొని, విద్యారణ్యుని సాహాయ్యమున తుంగభద్రానదికి దక్షిణతీరమున విజయనగరమును నిర్మించిరి.

పై చర్చనుండి విజయనగర సామ్రాజ్యము కర్ణాటసామ్రాజ్యమనుటయు, హోయసల బల్లాలుడు దానిని స్థాపించెననుటయు, ప్రమాదకరములనియు, నా సామ్రాజ్య మాంధ్రవినిర్మితము నాంధ్రాభిపోషకమునై యొప్పెననుటయు, సమంజసములనియు స్పష్టమగుచున్నది. గీర్వాణాంధ్రభాషా పోషణమునకును, యవన ప్రతిఘటనమునకును, విజయనగర సామ్రాజ్యమునకును, కృష్ణదేవరాయలకును, గాకతీయాంధ్ర సామ్రాజ్యమును బ్రతాపరుద్ర చక్రవర్తియు, నాదర్శములై యొప్పియుండిరని చెప్పవలసి యున్నది.

రెడ్లసంబంధము:—పదునాలుగవ శతాబ్ద ప్రథమపాదమున గాకతీయసామ్రాజ్య మస్త

219 [illegible] Q. J. M. S. Vol. XX [illegible]

మించిన పిమ్మట నాంధ్రదేశము బహు సంకటములకు లోనైయుండెను. దక్షిణాపథ మునంతను గలయబెట్టు నావేశముతో విజృంభించుచుండిన తురుష్కవాహిని యాంధ్రదేశ స్వాతంత్ర్యమును, వ్యక్తిత్వమునుగూడ గబళింప నుంకించుచుండెను. అట్టియెడ నీవిదేశీయులనరికట్టి యాంధ్రగౌరవము నుద్ధరించిన మహాసంస్థలలో విజయనగర సామ్రాజ్యము నుత్తరమున బ్రబలిన పద్మనాయక రాజ్యమును ముఖ్యములు. కాకతీయ ప్రతాపరుద్రదేవుని రాజ్యాంత్యమునకును నేకఛత్రాధిపత్యమునకు లోనైయుండిన యాంధ్రభూమి యాచక్రవర్తి మరణానంతరము పైవిధమున విభజింపబడియుండెను. రెడ్డి విజయనగర పద్మనాయక సామ్రాజ్య నిర్మాణములకు ప్రతాపరుద్రుని కాలముననే యంకురార్పణ మొనర్పబడియుండెను. విజయనగర రాజోత్పత్తిక్రమమునుగూర్చి యిదివరలో జర్చింపబడియున్నది. ప్రకృతమున రెడ్లకును ప్రతాపరుద్రునికిని గల సంబంధమును చర్చింపుచు నాతని రాజ్యాంత్యభాగమున రెడ్డిరాజ్యము నిర్మింపబడినవిధమును పేర్కొనుచున్నాము.

కాకతీయులకాలమునందలి రెడ్లచరిత్రమింతవరకును చర్చింపబడియుండలేదు. ఇటీవల గన్గొనబడిన నైజాంరాష్ట్ర శాసనముల నుండియు స్థానికచరిత్రములనుండియు వీరి పూర్వవృత్తాంతమును దెలిసికొనవలనుపడుచున్నది. కొందరు పండితులు రాష్ట్రిక, రాష్ట్రకూట, రట్ట, రెడ్డి యనుపదములకు సన్నిహితమగుసంబంధము గలదనియు దానజేసి చరిత్రప్రసిద్ధమగు రాష్ట్రకూట వంశమునకు జెందినవారే రెడ్లనియు దలంచుచున్నారు. ఇందలి నిజానిజము లెటులుండినను రెడ్డి కులజులు కాకతిరుద్రుని కాలమునుండియు నీ దేశమునం దుండిరని యూహింపనగు చున్నది. రేచెర్లాన్వయులును పిల్లలమఱ్ఱి, ఆమనగల్లు ప్రాంతపాలకులునగు బేతిరెడ్డి, నామిరెడ్డి మున్నగు వారి పిల్లలమఱ్ఱి నాగులపాడు శాసనము లీయూహను బలపఱచుచున్నవి. గణపతిదేవ చక్రవర్తి కాలమునందు పంటకులజులగు రెడ్ల ప్రశంసగానవచ్చుచున్నది. ఒరంగల్లు జిల్లా ముప్పవరగ్రామమున పంటబొల్లి రెడ్డి యను నాతడు రామేశ్వరదేవుని బ్రతిష్ఠించినటుల దెలుపు నొక శాసనమున్నది. స్థానిక చరిత్రములనుండి దత్తమండలములలో గూడ నీకాలమున గొందరు రెడ్డికులజులు భూస్వాములుగ నుండినటుల దెలియనగును. ప్రతాపరుద్ర చక్రవర్తి కాలమునం దనేకులగు రెడ్డిసామంతులు కాకతీయ సామ్రాజ్యపు దక్షిణభాగము నేలుచుండిరి. వారిలో నీక్రిందివార లగ్రగణ్యులు.

| | | |
|---|---|---|
| గణపయరెడ్డి — | నందిగూడెము — | 1300 |
| ఎల్లయరెడ్డి — | త్రిపురాంతకము | 1308 |
| అన్నమరెడ్డి — | నందిగూడెము | 1314 |
| పోలయవేమారెడ్డి — | ధరణికోట | 1320 |
| దేవయరెడ్డి — | నెల్లూరు | |
| కాటమరెడ్డి — | పాకనాడు | |

కాకతీయాంధ్ర చక్రవర్తుల కాలమునం దితర జాతులవారందరు, నభివృద్ధినందుచు రాజాదరణమునకు పాత్రులగుచుండ నీరెడ్డిసామంతు లేల నిటు లజ్ఞాతగౌరవులై యుండిరాయను సందియము పొడముచున్నది. దీని కొక ప్రబలమగు కారణముగలదు. పండ్రెండవ శతాబ్ది యుత్తరార్థమున జరగిన పల్నాటియుద్ధము దేశమునం దనేకములగు మార్పు

లను జేసియుండెను. యుద్ధకాలమున మహావీరుడును వీరవైష్ణవుడునగు రేచెర్ల బ్రహ్మనాయుడు వివిధవర్ణములకు జెందిన యోధుల నెల్లను నొకచో జేర్చి వారల కన్యోన్యభోజనాది వివిధసంబంధముల నొనగూర్చి యుండెను. పల్నాటియుద్ధము ముగిసినపిమ్మట నితరకులముల వారినుండివీరువేరై పద్మనాయకులను ప్రఖ్యాతివడసిరి. అప్పటినుండియు వీరికిని రెడ్లకును పరస్పర విరోధము లేర్పడజొచ్చినవి. ఆకాలమున బేతిరెడ్డి కామిరెడ్డి మున్నగు మహావీరులు కాకతీయరాజుల గౌరవాదరణములకులోనై సేనానాయకాది పదవుల నలంకరించియుండిరి. ఇతరకులములనుండి వేరైన పద్మనాయకు లాత్మస్థితికై పల్నాటియుద్ధమున పోరవలసియుండుటచే వారియందనేక వీరశిఖామణు లుత్పన్నులైరి. ఈ సమయముననే యుత్తరాంధ్ర దేశమునంతటిని జయించిన కాకతిరుద్రదేవరాజు ప్రాగ్దక్షిణమున వెలనాడుపై దండువెడల బ్రయత్నము లొనర్చుచుండెను. మహాయోధుడును స్వరాజ్యవిస్తరణైక దీక్షితుడునగు నారాజు యుద్ధనీతినిపుణులగు నీపద్మనాయక వీరులకు దన యాస్థానమున తావొసంగి వారిని దన వెలనాటి విజయయాత్రలలో నియమించి యుండును. ఈ విధమున నీవీరుల కాశ్రయము లభించెను. గణపతిదేవచక్రవర్తికాలమున రుద్రసేనాని తక్క పిల్లలమఱ్ఱి రెడ్లలో నెవ్వరును రాజకీయమున బ్రాముఖ్యత వహించినటుల గన్పడుటలేదు. దీనినుండి యీ చక్రవర్తికాలముననే పద్మనాయకులు తమ శౌర్యసాహసములచేతను, స్వామిభక్తిపరాయణతచేతను, రెడ్డి కులజుల నతిక్రమించి రాజాదరణము నేకభోగముగ ననుభవించుచుండిరని యూహింపనగుచున్నది. రుద్రాంబికకాలమునగూడ నీరెడ్ల ప్రశంస విశేషముగ గానరాక పద్మనాయకవీరులే యనేక రాజకీయపదవులయందుండినటుల దెలియుచున్నది. ప్రసాదాదిత్యనాయుడు మున్నగువా రీమహారాజ్ఞి కాలమున విశేషకీర్తిగౌరవముల నందియుండినటుల స్థానికచరిత్రములనుండియు, శివయోగసారమునుండియు, దెలియనగుచున్నది. ఇందుమూలమున గణపతిదేవునినాటనుండియు నీ పద్మనాయకులును, రెడ్లును, రాజాదరణకై యభ్యర్థించుచుండిరనియు, రుద్రాంబికకాలమున బద్మనాయకులు విజయమునందిరనియు స్పష్టమగుచున్నది.

ప్రతాపరుద్రచక్రవర్తికాలమునం దీరెడ్డి పద్మనాయకవిరోధాగ్ని యొక్కసారిగ బ్రజ్వరిల్లినది. రాజ్యాభిషిక్తుడయినవెంటనే యీచక్రవర్తి డెబ్బదియేడు రాజ్యాంగనియోగములనుండియు నితరజాతినాయకులను తొలగించి పద్మనాయకులనే నియమించెనని ప్రాచీన చరిత్రములలో జెప్పబడియున్నది. ఇంతవఱకును గాకతీయరాజు లిట్టికార్యము నొనర్చియుండలేదు. పద్మనాయకులయెడ బక్షపాతము జూపుచుండినను వారలితర జాతివారల నవమానించి యుండలేదు. ప్రతాపరుద్రదేవుని యీ ప్రథమరాజ్యాంగ సంస్కరణము రెడ్డిసామంతులను హతాశుల నొనర్చివైచెను. వారికి రాజకీయగౌరవములు దుర్లభములని స్పష్టపడియెను. ఇటనుండియు రెడ్లు తమయెడ నొనర్పబడిన యీ యపకృతికి బ్రతీకారమొనర్చి చక్రవర్తిని దమ స్వాధీనమొనర్చుకొని తన్మూలమున బద్మనాయకులను పదభ్రష్టుల నొనర్ప బ్రయత్నింప మొదలిడిరి. ఈ కార్యదీక్షను జూచి వారలు జాతిముఖా

దేశము నాంధ్రదేశోపాయములను సైతము సరకుచేయక, స్వార్థము నభివృద్ధిపఱచుకొని యుండిరి. ప్రతాపరుద్రదేవుని కాలమున గొందరు రెడ్డికులజులు సామంతపదవులనుండి యుండిరని యింతకుమున్న చెప్పఁబడియుంటిమి. వీరలేగాక నోరుగల్లునగరమునందే కాలమున దొంతియల్లాడరెడ్డి యను నొక శ్రేష్ఠు డుండెననియు, నాతనికి మాచ, వేమ, దొడ్డ, అన్న, మల్లయను నైదుగురు కుమారులుండిరనియు, వారిలో రెండవవాడగు ప్రోలయవేమారెడ్డి క్రీ. శ. 1320 ప్రాంతమున ధరణికోటలో స్వతంత్రస్థానమును నెలకొల్పెననియు, "రెడ్డిచరిత్రము" నం జెప్పఁబడియున్నది. దక్షిణదేశమునందుండిన రెడ్డిసామంతులుగ పేర్కొనఁబడిన యన్నారెడ్డియు, నల్లాడరెడ్డి నాల్గవ పుత్రుఁడగు నన్నమరెడ్డియు నొక్కరేయని చెప్పవచ్చును. అట్లయినచో ప్రోలయవేముడు సేనానాయకుఁడుగను, అతని యనుజుడగు నన్నమరెడ్డి గొప్పసామంతుఁడుగను, ప్రతాపరుద్రచక్రవర్తి కాలమునందుండిరని తెలియుచున్నది. వీరిద్దరు నాకాలమున రెడ్డికులమునకు నాయకులై యుండిరి. చక్రవర్తి తననియోగములను సంస్కరించిన పిమ్మట నీరెడ్డినాయకు లిర్వురును జేరి యితరుల సహాయమున ప్రబలవిద్రోహముల నొనర్చిరనుటకు గొన్నినిదర్శనము లగపడుచున్నవి. ఈకాలపు శాసనమొకటి చక్రవర్తి సామంతు డొకడు శత్రువుల నిర్జించి గండికోటదుర్గమును స్వాధీనము నర్చుకొనియెనని తెలుపుచున్నది. కాయస్థ సామంతులగు ద్రిపురాంత కాంబదేవాదుల విద్రోహమునణంచి చక్రవర్తి యాజ్ఞానుసారము క్రీ. శ. 1304_1313 ల నడుమ పట్టసాహిణి సోమయనాయకుడాదుర్గమును పాలించుచుండెను. స్థానికచరిత్రములనుండి సోమయనాయకునికి పిమ్మట బొట్టుపలంకి యను నాతడీదుర్గమున కధిపతియయ్యెనని తెలియుచున్నది. దీనినుండి పైశాసనమునందలి ప్రతాపవిజయము సోమయనాయకుని మరణానంతరమును, బొట్టుమలంక గోంకారెడ్డి పరిపాలించుటకు బూర్వమును, అనగా క్రీ. శ. 1313-14 ల నడుమ గండికోటదుర్గమున జరిగిన విద్రోహము నణంచుటకేయని చెప్పనగును. ఇట్టి యూహ నితరకారణములుకూడ బలపఱచుచున్నవి. ఇంతియగాక నీ విద్రోహమునకును రెడ్లకు నెక్కుడు సంబంధముండినట్లుకూడ నూహింపవలసివచ్చుచున్నది. మహమ్మదీయులు ప్రథమమున క్రీ. శ. 1309 లోను రెండవసారి క్రీ. శ. 1320_21 లోను దండెత్తియుండిరి. దక్షిణపశ్చిమముల హొయసల రాజులు కాకతీయులకు మిత్రులుగ నుండిరి. ఇట్టిచో నితరరాజు లెవ్వరును గండికోటపై దాడి వెడలుట కవకాశము గన్పడుటలేదు. అయినను క్రీ. శ. 1313_14 లలో ప్రతాపరుద్రచక్రవర్తి స్వయముగ గండికోటప్రాంతమునకేగి యచ్చట ననేక గ్రామములను నిర్మించి శ్రీశైలత్రిపురాంతకాది పుణ్యక్షేత్రముల కేగియుండెను. అంబదేవాదు లింతకుమున్నే గతించియుండినను, తన తనయుడగు గోంకారెడ్డియే దుర్గపాలకుడుగనుండియుండినను గూడ చక్రవర్తి స్వయముగ దక్షిణమున కేగుటచే దానికెద్దియో ప్రబలమగు కారణముండెననియు, నితడు కడప కర్నూలు మండలములందొనర్చిన గ్రామనిర్మాణాదికము కేవల మార్థికమేగాక రాజ్యాంగ తంత్రముగూడనై యుండవలయుననియు దోచుచున్నది. స్థానిక చరిత్రము లీ సందర్భమునం

దెక్కుడుగ నుపయోగించు చున్నవి. వాని లో కర్నూలు మండల చరిత్రమునుండి దక్షిణమున గొందరు రాజులు తిరుగుబాటు చేయుటచే చక్రవర్తి స్వయముగ బయల్వెడలెననియు, నితర చరిత్రములందు గండికోట ప్రాంతమున వడ్డిరాజులు మఱికొందరి ప్రోద్బలముచే విద్రోహమొనర్చిరనియు జెప్పబడియున్నది. దీనినుండి గండికోటలో నొక ప్రబల విద్రోహము జరగియుండినటుల స్పష్టమగుచున్నది. అన్నమరెడ్డి, గణపరెడ్డి మున్నగు మహాసామంతు లీ ప్రాంతములనే యుండుటయు, చక్రవర్తి పద్మనాయకులయెడ జూపిన పక్షపాతము వీరి పౌరుషాభిమానముల బ్రజ్వరిల్లజేసి యుండుటచే వీరలాతనిపై విరోధభావముబూనియుండుటయు సమన్వయించి నచో, నీ వడ్డిరాజుల తిరుగుబాటునకు ప్రోద్బలమొసంగినది రెడ్డిసామంతులేయని తోచుచున్నది. విద్రోహమింత ప్రబలమగుట చేతనే ప్రతాపరుద్ర చక్రవర్తి దాని నణంచుటకు స్వయముగ బయల్వెడలి యుండును. పై చర్చనుండి క్రీ. శ. 1313-14 లో రెడ్డినాయకులు దమ యాశాభంగమునకు బ్రతీకారముగ గండికోటప్రాంతమున చక్రవర్తిపై తిరుగుపాటు చేసియుండిరని స్పష్టమగుచున్నది.

ఈపరాజయమువలన నిరుత్సాహులుగాక రెడ్డినాయకులు మఱియొక సమయమునకై వేచియుండిరి. క్రీ. శ. 1320.వ సంవత్సరమున మఱియొకతూరి తురుష్కులాంధ్రదేశముపై దండెత్తివచ్చిరి. దక్షిణమున పాండ్యులు కాంచీనగరము నాక్రమించి యందలి యాంధ్రప్రతినిధిని బారదోలిరి. మహమ్మదీయుల యొత్తిడి యధికమగుటచే, ప్రతాప . రుద్రచక్రవర్తి పాండ్యుల విజయములను సరకు సేయక సామ్రాజ్యమునందలి సైన్యముల నెల్ల నుత్తర భాగమున కేంద్రీకరించి తురుష్కులతో హోరాహోరిగి బోరు చుండెను. ఇటు లాంధ్రదేశమును, కాకతీయరాజవంశమును చావుబ్రతుకులకు లోనై యుండి తమస్వాతంత్ర్యమునకై పోరుచుండిన క్లిష్టసమయమున స్వార్థపరులగు రెడ్డి నాయకులు కేవలస్వాభిమానపూరితులై చక్రవర్తిపై దమ పగనుదీర్చుకొన మంచిసమయము దొరకినదని సంతసించిరి. అప్పుడు ప్రోలయవేమారెడ్డి బంధుమిత్రపరివారసహితుడై ధరణికోటప్రాంతమునకేగి యచ్చట విజయపతాకను నెలకొల్పి స్వాతంత్ర్యమును బ్రకటించెను. అనుభవజ్ఞులు విశ్వాసనీయులు మహాశూరులునగు గుండయనాయకసోమయనాయకాది కాకతీయసేనానులు గతించి యుండిరి. ఇతరసేనానులు నితరబలములు నెల్లరుత్తరమున తురుష్క సమరమున నిమగ్నులై యుండిరి. దానజేసి ప్రోలయవేముని స్వాతంత్ర్యస్థాపనమనాయాసముగ నెఱవేఱినది. అయినను చక్రవర్తి యొకసేనను ధరణికోటపై కంపియుండెను. అల్పసంఖ్యాకులగు వీరిని మహాసూరుడును ప్రబలుడునగు వేమారెడ్డి త్వరలో నిర్జించి తన మార్గమును నిష్కంటకము నొనర్చుకొనియెను.

ప్రతాపచరిత్రమునుండి స్వార్థపరులగు నీ రెడ్డినాయకు లొనర్చిన మఱియొక స్వామిద్రోహకార్యముగూడ దెలియనగుచున్నది. ప్రోలయవేముని స్వాతంత్ర్య ప్రకటనమున గాకతీయులకొదవిన నష్టము ధరణికోటప్రాంతము తమ సామ్రాజ్యమునుండి యపహరింపబడుట మాత్రమే కాని, పై వంశచరిత్రమున బేర్కొనబడిన బొబ్బారెడ్డియను నాతడొనర్చిన కృత్యముచే కాకతీయచక్రవర్తి తురుష్కులకు బందీ

యగుటయు, నాంధ్రదేశ స్వాతంత్ర్యము నశించుటయుగూడ సంభవించినవి. క్రీ. శ. 1323 లో పరాజయపరంపరలకు వెనుదీయక, నీతూరి నిశ్చయముగ రుద్రదేవుని నాతని సామ్రాజ్యమును జయింపవలెనను పూనికతో తురుష్కులును, ప్రాణములనైన నొసంగి తమ దేశగౌరవమును దమ చక్రవర్తిని రక్షించు పూనికతో నాంధ్రులును, వెనుదీయక రణరంగమున పెనగులాడుచుండిరి. విజయలక్ష్మి యాంధ్రులవంకకే తన కటాక్షవీక్షణముల బఱపజొచ్చెను. ఇట్లు, యుద్ధపరిణామ మాంధ్రులకు ప్రమాదకరమగు స్థితినిదాటి యనుకూల్యతను వహింపగనే, యాంధ్రబలములలో జాతిభేదమూలకములగు నీ పద్మనాయకరెడ్డినాయక వైషమ్యములు పొడసూపినవి. రాజాదరణము ననుభవించుచు, మొక్కవోని సాహసమును జూపి శత్రునివారణము నొనర్చుచుండిన పద్మనాయకులు దమ సామర్థ్యవిశేషముల నించుక నుత్ప్రేక్షించియుండిరి. బహుశః చక్రవర్తిగూడవీరిని ప్రత్యేకముగ బ్రశంసించియుండును. ధరణికోటకేగినవారలు గాక మఱికొందఱు రెడ్డినాయకులు బొబ్బారెడ్డియను నాతని నాయకత్వమున జక్రవర్తి పక్షమునందుండిరి. వారలకీ పద్మనాయక విజృంభణ మసూయను గల్పించెను. ఇంతకుముం దిట్టులే ప్రత్యర్థికృత గౌరవవిశేషమునకును దమ కొనర్పబడిన నిరాదరణకును బ్రతీకారముగ ప్రోలయవేమారెడ్డి యొనర్చిన స్వాతంత్ర్యప్రకటనము వీరలకు బ్రబలమగు నాదర్శముగనుండెను. ఈ కడసారియుద్ధమున బొబ్బారెడ్డి మున్నగు రెడ్డినాయకులు చక్రవర్తికడకేగి యుద్ధమున విజయమాంధ్రుల కెట్లైనను నిశ్చితమేయనియు, మహాప్రీతిభావంతులగు పద్మనాయకులే దానిని నమకూర్పగలరనియు, నట్టిచో దాము సమరమున పాల్గొనకుండినను నష్టముండదనియు వినయోక్తులనాడి, నాటికి రెడ్డిబలములు విశ్రాంతిననుభవింపననుజ్ఞనిమ్మని ప్రార్థించిరి. ఇంతకుమునుపే బొబ్బారెడ్డి తురుష్కసేనానివద్దనుండి కొంత ద్రవ్యమును బడసి, నాడు యుద్ధమున పాల్గొన కుండుటకై యొడంబడికను చేసికొనియుండెను. ఈకుట్ర నెఱుగని చక్రవర్తి, విజయమీవఱకే తనకు గరతలామలకమై యుండెనని దలంచుచు, రెడ్లకు విశ్రమింప ననుజ్ఞనొసంగెను. యథాపూర్వముగ యుద్ధమారంభమాయెను. తురుష్కులు నాంధ్రులును ప్రాణములకు తెగించి పోరుచుండిరి. అయిన నొకేసారిగ మహాశూరులగు రెడ్డినాయకులెల్ల రంగమునుండి నిష్క్రమించుటచే దురుష్కు లినుమడించిన యుత్సాహముతో బోరుచుండ నాంధ్రసైన్యములు విస్మయమునంది కొంచెము వెనుకంజవేయ దొడంగినవి. ఈయుపద్రవము నుపలక్షించి చక్రవర్తి మదగజారూఢుడై వెంటనుండిన పరివారముతో యుద్ధరంగమున బ్రవేశించి తన సైనికులను బ్రోత్సహింపదొడంగెను.

ఇట్టి పరిస్థితి నిదివరకే యుపలక్షించి యందులకు సంసిద్ధుడై యుండిన తురుష్కసేనాని యాంధ్రసైన్యములెల్ల చెల్లాచెదరై మైమఱచి పోరుచుండుటను, స్వల్పపరివారావృతుడై ప్రతాపరుద్రదేవుడు రణరంగమున కేతెంచుటను, గాంచి యొక్కసారిగ నాతనిపై బడి, యాతని నాతని యనుచరులను బందీకృతుల జేసెను. ఇట్లు లతిశీఘ్రముగ దన కార్యము సఫలమగుటచే సంతసమందియు రణనీతిజ్ఞుడగు నీ తురుష్కసేనాని సైనికులెల్లరకు నీసంగతి తెలియక పూర్వమే బందీయగు రుద్రదేవ చక్ర

వర్తిని గలిసియు తురుష్కసేనలతోఁ గూడ రహస్యమార్గముల దేవగిరి మార్గమున బంపి నైచెను. వినను నీ విషాదకరమగు వార్త యాంధ్రబలములకు దెలియవచ్చుటచే వార లప్పుడే జీవములబాసి నిమిత్తమాత్రములగు తురుష్క ఖడ్గములకు దమ తనువుల నర్పించి నైచిరి. ఇప్పటికి నాయెనప్పిన యకార్యము నను బర్యవసానముగ నాంధ్రసామ్రాజ్యము ను దనస్వాధీనముగాఁ జేసికొందిగిను పశ్చాత్తా పము రణమునను దూరమునందుండిన రెడ్డి నాయకుల కొదవినది. ఒకేసారిగ తురుష్కుల పైబడి, మోసపుంగొనగిను శత్రుసంహార మొ నర్చి, వారలు దమ యేలికను విముక్తునిజేయ ప్రయత్నించిరి. కాని, ప్రతాపరుద్ర దేవుడు తురుష్క శిబిరమున దాసమయమున బందీగ నుండి యింతసిజమో యీయనుమవేశప్రాణిత సమరమున రెడ్డిరాజుల విజయముగూడ సంత సాధ్యముగనే యుండెను.

ఒకప్పుడు పిల్లలమఱ్ఱి బేతిరెడ్డి కాకతి రుద్రునికి దక్షిణహస్తము దయ్యి, దనరాజును దన దేశమును రక్షించుటకై ప్రాణమును సహితము ముంచుపులతోడి యుద్ధమున వ్యయం చియుండెను. అట్లనే రుద్రిరెడ్డి గణపతిదేవు డు దేవగిరిలో బందియై యుండుతరి నాంధ్ర దేశమును గబళింప నేతెంచిన నాగతిరాజాది శత్రువీరుల ననేకుల సర్జించి, యాంధ్ర భూమిని దన బాహుబలమున బరిరక్షించి, గణపతిదేవుని వశముచేసి కాకతిరాజ్య స్థాప నాచార్యుడై వాసికెక్కె, కళింగదేశాది వివిధ రాజ్యముల దన యేలికకై జయించియుం డెను. ఇట్టి మహారాజభక్తిపరాయణులగు నీ రెడ్డి నాయకులకు బ్రతాపరుద్ర చక్రవర్తి కాల మున బదచ్యుతి పూర్వకమగు మహాపరాధ మొనర్పబడియెను. పద్మనాయకుల బ్రోత్స హించుటచే. చక్రవర్తి తమ కపచారమొన ర్చుటచే రెడ్లకు పద్మనాయకుల యెడను, జక్ర వర్తిపైనను, సహజమగు ద్వేషముద్భవించెను. దీనిని వారలు క్రీ. శ. 1314 లో విద్రోహ ముఖమున వెలిబుచ్చి యుండిరి. పద్మనాయక పాలనమునం దత్యంతవిశ్వాసముగల చక్ర వర్తి వీరియెడ సానుభూతిని జూపక దండనీతి నవలంబించుటచే, చేయునదిలేక నసహాయస్థి తిముగు కాకతీయసామ్రాజ్యవాతావరణము నం దుండజాలక, ననుకూలపరిస్థితు లుద్భవిం చినతోడనే రెడ్లుస్వతంత్రించి స్వరాజ్యమును నెలకొల్పిరి. ప్రతాపరుద్రదేవుని యనంతరమున కాకతీయసామ్రాజ్యమస్తమింప, దత్సామ్రాజ్య మున ప్రబలులై యుండిన పద్మనాయకులును రెడ్డినాయకులు నాంధ్రదేశమున కధికారులై యుత్తరదిశ నొకరును, దక్షిణభాగమునందొ కరును స్థిరపడి, యాంధ్రభూమి నేలదొడగిరి. ఇదేసమయమున బ్రతాపరుద్రుని కోశాధ్యక్షు లుగనుండిన సోదరు లిర్వురు దక్షిణపశ్చిమ దిశకేగి విజయనగరరాజ్యమును నెలకొల్పిరి. ధరణికోటలో విజయమును బ్రకటించిన ప్రోల యవేమారెడ్డి వినుకొండదుర్గమునను, పిమ్మట కొండవీటిదుర్గమునను, దన రాజ్యమును స్థాపిం చెను. ఈ రెడ్డిరాజ్యము దినదినాభివృద్ధినంది యొకటిన్నర శతాబ్దములకాల మాంధ్రదేశ మును తురుష్కులబారినుండి పరిరక్షించినవిధ ము రెడ్డిసామ్రాజ్య చరిత్రమునం గాంచనగును.

## XV విశేషాంశములు

వరంగల్లుజిల్లా ఖాజీపేటగ్రామములో నొక దర్గాలో బిగింపబడిన శాసనమొకటిగలదు. దానినుండి కాకతీయులనుగూర్చి వింతచరి

త్రాంశములు దెలియుచున్నవి. ఇటీవల బయల్వెడలిన యీవిషయములు లేనిచో గాకతీయుల చరిత్రము సమగ్రముకానేరదు. గాన వాని నీక్రింద పొందుపరచుచున్నాము—

1. వంశావళి:—ఇంతకుబూర్వము కాకతిబేతరాజే యీవంశీయులలో మొదటిరాజని చరిత్రకారులు దలచిరని చెప్పి, యతనికిపూర్వుడాతనితండ్రియగు మొదటి ప్రోలరాజు రాజ్యమేలెనని సప్రమాణముగ నిరూపించియుంటిమి. ఖాజీపేట శాసనమా సిద్ధాంతమును బలపఱచుచు మొదటి ప్రోలరాజుతండ్రి బేతరాజు మఱియొకండు కలండని దెల్పుచున్నది. ఇందుచే గాకతీయవంశావళి మఱికొంత వెనుకకు జరుగుచున్నది.

2. కాలనిర్ణయము:— వంశవృక్షమునుబట్టి కాకతీయరాజుల కాలనిర్ణయముగూడ నాశాసనము వలన మారుచున్నది. ఇంతకుబూర్వము వేంగీచాళుక్యరాజగు రెండవ అమ్మరాజు కాలమున కాకర్త్యగుండ్యన ప్రశంస చేయఁబడినదనియు, నాగుండ్యన క్రీ. శ. 950—999 ప్రాంతమువాడనియు, నప్పుపై క్రీ. శ. 1050-1080 నాటి మొదటిప్రోలరాజునుగూర్చియే మన మెరుగుదుమనియువ్రాసియుంటిమి. దానిని బట్టి గుండ్యనకును ప్రోలరాజునకును నడుమ 50 సంవత్సరములకాలము గలదనియు, నప్పటిచరిత్రము మనకేమియు దెలియదనియు చెప్పియుంటిమి. ప్రకృతఖాజీపేటశాసనమాకొఱతనుదీర్చుచున్నది. ఇందుండిదెలియనగు బేతరాజు, త్రిభువనమల్ల బేతరాజునకు తాతయగుటచే నాతనిని మొదటి బేతరాజని పిలువవచ్చును. అప్పుడీ మొదటి బేతరాజు క్రీ. శ. 1020-1050. నాటివాడగును. ఈవిధముగా గుండ్యనకు నీతనికి యిరువది సంవత్సరముల వ్యత్యాసముండును. సామాన్యముగ చరిత్రకారులు బురుషాంతరమునకు ముప్పదిసంవత్సరములనంతును బరిగణింతురు. కాని కాకతీయ రాజులందరును సుదీర్ఘకాలము రాజ్యమేలినవారే. గాన నీమొదటి బేతరాజు క్రీ. శ. 1000-1050 ల నడుమ రాజ్యమేలెనని చెప్పవచ్చును. అప్పుడు కాకతీయుల వంశకాలముల నీక్రింది విధమున నిర్ణయింపవచ్చును—

కాకర్త్యగుండ్యన

* * *

మొదటిబేతరాజు (1000—1050)

|

మొదటిప్రోలరాజు (1050—1080)

|

రెండవబేతరాజు (1080—1115)

|

రెండవప్రోలరాజు (1115—1158)

|

రుద్రదేవుడు (1158—1195) — మహాదేవుడు (1195—1199)

|

గణపతిదేవుడు (1199—1261)

|

రుద్రాంబ (1258—1296)

|

ప్రతాపరుద్రదేవుడు (1296—1326)

(3) మొదటి బేతరాజు:—ఈతడు "కాకతిపురాధినాథు" డని పేర్కొనబడియున్నాడు. దానికి కాకతిపురమను గ్రామమునకు నాథుడని యర్థము చెప్పినచో నా గ్రామము మెచ్చ

టిదను సమస్య బయల్వెడలును. ఇంతకు బూర్వము మైసూరు రాజ్యములో "కాగతి" గ్రామము గలదనియు, గాకతీయులకు దానితో నేమైన సంబంధముండుననియు, వ్రాసియుంటిమి. ఈ ఖాజీపేట శాసనములోని "కాకతి పురాధినాథ" యను విశేషణ మీయూహను బలపరచుచున్నది. మఱియు నీ బేతరాజు "చోడకటకపాళ చమూవార్ధి ప్రమథన సమార్జిత...లక్ష్మీకః" యని చెప్పబడినాడు. అనగా 11-వ శతాబ్ది ప్రారంభమున నాతనికి చోళులతో వైరమేర్పడెనని యర్థము. దీని నొక విధమున సమన్వయింపవచ్చును. చాళుక్య అమ్మరాజు మరణానంతరము వేంగిదేశమునందల్లకల్లోలము జరిగినది. ఆ సమయమున గాకర్త్యగుండ్యనయు నాతని వంశీయులును స్వతంత్రులై దమ యధికారమును నెలకొల్పిరని యిదివరలో వ్రాసియుంటిమి. మొదటి ప్రోలరాజిటులే కాంచీపుర చోళులతో బోరెను. 11-వ శతాబ్దారంభమున దాక్షిణాత్యచోళులు వేంగిదేశముపై దండెత్తి వచ్చిరి. ఆ సమయమున స్వార్థము నుద్ధరించుకొన యత్నించుచు గుండ్యనకు దిరువాతి వాడగు నీ మొదటి బేతరాజుగూడ చోళులతో బోరి, స్వార్థమును రక్షించుకొనెనని తోచుచున్నది.

(4) మొదటి ప్రోలరాజు:—ఈతనిని గూర్చి యపూర్వములగు విషయము లెన్నియో తెలియుచున్నవి. ఇతడు "నిర్వక్రీకృత చక్రకూట విషయు"డు. ఈప్రోలరాజునకు సమకాలికముగ క్రీ. శ. 1060.ప్రాంతమున వేంగీచాళుక్యరాజరాజును, అతనిపుత్రుడును, పిమ్మట కులోత్తుంగ బిరుదముతో నాంధ్ర ద్రవిడదేశముల నేలినవాడునగు యువరాజరాజేంద్రుడును, చక్రకూటముపై దండెత్తిరని వేంగీచాళుక్య చరిత్రమునుండి తెలియుచున్నది. ఇదేకాలమున ప్రోలరాజు నాగపురముపైనే దాడివెడలుట వింతగనున్నది. ఇంతకుబూర్వ మీ ప్రోలరాజు చరిత్రను వ్రాయుచు కులోత్తుంగునికి సాయమొసర్చినవారిలో నీతడుగూడ నుండెనని చెప్పియుంటిమి. రాజరాజు మరణించునాటికి రాజేంద్రుడు చక్రకూటమునందుండెను. ఆతడటనుండి మరలినపిమ్మటనో, లేక నాతనికి సహకారిగనో, యీప్రోలరాజు చక్రకూటముపై దండెత్తెనని యూహింపవచ్చును. మఱియు నీప్రోలరాజు "భద్రంగ విద్రావణు"డట. నైజాంరాష్ట్రములోని పెక్కల్లుగ్రామమందలి రెండుశాసనమున "భద్రంగ పురవరాధీశ్వర" బిరుదాంచితులును, "రావుతు" శబ్దవాచ్యులునగు గొందరు మండలీకులు ప్రశంసింపబడియున్నారు. వారు కాకతిరుద్రునికి సామంతులు. దీనినుండి ప్రోలరాజీ మండలీకులను జయించెనని తెలియుచున్నది. ఇంతియగాక నీరాజు కొంకణమండలమును జయించి, కొడవర్తి దుగ్గరాజు కొడుకునుజంపి, పురకూటదేశమును, గొన్నరాజునుజయించి మఱికొంతభూమిని వశపఱచుకొని, యీప్రదేశముగల అనుమకొండ విషయమును, త్రైలోక్య మల్లుని వద్దనుండి శాసనపూర్వకముగా బొందెను. ఈత్రైలోక్యమల్లుడు పశ్చిమచాళుక్యరాజు. దీనినుండి గొన్నివిశేషములు దెలియుచున్నవి. రెండవబేతరాజు త్రిభువనమల్ల విక్రమాదిత్యునికి సామంతుడు. మొదటి ప్రోలరాజు విషయమై యిట్టిదేమియు నింతవరకును దెలియదు. పశ్చిమచాళుక్యులలో విక్రమాదిత్యునికి బూర్వమీతనియన్న రెండవ సోమేశ్వరుడును, తత్పూర్వము వారి తండ్రియగు మొదటి సోమేశ్వరుడును రాజ్యమేలిరి. రెండవ

చేతరాజును విక్రమాదిత్యుడును సమకాలికు
లైనవారో, బేతరాజు తండ్రియగు మొదటి
ప్రోలరాజు, రెండవ సోమేశ్వరునికి సమకాలి
కుడును, సామంతుడునైయుండును. హనుమ
కొండకన్నడశాసనములో నైజదండాధినాథుడు
దనయేలికయగు రెండవ బేతరాజుచే "త్రిభువన
మల్లునికి మొక్కించి యీతని కాచక్రవర్తి
సబ్బిసాయిరమండలము నిచ్చునట్లొనర్చె"నని
చెప్పబడియున్నది.

దీనినుండి యీపూర్వ కాకతీయరాజులు
పశ్చిమ చాళుక్యులకు లోబడి, చాళుక్యసా
మ్రాజ్యములోని భాగములనేలుచు, దమకు
ప్రాగ్దిశనున్న వేంగిరాజ్యముపై దండెత్తివచ్చి
నవారిని దఱుముచు, నాత్మరక్షణనుజేసికొను
చు, వీలగునప్పుడెల్ల దూర్పుతీరమున రాజ్య
మును సంపాదించుచుండిరని స్పష్టమగు
చున్నది.

నైజాంరాష్ట్రములోని సూర్యాపేట తా
లూకాలోని జలాల్‌పూరుగ్రామములో నొక
శాసనముగలదు. అందు "బాణస్వరేశాస" పరి
మితమగు శకవత్సరమున "రుద్రదేవసృపతికి
సామంతుడగు చెఱుకు బొల్లిరెడ్డి చేసినధర్మము
దెలుపబడియున్నది. దీనికాలము శా.శ. 1175
కు సరియగు క్రీ. శ. 1253 అగుచున్నది.
ఈ కాలమున రుద్రదేవాభిదలు రుద్రాంబ
తప్ప నింకెవ్వరునులేరు. ఈమె క్రీ. శ. 1260
లో గాక క్రీ. శ. 1258 నుండియు రాజ్య
మేలుచుండినదని యింతకుముందు చెప్పియుం
టిమి. ప్రకృతశాసన మారాజ్ఞి క్రీ. శ. 1253
నుండియే యిట్టి కర్తవ్యమును నిర్వహించు
చుండెననియు నా సంవత్సరమునుండియే గణ
పతిదేవ రుద్రాంబికలు సంయుక్తపరిపాలన
మొనర్చిరనియు స్పష్టమగు చున్నది.

# XVI ఉపసంహారము.

సుమారు మూడునందల సంవత్సరముల
కాలము, రాజిల్లి యాంధ్రులకీర్తిని దిగంత
విశ్రాంత మొనర్చినది గాకతీయ సామ్రా
జ్యము. వేంగీచాళుక్య సామ్రాజ్యాంత్యకాల
మున దలయెత్తి, యప్పుడాంధ్రదేశమునం దొద
విన యల్లకల్లోలములనుగడచి, యథాసాధ్య
ముగ స్వార్థము నభివృద్ధిపఱచుకొనుచునప్పు
టికి ప్రబలురుగనుండిన బశ్చిమచాళుక్యుల
నాశ్రయించి దన్మూలమున నాంధ్రదేశమున నీ
వంశీయులు స్థిరవసతిని గల్పించు కొనిరి. 11-వ
శతాబ్ది యుత్తరార్ధ మంతమగుసరికి బశ్చిమచా
ళుక్యసామ్రాజ్యమే యస్తమయావస్థనందుట
చే, నిటనుండియు గాకతీయులు చాళుక్య
మండలీకులను జయించివారి మండలములను
దమరాజ్యమున గలిపికొని, అనుమకొండనుండి
దమప్రభావము నెల్లెడలను విస్తరించుకొనిరి.
పిమ్మట నీకాకతీయవాహిని దూర్పుతీరమును
గలంచి, దత్తమండలములపై గూడ బడినది.
13వ శతాబ్దిలో గణపతిదేవచక్రవర్తి కాల
మున ప్రకృతనైజాంరాష్ట్రమునందలి తెలిం
గానాప్రాంతమును, దూర్పుతీరమున గోదా
వరి కృష్ణాగుంటూరు నెల్లూరుమండలములు
ను, దత్తమండలములలో విశేషభాగమును,
గాకతీయ సామ్రాజ్యముగ మారినవి. అంతి
యగాక కాంచీపురమువరకును గల భాగము
గూడ గొంతకాల మాంధ్రుల వశముననుండి
నది. ప్రతాపరుద్రచక్రవర్తి యీసామ్రాజ్య
మునంతటిని బరిపాలించి, దూర్పున సింహాచల
మువరకును, దక్షిణమునం దొకప్పుడు శ్రీరం
గమువరకును, బశ్చిమమున మైసూరురాష్ట్ర
ములోనికి గూడ దనరాజ్యమును విస్తరింప
జేసెను.

సామ్రాజ్యము శోభాయుతమై విఖ్యాతముగూడ నీకాలమునం దాంధ్రదేశమున వర్ధిల్లినది. ఆంధ్రవాఙ్మయాభివృద్ధికి రుద్రదేవు డేర్పరచిన యంకురము సమగ్రాభివృద్ధి నొంది ప్రతాపరుద్రదేవుని కాలమున సుమనోహరముగ బుష్పించినది. ఆంధ్రకవితల్లజు లేకశిలానగరమున గీర్వాణాంధ్రభాషాయోషలకు విలాసనిలయములను నేర్పరి. శిల్పనాట్యకళ లపూర్వమగు నభివృద్ధిని గాంచినవి. కాలముయొక్కయు ప్రకృతియొక్కయు క్రౌర్యమును బ్రతిఘటించి, ప్రాచీనాంధ్రుల నిర్మాణకౌశలమును, కాకతీయచక్రవర్తుల కళాభినిరతిని, వేనోళ్ళజాటు కట్టడము లనేకములు నేటికిని నిలచియున్నవి.

ఈచక్రవర్తులకడ సామంతులుగను, యుద్యోగులుగనుండి, యప్పటి వైజ్ఞానికాసక్తిని జవిచూచిన ప్రోలయవేమునును, హుక్కబుక్క రాజసోదరులును, విమ్మట దామునిర్మించిన రాజ్యముల కేకశిలానగరసామ్రాజ్యమునే యాదర్శముగ గొనిరి.

ఇట్టులపూర్వశోభాయుతమై, నిరుపమమైనెలుగొందిన కాకతీయసామ్రాజ్యము, కడకు దైవోపహతులగు నాంధ్రుల బుద్ధిమాంద్యమునలననే నశించినది. జైనశైవమత సంఘర్షణము గొంతవరకును, రెడ్డిపద్మనాయకవైషమ్యములు గొంతవరకును, ప్రతాపరుద్రచక్రవర్తి యనూయాపరుష్టై యితరరాజుల సాహాయ్యమును గోరకుండుటయు, వారలు శత్రువులతో జేయి కలిపియుండి నిర్లక్ష్యము వహించుటయు, దక్షిణాపథమును జయించునెడ మహమ్మదీయులోనర్చిన ప్రయత్నములును, నేకకాలముననే సామ్రాజ్యపు బ్రాగ్పశ్చిమ దక్షిణముల వలజడిగలిగి, యదే సమయమునం దుత్తరమునుండి తురుష్కులు దండు వచ్చుటయు, కడను సామ్రాజ్యము జీవన్మృత్యుసమస్యను లోనైయుండునెడ రెడ్లొనర్చిన ద్రోహము గొంతవరకును, మహోన్నతమగు నీయాంధ్రసామ్రాజ్యము నశించుటకు గారణములు.

మొట్టమొదట నాంధ్రభాగమునంతటిని తమ యేకఛత్రాధిపత్యమునకు దెచ్చి, సాంఘిక రాజకీయ మతార్థిక వాఙ్మయ శిల్పములలో నూతనాదర్శములను నెలకొల్పి, యాధునికాంధ్రుల కనేక విధముల మార్గదర్శకులై యొప్పిన యీకాకతీయాంధ్రచక్రవర్తులు చిరస్మరణీయులై యొప్పుదురుగాక!

220 XV వ ప్రకరణములోని ఖాజీపేటశాసనము నాచే J. A. H. R. S. Vol. VII, p 2 లో ప్రకటింపబడినది.



# కాకతీయరాజధాని ప్రశంసా.*

శ్రీయుత విద్వాన్ ముదిగొండ వీరేశలింగశాస్త్రి గారు.

ఉ. ఎయ్యది కాకతీయనృప ♦ తీశ్వర పాణిపయోజమాలి క
న్నుయ్యెలలూపగా బడెనొ ♦ యుజ్జ్వలదైశికగీతికారతిన్
ఎయ్యది రుద్రమాంబ మహ ♦ నీయ పవిత్రచరిత్ర శాలయం
బయ్యెనొ యట్టియీపురి మ ♦ హత్త్వవిలాసము లెంచ శక్యమే.

సీ. కాకతీయనృపాల ♦ కాలనిర్మిత రమ్య, శిల్పంబుకనుల వీ ♦ క్షించు నపుడు
వేయి స్తంభంబుల ♦ విలసిల్లు నిచ్చోటి, దేవాలయంబున ♦ దిరుగునపుడు
పద్మాక్షి సిద్ధేశ ♦ వరశంభులి గాడి, వివిధాలయముల సే ♦ వించునపుడు
ఏకశిలాస్థలి ♦ శ్రీకలితానంద, కరసౌఖ్య మస్థితి ♦ గాంచునపుడు
చిత్రపటమందు బోలెను ♦ చిత్రితమయి, హృదయకుడ్యంబునందు స్తంభించు ప్రకృతి
తనువు గికురించు గద్గద ♦ ధ్వని జనించు, సరసగుణులార యో సభా ♦ స్తారులార.

సీ. సారస్వతారామ ♦ సరణిలో వెలసిన, గొనబైన మల్లెపూ ♦ గుత్తియనగ
మార్దంగికధ్వని ♦ మరపించి కలికించు, కమనీయ శరదభ్రి ♦ కళిక యనగ
కవిమానససరోజ ♦ కాంత సత్పథగతి, నామోదమందురా ♦ యంచయనగ
లక్ష్మీవిలాసన ♦ లలితనర్మక్రీడ, నచ్యుతుం డాడెడి ♦ హారమనగ
దిశల నాత్మీయకాంతులు ♦ దేజరిలగ, నెలమి నానందవారిధి ♦ నీదులాడి
విశ్రమించెను కాకతి ♦ విపులకీర్తి, సరసగుణులార యో సభా ♦ స్తారులార.

సీ. కవికులతిలకుడై ♦ గ్రాలువిద్యానాథు, కవిత విహారంబు ♦ గనినచోటు
మైలారుభటుల వి ♦ స్మయకర సాహస, కార్యముల్ జరిగిన ♦ ఘనతలంబు
వీరశైవులు భక్తి ♦ పారవశ్యత గండ, కత్తెరల్ గొన్నట్టి ♦ కర్మభూమి
శివదేవకవివర్య ♦ స్థిరమైన నయలక్ష్మి, తాండవమాడిన ♦ ధరణితలము
సోమనాథాది కవిబుధ ♦ స్తోమచరణ, కమలవిన్యాసపూతమై ♦ కశిలపురము
గనిన నెవ్వని చిత్తంబు ♦ గరగకుండు? సరసగుణులార సత్సభా ♦ స్తారులార.

---

* ఈపద్యములు కాకతీయ వర్ధంత్యుత్సవసభలో జదువబడినవి.

"సంపాదకుడు".

# కాకతీయరాజుల విజయబిరుదప్రశస్తి.

శ్రీయుత డాక్టరు బుర్రా శేషగిరిరావుగారు.

శ్రీ

స్వస్తి। సమస్త పంచమహాశబ్ద। మహామండలేశ్వర। రాజపరమేశ్వర। ఉద్దండమండలాగ్ర ప్రచండ। నెలవీడుగండ। ఘనసింహాసనాంత। అద్రికటకవజ్రప్రాకార। త్రిభువనీరాయ రాహుత్తరాయ। ధనుర్విద్యావిహారణ। విజయప్రతీకాతిమష్టుఖ। వివేకనారాయణ। ఆశ్రితజనకల్పవృక్ష। అన్యఘనసూర రాయమానసమర్థప । అష్టదిగ్రాయమాంచాళ్లు । అహిపటవతేరాయమాంచాళ్లు। దేచబహుత్తోకుర్క రాయమాంచాళ్లు। దండుగంపుశౌచ్చళ్లోరాయమాంచాళ్లు। కుటిలదేదబాదుదేద। కొమరమీసరగండ। హానసుంటలీకాంచాళ్లు। యియ్యాగౌరాణివాస ముఖతగతేరాయమాంచాళ్లు। బిరుసునియ్యకొని మన్నియమన్నెణ। ఢిల్లీ తెఘునాతె కుమారరాయమాంచాళ్లు। శ్రీయోగానంద నరసింహదేవర దివ్య శ్రీపాదపద్మారాధకులైన శ్రీకాకతిరాజుల అన్వయబిరుదప్రశస్తి। విజయీభవ॥ దిగ్విజయీభవ॥ *



* శ్రీ కాకతీయ సద్గుణైశ్వర్యతిస్నాహ్వాన సంఘాధ్యక్షులకు ఆంధ్రభారతీతీర్థప్రధాని విజయవిభవాశీర్వచనమాలతో, వినయపూర్వకముగా, సహర్షముగా, మంగళాచరణసూచకముగా, సగౌరవముగా చదివించుటకై శ్రీవీరశిలానగరమునను పంపినది.

(ఇవి శ్రీ కీర్తిశేషులైన గురుజాడ వేంకట అప్పారావుగారి "విజయనగరం చరిత్రరికార్డు" లోనుండి వ్రాయించినది)

# ప్రతాపరుద్రునికాలపు ముఖ్తాసనదు.

శ్రీయుత ఒద్దిరాజు రాజేశ్వరరావుగారు, బి. ఏ., యల్. యల్. బి.

(వ రా హ ము, ది రె.)

స్వస్తి శ్రీ విజయాభ్యుదయ విజితాఖిలభూపగణ శ్రీసమధిగతపంచమహాశబ్ద మహా మండలవీర ఏకశిలానగరవరవీర మహావీర వతిహితచరిత వినయవిభూషణ శ్రీమన్మహా మండల వీరవసురోద్దండ వీరప్రతాపరుద్రమహారాజుగారు దిగ్విజయవిజయరాజ్య ముత్తరోత్తరోత్తరాభివృద్ధి ప్రవర్తమాన మాచంద్రతారార్కముగా నేకశిలానగరమునందు సుఖ సంపదవినోదంబున రాజ్యంబుసేయుచు శాలివాహనశకవరుషంబులు ౧౨౩౦ యగు విజయ నామ సం॥ వైశాఖ శు ౧౫ గురువారంనాడు వుదయరాజువీరభద్రయ్యగారికి పడమర పుట్టకెకందకందగువను హనుమత్ గిరిచెర్వు నీరుముప్పుమీాది కుంట ప్రతి సం॥ మూాడువరహాల పైకం చెల్లించుడంకు నిబంధనంచేసి ఇచ్చిన జీవన్ముఖ్తాసనదుపత్రిక యిందుకు వుండబడిన హద్దుల నిర్ణయం.

తూర్పు స్తంభంభావిదగ్గరి, శాసనం. యీాశాసనం చాలున దక్షిణం కుంటకొమ్ముకు తూర్పుశాసనం. యీాశాసనంచాలున పడమర గుండుమీాదబద్దులు యీాబద్దుల నైరుతిదిశ యకునేల పర్పుబండమీాద చాలుబద్ది యీాచాలుబద్దికుంటకొమ్ము దక్షిణదిశకు వెన్నుగడ్డను శాసనం. యీాశాసనంచాలున పడమర వుసికకోలుదగ్గర శాసనం. యీా రెండు శాసనములమధ్య చాకిరాజుకుంటపాలిమరకు బుడుగున గుంటచెందుర్తిని శాసనం. యీాశాసనం గర్భంచాలున పడమర గుండంకొమ్మున శాసనం యీాశాసనం చాలున వుత్తరం చెఱ్వున కోలుగడ్డను శాస నం. యీాశాసనంచాలున తూర్పు కుంటకొమ్ముకు వుత్తరంశాసనం, యీాశాసనంచాలున ప్రథమ శాసనంకలియు యీాచొ॥ చతురాశ్రమం శాసనంలు లోగావుండబడిన భూమిలో త్రికాలముల యందు ఫలించేధాన్యములు ఫలపర్చుకొని మీాపుత్రపౌత్రపరంపరం ఆచంద్రార్కం అనుభ వించుతూ నిరంతరం ఆశీర్వచనం చేస్తూ వుండవలసినది. ఇది సత్యశాస్వితం.*

---

*దీని మాతృక ఒద్దిరాజువారింట గలదు.

# హానుమకొండ స్థానికచరిత్రము.

శ్రీయుత పింగళి వెంకటేశ్వరరావుగారు

ప్రస్తుతము మనము నివసించుచున్న భూభాగము భరతఖండములోఁ త్రిలింగదేశమను నామాంతరము గలదై, యాంధ్రదేశమై, చరిత్రలలో సుప్రసిద్ధముగ నున్నది ఈ ఆంధ్రదేశమునకు ఏకశిలానగరంబను నోరుగల్లు రాజధానిగ నుండుటకుఁ బూర్వము యీ అనుమకొండ (హానుమకొండ) రాజధానిగ నుండి ప్రసిద్ధచారిత్రము గలదై యుండినది.

ఈస్థలమునకు సమీపమున కనఁబడుచున్న హానుమద్గిరి పర్వతమునకును, మఱియు దానికి పడమర దిశనుగనబడుచున్న పద్మాక్షి దేవాలయమునకును, మధ్యనున్న ప్రదేశమున "ఎఱుకుదేవరా" జను పేరుతో వ్యవహరింపఁబడు కిరాతకుఁ డొకఁడు శ్రీశైలప్రాంతారణ్య ప్రదేశంబుల స్వేచ్ఛావిహారము సల్పుచు, తన యనుచరులతో గూడి యిటకేతెంచి యొక గ్రామమును నిర్మించి, క్రమక్రమముగ విస్తరింపఁజేసెను.

ఇతనికి "అనుముఁడు, కొండఁడు" అను నిద్దఱు పుత్రులు జనించిరి. ఈ యిరువురి పేరట నీరాజధానీనగరమునకు "అనుమకొండ" యను నభిధానము గలిగినది. ఎఱుకుదేవరాజునకు పిమ్మట అనుముఁడు కొండఁడును, అటుపిమ్మట నాగఁడు, గార్గేయుఁడు ననువారలు నీదేశమును ౧౮౬ సంవత్సరములు పరిపాలన జేసిరని చరిత్రలలో దెలుచున్నది.

ఈ కిరాతకులకుఁ బిమ్మట కందారమను పట్టణమును రాజధానిగఁ జేసుకొని పాలించుచున్నట్టి చంద్రవంశజుఁడైన సోమదేవరాజు కుమారుఁడైన మాధవవర్మకీభాగము వశమయ్యెను ఇతనితల్లి "సిరియాలదేవి". ఈమెనుగుఱించి యొక కథ గలదు. కాని వ్యాసవిస్తరభీతిచే నిట వదలితిని. మాధవవర్మ శా. శ. ౨౩౦ వ సంవత్సరము మొదలుకొని శా. శ. ౩౯౦ వఱకు పాలనముజేసియుండెను. తదుపరి చంద్రవంశరాజులు యీ అనుమకొండ పాలనము జేసినట్లు చరిత్రలయందు సూచింపఁబడి యున్నది. కాని కాలనిర్ణయములో చరిత్రకారులు భిన్నాభిప్రాయులై యున్నారు.

క్రీ.శ. ౨౩౦ మొదలుకొని క్రీ.శ. ౧౦౫౭ వఱకు నిజమైనచరిత్ర వివరముగఁ దెలియు సాధనములు లేవు గాని, కొన్ని శాసనములను బట్టి ఐదవ శతాబ్దమునుండి ఎనిమిదవ శతాబ్ది మధ్యవఱకు పశ్చిమ చాళుక్యలును, పదియవ శతాబ్దాంతమువఱకు రాష్ట్రకూటులును, తరువాత మఱల పశ్చిమచాళుక్య చక్రవర్తియగు త్రిభువనమల్ల విక్రమాదిత్యుఁడు పదకొండవ శతాబ్దమధ్యమువఱకు, అనగా క్రీ. శ. ౧౦౭౬ నుండి క్రీ. శ. ౧౧౨౬ వఱకు రాజ్యపాలనము జేసెను. అప్పుడీభాగమంతయు వివిధ భాగములుగ నేర్పడి వేర్వేఱు మండలాధిపతులచే బాలింపఁబడు చుండెను. వీరిలో "కాకతీయులు" నొకరుగా నుండిరి. వీరు మొదట మహారాజులవద్ద గొప్ప యధికార పదవులు సంపాదించి వారియనుగ్రహముచే సేనాధిపతులుగను, మంత్రులుగను, సామంతమాం



వారంగల్ కోట — వెంకటేశాలయములోని స్తంభము.

By Courtesy of H. E. H. The Nizam's Archaeological Department.



రామప్ప దేవాలయము.— లోపలిగోడపై శిల్పము.



రామప్పదేవాలయ ద్వారము.

By Courtesy of H. E H. The Nizam's Archaeological Department.

డలికులుగనుండి, క్రమక్రమముగ చాళుక్య చక్రవర్తులు క్షీణించినకొలఁది బలవంతులై, త్రైలింగసామ్రాజ్య స్థాపకులై మూఁడు శతాబ్దములవఱకు వరాక్రమముతో, జనమనోరంజకముగ, శత్రుభయంకరముగను రాజ్య పరిపాలనముజేసి తమ యశస్సును, కీర్తిని నలుగడల వ్యాపింపఁజేసి శాశ్వత యశంబుఁ గాంచిరి.

పశ్చిమ చాళుక్య చక్రవర్తియైన యాఱవ విక్రమాదిత్యుని కాలమున "కాకతి బేతరాజు" ఆంధ్రదేశములోని "సబ్బిసాయిర" మను మండలమును సామంత మాండలికుఁడై పాలించుచుండెను. ఇతనిమరణానంతర మీతనికుమారుఁడు "కాకతి ప్రోలరాజు" రాజ్యభారము బూని, బుద్ధి చాకచక్యమువలనను, రాజ్య తంత్రజ్ఞానమువలనను, చక్రవర్తి మహాప్రధానులలో నొకఁడై యుండి, చక్రవర్తి మరణానంతరము స్వతంత్రుఁడై త్రిలింగ సామ్రాజ్యము నిర్మించుటకు పునాదు లేర్పఱచి, సామంతమాండలికులను, చక్రవర్తి సేనానాయకులను గెలిచి, "జగత్ కేసరి" యను బిరుదమును వహించి యుండెను. ఈ ప్రోలరాజునే త్రైలింగ సామ్రాజ్య స్థాపకునిగను, మూలపురుషునిగను యెన్నుకొనుట యుక్తముగ గన్పట్టుచున్నది. ఈప్రోలరాజునకు యితని భార్య "ముప్పమ్మ" వలన నైదుగురు పుత్రులు జనించినట్లున్నది. మొదటి యిద్దరి నామములు "రుద్రదేవుఁడు, మహాదేవుఁడు". కడపటి ముగ్గురి నామములు చరిత్రలయం దెక్కడను గానరాకున్నవి.

ప్రోలరాజు బహుకాలము పరిపాలనము జేసిన తరువాత నొకనాడు అతని పెద్దకుమారుఁడైన రుద్రదేవుఁడు దేవాలయమున గాఢనిద్ర జెందియున్న కాలమున ప్రక్కనుండి పోవుచు నాతనిస్పృశించెను. రుద్రదేవుఁడు మేల్కొని తనను చంపవచ్చియుండెనని భ్రమజెంది కోపోద్దీపితుఁడై మొలలోని కైజారుచే పొడిచెను. తండ్రి నేలఁబడుటఁ జూచి తెలివిగాంచి చేసినహత్యకుఁ బశ్చాత్తప్తుఁడై దుఃఖింపసాగెను. ఇది భ్రమ ప్రమాదవశమున జరిగినదని తండ్రియెఱిఁగి కుమారుని శిక్షింపక రాజము ద్రికను, రాజ్యమును యొప్పగించి ప్రాణములవిడిచెను. అనంతరము రుద్రదేవుఁడు పట్టాభిషిక్తుఁడై తండ్రియేర్పఱచిన త్రైలింగ సామ్రాజ్యపు పునాదులపై సామ్రాజ్యభవన నిర్మాణము గావించి, క్రమక్రమముగ రాజ్యమును విస్తరింపఁజేయుచు, రాజ్యపాలనము జేసియుండెను. ఇతని కాలనిర్ణయములో చరిత్రకారులు భిన్నాభిప్రాయులై యున్నారు. అయినను క్రీ. శ. ౧౧౬౦ మొదలు క్రీ.శ. ౧౧౯౬ వఱకునని వేయికంబముల దేవాలయములోని శిలాశాసనాధారమునఁ జేయఁబడిన కాలనిర్ణయమే సమంజసముగనున్నది.

ఇతఁడు మైళగిదేవునితో యుద్ధముజేసి పొలవాసదేశమును, వేంగిదేశాధీశుఁడైన వీరచోడ భూపాలుని సేనాధిపతియైన మేడమార్యుని, నైజాంరాష్ట్రములోని వనపర్తి సంస్థానమునకు సమీపమున శిథిలమైయున్న "వడ్డమాని" యను నామాంతరముగల "వర్ధమానపుర" పాలకుఁడైన భీమచోడుని, వర్ధమాన పురమునకు ౨౦ మైళ్ళ దూరముననున్న కందనూరు పశ్చిమచాళుక్యచక్రవర్తి కుమారుడైన "తైలపదేవుని", మఱియు మంత్రికూటాధీశ్వరుఁడైన గుండమనాయుని, ఆంధ్రదేశమందు పశ్చిమచాళుక్యచక్రవర్తుల పాలనమునకు లోఁబడియున్న భూభాగములనన్నిఁటిని, స్వాధీన

ము జేసికొని, కేసరిసంభూత కడపటి రాజైన మారవకేసరిని జయించి "జగపతి" బిరుదమును వహించి, స్వతంత్రుడై మహారాజాధిరాజై, మహామండలేశ్వరుడయి, యవక్రపరాక్రమంబున పరిపాలించుచు బాగడ్త కెక్కెను.

వర్ధమానపురపాలకుడైన భీమచోడుడు తనసహోదరుడైన గోకర్ణచోడుని భోజనసమయంబున జంపి, సవతితల్లికి బలియై, కందనూరు పాలకుడైన తైలపదేవుని రాజ్యమాక్రమించుకొని, దుష్టప్రవర్తనగలవాడై రుద్రదేవునితో వైరము గలిగించుకొని, నిరంకుశాధికారము నెరపుచుండ, యా పరమదుర్మార్గునిపై దండెత్తి యతనిరాజ్యమును స్వాధీనము చేసికొని, యతనికూతురైన బద్మావతిని బెండ్లియాడి, యానగరిమధ్య నొక తటాకమును ద్రవ్వించెను.

ఇతడు ప్రపంచతంత్రజ్ఞానము గలవాడై శౌర్యపరాక్రమంబులకు వాసికెక్కె, పారమార్థిక జ్ఞానముగలవాడై, దైవభక్తి పరాయణుడయి, తండ్రిని భ్రమప్రమాదవశమున జంపిన పాపకృత్యమునకు గుందుచు, ఎన్ని దిగ్విజయములు జేసినను సంతసింపక, పాపభీతిచే వగచుచు, అట్టి దోషపరిహారార్థమై గురుజనబోధప్రకారము జైనమతద్వేషియై, శైవమత మవలంబించి, శైవమతమం దభిమానముగలవాడయి, తనకుమారుగ పితృతర్పణంబులు జేయుటకును విశ్వేశ్వరస్వామికి నభిషేకంబు జేయుటకును ౧౦౦ గురు బ్రాహ్మణుల కాశికి బంపుటయేగాక, యోరుగంటి కాఱుక్రోసుల దూరముననున్న అయినవోలు గ్రామమందు మైలారుదేవున కాలయంబు గట్టించి, చిత్రవిచిత్రములైన నాలుగు శిలాద్వారంబుల నిర్మింపజేసి, అనుమకొండకు రెండుమైళ్ల దూరముననున్న వొడ్డెపల్లెను ఆలయమును నిర్మించి, అందు బుద్ధగణపతిని ప్రతిష్ఠించి, మఱియు అనుమకొండకు మూడు క్రోసుల దూరముననున్న మొగిలిచర్ల గ్రామమున ఆలయము గట్టించి, ఏకవీరమహాశక్తిని ప్రతిష్ఠింపించి, అనుమకొండ సహస్రస్తంభమండపమును నిర్మింపించి, యది గాక యింక ననేక సుందరదేవాలయములను నిర్మింపించి, కోనేరుల త్రవ్వించి, తటాకములవేయించి, ఆయాదేవళములకు నిత్యోత్సవములకుగాను ఆర గ్రామముల నొసంగెను.

పూర్వకాలములో ఈగ్రామమున నా మహారాజన్యునిచే నిర్మింపబడిన "సహస్రస్తంభ మండపము" ప్రస్తుతముశిథిలమైయున్నను, నేటివఱకును చూచువారికి ఆకాలమునాటి శిల్పనైపుణ్యమును వేనోళ్ళ పొగడునట్లున్నదని వ్రాయుట యతిశయోక్తికాజాలదు.

ఈమహావీరుని కాలమున పశ్చిమ చాళుక్యసామ్రాజ్యమును, ప్రాచ్య చాళుక్య చోడ సామ్రాజ్యమును అంతరించినవి త్రిలింగ సామ్రాజ్యము విస్తరిల్ల నారంభించెను. ఇతనిరాజ్యముయొక్క విస్తీర్ణము అనుమకొండ శాసనములో నొకశ్లోకమున క్రీ శ ౧౧౬౨ అవ సంవత్సరమువరకు తూర్పున సముద్రమువరకును, దక్షిణమున శ్రీశైలమువరకును, పడమట పశ్చిమచాళుక్యరాజధానియగు కళ్యాణపురమను నామాంతరముగల కటకము వరకును, ఉత్తరమున మధ్యమాగాణములలోనిమాల్యవంతమువరకును, వ్యాపించియుండెనని చెప్పియున్నది.

ఈకాకతి మొదటి ప్రతాపరుద్రుడు క్రీ. శ. ౧౧౯౬ వరకు పాలనము జేసి సంతానహీనుడై మృతినొందగ తమ్ముడైన మహాదే

దేవరాజుపట్టాభిషిక్తుఁడై, మూఁడుసంవత్సరములుమాత్రమే రాజ్యమేలిమృతినొందెను. కాని యామూఁడుసంవత్సరముల కాలములోనే శౌణదేశాధీశుండును యాదవసంభూతుఁడు నైన "జైత్రపాలుఁడు" అనుమకొండపై దండెత్తి వచ్చి చేసిన ఘోరయుద్ధమందు మహాదేవరాజు వీరమరణము నొందెను. అతని కుమారుఁడైన గణపతిదేవుఁడు చెఱపట్టఁబడి తరువాత విడువఁబడెను.

ఈగణపతిదేవరాజు మహాదేవరాజునకు "బయ్యమాంబిక" వలన జనించినవాఁడు. ఇతఁడు తనతండ్రికి జైత్రపాలునితో జరిగినఘోర యుద్ధములో తనతండ్రి వీరమరణము నొందిన తరువాత తానుపట్టుబడివిడిచిపెట్టబడినయవమానమును భరింపఁజాలక క్రీ. శ. ౧౧౯౯వ సంవత్సరములో పట్టాభిషిక్తుఁడైన తక్షణమే పగదీర్చుకొనదలఁచి, గొప్పసైన్యముతో దాడివెడలి శత్రురాజైన జైత్రపాలునితో యుద్ధము జేసి గెలిచి, అమూల్యమైన ధన రత్నవస్తువాహనాదుల గ్రహించి, నిజరాజధానికి మరలి వచ్చెను.

ఇంతియేగాక నాంధ్రభాషను మాతృభాషగా జేసికొన్న మహాజనుల నెల్లరను, యాంధ్రదేశమునంతను — కృష్ణానది మొదలుకొని కాంచీపురమువఱకు, రెడ్లపాలనము నందుగల కృష్ణాతీర పూర్వభాగ మంతయును - యేకచ్ఛత్రముగ ఆంధ్రసామ్రాజ్యముక్రింద దీసికొనిరా గోరి జయించి, సేవణ, కర్ణాట లాట, కళింగ, చోళరాజులను జయించి, క్రీ. శ. ౧౨౧౫ వ సంవత్సరము వఱకు వెలనాటి సీమను సంపూర్ణముగ జయించి, అక్కడి సైన్యాధ్యక్షుఁడైన పిన్నచోడుని కూతురైన "నారాంబ, పేరాంబ "లను వివాహమాడి, యాసుందరీమణుల ద్వితీయ సోదరుఁడైన జయపనాయకుని తనగజ సైన్యమున కధిపునిగావించి, బిరుదము నొసంగి, చక్రవర్తి పదమును వహించి, యాంధ్రభూస్థలి నంతట సప్తమ చక్రవర్తి యని గొనియాడబడుచుండెను.

ఆంధ్రసామ్రాజ్యమును జయింప వలెనని ఢిల్లీచక్రవర్తులకుగల యాశ్యను జెల్లనివ్వకుండుటకై అనుమకొండనుండి రాజధానిని ఓరుగల్లుకుమార్చి, ఉన్నతములైన రాజభవనములను, స గతుర్ధారమై దుర్గములను శిలాప్రాకారములను గట్టించెను.

ఈగణపతి దేవచక్రవర్తి యిప్పటి వరంగల్ జిల్లా ములుగు తాలూకాలో జేరినగణపపురము (గణపరము)ను నిర్మించి, అక్కడ ఒక పెద్దతటాకమును వేయించెను. మఱియు చింతపల్లిసీమనుకు సమీపముననున్న యెల్గూరు గ్రామమును నిర్మించి, అదేపేరున యొక పెద్దతటాకమును వేయించెను. వీటియన్నిటికన్న ప్రసిద్ధి గాంచిన పాఖాల చెరువును యితనే వేయించియుండెను. ఈవిషయమైన చిత్రకథ జనులు వాడుకొనుటయేగాక, వ్రాతదృష్టాంతరములుగలవు. కానిగ్రంథ విస్తర భీతిచే కథ నిటవదలి ప్రస్తుతాంశమును వ్రాసితిని.

ఈచక్రవర్తి సేనాధిపతులలో కాటచమూపతి, భాండచమూపతి, ములుగు తాలూకాలోని రామప్పదేవాలయమును కట్టించినట్లు అక్కడి శాసనమువలన తెలియుచున్నది. మరియు కొండపర్తిలో శా శ ౧౧౬౭ సంవత్సరమున దేవాలయమును గట్టించి త్రిమూర్తుల ప్రతిష్ఠించి, బెల్లముచెరువు గ్రామమును దేవునికైంకర్యమునకై దానముజేసినట్లు చరిత్రవలన దెలియుచున్నది.

ఈచక్రవర్తిగూడ తండ్రివలె శైవమత

పక్షపాతియు జైనమతద్వేషియునై జైనుల సామ్రాజ్యమునుండి పారద్రోలుటయేగాక, జైనుల ౩౬౦ గ్రామములను ధ్వంసపరచినట్లుగూడ చరిత్రము వలన దెలియుచున్నది.

ఇతడు దుర్గములు, రాజభవనములు, గ్రామములు, తటాకములు, శివమందిరములు నిర్మించి, ప్రజలకు పాపభీతియు, దైవభక్తియు గరపుటకు బోధకులను నియమించి, ప్రజాసౌకర్యార్థము అరణ్యప్రదేశములలో మంచిబాటల జేసి, త్రాగజలము దొరకని ప్రదేశములలో తటాకముల ను చలివేందిరలను వేయించి, ప్రజలగన్నబిడ్డల మాదిరి పోషించుచుండెను. ఈకాలములో ౭౨ నియోగములు గలవనియు వానిని విచారించ తగినయధికారులు గలరనియు, చరిత్రములు చాటుచున్నవి. మరియు శ్రీగంధము, పచ్చకర్పూరము, చీనీకర్పూరము, ముత్యాలు, పన్నీరు, జవాజి, మొదలుగాగల సుగంధద్రవ్యములు వాణిజ్యమునకై దిగుమతి యగుచుండెడివి.

ఈచక్రవర్తికి ఋతికాసంతానమే కాని పుత్రసంతానము లేకయుండెను. ఈయనకు గణపాంబ, రుద్రాంబ, యనునిర్వురు కుమార్తెలు గలరు. పెద్దకుమార్తెయైన "రుద్రాంబ" ను కుమారునిగ భావించుకొని యామెకు విద్యాబుద్ధులు గరపించి, తనకి పిమ్మట నామెయే సింహాసనారూఢయై యాంధ్రసామ్రాజ్యమును పరిపాలింప నియమించి, ౬౮ సంవత్సరములు ప్రజారంజకముగ నిరంకుశపాలనము జేసి, వృద్ధుడై క్రీ. శ ౧౨౬౦ వ సంవత్సరమున స్వర్గస్థుడై యశమునుగాంచెను.

తదుపరి యాతని పుత్రికారత్నమగు "శ్రీరుద్రదేవి" క్రీ. శ. ౧౨౬౧వ సంవత్సరమున వజ్రసింహాసనారూఢయై యాంధ్రసామ్రాజ్యపరిపాలనాభారమును వహించెను. కాని యామె గణపతిదేవచక్రవర్తి భార్య యని కొంతమంది యపోహ పడియుండిరి. మ. రా. శ్రీ. చిలుకూరి వీరభద్రరావుగారు గుంటూరుజిల్లా మంగళగిరి తాలూకా మల్కాపురిగ్రామ ఆలయములోని శాసన మాధారముగ కూతురని నిర్ధారణ జేసినదే సమంజసముగ గన్పట్టుచున్నది. ఇదియునుగాక రుద్రమదేవి భర్త "మల్లదేవరా" జని ఆంగ్లేయభాషలో వ్రాయబడిన "ఓరుగల్లు గణపతులు" యనుగ్రంథములో యున్నది. కావున ఈపైన నుదహరింపబడిన ప్రమాణముల ననుసరించి, రుద్రమదేవి గణపతిదేవ చక్రవర్తి కూతురని నిర్ధారణ జేయుటయే సమంజసనీయము.

ఇటియేగాక ఈమె "రుద్రదేవ మహారాజు" అనునామముతో వ్యవహరింపబడుచు పురుషవేషముతో కొలువుకూటమునకు వేంచేసి, మంత్రులతో రాజ్యాంగవిషయములను గూర్చి ముచ్చటించుచుండినట్లు సంస్కృత ప్రతాపరుద్రీయము, త్రిపురాంతక శాసనము మొదలు గాగల వాటియందు వ్రాయబడియున్నది.

ఈమె తండ్రివలన రాజ్యతంత్రజ్ఞానము సంపూర్ణముగ అభ్యసించినందున ప్రజాను రంజకముగ పరిపాలనము జేయుచు, శిథిలమైన దుర్గభాగములను సవరించి, పుట్టకోట, మంటికోట మొదలుగాగల కోటలను నిర్మించెను.

యాదవసంభూతుండును, దేవగిరి పరిపాలకుండునగు మహాదేవరాజు మూలబలముల సైన్యములతో దండెత్తివచ్చి ఓరుగల్లును ముట్టడించి, ౧౫ దినములు ఘోరయుద్ధము జరిపియుండెను. ఈమె ధాటికి నిలువజాలక యాదవసైన్యము పలాయనంబయ్యెను. రుద్రదేవి యింతటితో తృప్తినొందక వెంటా దేవగిరివ ఱకుందఱుము, దేవగిరిరాజు శరణుజొచ్చి, కోటి

ద్రవ్యంబుఅపరాధముగా జెల్లించి సంధిజేసుకొనియుండెను అపుడు రుద్రమదేవి మహాదేవరాజు దేశమునకు సరిహద్దుగా జయస్తంభమును పాతించి, దానిపై శాసనమొకటి వ్రాయించెను. పూర్వకాలమున స్త్రీలుగూడ యుద్ధనైపుణ్య ధైర్యసాహసములను రాజ్యతంత్రజ్ఞానమును గలిగియుండిరని తెలియుచున్నది. ఈమె పరాక్రమవంతురాలై శత్రురాజుల నోడించి, యాంధ్రసామ్రాజ్య పరిపాలనము జేసెనని చరిత్రకారులు వర్ణించియుండిరి. ఈమెకును బుత్రికాసంతానమేకాని బుత్రసంతానములేదు. ఉమ్మక్క, రుయ్యమ్మయను నిరువురు బుత్రికలు కలరు. ఉమ్మక్క పెద్దకుమారుడైన ప్రతాపరుద్రుడను దౌహిత్రునకు ౧౨౯౫ సంవత్సరమున నీమె పట్టము గట్టెను.

మనస్థానిక చరిత్రలో కడపటి నాయకుడగు ప్రతాపరుద్రుడు చరిత్రములలో రెండవ ప్రతాపరుద్రుడుగ పరిగణింపబడుచున్నాడు. ఇతడు ౧౩వ శతాబ్దాంతమున క్రీ. శ. ౧౨౯౫ సంవత్సరమున త్రైలింగ సామ్రాజ్య సింహాసనారూఢుడై, వైభవమునబూని రుద్రమదేవి కాలమున దేశమునకు బాధకలిగించుచుండిన సామంతనృపాలుర జయించెను. అప్పుడాంధ్రసామ్రాజ్యము నవలక్ష సేనాపతులతో నొప్పుచు, నుత్తర హిందూదేశమునతురుష్కరాజధానీ నగరమైన డిల్లీనగరముకన్న నైశ్వర్యప్రభావంబుల వన్నెకెక్కియుండెను. వల్లభామాత్య కవిచే రచియింపబడిన "క్రీడాభిరామ" గ్రంథమున నిమ్మహాసామ్రాజ్యవైభవప్రాశస్త్యములు వర్ణింపబడియున్నవి.

సంస్కృతాంధ్రకర్ణాటకభాషలయందభిమానముగలిగి పండితపక్షపాతియై యనేక యుద్గ్రంథముల రచించి, విద్యాభూషణుడను బిరుదమును వహించిన రుద్రదేవునివలెను రుద్రమదేవివలెను, ఆంధ్రభాషాభిమానిగను ఆంధ్రభాషాపోషకుడుగ నుండి, మనచరిత్రనాయకుడగు రెండవ ప్రతాపరుద్రదేవచక్రవర్తి యాబాల్య కవితారసజ్ఞుడును, విద్వద్గోష్ఠీప్రియుండును నగుటచేత సంస్కృతాంధ్రభాషాభివృద్ధికొరకు మిక్కిలి తోడ్పడి, తన యాస్థానమున మహాకవులనేకులను నిలిపి పోషించి యుండుటచే, నితని కాలమున సంస్కృతాంధ్రభాషలు రెండును వర్ధిల్లెనని దెలియుచున్నది. ఇదియునుగాక యీచక్రవర్తి స్వయముగా ప్రతాపమార్తాండమను గ్రంథమును రచించినట్లు చరిత్రల మూలమున తెలియుచున్నది.

ఇతడు తన మాతామహితండ్రియగు గణపతిదేవచక్రవర్తివలెనే జైనమత ద్వేషియై, శైవమతాభిమానియై యనేకశివమందిరములనిర్మించియుండెను.

క్రీ. శ. ౧౨౯౬ వ సంవత్సరమున అలాఉద్దీన్ ఖిల్జీ తండ్రిని జంపించి డిల్లీ సింహాసనమెక్కెను. ఇతడు భరతఖండము నేకసామ్రాజ్యముగ నేలదలంచి, యనేక రాజుల జయించి ఆంధ్ర సామ్రాజ్యమును గెలువవలయునని క్రీ. శ. ౧౩౦౩ సంవత్సరాంతమున మలిక్ కాఫరు అధ్యక్షతక్రింద పదివేల గుఱ్ఱపు దళమును, నలుబదివేల పదాతివర్గము నిచ్చి ఓరుగంటి రాజ్యముపై బంప, యీవిషయమును ప్రతాపరుద్రుడు తన చారులవలన తెలుసుకొని తన సోదరుడయిన అన్నమదేవభూపాలుని అధిపత్యముక్రింద పేరుబొందిన కమ్మరెడ్డి సేనానులను మలికాఫర్‌ను నెదురుకొనబంపగా, గోదావరియొడ్డున ఘోరయుద్ధముజరిగి మలికాఫర్ పరాభూతుడై డిల్లీకి పారిపోయె

ను. ఈపరాభవమువలన మలిక్కాఫర్ రెండవసారి క్రీ. శ. ౧౩౦౭ సంవత్సరమున ౩౦ వేల గుఱ్ఱపుదళముతోను లక్ష కాల్బలముతోను వచ్చి యుండియూతఁడవగూడ పరాభూతుఁడై ఢిల్లీకిపారిపోయెను.

ఈ రెండుసారులు గలిగిన పరాభవమువలన మహమ్మదీయులు తమ పట్టువదలక క్రీ. శ. ౧౩౦౯ సంవత్సరమున ౧౦ వేల అశ్వికదళమును,లక్షకాల్బలమును వెంట తీసుకొని దండెత్తి వచ్చి కోటనుముట్టడించిరి. కోటలోనివారు అనేకదినములు ఘోరముగా యుద్ధముజేసిరి. కాని కటకరాజును, కాకతీయ శత్రువగు దేవగిరియాదవరాజును, తురుష్కులకు సహాయపడుటచేతను, అణగ ద్రొక్కబడిన జైనులు యీసందర్భమున విజృంభించి రాజ్యరహస్యముల దురుష్కులకుఁ జెప్పుటచేతను, సంధిజేసుకొనకుండుట నీతికాదనియు నపాయకరమనియు నిశ్చయించి, ప్రతాపరుద్రుఁడు ఢిల్లీశ్వరునకు కప్పము చెల్లించునట్లు సంధి చేసుకొనెను.

ఖిల్జీవంశముకుతరువాత సింహాసనారూఢుఁడై గయాసుద్దీనుతొగలకు తన జ్యేష్ఠకుమారుఁడైన అలఘుఖానును క్రీ. శ. ౧౩౧౭ సంవత్సరమున ౧౦ వేల గుఱ్ఱపుదళము లక్షకాల్బలము నిచ్చి ఓరుగంటిపై బంపెను. కోట ముట్టడించి ఘోరయుద్ధముజేసినను తుదకాతనికి పరాభవమేసంభవించెను జరిగిన పరాభవమును భరింపజాలక రెండుమాసములకేతిరిగి తురుష్కులు దండెత్తి వచ్చిరి. తురుష్కులు స్వల్పకాలములోనే వత్తురనియాంధ్రు లూహించియుండనందునను, సుప్రసిద్ధ సేనానాయకులును సేనలును వీరమరణము నొందుటచేతను, క్రొత్త మార్పులు చేసికొనుటకవకాశము జిక్కనందునను, యాంధ్రసామ్రాజ్యఁ మహాలక్ష్మి కాకతీయఁ ధరణీనాయకుల విడనాడినది.

ఓరుగల్లు మహమ్మదీయుల వశమయ్యెను. ఇమ్మహానగరమునకు అలఫ్‌ఖాన్ "సుల్తానాపూ"రను పేరుబెట్టి, ఇమాదుల్ముల్కును ప్రాంతాధికారిగ నియమించెను. ప్రతాపరుద్రుఁడు చెఱబెట్టఁబడి ఢిల్లీకిగొంపోబడినతరువాత సతనిమంత్రి యుగంధరుఁడు యుక్తిప్రభావముచే మఱల దీసికొనివచ్చినట్లు పురాతన కథలు గలవు. అవి యెంతవరకు విశ్వసనీయములో తెలియదు

ఈచక్రవర్తి చెఱపెట్టఁబడి ఢిల్లీకి గొంపోబడిన తరువాత వీరభద్రుఁడురాజ్యాభిషిక్తుడైనట్లు వ్రాయఁబడి యున్నది. కాని యితఁడు సోదరుఁడని కొందఱు, కుమారుఁడని కొందఱు భిన్నాభిప్రాయులై యున్నారు.

ప్రతాపరుద్రమహారాజు చెరపెట్టబడి ఢిల్లీకి గొంపోబడినపిదప నాతని తమ్ముఁడగు వీరభద్రుఁడు రాజ్యమునకువచ్చెను. అతనికాలములో ఢిల్లీచక్రవర్తియగు మహమ్మదు తొగ్లకు దండెత్తివచ్చెను. ఓరుగల్లుసైన్యమాతని సైన్యము నాపెను. కొన్నిమాసములవరకు తొగులకుసైన్యము కోటవెలుపలనుండి పోరెను కాని జయింప వీలుపడకుండెను. అంతట వేసవికాలమగుట మారి వ్యాధి ప్రబలి, సైన్యనష్టము మిక్కుటము గాజొచ్చెను. ఇక నిచ్చట నిల్వడము హానికరమని తలంచి తొగులకు దేవగిరికి మరలెను, కాని వెంటనే మరుసటిసంవత్సరము దండెత్తివచ్చెను. అతనిచేతలవలన సర్వజనులు అసంతుష్టి నొందిరి. అట్టితరుణమున వీరభద్రుఁడు గుల్బర్గసుల్తానుడగు హసన్‌గంగు బహమనీ సహాయమున రాజ్యమాక్రమించుకొని చక్రవర్తిసేనల పారదోలి స్వతంత్రుఁడాయెను. హ

సన్‌గంగుబహమిని ఢిల్లీచక్రవర్తుల కిచ్చు కప్పము గుల్బర్గరాజుల కిమ్మని వోరుగల్లు వారిని కోరెను. కాని యాతడు సమ్మతించ నందున వుభయులకు సమరమేర్పడెను. హసన్‌గంగు పరాభవమొందెను

హసన్‌గంగు మరణానంతర మాతని ప్రథమపుత్రుడైన మహమ్మదుషా పట్టాభిషిక్తుడాయెను. యీరాజుకాలమున యీవోరుగల్లు విజయనగరపురాజన్యులు హసన్‌గంగు ఆక్రమించుకొనిన వారికోటలు వారికి తిరిగి యిప్పించగలందులకై మహమ్మదుషా వద్దికి రాయభారమంపిరి. కాని అప్పుడాతని స్థితి బాగుగలేనందున రాయభారులను కొంత కాలము తనవద్దనే వుంచుకొని, సేనాదళములు సిద్ధపరుచుకొనిన పిదప, తమకు చెల్లించని కప్పములున్ను, మంచి యేనుగులున్ను, బంగారమున్ను పంపించగలందులకు వర్తమానమంపెను. అప్పటికి మహమ్మదుషా యేలుబడిలోజేరియున్న 'కవులాస' ముట్టడించ పంపించెను. కాని వోరుగల్లు సైన్యములు మహమ్మదీయులబలముయెదుట నిలువజాలక పరాభవమొందినవి అంత మహమ్మదీయులు వోరుగల్లువరకును సాగివచ్చి వోరుగల్లురాజును బాకీపడిన కప్పములు చెల్లించడమునకై నిర్బంధపరిచిరి. తదుపరి క్రీ. శ. 1371 లో కొందరు గుఱ్ఱములవర్తకులు గుల్బర్గరాజుకు గుర్రములతెచ్చుచుండగా మార్గమధ్యములో వోరుగల్లురాజు వారిని ఆపుకొనినందున వోరుగల్లువారికిని బహమినీరాజుకును యుద్ధముజరిగెను. అందు వోరుగల్లురాజు పుత్రుడైన 'వినాయకదేవుడు' వారు బంధించి తీసికొనివెళ్ళిరి. గుఱ్ఱముల నిల్పేల దూపుదల చేసితిరని యడుగగా వోరుగల్లురాజు తిరస్కరించి బదులుచెప్పెను. అందులకై బహమినీ రాజాగ్రహావంతుడాయెను. తదుపరి వారు తిరిగి కలబర్గకు వచ్చుచుండ వోరుగల్లువారు వారిని ముట్టడించిరి. మహమ్మదుషా కొకగాయము తగిలెను.

అట్టి అపజయమునున్ను, తన కొమారుని దుర్మరణమునకు చింతిల్ల వోరుగల్లురాజు ఢిల్లీశ్వరుని సహాయమువేడుచు బహమినీ రాజ్యము నంతరించడమునకు వారి సైన్యమునకు తాను సహాయముచేయుదునని వ్రాసుకొనెను. యీవార్త మహమ్మదుషా బహమినీ యెరింగి కవులాస, గోలకొండల వైపునుండి వోరుగల్లుపై దాడివెడలెను. వోరుగల్లువారు మూడువందల యేనుంగులు, రెండువందల మంచి గుఱ్ఱములు ముప్పదిమూడులక్షల రూప్యములిచ్చి, గోలకొండప్రాంతము యికముందు బహమినీరాజ్యమున కిచ్చునట్లుగా క్రీ. శ. 1364 సవత్సరములో సంధిచేసికొనిరి,

యీమధ్యకాలములో బహమనీసుల్తానులు విజయనగరమువారితో పోట్లాడుచుండిరి. మహమ్మదుషాబహమని తదుపరి క్రీ. శ. 1421 లో విజయనగరాధీసులు కప్పముచెల్లించక తిరుగుబాటుచేసినందున వారి యొద్దకప్పములు నేకొనుటకై దాడివెడలి, అపరాధముగా మరికొంత ధనమునేకాక కొంత భూభాగము, కొన్ని మంచి కోటలూ లాగుకొని, అచ్చటనుండి వోరుగల్లుపై దాడివెడలి బలహీనమైయున్న కాకతీయసామ్రాజ్యము నంతరింపజేసెను.

# విద్యానాథుని కాకతీయాన్వయ నిరూపణము.

శ్రీయుత గుద్రిరాజు నరసింహరాజు గారు.

శ్రీమదాంధ్రదేశమును క్రీస్తుశకము పండ్రెండు, పదుమూడు శతాబ్దుల ప్రాంతమున దాదాపు రెండున్నర శతాబ్దులవరకు నేకచ్ఛత్రాధిపత్యముగ నేలి, యాంధ్రుల ప్రతిభను దేశదేశముల చాటిన కాకతీయ చక్రవర్తుల కులము క్షత్రమా? లేక క్షత్రేతరమా? యని జరుగుచు వచ్చిన వాదప్రతివాదము లాంధ్రసాహితీపరిచితులకు క్రొత్తలుకావు. విద్యానాథ మహాకవిరచితమైన ప్రతాపరుద్రీయ యశోభూషణమను నామాంతరముకల ప్రతాపరుద్రీయమను సత్కృతాలంకార గ్రంథము కాకతీయులను క్షత్రియేతరులనుగాఁ దెలుపుచున్నదని క్షత్రియేతరవాదులును, క్షత్రియులనుగానే పేర్కొనుచున్నదని క్షత్రియవాదులును జేసిన వాదప్రతివాదములు రెంటియందును నది ప్రధాన ప్రమాణస్థానమునే యాక్రమించియున్నది. ఆ వాద ప్రతివాదములు కాకతీయవంశమును గూర్చి ప్రతాపరుద్రీయ మేమిచెప్పుచున్నదో నిర్ణయించుటకుఁ దగినంత సమర్థములుగాఁ గూడనున్నవి. అయినను గొందఱి కింకనీ విషయమున భ్రమలువీడినట్లు కాన్పింపదు.

రాజమండ్రిలోని యాంధ్రాహిస్టారికల్ రీసర్చ్ సొసైటీవారి జర్నల్ 4 వ సంపుటము, 3&4 వ సంచికయందు శ్రీజయంతిరామయ్య పంతులుగారు మాల్యాపురశాసనమును ప్రకటించుచుఁ దచ్చర్చాసందర్భమునఁ గాకతీయులు క్షత్రియులగుదురా? యనువిషయమును గూర్చి కొంతఁ బ్రస్తావించియున్నారు. అందుఁ గాకతీయులు క్షత్రియులుకారనుటకుగాను గాకతీయులు సూర్యవంశమువార మనిచెప్పుకొను చోడులను జయించిన తరువాతఁ దమ్ముఁ గూర్చి సూర్యవంశము వారినిఁగాఁ జెప్పుకొనియుందురనియు, గాకతీయ వంశమునుగూర్చి ప్రచురితమైన గుమ్మడితీఁగకథ తద్వంశపరిశుద్ధతకుఁ గళంకమునాపాదించునదిగానే యున్నదనియు, మొదలుగా వారొనర్చిన విశ్వాసానర్హములగు నూహాకల్పనములను వ్రాసిపుచ్చినచో వారును ముఖ్యముగాఁ బ్రతాపరుద్రీయము మీదనే యాధారపడి కాకతీయులను క్షత్రియులుగా రనుచున్నారని బోధపడగలదు.

శ్రీ శేషాద్రిరమణకవులుకూడ నాంధ్రపత్రిక ప్రజోత్పత్తిసంవత్సరాది సంచికయందుఁ 'గాకతీయరాజులు' అనువ్యాసమున 'అనుమకొండశాసనములో నున్న రుద్రదేవుని 'క్షుద్రక్షత్రకులోన్నతి క్షయకృతః' అనువిశేషణము, ప్రతాపరుద్రీయములోని 'క్షుద్రక్షత్రియపక్షశిక్షణవిధౌ' 'సోమార్కాభిజనంతమద్యజయతి శ్రీకాకతీయాన్వయం' 'అత్యుర్కేందు కులప్రశస్తి మసృజ ద్యం కాకతీయాన్వయం' 'సూర్యసోమాన్వయామాత్య మహత్త్వాద్యధరీకృతా' అనునవి కాకతీయవంశము సూరచంద్రవంశములకు భిన్నమైనదనియు, క్షత్రియేతరమనియు విశ్వసింపనవకాశము నొసంగుచున్నవి" అని వ్రాసియుండిరి. పిమ్మట భారతి యందుఁగూడఁ దమవూ

ర్వాభిప్రాయమునే స్పష్టీకరించియుండిరి. ఇందువలన నేఁడుకూడఁ సుప్రసిద్ధచరిత్రజ్ఞులు ప్రతాపరుద్రీయము కాకతీయులను క్షత్రియేతరులనుగానే నిరూపించుచున్నదని యెంచుచున్నట్లు స్పష్టమగుచున్నది.

అటుల వారభిప్రాయపడుట యెంతవఱకు నయుక్తికమో, నిజమునఁ బ్రతాపరుద్రీయమువలనఁ గాకతీయవంశమునుగూర్చి యేర్పడు నిర్ణయమేమియో ప్రస్తుత మీవ్యాసమునఁ జర్చింపఁబడును.

విద్యానాథుఁడు ప్రతాపరుద్రీయమునందచ్చటచ్చటఁ గాకతీయవంశమును వర్ణించియున్నాఁడు. [1]

ఈతనిచే గాకతీయవంశము సూర్యచంద్రవంశభిన్నముగ వర్ణింపఁబడినదనియు, క్షత్రియులెల్లరు సూర్యచంద్రవంశములలో నేదో యొకదానికిఁ జేరియే యుండవలయునుగానఁ గాకతీయులు క్షత్రియులేయైనచో వారిని విద్యానాథుఁడు సూర్యవంశ్యులనుగానో చంద్రవంశ్యులనుగానో తప్పక వర్ణించియుండు ననియుఁ, గాకతీయులు క్షత్రియులు కారుకనుకనే వారిని విద్యానాథుఁ డిట్లు సూర్యచంద్రవంశభిన్నులనుగా వర్ణించినాఁడనియు, నిందువలనఁ బ్రతాపరుద్రీయము కాకతీయులను క్షత్రియేతరులనుగానే తెలుపుచున్నదనియు, క్షత్రియేతరవాదుల వాదము. మఱియుఁ బ్రతాపరుద్రీయమున నాయక, కావ్యప్రకరణములలో "క్షుద్రక్షత్రియపక్షశిక్షణ విధౌ ప్రోక్షిప్తకౌక్షేయకః" అనియు, నాటకప్రకరణమున "క్షుద్రక్షత్రియమార్గ విజిత్య" అనియు, గాకతీయులు క్షత్రియవిరోధులుగా వర్ణింపబడుట కూడ వారివాదమునే బలపఱుచుచున్న దందురు.

ఇఁక క్షత్రియవాదులన్ననో యాప్రతాపరుద్రీయమునందే నాటకప్రకరణమున 'అజ్ఞా క్షత్రియవంశాళిమండన మనేనాత్తస్యసానుగ్రహా' అనియు, 'అస్మాభిర్నిజదోః ప్రసూతి మధునా ధన్యామజో మన్యతే' అనియు, 'స్వయంభూదేవవరానుకూలానాం భవదాశీర్వాదానాం ఫలమిదం యత్కాకతీయక్షాత్రం వర్ధతే' అనియు, నిట్లు కాకతీయమును క్షత్రియవంశముగ విద్యానాథుఁడే స్పష్టముగాఁ జెప్పియున్నాఁడనియుఁ, కనుకఁ బ్రతాపరుద్రీయమునఁ గాకతీయులు క్షత్రియులుగానే చెప్పఁబడిరనియు, గొన్నిచోటులఁ గాకతీయము సూర్యచంద్రవంశభిన్నముగ వర్ణింపఁబడినను నయ్యది

1 తాదృక్ప్రథ్యమలోక భాగ్య విభవా వృందారి బృందారకైః
క్షోణ్యాం క్రీడితు మిచ్ఛుభి శ్చిరతరం సంప్రార్థితః పద్మభూః
అత్యర్కేందు కులప్రశస్తి మసృజద్యం కాకతీయాన్వయం
తస్మిన్ సంప్రతి వీరరుద్రవపుషా జాగర్తి లక్ష్మీపతిః ||నాటకప్రకరణము||
సోమార్కాభిజనం తమద్య జయతి శ్రీకాకతీయాన్వయః ||నాటక ప్రకరణము||
సూర్యసోమాన్వయామాత్య మహత్త్వాద్యధరీకృతా
అస్మాభి రధికుర్వాణైః, కాకతీయలకుస్థితిమ్." ||నాటకప్రకరణము||
సామాస్రాంశవ మైందవంచ మహతీ యేద్వేకులే నిర్మితే
తేజా తేలఘునీ గుణైర్విజయిని శ్రీకాకతీయాన్వయే
భూపాలేషు భవత్ప్రతాప యశసః పూర్ణార్కచంద్రశ్రియాః
ప్రాప్త్యానుగ్రహ మూర్ఖితేషు ప్రశస్యేతే లఘేతేస్థితిమ్.|| ||నాటకప్రకరణము||

క్షత్రతాబాధకము కాదనియు, సూర్యచంద్ర వంశములకంటె వేఱైన క్షత్రియములు గొన్ని కలవనియు, నట్టివంశములలోఁ గాకతీయ మొకటియనియు విద్యానాథుని తలంపై యుండవచ్చుననియు, జెప్పియున్నారు.

ప్రతాపరుద్రీయమే కాకతీయులను క్షత్రియులని పైరీతిని స్పష్టముగఁ బేర్కొనుననుట క్షత్రియేతరవాదులకు బ్రబల ప్రతిరోధకమైన విషయమైనను, విద్యానాథుఁ డిట్లు కాకతీయులను క్షత్రియులనుట, కవి తన నరకృతుని గొంటుకుఁ జేసిన యతిశయోక్తివర్ణనము కాని యన్యముకాదని సమాధానముచెప్పుటతో శ్రీ రామయ్యపంతులుగారు సంతృప్తి వహించుచున్నారు.

ఈవాదప్రతివాదములవలన— గాకతీయము సూర్యచంద్రవంశభిన్నమనుటయు, గాకతీయులు క్షుద్రక్షత్రియ విరోధులనుట యుఁ గాకతీయులు క్షత్రియులుగారని సిద్ధాంతీకరించునా? విద్యానాథుఁడు కాకతీయము క్షత్రియవంశమే యైనచో నేల సూర్యచంద్రవంశభిన్నముగ వర్ణించినాఁడు? కాకతీయము క్షత్రియవంశము కానప్పుడు పైరీతినిఁ గాకతీయమును నర్కేందుకులభిన్నమని చెప్పియుండియుఁగూడ విద్యానాథుఁడు స్వవచోవ్యాఘాతముగ నేల మరలఁ గాకతీయులను క్షత్రియులని కంఠోక్తిగఁ బేర్కొనినాఁడు? ఈపేర్కొనుట కృతిపతియొక్క గొప్పకై చేసిన యతిశయోక్తివర్ణనమేనా? ఇట్లు విద్యానాథుఁడొక్కగ్రంథమున వ్రాసిన పరస్పరవిరుద్ధములైన వ్రాతలకు సమన్వయమెట్లు?—మొదలగు సంశయములేర్పడి సహృదయులకు పరిశీలనార్హములగుచున్నవి.

ప్రతాపరుద్రీయమునఁ గాకతీయవంశము విద్యానాథోక్తరీతిని సూర్యచంద్రవంశభిన్నమనుటనిజమే. కాని క్షత్రియేతరమని యిందువలనఁ దేలుచున్నదా?

సూర్యచంద్రవంశములకంటెభిన్నములైన క్షత్రియవంశములుకలవా? యనివిచారింతము.

మనపురాణములు సూర్యవంశపుగాథలనే విరివిగవర్ణించుచున్నను దదితరక్షత్రియకులములులేవని చెప్పుటలేదు. మహాభారతమునందు[2] నైలేక్ష్వాకవంశములు (చంద్రసూర్యవంశములు) మాత్రమేకాక యింకను క్షత్రియవంశములున్నటులఁ జెప్పబడినది. మఱియు రఘువంశము ౬ వసర్గము ౭౬ వ శ్లోకములో నీపాన్వయమని మఱియొక క్షాత్రవంశము పేర్కొనఁబడినది. పురాణములయందును జరిత్రములందును బ్రసిద్ధములైన శిశునాగ, మౌర్య, శుంగ, ఆంధ్ర, గుప్త, వర్ధన, ర్యాదివంశములును సూర్యచంద్రవంశములకుఁ జెందినవిగాఁ బేర్కొనఁబడని క్షత్రియవంశములై యున్నవి. ఉత్తరహిందూస్థానమునందలి క్షత్రియవంశములలోఁ గొన్ని "ఛత్తీస్‌రాజకుల్" (ముప్పదియాఱురాజకులములు) అనుపేరుతోఁ బిలువఁబడుచున్నవి. ఇది యిప్పటిమాటయే కాదు, దాదాపు పండ్రెండవ శతాబ్దికిఁజెందిన కల్హణపండితుఁడు తన రాజతరంగిణియందుఁగూడ నీఛత్తీస్ రాజకుల్ ప్రశంస చేసియున్నాఁడు

2 వ. ప్రోల్లి జమదగ్నిసుకుండయిన రామునిచేత ధాత్రి యపగతక్షత్రంబయిన నాఁటనుండి సైలవంశంబును నిక్ష్వాకువంశంబును దక్కఁ దక్కిన క్షత్రియవంశంబులెల్లం గ్షత్రియుంబులుగాని వివులకులార్హంబులుగావు.

ఈముప్పదియాఱు రాజకులములలో ౧౬ రాజకులములు సూర్యచంద్రవంశములకుం జెందనివిగాం జెప్పంబడుచున్నవి.[3]

కనుక సూర్యచంద్రవంశములకంటె భిన్నములుగ బేర్కొనంబడిన క్షత్రియవంశములు లేవని చెప్పవలనుపడదు.

వంశమునుగూర్చి పరస్పరవిరుద్ధములగు పెక్కుగాథలేర్పడుట కవకాశము కలదు. అట్టి కథలు జనారూఢములై పూర్వసందర్భములు విస్మృతములైనప్పుడు తద్వంశములు ప్రత్యేకవ్యక్తిత్వమునువహించి మూలవంశములకంటె భిన్నములుగం బరిగణింపంబడును. అట్టివంశములలో మనకాకతీయముకూడ నొకటియైయుండవచ్చును కాని వాదమున కొకవేళ క్షత్రియేతరవాదుల వాదమే యంగీకరించుదమన్నను, కాకతీయులను క్షత్రియులనుటకు సూర్యచంద్రవంశభిన్నములైన క్షత్రియకులములు లేవను నమ్మిక వారినెంతగా బాధించుచున్నదో, యంతకంటె నెక్కువగంగూడ బాధించు ప్రతిబంధకము మరియొకటి యున్నది అదియెట్టిదనం గాకతీయులు సూర్యచంద్రవంశములకంటె గొప్పదైన వంశమువారనగా వారేవర్ణము వారు?

ఈప్రశ్నలకు క్షత్రియేతరవాదులు నిరుత్తరులు కాకతప్పదు. క్షత్రియేతరములగు ననేక వంశములు—సుప్రసిద్ధములైన బ్రాహ్మణవైశ్యశూద్రవర్ణములకుం జెందినవి—కావ్యశాసనాదులయందు ననేక కవులచే నెంతెంత యతిశయోక్తి భూయిష్ఠముగ వర్ణింపంబడినను, నెచ్చటను నేవంశము నిట్లు సూర్యచంద్రవంశములకంటె గొప్పదిగ వర్ణింపంబడియుండ లేదన నీకవర్ణముపేరైనం బేర్కొనకుండ నిట్లు వర్ణింపంబడిన వంశము లేదని వేఱ చెప్పన క్కఱలేదు కనుక ప్రతాపరుద్రీయము నందు మాత్రమే యున్న యిట్టిలోకవిరుద్ధవర్ణనమును వారెట్లు సమర్థింపంగలుగుదురు?

కాకతీయులు శూద్రులని తెలుపుటకై విద్యానాథుడిట్టి మార్గమవలంబిచెనని క్షత్రియేతరవాదుల భ్రమయైయున్నది. కాని యెందరు కవులు తమయాశ్రయ శూద్రప్రభువులను శూద్రులనుగానే కావ్యశాసనాదులయందు వర్ణించియుండలేదు? సూర్యచంద్రవంశములకంటెను గొప్పవంశమని వర్ణించినంత మాత్రమున శూద్రవంశమని రూఢ్యర్థములేకుండుటచేంగవి తనయుద్దేశ్యమునెట్లువ్యక్తీకరింపంగలిగెను? కనుక విద్యానాథుండు కాకతీయులను శూద్రులనుగాంజెప్పనుద్దేశించియాక్రొత్త పుంతం ద్రొక్కెనని చెప్పవలనుపడదు.

మఱి విద్యానాథుండు కాకతీయులను క్షత్రియేతరులని తెలుప నుద్దేశించి మాత్రమే యటుల వర్ణించినాండనుటయు విశ్వసనీయము కాంజాలదు. విద్యానాథుం డటులుద్దేశించుటకా కాలమునం గాకతీయులు క్షత్రియులని వాడుక యుండవలయును. అట్టివాడుక లేనిదే తన్నివారణోద్దేశము విద్యానాథునకుంగలుగం జాలదు. ఆకాలమున క్షత్రియులని వాడుక యున్నపుడు విద్యానాథుండు తనయాశ్రయ ప్రభువునుగూర్చి ప్రజలవాడుకకు విరుద్ధముగ నట్లేలవర్ణించును?

విద్యానాథునిం బిచ్చివాండని యనుకొనకున్నచో నిట్లు కాకతీయులను క్షత్రియులనియు క్షత్రియేతరులనియుంగూడ వర్ణించి యుండు

3 "ప్రఖ్యాపయంతః సంభూతిం, షట్త్రింశతి కులేషు యే
తేజస్వినో భాస్వతోఽపి, సంభూతేరోచ్చకైః స్థితిమ్" ॥ రాజతరంగిణి, సప్తమతరంగము.

సని యెవరు నంగీకరింపఁజాలరు.

విద్యానాథుఁడు కాకతీయులను క్షత్రియు లనుట కేవలము ముఖస్తుతికొఱకని శ్రీరామయ్యపంతులుగారు వ్రాయుచున్నారు. ఉదాహృతశ్లోకములలో ముఖస్తుతియేలేదు. "క్షత్రియశ్రేష్ఠుఁడైన తండ్రియాజ్ఞ" యనుటయు, "మాపుట్టుకవలన బ్రహ్మతన దోఃప్రసూతిని ధన్యమైనది గాదలంచుచున్నాఁడ" నుటయు ముఖస్తుతులగునా? పంతులుగారికొకవేళ వీనియందు ముఖస్తుతియే కనఁబడుచున్నచో నిట్టిముఖస్తుతిని క్షత్రియత్వకథనము లేకుండఁగనే నిర్వహించుట కనేకావకాశము లుండుచుండఁగా—నాకాలమునఁ గాకతీయులు క్షత్రియులని వాడుకయున్నను గాకతీయ క్షత్రియేతరత్వద్యోతనమునకై నడుముకట్టిన విద్యానాథుఁడెల్లెల నిజోద్దేశవిరుద్ధముగఁ బ్రవర్తించును? కవియైనవాఁడెవఁడైనఁ దాను నుతించు ప్రభువును దనపుస్తకమునం దంతట నొకేకులమువానిఁగ వర్ణించునుగాని, యిటుల నొకచోట క్షత్రియునిఁగను మఱియొకచోటఁ దద్భిన్నునిఁగను వర్ణించునా? అట్లు వర్ణించినచోనది ముఖస్తుతి యగునా? ప్రకృతిభర్తయైన నిట్టి ముఖస్తుతి నామోదించునా?

ఇదిగో విద్యానాథుని ముఖస్తుతి మచ్చునకు[4] "మాకుల పతియు స్వయంభువునగు నాశివుఁడు స్వయముగా మాకుఁగర్తవ్యము నుపదేశించుటచేఁ గాకతీయవంశము నేఁడుసూర్యచంద్రవంశములకంటె మిన్నయగుచున్నది. భూకాంత ఇప్పుడు మాయందుఁ బాతివ్రత్యమును బొందుచున్నది బ్రహ్మ మావలన నేఁడు తన దోఃప్రసూతిని ధన్యమైన దానిని గాఁదలంచుచున్నాఁడు"[5].

ఈ ప్రకారము విద్యానాథుఁడు కాకతీయమును క్షత్రియవంశము కాదని చెప్పినాఁడు. వెనువెంటనే మఱల క్షత్రియవంశమని చెప్పినాఁడు. ఇది ప్రతాపరుద్రుని కొఱకు విద్యానాథుఁ డొనర్చిన ముఖస్తుతియఁట! మఱియు మంత్రికాని వానిని మంత్రిగను, ప్రభువుకాని వానిఁ బ్రభువుగను, దాతకాని వానిని దాతగను, శూరుఁడుకాని వానిని శూరునిఁగను నీరీతిని వర్ణించిన యతిశయోక్తులు కలవుగాని, యెక్కడైనఁ గులమునఁ నతిశయోక్తి యున్నదా? కనుక నెన్నివిధముల నాలోచించినను నైక్షత్రియత్వకథనము ముఖస్తుతిగాని, సత్యేతరముకాని కాఁజాలదు. అందువలన నొకచోటఁ గాకతీయులను క్షత్రియులని చెప్పిన విద్యానాథుఁడు వారిని క్షత్రియేతరులని చెప్పనుద్దేశించెననుటయు యుక్తియుక్తముకాదు. నిజమునకు విద్యానాథునియం దెట్టి స్వవచోవ్యాఘాత దోషమునులేదు. అతఁడు క్షత్రియవంశమని కంఠోక్తిగఁ జెప్పినాఁడు. కాకతీయము క్షత్రియవంశము కనుకనే క్షత్రియవంశములలోఁ బ్రసిద్ధములైన సూర్యచంద్రవంశములతోఁ బోల్చి కాకతీయమునకు ఘనతసంపాదించినాఁడు."ఎక్కువపరిశస్తికలది, జయించుచునది. దీనిముందది వెలవెలబోవుచున్నదని" యీరీతిగ వర్ణించుట పోలికనుసూచించును.

---

4 దశరవిసూం, దశచంద్రిసూం, ద్వాదశఋషిప్రమాణ చారిణాం, బ్రహ్మహోమసే,యహా ఛత్రీ సఙఖాక ||రుద్రక్షత్రియపత్రికా (హిందీ).||

5 "సోమార్కాభిజనం తమగ్యజయతి శ్రీకాకతీయాన్వయః
పాతివ్రత్యముపైతి సాంప్రతమిమా ప్యస్మాను విశ్వంభరా
అస్మాభిర్నిజదోః ప్రసూతి మధునా ధన్యామబో మన్యతే
యత్కర్తవ్యముపాదిశత్కులపతి ర్దేవ స్స్వయంభూ స్స్వయమ్"

ఇట్టి[5a] గాకతీయము సూర్యచంద్రవంశముల ప్రశస్తి కంటె నెక్కువ ప్రశస్తి కలది, సూర్యచంద్రవంశముల జయించుచున్నది కాకతీయము గుణోన్నతి వహించియుండ సూర్యచంద్రవంశములు లాఘవమును బొందుచున్నవి యని వర్ణింపఁబడుటవలన నది సూర్యచంద్రవంశములతోఁ బోల్పఁబడుచున్నదని గుర్తింపవలయును. కాకతీయము క్షత్రియవంశము కనుకనే క్షత్రియత్వాది సాధర్మ్యము కలిగి క్షత్రియవంశములలో సుప్రసిద్ధములైన సూర్యచంద్రవంశములతోఁ బోల్పఁబడెను. క్షత్త్రేతరమే యైనచో నిటులు సూర్యచంద్రవంశములతోఁ బోల్ప నవసరమే కలుగదు. అందువల్లనే యింతవఱకు నెవ్వరు నేక్షత్త్రేతరవంశమును సూర్యచంద్రవంశములతోఁ బోల్చియుండలేదు. క్షత్రియవంశము మాత్రము మఱియొకటి యిట్లు సూర్యచంద్రవంశములతోఁ బోల్చి వర్ణింపఁబడెనా యని ప్రశ్నింపవచ్చును. ఆ! కలదని యే ప్రత్యుత్తరము. కవిరాజు తన సంస్కృత రాఘవపాండవీయమునందుఁ గృతిభర్తయగు కామదేవుని వంశము నిట్లు వర్ణించియున్నాఁడు.[6] మఱియు విక్రమసంవత్ 1442 సం॥ నకుఁ జెందినదియు, ప్రభాస్ పాటన్‌లో దొరికినదియు, నగు యాదవ భీముని శిలాశాసనములో రాష్ట్రోడవంశముకూడ నిట్లు పోల్పఁబడెను.[8] కనుక సూర్యచంద్రవంశములకంటె భిన్నములైన క్షత్రియవంశములు సూర్యచంద్రవంశములతోఁ బోల్పఁబడుట యుక్తయుక్తమును, కవిజనాదృతమునై యున్నది. విద్యానాథుఁడు కూడఁ గాకతీయము క్షత్రియ వంశమని తలంచుటవలననే సూర్యచంద్రవంశములతో, బోల్చియుండెను. పోల్చుటయే కాక స్పష్టముగఁ గూడ క్షత్రియవంశమని చెప్పియున్నాఁడు. క్షత్త్రేతరమే యని యెంచినచో నిట్లు లోకవిరుద్ధముగ సూర్యచంద్రవంశములతోఁ బోల్చియుండఁడు. మఱియు క్షత్రియవంశమని కూడఁ జెప్పియుండక యుండెడిని.

ఇఁకఁ గాకతీయము క్షత్రియవంశమే యైనచో సూర్యచంద్రవంశములకంటె భిన్నమైన యదెట్టివంశము? దాని యుత్పత్తి యెట్లు?

---

☞ 127వ పేజీలోని 3వ Foot note ను 126వ పేజీలో రెండవ కాలం చివరున "చేసియున్నాడు" వద్దను; 128వ పేజీలోని 4వ Foot note ను 127వ పేజీలో 3వ Foot note గాను; 128వ పేజీలో 5వ Foot note ను అదే పేజీలో 4వ దానికి బదులు గాను — చదువుకొనవలెను —

॥కా॥ సం॥ సం॥

5a స్పర్ధతే జయతి ద్వేష్టి, ద్రుహ్యతి ప్రతిగర్జతి
ఆక్రోశత్యవజానాతి, కదర్థయతి నిందతి
విడంబయతి సంధత్తే, హసతీర్ష్యత్యసూయతి
తదస్యే త్యనుబధ్నాతి, తచ్ఛీలతి నిషేధతి
తచ్చవాను కరోతీతి, శబ్దాస్సాదృశ్యవాచకాః॥

॥కావ్యాదర్శము॥

6 ఆదిత్యస్యాస్యవాయో జయతి రఘుపతే ర్జన్మ సూః జృంభితశ్రీ స్తత్సామ్యం సోమవంశశ్శ్రయతి సురభితః పాండవానాం యశోభిః ధత్తైతత్సామ్యమద్య స్మరహరధరణీ సంభవస్యాన్వవాయో యస్యాలంకారభావం భజతి కృతధియాం కామదః కామదేవః॥

కాకతి! త్వాం ప్రాప్య చిరాత్కలు రాజత్రితయఘటితా తేజోమయా సకలజగద్గీయమాన బుధకర్ణానందకారి గుణగణా సోమసూర్యవంశా వివ పుష్యతాతి ముఖరవంశా॥ ॥హర్షచరిత 14-6 పుట.॥

8 వంశా ప్రసిద్ధాహి యథార్కసింధ్వో, రాష్ట్రోడవంశస్తు తథాత్రుతీయః

॥బొంబాయి గెజటీయర్ 1 వాల్యూం 2 భాగము 208 పుట॥

ఈవిషయమున విద్యానాథుఁడు చెప్పినదేమి? యనువిషయములను గూర్చి చర్చింపవలసియున్నది. సూర్యచంద్రవంశములురెండును బ్రహ్మయొక్క మానసికసృష్టిలోఁజేరినవి. బ్రహ్మయొక్క మనస్సునందు మరీచ్యత్రిమహర్షులు పుట్టిరి. అందు మరీచికిఁ గశ్యపుఁడును గశ్యపునికి సూర్యుఁడును సూర్యునినుండి సూర్యవంశక్షత్రియులు కలిగిరనియు, నత్రిమహర్షికిఁజంద్రుఁడును జంద్రునినుండి చంద్రవంశక్షత్రియులు పుట్టిరనియు వాని వంశక్రమమై యున్నది. దీనికంటె వేఱగు మఱి యొక సృష్టిక్రమము ఋగ్వేదము, తైత్తిరీయసంహిత, మనుస్మృతి మొదలగు గ్రంథములయందును బురాణాదులయందు నుల్లేఖింపఁ బడియున్నది. బ్రహ్మయొక్క ముఖమునుండి బ్రాహ్మణులును,బాహువులనుండి క్షత్రియులును బుట్టిరనునది యట్టి సృష్టిక్రమమైయున్నది.

కాకతీయు లదివరకు తామవలంబించిన బౌద్ధజైనమతములవీడి మరల వైదికమతమవలంబించు సందిగ్ధకాలములో వారివంశమునుగూర్చి పైనఁబేర్కొనినటులఁ బెక్కు గాథలేర్పడెను. కొన్నిశాసనములలో వారు సూర్యవంశమువారని పేర్కొనఁబడిరి. కొన్నిపుస్తకములలోఁ జంద్రవంశము వారని వ్రాయఁబడినది. కొన్నియెడల బ్రహ్మబాహుజనితులగు దుర్జయవంశము వారని చెప్పఁబడిరి. ఇటులభిన్న గాథ లేర్పడుటకుఁ గారణము వారుదీర్ఘకాల మన్యమతానుయాయులై యుండి యాకాలమున మఱల వైదికమతముసఁజేరుటయు, నప్పటికి వారి పూర్వవంశావళి విస్మృతమగుట యున్నై యున్నది. కేవల మప్పటికి వాడుకయందున్న కాకతీయ పదమును బట్టియు, తమకుఁ దట్టిన యాయాయూహల ననుసరించియుఁ గవులిట్టి భిన్నగాథలఁ గల్పించిరి. ఇటులనే యాకాలమునఁ జాళుక్యులు, పరమారులు పరిహారులు, చౌహానులు మొదలగు క్షత్రియ జాతులవారలఁ గూర్చి కూడ వారి వంశనామముల ననుసరించియు, నాయాకవుల యూహలఁ బట్టియుఁ బరస్పరభిన్నములగు పెక్కు వంశోత్పత్తి కథనము లేర్పడియున్నవి. ఇట్టిగాథలయొక్క పరస్పరభిన్నత వలనను, విశ్వాసానర్హతవలనను నసలువంశమునకు లోపమాపాదింప వలను పడదని పైన వ్రాసియే యున్నాము.

మనవిద్యానాథుఁడీ గాథలలోఁ గాకతీయులు బ్రహ్మయొక్క దోఃప్రసూతికిఁ జెందిన వంశమువారనుగాథనే స్వీకరించెను.[9] మాల్కాపురశాసనమునఁగూడ బ్రహ్మయొక్క బాహువులనుండి పుట్టిన క్షత్రియజాతులలో సూర్యవంశమొకటి యనియు, దుర్జయులగు కాకతీయులా సూర్యవంశమునకుఁ జెందినవారే యనియుఁ బేర్కొనఁ బడినది.[10] దుర్జయులమని చెప్పుకొనిన నతవాటిసీమరాజులు మొదలగు వారును దమశాసనములలో దుర్జయులు బ్రహ్మబాహుజనితులని చెప్పుకొనియున్నారనుట శాసనపరిశోధకులకుఁ దెలియనిదికాదు. కనుక కాకతీయులు బ్రహ్మయొక్క దోఃప్రసూతివారనుట కేవలము విద్యానాథోక్తమే కాక త

9 అస్మాభి ర్ద్విజదోఃప్రసూతి మధునా ధన్యాన్వయో మన్యతే॥

10 శ్లో॥ అస్తి స్వస్తి మతీ తనుర్భగవతో దేవస్య తస్య స్ఫుర
న్నాభీపంకజ సంభవస్య భుజతో యే క్షత్రియా జజ్ఞిరే
తేషాం తిగ్మమరీచి సంతతి భువో యే దుర్జయాః క్షత్రియా
స్తేషా మస్తి కులం కళంకరహితం శ్రీకాకతీభూభుజామ్॥

త్కాల కవిజనాదృతవిషయమేయని బోధపడగలదు. కాకతీయులనుగూర్చి పెక్కుటుత్పత్తి గాథలున్నను విద్యానాథుఁడీగాథనే స్వీకరించుటకుఁగారణము కాకతీయవర్ణనమునం దెక్కువ చమత్కృతుల వెల్లడించుట కనువగుటయే. త్రేతాయుగమున సూర్యవంశమును ద్వాపరయుగమున చంద్రవంశము నెట్లుసకలక్షత్రియ వంశములలోఁ బ్రసిద్ధివడసెనో, యటులనే యాయాయుగములం బై వంశములు శ్రీమహావిష్ణువు తమయందు శ్రీరాముఁడుగను, శ్రీకృష్ణుఁడుగను నవతరించుటచే నెటులఁ బావనములయ్యెనో, అటులనే కలియుగమున కాకతీయ వంశము తనయందు మహావిష్ణువు ప్రతాపరుద్రుఁడుగ నవతరించుటచే సూర్యచంద్రవంశములవలెఁ బ్రసిద్ధమును బవిత్రము నయ్యెనని యీరీతిగా నెన్నియో చమత్కారవర్ణనముల గావించియున్నాఁడు. 11

ఇట్టివర్ణనములు కాకతీయమును సూర్యవంశముగానో, చంద్రవంశముగానో, పేర్కొని నవో మొలకెత్తియుండవు. కేవలము వర్ణనాచమత్కృతి కొఱకుఁ గాకపోయిన, గాకతీయుల యొక్క సూర్యచంద్రవంశభిన్న బ్రహ్మదోః ప్రసూతిత్వ కథన మప్పటికి బాగుగాఁ బ్రచారమునందుండుట చేతను, దనవర్ణనా చమత్కృతి కుపయోగించునదగుట చేతను గూడ విద్యానాథుఁ డీమార్గమునే పట్టెననుటలో సందియముండదు. విద్యానాథుఁడైనను మఱియొకరైనను గాకతీయులు సూర్యచంద్ర వంశములకు చెందని వేరొక క్షత్రియవంశము వారని తలంచుటకు గారణమేమియో యూహింపవలసియున్నది. సూర్యవంశమువారితో సూర్యవంశమువారికిని, చంద్రవంశమువారితోఁ జంద్రవంశము వారికిని సంబధములుండవని లోకములో నొకభ్రమకలదు. అదియేపైన నేనువ్రాసినటుల సీతను చంద్రవంశదీపికనుగాఁ బేర్కొనెనది. ఏతాదృశేతద్భ్రమా ఫలితము లింకను పెక్కులు కలవు. వానినన్నిఁటి నిచటఁ బేర్కొనుట విస్తృతికి హేతువగును. ఈభ్రమయే కాకతీయులు సూర్యవంశ్యులగు చోడులతోడను చంద్రవంశ్యులగు చాళుక్యాదులతోడను సంబధ బాంధవ్యములు కలిగియుండుటచే వీరు తద్వంశములకంటె భిన్నమగు వేరొక వంశము వారుగాఁ బేర్కొనఁ జేసియుండును. మఱియుఁ బురాణాదులయందుఁ గలియుగమున సూర్యచంద్రవంశములులేవను నర్థము నిచ్చు కొన్నివాక్యము కలవు. అట్టివాక్యములవలనఁ గలియుగమున సూర్యచంద్రవంశములులేవని యేర్పడిన యపభ్రమ కూడ కాకతీయులను సూర్యచంద్రవంశ్యులనుగాఁ బేర్కొనక పోవుటలోఁ గొంత తోడ్పడియుండును. అదియుగాక జైనబౌద్ధమతముల నవలంబించిన క్షత్రియులు మఱల వైదికమతమునఁ జేరునప్పుడు వారివారి యాశ్రిత కవులు తమ ప్రభువంశముల కపూర్వత్వమును గలిగించుటకుగాను నూతన కల్పనములు చేయఁ జొచ్చిరి. ఆమార్గము నవలంబించియే యాకాలమునఁ గవులు చాళుక్య, చౌహాన, పరమార, పరిహారవంశముల పుట్టుక వసిష్ఠుని యగ్నికుండమున నయ్యెనని కల్పించి యున్నారు. అటులనే కాకతీయవంశనకుఁ గూడ నపూ

11 "క్షోణ్యాం క్రీడితు మిచ్ఛుభిః" "(నాయకప్రకరణే 13)" "కౌసల్యా సీత్ప్రథమజననే" "(నాయకప్రకరణే 20)" "సోమార్కాభి జనం తమద్య జయతి" "(నాటకప్రకరణే ప్రథమాంకే 1)" "సాహసాంకవమైందవంచయాతి" (చతుర్థాంకే 22)

ర్వత నాపాదించుటకునై కవులీక్రొత్తమార్గమును (గుమ్మడితిగె కథవలెనే) ద్రొక్కియుందురు.

ఇఁకను జర్చింపవలసినది కాకతీయులు క్షత్రియులే యైనచో విద్యానాథుఁడు కాకతీయ విరోధులను క్షుద్రక్షత్రియులనునా? యనునది. కాని కాకతీయ విరోధులును క్షత్రియులైనచో వారికి క్షత్రియ విరోధులుండ కూడదా? ఉన్నచో వారివిషయమున క్షుద్రశబ్దమును బ్రయోగింపగూడదా? క్షత్రియులకు క్షత్రియ విరోధులుండరని చెప్పవీలులేదు. ఉండరనుటకెట్టి యాధారమును లేదు. ఉండిరనుట గతచరిత్రమున కంతకును ప్రబలవిరుద్ధము. ఉన్నను దనప్రభువుయొక్క సాటికులమువారిని క్షుద్రక్షత్రియులనుట విద్యానాథునికిని, తన సాటికులమువారినిఁ దనకవిచే క్షుద్రక్షత్రియు లనిపించుట ప్రతాపరుద్రునికిని తగనివని కానేరదు. కవులు తమ యాశ్రయదాతను గొప్పగను నతని శత్రువులను క్షుద్రులనుగను వర్ణించుటయుఁ బ్రభువులటుల వర్ణింపించుకొనుటయు లోకాచారమే యైయున్నది. ఆయాచారమున ననుసరించియే విద్యానాథుఁడు కూడ తనప్రభువుల 'క్షత్రియ మౌళిమండనములు' లనియు, వారిశత్రువులను 'క్షుద్రక్షత్రియు' లనియు వాక్రుచ్చియున్నాఁడు. కనుక విద్యానాథుఁడు కాకతీయశత్రువులను క్షుద్రక్షత్రియులనుట కాకతీయక్షత్రియత్వమునకు బాధకముకానిఁ క్షత్రియేతరత్వమునకు సాధకము గాని కానేరదు.

జివరకుఁ దేలిన పరవసానమే మనఁగా—విద్యానాథుఁడు కాకతీయులను క్షత్రియులనుగానే గుర్తించి యున్నాఁడనియు, దనపుస్తకమున క్షత్రియులనుగానే తెలుప నుద్దేశించి, క్షత్రియులనుగానే పేర్కొని యున్నాఁడనియు, క్షత్రియేతరులని తెలుప నుద్దేశించుట కాని, క్షత్రియేతరులనుగాఁ బేర్కొనుటగాని, జరిగి యుండలేదనియు మామాటికిని సత్యమై యున్నది. ప్రతాపరుద్రీయము వలనఁ గాకతీయులు క్షత్రియేతరులుగాఁ దేలుచున్నారనుట నేఁటి మనపరిశోధకుల యపూర్వపరిశోధనా విలసనము దక్క వేరొండుకాదు.



# కాకతీయ సామ్రాజ్యాంధ్ర వాఙ్మయము.

శ్రీయుత నిడుదవోలు వెంకటరావుగారు బి. ఏ.

చిరస్మరణీయమగు ప్రాచీనాంధ్ర సామ్రాజ్య వైభవము బునరుద్ధరించి, రెండుశతాబ్దముల పర్యంత మాంధ్రదేశము నవిచ్ఛిన్నముగఁ బరిపాలించి, యశఃకాయులైన కాకతీయుల చరిత్ర మాంధ్రమహాజనుల కవశ్యపఠనీయమై యమితోత్సాహ జనకమై యలరారుచున్నది. కాకతీయులేవంశజులైనను సాహసౌదార్య విక్రమంబున, సాహిత్యవిద్యా పరిపోషణంబున సామ్రాజ్యాధి నాథులై వన్నె కెక్కి, యాంధ్రులఁ బ్రత్యేకవ్యక్తిత్వముఁ బ్రతిపాదించి, యాంధ్రజాతీయాభ్యుదయమునకుఁ దోడ్పడిరి. అట్టి కాకతీయులకాలపు టాంధ్రవాఙ్మయమును గూర్చి యీ వ్యాసమున జర్చింపబడును.

ఆంధ్రవాఙ్మయమున క్రీ.శ. 1100_1350 వఱకునుగల కాలము కాకతీయయుగమని చెప్పనొప్పును. మఱియు నాంధ్రవాఙ్మయ చరిత్రమున నన్నయతిక్కనల నడిమికాలమునఁ గల కవులఁగూర్చియుఁ గావ్యములఁగూర్చియు మనకుఁ దెలుపుడుచేయునదీయుగమే.

కాకతీయులలోఁ బ్రథముఁడగు మొదటి ప్రోలరాజునకు సమకాలికుఁడై, వైదికధర్మరక్షణ తత్పరుఁడై, మహాభారతాంధ్రీకరణ కర్తయగు తూర్పు చాళుక్యచక్రవర్తి రాజరాజనరేంద్రుఁడు క్రీ. శ. 1022_1063వఱకును నలువదేండ్లు వేఁగిదేశమునుఁ బరిపాలించెను. రాజరాజనరేంద్రుని పాలనమున శాంతియు సౌఖ్యమును నెలకొనినకతన భాషావాఙ్మయాభివృద్ధియయ్యెను. నన్నయ, నారాయణభట్టు, పావులూరి మల్లన, మొదలగు కవులు గ్రంథరచనమునకుఁ గడగిరి. రాజరాజు కవులయందాదరముగలవాఁడై వారిని గౌరవించెను. నారాయణభట్టునకు నందమపూఁడి, పావులూరిమల్లనకు నవఖండవాడయును దానముచేసినట్లు శాసనములు సాక్ష్యమిచ్చుచున్నవి. కాని క్రీ. శ. 1063 సంత్సరమున రాజరాజనరేంద్రుఁడు మరణించిన వెనుక వేఁగిదేశమునందంతఃకలహములు ప్రారంభమైనవి.

వేఁగిదేశమునకు వెనుక వెలనాఁటిసీమ యాంధ్రసారస్వతమునకు రంగస్థలమైనది. వెలనాఁటి చోడులు దేశమును క్రీ. శ. 1036 వఱకును పాలించిరి. వెలనాఁటివి క్రీ. శ. 1117 మొదలు 1132 వఱకుఁ బరిపాలించిన మొదటివెలనాటి చోడుని మంత్రియగు నందూరి కొమ్మయామాత్యుని మనుమనికి మంచనకవి తన కేయూరబాహుచరిత్రము నంకితముఁగావించి యున్నాఁడు. సంస్కృతమునఁగల నాటకముల గావ్యపద్ధతి ననువదించినవారిలో నితఁడే ప్రథముఁడు. కేయూరబాహుచరిత్రమునందలి యవతారికయందు వెలనాఁటిచోళులఁగూర్చి యెన్నియో చారిత్రకవిషయములు తెలియుచున్నవి.

వెలనాఁడునకు వెనుక పాకనా డాంధ్రకవితాకన్యక కాస్పదమైనది. పాకనాఁటి యందు తొలుత తెలుఁగు చోడులు పరిపాలించిరి పాకనాఁటికి ముఖ్యస్థానమగు నెల్లూరును బేటరాజు క్రీ. శ. 1121 సంవత్సర ప్రాంతమునను, విమలాదిత్యుఁడు. క్రీ. శ.. 1126 సంవత్సర

ప్రాంతముననుం, మనుమసిద్ధిరాజు క్రీ. శ. 1189 సంవత్సర ప్రాంతముననుఁ బరిపాలించిరి. మనుమసిద్ధి కొమరుఁడు తిక్కభూపతి. ఈతఁడు క్రీ. శ. 1230-సంవత్సరప్రాంతమువాఁడు. ఈతఁడు సకలవిద్యాపరిశ్రముఁడై కవిసార్వభౌమ బిరుదముకలవాఁడని తిక్కనమహాకవి కృతనిర్వచనోత్తరరామాయణము తెలియఁజేయుచున్నది. [1]

విక్రమార్కచరిత్రము రచించిన జక్కయకవి ప్రపితామహుఁడగు పెద్దయామాత్యుఁడు తిక్కభూపాలునాస్థానము నలంకరించినట్లు విక్రమార్కచరిత్రమునందలి యొక పద్యమువలనఁ దెలియుచున్నది [2]

తిక్కభూపాలుని కొడుకు మనుమసిద్ధి. ఈతనికాలముననే కవిబ్రహ్మయు, నుభయకవిమిత్రుఁడునగు తిక్కనసోమయాజి యుండినది. మనుమసిద్ధి కాకతీయగణపతి దేవునికి సమకాలికుఁడై యుండుటచే క్రీ. శ. 1260 సంవత్సర ప్రాంతమువాడగుచున్నాఁడు.

ఆంధ్రభాషావాఙ్మయచరిత్రమునకు వీరశైవమతవ్యాపన మత్యంతముఖ్యమైనది. శైవకవులు జనసామాన్యమునకు మతవిషయములు బోధింపవలసిన వారగుటచేత, మాతృభాషయగు తెలుఁగుభాషయందు నభిమానముఁగలిగి, తెలుఁగు భాషాప్రశస్త్యమునుఁ దెలిపిరి. ఈశైవకవులు విలసిల్లిన కాలము కాకతీయ రాజ్యకాలమే. కర్మజ్ఞానప్రతిపాదకమగు వైదికమతమునకు సంస్కృతమెట్లో భక్తిప్రతిపాదకములగు శైవవాదిమతములకు దేశభాషయట్టులని చెప్పవచ్చును. నన్నయభట్టారకుఁడు సంస్కృత ఛందోమర్యాదల ననుసరించి సలక్షణవృత్త కవిత్వముతో తత్సమయుతమగు భాషలో నాంధ్రమహాభారతము రచించెను. శివకవులు జానుతెనుఁగు నాధారముగఁగొని, సంస్కృతభూయిష్ఠరచన సర్వసామాన్యము గామిచే దేశీయఛందస్సు ననుసరించి కావ్యములు రచియించిరి—కావున క్రీ. శ. 1350 సంవత్సర ప్రాంతమువఱకు నీదేశికవితయే దేశమున వర్ధిల్లుచున్నట్లు తెలియుచున్నది. కాకతీయసామ్రాజ్యానంతరము రెడ్డిరాజుల పరిపాలనముననుం, నంతకుకొంచెము ముందుకాలముననుం, తిరిగి మిశ్రకావ్య వాఙ్మయము, సంస్కృతభాషా వాఙ్మయప్రోద్బలము తలయెత్త నారంభించినవి. కాకతీయ యుగమునందు వెలసిన యాంధ్రవాఙ్మయ గ్రంథములన్నిటినిఁ బరిశీలించిన మనకీవిషయము సువ్యక్తముకాగలదు ఆకాలమునఁగల గ్రంథములింకను బెక్కులు ముద్రణము గావలసియున్నవి. ఇఁక కాకతీయుల కాలమునఁగల యాంధ్రకవులఁ గూర్చియు, వారిగ్రంథరచనఁ గూర్చియుఁ గొంత తెలిపి యీవ్యాసమును ముగించుచున్నాఁడను కాకతీయ యుగమున శైవకవులే మొదటివారుగావునను, నన్నయభట్టారకాదులతో సమకాలికులగు కవులఁ గూర్చి యీవఱకే వ్రాసియుండుటచేతను శైవకవులతో నీచరిత్రము ప్రారంభించుచున్నాఁడను.

శ్రీపతిపండితుఁడు:—ఈతఁడు తెలుఁగుదేశమున శైవపండితత్రయమునఁ బ్రముఖుఁడు. మనకుఁ దెలిసిన కాకతీయసామ్రాజ్యాంధ్ర

---

1 సకలవిద్యాపరిశ్రమముఁ దెల్పఁగ నేల, కవిసార్వభౌమాంక మవనిఁ జెల్ల.

2 గీ. అనుచు నెల్లూరి తిక్కక్ష్మామనుజవిభుని, సమ్ముఖమ్మున సాహిత్యసరణి మెఱసి,
మహిమఁగాంచిన పెద్దయామాత్యసుకవి, మనుమఁడవు నీవు నీవంశమహిమ యొప్ప

కవులలోఁ దొలివాఁడు. ఈతనినివాసస్థలము తొల్లి విజయవాటిక యనఁబరఁగిన బెజవాడ. ఈతఁడత్యద్భుత శివభక్తుఁడై శివుఁడొకఁడే దైవమని తెలుపుటకు కొంగునవిప్పులు మూటఁగట్టిన మహానుభావుఁడు. ఈతని పండితారాధ్యులు శివతత్త్వసారమున ప్రశంసించి యున్నారు. [3]

పాల్కురికి సోమనారాధ్యుని పండితారాధ్యచరిత్రమునను[4] శివభక్తవిజయమునను గూడ నీతఁడు వినుతిగావింపఁబడినాఁడు. [5]

ఈతఁడనంతపాలుని యాస్థానమునున్నట్లు బసవపురాణమునుండి తెలియుచుండుటచే నీతఁడు రెండవప్రోలరాజునకు సమకాలికుఁడు గాని కొంచెము పూర్వుఁడుగాని యైయుండవచ్చును. అనంతపాలుఁడు చాళుక్యదండనాథుఁడై కొండపల్లిప్రాంతములఁ బరిపాలించుచుండెడివాఁడు. ఈతని మేనల్లుఁడగు గోవిందరాజును రెండవప్రోలరాజు జయించెనని యొకశ్లోకము తెలుపుచున్నది. [6]

అనంతపాలుని శాసనములు క్రీ.శ.1120-23 సంవత్సర ప్రాంతములఁ గానవచ్చుచుండుటచే నితఁ డా కాలమువాఁడని నిశ్చయముగ చెప్పనొప్పును. ఈతఁడు శైవుఁడగుటచేతను శైవులాకాలమున మతవ్యాపనమునకై తెలుఁగున గ్రంథములు రచియించుటచే నీతఁడేమేని తెలుఁగుగ్రంథములు రచియించి యుండును. అవి యిప్పుడు కానవచ్చుటలేదు. ఈతఁడు శివదీపికయను గ్రంథము రచియించినట్లు శివకవికంఠాభరణమున చెప్పఁబడియున్నది. [7]

ఈతనికవిగా పాల్కురికి సోమనారాధ్యుఁడు పేర్కొనినాఁడు. ఈతనివంశ మవిచ్ఛిన్నముగ నున్నట్లు వీరనారాధ్యకృత భద్రాయుశ్చరిత్రమువలనఁ దెలియుచున్నది. [8]

శివలెంక మంచన పండితుఁడు:— ఇతఁడు శైవపండితత్రయమునఁ ద్వితీయుఁడు. ఈతని కథ బసవపురాణమున వర్ణితము. మల్కాపుర శాసనమున జెప్పఁబడిన కాలాముఖ మతాచార్యుఁడగు సోమశంభువనునత డీతఁడని బసవపురాణ పీఠికయందుఁ జెప్పఁబడినది. సోమశంభుఁడు కేయూరవర్షుని కాలమునకుఁ దరువాతను, కాలచురిరాజగు కర్ణదేవుని కాలమునకు ముందును నున్నవాఁడగుటచే, నీతఁడు క్రీ. శ. 1050 ప్రాంతమువాఁడగును. కావున శివలెంక మంచనపండితుఁడు శ్రీపతిపండితునకు వృద్ధాప్యమున నాతనికిఁ గాలీనుఁడై యుండి, యాతనికి కొంచెముతరువాత ప్రసిద్ధి కెక్కియుండవచ్చును. పండితారాధ్యు లీతనిఁ బేర్కొనలేదు. పాల్కురికి సోమనారాధ్యుఁడు

---

3 కం॰ ఒక్కఁడె దైవము శివుఁడని, నిక్కముసేయుటకు మడిచె నిప్పులు చీరన్
గ్రిక్కక శ్రీపతిపండితుఁ, డక్కజముగ విజయవాడ నల జమ్మి శివా.

4 ద్వి. కడునద్భుతోత్పత్తికర్త సాక్షిబ్రహ్మ, వడిబ్రహ్మమను బ్రహ్మవాదులదు్రించి
హరభక్తియుత్పత్తికధిపతి నాఁగ, బాగై దాదొల్లి శ్రీపతిపండితయ్య.

5 కం॰ అతులితశివభక్తునితోఁ, బ్రతిసేయగ రారు కోటి బ్రాహ్మణులని శ్రీ
పతిపండితయ్య నిప్పుల, కుతుకమతి మూటగట్టె కొంగునను శివా.

6 శ్లో॥ యోఽకుంతోపరి తీరకుంత పరశుశ్లక్ష్ణాగ్రధారోల్లస, ద్ధారాపాత నిపాతనైకచతురం గోవిందరాజాహ్వయమ్
బద్ధ్వా న్యత్యజదోగయుక్షితి భృతేరాజ్యమ్ దదౌ లీలయా, లుంఠాకో విషయస్యతస్యపమ రేశద్వీర దీక్షాగురుః

7 శ్రీపతిపండితకవి శివ, దీపిక విరచించి శైవదీక్షాగురుఁడై
చేపట్టె ముక్తి పేరిటి, రాపట్టిని విజయనగర రామయలింగా।

8 క్షితికర్త హారు మహాపతికి మ్రొక్కించి, క్షితివిష్ణువాదుల గీటడగించి
చెనసి భక్తిక్రియాస్థితికర్త యనగ, జనియించు లెంకమంచన పండితయ్య.

పండితారాధ్య చరిత్రమున మంచెనపండితునిఁ గూర్చి చెప్పినాఁడు.[9]

ఈతఁడు రెండవప్రోలరాజు కాలమున నుండి యుండవచ్చును. ఈతఁడు రచియించిన తెలుఁగు గ్రంథములు చిక్కుటలేదు. ఈతఁడు "ఆత్మవిత్" అనువాక్యమునకు గౌళభట్టారకునివలె నాలుగువేల గూఢార్థములఁ జెప్పినట్లు శివకవికంఠాభరణము నుడువుచున్నది.[10]

మల్లికార్జున పండితారాధ్యుఁడు:- ఈతఁడు శైవపండితత్రయమునఁ దృతీయుఁడు. పాల్కురికి సోమనాథుని పండితారాధ్యచరిత్రమునకుఁ గథానాయకుఁడు. బసవన స్థాపించిన శైవమతమును వైదికముగ సంస్కరించి, యారాధ్య శైవమతసాంప్రదాయమునకు మూలపురుషుఁడైనవాఁడు. ఈతఁడు వెలనాటిచోడుఁడు. (క్రీ. శ. 1163-1181) పానుగంటి ఉదయావనీశుఁడు (క్రీ. శ. 1162) బుద్ధరాజు (1171) మొదలగువారి సమకాలికుఁడగుటచే రుద్రదేవుని సమకాలమువాఁ డగును. ఈతని గ్రంథము శివతత్త్వసారము (అసంపూర్ణప్రతి) ఆంధ్రసాహిత్య పరిషన్ముఖమునఁ బ్రకటితమైనది. ఈతఁడు కర్ణాటకభాషయందుఁగూడ బసవనివిభూతిచేఁ గవిత్వము సెప్పనేర్చి గణసహస్రనామము మొదలగువానిని రచియించెను. మరియు నమరేశ్వరాష్టకము, లింగోద్భవదేవు గద్యము మొదలైనవి చెప్పినట్లారాధ్యచరిత్రమునుండి తెలియుచున్నది. ఈతఁడు శ్రీముఖగద్యయను మఱియొక చిన్న గ్రంథము రచియించినట్లు బసవపురాణపీఠిక వ్యక్తముచేయుచున్నది. ఈతఁడా కాలమున బౌద్ధపదాచార్యులతో వాదమొనరించి వీ[ర]శైవమతమును సంస్కరించిన సుప్రసిద్ధ పండితుఁడు. ఈతఁడు శివుఁ డితరులనుకొనునట్లు సంహారకర్తయగాక సృష్టిస్థితిలయకారకుడని నిర్ణయించినట్లు సోమనాథుఁడు చెప్పినాఁడు.[10]

ఈతని చరిత్రమగు పండితారాధ్యచరిత్రమున నెన్నియో మహత్తరవిషయములు తెలియుచున్నవి. ఈతని మహిమయంతయు సువ్యక్తమగుచున్నది. ఈతఁ డాంధ్రదేశమున మతసంస్కర్తలలో నగ్రగణ్యుఁడై యాంధ్రులందఱకు బూజ్యుఁడగుచున్నాఁడు. ఈతఁడు రుద్రదేవునికి సమకాలమువాడయ్యు నాతనిచే పూజింపఁబడినట్లు తెలియుటలేదను విషయమీవఱకే వ్రాసియుంటిని. ఈతనివెనుక నీతని కుమారుఁడు కేదారయ్యయు నాతని తనయులైన మనుపండిత, భీమపండిత, మహాదేవపండితఁ, చెన్నపండితులును, కేదారయ్య శిష్యుఁడైన యివటూరి సోమనాథయ్యగారు నాయన తనయులు సూరీశ్వరుండును విశ్వనాథవ్వయ్యరుగారును, సింగనమంచి[వా]రు నాంధ్రదేశమున పండిత స్థాపిత సంప్రదాయముల స్థిరముగ నిల్పిరి.

రుద్రదేవుఁడు:— కాకతి రుద్రదేవుఁడు విద్యాభూషణ బిరుదాంకితుఁడై సంస్కృతాంధ్రభాషాకవులఁ బోషించెను. ఈతఁడు నీతిసారమను గ్రంథము నాంధ్రభాషలో రచియించినాఁడు. అందునుండి సకలనీతిసమ్మ

9 కం మనుమహత్త్సంవిత్తను వా, క్యమునకుఁ జెప్పె నాల్గువేల గూఢార్థములన్
ఘనుఁడు శివలెంకమంచన, రనఘునఘాలాంగ విజయ రామయలింగా||

10 ద్వి గాథమై సంహారకర్తయయనుచు, సాధారణముగనీశ్వరుబల్క— భక్తి
దూరాత్మ్యసమయసంహారుడై చనిరొ, కూరుండు మల్లికార్జున పండితయ్య||

మున మడికిసింగన పెక్కుపద్యము లుదహరించినాఁడు. రుద్రదేవకృతమగు "ఉషాపరిణయము" అను సంస్కృతనాటక మొకటి గలదనియు, నది రచించినవా డితఁడగుట విశదముకాలేదనియు, శ్రీయుతమానవల్లి రామకృష్ణకవి ఎం. ఏ. గారు సకలనీతిసమ్మతము పీఠికయందు వ్రాసియున్నారు. కాని యయ్యది భాస్కరరామాయణమునం దయోధ్యాకాండము రచించిన కుమారరుద్రదేవ కృతమేమో యని సందియముగలుగుచున్నది. అతఁడైన కాకతీయయుగమునకు సంబంధించినవాఁడే యగుచున్నాఁడు.

నన్నెచోడమహాకవి:— నన్నెచోడమహాకవి కుమారసంభవమహాకావ్యకృతికర్త. ఈతనికాలము నిశ్చయముగ మనకు తెలియకపోయినను పండ్రెండవశతాబ్దముకంటె పూర్వుడనియు, రుద్రదేవాదుల రాజ్యారంభకాలమున నున్నవాఁడనియు, కొన్ని నిదర్శనములచే నూహింపవచ్చును. ఈతఁడు తన కావ్య మంకితమిచ్చిన మల్లికార్జున శివయోగి కాలాముఖమతానుసారియైనట్లు నిదర్శనములు గలవు. కవితాగౌరవమునందును కావ్యరచనమునందును కవి రాజులయందేమి రాజ కవులయందేమి, యీతఁ డగ్రగణ్యుఁడు. ఈతడు కుమారసంభవమేకాక కళావిలాసమను కావ్యమును రచించినట్లు రామకృష్ణకవిగారు కుమారసంభవ ప్రథమభాగపీఠికయందు వ్రాసియున్నారు.

పాల్కురికి సోమనాథుఁడు:— ఈతఁడు బసవన పండితారాధ్యులతరువాత కర్ణాటాంధ్రదేశముల వీరశైవమతమును వ్యాపింపఁజేసిన మహనీయుఁడు. శైవకల్ప పౌరాణికుఁడై యష్టభాషాకవిశ్వరచనా విశారదుఁడై వేదవేదాంతేతిహాస సకలాగమశాస్త్ర విజ్ఞాన సంపన్నుఁడై, బహుగ్రంథరచయితయై నెగడినవాఁడు. ద్విపదకవితా సామ్రాజ్యమునకు సార్వభౌముఁడగు నీతని ద్విపదకావ్యము లీతని సర్వతోముఖపాండిత్యము విశదము చేయుచున్నవి.

బసవపురాణము, పండితారాధ్యచరిత్రము, అనుభవసారము, వృషాధిపశతకము, సోమనాథస్తవము, చెన్నమల్లు సీసములు మొదలగు బహుగ్రంథముల, నుదాహరణములను, అష్టకముల, గద్యల, రగడల, పెక్కింటి రచియించి మించినాఁడు. ఈతని కాలము క్రీ. శ. 1190—1250 ప్రాంతమగును.

యథావాక్కుల అన్నమయ్య— ఈతఁడు వీరశైవమతప్రతిపాదకమగు సర్వేశ్వర శతకమును క్రీ. శ. 1242 లో రచియించుటచే నీ కాలమువాఁడు. ఈతని శతక మనేకాంధ్రశతకములకు మాతృక. ఆంధ్రసాహిత్య పరిషత్ప్రకటితమగు సర్వేశ్వరశతక పీఠిక యందీకవి యుదంతమంతయుఁ గలదు.

బద్దెన— భద్రభూపాలుఁడను నామాంతరముగల యీతఁడు గణపతిదేవ సామంతులలో నొకఁడు. ఈతఁడు నీతిశాస్త్రముక్తావళిని సుమతి శతకమును రచియించెను.[11]

ఈతని నీతిశాస్త్రముక్తావళినుండి మడికిసింగన తన సకలనీతి సమ్మతమున పద్యములుదహరించుటచే నీగ్రంథము పూర్వము

11 శ్రీవిభుఁడగర్వితారి, క్ష్మావర దళనోపలబ్ధ జయలక్ష్మీసం
భావితుఁడ, సుమతి శతకముఁ గావించినప్రోఢ కావ్యకలాపనుఁడఁగ॥

ప్రఖ్యాతమైయుండెనని చెప్పనొప్పును.

మరియు సకలనీతిసమ్మతమున నుదహరింపఁబడిన ముద్రామాత్యమును విరచించి క్షేమేంద్రుడని ప్రఖ్యాతికెక్కినలక్కాభట్టును, చారుచర్యను విరచించిన యప్పనమంత్రి మొదలగువా రీకాలమువారలే యగుదురు.

శివదేవయ్య— కాలాముఖమతాచార్యుడును గణపతిదేవ చక్రవర్తికి దీక్షాగురువునగు విశ్వేశ్వరశివదేశికులే యీతడని చరిత్రజ్ఞులు సిద్ధయించి యున్నారు అట్లయినచో నీతని కృతులు పురుషార్థసారము, శివదేవధీమణి శతకము రెండు గలవు. సకలనీతిసమ్మతమున సింగన పురుషార్థసారమునుండి మెండుగ పద్యము లుదహరించినాఁడు. శివదేవయ్య రాజ్యపరిపాలనా పద్ధతుల నెఱిఁగిన వాడగుటచే నాతఁడను భవమునకుఁ దోడు శాస్త్రజ్ఞానము నుపపాదించి పురుషార్థసారసత్కృతిని రచియించి యుండును. ఈతఁడు పరతత్త్వరసాయనమను మఱియొక గ్రంథముగూడ రచించినట్లు తెలియుచున్నది

రంగనాథుఁడు— రంగనాథ రామాయణమనుపేరఁ బరఁగు ద్విపదకావ్యమున కీతఁడు కృతికర్తగా గన్పట్టుచున్నాఁడు, కాని యాశ్వాసాంతములయందు గోనబుద్ధభూపతి తన తండ్రియగు విఠలరాజునకు నంకితముగా దీనిని రచియించెనని స్పష్టపడుచున్నది. మఱియు నుత్తరరామాయణమును ద్విపదగ రచియించిన కాచవిభుఁడును పినవిఠలరాజును దమతండ్రి బుద్ధరాజనియు, నాతఁడు కోటగన్న క్షితీంద్రునకు నన్నమాంబకుఁ దనయుఁ డనియుఁ జెప్పినారు.

సుప్రసిద్ధపరిశోధకులగు రామకృష్ణకవిగారు కోనగన్నారెడ్డియు విఠలనాథులు సోదరులనియు, పినతండ్రి పెదతండ్రులను గూడ తండ్రులనిచెప్పు నాచారము గలదు గావున గన్నయ్యరెడ్డి కుమారుడైన బుద్ధారెడ్డి పినతండ్రియగు విఠలధరణీశునకుఁ గృతినొసంగుచు తండ్రియని పేర్కొనెనియు, నూహించుచున్నారు ఈ యూహ యెంతయు సమంజసముగ నున్నది.

కోనబుద్ధారెడ్డి రుద్రమదేవి కాలమువాడని యాతని కూతురు కుప్పమాంబ క్రీ. శ.1265 సంవత్సరమున వేయించిన శాసనమువలననేమి, యితర చరిత్రలవలననేమి స్పష్టపడుచున్నది. రంగనాథుఁడు రామాయణము రచియించి, వారిపేరుపెట్టెనో లేక వారికిఁ జాల సహాయకారిగనో యుండి యుండును, కావున రంగనాథుఁ డీకాలమువాఁడే యగుట నిస్సంశయము రంగనాథుని శివస్తుతిరూపకములగు తోటకవృత్తములను లాక్షిణికు లుదాహరించిరి. త్రిపురహరణమును వర్ణించు పద్యము రంగనాథునిది యని ప్రబంధరత్నావళియందు జగన్నాథు డుదహరించి యున్నాడు.[12]

తిక్కనసోమయాజి:— తిక్కనసోమయాజి గణపతిదేవుని సామంతుఁడగు మనుమసిద్ధి కాలమువాడగుటచే నతఁడు కాకతీయయుగమువాఁడేయగుచున్నాఁడు. మఱియు సిద్ధేశ్వరచరిత్రమునందక్కన బయ్యనలను మనుమసిద్ధి దాయా

12 చ॥ అదలని తేరు, తేరునకు నాదరులై తగు విల్లువింటికిం
గుదురగు నారి, నారిపయిఁగూర్కు శరంబు, శరంబుఁబోద్దునం
బొదలినయంత, యుంతముఖల్ నిజవాహములైన గుఱ్ఱముల్
చెదరక నీకుఁబెట్లు పనిసేయునయా గిరిశేశనాయకా.॥

డు లాతనిపై దండెత్తి వచ్చి, యాతని రాజ్యపద భ్రష్టునిఁగావింప, మంత్రిశిఖామణియగు తిక్కన యోరుగంటికిబోయి గణపతిదేవచక్రవర్తికి దానుబూర్తిచేసిన భారతాఖ్యానము వినిపించి, యాతనిసహాయముఁగొని, యక్కనబయ్యనల ను పాఱఁదోలి, మనుమసిద్ధిని రాజ్యమునకుఁ బునరభిషిక్తునిఁగావించెనని చెప్పబడియున్నది పై విషయమంతయుఁ దిక్కన క్రీ 1210-1290 ప్రాంతములనుండినట్లు తెలుపుచున్నది. తిక్కనతనకాలమునందు కృతికర్తయు కృతిభర్తయునై వెలసినవాఁడు. నిర్వచనోత్తరరామాయణము మున్నగు గ్రంథములు రచియించుటయే గాక భారతమందలి పదియేనుపర్వములాంధ్రీకరించి, యాంధ్రభాషావాఙ్మయముతోఁగూడ తనపేరు శాశ్వతముగ నిల్పినవాఁడు.

కేతన:—కేతన దండివిరచిత దశకుమార చరిత్రము బద్యకావ్యముగఁ దెలిగించి తిక్కన సోమయాజి కంకితమిచ్చుటచే నీతఁడా కాలమువాఁడేయగును. మఱియునీతఁడు విజ్ఞానేశ్వరమను ధర్మశాస్త్రగ్రంథము, నాంధ్రభాషాభూషణమను వ్యాకరణగ్రంథమును, రచించినవాఁడు. వేఁగివిషయమునఁ గల వెఱ్ఱిరాలను నగ్రహారమునకు నగ్రణి, అభినవదండి బిరుదాంకితుఁడు.

బయ్యన:—ఈతఁడు తిక్కనసోమయాజి కాలమున నున్నట్లు నాతనిచే 'భవ్యభారతి' యని బిరుదము నొందినట్లును, తనకు మంత్రాతయైనట్లును, యనంతకవి తనభోజరాజీయమునఁ జెప్పినాఁడు

మారన:—ఈపండితుఁడు తిక్కనసోమయాజికి శిష్యుఁడై మార్కండేయపురాణము నాంధ్రీకరించి, ప్రతాపరుద్రుని సేనానియగు నాగయ గన్నని కంకితముఁగావించియున్నాఁడు. ప్రతాపరుద్రుఁడు క్రీ శ. 1290-1326వఱకు ను పాలించుటచే నితఁడా కాలమువాఁడు.

భాస్కర రామాయణ గ్రంథకర్తలు:—ప్రతాపరుద్రునియశ్వాధ్యక్షుఁడగు సాహిణిమారని కంకితముగా భాస్కరుఁడనుకవి, తన పుత్రుఁడగు మల్లిఖార్జున భట్టును, సాహిణిమారుని కుమారుఁడగు కుమారరుద్రదేవుని, అయ్యలార్యుని దోడుసేసికొని రామాయణము రచించెను వీరందరు కాకతీయయుగమువారు ను నోరంగల్లుప్రాంతము వారేయగుదురు. రామాయణమేకాక దశగతులను గ్రంథముఁ వ్రాసి సాహిణిమారుని కంకితమిచ్చెనని విద్వద్వర్యులగు శ్రీరామకవిగారికుమారుడు భవవీతికయందుఁ దెల్పియున్నారు ఇంతమంది రచించిన ను భాస్కరునికిముందు రంగనాథరామాయణమును వెనుక నెఱ్ఱాప్రెగ్గడ రామాయణమును వెలయుటచేతను, భాస్కరుఁడుముఖ్యుఁడగుట చేత నీతరువాతివారు భాస్కర రామాయణ మని దీనిని వ్యవహరించిరి.

కాకతీయ యుగమునందు వీరుగాక వేములవాఁడ భీమకవి, యథర్వణుఁడు మొదలగు వారు గలరు. వారికాలములింకను సునిశ్చితములు గాలేదు. అయినను జరిత్రాంశములు పరిశోధింప వారు కాకతీయయుగమునకు సంబంధించినవారుగనే కానవచ్చుచున్నారు

తెనుఁగుకవులేగాక, సంస్కృతకవులుగూడ కాకతీయయుగమునకు సంబంధించినవారు పెక్కుఱుగలరు. నృత్తరత్నావళిరచియించిన జాయసేనాపతి, వీరభల్లటదేశికుఁడు, నిరోష్ఠ్యరామాయణమునురచియించిన శాకల్యమల్లభట్టు, ప్రతాపరుద్రయశోభూషణకర్తయగు విద్యానాథుఁడు మొదలగు మహాకవులెందఱోవి యాకాలమున వెలసియుండిరి. వీరుగాక రుద్రదే

వుని యనుమకొండ శాసమునురచించిన రామ దీక్షితుఁడు మొదలగు సుప్రసిద్ధులెందఱేని సం స్కృతమున రసవత్కవిత్వముచెప్పఁగలిగిన వారా కాలమున నుండిరి.

సంస్కృతాంధ్ర భాషా పరిపోషణంబున నింతమందిమహాకవులుగల యుగమును కాకతీ యయుగమని యాంధ్రవాఙ్మయ చరిత్రకారు లు నామకరణము సేయుదురుగాత!

## కాకతిప్రోలరాజాదుల ప్రశంస.

శ్రీయుత చాగంటి భాస్కరలింగంగారు

శా. ఇన్నూఱేబది శంభుదేవళములన్, యెంతేని నిర్మించె నె
న్నున్నూరింట ప్రతిష్ఠజేసె, గిరిజన్ గూర్మిన్ గనన్ యేబదిం
ట న్నిల్పెను గణనాథ ముఖ్యుల బ్రతిష్ఠల్ జేసె దిక్సంఖ్యలన్
ఎన్నన్ కాకతిప్రోలరా జవరదేవేంద్రుండు సామాన్యుడే.

సీ. భాసురంబౌ శిలాప్రాకారరాజంబు, నిర్మించి మించె నేనిర్మలుండు
ద్వినవాస్రి సంఖ్యాక వసుమతీనాథుల, శాసించె నేచండశాసనుండు
మమతతో శ్రీశైలమల్లిఖార్జునదేవు, సేవించె నేభక్తశేఖరుండు
పండితారాధ్య గుర్వంఘ్రుల్ భజించి. దీక్షను బొందె నేరాజసత్తముండు
ఎవ్వడట్టి మహామహుడెంచి చూడ, వానిగొనియాడ జెల్లును వసుధలోన
భూవరబిడౌజు గణపతిదేవరాజు అభ్యుదయులార! నైజాముసభ్యులార!

మ. విమతున్ దేవగిరిప్రభున్ గెలిచి వేవే కాన్కగా కోటిద్ర
వ్యమునందెన్ గొలిచెన్ సహస్రకళిసీవారంబునన్ సిద్ధలిం
గము పద్మాక్షికి భాసురోత్సవము వీకన్ జేసె నెంతేని రు
ద్రమహాదేవితలంప నీపెకెనయే, రాజన్యచూడామణుల్.

సీ. గిరిరాజకన్యతో సరివచ్చు ముమ్మాంబి, కడుపార నెవ్వానికన్నతల్లి
అమరావతికిసాటి యనవచ్చు, నోరుగల్ లాలసంబుగ నెవ్వడేలుపురము
సురనదికెనవచ్చు ధరకాశికాగంగ, యెవ్వాని పానార్ఘ్యశుద్ధజలము
శివునిజోడనవచ్చు శివదేవయఖ్యాత, సద్విజుండెవ్వాని సచివమౌళి
ఎవ్వడట్టి మహామహుండెంచిచూడ, వానిగొనియాడ జెల్లును వసుధలోన
భూపచయపట్టభద్రుప్రతాపరుద్రు అభ్యుదయులార! నైజాము సభ్యులార!

# కాకతీయులనాటి సాంఘికచరిత్ర.

శ్రీయుత అంబడి సుబ్బరాయచెట్టిగారు ఎం. ఏ. బి. ఇడి.

ఆంధ్రచక్రవర్తులై సుమారు క్రీ శ. 1050 సం॥లు మొదలుకొని 1326 వఱకు ఓరుగల్లురాజధానిగా పాలించిన కాకతీయుల నాటి రాజకీయ, సాంఘిక, సారస్వతాది పరిస్థితులు విస్మృతములై యింతవఱకును చరిత్రకు వేద్యంబులు గాకున్నవి. కాన నాటి యాంధ్రుల సాంఘికాది పరిస్థితులిట వర్ణింపబడుచున్నవి.

1 ప్రజాసామాన్యజీవితము:—ఆకాలమందు పెద్దపెద్ద పట్టణములదక్క, నక్కడ పల్లెలలో సామాన్య జీవనము కేవలము నిరాడంబరమైయుండెను. ఇప్పటికాలమున పల్లెలయందు బీద లుపయోగించురీతి నీరుదెచ్చుటకు మట్టికుండలు, కడవలు, దిగుడుబావులు, పండుటకు నులకమంచములు, నివసించుటకు పూరిండ్లు, కట్టుటకు నూలుచీరలు, ధరించుటకు సామాన్యములైన సొమ్ములు నపుడుండినవి. పట్టణముల నుత్తమ తండులాన్నమును, గోధుమవంటకములను దినుట వాడుకయైనప్పటికి పల్లెలయందు భాగ్యవంతులుకూడ కొఱ్ఱన్నముకూడ దినుచుండిరి. వారికి పాయసము, పులగము నున్నగునవి ప్రియాహారములై దేవతానైవేద్యములందును, పర్వదినములయందును వాడబడుచుండినవి. వరి, చెఱకు, ప్రాసకులు, కొఱ్ఱలు, పెసలు, గోధుమలు మున్నగు ధాన్యముల పైరులుబెట్టి పండించుచుండిరి. కొన్ని పల్లెలయందు ధాన్యపుసంతలుగూడ జరుగుచుండెను. బెల్లము, పంచదార మున్నగు భోజ్యవస్తువులనుగూడ తయారుచేయుచుండిరి.

వక్కలు, తమలపాకులు భోగ్యవస్తువులై యుండినవి వలయుసామాను ఎద్దులబండ్లపైనను, బండ్లుపోనిమార్గముల దున్నపోతులపైన, నెత్తిపైన గొనిపోవుచుండిరి. ప్రజలు తమ్ము బరిపాలించు రాజులయెడ మిగుల భక్తిగలవారై యుండిరి.

2 సంఘము:—సంఘమునందన్నికులముల సంతర్పణభోజనము ప్రోత్సహింపబడుచుండెను. అన్నికులములందు వివేకవంతులు రాజ్యమందున్నత పదవు లందుచుండిరి. సర్వకులముల వేశ్యావృత్తి ప్రబలియుండెను. రాజులయందుగూడ బాల్యవివాహములు మెండుగా జరుగుచుండెడివి పల్నాటి వీరుడగు బాలచంద్రుడు బాల్యక్రీడాతత్పరుడగు నప్పటికే వివాహితుడై యుండెను. అప్పటి కతడు పదునాలుగేండ్ల యీడునందుండెను.[1] ఇంతియేగాక నాకాలమందు సహగమనమును హిందువులు పూర్వమతాచారము వాడుకయందుండెను. పల్నాటివీరుడగు రాచమల్లుడు యుద్ధములో నిహతుడుకాగా సతినివత్తి "పేరమ్మ" అను సతీతిలకము భర్తనుదహించుచితిపైనబడి యసువుల వీడెను. హీనకులజు

1. Cf. పల్నాటి వీరచరిత్రము.

లయిన మాలలగూడ వైష్ణవుల గావించి యున్నతపదవుల నిచ్చి యంతర్వర్ణపంక్తి భోజనముల బ్రోత్సహించి కేచెర్ల బ్రహ్మనాయుడు, సర్వకులసమత్వభావము విజృంభింప జేయుచుండెను. కన్నమనాయుడను మాల బ్రహ్మనాయునికి బ్రియశిష్యుండై పల్నాటి రణరంగమున జాలదోడ్పడెను. ఆమాల వీరుఁడు "నాయుఁడు" అనగా పాలించువాడు అని పిలువబడుట, ఎఱుకలసానులు యుద్ధరహస్యములగనుటకు నేర్పఱుపబడుట, భట్టువారల రాయభారములకు బంపుట మున్నగు విషయము లాకాలమున నంత్యకులజులు వహించిన యున్నతస్థితిని సూచించుచున్నవి. కన్నమనాయుడు కార్యమపూడి రణరంగరహస్యవృత్తాంత మొక యెఱుకలసానినుండి గ్రహించెను. బ్రహ్మనాయుడు నలగామ రాజుకడకు బంపిన రాయభారి భట్టుకులము వాఁడు. కాకతీయనృపతియగు ప్రతాపరుద్రుడు తన సేనలగూర్చుటయందు కులభేదముల బాటింపక వీరులై తగినవారల నెల్లర జేర్చుకొనుటగూడ[2] నీవిషయమునే సూచించుచున్నది. బ్రహ్మనాయుడు పలుకులముల లలనల వివాహమాడి బిడ్డలగనుట, బాలచంద్రుడు వివిధవర్ణముల వారితో స్నేహము గావించుట మున్నగు విషయము లాకాలమందు కులభేదము లంతగా పాటింపకుండు విషయము వేనోళ్ల జాటుచున్నవి. వర్ణమానకాలమున సంస్కర్తలెల్లరిచే దూష్యమైన "ఉంకువ" లేక "ఓలి" (అనగా భర్త భార్య తలిదండ్రులకిచ్చు రొక్కము) ఆచారముండుండెను. బాలచంద్రుడు తన వివాహకాలమందు తన మేనమామల కోలియిచ్చినట్లు చెప్పియున్నాడు.[3] సామాన్యప్రజలకుఁజేరిన టిట్టిభసెట్టి మొదలుకొని రాజకులజులగు ప్రతాపరుద్రాదులవఱకును, బాలుఁడగు బాలచంద్రుడు మొదలుగా నతని తండ్రియగు బ్రహ్మనాయునివఱకెల్లరు జారులై యుండుట ఆకాలమందలి జారత్వప్రాబల్యము జాటుచున్నది. తిరునాళ్లు, పూటకూటియిండ్లు నిట్టి యసహ్యముల కిప్పటివలె యప్పుడుకూడ లోనై యుండుట స్పష్టముగా దెలియుచున్నది.[4]

ఇంతియేగాక యిప్పటివలె నాఁటికాలమునగూడ గంగమ్మ, కాకతమ్మ, పోలేరమ్మ మున్నగు శక్తిదేవతల జాతరలు విరివిగా జరుగుచుండెడివి. అందు బోనగావళ్లు, కుంభము, దున్నపోతుల బలియిచ్చుట వాడుకయందుండెడివి.

ఇప్పటి "ఆసాదువారి" సుద్దులవలె యాకాలమున బవినీలనెడువారు "ఏకవీర" మున్నగు దేవతల జాతరలయందు కథలఁ జెప్పుచు ప్రేక్షకుల నాహ్లాదనిమగ్నుల జేయుచుండినట్లు దెలియుచున్నది. ఈ దేవతలకథ నీజాతరసమయములందు బవినీలేకాక మాలెతలు, కాపుటాడవాండ్లు, జక్కులపురంధ్రులు మున్నగు

2. "The Political History of the Kakatiyas" by Mr. M. Rama Rao J.A.H.R.S Vol V pt3.

3. "మామలంబునకోలి మాదలుగలవు." ||పల్నాటివీర చరిత్రము||

4. గీ|| సంధివిగ్రహయానాది సంఘటనల
బంధకీజారులను రాయబారయగుచు
పూటకూటింట వర్తించు బుప్పశకుడు"
"క్రీడాభిరామము"

స్త్రీరత్నములు పాటలుబాడుచు, చిందులు ద్రొక్కుచు చూపఱులకు వింతగొల్పుచుండిరి. సంతానకాంక్షతో వచ్చిన పడఁతులుగూడ వీరిఁజేరుచుండిరి. కాకతమ్మ కాకతీయుల వంశ దేవతగా గొలువఁబడుట, "ఏకవీర" యీ కాకతమ్మకు సైదోడని పిలువఁబడుట, యీదేవతల యాలయములు ఓరుగల్లుపురమున వెలయుచు నుండియుండుట, పల్నాటివీరుడగు బ్రహ్మనాయుఁడు కారెమపూడి రణరంగమున కేగుతరి దున్నపోతును బలియిచ్చుట, మున్నగు విషయము లాకాలమందు జాతరలలో ప్రజాసామాన్యముననేగాక రాజులకుఁగూడఁ గల భక్తివిశ్వాసములఁ జాటుచున్నవి.

ద్యూతవ్యసనముకూడ యానాటి ఆంధ్రుల నలయించుచున్నట్లు పెక్కు దృష్టాంతములు గలవు. మొలలఁ గోచిపాతలుమాత్రముఁ దక్కనంతవఱకు పన్నిదములొడ్డి జనులు పాడుచుండిరి.[5] కేవలము సేద్యము వృత్తిగాఁ జరించు హాలికులుగూడ నీపణములకై పచ్చడము లమ్ముకొని చలికాలమున బాధపడుచుండిరి.[6] ఇట్లుసర్వజను లీ జూదపుపిచ్చియందు మునిగి బజారులందే పన్నిదములొడ్డుచుండుట, కోడిపందెములు, మేషయుద్ధములు విరివిగా జఱుపఁబడు చుండుట,[7] యాకోడిపందెములు పల్నాటివీరుల యుద్ధమునకుగూడ యొకకారణముగా నేర్పడుట, మున్నగువిషయములఁ దఱచిచూచిన జారత్వమునకుఁబలె ద్యూతమునకుఁగూడ రాజులే మార్గదర్శకులైరని దెలియును. ఈకోళ్ళపోరితనము, మేషయుద్ధములు, కేవలము పన్నిదములకే గాక, వినోదములకుగూడ జరుపఁబడుచుండినవి. ఇట్టిజీవహింసాన్వితములగు వినోదములు నెఱపుచుండినందువలనను, జాతరలందు దున్నపోతులఁ బలియిచ్చుచుండి నందువలనను, భూతదయాబుద్ధి, అహింసాచింతన యంతగా నప్పటిజనులచే తలఁపబడియుండినట్లు తోచదు.

అప్పటి జనసామాన్యము పెక్కువినోదములఁ గాలముఁబుచ్చుచుండిరి. ఆకాలమందు యిప్పటివలె నాగస్వరముఁ జేబూని దానివాయించుచు పాములాడించుకొనుచు వచ్చు పాములవాండ్రును నుండిరి. ఓరుగల్లుపురవీథియందిట్టియాట జరుగుచుండ గోవిందశర్మ టిట్టిభసెట్టికిఁ జూపించెను. ఇప్పటి దొమ్మరిపడుచులు చేయుపింతలననుకరించి, మొగ్గ్రవాలుచు, గొరగపడుచులును, వివిధములగు వింతలజేయుచు మైలారపిరభటులునువారిఁ బ్రజలకానందముఁ గొల్పుచుండిరి. ఇక్కాలమున దత్తమండలములలో భిక్షకై వచ్చి పలువిధములగు గంతులు రంతులొనర్చు ముండిపకీరులను బోలె వివిధములగు గంతులచేఁ జూపఱ నలరించు తూర్పునాటి గడీములనువార లోరగల్లుఁవంటి పట్టణములనుండిరి. నేటితందనాల పాటకులఁ బోలె వీరులఁగూర్చి పురుషులేగాక స్త్రీలుగూడ సత్కీర్తనలఁ జేయుచుఁ గాలముఁబుచ్చుచుండిరి. ఈవీరపూజ జైనమతము క్షీణించి శైవమతము ప్రబలుకొలది ద్వితీయ

5. పాచద్యూతమీ పన్నిదం బంగీకారము సేయువారి
మొలలఁ బ్రాపించు గోపీనములే" Ibid

6. గీ|| మాఘమాసంబు......
ఇచ్చెదం బిమ్మికొన్నాడు పణములకును" Ibid

7. cf హాళి ఖగేంద్రములార Etc. Ibid

ప్రతాపరుద్రుని కాలమునాటికి శైవమతయుక్తములగు భైరవ, మైలార దేవపూజలతో కూడి, (బ్రాహ్మణేతరులలో) మఱింతయెక్కువయ్యెను.[8] కేవల మాటపాటలనే గాక దేవాలయములఁగట్టి, విగ్రహములఁ బెట్టి, యుత్సవముల జేయుచు నీవీరపూజ చేయుట వలన యీ కాలమందు వీరులఁ బూజించుటయందు, వారిననుకరింప వలయునను నాయాశయమునందునుఁ బ్రజలకుఁగల యాసక్తి విశదమగు చున్నది

3 పరిశ్రమలు:- పైనుడువబడిన విధమున గానుగ, కుట్రపు (సాధారణమగు) వృత్తులేగాక, లోహపరిశ్రమకూడ ప్రథమప్రతాపరుద్రుని సమకాలీనులైన పల్నాటిసీమ నేలిన పల్నాటి వీరులరాజ్యమునఁ జాలప్రసిద్ధిఁగాంచెను. ఇనుము, ఇత్తడి మున్నగు పంచలోహములు ప్రబలముగా దొరకుచుండెడివి. గుత్తికొండలోని గొలుముల పాడెమని యొకభాగమునకు బేగొందుటచేతను, యందలి యొకకొండ కనుపకొండయని నామముంటచేతను, యొకప్పుడు పల్నాటి సీమ లోహపరిశ్రమకు ముఖ్యస్థానమై చుట్టునున్న దేశమునకుఁగావలసిన యినుము, రాగి మొదలగు లోహములఁబంపుచు, వ్యాపారాశ్రయమైయుండి యుండెనని గ్రహింపదగియున్నది. ఇంతియేగాక గణపతిదేవుని కాలమందు ప్రస్తుతపు గుంటూరుజిల్లాలోని మోటుపల్లె యొకరేవుపట్టణముగానుండి విదేశవ్యాపారమున కాశ్రయమై యుండెను. గణపతి విదేశవ్యాపారము వృద్ధిపొందించుటకుగాను పరదేశవర్తకుల కభయశాసనమిచ్చి నియతములగు సుంకములమాత్రము రాబట్టుచువచ్చెను. ముందువలె వారివస్తువులఁగొల్లగొట్టకుండునట్లాజ్ఞాపించెను. ఈవిదేశవస్తుసుంకములేకాక, యీకాలమున, నూరిలోనికిఁబండ్లపైనఁ గొనివచ్చు సామానులపైన సుంకములు (Tolls) తెములపాకులుమున్నగు భోగ్యవస్తువులపై విధింపబడు పన్నులు, పుల్లరి పన్నులుమున్నగునవి రాబట్టబడుచు, చాల వఱకు దేవతార్చనాదికములకు వినియోగింపఁబడుచుండెను.

4 మతము:- కాకతీయులు మొదట జైనులుగానుండితరువాత వీరశైవులైరి. ప్రోలరాజు గొందఱు జైనుఁడనియు మఱిగొందఱు శైవుడనియందురు. ఏదియెట్లున్నను ప్రథమప్రతాపరుద్రునికాలమునుండి శైవ వైష్ణవ మతములు తలయెత్తి జైనమత మడుగంటఁజొచ్చెను. అతని సమకాలీనుడును, పల్నాటివీరవతంసుడునగు బ్రహ్మనాయుఁడు వైష్ణవుడై నిమ్నజాతులనుండి యుగ్రజాతివఱకు నందఱ వైష్ణవులఁగావించి యంతర్వర్ణపంక్తి భోజనములకైగూడ ప్రేరేపించెను. పల్నాటిసీమయందీనాటికతని విష్ణువియవతారుడనికొనియాడుట గాంచిన యాతనియొక్కయు వైష్ణవమత ప్రచారముయొక్కయు యీనాటి యున్నతస్థితి తెలియగలదు. ఆనాటినుండి యీ వేదమతములు క్రమముగా వృద్ధిగాంచి యాంధ్రరాజ్యమునుండి జైనమతమును బాఱదోలినవి. వీనియందు వీరశైవము మిన్నయై కాకతీయనృపతుల యాదరమునకుఁ బాత్రమై యాంధ్రరాజ్యమునందు విరివిగా వ్యాపించెను. గణపతియు ద్వితీయప్రతాపరుద్రుడును వీరశైవుల యుద్బోధనఁజేసి జైనుల హింసించిరని కొందఱు చరిత్రకారులు తెల్పియున్నారు. కాని నిజముఁదఱచిచూచిన నిదిసత్యముకాదు.

8. "The political History of the Kakatiyas" J.A.H.R.S. Vol VII pt i,

ఎందుకన, గణపతి సోదరియగు మైలమదేవికుమార్తె బయ్యలమహాదేవికి భర్తయై, ధాన్యకటకమేలిన రాజగు కోటకేతరాజు భార్యాసహితముగా బుద్ధభక్తుడై బౌద్ధచైత్యములకు బలువిధములగు బహుమతులఁ గావించెను. ద్వితీయప్రతాపరుద్రుని కాలమందోరుగల్లుపురమున గోవిందశర్మయు, టిట్టిభసెట్టియు కేవలము శైవదేవాలయములగు భైరవవీరభద్రాలయములే కాక, చండేశ్వరమహాశక్త్యాలయము, బౌద్ధవిహారము, పాండవుల గుడి, తురకల మసీదు, కేశవస్వామి గుడి మున్నగు వివిధమతాలయములఁ జూచిరి. ఈవివిధ దేవతాలయముల యునికి యా యోరుగల్లున వివిధమతముల యునికిని సూచించుచున్నది ఈవిషయములు గణపతి ప్రతాపరుద్రుల పరమతసహనముఁ జాటుచున్నవి. ఇంతియేగాక ప్రజలుగూడ జాతిమతభేదములులేక తమ పితృదేవభక్తితో గూడ, రాజభక్తిఁగూడ జాటువారై వివిధదేవతాలయములకు గుళ్ళు, చేలు, సర్పించుచుండిరి. అట్టి పరమతసహనభావముగల మహీపతుల యెడ, జైనులు పూర్వరీతిఁ దామాదరింపఁబడమికసూయజెంది రాజద్రోహకరకార్యములేవేని జేయనుద్యమించియుండవచ్చును. కాని మతవైషమ్యమునఁ జేసి వారు పీడింపఁబడియుండరు.

5 రాజులు:-రాజులుపైనజెప్పినట్లు మొదట జైనమతమును దరువాత వైదికమతముల, నందుముఖ్యముగా వీరశైవమతము నెక్కువగా నాదరించుచు, వీరశైవకవులగు పాలకురికి సోమనాథుని, మల్లికార్జునుఁడు శివదేవయ్య మున్నగువారిఁ బోషించిరి. గణపతిరుద్రుడు మొదలుగా నందరు శైవగురువులఁగలిగి శివాలయములకును, శైవగురువులకును మాన్యములిచ్చి యాదరించుచు కేవలమును, శైవాదరణయేకాక విష్ణ్వాలయములకుఁ గూడ దానములిచ్చి శైవకవులనేగాక తిక్కనాది హరిహరోపాసకులఁ గూడ నాదరించిరి. ఈరీతి కవుల నాదరించుటయేకాక తామే కవులై కూడ వాఙ్మయవృద్ధికిఁ దోడ్పడిరి. ప్రథమప్రతాపరుద్రుఁడు విద్యాభూషణ బిరుదాంకితుఁడై నీతిసారమను గీర్వాణగ్రంథము రచించెను. ద్వితీయ ప్రతాపరుద్రుఁడు విద్యానాథాదులఁ బోషించుటయే గాక ప్రతాప మార్తాండమను గ్రంథమునకుఁ గర్తయయ్యెను. ఇటుకవులై, కవిజనపోషకులై, వారి మంత్రిసామంతులకు మార్గదర్శకులైరి. బద్దెనభూపాలుఁడు, బుద్ధరాజు మున్నగు సామంతులును గుండమంత్రి, గన్నమంత్రి, సాహిణిమారుఁడు మున్నగు సేనాపతులును, శివదేవయ్య, తిక్కనాదికవిమంత్రిసత్తములును, గ్రంథకర్తలై గ్రంథభర్తలై యాంధ్రగీర్వాణ వాఙ్మయాభివృద్ధిఁ గావించి, యకాలపు శాస్త్రకళా వికసనమునకుఁ దోడ్పడిరి.

ఇంతియేగాక పల్నాటిరాజులు సంఘసంస్కర్తలు. పల్నాటి వీరుఁడగు బ్రహ్మనాయుఁడు మాలలను బ్రాహ్మణులను సమముగా వీక్షించుచుఁ బంక్తిభోజనములఁ బ్రోత్సహించుట విదితమే. కాకతీయనృపతులుగూడ వెలమ, రెడ్డి మున్నగు నిమ్నజాతులవారికి సేనాపతి మున్నగు గొప్పపదవులనిచ్చి యాదరించిరి. ద్వితీయ ప్రతాపరుద్రుఁడు మాచల్దేవియను వారాంగనాసక్తుఁడై యుండినట్లు గోవిందశర్మ ప్రసంగవశమునఁ బేర్కొనియున్నాడు.[9] పల్నాటివీరగు బ్రహ్మనాయుఁడు పలువురభా

9. శ్లో॥... ... ...ప్రతాపరుద్ర॥ ధరణీశో శాస్త్ర గోష్ఠీ ప్రతిష్ఠాపారీణ॥... ...మాచల్దేవి వారాంగనా,

లంద్యలఁ బెండ్లాడెను. అతనికుమారుఁడు బాలచంద్రుఁడు పదునాలుగేడుల ప్రాయముఁ గలవాఁడైనను "సబ్బాయి" యను వారస్త్రీవలలోఁ జిక్కియుండెను. 'రాజవేశ్యావిటప్రాభవప్రకట' అనియూనాడు రాజులఁ బ్రశంసించు వాడుకఁ జూడ, నప్పటిరాజుల స్త్రీవిలోలత బాగుగాఁ దెలియఁగలదు.

6 కవులు—అక్కాలమందు కవులకుఁగల గౌరవప్రతిష్ఠలు మఱియొక్కరికి యుండియుండవని తలచుట యతిశయోక్తి కాదు. ఎందుకన, కవులు కేవలము గ్రంథకర్తలై యుదరపోషణ చేసుకొనువారుగానే యుండలేదు. పైనఁజెప్పినట్లు వారు మంత్రులుగాను, రాజకీయతంత్రజ్ఞులుగానే కాక, రాజగౌరవముఁగూడ నందుచుండిరి. మనుమసిద్ధి తిక్కనను మామయని సంబోధించెను. అందలములు గొడుగులు మున్నగు రాచపదవులెల్లఁ బడసెను. మనుమసిద్ధి మహీశ సమస్తరాజ్యభార ధౌరేయుఁడై, నీతి చాణక్యుఁడై, వెలసెను. రంగనాథుఁడు కవిరాజగు బుద్ధరాజుయొక్క సభాస్థానమునఁగాంచిన గౌరవము బుద్ధరాడ్కృతమగు రామాయణమునకు రంగనాథరామాయణమని పేరిడుటయె చెప్పకఁ జెప్పుచున్నది. మఱియు నాటికవులు పెక్కురు కుకవితిరస్కృతి జేయని విశాలమనస్కులు; పరస్పరముఁ బ్రేమగౌరవములఁ జూపుచు, దమగ్రంథములఁగూడ కవులకే యంకిత మిచ్చుచుండిరి. షష్ఠ్యంతములచే గ్రంథభర్తల మితిమీఱి పొగడుటగాని, వివిధదేవతల సంకుచితబుద్ధివర్ణించి గ్రంథమునింపుటగాని వారికిష్టములేనివని. భాషాంతరీకరణమందుఁగూడ స్వతంత్రబుద్ధిఁజూపి గాలానుసరణి మార్పుజేసి యుక్తాయుక్తముగాఁ గవితనల్లశక్తిఁ గలవారు.[10] తమ్ముపోషించిన గ్రంథభర్తలనైన నిటీవలికవులఁవలె మితిమీఱు వర్ణనలను లేని పోని కట్టు కథల రాజులఁజేయక, శూద్రుడైన శూద్రుఁడుగానే చెప్పిన యాత్మగౌరవాభిలాషులు, సత్యవచస్కులు. ఉదరపోషణార్థమై తమకర్తవ్యము విడనాడక, దమకు నుత్తమముగా తోచిన మతము లోకోపకారార్థముగాఁ గ్రంథరూపమునఁ దెల్ప నుద్యమించిన స్వతశ్చలనపారీణులును, ఆత్మత్యాగులునై యుండిరి. ఇంతియేగాక యాశుకవితానైపుణిచే రాజుల, విజ్ఞులఁగూడ నలరింపగలిగిన సమర్థులై, తమవచోపటిమచేఁ జక్రవర్తులఁగూడ మెప్పించి, తమ్మునాదరించు నృపతులు దురవస్థలపాలైనపుడుగూడ కాపాడగలిగిన ధీరులును, స్వామిభక్తిపరాయణులునై యుండిరి. అందువలననే యాకాలము కవిబ్రహ్మఁనుగనఁ గల్గిననోమునోచుకొనెను. అట్టి సత్కవులు విరాజిల్లుచుండిన దేశమగుటచేతనే యాంధ్రులాత్మగౌరవరక్షణార్థముఁ బోరాడితురకలఁదాడిని చాలకాలమోర్పున నిల్పఁగలిగిరి.

7. స్త్రీలు:—బాల్యవివాహములు మొదుగానుండి బాలవితంతు ప్రాబల్యమునకు గారణభూతము లయ్యెననియు, సహగమన దురాచారము కొంతవఱకు పాటింపఁబడుచుండెననియుఁ బైన చెప్పియున్నాము. అయిన నప్పటిస్త్రీలు కొందఱు శూరురాండ్రై, శత్రులఁబన్ను నేర్పరులై, యుద్ధముఁజేయు సామర్థ్యముఁ గల్గియుండిరి. భారతికర్తయు,

---

10. దశకుమార చరిత్ర—ఇందు కవి తిరస్కృతి లేదు,
నిర్వచనోత్తర రామాయణము—షష్ఠ్యంతములు లేవు,
భాస్కర రామాయణము—ఇందు రెండును లేవు,

మనుమసిద్ధి నృపాలుని మంత్రిసత్తముండునగు తిక్కనసోదరుఁడగు ఖడ్గతిక్కన యుద్ధమున నోడి యింటఁదాగియుండుతరి, నతని మిక్కిలి ప్రోత్సహించి యుద్ధమునకుఁబంపిన దతనితల్లియు భార్యయునను టెల్లరికిఁ దెలిసినవిషయమే. పల్నాటియుద్ధమునకుఁ గారణభూతురాలై కారెమపూడి రణరంగమున ఘోరముగాఁ బోరాడిన నలగామరాజు నాయకసాని బాలనాగమ్మ నాటి వీరనారీమణియే. తాను యువతియైనను, భర్త చిన్నవాడైనను, యతడు విషయలోలుఁడై రణము మఱచియున్నతరి, బాలచంద్రుని యుద్ధమునకుఁ బ్రేరేచిన దతనిపత్ని మాంచాలి నాటివీరపత్నియే. ఇంతియేగాక వారు రాజకీయ వ్యవహారములఁ గూడ మిగుల బుద్ధిబలముఁజూపి రాజ్యములఁ గూడ చాలనేర్పునఁనేలిరి. విద్యానాథుని వాక్యానుసరణి నర్ధనారీశ్వరుడు సంపూర్ణస్త్రీరూపముఁదాల్చి భువిఁ జరింపవచ్చినాడో యనఁ నవత్రివిక్రమ పరాక్రమాతి శయమున 38 సంవత్సరములు కాకతీయ సింహాసన మధిష్ఠించి యాంధ్రులనేలిన రుద్రాంబయు, ధాన్యకటకనృపతియైన బేతరాజునకు భార్యయై భర్త గతించిన యనంతరము ధాన్యకటకమేలిన కోటగణపమ్మయు (కాకతీయ గణపతికుమార్తె)నాటి భూపాలనా విచక్షణలగు వనితామణులే. పల్నాటియుద్ధము నెన్నేని యుక్తులచేతను, మాయోపాయముల చేతనుఁ జరుగునట్లుగావించిన బాలనాగమ్మవంటి రాజ్యతంత్రజ్ఞ లింకెవరుందురు.

అయినను స్త్రీజాతికి సహజములగు కొన్ని క్రీడలు, వృత్తులుఁగూడ వారుమఱువక ననుసరించుచుండిరి. వారియాటలు:—(1) పాత్రిగొండ్లి యనగా గుండలాకారముగా నృత్యము సల్పుట. (2) పేరణియన భాండముపై నదివగులకుండునట్లు మృదువుగా నృత్యము సేయుట. (3) కోలాటము. (4) గొబ్బిళ్ళు పెట్టుట. (5) గుజ్జముభంజళి యనగా పామువలె వంకరగాబోవుచు నర్వాగమనమున నాటాడుట—మున్నగునవి. ఇందు రెండవదితప్ప మిగతనాల్గునుఁ గొంతవఱకు మనపల్లెలయందలి స్త్రీలు వ్యాసపూర్ణిమ మున్నగు పర్వదినముల దేవాలయములయందాడుట నేటికిని చూడనగును.

వారుఁ చేయుచుండిన వృత్తులు:—(1) కటకారవృత్తి యనగా నేటి మేదరవాళ్లువలె చాపలు, బుట్టలు మున్నగునవి యల్లుట. (2) పుష్పలావికలుగా నుండుట. (3) సుసరక్షేత్రు మున్నగుమందులు సంతలయందమ్ముట. (4) తెలికస్త్రీలు గానుగదిప్పుట. (5) సంపెగనూనెకూడ (పరదేశములనుండి వచ్చుట లేదు) తెలికస్త్రీలే గానుగలందుఁ దయారుచేసి బజారులం దమ్ముచుండుట ఇయ్యవి గిరిడాభిరామమునుండి దెలియుచున్నవి. ✓

స్త్రీలయుడుపులు, భూషణములుము క్కున ముత్యాలముంగర, జెవులకమ్మలు, భవిరెలు, కుంటెండ్లు జడయందు ముత్యాల కుచ్చులు, చేతులకు దండకడియములు నీలాలగాజులు, పచ్చలకంకణాలు, చాములాకడియములు, వేళ్ళకుంగరములు, నడుమునకు గజ్జలుగల బంగారపు టొడ్డాణము, పువ్వులరవికె, తగటుచీర మున్నగునవి సామాన్యస్త్రీయగు తెలికస్త్రీ గూడకట్టిన చీరకట్టుతీరు నేటినవనాగరికుల యందుఁగాని బూడగానము.

8. పురుషులు:—వీరులై, పరాక్రమమునఁ బేరెన్నిక గన్నవారును, రాజులునుఁ దత్సూచకముగా వారికాలియందు కడియాలు ధరిం

చుచుండిరి.[11] వీనింగాలికడియాలని చెప్పుచుండిరి. ఇప్పటికిఁ బల్లెలలో బాహుబలమునఁ బేరెన్నికఁ గన్నవారును, కుస్తీలయందు జయముఁగాంచువారును, మిగులఁబరువు మోయ సమర్థులైనవారు నీకాలికడియాలు ధరించుట వాడుక. ఇదియొకగొప్ప గౌరవముగా వాడబడుచున్నది. మఱియు మురుగులు, గొలుసులు, ఉంగరాలు ధరించుచుండిరి.[12] వేషాడంబరమున స్త్రీలకెంతమాత్రము దీసిపోకుండున ట్లప్పటిపురుషులుగూడ పైజెప్పిన యాభరణములకుఁ దోడుగా తగటుకూసములుఁ బంగారుదుప్పట్లు ధరించుచుండిరి. ఈయాడంబరరీతులు నలగామరాజాదిరాజులు, ధనికులు నవలంభించుచుండిరి. గోవిందశర్మవంటి సామాన్యజనులు రసికులైనను, నీర్కావిధోవతి పింజెవిడిచికట్టు సాధారణాచారములే యవలంభించుచుండిరి.

9 విశేషములు:— అక్కాలమున నిట్టి యానందదాయకములగు వినోదములేగాక, యిప్పటి మనకు నాశ్చర్యము గొల్పు కొన్ని వింతలుగూడ నుండెను. ప్రజలకు వలయు భోజనపదార్థములు సరఫరాజేయు కొన్ని సంతలుండెడివి. ఇట్టి సంతలు రెండువిధములు. వానిలో మొదటిది మడిసంత రెండవది మైలసంత ఈసంతలు పదునారవ శతాబ్దమున విజయనగరమున నదేపేర్లతో వెలయు సంతలఁబోలి ఓరగల్లుపురమున జరుగుచుండినట్లు టిట్టిభసెట్టి గోవిందమంచనశర్మ సంభాషణల నుండిగ్రహింపనగును.[13] ఈమైలసంత యూరికిబయట వెలిపాళెమున జరుపఁబడుచుండెను. ఇందు నిమ్నజాతులకు వలయు మత్స్యమాంసాదులు విక్రయింపఁబడుచుండెను. ఉన్నతవర్ణస్థులకు వలయు కూరగాయలు మున్నగునవి మడిసంతయందు దొరకుచుండెను. ఆమడిసంత యూరిమధ్య జరుగుచుండివి. మఱియు నిప్పటివలె యక్కాలమునగూడ కాపుటాండ్లు యింటిముంగిట గోమయపిండములు రచించుచుండిరి. ఇంతియేగాక నక్కాలమున చిత్రవస్తుప్రదర్శనశాలలుగూడ నోరుగల్లుపురమున నుండెడివి. యప్పటి "బాడ్మింటన్"నుబోలి యప్పటి స్త్రీలు కందుకత్రియముతో బంతులాట నాడుచుండిరి.[14]

---

11. "కరమున గుజ్జరి కడియముల్ మెరయ
ఘనమైనదేహంబు కాలిపెండేరము"
"పల్నాటివీర చరిత్రము"

12. "మురుగులు గొలుసులు ముంజేతులాదు
దిరముగా వ్రేళ్ళ ముద్రికలను బెట్టి
... .... .... .... ...
గండపెండేరంబు కాలికిదాల్చి" Ibid

13. "యింతులకు ప్రీతిగా మైలసంతలోన"
"క్రీడాభిరామము"

14. కాంచీనూపుర కంకణక్వణనముల్ గర్జింపబాలాజనం
... ... ... ... .... క్రీడించెదరుప్పాడుమూ
... ... ... ... కాంచనకందుక క్రియామూలతో Etc, Ibid

మఱియు కాలమానము దెల్పునట్టి ఘటికా యంత్రములు (గడియారములు) కూడ యక్కాలమున నిప్పటి కచ్చేరీలయందువలె రాజభవనముల నెలకొల్పబడియుండినవి. మఱి యొకవిశేషమేమన పరస్థలములనుండి వివిధ కార్యోద్యోగులై పట్టణములకు రాకపోకలఁ జరుపువారికి భోజనవసతులఁ గల్పింపఁగల పూటకూటియిండ్లుకూడ యుండినవి. ఈపూటకూటియిండ్లయం దొకరూకకే కప్పురభోగి వంటకములు చక్కని గోధుమపిండి వంటకము మున్నగువానితోఁ గూడిన కలమాన్నము వడ్డింపబడుచుండెను. విటసంగమార్థమై తత్పూర్వము ముకురవీక్షావిధానమును నొక కర్మము వేశ్యలొనరించుచుండిరి. వారి యత్యాచారము లడచుటకుగా జారధర్మాసనము నొక నియమమేర్పడియుండెను. మఱియు నిప్పటి దర్జీవారిఁబలె మోహరివాడల నుద్యోగముఁ జేయు కుట్టుపనివాండ్లు (Military outfitters and military tailors) కూడ యక్కాలమున నుండిరి. మఱియు నిప్పుడు సతు లింటిలోపల గోప్యముగా నొనర్చుకొను "ఊరీర్పుట" "పసుపునూరుట" మున్నగు కృత్యములు బజారునందే యుండఁ జూచునట్లుగా నక్కాలమున స్త్రీలుఁ జేయుచుండినట్లు గోవిందమంచనశర్మ ప్రశంసించియున్నాడు. ఈవిషయము లన్నియు క్రీడాభిరామము నుండి తెలియుచున్నవి.

10 ఇతర విషయములు:—వాద్యములు— తప్పెట్లు, కాలికొమ్ములు, బూరలు, డమాయీలు, శంఖము మున్నగు వాద్యసాధనములు వాడబడుచుండెను. సంగీతసాధనములు-వీణామృదంగము, తాళము సంగీతసాధనములై వెలసినవి. ఇప్పటిహార్మోనియమువలె సుతికినై ముఖవీణ అనుమఱి యొకసాధనము ప్రయోగింపఁబడుచుండెను. నేటికిని దత్తమండలములఁ గొన్ని పల్లెలయందీ ముఖవీణ వాడఁబడుచున్నది.

బాలురు బొంగరములాడుచుండిరి. ఇయ్యది రాజబాలుఁడగు బాలచంద్రుఁడుగూడ యాడుచుండుటచే మిక్కిలి ప్రాముఖ్యము వహించిన బాలక్రీడగా నుండియుండవలెను.[80] ఆకాలమున బంగారు కుదువబెట్టుట, ముఖశుద్ధి చేయకముందే ప్రొద్దుననే వీడెమువేయుట యాచారమై యుండియుండుట కాబోలు, బద్దెభూపాలుఁడు తన శతకరత్నమున నటుచేయుట పాడిగాదని నీతిపద్యముల వ్రాసెను.

---

# ప్రతాపరుద్ర ప్రశస్తి

---

శ్రీయుత మారేమండ రామారావుగారు, బి. ఏ. ఆనర్సు, బి. ఇడి.

క॥ ఆనంద వత్సరంబున, ఘనముగ తర్కాబ్ధిరుద్ర గణితంబై తా
నెసఁగు శక వర్షమందున, యనఘా! యల చైత్రశుద్ధ పంచమినాటన్॥

సీ॥ ముత్తాతగణపతి ముచ్చటల్ దీరంగ, రుద్రాంబ నోములు రూఢికెక్క
చాళుక్యమహాదేవు జన్మంబు దరియింప, ముమ్మడంబా సాధ్వి మోదమంద
శివదేవధీమణి చేయు నాశీర్వాద, ఫలమిదేయని జనుల్ బల్కునటుల
త్రైలింగసామ్రాజ్య ధౌరేయతాఖ్యాతి, దిఙ్నగాగ్రములందు దేజరిల్ల
ఘనతజనియించి చాళుక్య కాకతీయ, వంశములు రెండు దరియించి వాసికెక్కి
తీవు, చలమర్తిగండ! యోదివ్యతేజ! వినుతగుణభద్ర! కాకతి వీరరుద్ర!

సీ॥ కాంచీపురాధీశు సంచితసౌధాన, కదిలె నీదుపతాక గరిమమీర
కంపిలరాజ్యంబు గడియలోన జయించి, పాతినాడవు జయధ్వజము నచట
అటుకళింగము బాహుపటుదర్పమున జుట్టి, గండికోటను బట్ట గలిగినావు
అరుల నెందరినేని యనిలోన నిర్జించి, ప్రక్కలో వారికి బల్లెమయితి
ఇట్టి వీరప్రతాప కెవరుసాటి, పరమ మాహేశ్వరాచార! భవ్యచరిత!
మూరురాయరగండ! యో ముల్లోకవీర! వినుతగుణభద్ర! కాకతి వీరరుద్ర.

మ॥ నరసింహాంకుడును, విద్యానాథకవియు న్మారన్న, రుద్రుండు, భా
స్కరుడున్, దేశికు, డప్పయార్యుడొకడున్, శాకల్య మల్లన్న, ప
లుర్వరు సంగీత కవిత్వ వేత్తలలరన్ పూర్ణప్రభావంబునన్.
వరలెన్నీసభ నీవె శిష్టకవివై వర్ధిల్లితింతేటికిన్॥

ఉ॥ అన్నయమంత్రి, ముప్పిడి మహామహుడున్, శివదేవ కామయల్
గన్నయ గుండయల్, మఱి యుగంధరప్రాజ్ఞుడు మాచనాయుడున్
మన్ననలన్ మెలంగి దగ మంత్రముసేయగ రాజ్యమేలి ము
న్నెన్నడులేని వైభవము నేర్పడజేసితివయ్య భూవరా!

---

# ప్రతాపరుద్రునిపై మహమ్మదీయుల దండయాత్రలు.

శ్రీయుత గొర్తి వెంకటరావుగారు ఎం. ఏ. ఎల్. ఎల్. బి.

మహమ్మదీయులు దక్షిణాపథముపై దండెత్తినప్పుడు వింధ్యపర్వతముల దక్షిణమున నున్న హిందూదేశము నాలుగు ముఖ్యభాగములుగా విభజింప బడియుండెను. మహారాష్ట్ర మనబడు పశ్చిమభాగమును దేవగిరి ముఖ్యపట్టణముగా యాదవనాయకుడగు రామదేవుడను నామాంతరముగల రామచంద్రదేవుడు పరిపాలించుచుండెను. అతడు క్రీ. శ. 1271 మొదలు 1309-10 వరకును రాజ్యమేలెను. తూర్పుభాగమగు తెలింగానా ప్రాంతమును కాకతీయవంశీయుడైన ప్రతాపరుద్రుడేలుచుండెను. అతడోరంగల్లు రాజధానిగా జేసికొని క్రీ. శ. 1291 మొదలు 1323 వరకును పాలించెను. గోవానుండి పెన్నా యుత్తరభాగమున కొకగీత గీసినయెడల నాగీత యీ రెండు రాజ్యములకు దక్షిణపు కెల్లయై యుండును. ఈ గీతకు దక్షిణభాగమున హోయిసాల పాండ్యరాజ్యములు ప్రబలియుండెడివి. ద్వారసముద్రము, మధురయును క్రమముగా నీరెండు రాజ్యములకును ముఖ్యపట్టణములు. ఆకాలమున హోయిసాల రాజ్యమునకురాజు మూడవ వీరబల్లాలుడు. అతడు క్రీ.శ. 1291 మొదలు 1342 వరకును పరిపాలించెను. క్రీ. శ. 1268 మొదలు 1311 వరకును పాండ్యరాజ్యము నేలినవాడు మొదట మారవ వర్మ కులశేఖరుడు. పైనిచెప్పిన రాజులుగాక వారికి లోబడియున్న సామంతనాయకులు మఱికొందఱుండిరి.

ఈరాజ్యములన్నియు నార్థికముగ మిక్కిలి యుచ్చదశలోనుండినవి. రాజులును వారిప్రజలును మిక్కిలి ధనాఢ్యులై యుండిరి. రాజుల ధనాగారము లన్నియు భర్మమణిపూర్ణములై యుండెను. వ్యవసాయము, వర్తకము, విద్య, కళ లివియన్నియు చాల యభివృద్ధిలోనుండెను. రాజధానులు వర్తకమునకును నాగరికతకును నిలయములై యుండెడివి

కానిదురదృష్టవశము వలన కాదాచిత్కములగు రాజకీయాందోళనములచేతను, ఘోరయుద్ధములచేతను, నీసమిష్టిభావము చెదరిపోవుచుండెడిది. కాకతీయులు యాదవులతోడను తరతరములనుండి దీక్షతో పోరాడుచుండిరి. ఈవైరములు చాలపాతుకొని పోయివిదేశీయులు దండెత్తి వచ్చినప్పుడు నైతము మఱువరాని వయ్యెను. ఇట్లొకరి నాశనమున కొకరు కారకులై తుదకందఱును యవనసేనా వాహినిచే నూడ్చుకొనిపోబడిరి.

ఎట్లయినను దక్షిణహిందూదేశ చరిత్రలో శూరత్వమునకును ధార్మికత్వమునకును గాకతీయులు సుప్రసిద్ధులు. వారిలో రెండవ ప్రతాపరుద్రునినామ మున్నతస్థానము నాక్రమించును. దాక్షిణాత్యభూపతులలో నాతడొక మహనీయమూర్తి. మహమ్మదీయుల భయంకరధాటినుండి తనరాజ్యమును కాపాడుకొనుటకితడు మహాత్యాగమును గావించినాడు. ఇస్లాము మతస్థులదాటి కొక్కరొక్కరుగా రాజులందఱు దలలు వంచిరి. కాని ప్రతాపరుద్రుడే కాక

యయ్యు నిరువది యేండ్లు పోరాటము గావించె ను. తుదకు రాజ్యము, స్వాతంత్ర్యము, ప్రాణము లనుగూడ కోల్పోయెను. కాని యాతనిత్యాగము ధైర్యము నాతని నామమునకు దక్షిణ హిందూదేశచరిత్రమున జిరస్థాయిత్వము గల్పించినవి. ప్రవర్తనయందును ప్రజ్ఞయందు నీతని నారవవిక్రమాదిత్యునితోడను, మొదటి కులోత్తుంగునితోడను సరి చేయవచ్చును. కాని యాతని కీర్తి నజరామరముగావించుటకు బిలహణునుగాని జయమగొండారుగాని లేకపోయెను. అతని సంగరములను గూర్చి మనకేమి తెలియవచ్చినను తురకల వ్రాతలనుండియే. ఆరోజులలో నేదియైనను మతముతెరువాతనే అగుటయు మహమ్మదీయచరిత్రకారులు తమ పోషకులగొప్పకై యదార్థమును మరుగుపరచుటకు వెరువరైరి. అందుచేత ప్రతాపరుద్రుని యుద్ధములను గూర్చిమనకు యథార్థచరిత్రములభించుట దుర్లభమగుచున్నది. కనుక నీవాక్షికములైన గాథలనుండియే మనము సాధ్యమైనంతవరకు చరిత్రమును గ్రహింపవలసి యున్నది.

దాక్షిణాత్యభూపతు లందఱిలోను కాకతీయులు విదేశీయుల దండయాత్రలవలని యపాయములను మిక్కిలి విస్పష్టముగ గ్రహించినట్లు తోచుచున్నది. పదుమూడవ శతాబ్ద మధ్యమున కాకతీయగణపతి తనరాజధానిన రక్షించుటకయి యొకపాషాణ, ప్రాకారమును నిర్మింప నారంభించెను. అతనికుమార్తెయగు రుద్రమదేవి దానిని పూర్తిచేయుటయే గాక దానిచుట్టును మృణ్మయప్రాకారము నొకదానిని కట్టించెను. శిలాకుడ్యముయొక్క పరిధి 4 మైళ్ళు 630 గజములు. మృణ్మయకుడ్యముచే నావరింపబడిన స్థలమై శాల్యముయొక్క వ్యాసముపొడవు రెండుమైళ్ళు. "దాని యన్నిప్రక్కల యందును రెండుమైళ్ళ దూరమువరకు సౌఖ్యపిపాసువుల తృప్తిపరచుటకై చెలమలును ఆరామములును గలవు. అందు మామిడిపండ్లు, అరటిపండ్లు, పనసపండ్లును పండెడివి. హైందవ సౌందర్యమునకు తార్కాణములగు చంప, కుంద, కేతకీ సుమము లచ్చట మెండుగా నుండెడివి."[1] అని అమీరు ఖుస్రో వ్రాసియుండుటచే రుద్రమదేవి మనుమడగు రెండవ ప్రతాపరుద్రుడు మఱికొన్ని యితరసౌకర్యములను గల్పించినట్లు కన్పించుచున్నది. దుర్గముయొక్క బలమును వర్ణించుచు నతడు మఱియొకగ్రంథమున నిట్లు వ్రాయుచున్నాడు. "ఒరంగలు చుట్టునుగల కుడ్యము మృణ్మయమయ్యు నుక్కుబల్లెములు గూడ చొరజాలనంత దిట్టముగా నుండెను. పాశ్చాత్య యంత్రసాహాయ్యమువలన రాతిగుండ్లు త్రోయబడినచో నవి బాలకులాడుకొను బంతులవలె వెనుదిరిగివచ్చును."[2]

నిపుణురాలగు తనమాతామహి జీవితకాలముననే రెండవప్రతాపరుద్రుడు రాజ్యమునకు వచ్చెను. ఆమె క్రీ. శ. 1981వ సంవత్సరమున రాజ్యము నాతనికి వశపరచినట్లు తెలియుచున్నది. ఆమెశాంతి సంరక్షణమునందును యుద్ధవిధానము నందును అసామాన్య ప్రతిభగల వీరవనిత. సుశిక్షణమును, సహవాసమును. మనుజనిశీలమును బాగుపరచు స్వభావము గలిగినవియగుట నిజమేయగునెడల నామె శిక్షణము మూలముననే ప్రతాపరుద్రుడు

1 Amir Khusru: Nub Sipihr (Elliot, III, P. 559)
2 [illegible] Tarikh-i-Alai (Elliot, III, P. 80)

మంచియోధుడును రాజనీతికోవిదుడు నయ్యెనని మన మొప్పుకొనవచ్చును. ఇట్లతడొక విశాలరాజ్యమునకును, అమూల్య కోశాగారమునకును అధిపతియయ్యెను. విప్లవములుగాని, బంధువుల కుట్రలుగాని, పరదేశీయుల యుద్ధములుగాని యాతడు సింహాసనము నధిష్ఠించినకాలమున దేశశాంతికి భంగకరములుగాలేదు. సర్వమును పురోవృద్ధిసూచకమై యుండెను. 10 సంవత్సరములపాటతడు నిర్విఘ్నముగ రాజ్యపాలన విధానమును చక్కబెట్టుటయందును, ప్రజలసౌఖ్యము నభివృద్ధిపరచుటయందును తనకాలమును గడపుటకు వీలుకలిగెను. తరువాత తురుష్కులాతని దేశముపై దండెత్తివచ్చుటచే నతడు తన పరిశిష్టరాజ్యకాలమును దేశమతసంరక్షణార్థమె వినియోగింపవలసివచ్చెను.

క్రీ. శ. 1303 వ వత్సరములో గాకతీయసామ్రాజ్యము అలావుద్దీను ఖిల్జీదండయాత్రకు గురియయ్యెను. యువరాజుగానున్న కాలమున నాతడు దక్షిణాపథముపై దండెత్తి రామదేవుని యొద్దనుండి వెండి, బంగారు, మణులరూపమున నింతింతనరాని ధనమును, ఎలిచిపురమునుండి వచ్చు శిస్తునిచ్చుటకు వాగ్దానమును, గ్రహింపగలిగెను. ఆతడీధనమంతయు పినతండ్రినిచంపి ఢిల్లీరాజ్యమును సంపాదించుటకొరకు వినియోగించెను. ఆతని రాజ్యమునందలి క్లిష్టపరిస్థితులెల్లప్పుడు, నతనికి ధనావశ్యకతను గల్పించుచుండెడివి. దేవగిరిపై మరలదండెత్తుటచే నతని కేవిధమయిన లాభమును లేకుండెను. అందుచే ధనరాసులను వశపరచుకొనుటకై ఫకూరుద్దీన్ జూనా, మలిక్, ఛజ్జూల నాయకత్వముక్రింద, ప్రతాపరుద్రుని పాలనలోనున్న కాకతీయ సామ్రాజ్యమును ముట్టడించుటకై గొప్పసైన్యమును బంపెను. ఈసైన్యములు పూర్వమార్గమునగల బెంగాలు, ఒరిస్సా, రాజ్యముల గుండ పోవలసినచ్చెను. ఈసైన్యచలనము యొక్క సంపూర్ణచరిత్ర మెచ్చటను వ్రాయబడి యుండలేదు. కాని యీదండయాత్ర ఫలితము పరాజయమేయని చెప్పుటకు మాత్రము సందియము లేదు. ఈపరాజయమునకు కారణములు వివరించుచు బరానీయిట్లు వ్రాయుచున్నాడు. "వారచ్చటికి జేరినంతనే వర్షఋతు వారంభించుటచే సైనికు లేమియును చేయజాలరైరి. అందుచే శిశిరారంభమునందే మిక్కిలినష్టమును పొంది వారు హిందూస్థానమునకు దిరిగి పోవలసివచ్చెను." కాని యతడు సంపూర్ణసత్యమును చెప్పినట్లు తోచదు. ఏలనన తురుష్కుల పరాజయమునకు నోరంగలుదుర్గ ప్రాబల్యమును, కాకతీయ సార్వభౌముని యమేయప్రయత్నమునుగూడ కారణములై యుండినను యుండవచ్చును.

కాని యీదాడి ముందుజరుగబోవు తురుష్కదండయాత్రానాటకమునకు నాందివంటిది. అల్లావుద్దీను మొదట దక్షిణమునకు దాడివెడలి నప్పటినుండియు దక్షిణాపథద్వారములెన్నడును మూయబడియుండలేదు. ఆంతరములైన తిరుగుబాట్లును, బాహిరములైన దండయాత్రలును అతని ధనాగారమును శూన్యముగావించినవి. అందుచే నతడు కోశాగారమును పునఃపూరితముగావింప వలసివచ్చెను. రాజభక్తిపథమునుండి తొలగువారిపై జరిమానాల రూపమునను, వారి యాస్తి సంక్రమణరూపమునను విశేషధనము సమార్జింపబడెను. రామదేవుడు ఎలిచి పురపుభూములమీది శిస్తును పంపకుండుట తిరుగుబాటుగా పరిగణింపబడె

ను. అందుచే నతనిని శిక్షించి యాతని ధనాగారముల వశపరచుకొనుటకై క్రీ. శ. 1307 వ సంవత్సరమున మల్లిక్ కాఫరు పంపబడెను. కాఫరు దేవగిరి పట్టణమును సమీపించి దాని పరిసరప్రాంతములను నిధనోన్ముఖముల గావించెను. అతడు హిందువులను జయించి, విశేషధనమును లోబరచుకొని రామదేవుని ఢిల్లీకి ఖైదీగా దీసికొనిపోయెను. సుల్తానాతని నిక్షమించి సామంతరాజుగానుండి యాతని రాజ్యమునేలుకొనుటకై గౌరవపురస్సరముగ మరల బంపివేసెను. ఇట్టి సమాదరణముచే సుల్తాను యెడ రామదేవుడు యకుంఠిత రాజభక్తిని వహించెను. రామదేవుడప్పటి నుండియు మహమ్మదీయులు తన సోదర భూపాలురపై దండెత్తి వచ్చినప్పుడుసైతము వారికి తోడ్పడుటకు సంకోచపడలేదు.

మహమ్మదీయ దండయాత్రల యపాభారము ననుభవించిన తరువాతిరాజు ప్రతాపరుద్రుడు. అల్లావుద్దీను కాకతీయసామ్రాజ్యములోని ధనాగారములన్నిటిని దోచుకొనుటకై క్రీ. శ. 1309వ సంవత్సరమున రెండవ మారు ప్రయత్నించెను. మల్లిక్ కాఫ రొరంగలు మీదికి దండెత్తి పోవునప్పుడల్లావుద్దీ నాతనికి గఱపిన యుపదేశము లాతని ముఖ్యోద్దేశము ధనార్జనమేకాని గాజ్యసంక్రమణము కాదని వ్యక్తీకరించుచున్నవి. అతడు కాఫరునకీక్రింది విధమున నుపదేశించెను.[3] "రాజు ధనకనకవస్తువాహనములనొసంగుటకును, మరుసటిసంవత్సరము కప్పముగట్టుటకు, నొప్పుకొనినయెడల నాత డేవిధముగను నిర్బంధింపబడరాదు. పరిస్థితులను విషమములనుగా నొనరించక యాతనితో నేదో యొకవిధమున సంధి కుదుర్చుకొనుట......లాభకరము. ఒకవేళ నాతడట్లొనరింపలేకున్నచో రాజును ఢిల్లీకి దోడ్కొనివచ్చి తనపేరు నిలబెట్టుకొనవలయును.[4] కాఫరును, ఖ్వాజాహాజియును పెద్దసేనతో ఢిల్లీని విడచి యడవులనుదాటి రామదేవుని చల్లనిరాజ్యమును ప్రవేశించిరి. రామదేవుడు సుల్తానునకును నాయకులకును ఉపాయనములను పంపి వారికి స్వాగతమొసంగెను. తురుష్కసేనలు రాజ్యములోనుండి పోవుచున్నప్పుడాత డోరంగల్లు పరిసరములనున్న గ్రామములకు దనసేవకులను బంపి, తురుష్కసేనల కేవిధమగు లోటును జరుగకుండ జేయించెను. కాఫరునకు సహాయము చేయుటకై కొంత మరాఠీదండును కొన్ని మరాఠీగుఱ్ఱములను వారికి సమకూర్చి, తాను కొంతదూరమువరకును వారిని సాగనంపెను. ఇట్లెల్లయెడల రామదేవుని సహాయము నందుచు తురుష్కసేనలు కాకతీయులకుచెందిన సర్బరు (శ్రీపురము) కోటను సమీపించి తక్షణమే కోటను ముట్టడించినవి. మహమ్మదీయులాగ్నేయాంబకముల నుపయోగించుటచే కోటలోని కొన్నిగృహములకు నిప్పంటుకొనెను చాలమంది ప్రజ లాయగ్నిజ్వాలలలో బడి దగ్ధులైరి మిగిలినవారు క్రూరులగు తురుష్కులచే ఖండింపబడిరి ఈకోట ముట్టడి యయిపోయినతరువాత మల్లిక్ కాఫ రచటినుండి సాగి ఓరుగల్లుపట్టణమును సమీపించెను. అనుమకొండనుండి చూచినయెడల నోరంగల్లులోని దివ్యభవనములును ఆరామములును స్పష్టముగా దృగ్గోచరములగును.

3 తురుష్క గ్రంథకర్తలు ప్రతాపరుద్రదేవుని 'లద్దరుదేవ' అని వ్రాసిరి.

4 Barani—Tarikh-i-Firoz-Shahi (Elliot, III, P. 21

గాన నచ్చుటికి మల్లిక్ కాఫ రిద్దరు సేనాధికారులను గుఱ్ఱపువిలుకాండ్రతో నంపెను. తాను కాకతీయులకు రాజధానియగు నోరంగల్లును ముట్టడించుటకై బయలుదేరెను.

ప్రతాపరుద్రుడును నిర్వ్యాపారుడై యుండలేదు. ఇరుగుపొరుగురాజులు తనకు సహాయముచేయుదురన్న యాశ యాతనికి లేనే లేదు. యెందుచేతనన రామదేవుడు పూర్తిగా మహమ్మదీయ పక్షమునవలంబిచెను. మిగిలిన దాక్షిణాత్య భూపతు లతనియెడల నంతప్రత్యయము గలవారుకారు. పరిస్థితులిట్లున్నను మహమ్మదీయసేనల యసంఖ్యాకతచే ధైర్యమును గోల్పోక కోటనుముట్టడించు తురుష్కసైనికులపై బడుట కొకనాటి రాత్రి యేర్పరచుకొనెను. వినాయకదేవుడు 3000 గుఱ్ఱములతో గోటవెలువడివచ్చెను. కాని మహమ్మదీయులు మిక్కిలి జాగరూకతతో నుండుటచే నాతడు వారికేవిధమైన హానియును చేయజాలకపోయెను. పైగా తానే గొప్పనష్టమును భరింప వలసిన వాడాయెను. మల్లిక్ కాఫరు మిక్కిలి పట్టుదలతో దనప్రయత్నముల సాగించుచు చివరకు మృణ్మయకుడ్యముపై నన్నివైపులనుండియు పాశ్చాత్య పాషాణఖండములను విసరుట కాజ్ఞయొసంగెను. తురుష్కశిలాఖండములు బలవత్తరములైన రజ్జువుల సాహాయ్యముచే మిక్కిలి యెత్తుగాత్రోయబడుచుండెను. హైందవుల శిలాఖండములు యజ్ఞోపవీతక్షిప్తములువోలె మిక్కిలి నెమ్మదిగా బోవుచుండినవి.[5] చివరకు కుడ్యమున ననేక రంధ్రములుచేయబడెను. కొలదికాలములో, నే తురుష్కులు బహిఃప్రాకారమునంతయు నాక్రమింపగలిగిరి. తరువాత వారికి శిలానిర్మితమును, పరిఖాప్రావృతమునగు నంతర్దుర్గముదృష్టిగోచరమయ్యెను. ఆయగడ్త జేరినంతనే వైరిసేనలు దానిని తరించి, శిలాకుడ్యమున నొకభాగమును పట్టుదలతో ముట్టడింప నారంభించినవి. ఇది ప్రతాపరుద్రునికదుర్భరముగకన్పించెను. శతృవులను తరిమివేయుటయుం దతనికి గలయాశ పటాపంచములయిపోయెను. అతనికి తన దుర్గముయొక్క యసాధ్యత్వమునం దపార ప్రత్యయముకలదు. కాని బలవత్తరములైన మహమ్మదీయుల ముందవి యాగలేకపోయెను. ఇంకను ఆలస్యమొనరించిన యెడల తన దేశమునకే నాశనము ప్రాప్తించునను భయముచే దానులోబడి కప్పము కట్టుటకంగీకరించుచు మల్లిక్కాఫరుకడ కొకదూతను పంపెను. ఆశాపనద్ధబుద్ధియగు తురుష్కసేనాపతి సంధి వెలగా నితనిరాజ్యములోని ధనము నంతయు నిమ్మనియడిగెను. పైగా "నతడేమైనదనకొరకొ నిల్వయుంచుకొన్నట్లు గనబడినచో ఘోరహత్యలు ప్రారంభింపబడునని బెదరించెను."[6] ప్రతాపరుద్రుడీ కఠినసిబంధనముల కన్నిటికి నొప్పుకొని 300 ఏనుగులను, 7000 గుఱ్ఱములను ధనాభరణరాసులను అతనికి వశపరచెను. మఱియునతడుప్రతిసంవత్సరమునుతనధనములో గొంతభాగమును, కొన్ని యేనుగులను, ఢిల్లీకి పంపుటకు వాగ్దానముచేసెను. క్రీ. శ. 1310 వ సంవత్సరములో కాఫరు విశేషధనముతో[7]

---

5 Amir Khusru—Tarikh-i-Alai (Elliot, III P. 81)

6 Ibid P. 84.

7 Ibid, Page 92 బరానీప్రకారము 612 ఏనుగులు, 96000 మణుగుల బంగారము, అనేకాభరణ పేటికలు, మణులు, 20000 గుర్రములు

నోరంగల్లును విడచి దేవగిరి రాజ్యములోని నగరముల గుండప్రయాణముచేయుచు ఢిల్లీని చేరెను.

కోయిలొలుగను తమిళగ్రంథము ప్రతాపరుద్రుని పరాజయము గూర్చియు, నతనికోశాగారముల యాక్రమణమును గూర్చియుఁ మహమ్మదీయ చరిత్రకారులు వ్రాసిన వ్రాతలను బలపరచుచున్నది.[8] ఈదండయాత్రలోవిజయము నొందుటకు ఢిల్లీసేనలలోగలిగినజననష్టమునుగూర్చిగాని, వస్తునష్టమునుగూర్చిగాని, మహమ్మదీయ చరిత్ర కారు లేమియును వ్రాసియుండలేదు. కాని "రాజు తనసర్వస్వమును శాకభుసిజంతుసముదాయములతో గూడ సుల్తానునకు వశపరచవలెను"[9] అని మల్లిక్ కాఫరు పరాజితులపై బ్రయోగించిన విషమ నిబంధనముల బట్టి సుల్తాను సేనలలోగూడ గొప్ప నష్టము సంభవించి యుండవచ్చునని యూహింపవచ్చును. ప్రతాపరుద్రుడు కాలవైషమ్యముచే బ్రస్తుతము మహమ్మదీయులకు లోబడియుండుట కొప్పుకొనినను, వారియధికారమును తొలంగిచుటకయి తగినసమయమును ప్రతీక్షించుచుండకపోలేదు.

జయములు లభించినకొలదిని అల్లావుద్దీను ధనతృష్ణ మితిమీరిపోయెను. తరువాత రెండు సంవత్సరములపా టాతనిసేనలు దక్షిణదేశసౌభాగ్యమును కొల్లగొట్టుటకై నియోగింపబడెను. మధురాద్వారసముద్రాది పాలకులు పరాజితులైరి. వారు తరతరముల నుండి కూడబెట్టినయమే యసంపదలు తురుష్కవశములైపోయెను. చిదంబరము శ్రీరంగము మధుర మొదలగు పట్టణముల యందలి సుప్రసిద్ధ దేవాలయములు కొల్లగొట్టబడెను. అందలివిగ్రహములు అడవుల పాలాయెను. విజయశీలములగు తురుష్కవాహినులు 512 ఏనుగులను 5000 అశ్వములను 500 మణుగుల యాభరణములును తమతోగూడ దెచుచ్చు క్రీ. శ. 1311 వ ప్రాంతమున ఢిల్లీజేరెను.

ఇట్లు వింధ్యకు దక్షిణముననున్న హిందూ దేశమంతయు గొల్లగొట్టబడి మహమ్మదీయులకు లొంగిపోయెను. మహమ్మదీయాధికారముపై తిరుగబడుట కెవ్వరును సాహసింపలేదు. రామదేవుని తరువాత రాజ్యమునకు వచ్చిన శంకరుడు క్రీ. శ. 1312 వ సంవత్సర ప్రాంతమున గొంతవరకు తిరుగుబాటుఁచూపించెను. అందుచేత తక్షణమే మాలిక్ కాఫరు డేగవలె యాతనిపై కిలంఘించి యతనిని చంపుటయేగాక,యల్లావుద్దీను దక్షిణరాజనీతికి వ్యతిరిక్తముగ నాతని రాజ్యమును ఢిల్లీకి కలుపుకొనెను.

కాని యల్లాఉద్దీను క్షీణించుచున్న యారోగ్యమును, మల్లిక్ కాఫరు యొక్క కుట్రలును ప్రభుత్వాధికారము సరిగా సాగుట కాటంకమును గలుగజేసెను. సామంతరాజులు స్వాతంత్ర్యము సంపాదించుకొను నుద్దేశ్యముతో తమబలములను గూడబెట్టుకొనసాగిరి. క్రీ. శ. 1315 లో నల్లావుద్దీను దివంగతుడగుటచే రాజ్యమునందెల్లయెడల నల్లరులు బయలుదేరినవి. గుజరాతు బహిరంగముగా తిరుగబడెను. రామదేవుని జామాతయగు హరపాలదేవుడు మహమ్మదీయరక్షణసేనను దేవగిరినుండి వెడలగొట్టెను. ఇంతవరకును స్వాతంత్ర్యము నవలంబించుటకయి సమయమును నిరీక్షించుచున్న

8 K. V. S, Iyer: Historical Skches of Ancient Deccan Page 301
9 Amir Khusru—Tarikh-i-Alai (Elliot, III Page 84)

ప్రతాపరుద్రుడు ఢిల్లీకి కప్పమును పంపుట విరమించి, తనరాజ్యమును దక్షిణమున తిరుచునాపల్లి కాంచీనగరముల వరకును వ్యాపింపజేసెను. ఢిల్లీ పరమక్షోభమునబడి మ్రగ్గుచుండెను. కాఫరు రాజ్యమునందలి యధికారమునంతయు స్వహస్తగతముజేసికొని సింహాసనమునకు వారసులైన వారినందఱినికండ్లుపొడిచిగాని, కారాగృహములోనుంచిగానిబాధించెను.

అయినను హిందువుల జయములు చిరకాలము సాగలేదు. 35 రోజులు పాలించిన తరువాత కాఫరు నిజానుచరులచేతనే నిహతుడయ్యెను. తరువాత నల్లావుద్దీను కుమారులలో నొకడు 'ముబారక్‌షా' యను బిరుదముతో ఢిల్లీసార్వభౌమపదవికి నభిషిక్తుడాయెను. ఇతడు తన రాజ్యారంభదినములలో దక్షిణహిందూదేశముయొక్క పునర్విజయమున కారంభించి తనతండ్రివలె మేదురమగు శక్తిమత్తను ప్రదర్శించెను. క్రీ. శ. 1817 వ సంవత్సరమున నాతడు గుజరాతునందలి తిరుగుబాటు నడచివైచెను. దేవగిరి రాజగు హరపాలదేవు నోడించి సజీవుడైయుండగనే యతని చర్మము నొలిపించెను. తరువాత ప్రతాపరుద్రునిపై కసితీర్చుకొనుటకు తన కిష్టుడగు మల్లిక్ ఖుస్రు నాయకత్వముక్రింద నొక గొప్ప సైన్యమును పంపెను.

ప్రతాపరుద్రుడును తదితర దాక్షిణాత్య భూపతులును పూర్వాలబ్ధములచే నెట్టి నీతిపాఠమును గ్రహించినవారుకారు. ఏలనన నల్లావుద్దీను మొదట దండెత్తివచ్చినసమయమునందువలెనే వారు ఇప్పుడుగూడ వేఱువేఱుగనైకమత్య విహీనులైయుండిరి. కాని కాకతీయ సార్వభౌముడగు ప్రతాపరుద్రుని విషయమై యతడు విశేషమైన పోరాటములేకుండ శత్రువులకు లోబడలేదనిమాత్రము చెప్పవలసియున్నది. అమీరుఖుస్రూ వ్రాతప్రకారము హైందవాశ్వికులు 10 వేలకు నెక్కుడుగను, వారి పదాతిగుణము ల సంఖ్యేయములుగను ఉండెను. మహమ్మదీయులందరును కలసి 300 లో లేక యంతకు తక్కువగనో యుండిరి. అయినను మహమ్మదీయులు హిందువులను సంపూర్ణముగ పరాజితుల నొనర్చుట యేగాక వారిని దుర్గద్వారమువరకును తరిమివేయగలిగిరని చెప్పబడియున్నది.[10] కాని యిచ్చట నమీరుఖుస్రూ తురుష్కయోధుల ప్రతిభను సర్వతోముఖము గావించునుద్దేశముతో బుద్ధిపూర్వకముగ వారి సేనాసంఖ్యను స్వల్పీకృతము గావించినట్లు కన్పించుచున్నది. ప్రతాపరుద్రుని సేనానాయకులును యుద్ధభటులును అతిస్వల్పసంఖ్యాకులగు మహమ్మదీయ సైనికులుమాత్రమే తరిమివేయగలిగినంత బలహీనులుగను, పిరికిపందలుగను ఉండిరని విశ్వసించుటకు వీలులేకున్నది. అయినను మిగిలినదండయాత్రా క్రమమంతయు మల్లిక్ కాఫరు దాడివెడలినప్పటివలెనే యుండి యట్టి ఫలితములతోనే ముగిసెను. చుట్టునున్న మృణ్మయప్రాకారమును, లోపలనున్న శిలాకుడ్యమును ముట్టడింపబడినతరువాత రాజునకు వినాశము రానున్నదని స్పష్టముగా గోచరించెను. ఇంక శత్రువుల నెదిరించుట సర్వథా నిష్ఫలమని యాతనికి నమ్మకముపుట్టెను. అందుచే నతడు సంధినంరభమును చేయమొదలిడి తన సర్వసంపదను 100 ఏనుగులులు, 12000 అశ్వములను సంధికి వెలగానిచ్చుట కంగీకరించెను. ప్రతాపరుద్రుడు తనకియ్యకుండ నేదియు

10 Amir Khusru—Nub Sipihr (Elliot, III Page 560)

స్వప్రయోజనమునకై దాచుకొనలేదని ప్రత్యయముగల్గినప్పుడు తురుష్కసేనాని యతని యొద్దనుండి ప్రతిసంవత్సరమును కప్పముగట్టుట కొకలిఖితమైన యొడంబడికగైకొని ఒరంగలునుండి నిర్గమించగా ప్రతాపరుద్రునికి భయముపోయి ఊరకొనెను.

కాకతీయ భూపతిని లోబరచుకొనినతరువాత సమీరుఖుస్రూ మాబారుపై దండెత్తి దాక్షిణాత్యభూపతు లందఱిపైనను ఢిల్లీసార్వభౌముని యధికారమును పునఃప్రతిష్ఠితము గావించెను.

కాని ఖుస్రూకు దక్షిణదిగ్విజయముతో సంతృప్తిగలుగలేదు. అతడు మల్లిక్‌కాఫరువలెనే తన జయముల నన్నిటిని ఢిల్లీసింహాసనోపగమనమునకు సోపానమార్గములుగా దలపోసెను. తగినసమయమునుజూచి తన ప్రభువును వధించి 'నాసిరుద్దీను సుల్తానన్'ను బిరుదముతో తానే సార్వభౌముడనని ప్రకటింపజేసెను. కాని అతని పరిపాలనావిధానము మహమ్మదీయులకు దుస్సహాముగా నుండుటచే నతడు రాజ్యము నాక్రమించిన మూడునెలలలోనే పంజాబీయుడగు 'ఘాజీ' తుగ్లకతని నోడించి గయాసుద్దీను తుగ్లకను నామముక్రింద తానే సుల్తానాయెను. (1320)

ఢిల్లీలోని యీవిప్లవము లన్నియు సుల్తానునకు కప్పముగట్టుట మానివేసి, స్వాతంత్ర్యావలంబన ప్రయత్నముల నొనరించుటకయి ప్రతాపరుద్రునికి రెండవ యవకాశమును గలుగజేసినవి. అతడు తన కోటను బలపరచుకొని హైందవరక్షణ సేనలను నియమించి సర్వమునకును సంసిద్ధుడై వేచియుండెను. ఢిల్లీసుల్తానులు తన రాజ్యమునుండి కప్పమునుగైకొనక మానరనియు, నెట్టి పరిస్థితులలోనైనను దాని నములులోపెట్టుటకు ప్రయత్నించితీరుదురనియు నతడు పూర్వానుభవములవలన నెఱిగియుండెను. మొసటి తుగ్లకురాజు ఉల్లావుద్దీనువలె మిగుల శక్తిసంపన్నులును, దక్షిణదేశవిషయమైన వ్యాపారములలో నతనికంటె నెక్కుడు దురాశాపూరితులు. "తనకు గావలసిన సువర్ణముకొఱకయి దక్షిణాపథమును పాలిచ్చెడు యావును (Milch cow) వలె నుపయోగించుటతో" నల్లావుద్దీను సంతుష్టిపడెను. కాని తుగ్లకు దక్షిణాపథమునందలి సువర్ణమును, రాజ్యములను గూడ సంపాదింప నిచ్ఛించెను. అందుచే హిందూరాజులెవరైన స్వాతంత్ర్యము నవలంబించినచో వారొకనిమిషమేనియు నోర్వలేకపోయిరి.

క్రీ. శ. 1321 వ సంవత్సరమున గయాజుద్దీనుతుగ్లకు కాకతీయ భూపతిని శిక్షించుటకయి ఉలుగ్‌ఖానను బిరుదుగలిగిన ఫకూరుద్దీను జూనా యను తనకుమారుని ఓరుగల్లుపంపెను. అతడు తనవంశమునకును తన పూర్వుల వంశమునకు చెందిన చాలమంది భూస్వాములను, ఉద్యోగస్థులను, నతనితోగూడ గొంపోయెను. యువరాజు మహావైభవముతో బయలుదేరి దేవగిరి జేరుసరికి అచ్చటి యధికారులును సేనలును అతనిని కలసికొనిరి. ఒరంగల్లు యథాపూర్వముగ ముట్టడింపబడెను. శత్రువులుపైబడినప్పు డచ్చటి హిందువులు వారిని మిక్కిలి పట్టుదలతో నడ్డగించిరి. ప్రతిదినమును రెండు పక్షముల వారికిని తీవ్రయుద్ధములు జరుగుచుండినవి. కోటనుండి యగ్నిసమాక్షిప్తమై యుభయసేనలలో చాలమందిని దగ్ధులనొనరించెను. కాని కాలము గడచినకొలదిని మహమ్మదీయులు హిందువులకంటె నెక్కుడు ప్రాబల్యమును సంపాదింప దొడగిరి. అందుచే ప్ర



రామప్పదేవాలయాంతర్భాగము

By Courtesy of H. E H. The Nizam's Archaeological Department.



రామప్ప దేవాలయము—గర్భాలయ ద్వారము

By Courtesy of H. E. H. The Nizam's Archaeological Department.

తాపరుద్రు "దమూల్యములగు నాభరణములను, ఏనుగులను, ధనరాసులను ఇచ్చుటకను మతించి అల్లావుద్దీను రాజ్యకాలమున మల్లిక్ కాఫరువలె నీవుగూడ కప్పమును గ్రహించి తిరిగిపొమ్మని యువరాజు నభ్యర్థించెను"[11] కాని జూనా యీప్రార్థనమును సగర్వముగ తిరస్కరించి కోటను వశపరచుకొని, రాజునుఖైదీగాపట్టుకొనుటకై నిశ్చయముచేసికొనెను.

ఇంతలో ఢిల్లీకిని, ఓరుగల్లు సమీపముననున్న తురుష్క శిబిరమునకును మధ్య నుత్తరప్రత్యుత్తరము లరికట్టబడెను. ఇదిగాక సుల్తాను మరణించెననియు, ఢిల్లీసింహాసనము వేరొకనిచే నాక్రమింపబడెననియు నొకకింవదంతి బయలుదేరెను వైరిసైనికులలో నల్లకల్లోలముగల్గించుటకై ప్రతాపరుద్రుని యనుచరులచేతనే యిట్టిది కల్పింపబడియుండవచ్చును.

జూనా యల్లావుద్దీను కాలమునాటి భూస్వాములననుమానముతో జూచుచుండుటచే వారిని కారాగారనిబద్ధులజేసి చంపయత్నించుచుండెనని దుర్మార్గులు కొందఱు మఱియొక మిథ్యావృత్తమును వ్యాపింపజేసిరి. అందుచే తురుష్కసేనాసమూహములలో నొకపెద్దయలజడి కలిగెను. భూస్వాము లొకరితరువాతనొకరు జూనాను విడిచి పోవనారంభించిరి. గాన ఒరంగల్లుముట్టడి వదలుకొని దేవగిరిచేరుటదప్ప రెండవమార్గము లేకపోయెను. అప్పుడు హిందువులు కోటవెలుపలికివచ్చి వెనుదిరిగి పోవుచున్న మహమ్మదీయ సైన్యములను వెంబడించి యసంఖ్యాకములగు నాయుధములను, యోధులను, తురంగములను పట్టుకొనిరి. పరాజయము విజయముగ్గా మారిపోయెను. ప్రతాపరుద్రుడు పోరాటమునుండి పూర్ణవిజయముతో బహిర్గమించెను.

ఈపరాజయము సుల్తాను హృదయమును దహించివేయుచుండెను. అందుచే నతడు క్రీ. శ. 1323 లో నోరంగల్లును వశపరచుకొనుటకై జూనానాయకత్వముక్రింద బలవత్తరములైన భటసమూహములను రెండుమార్లు సంప్రేషించెను. అచిరకాలముక్రిందటనే పరాజితులైన మహమ్మదీయులు మరల నింతత్వరలో దిరిగి వచ్చెదరని ప్రతాపరుద్రుడెన్నడును తలంచలేదు. మేలైన యాయుధసంభారముగల వారగుటచే మహమ్మదీయులు బహిరంతఃకుడ్యములను సునాయాసముగా వశపరచుకొనగలిగిరి. ప్రతాపరుద్రుడు సకుటుంబముగ శత్రులచేతులలోబడి ఢిల్లీకిపంపబడెను. కాకతీయసామ్రాజ్యమునందలి ధనరాసులును, కరితురంగములును, మహమ్మదీయులకు వశంగతములై పోయినవి. ఓరంగల్లు ఢిల్లీసామ్రాజ్యమునకు గలుపబడెను. ప్రతాపరుద్రుడు ఢిల్లీకి బోవుచు మధ్యేమార్గమున పరమపదించెను.[12]

11 Barani—Tarikh-i-Firoz Shahi (Elliot, III Page 231)
12 Shams-i-Siroj Afif: Tarikh-i-Firoz Shahi (Elliot, III P. 367

# కాకతీయుల ఆంధ్రభాషాసేవ.

శ్రీయుత దూపాటి శేషాచార్యులుంగారు (శేషాద్రిరమణకవులు)

క్రీ. శ. ౧౧౨౦ ప్రాంతమునుండి పశ్చిమ చాళుక్యచక్రవర్తియగు త్రిభువనమల్లవిక్రమాదిత్యుని రాజ్యము క్షీణదశకువచ్చెను. అదియే కాకతీయుల విజృంభణమున కారంభకాలము. అంతవరకు సామంతుడుగను, సేనానాయకుండుగ నున్న ప్రోలరాజు ఆంధ్రసామ్రాజ్యము నకు బునాదివేసెను. దాదాపుగా నీతనిపూర్వుల శాసనములన్నియుఁ గన్నడభాషయందే యున్నవి. ఈతనికాలమునఁగూడ గొన్నికన్నడశాసనములు పద్మాక్షి, గూడూరు, ప్రాంతములనుండుటచేతఁ దొలుత నీతడు కర్ణాటభాషకే ప్రాధాన్యతనిచ్చెనటుల నూహింపవచ్చును. ఇనుగుర్తి, మాటేరులలోనున్న తెలుఁగుశాసనములలో కాకతిప్రోలుని యాలయప్రతిష్టలు పేర్కొనఁబడినవి. ఇవియే యీతని ప్రథమాంధ్రశాసనములైనచో నిటనుండి కాకతీయులుగావించిన ఆంధ్రభాషాసేవ సంగ్రహముగ దెలుపంగవచ్చును.

ప్రథమప్రతాపరుద్రుఁడని చరిత్రవిదులు ప్రశంసించు రుద్రదేవచక్రవర్తి ఆంధ్రమున కెంతయో సేవఁగావించెను. ఈతనిమంత్రి గంగాధరుఁడు నగునూరులో వ్రాయించిన శాసనమందును, సేనానాయకుఁడగు రుద్రసేనానికి ప్రతినిధియు మంత్రియునగు రాజప్రెగడ నెలకొల్పిన ఉప్పరపల్లిశాసనమునందును, ఆంధ్రకవితాసంపద వెల్లివిరిసినది. ముఖ్యముగ గంగాధరుని శాసనమందు గొన్ని విలక్షణభాషాస్వరూపములుగూడ గోచరించుచున్నవి. తృతీయావిభక్తిలోని 'చేతఁ' అను ప్రత్యయాంతముగా నాలుగుపద్యములు రచియించి యేవంగుణవిశిష్టుఁడగు రుద్రభూపతిచేత మంత్రిపదవి చేకొంటినని గంగాధరుఁడు చెప్పినాఁడు. 'చేసితిఁ' అనియు, 'మనోమోదకరు'డనుటకు, 'మనోముదకరుం'డనియుఁ, గొన్ని విలక్షణరూపములు పేర్కొనినాఁడు. ఈతని శాసనకర్తపేరు దెలియకున్న నానాటి వాఙ్మయస్వరూపము సర్వతోముఖముగ వెలుఁగొందెననుటకు నగునూరుశాసనము నందలిపద్యములే చాలును.[1] మఱియు రుద్రసేనానిమంత్రియగు రాజనాయకుని యుప్పరపల్లి శాసనమందలి పద్యములుకూడ నాకాలపు వాఙ్మయపరిపక్వమునకు దార్కాణములు కాగలవు.[2]

---

1 "శ్రీరామాధిపుఁ డిందిరానీలనిభ శరీరుఁ, డుదారుండు, గౌరీరామాధిపుఁ డుజ్జ్వలస్ఫటిక శరీరుండు, ధీరుండు, భాషారామాధిపుఁ డబ్జకేసరలసచ్ఛాయాశరీరుండునుం గారుణ్యంబున మాకు నీవుత సదాకాలంబుఁ గామ్యార్థముల్ ॥

2 "ప్రతిపక్షక్షితిపాల కుంజర మదప్రారంభ సంరంభ ముదితబాహానిహిత ప్రచండవిసితోర్వ్య ఖడ్గధారానఖాహతిభేదింప యఖర్వగర్వ బలశౌర్యస్ఫూర్తి కంఠీరవాకృతియై యున్నతవృత్తిఁ దాల్చి వెలసెన్ కేచెర్లరుద్రుం డిలన్॥

రుద్రదేవమహారాజు క్రీ. శ. ౧౧౫౦ మొదలు ౧౧౯౬ వఱకు రాజ్యము నేలెను. ఈతఁడు విద్యాభూషణ బిరుదాంకుడనియు, నీతిసారమను పేర నొక యమూల్యగ్రంథము విరచించెననియు వినుచున్నారము. వీరశైవవాఙ్మయ నిర్మాతయగు పాలకురికి సోమనారాధ్యులు కూడ నీకాలముననే దన కవితామృతముచే నాంధ్రసామ్రాజ్యమును ముంచియెత్తెను. ఆకాలపు శాసనములవలన రామేశ్వరభట్టారకుఁడు, కవిచక్రవర్తి, మల్లికార్జున పండితారాధ్యులు, బాలసరస్వతి మున్నగుకవులు కొందరున్నటుల దెలియవచ్చుచున్నది. సిద్ధేశ్వరాలయము చెంతగల గుహలోని గండశిలపై హన్మకొండ సామ్రాజ్యమును వర్ణింపదొరకొనిన యొక ప్రౌఢకవి కవిత సంపూర్ణముగ గోచరించుచున్నది. అందుఁగూడ రుద్రదేవునికాలపు టాంధ్ర వాణీవిలాసచ్ఛాయలు గలవు.

కాకతిగణపతి దేవుఁడు క్రీ. శ. ౧౧౯౯ మొదలు ౧౨౬౦ వఱకు రాజ్యమును పరిపాలించినాఁడు. ఈతని శాసనములు గొన్ని తెలుగునను, కొన్ని సంస్కృతమునను గలవు. విశేషించి ఆంధ్రశాసనములు గద్యరూపములు ఆనాటి వాఙ్మయమును గుర్తింప నివి మిక్కిలి యుపకరించును. రుద్రదేవుని కాలమునుండి గణపతిదేవుని కాలమువఱకు విస్తరించిన కాకతీయశిల్పములకు లక్షణగ్రంథమని చెప్పఁదగు నృత్తరత్నావళి వెలువడిన దీకాలముననే. పత్ గ్రంథకర్తయగు జాయసేనాపతి గణపతిదేవుని బావమఱది. అంతియేకాదు అతని గజసైన్యాధిపతికూడ నై యున్నాఁడు. ఈగ్రంథము గీర్వాణభాషలోనున్నను ఆంధ్రశిల్పములను గూర్చియు, ఆంధ్రనృత్యమునుగూర్చియు, వివరములు గలిగి యుండుటచే నిది యొక యపూర్వనృత్తవాఙ్మయ చరిత్రమని చెప్పవచ్చును. విశ్వేశ్వరదేశికుఁ డాకాలపుశైవపీఠాధికారి. గణపతిదేవుఁ డీతనికుమారుఁడని మల్కాపురముశాసనము వాకొనుచున్నది. బహుశః అనుభవసారమురచించిన ఆంధ్రప్రౌఢకవి యీతని కాలమువాడేమో? గణపతిదేవుని వాఙ్మయసేవదెలుపు ప్రత్యేకగ్రంథము లేవో తెలియరావు కాని ఈతడు రసికశేఖరుఁడనుటకు సందియములేదు. తిక్కనసోమయాజి కార్యార్థియై దర్శనమునకేతెంచ నాదరించి భారతము నాలించి తద్రచన కబ్బురపడి కామితము నొసంగుటయే యీతని వాఙ్మయాభిమానమునకు బ్రబలదృష్టాంతముగఁ జెప్పవచ్చును. గణపతిదేవుని కాలముసఁ గూడ గవియైయుండి కవితాజీవనము, ఖడ్గజీవనము సమముగ నిర్వహించికొనినాఁడు. మారనమహాకవి గణపతిదేవునికాలమున బాలుడై యుండి, తిక్కనసోమయాజికడ శుశ్రూషఁగావించి, ప్రతాపరుద్రుని యనుఁగు గన్నయ సేనానికాలమున నిరర్గళ కవితాపరిపాటి గడించినట్లు మార్కండేయపురాణమువలన దెలిసికొనవచ్చును దాదాపుగా నీతని కాలమువాఁడే కొలనిరుద్రదేవుఁడు కూడను. ఈతఁడు వ్యాకరణబ్రహ్మయను బిరుదమువహించి గ్రంథరచనలో నారితేరినట్లుగూడ గొన్ని యైతిహ్యములుగలవు. ఆకాలపుజైనులకు శైవులకు బద్ధమత్సరముండుటవలన గలిగిన యన్యోన్యకలహములచే గొంతవాఙ్మయము నశించినది.

గణపతిదేవుడు ఈమతవిప్లవములలో శైవపక్షపాతియని తెలియుచున్నది. అందుచే జైనవాఙ్మయము నశించునవకాశము తటస్థించినది. శివదేవకవికృతమగు పురుషార్థసారము వాఙ్మయమున కపూర్వభూషణము. ఈగ్రంథ మా

కాలపురాజనీతుల వెల్లడించు రాజనీతిశాస్త్ర మనుటకు సందేహములేదు.[3]

శివదేవధీమణియను మకుటముగల శతకమునుగూడ నీతఁడు రచించినట్లు లక్షణ గ్రంథములవలన దెలియుచున్నది. ఈరెండు గ్రంథములు, ఈయన శతకమును నేటివఱకు ననుపలభ్యములే. శతవర్షజీవియై గణపతిదేవుని కాలమున ప్రతాపరుద్రుని కాలమునను గూడ రాజకీయచాకచక్యము వెల్లడించినట్లు స్థానికచరిత్రము వెల్లడించుచున్నది. శివయోగి ప్రతాపరుద్రదేవునకు బసవవిజయము నివేదించెననియు, దానిని తాను పద్యకావ్యముగ రచించితిననియు తుమ్మలపల్లి నాగభూషణకవి చెప్పియున్నాఁడు. దీనినిబట్టి చూడ శివదేవుఁడు ప్రతాపరుద్రునికి శివమంత్రోపదేశకుఁడే కాక విద్యాగురువని కూడతోచుచున్నది. రంగనాథుఁడను నొకకవి యీకాలమునందు గలఁడు. ఈతఁడు తొలుత వైష్ణవుఁడై యుండి శివనిందనుగావించి గ్రుడ్డివాఁడై "నయనగతిరగడ" అనునొకకృతిరచించి లబ్ధచక్షుష్కుఁడై నటుల నైతిహ్యములుగలవు.

రుద్రమదేవిచక్రవర్తిని క్రీ. శ. ౧౨౬౧ మొ ౧౨౯౫ వఱకు రాజ్యమేలినది. ఈమె గణపతిదేవుని రాజ్యాంతమునను ప్రతాపరుద్రుని రాజ్యారంభమునను గూడ నుండెను. ప్రత్యేకముగ నీయమగావించిన భాషాసేవను గమనింపజాలము. కాని యీమెపరివారముమాత్రము మెంతయో సారస్వతసేవకు దోడ్పడెను. రంగనాథరామాయణ నిర్మాతలగు కోనబుద్ధారెడ్డియు, రావిపాటి త్రిపురాంతకుఁడును, భాస్కరరామాయణ నిర్మాతలగు భాస్కరాదులును, నలకీర్తి కౌముదిరచించిన అగస్త్యేశ్వరుఁడును, దాదాపుగ నీకాలమువారే. భాస్కరరామాయణమున గొంతభాగమును బూరించిన శాకవల్లి మల్లికార్జున భట్టు బహుగ్రంథనిర్మాత. యీతడు రచించిన "అభిషిక్తరాఘవము" అను సంస్కృతకావ్యము హృదయంగమమై యీతనియొక్క యుభయభాషానైపుణ్యమునకు దార్కాణముగ నున్నది. ప్రతాపచరిత్రమువలన మల్లికార్జునభట్టారకుఁడు కవితావిషయముననేగాక రాజకీయ తంత్రనిర్వహణమునగూడ నప్రతిమానుఁడు అని గ్రాహ్యమగుచున్నది. ఇక నందు మల్లికార్జునుని యమానుషచర్యలు ఆశుకవితానైపుణ్యములుగూడ చేర్కొనబడినవి. ఈతని భాషాసేవ గుఱుతింప పరిశోధకులు ప్రత్యేకకృషిచేయువలసియున్నది కుమారరుద్రదేవుఁడు, మాళక్కిభాస్కరుఁడు, అయ్యలార్యుఁడు, భాస్కరుఁడు మున్నగు కవులచరిత్రములు నేటివఱకు మఱుగుపడియున్నవి.

రుద్రమదేవి యనంతరము ౧౨౯౫ మొదలు ౧౩౨౩వ వఱకు నామెదౌహిత్రుఁడగు ప్రతాపరుద్రుఁడు రాజ్యమేలెను. ఈమధ్యకాలముననే విద్యానాథమహాకవిచే ప్రతాపరుద్రీయమను నలంకారగ్రంథ మాతని కంకితముగావింపబడినది. ఆంధ్రుల బలపరాక్రమములు సామ్రాజ్యవిస్తృతియు నందు ప్రశంసింపబడినవి ప్రతాపరుద్రుని యాస్థానమున రెండువందలమంది కవులుండిరని స్థానికచరిత్రము చెప్పుచున్నది.

3 ధరణి మదములేని కరులును బోలె, దంష్ట్రములు లేని పన్నగములు వోలె
అరయ దుర్గహీనులైన ధాత్రీశ్వరు లవనికెల్ల వశము లగుదు రెప్డు
పరులకు దిగ్గమఁ బలతే, హరువరమున భువనవిజయుఁడగు రావణుడున్
శరధిగిరి ప్రాకారా, త్కర పరివృతమైన లంకఁ బురమై యుండెన్.

ఇందతిశయోక్తియున్నను, పలువురు మహాకవుల కాశ్రయుఁడనుట మాత్రము సత్యము. ప్రతాపరుద్రుఁడు స్వయముగ కవియుఁ బండితుఁడునై ప్రతాపమార్తాండము, వ్యాకరణవార్త్తికము, మున్నగు సంస్కృతగ్రంధములరచించెనని గ్రంథాంతరములఁగలదు. ఇప్పుడాగ్రంథములు మృగ్యములు. ప్రతాపరుద్రుని కాలమున దేవతోత్సవములయందు ప్రేమాభిరామము రూపకము ప్రదర్శింపబడుచుండెడిది. దీనిని రచించినకవి రావిపాటి త్రిపురాంతకుఁడు. అది ప్రకృతము కానరాకున్నను దాని యాంధ్రీకరణమగు క్రీడాభిరామముచే ప్రతాపరుద్రునినాటి యోరుగంటి మహావైభవము తెలియుచున్నది. ప్రతాపరుద్రుఁడు బంధితుఁడగుటతో ఆంధ్రసామ్రాజ్యము భిన్నమైనది. ఆంధ్రశిల్పము, వాఙ్మయమునశించినవి. ప్రధాననగరమున నెలకొల్పబడిన గ్రంథభాండారములు భస్మీపటలములగుటచే వాఙ్మయమున కింతంతయనరాని యపకారము వాటిల్లినది. సామ్రాజ్యోపజీవులగు మాధవవిద్యారణ్యులు, నాచనసోముఁడు, అగస్త్యేశ్వరుఁడు మున్నగు ప్రముఖులు స్థానాంతరముల కేగవలసివచ్చెను. నాటివగుచు నుపలబ్ధగ్రంథములలో భాస్కరరామాయణము బహుళకర్తృకము. ప్రేమాభిరామ మదృశ్యము. పురుషార్థసారము నామమాత్రశరణ్యము. ఈరాష్ట్రమున సమగ్రమగు వాఙ్మయ పరిశోధనము జరుపఁబడక పోవుటచే హతశేషమగు గ్రంథసముదాయమును గుర్తింప నేటికిని అవకాశము చిక్కలేదు.

---

శ్రీమద్గణపతి క్షోణీపతి ర్జయతి జిత్వరః।
యచ్చిత్తేపి వశం నీతో నముంచత్యచలస్థితిం॥
తద్భక్తస్య ప్రవీరస్య శ్రీమద్రుద్ర చమూపతేః।
రేచెర్లస్వామినో వంశం వక్ష్యే విఖ్యాత్యముత్తమం॥
శ్రీమద్బ్రహ్మాఖ్య సేనానీర భూద్భూరిగుణాన్వితః।
నిజప్రతాప ప్రాకార పరిత్రాత మహీతలః॥

తూర్యప్రణాద సమనంతరమేవ తూర్ణ
మాక్షిప్య యో యవనికా సదృశం కవాటం।
కాంచీపురస్య సమపాదయ దాశువీర
లక్ష్మీవివాహ మిహ కాకతివల్లభస్య॥

॥ పాలంపేట శాసనము శ్లో 5,9-11

---

# కాకతీయ ప్రశంసా పంచరత్నములు.

శ్రీయుత సాగి వెంకటనరసింహముగారు ఎం. ఏ.

సీ॥ ఆంధ్రక్షమామండ లాఖండలుండైన ♦ రుద్రభూపాలు నిర్నిద్రశక్తి
స్వీయరాజ్య ప్రజామేయ రక్షణశీల ♦ గణపతీంద్రుని లోకవినుతకీర్తి
రుద్రమాంబాకటాక్షార్ద్ర సుధాసార ♦ సిక్తక్షిత లోకచిత్రరక్తి
వీరప్రతాపరుద్రారూఢ సింహాస ♦ నాసక్త వరదండనాథభక్తి
గీ॥ కారణములుగ నెలకొనగలిగి సార్వ ♦ కాలికానూనకీర్తిని గంటివమ్మ
మమ్ముధన్యులజేసె నీ స్మరణనేఁడు ♦ రమ్ము తల్లిరో! కాకతిరాజ్యలక్ష్మి.

సీ॥ భాషించితివి శైవభక్తి సోమనలీల ♦ జానుతెన్గుల తేనెసోనగురియ
వచియించితివి సొంపువచరింప నభినవ ♦ దండిపోకడల నఖండసరణి
పోషించితివి రామభూవిభుకథ భాస్క ♦ రాది కవీశ్వ రామోదఫణితి
ఉత్సహించితి యజ్వ సత్సావహానంబున ♦ నుభయ భాషాప్రౌఢి సభలుమెచ్చ
గీ॥ రంగనాథ రామాయణ రమ్యకావ్య ♦ సారమున బెంచితివి నుడికార మహార!
మమ్ముధన్యులజేసె నీస్మరణ నేడు ♦ రమ్ము తల్లిరో! కాకతిరాజ్యలక్ష్మి.

సీ॥ చాళుక్యధరణీశ సద్భక్తి యుతదత్త ♦ భద్రేభసంతతి బాళిమెండె
పాండ్యావనీశ సంపాదితాఖిల రత్న ♦ చిహ్నితరథములు సిద్ధమయ్యె
రాష్ట్రపాలకజిత రాజ్యసంప్రేషిత ♦ కరములు ధనపరంపరలు వచ్చె
నానావిదేశాగతానూన వస్తువుల్ ♦ వర్తకానీతమై ప్రాప్తమయ్యె
గీ॥ కనులపండువుగా నిన్ని గాంచినట్టి ♦ విమలశీతలదృష్టి ప్రభావమేమొ
మమ్ముధన్యులజేసె నీ స్మరణనేఁడు ♦ రమ్ము తల్లిరో! కాకతిరాజ్యలక్ష్మి.

సీ॥ అరిరాజ రక్తారుణాంబు వర్షమెగాని ♦ కరుణలేదాజిని గాంచినపుడు
ఘనరత్నమణివస్తుకనక దానమెకాని ♦ 'నాస్తి' లేదర్థుల గాంచినపుడు
నవసుధాస్పదకృతు లవధరించితిగాని ♦ కనలేదు నీరసకావ్యమెపుడు
సత్యధర్మాది ప్రశస్తరీతులెగాని ♦ వినలేదు దుర్జనవిధములెపుడు
గీ॥ చంద్రచందన నిర్మలసాంద్రకీర్తి ♦ గాని దుష్కీర్తి నెన్నడు గాంచలేదు
మమ్ము ధన్యులజేసె నీ స్మరణనేఁడు ♦ రమ్ము తల్లిరో! కాకతిరాజ్యలక్ష్మి.

సీ॥ నీ మంగళారావ నినద పరంపర ♦ భావిసంపదల సంప్రాప్తిజేయు
నీసూరవర ఘోరసస్ఫుర వీర్యంబు ♦ వేడిక్రొన్నెత్తురుల్ విరియజేయు
నీయాంధ్ర సత్సుధానిర్మల సూక్తులు ♦ కావ్యకౌతుకలక్ష్మిఁ గ్రాలజేయు
నీ మతాచారసందీప్త ధార్మికజీవ ♦ మార్యమతాసక్తి నలరజేయు
గీ॥ నిన్నుధ్యానింప మోక్షసాధోన్నత ప్ర ♦ శాంత తత్వాత్మ కానందసరణిగూర్చు
మమ్ముధన్యులజేసె నీ స్మరణనేడు ♦ రమ్ము తల్లిరో! కాకతిరాజ్యలక్ష్మి.

# కాకతీయులు రెడ్లు.

శ్రీయుత బి. కృష్ణమూర్తిగారు.

నిఖిలప్రజాను రంజనంబుగను నిరుపమాన దోర్వీర్యసన్నాహ బంధురంబుగను త్రిలింగ సామ్రాజ్యంబును మూఁడుశతాబ్దంబులు దేదీప్యమానంబుగ సాగించిన కాకతీయ చక్రవర్తులజాతిని దెలిసికొన బలువురు సముపజాత కుతూహలులై యున్నారు. అట్టివారికి కాకతీయజాతిని సువ్యక్తముచేయుట ప్రస్తుత కర్తవ్యమై యున్నది.

కొందరు చరిత్రకారులు కాకతీయులు సూర్యవంశజు లనియుఁ గొందరు చంద్రవంశజులనియు నభిప్రాయ పడుచున్నారు. కాకతీయులు గణపతిదేవచక్రవర్తి శాసనములకుఁ బూర్వపు శాసనములలో తాము సూర్యవంశజులమనికాని చంద్రవంశజులమనికాని చెప్పుకొని యుండలేదు. కాని వారు దుర్జయవంశజులమని చెప్పుకొనినంత మాత్రముననే క్షత్రియులని తలచుటదుర్లభము. ఏలనన పెక్కు తెగలవారు దుర్జయకులస్థులమని చెప్పుకొన్నవారు విష్ణుపాదోద్భవులమనియు చతుర్థాన్వయులమనియు వ్రాసికొనియున్నారు. అటుల జెప్పుకొనినరాజులే, నతవాటిసీమను రుద్రుని కాలమునఁ బరిపాలించుచుండిరి. వారిలో కాకతీయులకు బంధువగు దుర్గరాజుకొడుకు బుద్ధరాజొకడు. కాన నతవాటిసీమరాజు లెటువంటి దుర్జయవంశజులో కాకతీయులు నట్టివారని తేలుచున్నది.

చిలుకూరి వీరభద్రరావుగారు, "ఆంధ్రుల చరిత్రము"లో కాకతీయులు చతుర్థాన్వయులనియు, శూద్రులనియు తేల్చిరి. కాకతీయులు సూర్యవంశజులమని యొక్క గణపతిదేవ చక్రవర్తి శాసనములయందు పేర్కొనంబడినందు వల్లను, అంతకుబూర్వము నే శాసనమునందును తాము సూర్యవంశజులమని కాని, చంద్రవంశజులమని కాని వ్రాసికొని యుండక పోవుటవల్లను, నదికాక విద్యానాథుఁడు తన ప్రతాపరుద్రీయమునఁ గాకతీయులు పైనుదహరించిన రెండువంశజులును గాక రెంటి నతిశయించిన వర్ణమునకు జెందినవారని వర్ణించుటను, బట్టిచూడ శూద్రులగు కాకతీయులు క్షత్రియులై రనుటకుఁ గారణము వర్ణాశ్రమ ధర్మములో జేరిన కులముచేతగాక, క్షాత్రము నుదాల్చి భూమిని జయించి పాలించుటయని యూహింపదగును. లేదా కాకతీయులు క్షత్రియులనువారి వాదమునుబట్టి చూచినను మొట్టమొదటిరోజులలో ననగా రుద్రుని కాలమువరకును కాకతీయులు క్షత్రియులే యనుకొనినప్పటికిని, తరువాత, ననగా గణపతిదేవచక్రవర్తి కాలమునుండియో, లేక ప్రతాపరుద్రుని కాలమునుండియో కాలానుసారముగ జేసిన సంబంధబాంధవ్యములవల్ల నొకప్పుడు క్షత్రియులుగ నుండినను తదుపరి శూద్రప్రాయులై పోయిరని యేలనూహింపరాదో తెలియకున్నది.

కాకతీయులు మొదట రెడ్లుగానుండి తదు

పరి వారుజేసిన బాంధవ్యములను బట్టి తరువాత కమ్మవారుగామారి నట్లున్నది. కాకతీయులు కమ్మవారితో సంబధ బాంధవ్యములు నెరపిరనుట విస్పష్టము.

1. కాకతీయ మహాదేవరాజు పుత్రికయు, గణపతిదేవచక్రవర్తి తోబుట్టువయునగు మేళాంబికయును మైలమ్మ నతవాటి విషయాధీశ్వరుడగు బుద్ధరాజుకొడుకు శ్రీమన్మహామండలేశ్వర రుద్రదేవరాజుకిచ్చి వివాహము చేయబడియెను. [1]

2. శ్రీమన్మహామండలేశ్వర కాకతీయ గణపతిదేవచక్రవర్తి తనపుత్రికయైన గణాంబను శ్రీమహామండలేశ్వర కోటబేతరాజునకిచ్చి వివాహముఁ జేసెను. [2]

3. గణపతిదేవచక్రవర్తి వెలనాటివిజయించినప్పుడు పిన్నచోడుని కూతులైన నారాంబను, పేరాంబను పెండ్లియాడినట్లు చేబ్రోలులోని జయనాయకుని శాసనమును బట్టి తెలియుచున్నది [3]

4. గోనబుద్ధారెడ్డి కూతురైన కుప్పమాంబ, కాకతిమహాదేవరాజు వంశమునందు జనించినట్లును శ్రీమల్యాలగుండదండాధీశ్వరునకిచ్చి వివాహము చేయబడినట్లును తెలియుచున్నది.

కాకతీయులు కమ్మవారితోనేగాక వెలనాటిరాజులతోకూడ సంబంధములు చేయుచుండెడివారనుట కనేకశాసనములు గలవు. రెడ్లు, కమ్మలు, వెలమలు నీమూడు తెగలవారు నొక్కతెగలోనుండి యేర్పడినవారు కానప్పటికి నీమూడుతెగలకును సంబంధ బాంధవ్యములున్నట్లు చరిత్రమునందు పెక్కుఉదాహరణములుగలవు. అదిగాక ఈవెలమలు తమనామాంత్యములకు "రెడ్డి" యను బిరుదవాచకపదమును జేర్చుకొని వ్యవహరింపబడుచుండిరి.

కాకతీయులు రెడ్లతోసంబంధములుఁజేయుటయేగాక కొందరు తమనామములకు "రెడ్డి" యను పదముకూడ చేర్చుకొనిరి. అందుకుదాహరణము లేవనగా, ప్రతాపరుద్రచక్రవర్తి కొడుకులలోనొకడు క్రీ. శ. 1318వ సంవత్సరము నఁ గడపమండలములోని చెన్నూరిగ్రామమున దక్షిణపుపు నాగనాథుని దేవాలయముకడ వ్రాయించిన యొక దానశాసనములో నతని నామమునకు 'రెడ్డి' యను పదముచేర్పబడియున్నది. అంతియేకాదు, జుట్టయలెంకగొంకారెడ్డి ప్రతాపరుద్ర మహాదేవరాజుల కుమారుడనుటకు పెక్కుశాసనములు గలవు. ఇట్లుకాకతీయులలో కొందరికి నామాంత్యమున "రెడ్డి" పదముండుటంబట్టి కాకతీయులురెడ్లని యూహింపవీలగుచున్నది. రెడ్డివారినిగూర్చి చిలుకూరి వీరభద్రరావుగారు రాష్ట్రకూటులే రెడ్లనియు, వీరిని క్షత్రియులుగా బరిగణింపవలసినది గాని శూద్రులుగా బరిగణించుట శాస్త్రవిరుద్ధమనియు వ్రాసిరి. మరల ఆంధ్రుల చరిత్రములో మొట్టమొదట రెడ్లుగనుండి తరువాత కమ్మవారయిరని వ్రాయబడిన కాకతీయులు చోళులతోను రెడ్లతోను సంబంధములునెఱపి శూద్రులుగాఁ బరిగణింపబడు టట్లు శాస్త్రసమ్మతమూ తెలియకున్నది.

పల్లవులకు, చాళుక్యులకు, కళింగులకు,

1 E. R. 204 of 1904
2. E. I. VI P. 84
3. E. I. III P. 84

రెడ్లకు, చోళులకు సంబంధ బాంధవ్యము లున్నటుల చరిత్ర నుండి ఋజువుచేయవచ్చును. మరియు రెడ్డివీరులు రాష్ట్రకూటవంశీయులనుటకు చరిత్రములు సహాయపడుచున్నవి. అందువల్లనే శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుపంతులుగారు 'ఆంధ్రుల చరిత్రము'లో "వీరికి రాజపుత్ర రాఠోడులతో సంబంధముండవచ్చుననియు రెడ్లనువారే వీరిసంతతిగా నెన్నబడుచున్నార"నియు వ్రాసియున్నారు రాష్ట్రకూటులు సూర్యవంశీయులు చంద్రవంశీయులునగు క్షత్రియవర్యులనియు, చాళుక్యులు చంద్రవంశజులనియు, పెక్కుశాసనములు తెలుపుచున్నవి కాకతిరుద్రుడు కందూరు చోళుల యాడపడుచగు పద్మావతిని బెండ్లాడినందున కాకతీయులకు చోళులకు సంబంధమున్నదన్నమాట సత్యము. కాకతీయవంశ సంజాతుడగు మల్యాల గుండదండాధీశ్వరుడు గోనబుద్ధారెడ్డి కూతురగు కుప్పాంబికను బెండ్లాడెనని బూతపూరు శాసనమందు నితరశాసనములందు నుండుటచే గాకతీయులకు రెడ్డివారితో సంబంధబాంధవ్యము లున్నట్లు నిశ్చయము

శ్రీమాన్ శేషాద్రి రమణకవులు, శ్రీమాన్ పెద్దమందడి వేంకటకృష్ణకవి గార్లచే రచియింపబడిన 'రెడ్డికుల నిర్ణయచంద్రిక' నాల్గవప్రకరణములో "రాష్ట్రకూటులను రెడ్డివీరులు చంద్రవంశజులగు విజయనగర రాజులతోడను, చాళుక్యులతోడను, సూర్యవంశజులగు చోళులతోడను పల్లవగాంగుల తోడను, కాకతీయులను నామాంతరముగల చోళులలో నొకశాఖవారితోడను, సంబంధ బాంధవ్యములొనర్చినట్లు స్థిరపడినది." అని ఉన్నది. రెడ్డివారు స్వయముగా తాము సూర్యవంశజులమని చెప్పుకొనినవి చెప్పించుకొనినవియగు శాసనములు పెక్కులుగలవు. పైనుదహరించిన పొత్రములోనే "కాకతీయులు .... ప్రథమమున రాష్ట్రకూట సంభవులగు రెడ్డివారనియు, చోళులసంబంధముచేసి తుదకు చోళులమని చెప్పుకొనిరనియు, కాకతీయులలో రాజులకు మహారాజనామ ముండుటయు, సామాన్యులకు నామాంత్యమున రెడ్డిపదముండుటయును బట్టి నిర్ణయింప వీలగుచున్నది" అనియున్నది.

కాకతిచక్రవర్తులవద్ద రెడ్లు సేనాధిపతులుగానుండి త్రిలింగసామ్రాజ్యమును నల్గడల విస్తరింప జేసిరనుటలో సందియములేదు. మొదటి ప్రతాపరుద్రదేవ మహారాజునకు భృత్యులై బేతిరెడ్డి, నామిరెడ్డి భక్తితో నాతని సేవించుచు నామనగల్లుదుర్గమున కధిపతులై, యుద్ధముల నజేయులై, ప్రఖ్యాతిగాంచిరి. వెంకటగిరి సంస్థానాధిపతులకును, జటప్రోలు సంస్థానాధిపతులకును, బొబ్బిలి, పిఠాపురము, మైలవరము మొదలగు సంస్థానములకును మూలపురుషుడైన చెవ్విరెడ్డి కాకతిగణపతిదేవుని రాద్యకాలమున శౌర్యధైర్యాది లోకోత్తర గుణగణపరిపూర్ణుడై, యామహారాజువలన మిగుల మన్ననగాంచినట్లుగా గూడ తెలియుచున్నది. మరియు గణపతిదేవచక్రవర్తి సేనాధిపతులలో కాటచమూపతి భాండ సేనాధిపతియను నిరువురునుగూడ రెడ్లలోనివారేయనికూడ చెప్పవచ్చును. కాకతిరుద్రమదేవి సైన్యాధిపతులలో నొకడగు గోనగన్నారెడ్డి వర్ధమానపురము రాజధానిగ నాంధ్రసామ్రాజ్యము యొక్క పశ్చిమభాగమున కంతయు నధికారియై పరిపాలనముసేయుచు నామెకు దక్షిణభుజమై యొప్పియుండెను.

ఇట్లు రెడ్లు కాకతీయచక్రవర్తుల కాలములో గొప్పసైన్యాధిపతులుగా నుండి వారిమన్నన బడయుటయేగాక వారితో సంబంధ బాంధవ్యములు చేసినట్లు పెక్కునిదర్శనములు కలవు

కాకతిగణపతిదేవచక్రవర్తి పరిపాలనకాలమున కృష్ణానది మొదలుకొని కాంచీపురము వరకుగల తూర్పుతీరమునంతను కమ్మనాటి రెడ్లు, పాకనాటిరెడ్లు, రేనాటిరెడ్లు చోడుల నుపేరుతో బరిపాలనము చేయుచుండిరి. వీరినందరిని జయించి, ఏకఛత్రము క్రిందికిదీసికొని రావలయునని నిశ్చయించి, తదనుగుణముగా సమర్థులైన మంత్రులను సేనాధిపతులను, నియమించుకొనుటకు నానావర్ణంబుల వారికిని గణపతి నాయకత్వంబిచ్చినట్లుగా సోమదేవరాజీయములో నొక వచనమునుబట్టి దోచుచున్నది. అట్లుజయించిన రెడ్డిరాజులతో కాకతీయులు సంబంధములు నెఱపియుండవచ్చును. లేదా తమస్థానమును బలపరచుకొనుటకై వారు రెడ్లతోసంబంధములు చేసియుండవలెను, గణపతిదేవుడు వెలనాటిని జయించినప్పుడు యాభాగమునందధికారము ధృఢముగనాటుకొన్నట్లు సేయుటకు వెలనాటి సైన్యాధిపతులతో బాంధవ్యముచేసినట్లు గాన్పించుచున్నది.

పైనుదహరింపబడిన కారణములబట్టియు కాకతీయులు రెడ్డిరాజులతో సంబంధబాంధవ్యములు నెఱపినందునను కొందరు నామాంత్యమున "రెడ్డి" పదమునుజేర్చి వ్యవహరించుటను బట్టియు, కాకతీయులు మొట్టమొదట రెడ్లుగా నుండిరని స్పష్టమగుచున్నది.

---

శ్రీమత్ప్రోల నృపాల సైన్యపతినా విఖ్యాతవిక్రాంతినా
యుద్ధే యేన మహాబలేన నిహతే మంథన్యగుండాధిపే।
అన్యే వైరినృపాలకాః ప్రతిదిశం ప్రాద్రుద్రువం స్తత్క్షణా
త్సింహేనేవ నిపాతితే గజపతౌ శేషాగజాః క్షుద్రకాః॥

తత్కులే ద్విషతాం జేతా కాటయాఖ్య శ్చమూపతిః।
విచిత్రసంపదాం పాత్రం పవిత్రః సజ్జనప్రియః॥
తత్పుత్ర శ్చిత్రచారిత్రః కామనామా చమూపతిః।
లోకనాథ పదాంభోజ పూజా నిర్మలమానసః॥

పాలంపేట శాసనము. శ్లో 12, 14, 15.

---

# కాకతీయరాజ్యము: భౌతిక స్వరూపము

శ్రీయుత రాళ్లబండి సుబ్బారావుగారు. ఎం. ఎ. ఎల్. టి. ఎం. ఎ. యు. యస్.

కాకతీయవంశపురాజు లేలినప్రదేశము యొక్క సరిహద్దులు, నైసర్గిక స్వరూపము, శీతోష్ణస్థితి, విస్తీర్ణము, రేవు పట్టణములు,వర్తకము, నాగరికత, మొదలగు విషయములు తెలుపుటయే యీవ్యాసము యొక్క ముఖ్యోద్దేశ్యము.

సరిహద్దులు:- దేశచరిత్రకుగలసంబంధము ఇంపీరియల్ గెజటీరు, చెన్నరాజధాని మొదటి సంపుటము183వపుటనుండి, ఈక్రిందివిషయములు తెలియుచున్నవి. కర్నాటకదేశముబీడర్ పట్టణమునుండి దక్షిణదిక్కుగా అదవోని,అనంతపురం,పట్టణములమీదుగా మహిషమండలములోని నందిదుర్గము వరకును వ్యాపించి, అచ్చటనుండి తూర్పుకనుమలనంటి కోయంబత్తూరువరకును వ్యాపించి, అచ్చటనుండి ఉత్తర పశ్చిమదిక్కుగా పడమటికనుమలనంటి కృష్ణానది పుట్టుస్థలమువరకును వ్యాపించి, అందుండి తిరిగి ఆనదీతీరముననే బిదరుపట్టణమువరకును వ్యాపించియుండెను. ఈ సరిహద్దులమధ్యనున్న ప్రదేశమే మొట్టమొదట కర్ణాటకదేశమని పిలువబడెను. మరియు,అదేసంపుటము108వపుటనుండి, మహారాష్ట్రదేశమున కుత్తరమున నర్మదానది సరిహద్దనియు, దక్షిణమున కృష్ణానదియనియు, పశ్చిమమున అరేబియా సముద్రమనియు, తూర్పున బీదరుపట్టణము మొదలుకొనితూర్పుఉత్తరముగా సందేరు వరకును అందుండితిరిగి అమరోటివరకును వ్యాపించిన ప్రదేశము, సరిహద్దనియు తెలియును. ఈ సరిహద్దులకుమధ్యనున్న దేశమేమొదటిమహారాష్ట్రదేశము. ఇట్లు దక్షిణాపథముయొక్క పశ్చిమోత్తరప్రదేశమున, అనగా, మహారాష్ట్రదేశమున దేవగిరినుండి యాదవులును, వారికి దక్షిణమున అనగా కర్నాటకదేశమున ద్వారసముద్రమునేలు హొయసలులును, ఈరెండువంశములకు తూర్పుగా త్రిలింగ లేక ఆంధ్రదేశమున ఓరుగల్లు కాకతీయులును, రాజ్యము చేసిరి.

పైవిషయములే కొంత విపులముగ కేంబ్రిడ్జిహిందూదేశచరిత్ర మూడవసంపుటము, పుటలు 485- 489లో గూడ వర్ణింపబడినవి. క్రీ॥ శ॥ 1292 లో హొయసలులకును యాదవులకును మధ్యసరిహద్దుకృష్ణానదియని తలంపవచ్చును. దక్షిణాపథము యొక్క పశ్చిమార్ధభాగమున యాదవరాజ్యముండెను. దానితూర్పుసరిహద్దు, బీజపూరునకు తూర్పుననుండికుల్బర్గ, యాదగిరి, కల్యాణి, పట్టణములమీదుగా తూర్పుఉత్తరముగా బెహార్ పట్టణము వరకును, అందుండి యింకను తూర్పుఉత్తరముగనొక గీతగీసినట్లూహించినచో నేర్పడుచున్నది. ఈగీతకు పశ్చిమముననుండు ప్రదేశము దేవగిరి యాదవులకు చెందెను. తూర్పుననుండు ప్రదేశము కృష్ణానదీముఖమువరకును ప్రప్రథమమున అనుమకొండ రాజధాని

గాగల కాకతీయులదై యుండెను. క్రమముగ వీరు తూర్పుచాళుక్యులరాజ్యమును కబళించి యుండిరి. కాకతీయగణపతిదేవచక్రవర్తి కాలమున జటావర్మసుందరపాండ్యుడు నెల్లూరు తెలుగు చోళవంశపురాజులను జయించుట చేత దక్షిణసరిహద్దు కృష్ణానదీ ముఖప్రాంతమున స్థిరపడెను. నెల్లూరు,దత్తమండలములనేలిన తెలుగుచోళులదేశము, ఉత్తరముననున్న కాకతీయులకును తూర్పుతీరమునంటి దక్షిణమువరకును వ్యాపించినపాండ్యులకును మధ్యనుండుటచే రెండువంశములవారివల్ల నాటుపోటులను తినుచుండెను. కృష్ణానదికి కొంత దూరముననున్న అదవానిపట్టణము మొదలుకొని హొయసలపాండ్యుల సరిహద్దుతూర్పు కనుమలనంటివ్యాపించి, తర్వాత మహిమ మండలముయొక్క తూర్పుభాగము నంటిపోయి,తర్వాత పశ్చిమముగ నీలగిరి పర్వతములవరకును వ్యాపించెను. ఈప్రకారము హొయసలులు చుట్టుప్రక్కల మూడుదిక్కులనుండువంశములవారినుండితమసరిహద్దులను కాపాడుకొనుచుండిరి. వీరు తరుచు కాకతీయులతోకంటె యాదవులతో పోరాడుచుండిరి. ఈనాల్గువంశములవారి యభిమతములు భిన్నములగుటచేత మహమ్మదీయులుదండెత్తి వచ్చినను వారందరును కలసి వారిని యెదిరింపలేకపోయిరి.

కాకతిరుద్రదేవుని క్రీ॥ శ॥ 1162నాటి అనుమకొండ వెయ్యి స్తంభముల గుడి శాసనము నందలి 4 వ శ్లోకమును బట్టి ఆకాలమునాటి కాకతీయ రాజ్యపు సరిహద్దులు యీక్రిందివిధమున తెలియుచున్నవి:

శ్లో॥ రాజ్యం ప్రాచ్యాం లవణజలధేస్తీర
పర్యన్తమస్య। శ్రీశైలాన్తాం ప్రచర
తిసదా దక్షిణాశాంసమగ్రాం। ప్రాతీ
చ్యాన్తా కటకనికటస్థాయి నీ రాజ్య
లక్ష్మీః। కౌబేర్యాశా తట విలసితే
మాల్యవన్తం ప్రదేశే॥

అనగా, తూర్పున బంగాళాఖాతము వరకును, దక్షిణమున శ్రీశైలము వరకును, పడమట (కల్యాణి) కటకము వరకును, ఉత్తరమున మాల్యవంతమువరకును రుద్రదేవుని కాలమున కాకతీయ రాజ్యమువ్యాపించెను.

క్రీ॥ శ॥ 1180 ప్రాంతమున తూర్పుగోదావరిజిల్లాలోని ద్రాక్షారామమున కాకతి రుద్రదేవుని శాసనములు కనబడుటచేత అతని రాజ్యము ప్రాగ్దిశను గోదావరి ముఖద్వారము వరకును వ్యాపించెననుట సత్యము. ఆకాలముననే త్రిపురాంతకమున గూడ అతని శాసనములు కనబడుటచేత శ్రీశైలపు ప్రాంతముగూడ కాకతీయ రాజ్యము లోని దనుటస్పష్టము. ఇంతకు పూర్వము గుంటూరు మండలము మొదలుకొని కర్నూలుజిల్లాలోని త్రిపురాంతకము వరకును గలప్రదేశము వెలనాటిచోడులస్వాధీనమునందుండుటచేత కాకతీయుల రాజ్యము ఆభాగమున కుత్తరమునవ్యాపించియుండెను. కానిగణపతిదేవుని రాజ్యకాలమున (1199—1261) అతని సేనానాయకుల విజయముల చేతను, అతని రాజకీయ సంబంధమైన వివాహముల చేతను ప్రాగ్దేశముననున్న గుంటూరు మండలము నందలి నతవాటి, అమరావతి, రాజులతనికి వశులైరి. అతని కాలమునాటి ఉప్పరవల్లి, మోటుపల్లి, ఏకామ్రనాథ, శాసనములాతని యములను తెలుపును. కొలని గణపతిదేవుని శివయోగసారమున సోమమంత్రి ఓరుగంటికి తూర్పుభాగమును అనగా



పానగల్లు దేవాలయము.

[ By courtesy of H. E H. The Nizam's Archaeological Department. ]



యాదగిరిదుర్గము.

వేంగిదేశమును, కలింగముయొక్క దక్షిణభాగమును (తూర్పుగోదావరి మండలమును) జయించినట్లు కలదు. రుద్రమదేవికాలమున మొదట త్రిపురాంతకమునేలిన కాయస్థరాజులును, పాండ్యరాజులును, కాకతీయమండలికులును దక్షిణమునను ప్రాగ్దిశను, స్వతంత్రులైనను, తర్వాత ఆమె సేనానాయకులు ఇందులూరి అన్నయదేవుడు, కోలని రుద్రదేవుడు దక్షిణదేశమును (కంచి వరకును) తూర్పు దేశమును(సింహాచలపర్యంతమును,) జయించి ప్రతాప రుద్రుని కాలమునగూడ మంత్రులుగ నుండి కాకతీయ రాజ్యవిస్తీర్ణము తగ్గకుండ ప్రయత్నించిరి. గనుక రుద్రదేవుని కాలమునన్నన్న పశ్చిమోత్తర పరిహద్దులు ప్రతాపరుద్రదేవుని కాలమున గూడ మారకపోయినను, ప్రాగ్దక్షిణదిశలందు మార్పులుగల్గుచు తుదకు దక్షిణమున కంచివరకు కాకతీయసామ్రాజ్యము వ్యాపించియుండెను.

క్రీ॥ శ॥ 1316 లో ప్రతాపరుద్రుని సైన్యాధిపతియగు ముప్పిడినాయకుడు కేరళాధిపతియగు రవివర్మను కంచిదేశమునుండి తొలగించి చోళవంశీయుడగు మానవీరుని కంచిమండలాధిపతిగా నియమించినట్లును, అరులల్ పెరుమాళ్లాలయమునకు రెండు గ్రామములు దానమిచ్చినట్లును, తెలియుచున్నది.(Ep. Ind. Vol 7, P p 128-132).

జంబుకేశ్వరాలయముననున్న ప్రతాపరుద్రుని శాసనమునుబట్టి 14వశతాబ్దాదిని కాకతీయరాజ్యము దక్షిణమున తిరుచునాపల్లివరకును వ్యాపించినట్లు తెలియుచున్నది. (Ind. Ant. Vol XXI, P. 200). కాని కంచిలో. దక్షిణభాగము సుస్థిరముగ కాకతీయుల పరిపాలనమునందుండలేదు. ఇట్లే శివయోగసారమునుబట్టి రుద్రమదేవి, ప్రతాపరుద్రదేవుల రాజ్యకాలములలో సింహాచలపర్యంతముగల కళింగదేశము కాకతీయరాజ్యమున నిమిడియుండెనని తెలియుచున్నను వారిశాసనములు గంజాం, విశాఖపట్టణము జిల్లాలలో కనబడకుండుటచేత వారు దండయాత్రలను మాత్రము జరిపిరనియు, ఆభాగములు సుస్థిరముగ వారి యాధీనమున నుండలేదనియు స్పష్టము. గణపతిదేవుని కాలమునుండి కళింగములోని దక్షిణమండలమగు ప్రస్తుతపు తూర్పు గోదావరిజిల్లా మాత్రము కాకతీయుల స్వాధీనమునందుండెననుటకు అచ్చట దొరికిన వారి శాసనములే తార్కాణము.

### నైసర్గికస్వరూపము-

### కొండలు, నదులు, సరస్సులు.

ప్రస్తుతపు నైజాము రాజ్యములోని రెండు—మూడవవంతు తూర్పు భాగము, అనగా, రాయచూరునుండి కల్యాణిబీదుగా గోదావరిని దాటి అదిలాబాదువరకుగల ప్రదేశమునకు తూర్పుననున్న భాగముబంగాళాఖాతమువరకును, ఉత్తరమున మాల్యవంతము మొదలుకొని దక్షిణమున కంచివరకును (దత్తమండలములు, గంజాం,విశాఖపట్టణం, జిల్లాలుతప్ప) మిగిలిన ఉత్తరసర్కారులు కాకతీయరాజ్యమున నిమిడి యుండెను. ఈప్రదేశముదక్షిణ పీఠభూమియొక్క దక్షిణతూర్పుభాగముననున్నది. చాలభాగముపర్వతారణ్యమయమైయున్నది. నైజాముగాజ్యములోని దేశముయొక్క సగటు ఎత్తు 1300 అడుగులు. తక్కిన భాగముయొక్క ఎత్తు800 అడు

గులు. భూభాగము గోదావరి పైన్ గంగ నదులకు ఉత్తరముననున్న అజంతా కొండలు, దక్షిణముననున్న బలఘాటు కొండలు మొదలొని తూర్పుతీరమువరకును అనగా, పశ్చిమోత్తరదిశనుండి ప్రాగ్దక్షిణదిశగా వాలియున్నది. అందుచేతనే నదులుగూడ అట్లే ప్రవహించుచున్నవి. గోదావరినది అట్లుప్రవహించి ఉత్తరమున పైన్‌గంగ, దక్షిణమున మంజీరయను ఉపనదులను చేర్చుకొని, కాకతీయరాజ్యమునకు పశ్చిమోత్తర దిశను సరిహద్దగుచున్నది. మంజీరనది గోదావరిని కలియుప్రదేశమునకు సమీపమున ఇందూరనుపట్టణము (నిజామాబాదు) గలదు. యాదవ రాజ్యము ఈనదులకు పశ్చిమమున బలఘాటు, అజంతకొండలనంటివ్యాపించెను. 1292—1308 సం॥ లలో అల్లాఉద్దీన్ యాదవరాజ్యమునుజయించి, దేవగిరి మీదుగా గోదావరినిదాటి, కాకతీయరాజ్యపు సరిహద్దుపట్టణమగు ఇందూరునుముట్టడించి పట్టుకొని, తర్వాత ఓరుగల్లు చేరెను. (కేంబ్రిడ్జి హిందూదేశచరిత్ర, మూడవ సంపుటము, పుట 115). ఇట్లే 1309-10సం॥లో మాలిక్‌ఖాఫుర్, నర్మదానదిని దాటిన 8 రోజులకు దేవగిరి సరిహద్దుననున్న నీలకంఠ లేక నెలకొండగ్రామము చేరి అందుండి విజనగరము మీదుగా (యపార్ బరుజ నదుల మధ్యగా) సిరిబార్ లేక సిరిపురము (ఇదిప్రస్తుతము ఖరీం జిల్లాలోనున్నది)కోటనుముట్టడించిపట్టుకొని, బస్తరురాజ్యములోని సునర్‌పాలు పట్టణము మీదుగా గోదావరినదిని దాటి ఓరుగల్లు కోట ముట్టడించెను. ఈ దండయాత్రలను బట్టి దేశమెట్లు వాలినదో, నదు లేదిక్కుగా ప్రవహించు చున్నవో, అప్రాకారమే శత్రువాహినులుగూడ నడుచుచుండెనని తెలియుచున్నది. నదులు, పర్వతములు, తదితర నైసర్గిక స్వరూపములు చరిత్రవిషయముల కెట్లుసంబంధమును కలియుండును.

కాకతీయ రాజ్యముయొక్క తూర్పుభాగము (గోదావరిజిల్లామొదలుకంచివరకును గల తీరప్రదేశము) 600మొదలు1000అడుగుల ఎత్తునుండును. ఈభాగమునకు పశ్చిమమునగల పర్వతపంక్తికే తూర్పుకనుమలనిపేరు. ఈపంక్తికి శిరోభాగముననే మాల్యవంతముగలదు. గంజాంజిల్లాలో మహేంద్రగిరి (4000 అడుగుల కన్న ఎక్కువ ఎత్తు), గోదావరి జిల్లాలో పాపి కొండలు (రమారమి 2000 అడుగుల కన్న ఎక్కువ ఎత్తు) కర్నూలు జిల్లాలో నల్లమలకొండలు (3000 అడుగులకన్న ఎక్కువ ఎత్తు) ఇవి తూర్పుకనుమల లోని ముఖ్యభాగములు. తూర్పుకనుమలగుండా గోదావరి,కృష్ణా, ఉత్తరపినాకిని, పాలారునదులు విశాలమగు మార్గములను చేసికొని బంగాళాఖాతములో కలియుచున్నవి. ఆనదులయొక్క లోయలలో పచ్చిక బయళ్లు, కారడవులు, పంటభూములు గలవు. గోదావరినది రమారమి 200 మైళ్లు కాకతీయ రాజ్యమునకు పశ్చిమోత్తరదిశలయందు ప్రవహించి, సహజమైన సరిహద్దుగ నేర్పడి, యాదవ, మహమ్మదీయ దండయాత్రలకు గట్టియాటంకములను బెట్టెను. ఈనదికి కుడివైపుననుండు గొప్ప యుపశాఖ మంజీర. ఇదియాదవ కాకతీయరాజ్యములకు కొంతవరకు పశ్చిమ సరిహద్దుగా నుండెను. కృష్ణానది కాకతీయ యాదవ రాజ్యములకును, హొయసల కర్ణాటరాజ్యములకును

మధ్య సరిహద్దుగనుండెను. ఈనది కాకతీయ రాజ్యమునకు మొదటి దక్షిణపు సరిహద్దుగా 400 మైళ్ళు ప్రవహించెను. దీని యుపనదులు తుంగభద్ర, మలప్రభ, భీమ. కాకతీయ రాజ్యము యొక్క దక్షిణ పశ్చిమభాగములందు ప్రవహించిన ఈనదీప్రదేశములు కొంతకాలము హొయసల, యాదవ, కాకతీయ రాజులకు యుద్ధకారణములయ్యెను. తుదకు కృష్ణానది యాదవులకు, హొయసలులకు మధ్య సరిహద్దయ్యెను. రాయచూరు మండలము మొదలుకొని కల్యాణిమీదుగా ప్రాగుత్తరమున నున్న ఇందూరు, ఆదిలాబాదు వరకుగల ప్రదేశము యాదవులకు కాకతీయులకు సరిహద్దయ్యెను అనగా, తుంగభద్ర-కృష్ణలోయయు, కృష్ణ-భీమ లోయయు, మంజీర-గోదావరి లోయయు, గోదావరి-పైన్ గంగలోయయు, కాకతీయరాజ్యమునకు వరుసగా దక్షిణ, పశ్చిమ, పశ్చిమోత్తర దిశలయందు సహజమైన సరిహద్దులుగా నేర్పడెను. హైదరాబాదు మీదుగా ప్రవహించి కృష్ణా నదిలో కలియు ఉపనది మూసి. ఇట్లే, అనేక ఉపనదులు దేశమునగల కొండలలో పుట్టి, దేశము శీరభూమి యగుటచేత విశేషముగా వ్యవసాయమున కుపయోగపడక బహువేగముగ ప్రవహించుచున్నవి. ఇట్టిదే వారంగల్లుజిల్లాలోని మోర్వంచనది. ప్రతాపరుద్రుని సైన్యాధిపతియగు రేచెర్లరుద్రిరెడ్డి ఈనదికి కట్టుకట్టి, రామప్ప చెరువు నేర్పాటు చేసెను. దేశమునందనేక బావులు, చెరువులు, సరస్సులు, కాలువలు గలవు. ఓరుగల్లు జిల్లాలోని ములుగు తాలూకాలో రామప్ప, లక్నవరం సరస్సులును, పాఖాల తాలూకా లోని పాఖాల సరస్సును గొప్పవి. రామప్ప చెరువు 82 చతురపు మైళ్ళ విస్తీర్ణముగల భూమినుండి వచ్చు నీటిని నిలవచేయును. చెరువుక్రింద ఆయకట్టు 5046 యకరములు. చెరువుక్రిందనే రామప్ప దేవాలయము కలదు. ఇందు రేచర్ల రుద్రిసేనాని శిలాశాసనముగలదు. ప్రతాపరుద్రుని కాలమునందిదియొక గొప్ప సైన్యపు విడిదిగా నుండెను. భూమి సుద్ద ప్రదేశము ఇందు ముఖ్య పంటకు తబియని పేరు. ములుగు తాలూకాలోని లక్నవరం సరస్సు 75 చతురపు మైళ్ళ విస్తీర్ణముగల భూమినుండి వచ్చు నీటిని నిలవ చేయును. ఈప్రాంతములందు సంవత్సరమునకు సగటున వర్షపాతము 32 అంగుళములు. రమారమి 1400 యకరములనేల దీనిక్రింద తడుపు. దీని ఆయకట్టు 3535 యకరములు. ఈ సరస్సునకు అడ్డముగా కట్టుకట్టి అనేక పంటకాలువల ద్వారానీటినిపంటలకుపయోగించుచున్నారు. పాకాల సరస్సు, కృష్ణానది కుపనదియగు మానేరు నదియొక్క నీటిచేత పోషింపబడుచున్నది. ఇది ఓరుగల్లునకు 32 మైళ్ళదూరమున తూర్పుగా నున్నది. దీని చరిత్ర ఆసరస్సు గట్టుపై గల శిలాశాసనమున గలదు. ఈ ప్రాంతమున సంవత్సరమునకు సగటున వర్షపాతము 40 అంగుళములు. 80 చతురపు మైళ్ళ విస్తీర్ణముగల ప్రదేశమునుండి వచ్చు నీరు నిలవ చేయబడును. 17258 యకరముల భూమి దీని నీటిచే తడియుచున్నది. ఈసరస్సు క్రింద ముఖ్య పంటలు వరి, చెరుకు, తమలపాకులు. ఈ ప్రాంతము నందనేక శిథిలములైన కట్టడములు, ఆలయములు, గ్రామములు గలవు. ప్రస్తుతము కారడవులతో

నిండి ప్రజాహీనముగానున్నను ప్రతాపరుద్రుని కాలమునందీభాగ మున్నతదశ ననుభవించె ననుటకు సంశయము లేదు.

ఈప్రకారము కాకతీయ రాజ్యము నం దనేక భాగములలో ఇంకననేక సరస్సులుండెడివి. అట్టివి జగత్కేసరి చెరువు, పాట సముద్రము, సబ్బిసముద్రము, చౌండ సముద్రము, ఎఱకసముద్రము మొదలగునవి.

### శీతోష్ణస్థితి, వర్షములు, జనసంఖ్య.

కాకతీయరాజ్య ముత్తరమున 20 వ అక్షరేఖకును (పైగంగనదికిని, బస్తరు దేశమునకును పైభాగము), దక్షిణమున 14వ అక్షరేఖకును (దత్తమండలమునకును, నెల్లూరు మండలమునకును క్రిందిభాగము), ఒకప్పుడు 13వఅక్షరేఖకును (కంచిమండలమునకుదక్షిణభాగము) మధ్య వ్యాపించినట్లు వారిశాసనములే నిదర్శనములు. మరియు, పశ్చిమమున 77వ విషువాంశరేఖకును (బల్లారి, రాయచూరు, కల్యాణి, నిజామాబాద్‌లేక ఇందూరు, అదిలాబాద్, మండలములకు పశ్చిమభాగము), తూర్పున 82వ విషువాంశరేఖకును (తూర్పు సముద్రపుతీరము) మధ్యనిమిడియున్నది. చాలప్రదేశముదక్షిణాపథపు పీఠభూమిపైని సగటున 1300 అడుగుల కెక్కువ యెత్తున నుండుటచేత శీతోష్ణస్థితి బాగుగ నుండును. గాలియందు తడిలేక చల్లదనముండును. దేశమునందెడారులులేని కారణమున వేడిగాల్పులు తగలకున్నను వేసవికాలమునందు ఎండవేడిమి విశేషముగా నుండును. సంవత్సరమునకుసగటు వేడిమి 82° మాత్రమే. దేశముయొక్క ఉత్తరభాగమున చలిమెండు. దేశమునందడవులు విశేషముగానుండుటచేత ఈశాన్యమూలనుండి వీచు వర్షవాయువు లెక్కువవర్షమును, నైఋతి మూలనుండి వీచువర్షవాయువులు కొద్దివర్షమును ఇచ్చుచుండును.

సంవత్సరమునకు వర్షపాతము దేశముయొక్క ఉత్తరభాగమున 60 మొదలు 120 అంగుళముల వరకును, దక్కిన భాగమున 40 మొదలు 60 అంగుళముల వరకును ఉండును. తూర్పుతీరమున (కంచిమొదలు గోదావరిమండలమువరకు) వర్షములెక్కువగ నుండుటచేతను, నదులు కాలువలు చెఱువులు మెండుగ నుండుటచేతను, భూమి పీఠభూమి గాక నల్లరేగడి నేలయగుట చేతను, ఫలవంతమగుటచేతను, ధాన్యము ప్రత్తి చెఱుకు పైరులు ముఖ్యముగ పండును. పశుసమృద్ధి గల్గియుండుటచేత వ్యవసాయమునకు చాల అనుకూలము. దత్తమండలమున వేరుశనగ, ప్రత్తి, నీలిమందు, జొన్న ముఖ్యమైన పంటలు. నైజాంరాజ్యమునందలి కాకతీయ రాష్ట్రమున పశ్చిమోత్తరభాగమున ప్రత్తియు దక్కిన భాగమున రాగి, నువ్వు, ధాన్యము, నీలిమందును పండును. అడవులు విశేషముగా నుండుటచేత టేకు, మద్ది, సాలకర్ర, విశేషముగా దొరుకును. శింగరేణియందిటీవల రాక్షసిబొగ్గు దొరికినది. కాకతీయుల రాజ్యమున బంగారము, వజ్రములు దొరుకు గనులుండెననియు, ఆకారణమున రాజులు విశేషధనవంతులుగ నుండిరనియు, ఢిల్లికి తర్వాత హిందూదేశమున భాగ్యవంతమైన గొప్పపట్టణమోరుగల్లే యనియు, తెలియును.

జనసంఖ్య తూర్పుతీరపు మండలములలోనే ఎక్కువగ నుండెను. పల్లెలు

ద్రవిడ జాతికి చేరిన హిందువులు. తెలుగువారు గోల్కొండ నుండి తూర్పుతీరము వరకు నివసించిరి. పశ్చిమోత్తరమున మహారాష్ట్రులు (శక-ద్రవిడులు), దక్షిణ పశ్చిమ భాగమున కర్నాటకులు, నెల్లూరు మొదలు కంచి వరకుగల ప్రదేశమున అరవలు, నివసించుచుండిరి. ఆయా జాతులచేత వారివారి భాషలు మాట్లాడబడుచుండెను. ద్రవిడ జాతులే గాక అడవిప్రాంతములందు అనాది జాతులవారు నివసించుచుండిరి. నల్లమలై కొండలలో చెంచులును, ఓరుగల్లుప్రాంతమునందు ఎఱుకలును, గోదావరిమన్యప్రాంతములందు కోయలును, వారివారి భాషలనువాడుచుండిరి. జనసంఖ్య రమారమి నూరులక్షలుండెను.

## విస్తీర్ణము, వర్తకము, రేవుపట్టణములు, నాగరికత.

రాజ్యముయొక్క దక్షిణ పశ్చిమ మూలనుండి (బళ్లారిరాయచూరుమండలములనుండి) బస్తరు వరకు 500 మైళ్ళదూరముండును. ఇట్లే అదిలాబాదుమొదలు కంచివరకునురమారమి 500మైళ్ళు. రాజ్యముయొక్క విస్తీర్ణ మొకలక్షమైళ్ళు. ప్రస్తుతపు నైజాం రాష్ట్రముకన్న ఎక్కువ విరివిగల్గియుండెను. కాకతీయుల శాసనములు దత్తమండలమునను, చిత్తూరు చంగల్పట్టు, నెల్లూరు,జిల్లాలయందును, గంజాం విశాఖపట్టణంజిల్లాలు తప్ప మిగిలిన ఉత్తరసర్కారులలోను, నిజాం రాష్ట్రములోని తూర్పుననున్న7 జిల్లాలలోను దొరికినవి. గనుక, ఈభాగమంతయు వారి రాజ్యమున నిమిడియుండెను. అనగా, ప్రస్తుతపు నిజాంరాష్ట్రమునకు 1½ రెట్లు పైగా విస్తీర్ణము గల్గియుండెనని చెప్పవచ్చును.

గణపతిదేవునికాలమున తూర్పుతీరమును జయించినతోడనే విదేశములతో వర్తకము విరివిగా సాగనారంభించెను. గుంటూరు జిల్లాలోని మోటుపల్లి గొప్ప రేవుపట్టణము. తూర్పున బర్మా, చైనా, తూర్పుదీవులు, సింహళముతోడను, పశ్చిమమున అరేబియా పారసీకము, ఈజిప్టు, దేశములతోడను వర్తకము సాగుచుండెను. గణపతిదేవుని మోటుపల్లి శాసనమునుబట్టి, విదేశవర్తకమువృద్ధి చేయుటకై యాతడు కూఫశుల్కముతప్ప తక్కిన పన్నులనన్నిటిని కొట్టివేసినట్లును, వర్తకులను వారి యోడలను రక్షించినట్లును, తెలియును. ఓడదొంగలను శిక్షించెను. ఆయా వస్తువులపై సుంకములను నిర్ణయముచేసెను. ఆకాలమున శ్రీగంధము, కర్పూరము, ముత్యాలు, దంతము, లోహములు, నూలుబట్టలు, కంబళ్లు, సుగంధ ద్రవ్యములు, మిరయాలు, రత్నములు, ఎగుమతి చేయబడుచుండెను. పట్టుసామానులు, గాజు, చీనాకర్పూరము, పంచదార, గుఱ్ఱములు దిగుమతి యగుచుండెను. ఇట్లే, మచిలీపట్టణముకూడ ఆకాలమున గొప్ప యోడరేవుగాను వర్తకస్థలముగా నుండెను.

కాకతీయుల యొక్కయు యాదవుల యొక్కయు నాణెములు విశేషముగా దొరికినవి. బంగారము, వెండి, రాగి నాణెములు అనేకరకములవి, విలువగలిగినవి, యుండెను. ఆకాలమున మహమ్మదీయ చరిత్రకారులు వ్రాసిన వ్రాతలను బట్టియు, మార్కొపోలో మొదలగువిదేశయాత్రికులవర్ణనలనుబట్టియు క్రీడాభిరామమును శాసనములను బట్టియు, మాడలనియు, గండ గోపాల మాడలనియు,

ప్రతాపమాడలనియు, రుద్రమాడలనియు, నిష్కములనియు, రూకలనియు, ద్రమ్మములనియు, ఫణములనియు, టంకములనియు, వరహాలనియు, చిన్నములనియు, పేర్లుగల నాణెములుగలవని తెలియును. హనుమకొండనుండి ఓరుగల్లునకు బోవుమార్గముననున్న ఖాన్ సాహెబ్ తోటవద్దనున్న శిలాశాసనమునుబట్టి గణపతిదేవుని కాలమున వర్తక సామగ్రిపై నియమితములైన సుంకములు వసూలుచేయబడెననియు తెలియును దక్షిణహిందూ దేశశాసనావళిలోని 734 నంబరు శాసన మిదియె. దానినిబట్టి ఈక్రిందివిషయములు తెలియుచున్నవి—

"శ్రీమన్మహామండలేశ్వర కాకతీయపురవరాధీశ్వర గణపతి దేవమహారాజులు సర్వధారి సం॥ న, శ్రీ వీరభద్రేశ్వర దేవరకు భోగమున కిచ్చిన ఆయం సుగంధములందు మాడకు పాతిక; మిరియాలు, తేనె మొ॥ వాటియందు మాడకు పాతిక; తగరం, సీసం, రాగి, మొ॥ లోహాలందు తులానకు పలము; చందనమున తులానకు పలము; కర్పూరమున వీశకు 2 చిన్నములు; జవాది మాడకు పరక; పట్టునూలు చవరాలు, తులానకు చిన్నము; పసుపు, మాడకు అరవీసము, దంతము పట్టు-మాడకు పాతిక, పవడములు వీశకు చిన్నము; ముత్యము, సదాక్షు, కాటుపూసలు, మణులు; మాడకు వీసము; సిలిమందు మాడకు రెండు వీసములు; పోకలు లక్షకు పాతిక; ఫలజాతులు, ఊరుగాయలు బండికి పాతిక; అపరాలు మానెడు" ఈమొదలుగా సుంకనిర్ణయము చేయబడినది.

అనేకరకముల పరిశ్రములు దేశమునందు వృద్ధిపొందుచుండెను. క్రీడాభిరామమునందు వర్ణింపబడిన సంతలు, వృత్తులు, పలురకముల నగలు, వీటినన్నిటినిబట్టి చూడగా ఆకాలమున వర్తకము దేశములోని వేరువేరు రాజ్యములతోడను, విదేశములతోడను, విరివిగా జరుగుచుండెననియు, ప్రజలుపలుసౌఖ్యముల ననుభవించుచు నాగరికులై యుండిరనియు, తెలియును.



హనుమకొండ సహస్రస్తంభదేవాలయము—ఒకస్తంభము.

By Courtesy of H. E. H. The Nizam's Archaeological Department.

# కాకతీయులు : కళింగము.

మ. రా. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు.

ఓరుగల్లు రాజధానిగా ఆంధ్రదేశమును బరిపాలించిన కాకతీయులకును, గంగవంశ భూపతులచేత పరిపాలితమైన కళింగమునకును ఎట్టిసంబంధము కలదో ఇంతవరకెవ్వరును చర్చించి యుండలేదు. కాకతీయులు కళింగమును గూడ పరిపాలించియుండరా? కళింగగజపతులు కాకతీయ సామ్రాజ్యమున ఎప్పుడైన అధికారము నెఱపియుండిరా? ఈవిషయములు ఇంతవఱకు చక్కగ పరిస్ఫుటముగాని రహస్యములుగనే యున్నవి. వీటికి సంబంధించిన యాకరములను సాధ్యమైనంతవరకు సేకరించి, వీటినిగుఱించి చర్చించుటయే యీవ్యాసము యొక్క యుద్దేశము.

కాకతీయులకును, కళింగమునకునుగల సంబంధమును గుఱించి చర్చించుటకు పూర్వము కళింగముయొక్క సరిహద్దులను గుఱించి యించుక తెలిసికొన వలసియున్నది. కళింగదేశమేది? దానిసరిహద్దులేవి, యను విషయమున చాలయభిప్రాయభేదములుకలవు. తమ ఒరిస్సాదేశచరిత్రమున యమ్. యమ్. గంగులీగారు కళింగమునకు సరిహద్దులనిట్లు తెలిపియున్నారు: (౧) ఉత్తరమున వైతరణీనది (౨) దక్షిణమున గోదావరినది (3) తూర్పున బంగాళాఖాతము (౪) పశ్చిమమున ఒరిస్సాసామంతసంస్థానములు. ఫ్లీటుదొరగారుకూడ "కర్ణాటకమును బరిపాలించిన పాలకవంశములు" అనుతమ గ్రంథమున మహానదీ గోదావరులకు నడుమ వ్యాపించియుండిన దేశము కళింగమని చెప్పియున్నారు. ఉత్తరసర్కారులుకూడ కళింగముననే చేరియుండినట్లు డాక్టరు భండార్కరుగారు తమ 'దక్కనుదేశ ప్రారంభ చారిత్రము' నజెప్పియున్నారు. రాప్సన్ దొరగారు మహానది గోదావరీనదులనడుమనున్న దేశమే కళింగమని తమ 'ప్రాచీనహిందూదేశ' మను గ్రంథమున వ్రాసియున్నారు. కళింగదేశము యొక్క సరిహద్దులను గుఱించి ఇట్లు అభిప్రాయభేదములు చాలకలవు. పశ్చిమోత్తరపూర్వ సరిహద్దులవిషయము నిటులున్నను, మనకు ముఖ్యముగ కావలసినది కళింగము దక్షిణపుసరిహద్దును గుఱించియే. కళింగము గోదావరినది వరకు వ్యాపించియుండెనా? లేదా? చాలమంది గోదావరినదివఱకు వ్యాపించియుండెనట్లు చెప్పుచుండుటచేత మనమును అదిసరియైనదే యని ప్రస్తుత మంగీకరింతము. వ్యాసము ప్రధానముగ కళింగము సరిహద్దులనుగూర్చినది కాదు కనుక, ఈచర్చ యింతటితో కట్టిపెట్టి, అది యొకవేళ గోదావరినదివరకు గూడ వ్యాపించి యుండెననియే నమ్మెదము. ఈనమ్మకమునకు గూడ మనకించుక ఆధారము లేకపోలేదు. క్రీ.శ. పదుమూడవశతాబ్దిలో నుండిన మంచన కవి తనకేయూరబాహుచరిత్రమున పిఠాపురము కళింగములోనిదిగనే వర్ణించియున్నాడు. అదియునుంగాక కళింగదేశమును పరిపాలించిన మాఠర వంశప్రభువైన వాశిష్ఠీపుత్ర శక్తివర్మమహారాజు రాజధాని పిఠాపురమే. ఈకారణములవలనగూడ పిఠాపురము మొదలుగా గల యుత్తరదేశమైనను కళింగములోనిదిగనే నిర్ణయింపవచ్చును.

కాకతీయుల శాసనములేవియు కళింగమున గనబడకపోవుట వలన దానికి సమీపస్థదేశమునందలి శాసనముల వలననే కాకతీయులకు, కళింగమునకు గల సంబంధమును

సర్వ్రాంత పాలించి యుండెను.

కాకతీయుల మొట్టమొదటి శాసనము త్రిపురాంతకమున, అనగా గోదావరి మండలములోని ద్రాక్షారామమున త్రిభువన చక్రవర్తి రాజరాజదేవుని ౧౩వ విజయరాజ్య సంవత్సరమున గాన్పించుచున్నది. ఇందు అస్మద్గురుడు రుద్రదేవుని ప్రెగ్గడ ఇవంగల బ్రిమ్మిరెడ్డి ద్రాక్షారామ భీమేశ్వరునికి దీపదానము చేసినట్లు కలదు.[1] కాకతి రుద్రదేవరాజుదే ద్రాక్షారామమున మఱియొక శాసనముకలదు.[2] అది రాజరాజు ౨ (౩)వ విజయరాజ్య సంవత్సరమునాటిది. కాకతి రుద్రదేవ రాజుల ప్రెగ్గడను దన్నమదేవులు భీమేశ్వరునికి దీపదానము చేసెనని యీశాసనము తెలుపుచున్నది. ఈ రెండు శాసనములలోను శకవర్షసంఖ్య లేక పోయినను, రాజరాజదేవుని విజయరాజ్య సంవత్సరములు తెలుపబడి యుండుటచేత శకవర్షమును దెలిసికొనవచ్చును. పై శాసనములందు పేర్కొనబడిన రాజరాజదేవరు రెండవ కులోత్తుంగుని యనంతరము చోళరాజ్యమును పరిపాలించినవాడు. శాసనములనుబట్టి యతడు శకవర్షము ౧౦౬౭-౧౦౬౮ లో సింహాసనము నెక్కినట్లు తెలియుచున్నది. దీని ప్రకారము కాకతిరుద్రదేవుని మొదటి శాసనము శకము ౧౦౮౪-౧౦౮౫లోను, రెండవశాసనము శకము ౧౦౮౦-౧౦౮౧లోను వేయబడినవని తెలియును. ఈ పై రెండు శాసనములుమగాక, ఇతని శాసనములు ద్రాక్షారామమున మఱి రెండుకలవు. అందొకటి శకము ౧౧౦౧ నాటిది.[3] రెండవది శకము ౧౧౦౮ నాటిది.[4] ఇవి రెండునుగూడ భీమేశ్వరస్వామికి చేయబడిన దానములనే తెలుపుచున్నవి. అటుప, దడప రుద్రదేవని శాసనములు మనకు ద్రాక్షారామమున గాన్పించుచునే యున్నను, ఇప్పటి గోదావరీ మండలపు సరిహద్దుల కావలిదేశమున మాత్రము ఒక్కటియు గనబడదు. ఇన్ని శాసనము లున్నను అవి యొక్క చరిత్ర విషయమునైన దెలియజెప్పుట లేదు.

ఈకాలమున వేంగిదేశ మంతయు వెలనాటిచోళుల స్వాధీనమునను ండెను. వెలనాటి చోళులకును, కాకతీయులకును గల సంబంధమెట్టిదియో మనకు తెలియదు కాని శాసన సహాయమున మనమీవిషయములు గొంత తెలిసికొనవచ్చును. పల్నాడు, సత్తెనపల్లి, గుంటూరు, తెనాలి, బాపట్ల, కొంతవఱకు నర్సారావుపేట తాలూకాలు—గుంటూరు మండలములోని వన్నియు—వెలనాటిచోళుల యధికారమునే దలదాల్చెను. ఈరీతిని గుంటూరు మండలమేకాక కర్నూలు మండలములోని త్రిపురాంతకము వఱకు వారిరాజ్యమువ్యాపించియుండెననుటకు త్రిపురాంతకములోని వారిశాసనములే తార్కాణము. త్రిపురాంతకము వఱకు వ్యాపించిన వెలనాటి చోళరాజ్యమునకు కాకతీయరాజ్యము సరిహద్దుననున్నది. మొదటికాకతి ప్రతాపరుద్రుని శాసనములు త్రిపురాంతకమునను, తూర్పున గోదావరిజిల్లాలోనుకూడ గనబడుటచేత, కాకతీయులు తమరాజ్యమును ప్రాగ్దిశ విస్తరింపజేసికొనుటకై కాకతి ప్రోలరాజు నుండియో, లేక యాతనికొడుకగు మొదటి ప్రతాపరు

1 S. I. Insc, Vol IV. no 117.
2 S. I. Insc Vol IV. no 1095.
3 Elliot's collection, 15—6—26, P 207.

డ్రని కాలమునుండియో, ప్రయత్నింపుచు వచ్చిరనుటకు సందియములేదు. ఈప్రయత్నము కాకతి ప్రోలరాజు కాలముననే జరిగియుండ వచ్చును. కాని తండ్రికంటె కొడుకేఎక్కువ జయశీలుడనియు, తండ్రివేసిన పునాదులను బలపఱచి సామ్రాజ్యమును నిర్మించుటకు కొడుకే గొప్పప్రయత్నము చేసెననియు, శాసనములను బట్టి మనము నిశ్చయింప వచ్చును. ఈవిధమైన ప్రయత్నములలోనే కాకతీయులకును వెలనాటిచోళులకు నొకరికొకరికి శత్రుత్వ మేర్పడెను. ఇట్లనుటకు మనకొక యాధారముకూడ గలదు. వెలనాటి రెండవ చోడయరాజు (శక ౧౦౮౫–౧౧౦౩) శాసన మొకటి దాక్షారామమున గలదు.[5] అది శక వర్షము ౧౦౯౧ నాటిది ఆశాసనము నందలి ప్రశస్తిలో చోడయరాజు "కాకతిప్రోల నిర్దహన" అని కీర్తింపబడి యున్నాడు. దీని ననుసరించి యతడు కాకతి ప్రోలరాజును దహించినవాడు అని తేలుచున్నది. కాకతిప్రోలరాజు శాసనములు ఇంతవఱకు రెండుమాత్రమే తెలియవచ్చినవి. (౧)శకము ౧౦౩౯ నాటిది[6] (౨) శకము ౧౦౩౫ నాటిది.[7] వీటిలో మొదటిశాసనమున నొక ప్రోలరాజు పేర్కొనబడెను. అతడితడగునా కాదా యని యించుక సంశయింపవలసి యున్నను రెండవది యాతని దగుట నిశ్చయము. ప్రోలరాజకుమారుడైన మొదటి రుద్రదేవని మొదటిశాసనము శ ౧౦౮౦ నాటిదే.[8] రుద్రదేవరాజు ఎప్పుడు రాజ్యమునకు వచ్చినదియు మనకు నిశ్చయముగ దెలియదు. వెలనాటి చోడను కాకతిప్రోలని దహించిన దెప్పుడో మనము నిశ్చయముగ జెప్పలేముకాని యీాపని నాతడు యువరాజుగనుండినప్పుడో లేక, సింహాసన మెక్కిన మొదటిదినములలోనో, చేసియుండవచ్చును. వెలనాటిచోళులకును, ఓరుగంటి కాకతీయులకును ప్రోలరాజునాటినుండియు శత్రుత్వముండుటచేతను, వెలనాటిచోళరాజ్యమైన దాక్షారామప్రాంతమున ప్రోలరాజు కుమారుడైన రుద్రదేవుని శాసనములు కాన్పించుచుండుటచేతను ఆప్రాంతమునకు రుద్రదేవరాజు దాడివెడలియుండునని యూహింపదగి యున్నది. ఈప్రాంత మంతయు నీతడు జయించినందువలననే ఈతని రాజ్యమునకు దూర్పుదిశను లవణజలధియే సరిహద్దయ్యెను. ఈతనిరాజ్యవిస్తృతి అనుమకొండ శాసనమున[9] నిట్లు తెలుపబడినది.

> రాజ్యం ప్రాచ్యాం లవణజలధే స్తీరపర్యన్తమస్య
> శ్రీశైలాన్తం ప్రసృతిసదా దక్షిణస్యాం పరాస్యాం
> ప్రాక్పశ్చాత్యాన్తా కటకనికటస్థాయినీ రాజ్యలక్ష్మీ
> కౌబేర్యాశాంతవిలసితా మాల్యవన్తం గిరీశే

శకము ౧౧౧౫కి పిదప రుద్రదేవని శాసనములు గోదావరిమండలమున గానరావు. ఈశాసనములవలన కాకతీయులు కళింగము సరిహద్దులవఱకు వచ్చిరని స్పష్టపడుచున్నను, కళింగముపై దండెత్తిరో లేదో, తెలియుటలేదు.

మొదటి ప్రతాపరుద్రుని యనంతరము రాజ్యమున గొంత సంక్షోభము కలిగెను. మహాదేవచక్రవర్తి రాజ్యభారమును వహించెను. ప్రతాపరుద్రుడు గతించిన సంవత్సరమేదో, ఆతని సోదరుడు మహాదేవరాజు రా

5 S. I. I. Vol IV, no 1242.
6 Ep. coll. 316-1915.
7 Ep. Ind. Vol IX, P 256.
8 S. I. I. Vol IV. no 1107.
Ind. Ant. Vol- XI.

జ్యమునకు వచ్చిన సంవత్సర మేదో, మనకు స్పష్టముగ దెలియదు. శకము ౧౧౧౬ నఱకు మొదటి రుద్రదేవుడు రాజ్యము చేయుచుండినట్లు శాసనముల నిదర్శనము కలదు.[10] గణపతిదేవ చక్రవర్తి యొక్క ౨౨ వ విజయరాజ్యసంవత్సరము శకవర్షము ౧౧౪౨ అయినట్లు అతని త్రిపురాంతక శాసనము[11] వలన దెలియుచుండుటచేత అతడు శకవర్షము ౧౧౨౧లో సింహాసన మెక్కినట్లు స్పష్టమగుచున్నది. కావున శకవర్షములు ౧౧౧౬, ౧౧౨౦ల లోపుననే మొదటిరుద్రదేవుడు కాలముచేయుటయు, అతనివెనుక మహాదేవరాజు సింహాసనమెక్కి కొంతకాలము రాజ్యముపాలించి కాలవశుడగుటయు సంభవించినట్లు తెలియదగియున్నది. మహాదేవరాజు మూడునాలుగు సంవత్సరములకంటె ఎక్కువ కాలము రాజ్యముచేయలేదు. మొదటి రుద్రదేవుని మరణానంతరము కాకతీయసామంతులు కొందఱు తిరుగబడి దేశము నల్లకల్లోలము కావించిరని పాలంపేట శాసనములోని[12] యీక్రిందిశ్లోకమువలన దెలియుచున్నది.

శ్రీరుద్రదేవనరాధిపే కృపమహీపాలాద్రి వజ్రే ... వసుమాతే కాకతినాథభోగ్యవిలసత్ పృథ్వీకగా
ఖడ్గకోశసంభ్రాంతాః సముద్ధితాః పరభసాస్తైం క్షమాపాలకాః యేకగీర్గా—గణాంగణేషు విజితా విఖ్యాతః (విక్రాంత)తివా॥

మహాదేవరాజు రాజ్యము కూడ ప్రశాంతముగ నుండినట్లు గనబడదు. కాకతీయులకును, యాదవులకును యుద్ధములు జరుగుచుండెను.[13] ఈకారణమువలన సమయము కనిపెట్టినవారై ప్రాగ్దేశముల నున్న మాండలికులు స్వాతంత్ర్య పతాకములనెత్తిరి. వీరి నందఱను జయించి రుద్రదేవుని సామ్రాజ్య సంస్థాపన ప్రయత్నమును సఫలముచేసి రాజ్యమును, తాతతండ్రుల పేరుప్రతిష్ఠలను, గాపాడవలసిన భారము గణపతిదేవునిపై బడెను. రాజ్యమున కంటకములవలె నున్న యీ మాండలికులనుజయించుటకుపూర్వముగణపతిదేవుడు చుట్టుపట్టులనున్న సామంతులు కొందఱితో సంబంధబాంధవ్యములుచేసితనస్థితిని, రాజ్యమును కట్టుదిట్టముచేసికొనెను.[14] రాజ్యము నీరీతినికట్టుదిట్టము చేసికొనినపిదపఆతడుపూర్వదిగ్విజయ యాత్ర సాగించెను. శకవర్షము ౧౧౧౮కితరువాత దాక్షారామమునగానవచ్చు మొదటి కాకతీయశాసనము శకము ౧౧౩౪ నాటిది. ఇది 'కాకతిరాజ్యసమర్థు' డని బిరుదందిన రేచర్ల రుద్రరెడ్డి సామంతుడు రాజ

10 ఆంధ్రపత్రిక, సారస్వతానుబంధము, రుధిరోద్గారి, భాద్రపదమాసము.

11 Ep. coll. 196 (1905).

12 Hydarabad Archaeological Series, No. 3, P 4 Verse 21.

13 Historical Sketches of the Ancient Dekkhan K. V. S. Aiyer, Bhandarkar's Early History of the Dekkan.

14 వెలనాటిని జయించి గణపతిదేవుడు జాయపనాయకుని వశపఱచుకొని, అతనిసోదరీమణులైననారమ పేరమలను వివాహమాడి, జాయపనాయకుని తనగజసైన్యమున కధిపతిం గానిచెను. E P. Ind. Vol III, P 84. గణపతిదేవుడు తనసోదరి మేలాంబికను నాతవాటివిషయాధిపతియైన బుద్ధరాజు కొంకవెలోడుగు రక్కడి నల్లిరుద్రునకిచ్చి పెండ్లిచేసి, నాతవాటిరాజులతో బంధుత్వము నెఱపెను. (EP. coll. 204-1903) ఇందువలన నతవాటి రుద్రుడు గణపతి మఱందియని శాసనముల కెక్కినాడు. EP. Ind. Vol IV, P 159. Text line 8). ఇట్టి సంబంధములమూలముననే గణపతికూతురు గణపాంబ అమరావతి ప్రభువగు కోటబేతరాజు భార్యయయ్యెను. (EP. Ind. Vol III, P 94). కోట కెందవకేతరాజు భార్యలలో కాకతివంశపు నాగమ గలదు (EP. coll, 261, 262-1897); (కాని యీమెకును గణపతికిని బంధుత్వ మున్నదో లేదో?)

నాయకునిది. ఇందువలన రాజనాయకుని సైన్యాధిపత్యమున కాకతీయవాహిని కళింగ ప్రాంతములను జయించినట్లు తెలియుచున్నది. గణపతిదేవుని ఉప్పరపల్లిశాసనము[15] కూడ పై విషయమును ధ్రువపఱుచు చున్నది. అందు రేచర్లరుద్రునకు ప్రధానియైన రాజనాయకు డిట్లు కీర్తింపబడి యున్నాడు.

కులతిలకుడు కను ధామర
జలధి సుధాకరు డశేషజన నుతచారుం
డలఘుడు రిపుకరుదావా
నలుడనగా బరగై రాజనాయకుడుర్విన్.

ఈతని విజయములు పైనుడివిన శాసనమున ఇట్లు వర్ణితములైనవి.

"బొక్కెరలోని వీరభటావలి వధించి గోధుమ
జాతి తలద్రుంచి ఉదయగిరి సాధించి పడినాయు
దిందోలి దక్షారామ భీమేశ్వర దేవర కక్షయ
దీపంబులు నిల్పె..."

బొక్కెర అనునది గంజాంజిల్లా ఆస్కా తాలూకాలోని బొక్కెరయని శాసనపరిష్కర్తలు వ్రాసియున్నారు. వారు ఉదయగిరి రూపాంతరముగ నున్న ఉదగిరిని నెల్లూరు మండలములోని ఉదయగిరిగ గుర్తించుచున్నారు; కాని యది పొరపాటగునేమో? ఇదికూడ విశాఖపట్టణమండలములోనిదిగాని, గంజాంమండలములోనిదగాని, యగునని నాయూహ. ఉత్తరమున కళింగజైత్రయాత్రకు వెళ్ళి బొక్కెరను, ఉదయగిరినిజయించి తిరిగి దాక్షారామము వచ్చి, భీమేశ్వరునికి అక్షయదీపంబులు నిల్పి, రాజనాయకుడు పిదప ఓరుగంటికి మఱలిపోయెననుటయే సమంజసముగ గన్పట్టుచున్నది. జయించినట్లు తెలుపబడిన రాజులైనను ఎవరో, ఎక్కడివారో, తెలిసికొనుట కవకాశము లేనందున వారి మూలముననైనను స్థలనిర్దేశము చేయుటకు వీలుకలుగుటలేదు. ఎట్లయిననేమి, ఈశాసనాధారమున కాకతీయులు కళింగమును జయించిరని నిశ్చయింపవచ్చును. పైనుడివినదే గాక కాకతిగణపతిదేవుని కళింగయుద్ధములను దెల్పునట్టి శాసనములింకను గలవు.[16] గణపతిదేవుని మోటుపల్లిశాసనమున[17] గూడ అతడు కళింగముపై దాడివెడలినట్లు సూచించు నీక్రిందిశ్లోకము కలదు.

కుండశాలాఖ్య దవైరావణ కటకరణక్షోభసంభ్రాంత
భృంగీ సంగీతాకల్పకల్ప ద్రుమవనవిటప ప్రాంతదో
లాధిరూఢా గాయం గాయం రమతే సురపుర
సదృశో విక్రమం యస్యశౌర్య క్వం గ్రామారంభ
లం బాపటహారవ మకాలంకతా మృక్కలింగం॥

గణపతిదేవుని ఏకామ్రనాథ శాసనమున[18]

యకృదయకృత చేతోరింధణ స్పింహాసో య
చ్చాటుల సుభటఘాటీ దత్త భంగః కళింగః
అపిచయ దుపసేవాజీవినో లాటగౌడా
గణపతినృపతేః కః శ్లాఘతేవిక్రమాయ॥

అని కలదు. ఇదియు కళింగవిజయసూచకమే. గణపతిదేవుని పాఖాలశాసనములో[19] కూడ

కాశీనాథః కళింగః శశధరణి పతిమ్మాళవః కేరళేశ
స్సామ్రాణ్ణో హారాణభూపః కురుపతి రరిమర్దాధి
పో మాగధేశః నేపాళశ్చోళ పృథ్వీపతిరపి వినతా
నగ్రతో రాజవర్గా నామగ్రాహంగృహీత్వాసదసి
సదసి యద్గ్రాహ్యకాదగ్రాయంతి॥

అని కళింగ విజయ సూచనకలదు కాని కాశీనాథ, శశధరణిపతి, మాలవ, కేరళ, కురుపతి, మాగదేశము, నేపాళాధిపతులను, అందఱినివరుసపెట్టిజయించినట్లుండుటచేత ఈవిజయ

15 Hyderabad Archaeological Series, No. 3, P 16.
16 EP. Ind. Vol III. P 84; Ind. Ant. Vol XXI, P 188.
17 EP. Ind. Vol XII. P. 188. 18 Ind Ant. Vol XXI, P 197.
19 Hyderabad Archaeological Series, No 4 P 5.

ములని చెప్పుకొనబడిన వన్నియు వట్టిబూటకములుగనే పరిగణింపవలసి యుండుననుటకు సందియములేదు. అయినను తుమ్మాణ, కళింగములు పరిహద్దు రాజ్యములగుటచే నిందు రవంతయేని సత్యముండకపోదని యనుమానింపవచ్చును. ఇదియునుంగాక, ఒడ్డాది మత్స్య వంశజుడైన అర్జునదేవని 'దిబ్బిడ' తామ్రశాసనమున వీరపల్లి తాలూకాలోని 'దిబ్బిడ' గ్రామము సరిహద్దులలో "కాకతిఖండి' అనునది, యొకసరిహద్దుగ దెలుపబడినది. అదిగ్రామమో యేమో? ప్రాయికముగ కళింగమున ఆసరిహద్దువఱకు అనగా విశాఖపట్టణమండలములోని వీరపల్లి తాలూకావఱకు కాకతీయ రాజ్యము వ్యాపించి యుండెనేమో! రాజనాయకుని దాక్షారామ శాసనము శకవర్షము ౧౧౩౮ నాటిది. గనుక కాకతీయులకు కళింగ విజయము అంతకుపూర్వమే సంభవించినదని చెప్పవచ్చును. కాకతీయులు కళింగమును జయించి పరిపాలించిరనుటకు పూర్వోదాహృతోదాహరణము లన్నిటికంటెను బలవత్తరమైన మఱియొక ప్రమాణముకలదు. కొలని గణపతిదేవుని 'శివయోగసారము'న, ఇందులూరి పెదమల్లవిభుని కుమారుడైన సోమమంత్రి కాకతి గణపతిదేవునికి ప్రధానమంత్రి యనియు, దండనాథుడనియు, ఇతడు ఓరుగంటికి దూర్పుభాగమున నుండెడి దేశములను మాత్రమే కాక కళింగములోని భూములను గూడ జయించెననియు, నిట్లు వర్ణింపబడియున్నాడు.[20]

ఇలబవరుసైన్యముల్ గొలువ వేకశిలాపురి తూర్పు
దిక్కునం గలరిపు భూములెల్ల గొని గర్వముమై...
...మండలీకుల నవలీల దోలి నురిగోసుల నా
దుకు గొల్చివీడు నావెలసిన దుర్గముల్గొనుచు వేగ
మె గౌతమిదాటి యిమ్ముల౯॥
మాడియు గడుంగొని యూ
డాడెడి పన్నెండు మన్నియముల నోడిదిశా
నాడె కళింగయ నీడుకు
గూడిన భువిగొనియె సోమకుల ముఖ్యుడొగి౯
లీలగొలనుమండ లీకుల వెలదోల
గొలనివీడు దాను గొనటజేసి
కాకతీశుడైన గణపతి యాదను
కొలని సోముడనగ వెలసె జగతి॥

సోమమంత్రి కళింగమును జయించుటే కాక కృష్ణాగోదావరీనదుల నడిమి దేశమును, కొలనినాయకులచే పరిపాలితమగు దానినికూడ జయించినట్లుపై పద్యములవలన దెలియుచున్నది.

ఈ కాలమున కాకతి గణపతిదేవునికి సమకాలికులై కళింగమును బరిపాలించుచుండిన గంగ వంశపురాజులు ఇరువురు కలరు. (౧) మూడవ అనంగ భీమదేవు. ఇతడు మనోమోహ౯ చక్రవర్తిగారి పరిగణనము ప్రకారము శకవర్షము ౧౧౩౩ మొదలు ౧౧౬౦ వఱకు పరిపాలించెను (౨) అతనికొడుకైన మొదటి నరసింహదేవు చక్రవర్తిగారి పరిగణనమునను సరించి శకవర్షము ౧౧౬౦ మొదలు ౧౧౮౬ వఱకు పరిపాలించెను. కాకతీయులు కళింగముపై దండెత్తి జయించుటకు వీరిరువురిపరిపాలనకాలమే చాలయుక్తముగనుండెను. ఏలయన ఉత్తరహిందూస్థానమున కంతకు సంభవించిన మహమ్మదీయ విప్లవోపద్రవము ఈయనంగభీమదేవుయొక్కయు, ఈతని తండ్రి రాజరాజుదేవు యొక్కయు, కాలముననే సంభవించెను, బఖ్తియార్ ఖిల్జి ప్రారంభక ప్రోత్సాహములవలన మహమ్మదీయులు ఉత్తర వుతట్టునుంచి కళింగ గంగవంశపురాజ్యము

20 శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారి వ్యాసము, ఆన్ధ్రయుదేవుడు, విం[illegible]చరిత్రాంశములు, సుభాషితం ౧ పుట ౭౨.

నెదుర్కొనుచుండిన కాలముననే కాకతీయులు ఉత్తరముగదమరాజ్యమును కళింగమున వ్యాపింపఁజేసుకొనుచుండిరి. ఈమూడవ యనంగ భీమదేవు కాలముననను, అతనికుమారుడు మొదటి నరసింహదేవు కాలముననుగూడ మహమ్మదీయ సేనావాహిని తడవతడవకు సముద్రపు పొంగువలెవచ్చి, కళింగోత్తరభాగముపై ప్రవహించి దానిని ముంచెత్తుచునే యుండెను. మహమ్మదీయులతోడి యాపోరాటములలో వారిని జయించి కొంచెము విశ్రాంతిగైకొని తేరుకొన్నమీదట గంగవంశ భూపతులు వేంగీదేశముపై దృష్టిమఱల్చిరి. ఈ కాలమున అనియంకభీముని శాసనములు రెండు దాక్షారామమున గాన్పించుచున్నవి. అందొకటి శకము ౧౧౫౭ నాటిది.[21] రెండవది శకము ౧౧౫౫ నాటిది.[22] మొదటిది అనంగభీముని దండాగ్రేసర వల్లభుడును, ఖడ్గసింహుని అగ్రపుత్రుడును అయిన"శ్రీమజ్జెసాజ"కుని ధర్మశాసనము. రెండవశాసనము చెడిపోయినది. ఇందు రాజరాజు కుమారుడును, హరిపద ప్రియరావుతాఖ్యుడును అగు "అనింక్కభీముడు" (అనంగ భీముడు లేక అనియంకభీముడు) పేర్కొనఁబడియున్నాడు. అటుపిదప దాక్షారామ భీమేశ్వరునికి చేయఁబడిన దానమును వర్ణించుసందర్భమున కొన్నియక్షరములు పోయినవి. తరువాత.,,.. ...,వ్రజకేన,ద్రుతజితవిలసద్వేంగిభూమండలేన, అనికలదు. అంతటితోసీశాసనము ముగియును. అనియంకభీముని దండాగ్రేసర వల్లభుడు "జెసాజకు" డని మనకు తెలియునుగనుకను, శకవర్షకాలముకూడ మొదటి శాసనకాలమునకు సమీపమున నుండుటచేతను రెండవశాసనమందలి ,,. వ్రజకేన యనునది "జెసాజకేన" అని యుండదగునని నానమ్మకము. తరువాతి "ద్రుతజితవిల సద్వేంగీమండలే," అనునది "జెసాజకు"నికి విశేషణము. ఈవిశేషణము ననుసరించియే అనియంకభీముడు వేంగీమండలము నమల కాకతీయులనుండి జయించెనని నిశ్చయింపవచ్చును. దక్షిణకళింగముననే కాక అనంగభీముడు వేంగినిగూడ కాకతీయులనుండి జయించెననుటకు ఈశాసనములే మనకాధారములు.

కాకతిగణపతిదేవని ప్రధానియైన మల్లల హేమాద్రిరెడ్డియొక్కయు, కాకతిగణపతిదేవరాజుల గజసాహిణియు అనుంగు అయిన జాయపనాయకుని యొక్కయు, శాసనములు దాక్షారామమున వరుసగా శకము ౧౧౫౫ లోను,[23] శకము ౧౧౭౫ లోను,[24] మనకు కాన్పించుచున్నవి. వీటిమూలమున వేంగివైపు కాకతీయుల యుత్తరపు సరిహద్దు సురక్షితముగ నుండలేదనియు, స్థానికులైన సామంతులవలననో, లేక కళింగాధిపతుల వలననో, వారి మండలికులవలననో, కాకతీయుల యుత్తర రాజ్యమునకు ఉపద్రవము సంభవించుచునే యుండెననియు, అకారణముననే కాకతిగణపతి మహాప్రధాని మల్లల హేమాద్రిరెడ్డియు, అనుంగుజాయపనాయకుడు నిటుగావలసివచ్చెననియు, వారి శాసనములు దాక్షారామమున గనబడుటకు అప్రాంతపు 'కల్లోలము'లే కారణములై యుండుననియు, ఊహింపవగియున్నది ప్రాయికముగ, కాకతీయరాజ్యమిట్టి విపత్పరంపరలకు లోనైన కాలముననే

---

21 S. I. I. Vol IV. No 1360.
23 S. I. I. Vol IV. No. 1339.
22 S. I. I. Vol IV. No 1252.
24 S. I. I Vol. IV. No 1045.

కావచ్చును, పాండ్యదేశాధిపతియైన జటా వర్మసుందరపాండ్యుడు విక్రమించి, కాకతీయ సామంతులను కంచినుండి తరుమగొట్టి దానిని స్వాధీన పఱచుకొనెను. ఈకాలముననే గణపతి దేవచక్రవర్తి పాదపద్మారాధకుడైన కాలపనాయకుడు వేంగీవిషయమునకు అధిపతిగ నియమితుడయ్యెను. శకవర్షము ౧౧౭౬ నాటి అతని యొక్క శాసనమున[25] అతనికి 'వేంగీ విషయాధినాథ' యను బిరుదముండుటయే యిట్టి యూహ కెడమిచ్చుచున్నది.

కాకతి గణపతి దేవచక్రవర్తి శకవర్షము ౧౧౮౧ లో కాలగతినొందెను. అతని యంత్యకాలమునను, ఇంచుక అనంతరమును గూడ కాకతీయ సామంతులు అవస్యవనోద్భవులైన మహారాజ సింహాదులు వేంగీవిషయము కళింగ గంగభూభుజులకు వశముగాకుండ దానిని గాపాడుచునే వచ్చిరి. వీరిశాసనములును[26] దాక్షారామమున శకవర్షము ౧౧౮౪ ప్రాంతముల గానవచ్చుచునే యున్నవి.

గణపతిదేవచక్రవర్తి యనంతరము అతని కూతురు ఓరుగంటిసింహాసనము నధిష్టించెను. కాకతీయ సామ్రాజ్యమునకు మఱల శత్రువుల వలన ఉపద్రవము సంభవించెను. ఈసమయమున కాకతీయ మండలికులుకూడ గొందరు తిరుగబాటుచేసిరి. దక్షిణదిశనుండి కాకతీయ సామ్రాజ్యమును పాలించుచుండిన కాయస్థ కులాన్వయులును, బ్రహ్మారాక్షస గండబిరుదాంచితులునైన జన్నిగ దేవమహారాజు త్రిపురాంతకదేవ మహారాజు, అంబదేవ మహారాజు మొదలైనవారు రుద్రమదేవి యాధికారమును ధిక్కరించి స్వాతంత్ర్యధ్వజమును బ్రతిష్టించిరి. వీరు తమ శాసనములందెచ్చటను తాము రుద్రదేవ (రుద్రమదేవి) పాదపద్మారాధకులమని చెప్పుకొని యుండలేదు. ఇదియేసమయమని కంచిని జయించిన జటావర్మసుందర పాండ్యుడు మహారాజసింహుని గూడ లోబఱచుకొని, యాతని మైత్రిసంపాదించుకొని, ఆంధ్రదేశముపై దాడివెడలి విక్రమసింహపురమున (నెల్లూరు) వీరవిజయాభిషేకము గావించుకొనెను.[27] సుందరపాండ్య మహారాజసింహులు నెల్లూరికుత్తరమున కృష్ణానదీతీరము వఱకుగల దేశమునుగూడ జయించిరని చెప్పుటకు దగిన యాధారములు లేవు గాని, నెల్లూరివఱకుగల దక్షిణాంధ్రదేశము వారి స్వాధీనమయ్యెనని చెప్పుటకు సంశయములేదు. కృష్ణానదీ ప్రాంతములనున్న కాకతీయ మండలికులు-గుంటూరువారు కూడ-విప్లవపు బావుటాలనెత్తియుందురు. వీరు భారద్వాజగోత్రులు, ఖట్వాంగధ్వజులు, కాంచీపుర వరేశ్వరులు, కదువాయ పఱఘోషణులు, పల్లవకులతిలక పదాంబుజసేవితులు. గణపతి దేవచక్రవర్తి కాలమున వీరు అడగిమడగి యుండి, యాకాకతిమార్తాండు దస్తమించిన వెనుక వీరును, స్వాతంత్ర్య ప్రయత్నముల దగిలియుందురు. ఈకారణమునంజేసియే యైయుందును, రుద్రమదేవి సేనానులు వీరిపై దృష్టిమరల్చిరి. కాకతి గణపతిదేవచక్రవర్తి యంత్యకాలమున నుండిన గుంటూరిమండలికుడు నాగదేవరాజు. రుద్రమదేవియొక్క సకల సేనాధిపతి పట్టసాహిణియైన పడికము

---

25 S. I. I. Vol IV. No 602.

26 S. I. I. Vol IV. Nos 1341, 1342-A, 1342-B.

27 శ్రీయుత్ వెంకటరమణయ్యగారి ధాన్యకటకము; కొప్పెఱుంజింగడు, భారతి సం॥ ౧౨౮౨ పుట 644.

బాప్పదేవనికి అతని త్రిపురాంతకము శాసనమున[28] "గోదావరీతీర సమరగాండీవి' యనియు, 'గొంటూరి నాగదేవతల గొంటుగండ' యనియు, "కళింగమండలిక ధాటీసమర్ధరాయ కువర తొండపాడి రాయకు వరువడి ఘూణమల్ల' యనియు, 'కాకతీయగణపతిదేవ మహారాజదివ్య శ్రీపాదపద్మారాధక' యనియు బిరుదములు కలవు. రుద్రమదేవి సింహాసనమెక్కిన రెండవయేట; అనగా శకవర్షము ౧౧౮౩లో వేయబడిన శాసనమునందే యివి యన్నియు గనబడుటచేత, గోదావరీతీర ప్రాంత మంత సంక్షుభితముగ నుండెనదియు మనము దెలిసికొనవచ్చును. అదియునుంగాక ఈకాలమున కళింగమండలికు లాప్రాంతమును కలవరపఱచుచుండినట్లు తెలిసికొనుటకుగూడ ఆశాసనమునందే సూచనలుకలవు.

కాకతీయసామంతుల శాసనములు దాక్షారామమున శకవర్షము ౧౧౬౧ వఱకు గానవచ్చుచున్నవి. ఈప్రాంతమున శకవర్షము ౧౧౯౬ ప్రాంతమున కళింగ గంగవంశప్రభువైన గజఘటాపతి మొదటి భానుదేవుని యొక్కయు, కళింగమండలికులైన చాళుక్య విజయక్షితీశ, ఒడ్డాది అర్జునదేవుల శాసనములు[29] గాన్పించుచుండుటచేత వీలుచిక్కినప్పుడెల్ల కళింగ మండలికులును, దేశాధిపతులును గూడ కాకతీయ భూపతులకే ప్రాంతమున గొంతయలజడిని కలిగించుచునే వచ్చినట్లు మనము విశ్వసింపవచ్చును. పైనుడివిన వీరిశాసనములన్నియు శకవర్షములు ౧౧౯౬ ౧౧౯౭, ౧౨౧౯ నాటివి. ఈయలజడికాలమున విక్రమ పౌరుషములు నెఱపి పేర్ప్రతిష్ఠలం బడసినవారు కొందఱుండిరని కాకతీయ శాసనములు తెల్పుచున్నవి. రుద్రమదేవి సామంతులలో పోతినాయకుడొక్కడు. ఇతనికి సూరప, పోతయ, మారయ అను కొడుకులు కలరు. వీరందఱును కళింగ గజపతులతోడి యుద్ధములందు విజయమునొంది సుప్రసిద్ధులైనవారలే. పోతయ, మారయలిరువురికి "కటకము' నాశనముచేసిన వారనియు, గజపతియను వనగజమునకు సింహమువంటివారనియు, బిరుదములు కలవు. ఈబిరుదములను పేర్కొనిన శాసనము[30] శకవర్షము ౧౧౯౯ నాటిది. అందువలన వారీయలజడి కాలమున సామ్రాజ్యమునకు జేసినసేవవలననే వారికీ బిరుదగౌరవము లభించినట్లు విశ్వసింపవలసియుండును. ఈయలజడికాలమున సామ్రాజ్యమును రక్షించినవారలితరులిక నెవ్వరును లేరనికాని, ఇక నెవ్వరు నటువంటి వీరకృత్యములు జరుపలేదనికాని భావింపరాదు. ఈకాలమున నిట్టి బిరుదములతో శాసనములవలన దెలియవచ్చిన వారు వీరేయగుటవలన వారేయిచట పేర్కొనబడిరి. ఇంకను ఇట్టివారు సామ్రాజ్యసంరక్షకులుండక పోలేదనుటకు నేనుబ్రకటించిన పులిదండి శాసనమే[31] తార్కాణము. ఇది శకవర్షము ౧౨౧౦ నాటిది. ఇందలి దాతయైన నల్లపనాయుని పోలినాయునికి "పాణ్యాంధాళరాయ ధూమకేతు', 'కాళవరాయ దిశాపట్ట', "సేవణరాయ లవణి పాంచణు (?) ఒడ్డియరాయ మానమర్దన' మొదలైన బిరుదములు కలవు. గళింగ గంగవంశభూపతియే యాబిరుదములలో "ఒడ్డియరాయ' డని పేర్కొనబడియున్నాడు. కళిం

28 Ep. coll/n. 194 of 1905. 29 S. I. I. Vol. IV. Nos 1054, 1162, 1268, 1373.
30 Ep. colln 333 of 1915. 31 ఆంధ్రపత్రిక. సాంవత్సరాది సంచిక, దుందుభి సంవత్సరము.

గంగవంశజుల రాజ్యము ఒరిస్సాకంట వ్యాపించియుండినందున ఓఢ్రదేశమునకుగూడ వారే యాకాలమున ప్రభువులుగ నుండిరి. ఈకారణముననే కళింగభూనేత "ఒడ్డియరాయడు" నాబరగెను. ఒడ్డిరాయుడన్నను, గజపతియన్నను, ఒక్కడే రుద్రమదేవికి సమకాలికులై కళింగము పాలించిన నృపాలురు ఇరువురుకలరు. (౧) మొదటి నరసింహదేవు కుమారుడైన మొదటి భానుదేవు (చక్రవర్తిగారి పరిగణనముప్రకారము శకము ౧౧౮౬ మొదలు ౧౨౦౦-౧ వఱకు). (౨) మొదటి భానుదేవు కుమారుడు రెండవ నరసింహదేవు (చక్రవర్తిగారి పరిగణనము ననుసరించి శకము ౧౨౦౦-౧ మొదలు ౧౨౨౭-౨౮ వఱకు) మారయ పోతయ, లిరువురు నాశనముచేసిన "కటకము" కళింగ గంగవంశమువారికి రాజధానిగనుండిన "కళింగనగరి కటకము" కావచ్చును. ఈసంక్షోభమును, ఉపద్రవమునుజూచి, రుద్రమదేవి "రాజబంధువు"[32] లనదగిన ఇందులూరి యన్నయదేవుని, కోలని రుద్రదేవుని ఈప్రాంతముల నధికారము నెఱపబంపెను. ఓరుగల్లు మొదలు సింహాద్రివఱకు గలభూమిని వీరు పాలించిరి. శివయోగసారమున వీరిరువురు నిట్లు వర్ణింపబడి యున్నారు.

సీ॥ వెలిగి నోరుగంటి దూర్పగవని మొదలుగా
సింహాద్రిసీమగా క్షితిభరించె।
హయములు పన్నెండు వేలంటియు రౌతులం
పంచలక్షల కాల్బలము నేలె।
సాహ్ణిం జూచి (ఖడ్గయుతుంగొని?) కాళింగ
పతియైన గజపతి బాఱద్రోలె।
(నానురుబాహోరు గొల్లైన?) చుట్టుముట్టి రౌ
త్కృవలీల దాని కొండ్రువటగారె।
శేష్రుమై పంచపాండ్యుల రూపుమాపె
రౌత్రిచర్లాదిగా భూమి లీలగొనియె
కోలని రుద్రభూపాను నిశ్చలత (గాను)
నిందులూరి యన్నయదేవ హీనబలుఁడు॥
చండభుజ బలుండు పంచొటనారాయ
ణుఁడు కలియుగభీము నుతయశుండు
ఘనుఁడు మండలీక ఘంటానినాద వి
ఖ్యాతుఁ డిందులూరి యన్నవిభుఁడు॥
అనఘ చరితుఁడు కోలని రుద్రావనీశు
డఖిల జనులెల్ల వినుతింప నమలమహిమ
వెలిగి యేకశిలాపుర సింహాకుధర
పరిమితాంతర భూభాగ భరము దాల్చె॥[33]

కోలని రుద్రదేవునికి "కాళింగరాయవిభాడ" నికూడ బిరుదముండినట్లు శివయోగసారము తెలుపుచున్నది. అప్పటినుండి యీప్రాగ్దేశమంతయు, కాకతిప్రతాప రుద్రావనీశుని పరిపాలనము కడవటివఱకు కాకతీయుల క్రిందనే యుండెనని చెప్పవచ్చును. సింహాచలమునకు దక్షిణముననున్న కళింగభాగము కాకతీయుల క్రింద నుండినను లేకపోయినను వేగిదేశము మాత్రము వారిక్రిందనే యుండెననుట కాధారములు కలవు.

కోలనిరుద్రదేవు, ఇందులూరి అన్నయదేవు లిరువురు రుద్రమదేవి, రెండవప్రతాపరుద్రుల కాలముననుండి, కాకతీయసామ్రాజ్యమును రక్షించుచుండిరని శివయోగసారమువలన దెలియుచున్నది. ఈ యిరువు రమాత్యులశాసనములును గూడ మనకు గాన్పించుచున్నవి. ఇందులూరి అన్నయదేవునివి

32. సుభాషి, సం. ౧. పుట ౨౫.

33. శివయోగ సారములోని యీపద్యములన్నియు శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు 'సుభాషి'లో వ్రాసిన వ్యాసము నుండియే గ్రహింపబడినవి.

రెండుశాసనములు కలవు. (౧) త్రిపురాంతకములోనిది. శకము ౧౨౧౩ నాటిది.[34] (౨) దాక్షారామములోనిది శకము ౧౨౧౪ నాటిది.[35] కాలని రుద్రదేవుని శాసనములు కూడ గలవు ఈ శాసనముల ననుసరించి యితడు ప్రతాపరుద్రుని కాలమున క్షయ సంవత్సరమునకు సరియైన శకవర్షము ౧౨౪౮ వఱకు ఉండినట్లు తెలియును.[36] శాసనముల ననుసరించియు, వాఙ్మయము ననుసరించియు వీరు మహాప్రధానులై పేర్వడసి ప్రాగ్దేశమును బాలించుచుండిరని స్పష్టమగుచున్నది.

కాకతీయులకును, కళింగమునకును గల సంబంధము నింతవఱకు సప్రమాణముగ నిరూపించియున్నాను. తుదకీ వ్యాసమువలన దేలునట్టి సారాంశ మిది:

(౧) కాకతీయులకును, కళింగమునకును సంబంధము కలదు.

(౨) కృష్ణా, గోదావరీ మధ్యస్థితమైన దేశమును స్వాధీనపఱుచుకొన నుభయులును బ్రయత్నించు సందర్భముననే కాకతీయులకును, గజపతులైన కళింగ గంగవంశజులకును సంఘర్షణము కలిగెను.

(౩) కాకతీయుల కళింగ దండయాత్రలు కాకతి గణపతిదేవు నాటినుండియే ఆరంభమైనవి.

(౪) కాకతీయులు కళింగమును ఆస్కా (గంజాంజిల్లా) పర్యంతము జయించిరి.

(౫) కాని, జయింపబడిన కళింగభాగము స్థిరముగ కాకతీయాధికారమున నుండలేదు.

(౬) అయినను, సింహాద్రిపర్యంతముగల కళింగదేశము—మధ్యమధ్య పట్టువదలి జారిపోవుచు వచ్చినను—కాకతీయ రెండవప్రతాపరుద్రుని పరిపాలనాంతిమ భాగమువఱకు కాకతీయుల క్రిందనే యుండినట్లు కనబడును.



34 Ep. colln. 238—1905
35 S. I. I. Vol VI. No. 1807.
36 Ep. colln. 308—1915.

# రుద్రమ్మ.

మ. రా. శ్రీ. పాటిబండ మాధవశర్మ గారు.

౧

రక్షింపుమని పరాక్రమపరాభూత యాదవ మహాదేవుండు తరలివచ్చి
సకుటుంబముగ భవచ్చరణద్వయమ్ముపై బడి వేడుకో సిగ్గు పడనినాడు
భువన మోహనమైన భవదీయవదన బింబము మోహావశమున పైకెనెత్తి
ముద్దాడబోయిన పురుషుండు తేజమ్మువడదాకగా సిగ్గు పడిననాడు
నీదృగంత ప్రసారమ్ము నియతిగాగ నీ చిరుతనవ్వు లేనిల్వ నీడగాగ
సంచరించిన పుంస్త్వ ప్రపంచమెల్లఁ దెలిసికొనె నాడు దాని శక్తిప్రకర్ష!

౨

గళితబంధంబైన కబరీభరము మహాభీలమై మూపున వ్రేలుచుండ
క్రుద్ధదర్వీకర క్రూరజిహ్వాంచలచ్ఛవి కరాళాసి హస్తమున మెఱయ
పరిపంథికంధర ప్రకరనిర్యచ్ఛోణితార్ద్రమై ముఖము భయమ్ముగొలుప
కుపితశౌర్యాగ్ని పరిఘూర్ణిత దృక్ప్రపాతమ్మె శాత్రవుల దగ్ధమ్మొనర్ప
తఱిమితఱిమి కొట్టిన నీకు వెఱచివిఱిగి పఱచు యాదవ పతియాడు గఱచునాడు
మోమ్మువిఱిచి నిల్వగల పూరుషుఁడొకండు కానుపింపడు మచ్చునకేని రుద్ర!

౩

ఆశాగహ్వరముల్ ప్రతిధ్వనులు మ్రోయన్, నీయశోగాథ నానా
దేశీయుల్ పఠియింతురు ముక్తగళులై దేవీ! భవద్దివ్య సం
దేశమ్మున్ మననమ్మొనర్చుచు పురంధ్రీసంఘ మాంధ్రమ్ము ప్రేక్
త్రైశాక్తేయము నీదుమూర్తి నెదఁదన్ ధ్యానింతు రుద్రాంబికా!

౪

కట్టించితివి వరంగలుచుట్టుఁ జుట్టిరా మృత్తికామయమైన భిత్తియొకఁడు
త్రవ్వించితివి మహోత్తాలతాలకురుట్చ ఖాదఘ్నమైన యగడ్తయొకఁడు
ఉద్ధరించితివి భ్రంశోన్ముఖంబైన స్త్రీజాతి నిర్మలయశఃకేతనమ్ము
గౌరవించితి కవీద్గంధేభముల దానధార చెక్కుల జిడ్డుదేరునట్లు.
ప్రజలపాలించితివి రామరాజ్యమునకు సాటియని చెప్పఁగాఁదగ్గ శాంతిగూర్చి;
వలిపితివి సిక్ఛలము బ్రహ్మచర్యదీక్ష రుచిరసద్గుణనికురంబ! రుద్రమాంబ!

# కాకతీయవంశము.

శ్రీయుత వేఁడేపల్లి వెంకటరమణాచార్యులు గారు

ఆంధ్రరాజులలో గాకతీయులు మిగులబలవంతులు స్వకార్యనిర్వహణధుర్యులు, యశస్కాములునై యుండిరి. పడమట యాదవవంశస్థుల యుచ్ఛ్రియము తూర్పునఁగాకతీయుల యుచ్ఛ్రియముతో సమకాలికముగా నుండెను. ఒక కాలమందీకాకతీయులరాజ్య మాంధ్రదేశమంతయుగాక ద్రావిడదేశములోఁ గూడ గొంతిభాగమువరకు వ్యాపించి యుండెను. ఈ కాకతీయులవంశమందసాధారణానేకశక్తిసంపన్నురాలు, సకలరాజ కార్యనిర్వహణధౌరేయురాలునగు నొకస్త్రీయును, బహుసంగ్రామజేతలగు ననేక మహాశూరులు నుద్భవిల్లిరి. ఈయాంధ్రదేశము కాకతీయుల పరిపాలనములో రాజకీయ సాంఘికమత విద్యాదిశాఖలలో నానావిధములైన మార్పులజెందెను. తెలుగుజిల్లాలలోఁ బ్రసిద్ధికెక్కిన జమీందారీకుటుంబములనేకములు కాకతీయచక్రవర్తులదగ్గర పనిచేసిన యుద్యోగస్థులవలన జనించినవి. కాకతీయులు రాజ్యపదభ్రష్టులుకాగా దూర్పుదక్కనులో మహమ్మదీయాధికారము స్థిరీకృతమైనది.

తూర్పు చాళుక్యరాజ్య చోళరాజ్యములు రెండునుకలిసి యొకరాజుయేలుబడిక్రింద రావడము మనమిదివరకేచూచియున్నాము. చోళరాజులుఁ దెలుగుదేశమందు రాజప్రతినిధులవలన రాజ్యమేలించుట తెలుఁగుదేశము యొక్క విభాగమునకుఁగారణమైనది. అందువలన ననేకవంశములు గొప్పతనము నొందినవి. కల్యాణిలోనున్న పడమటి చాళుక్యుల దండయాత్రలకు దేశములోఁబడెను. దేశప్రజలు చోళరాజువలన సహాయమునొందుటకుఁదగిన స్థితిలో నుండలేదు. చోళరాజ్యమునకుఁ జెడుకాలము వచ్చుటకు సిద్ధముగానుండెను. ఇట్టిస్థితిలో రాజ్యపరిపాలనాధికారము నాక్రమించుటకు, స్వతంత్రసంస్థానములను స్థాపించుటకు, పెద్ద రాష్ట్రములను బెంచుటకు నవకాశము గలిగెను. అట్టిసమయమువలన నుపకృతులైనవారిలోఁ గాకతీయులు మిక్కిలిగొప్పవారైరి. కాకతీయాధికారమును స్థాపించినవాడు బేతరాజు. అతఁడు నైజామురాష్ట్రము లోని అనుమకొండకుఁ బరిపాలకుఁడై యుండెను. అతఁడు కల్యాణిరాజైన యారవవిక్రమాదిత్యు నభియోగములను మొదట కొంతమట్టుకెదిరించెను. కాని కొనకు వానికిలోఁబడెను. అతఁడు జైనులకు మిత్రుఁడై యున్నట్లు తెలియవచ్చును. ఇతఁడు సుతునకు తనరాజ్యము నొప్పగించి 1117 లో మృతినొందెను. ఈప్రోలరాజు రాజ్యతంత్రజ్ఞుడైన మహాయోధుడు. ఇతఁడు తనతండ్రిమృతినొందినపిదప రాజ్యభారమును బూని పశ్చిమచాళుక్యచక్రవర్తియగు నారవ విక్రమాదిత్యునికి సామంతమాండలికుఁడై యాతని మహాప్రధానులలో నొకడుగానుండి యాచక్రవర్తి స్వర్గతుఁడైనపిమ్మట స్వతంత్రుడై యాం

ధ్రరాజ్యమును స్థాపించుటకు బ్రయత్నించెను. పశ్చిమచాళుక్యరాజులను లక్ష్యపెట్టక స్వతంత్రరాజునని ప్రకటించెను. అనుమకొండను ముట్టడివేసిన చాళుక్యపక్షీయుఁడైన జగద్దేవుని సంపూర్ణముగా నోడించెను. ఇతఁడు చాళుక్య రాజులకు గొప్పహానిఁగలిగించి వారిని లోబరచుకొనెను. పశ్చిమచాళుక్యచక్రవర్తుల సేనాధిపతియైన గోవిందరాజును జయించెనని అనుమకొండలోని రుద్రదేవుని శాసనములో నొక శ్లోకమున జెప్పబడినది. [1]

అందులోఁ బేర్కొనఁబడిన గోవిందరాజు పశ్చిమచాళుక్య చక్రవర్తియగు నారవ విక్రమాదిత్యుని సేనాధిపతియైన అనంతపాలుని సోదరిపుత్రుఁడని శాసనములో నున్నది. ఈగోవింద దండనాయకుఁడు క్రీ. శ. 1126—27 సంవత్సర ప్రాంతమున నాంధ్రదేశములోని కొండపల్లిసీమకుఁ బరిపాలకుడుగ నుండెను. ప్రోలరా జీతని జయించి యితనిరాజ్యమును చోళరాజు కుటుంబములో నొకని కిచ్చివేసెను. నూజివీడుజమీందారీలో నున్న మంతెనను (మంత్రికూటము) సంపాదించి కాకతీయరాజ్యముతో గలిపెను. ఇతఁడు వ్యవసాయదారులను సంపన్నులనుగా జేయుటయందు మిక్కిలి అభిలాషగలవాడు. వ్యవసాయమునకుపయోగించు నొకపెద్దచెఱువును ద్రవ్వించెను.

ఇట్టిపరాక్రమముగలవాడును బహుసంగ్రామ విజేతయునగు ప్రోలరాజు తనకుమారునిచే నిహతుడయ్యెనని యొకకథ కలదు. అదియెంత మట్టుకుసత్యమో మనము నిశ్చయింపనేరము. ఒకదివసంబునఁ బ్రతాపరుద్రదేవుడు దేవాలయంబున గాఢనిద్రనున్న సమయమున తండ్రియైన ప్రోలరాజతనిప్రక్కనుండి పోవుచుండగా నితనికాలతనికిఁ దగిలెనట. అంతట నతడు మేల్కాంచి శత్రువెవ్వఁడో తన్ను ముట్టుకొన వచ్చెనని యెంచి తనమొలలోనున్న ఛురికముచే నతనినిఁబొడిచెను. అంతట తండ్రి నేలంగూలజూచి తెలివినొంది చేసిన పితృవధకర్మకుఁ బశ్చాత్తప్తుఁడై దుఃఖింపసాగెను. ఇది భ్రమప్రమాదవశమున సంభవించినదని యెఱింగినవాడై ప్రోలరాజు కుమారుని శిక్షింపక యోదార్చి రాజముద్రికనొసంగి రాజ్యమునొప్పగించి ప్రాణములను విడిచెను.

వానితరువాత రాజ్యమునకు వచ్చినవాఁడు రుద్రదేవుఁడు. ఇతడు 1160 మొదలుకొని 1196 వరకు రాజ్యమేలెను. ఇతనినాడు కూడఁ బశ్చిమచాళుక్యులతో యుద్ధము ప్రవృత్తమయ్యెను. దొమ్మఅనువాని రాజ్యమును దనరాజ్యముతోఁ గలుపుకొనెను. భిల్లమఅనువానికి ముందువాడైన మల్లుగియను యాదవరాజును జయించెను. ఈతనికిఁ బ్రతాపరుద్రుడని నామాంతరముకలదు. ఇతడు పరాక్రమమునందు తండ్రినినయితము మించినవాడు. ఈరుద్రదేవుడు చాళుక్యసైన్యపాలకుడైన తైలపదేవుని, కర్ణాటకచోడులైన భీమచోడ ఉదయ చోడులను, మంత్రికూటాధీశుడైన గుండమనాయని తక్కిన శత్రురాజవర్గమును జయించి, యాంధ్రదేశమందు పశ్చిమచా

1 "దోఃకుంతోరిపతేర కుంతపరశుర్ల్లక్ష్మా గ్రధారోల్లస
ద్ధారాపాతనిపాతనైక చతురం గోవిందరాజాహ్వయం
బద్ధ్వోన్ముచ్య తదోదయక్షితిభృతే రాజ్యం దదౌ లీలయా
యంతాం గోవిషయస్య తస్య పటుతే స ద్వీరదీక్షాగురుః"

ళుక్య చక్రవర్తుల పరిపాలనమునకు లోబడి యున్న భూభాగములనన్నిటిని స్వాధీనము చేసికొని, మహామండలేశ్వరుఁడై రాజాధిరాజై పొగడ్తకెక్కెను.[2]

కాకతిరుద్రదేవునిరాజ్యము తూర్పున సముద్రమువరకు, దక్షిణమున శ్రీశైలమువరకు, పడమట కటకమువరకు, ఉత్తరమున మాల్యవంతమువరకు, విస్తరించి యుండినది.

ఇతనికాలమందు శైవమతము మిక్కిలి వృద్ధినొందెను. శైవులమతబోధనములను విని శైవమతమం దభినివేశము గలవాడయ్యెను. నిర్నిమిత్తముగా దానుతండ్రిని జంపిన మహాపాప మెట్లుపోవునో దానికితగినయుపాయములజెప్పుడని శైవగురువులనడిగెను. వారు "ఓయి ప్రోలమహారాజా! దేశాటనము సలిపి దివ్యనదులగ్రుంకి, లింగముల బ్రతిష్ఠింపించి, పంచామృత దివ్యతీర్థములసేవించి, దివ్యలింగముల బ్రతిష్ఠింపించి పంచామృతముతో సదాశివుని కభిషేకముగావించి, భక్తితోసేవించిన సర్వపాపహారంబగు"నని చెప్పిరి. అందుపై రుద్రదేవుడు నూరుగురు బ్రాహ్మణోత్తములను గాశికి బంపించి యచట విశ్వేశ్వరున కభిషేకము జేయ నియమించి విశేష ధనంబులొసంగి వారలచే దనకుగాను పితృతర్పణము జేయించెను. తన రాజ్యములో బ్రతిగ్రామమందు శివాలయములను నిర్మించి వానిపూజాదుల కొరకు భూములనొసంగెను.

ఈతడు సంస్కృతాంధ్రకర్ణాట పండితుల రావించి యాదరించుచు, పండితపక్షపాతియై తానును పండితుడు కవియునై, బహుగ్రంథములఁ బఠించుటయేగాక గ్రంథరచన యందు గూడ ప్రౌఢత్వముగల వాడై యున్నట్లు కానవచ్చుచున్నది. ఇతనికి విద్యావిభూషణుఁడను బిరుదుకూడగలదు. ఇతడు నీతిసారమను నొక గ్రంథము నాంధ్రభాషలో రచించినటుల దెలియవచ్చుచున్నది.[3]

కాకతిమహాదేవరాజు.—ఇతడు కాకతిరుద్రదేవుని తమ్ములలోఁ బెద్దవాడు. ప్రోలరాజు ద్వితీయపుత్రుఁడు. తనయన్నయగు రుద్రదేవుడు 1196 వరకు రాజ్యముచేసిమృతినొందగామహాదేవరాజు సింహాసనారూఢుడై, మూఁడుసంవత్సరములు మాత్రమే రాజ్యమేలెను. ఇతడు తన యన్నగారైన రుద్రదేవ రాజు తండ్రిని జంపి రాజ్యము చేయుచున్నాడను ద్వేషముచేత నతని జంపి రాజ్య మాక్రమించుకొనవలయునని పలుమారుప్రయత్నించెను. గాని యట్టివైపరీత్యము జరుగకుండ మంత్రులు మొదలగువారు వారించుచుండిరి. తన్నుజంపుటకై తమ్ముఁడుచేయు దురాలోచనలను సహించి రుద్రదేవుడు వానిని క్షమిం

---

2 శ్లో॥ రాజ్యం ప్రాచ్యాం లవణజలధేస్తీరపర్యంత మస్య శ్రీ
శైలాన్తం ప్రచలతి సదా దక్షిణస్యాం సమగ్రం
ప్రాతీచ్యాన్తా కటకనికటస్థాయినీ రాజ్యలక్ష్మీః
కౌబేర్యాం కాతట విలసితా మాల్యవంతం ప్రపేదే॥

3 "చ॥ పరువడి నాంధ్రభాషగల బద్దననీతియు సంస్కృతంబునన్
బరగ బ్రతాపరుద్ర వరపాలుని చే రచియింపబడ్డ యా
సరవగు నీతిసారము వివం జనుమం గడు మంచిదంచు చె
చ్చెరగ వినీతిపద్ధతుల చేసె వినోదము బాలబోధకున్॥"

చుచువచ్చెను. అట్లునైచుట యుక్తముకాదని మంత్రి పురోహితాదిజనంబు లెంతచెప్పినను రుద్రదేవుడు వారిమాటలను బెడచెవినిబెట్టి తమ్ముని నాదరించుచు వచ్చెను. రుద్రదేవుని యనంతరము మహాదేవరాజు రాజ్యభారమును వహించి మూడుసంవత్సరములు మాత్రమే రాజ్యముచేసెను.

శౌణదేశాధీశ్వరుండైన జైత్రపాలుడను యాదవరాజు తనతండ్రియగు సింగభూపతి యనంతరము 1193 సంవత్సరమున రాజ్యభారమును వహించి త్రిలింగదేశముపై దండెత్తి వచ్చెను. అప్పుడు జైత్రపాలునకు మహాదేవరాజునకు జరిగిన ఘోరయుద్ధమందు మహాదేవరాజు చంపఁబడెను.

యుద్ధములో మహాదేవరాజు మృతినొందిన తరువాత నతనికుమారుడైన గణపతిదేవుడు రాజ్యభారము వహించెను. ఇతడు మహాదేవరాజునకు బయ్యమాంబికవలన జనియించినవాడు. ఇతడు తనజ్యేష్ఠ పితృవ్యుడైన రుద్రదేవునిచే స్థాపింపఁబడిన త్రిలింగ సామ్రాజ్యమును నల్గడల విస్తరింపజేసి, చక్రవర్తిపదమును వహించి, సప్తమచక్రవర్తి యని యాంధ్రభూస్థలి సంతట శ్లాఘింపబడుచుండెను. యుద్ధములో నితఁడు శత్రువులచే జిక్కువడి, విడిచిపెట్టబడిన తరువాత నాయవమానమును సహింపజాలక అసంఖ్యాకములైన సైన్యములం గూర్చుకొని యాదేశముపై దండెత్తివెళ్ళి, యాదవులతో యుద్ధముచేసి శౌణభూపతిని జయించి, యతనివలన నమూల్యములైన రత్నరాసులను ధనములను బడసి, నిజరాజధానికి మరలివచ్చెను. అప్పటినుండియు యాదవు లనేకపర్యాయము లాంధ్రదేశము నాక్రమించుకొనుటకై ప్రబలప్రయత్నములు చేయుచువచ్చిరిగాని తెలుగువారు వారిని గోదావరినదినిదాటి దిగువకు రానియ్యక నాపివేసిరి. పశ్చిమచాళుక్య సామ్రాజ్యమంతరించినవెనుక కర్ణాటదేశమున కధిపతులైన భళ్ళాణరాజులుసైతము తెలుగుదేశమును వశపర్చుకొన వలయునని ప్రబలప్రయత్నములు గావించిరి,గాని తెలుగువారి పరాక్రమముముందట నవియన్నియు భగ్నములైపోయినవి. గణపతిదేవుడు సింహాసన మెక్కిన తోడనే మండలేశ్వరు లనేకులచే బరిపాలింపబడుచున్న యాంధ్రదేశమునంతయు నేకచ్ఛత్రాధిపత్యము క్రిందికిదీసికొని రావలయునని నిశ్చయించి తదనుగుణముగా సమర్థులైన మంత్రులను సేనాధిపతులను గూర్చుకొని వారలసాహాయ్యముచే దండయాత్రలు ప్రారంభించి యొక్కొక్క మండలేశ్వరుని జయించి వశపర్చుకొని, సామంతునిగ జేసికొనుచుండెను. గణపతిదేవుడు రాజ్యతంత్రజ్ఞానము గలవాడుగావున నేపనిప్రారంభించిన నతనికి విజయమే లభించుచుండెను.

ఈగణపతిదేవుడు వ్రాయించిన యనేకశాసనములు దక్షిణహిందూస్థానమందు బహుళముగా గానవచ్చుచున్నవి. ఇతడుమహాపరాక్రమశాలి గొప్పవారైన యాంధ్రదేశపురాజు లందరితోను వివాహసంబంధములను జేసెను. వారందరితనికి యుద్ధములయందుదోడ్పాటు గావించుచుండిరి దక్షిణపుజిల్లాలపై దండెత్తివెళ్ళి కొణిదెన, అద్దంకి, ములికినాడు, పొట్టపినాడు, రేనాడు, గండికోట, జయించెను.

ఈ సమయమందు చోళరాజ్యము గందరగోళములో నుండెను. పలుమా రుత్తరముగా దండెత్తివెళ్ళి నెల్లూరును కూడ బట్టుకొన్న పాండ్యులను ఘోరముగా బరిభవించెను,

ఇదివరకే రాజధానియై యున్న ఓరంగల్లులో నొక గొప్పకోట గట్టెను. ఇతడు తన రాజ్యమందు పూర్ణమైన స్వాస్థ్యమును నెలకొల్పి అవ్యాహతముగా దనయాజ్ఞ చెల్లునట్లు చేసెను. మంచిబాటలను సత్రములను నిర్మించెను. ఇతడు శైవమతావలంబి జైనమత విరోధి. జైన భక్తుల ననేకుల గఠినముగా హింసించి చంపెను. వారు నివసించు ముప్పదియారు గ్రామములను, వారి దేవాలయములను నశింపజేసెను. అతని రాజ్యపాలనవరకును కంసాలివారు గ్రామకరణములై యుండిరి. తరువాత వాండ్రు జైనమతస్థులని తెలుసుకొని, వారి నాయుద్యోగములనుండి తప్పించివేసి, వారి స్థానమందు నియోగిబ్రాహ్మణులను బెట్టెను. ఇప్పటికి నివారన్ని తెలుగుజిల్లాలలోను కరణములుగా నున్నారు. అతడు చేసిన యన్ని పనులలోను సమర్థులైన మంత్రులు, యిప్పటికి ననేకప్రదేశములయందు గానవచ్చు శాసనములను వ్రాసిన పండితులు, సహాయమొనర్చిరి. అతడు వణిక్కులకు గొప్ప మిత్రుడై యుండెను. పూర్వశతాబ్దములయందు వాణిజ్యస్థలముగా బ్రసిద్ధికెక్కినది కృష్ణానదీ ముఖద్వారమందున్న మోటుపల్లెయను సముద్రతీర పట్టణము. నౌకాచోర (Pirates) బాధచే బాడయ్యెను. గణపతి యాస్థలమందున్న వర్తకులను గాపాడుట కనేకప్రయత్నములను గావించెను. ఎగుమతీ దిగుమతీలమీద పన్నులను తగ్గించెను. గంధపుచెక్కలు, కర్పూరము, పన్నీరు, గజదంతములు, పరిమళద్రవ్యములు, రాగి, సత్తు, సీసము, వచ్చలు, పట్టుబట్టలు, మొదలగునవన్నియు దూరదేశములనుండి యీరేవుపట్టణముద్వారా దేశములోనికి బంపబడుచుండెను. గణపతి విద్వత్పోషకుడు. అతని మంత్రులలో నొకడైన శివదేవయ్యచే పురుషార్థసారమను నొక శైవగ్రంథమును వ్రాయించెను.

క్రమముగా గణపతిదేవమహారాజు కీర్తిశేషుడయిన పిమ్మట నతనికుమార్తె రుద్రమదేవి సింహాసనము నెక్కెను. ఈ గణపతిదేవునికి పుత్రసంతానము లేకపోవుటచే నీమెనే పుత్రునిగా జూచుకొనెను. పూర్వగ్రంథకర్తలు నూతనగ్రంథ కర్తలు రుద్రాంబిక గణపతిదేవుని భార్యయని భ్రాంతినొందిరి. మల్లినాథసూరి పుత్రుడగు కుమారస్వామి ప్రతాపరుద్రీయమునకు వ్రాసినవ్యాఖ్యలో నొకచోట.

"పురాకిల కాకతికులసంభూతే గణపతినామ్ని మహారాజే దుహితృమాత్రసంతానే కదాచిద్దైవయోగేన కాలపరిపాకము పేయుషి, తన్మహిషీ రుద్రమదేవీనామ రాజ్ఞీ బహూన్ వత్సరాణి తద్రాజ్యమకంటకం పరిపాల్య పరిణతాసతీ, దౌహిత్రే ప్రతాపరుద్రే రాజ్యధురాం నిదధే. తామిమాం కథాం మనసి నిధాయాహ 'యోరుద్రఇతి'" 4

రుద్రమదేవి గణపతిరాజు భార్యయని అనేకులు భ్రమపడిరి. విద్యానాథుడు వ్రాసిన ప్రతాపరుద్రీయమును జక్కగా బరిశోధించి రుద్రాంబిక గణపతిదేవుని కుమార్తెయని మొదట గనిపెట్టినవాడు Hultzsch అనుజర్మ

4 "శ్లో|| యోరుద్రో రజతాచలే స్థితి మగా దర్ధాంగనారీః పురా
సోయం సంప్రతి కాకతీశ్వరకులే పర్యాంగనారీః స్థితః||
స్థానే యద్విషమావలోకన కళామాత్రేణ భస్మీకృతా
శ్యాప స్త్వైరిపురాణి చిత్ర మధునా ఖడ్గే విమంగార్యతే||"

నీదేశపు పండితుడు. ఈవిషయమే ప్రతాపరుద్రీయములో నాటక ప్రకరణమందున్నది.[5]

కావున గణపతిచక్రవర్తికి రుద్రాంబిక కూతురనియు, పుత్రులు లేనికారణమున నామెను పుత్రినిగా జూచుకొనియాతడామెకు రుద్రదేవుడనియే పురుషనామ ముంచెననియు, స్పష్టమగుచున్నది.

ఈమె తండ్రిచే శిక్షింపబడినదియై రాజ్యపరిపాలనమందు మిక్కిలి ప్రసిద్ధికెక్కిన సామర్థ్యముగలదియై యుండెను. ఈమె రాజ్యపరిపాలనారంభమందే యాదవరాజు వరంగల్ పైకి సైన్యముతో దండెత్తివచ్చి, యసంఖ్యాకములైన సైన్యములతో రాజధానిని ముట్టడివేసెను. పదునైదు దినములు జరిగిన ఘోరసంగ్రామమందు యాదవరాజుసైన్యములు పరాజయమునొంది కాందిశీకులైనవి. యాదవరాజుబలమైన నష్టమునచ్చుకొనెను. ఆసొమ్ములో గొంతభాగము వరంగలును సామర్థ్యముతోఁ గాపాడిన ధైర్యవంతులైన సైనికుల కిప్పించబడెను. ఆడుది రాజ్యమేలుచున్నదియని కొందరు గొప్పవారలయావిష్టులై రుద్రమదేవిమీద తిరుగబడిరి. కాని యామె వారినందరినీ అణగగొట్టెను.

ఈమెకు సమర్థులైన మంత్రులు సేనాధిపతులు ననేకులుండిరి. వారిలో ముఖ్యులు జన్నిగదేవసాహిణి, గంగయసాహిణి, త్రిపురాంతకదేవ మహారాజు, గోనగన్నారెడ్డి, నాగదేవమహారాజు, మొదలగువారు.

రుద్రాంబిక రాజ్యపరిపాలన కాలమందే మార్కోపోలో అనునాతడు ఆంధ్రదేశమునకు వచ్చెను. అతడు తనప్రయాణ వృత్తాంతములను దెలియజేయు పుస్తకములో నాంధ్రదేశ వృత్తాంతమును జక్కగావివరించెను. తండ్రివలెనే రుద్రాంబ శైవులమీద నిష్టముగలది. ఈమెకాలమందు రంగనాథ రామాయణమను కావ్యము రచింపబడెను. రంగనాథుడను నాతడు రామాయణమును ద్విపదకావ్యముగా రచించెను. కనుకనే యాగ్రంథమునకు రంగనాథ రామాయణమని పేరుకలిగినది. కాని గ్రంథాంతమందు గోనబుద్ధరాజు రచించినట్లు గానవచ్చుచున్నది మనుమూరి సంస్థానాధిపతియగు బుద్ధరాజున కాశ్రితుడైన రంగనాథుడు దీనిని తనప్రభువుపేరిట రచించెనేకాని బుద్ధరాజు రచింపలేదనియు, బుద్ధరాజు రచించియుండెనేని బుద్ధరాజ రామాయణమనుపేరే యాగ్రంథమునకు వచ్చునుగాని రంగనాథ రామాయణమను పేరుకలుగుటకు కారణము గానరాదనియు గొందరు చెప్పుదురు. ఎవ్వరు రచించినను యిందలి కాండాంతమున నిట్లున్నది [6]

---

5 మంత్రీ॥ "ఏవమేవైతత్। అన్యథా కథమీశ్వరస్య ప్రసాదాదృతేనిరంకుశం శ్రీవ్యక్తి విశేష స్యాలోకాధిపత్యం। ఏవంచ మమశంభునా గణపతిమహారాజేన అభ్యంతరస్యానుభవ మహిమ్నః సదృశ మతి పుత్రీ ఇతి వ్యవహారః కృతః తదనుగుణా చ రుద్ర ఇతి వ్యవహారః కృతః। తదనుగుణా చ రుద్రశబ్దాఖ్యా॥

6 "అనియాంధ్రభాష భాషాధీశవిభుడు, వినుతకావ్యాగమ విమలమానసుడు
పాలితాచారు దశారధీశరధి, భూలోకనిధి గోన బుద్ధభూవిభుడు
తమతండ్రి విఠ్ఠల ధరణీశుపేర, నాచంద్రతారార్క మైయుప్పమీర
వసమానలలిత శబ్దార్థ సంగతుల, రసికమైచెలువొందు రామాయణంబు
పరగనలంకార భావనల్ నిండ, గరమర్థి .........కాండంబుచెప్పె"

గోనబుద్ధరాజు తన తండ్రి విఠ్ఠలధరణీశు పేర రచియించినట్లు వ్రాయబడి యున్నది. 1291 సంవత్సరములో రుద్రమదేవి స్వర్గతి నొందెను.

ఈ మహారాజ్ఞికి దరువాత ఇట్లు పదమూడవ శతాబ్దము నంతమున రుద్రమదేవికి దౌహిత్రుడును దత్తపుత్రుడునైన వీరప్రతాపరుద్రదేవమహారాజు ఆంధ్రసామ్రాజ్యభారమును వహించెను. ఇతడు 1295 మొదలుకొని 1321 వరకు రాజ్యమేలెను. ఇతడు రుద్రదేవికాలమందు దేశమునకు బాధగలిగించు సామంత నృపతులను జయించి, యాంధ్రసామ్రాజ్యము వృద్ధినొందునట్లు చేసెను. ఈతని రాజధానియగు నేకశిలానగర మాకాలమం దుత్తర హిందూదేశంబునందు మహమ్మదీయుల రాజధానియగు ఢిల్లీపురముకంటె నధికైశ్వర్యసంపన్నమై ప్రకాశించుచుండెను.

ప్రతాపరుద్రుని మంత్రులలో ముఖ్యుడగువాడు నాగయగన్నమంత్రి. ఇతనికి యెల్లయనాయకుడు మేచయనాయకుడు నని యిరువురు సోదరులుండిరి. వీరిద్దరుగూడ ప్రతాపరుద్రునికి సేనాధిపతులుగ నుండిరి. ఈగన్నయమంత్రి మడికిసింగనకవి విరచితమైన పద్మపురాణకృతికి భర్తయైన కందనమంత్రికి చిన్నతాతయని శ్రీ వీరేశలింగముపంతులుగారు ఆంధ్రకవిజీవితములలో మడికిసింగనకవిగూర్చి వ్రాయుసందర్భమున జెప్పిరి. ఈగన్నయమంత్రిని వారునియోగిబ్రాహ్మణుడని యభిప్రాయపడిరి. కాని యది సరికాదు. ఈగన్నయమంత్రి చతుర్థకులజుడని మారనవ్రాసిన మార్కండేయపురాణములో స్పష్టముగా దెలుపబడియున్నది. ఇతనికి నాయకత్వము ప్రతాపరుద్రునివలననే లబ్ధమైనట్లు మార్కండేయ పురాణమున జెప్పబడియున్నది.[7]

ప్రతాపరుద్రునిసైన్యాధ్యక్షులలో నొకడుగానుండి, యోరుగంటియొక్క తూర్పుగవని మొదలుకొని తూర్పున సింహాచల పర్యంతము గల భూభాగమున కంతకు రాజప్రతినిధియై పరిపాలనము చేసినట్టు గనబడుచున్నది.[8] ప్రతాపరుద్రుని మహామాత్యులలో నొక్కడగు నీ రుద్రరాజునే కొలనుప్రతాపరుద్రుడందురు. కొలను అనునది కృష్ణామండలములోని యేలూరుకు నామాంతరము.

కాశ్యపగోత్ర సంభూతుడైన పోలయామాత్యునకు ద్వితీయపుత్రుడైన బెండపూడి అన్నయమంత్రి వీరప్రతాపరుద్రుని రాజ్యభార ధురంధరులలో నొకడు. శ్రీనాథమహాకవి తన భీమఖండమును ఈ యన్నయమంత్రి మనుమడును అల్లయ వీరభద్రారెడ్డి మంత్రియునగు అన్నమంత్రి కంకితము చేసెను.

---

7 చ॥ ఎలమి బ్రతాపరుద్ర మనుజేంద్రునిచేఁ బడసెం బ్రసిద్ధుఁడై
కొలిచియు శౌర్యలీల రిపుకోటి రణావని గీటడంచియు
న్బలరిపుతుల్యవిక్రముడు నాగయ గన్నవిభుండు తేజమున్
వ్వలసిత రాజచిహ్నములు విశ్రుతలక్ష్మియు నాయకత్వమున్ ॥ ॥మార్కండేయపురాణము॥

8 తే॥ గీ॥ అనఘుచరితుడు కొలనిరుద్రావనీశు
దఖిలజనులెంచ వినుతింప నతులమహిమ
వెలసి యేకశిలాపురి సింహాద్రిధర
పరిమితాంతర భూభాగ భరము దాల్చె॥ ॥శివయోగసారము॥

భాస్కరరామాయణ కృతికి పతియైన సాహిణిమారుడు ప్రతాపరుద్రుని యశ్వసైన్యంబున కధ్యక్షుడుగ నుండెను.

ఈ ప్రతాపరుద్రునిరాజ్యము తూర్పున సముద్రమువరకును, దక్షిణమున కాంచీపురము వరకు, పశ్చిమమున గళ్యాణ కటకము వరకు, ఉత్తరమున కళింగదేశములోని సింహాచలము వరకు, వ్యాపించి యుండెను.

1308 సంవత్సరములో మహమ్మదీయులు కాకతీయరాజ్యముపైకి దండెత్తి వచ్చిరి. కాని వర్షాధిక్యముచే మార్గమందు వారికి ప్రబలమైన ఆటంకములు గలుగుటచే నేమియు జేయనేరక ఢిల్లీకి మరలిపోయిరి 1309 లో మహమ్మదీయులు రెండవసారి పెద్దసైన్యముతో దండెత్తివచ్చి తెలింగానా సరిహద్దులవిడిసి, వారి మార్గమందనేకస్థలములబట్టికొని, కొనకువరంగలునెదిరించిరి. ఆకోటకన్నిప్రక్కలను ముట్టడివేసిరి. ఆకోటను గాపాడుసైనికులు తమశక్తి వంచనలేకుండ తమభుజశౌర్యమును గనపర్చిరి. గాని మహమ్మదీయసైనికులు లక్ష్యముసేయక ముందుకు ద్రోసికొనివచ్చి కొన్నిపరిఖలను దాటివచ్చి కోటయొక్క లోపలిభాగములను బట్టుకొనిరి. అందుపై ప్రతాపరుద్రుడు జయాశను బొత్తిగావిడిచికొని ఢిల్లీచక్రవర్తికి లోబడెను. సాంవత్సరికకరము నిచ్చుటకు ప్రతిజ్ఞచేసెను. దానికి మొదటివాయిదాగా సమిత్తమైన ధనమునొసంగెను. ఈపని జరిగినవెంటనే ఒరిస్సారాజైన గజపతి వరంగల్‌మీదికి యుద్ధమునకు వచ్చెను. అతడు పరాజయము నొందెను. ఇంతలో ద్రవిడదేశపు పరగణాలలో కొన్ని అల్లరులుపుట్టెను. కేరళదేశపురాజైన రవివర్మకులశేఖరుడు కాంచీపురమును బట్టుకొనెను. 1316 సం॥లో ప్రతాపరుద్రుడు ముప్పిడినాయకుడను తనదళవాయిని దాక్షిణాత్య శత్రువులపైకిబంపి, వారువశపర్చుకొన్న దేశభాగమునంతయును మరల స్వవశము జేసికొనెను. చోళరాజ్యములో నవశిష్టభాగమును, పాండ్యదేశములోని కొన్నిభాగములను, తనరాజ్యములో గలుపుకొనెను. ప్రతాపరుద్రుడు కొంతకాలముక్రిందట ఢిల్లీచక్రవర్తికిచ్చెదనని వాగ్దానముచేసిన పన్నును చెల్లించుట మానివేయునంత బలవంతుడయ్యెను.

ఈసమయమందు ఢిల్లీలో ఖిల్జీవంశము వారు టొగ్లకువంశమువారికి తావిచ్చిరి. మొదటి టొగ్లక్ చక్రవర్తియగు గాజీఉద్దీన్ ప్రతాపరుద్రునితో యుద్ధముచేయుటకొరకు లక్షపదాతిసైన్యమును, పదివేల గుఱ్ఱపుదండునిచ్చి తన కుమారుడైన ఉలుగ్‌ఖానుని పంపెను. 1321 సం॥లో వరంగల్ పట్టణమునుజయించి, మహమ్మదీయులాదేశమునంతయును యథేచ్ఛముగా దోపిడిజేసిరి. ఇట్టిసమయమందు ప్రతాపరుద్రుడెవ్వరికి జొరశక్యముగాని వరంగల్‌కోట లోదాగియుండి ప్రాణములను గాపాడుకొనెను. దానినిగూడ శతృవులు ముట్టడించిరి. ఆయుద్ధమందుభయపక్షముల వారును జయాశతో ఘోరముగా బరాక్రమించిరి. రెండుపక్షములవారికి నమితనష్టములు కలిగినవి. అట్టిసమయమందు ఢిల్లీచక్రవర్తి మృతినొందెనని యొకకింవదంతి ఆకస్మికముగా వ్యాపించెను. ఇదివరకే ఆమహమ్మదీయులు రోగములవలనను, శీతబాధవలనను, దుస్సహపీడనొందిరి. అందుచే వారతిశీఘ్రముగా దేవగిరి మార్గముగుండా స్వస్థానమునకు బోవలసివచ్చెను.

కొన్నినెలలతరువాత ఉలుగ్‌ఖానుడు పితృమరణవార్త కల్లయని తెలిసికొని మునుపటికంటె బలియమైన యుద్ధసన్నాహముగల సై

స్యములదోడ్కొని వరంగలుకు వచ్చెను. ఇది వరకే పట్టువడిన వరంగలును ముట్టడించి తెలింగానా సరిహద్దుననున్న బీదరుదగ్గిర పటాలములనుంచెను. వెలమలు, పద్మనాయకులు, కమ్మలు, రెడ్లుమొదలగు నన్నిజాతులవారు నైకమత్యమునొంది మహాశౌర్య ధైర్యములను వెల్లడించుచు నొకమనుష్యునివలె విదేశీయశత్రువులతో బోరాడిరి, కాని శ్రమయంతయు వ్యర్థమయ్యెను. ఫిరంగిగుండ్ల వర్షమును గురిపించి దుర్భేద్యమైన వరంగల్కోటను ధ్వంసముచేసి లోనికిబ్రవేశించి ప్రతాపరుద్రునియతని కుటుంబజనమును ఖయిదీలగా బట్టుకొని ఢిల్లీకిగొనిపోయిరి. ఖయిదీగా జేయబడిన యీమహారాజు గోదావరియొడ్డుకు వచ్చినపుడు విడువబడెననియును, విరక్తుడై నిజాయుశ్శేషము నంతయును బైరాగియై గడిపెననియు నొకయైతిహ్యము గలదు. అతనిరాజ్యము టాగ్లకురాజ్యములో గలిపివేయబడెను. స్వతంత్రాంధ్ర రాష్ట్రముయొక్క కీర్తిప్రతిష్ఠలతనితో నస్తమించినవి.

---

# ప్రతాపరుద్రీయము.

శ్రీయుత మేడేపల్లి వేంకటరమణాచార్యులుగారు

ప్రతాపరుద్రయశోభూషణము లేక ప్రతాపరుద్రీయము అను నీయలంకారశాస్త్రమును రుద్రదేవుని యాస్థానమందున్న విద్యానాథుడను మహాకవి రచించెను. ఇది భట్టుని కావ్యప్రకాశికను, విద్యాధరుని ఏకావళినిజూచి యారీతిగా వ్రాయబడినది. దీనిని కోలచల మల్లినాథసూరి పుత్రుడగు కుమారస్వామిశాస్త్రి వ్రాసిన తరళయను వ్యాఖ్యానముతో గూర్చి K. P. Trivedi (కే. పి. త్రివేదీపండితుడు) బొంబాయిలో బ్రకటించెను. ఇది తొమ్మిది ప్రకరణములుగా విభజింపబడియున్నది. ప్రథమ ప్రకరణమందు నాయకగుణములు వర్ణింపబడియున్నవి. అందుచే దానికి నాయకప్రకరణమని పేరు. అలంకారశాస్త్రములను వ్రాసిన పూర్వపుగ్రంధకర్తలందరు దానితో సంబంధించిన సకలాంశములను ప్రతిపాదించిరి గాని తమగ్రంథములను నాయకునితో గూర్చలేదు. గ్రంధములయొక్కయు గ్రంధకర్తల యొక్కయు గొప్పతనము నాయకగుణవర్ణనమునకు నాయకునికి ఆధీనమైయున్నదని యీదిగువవ్రాసిన శ్లోకములో జెప్పియున్నాడు.

శ్లో॥ గుణాలంకారాణాం రసమహతి కావ్యే విలసితం స్ఫురచ్ఛబ్దార్థాభ్యాం తదపి హృదయానంది భవతి। తయోరప్యున్మేషస్య పదమృతమాధుర్యసుభగః పరం పుణ్యశ్లోకం చరితమనుబధ్నస్విజయతే॥" ఆహేతువుచేతనే యీగ్రంధకర్త కృతినాయకుని కావశ్యకమయిన గుణములను ప్రథమప్రకరణమందే వర్ణించియున్నాడు. నాయకుని సామాన్యగుణము

లను వానిలక్షణములను చెప్పి, నాయకులు ధీరోదాత్త ధీరోద్ధత ధీరశాన్త ధీరలలితులని నాలుగు తెగలని వారియవాంతర భేదముల తో జెప్పెను. తరువాత నాయికలను వారి యవాంతర భేదములను వారిలక్షణములను బ్రతిపాదించెను.

రెండవప్రకరణము కావ్యప్రకరణము. ఇందులోఁ గావ్యలక్షణము శబ్దార్థభేదములు, వృత్తులు, రీతులు, శయ్య, పాకము, కావ్యభేదములు, అవాంతరభేదములు, ఆఖ్యాయిక, కథ, చంపు, ఉద్ధరణము, భోగావళి మొదలగు ఖండకావ్యములు వానిలక్షణములు వర్ణింపబడినవి.

మూడవ ప్రకరణములో వివిధములైన రూపకములు, వానిలక్షణములు, ముఖ్యముగా నాటకము, పంచసంధులు, వానిఅంగములు, వానిలక్షణములు, వీనికన్నిటికి నుదాహరణభూతమైన ప్రతాపరుద్ర కళ్యాణమను నొకకళ్యాణము ప్రతిపాదింపబడినది

నాల్గవప్రకరణము రసప్రకరణము. ఇందులో నవరసములు, వానిలక్షణములు, భేదములు నిరూపింపబడినవి. అయిదాఱు ప్రకరణములలో దోషములు గుణములు నుపపాదింపబడినవి. ఏడు, యెనిమిది, తొమ్మిది ప్రకరణములలో గ్రమముగా శబ్దాలంకారములు, అర్థాలంకారములు, ఉభయాలంకారములు చెప్పబడినవి.

కావ్యప్రకాశికకంటె, ఏకావళికంటె నిందులో గావ్యాలంకార లక్షణము, నాటకలక్షణముకూడ ప్రతిపాదింపబడి యుండుటచే గ్రంథము విపులతరముగానున్నది. విశ్వనాథకవి రాజప్రణీతమైన సాహిత్యదర్పణము కూడ నిట్టిదే. చూడగానే మనస్సున కారోహించు నీనిలక్షణమేమనగా గ్రంథమందంతట బ్రతాపరుద్రునికీర్తి ప్రతాపవర్ణనము గ్రంథమందు బ్రతిపాద్యములైన సకలవిషయముల కుదాహరణములుగ నియ్యబడిన శ్లోకములన్నియు బ్రతాపరుద్రుని ప్రతాపమును, శౌర్యమును వదాన్యత్వాసుగుణసంపదను వర్ణించుచున్నవి. కావుననే యాగ్రంథమునకు గవి ప్రతాపరుద్ర యశోభూషణమని పేరిడెను. ఈగ్రంథనామము నరసింహకవి రచించిన నంజరాజ యశోభూషణమను పేరుకు సదృశముగానున్నది. విద్యాధరుడు వ్రాసిన ఏకావళిలో నుత్కలదేశాధీశ్వరుడైన నరసింహరాజు, పురోహితదైవ శంకరనానాభాయి వ్రాసిన అలంకారమంజూషలో పేష్వాలైన మొదటి మాధవరావు, అతనిపినతండ్రి రఘునాథరావు వర్ణింపబడిరి.

మల్లినాథుడు రఘువంశాది మహాకావ్యములకు దానువ్రాసిన వ్యాఖ్యానములలో నీగ్రంథశ్లోకములను బహుళముగా నుదాహరించెను.[1]

మల్లినాథుడీ గ్రంథశ్లోకముల నుదాహరించిన స్థలములయందు గ్రంథముపేరుగాని గ్రంథకర్త పేరుగాని యెచ్చటను చెప్పలేదు. హిందూదేశపు దక్షిణభాగమం దీగ్రంథము, దీని గ్రంథకర్త సుప్రసిద్ధముగా నుండుటచే నీరెంటిపేర్లను చెప్పకపోవుట వాస్తవమని మనమూహించుకొనవచ్చును. శేషగిరిశాస్త్రి యిప్పటికి నీగ్రంథము దక్షిణహిందూస్థానమందు ప్రతిసంస్కృత విద్యార్థిచేతను గృషిచేయ

1 కుమారసంభవ వ్యాఖ్యానము సంజీవినిలో, కిరాతార్జునీయ వ్యాఖ్య ఘంటాపథములోను, శిశుపాలవధ వ్యాఖ్యానము సర్వంకషలోను, భట్టి కావ్యవ్యాఖ్యానము సర్వపథీనములోను.

బడుచున్నదని సంస్కృతగ్రంథశోధననివేదికలో వ్రాసియున్నాడు విశ్వేశ్వర పండితుడు తనఅలంకార కౌస్తుభములోను, అప్పయదీక్షితులు చిత్రమీమాంసలోను, ప్రతాపరుద్రీయ శ్లోకముల నుదాహరించియున్నారు. "కతిపయదివసైః క్షయం ప్రయాయాత్ కనకగిరిః కృతవాసరావసానః। ఇతిముదముపయాతి చక్రవాకీ వితరణశాలిని వీరరుద్రదేవే" అను శ్లోకము నప్పయదీక్షితులు కువలయానందములో సంబంధాతిశయోక్తి కుదాహరణముగా నిచ్చెను.

విద్యానాథుడు:—ప్రతాపరుద్ర యశోభూషణమను నీగ్రంథముతప్ప మరియేగ్రంథమునువ్రాసినట్లుకనపడదు. D R. Anfrecht ప్రతాపరుద్రకళ్యాణమును వ్రాసెనని చెప్పియున్నాడు కాని యదిప్రతాపరుద్రీయములో జెప్పబడిన నాటకలక్షణమును సంధులను స్పష్టముగా దెలియుట కుదాహరణముగా వ్రాసిననాటకముగాని స్వతంత్ర గ్రంథముకాదు.

గ్రంథకర్తకాలము గ్రంథముయొక్క అంతరంగసాక్ష్యమువలనను (Internal evidence) ఏకశిలానగరము లేక ఒరంగలులో రాజ్యపరిపాలనముచేసిన కాకతీయరాజుల శాసనము వలనను సులభముగానిర్ణయింపబడినది. అలంకారశాస్త్రచరిత్రను వ్రాసిన (Sushil Kumar De M. A. Ph. D.) సుశీలకుమారడెగారు ప్రతాపరుద్రుని కాలమును గురించియు, విద్యానాథునికాలమును గురించియు నిట్లువ్రాసియున్నారు.

He (Prataparudra) is described as a Kakatiya King whose Capital was Ekasila-nagara in the Tilingana or Andhra country and who is said to have vanquished among other kings the princes of the Yadava family. All these and other details have led Trivedi to identify Vidyanatha's patron with Prataparudra · the seventh Kakatiya King of Ekasila or Orangal whose inscriptions date between 1298—1317 A· D. and who is placed by Sewell between 1295-1323 A. D. and by Seshagiri Sastri between 1268 and 1319 A, D. The Yadava King referred to therefore seems to be Ramachandra, sixth ruler of the yadavas of Devagiri, whose dates are 1271 to 1309 A. D. We may, therefore assign Vidyanadha approximately towards the end of the 13th and the beginning of the 14th century.

"ఒకపెద్దబండరాయి" అనునర్థమిచ్చు "ఒరుక్కల్" అనుపదము మహమ్మదీయుల ఉచ్చారణాసౌష్టముచే "వరంగల్" అయినది. అదియే సంస్కృతములో "ఏకశిలా "అయినది. ఒరంగల్ శబ్దమున కనేక విధోచ్చారణములు కలవు ఎట్లనగా—వోరంగల్లు, వోరంగోలు, ఒరంగల్లు, ఒరంగోలు, వోరువకల్లు, వోరువకల్లి, ఈవిశేషము లన్నియును, Sewell దొరగారువ్రాసిన "దక్షిణహిందూస్థానరాజవంశసంగ్రహము (Sketch of the Dynasties of Southern India) P 32) లోవ్రాసియున్నారు. ఆంధ్రదేశపుచరిత్రములో ఒరంగల్లుఅను రూపమున్నది. ఒకరాయి యని దానియర్థము, అదియే సంస్కృతభాషలో "ఏకశిలా "అయినది.

విద్యానాథుని కాలమీగ్రంథస్థసాక్ష్యము వలననే నిర్ణయింపబడుచున్నది. ఈగ్రంథమువలననే యీగ్రంథకర్త ప్రతాపరుద్రునికి సమకాలికుడని స్పష్టమగుచున్నది. ఈయలంకార

శాస్త్రములవలనను, శాసనములవలనను. ప్రతాపరుద్రుని కాలము, చరిత్రము పూర్ణముగా దెలియబడుచున్నవి ఇతడు కాకతీయవంశపురాజు. ఏకశిలానగరమందు ప్రతిష్టింపబడిన వారికులదేవతయగు "కాకతి" యనుదుర్గనితడు పూజించువాడు గావున కాకతిరుద్రుడని వ్యవహరింపబడెను (రత్నాపణమను వ్యాఖ్యానము— "కాకతిర్నామ దుర్గాశక్తిరేకశిలానగరేశ్వరాణాం కులదేవతా, సాశక్తిర్భజనీయా అస్యేతి కాకతీయః) ఏకశిలానగరము ఆంధ్రదేశమునకు రాజధానియైయుండెను. "శ్రీశైలము, కాళేశ్వరము, దాక్షారామము" అను స్థలములయందు మూడులింగములుండుచే త్రిలింగమని యీదేశమునకు బేరొదవినది గౌతమీనది, హనుమదచలము (అనుమకొండ) రాజధానికి అనగా వరంగలుకు దగ్గరగానున్నవి. దుర్గాదేవి యీ కాకతీయవంశము వారికి కులదేవతగా వర్ణింపబడినది. "కాకతికుల దుర్గాదేవీసమారాధనేన విజయప్రస్థాన మంగళంకృత్వా" ప్రతాపరుద్రునికివీరరుద్రుడని, రుద్రుడని నామాంతరములు కలవు ఇతనితండ్రిపేరు మహాదేవుడు. తల్లిపేరుముమ్మడి లేక ముమ్మడంబ.[2]

ఇతడు సూర్యునివలె ప్రకాశమానుడై యుండుటవలన ప్రతాపరుద్రుడనియు[3] కలియుగమందు ముమ్మడి పుత్రుడగుటచే త్రేతాయుగమం దవతరించిన రాముడనియు, ద్వాపరయుగమం దవతరించిన శౌరి (కృష్ణుడు) యనియు విద్యానాథుడీ గ్రంథమందు వ్రాసెను. ఈప్రతాపరుద్రుడు తనకాలమందు విద్యలను వృద్ధినొందించెను. తానుస్వయముగా పండితుడై యుండెను.[4]

అతనిభటు లంధ్రక్ష్మాభృద్భటులని చెప్పబడుచున్నారు [5] ప్రతాపరుద్రుడు వరాహధ్వజుడై నట్లొక శ్లోకము చెప్పుచున్నది.[6]

ప్రతాపరుద్రుని శత్రువులతని యనుగ్రహమును సంపాదించుటకు నాతని ధ్వజచిహ్నమైన వరాహమును తమగుండెలపై ధరించుచున్నట్లు వర్ణింపబడెను

ఇతడు "చలమర్తిగండ" యని బిరుదువ

---

2 (కావ్యప్రకరణము—20 శ్లోకము) "కౌసల్యా సీత్ప్రథమజననీ దేవకీచద్వితీయా విష్ణోర్మాతా తదనుమహితా ముమ్మడంబా తృతీయా"

3 తేనుజాతం సముద్వీక్ష్య తేజోభ్యాం రవిమివోదితం।
ప్రతాపరుద్ర ఇత్యాఖ్యామకరోత్ కాకతీశ్వరః।
విష్ణోర్విశ్వైక వీరస్య కాకతీయ కులేస్థితం]
అవతార మముంజ్ఞాత్వా వీరరుద్రం ప్రచక్షతే॥ (నాటక—ప్ర—11—12 శ్లో)

4 గోష్ఠీభిఃపరిణోపయ న్పృథగర్ణావద్ధర్శనీ వీచుభిప్ర శాస్త్రాగ్రవృత మార్గదర్శన చణైస్సూక్తైః కవీన్ప్రీణయన్ సంగీతోపనిష ద్రహస్య పికురైరాతోద్యయోగ్య శ్రీమైర్ధిన్వాన్ సంసది వైణికాన్విహారతే శ్రీకాకతీంద్రోనృపః॥

5 యోద్ధారోపయ మిత్యరీనభి భవంత్యాంధ్ర క్ష్మాభృద్భటాః॥

6 "మన్థానాచల మూలమేచకలా సంఘట్టనశ్యామికా కారం యత్తుహినద్యుతౌ స్ఫురతి తత్పారంగ మాచక్షతే। మన్యేవన్యహా వీరరుద్రనృపతేః కీర్తిశ్రియానిర్జిత స్తన్మాద్రాంక వరాహమిందురరసాటిత్రస్యమాజ్జృంభతే॥"

హించినట్లీ గ్రంథమందున్నది. "చలమర్తి గండ" అనగా యుద్ధమునుండి పారిపోవు మర్త్యులకు పెద్దపాషాణము, లేకయుద్ధమునుండి యెప్పుడుమరలని ధైర్యముగలవాడని యర్థము.[7]

ఇంతియకాక నాటకప్రకరణములో నుదాహరణముగా వ్రాయబడిన ప్రతాపరుద్ర కళ్యాణమను నాటకము ప్రతాపరుద్రుని గురించియు, కాకతీయవంశపు రాజులనుగురించియు, గొంతవృత్తాంతమును దెలియజేయుచున్నది.

స్వయంభువు (శివుడు) కుటుంబస్థుల కందరికి వారివారి కృత్యములయందు దగినయుపదేశము లొనర్చు నిష్టదైవముగా నున్నట్లు చెప్పబడియున్నది.

వ్యాఖ్యాతయగు కుమారస్వామి చెప్పినట్లామె నిజమైనపేరు రుద్రాంబ, కాని ప్రతాపరుద్రీయవ్యాఖ్యాత యీరుద్రాంబ గణతిరాజు భార్యయని భ్రమజెందినట్లు రుద్రాంబి కావర్ణనశ్లో కావతారికవలన స్పష్టమగుచున్నది. ఎట్లనగా:—

"పురాకిల కాకతికులసంభూతే గణపతి నామ్ని మహారాజే దుహితృమాత్ర సంతానే కదాచిద్దైవ యోగేన కాలపరిపాకముపేయుషి తన్మహిషీ రుద్రమదేవీ నామరాజ్ఞీ బహూనివ ర్షాణి తద్రాజ్య మకంటకం పరిపాల్య"

(Professor Trivedi's Edition—P. 147—నాటకప్రకరణము చూచునది) రుద్రమదేవి గణపతికుమార్తెగాని భార్య కాదని నవీన చారిత్రక శోధనవలన (Historical Research) దెలియవచ్చినది. మనుష్యులలో 'సోమ'యని వ్యవహరింపబడు నామె యీరుద్రాంబికతల్లి. సాక్షాత్తుగా ఉమ. గణపతినామమును ధరించిన ఆమెతండ్రి సాక్షాత్తుగా శివుడగుటచేత నమెగొప్పతనము చూపింపబడెను. గణపతిదేవుని యనంతరమందామె సింహాసనమెక్కెను. రుద్రదేవునికి శివుడు స్వప్నమందు దర్శనమిచ్చి ప్రతాపరుద్రుని గొప్పతనమును స్తుతించి మనుమడైన యతనిని బుత్రునిగా దత్తతచేసికొమ్మనియు రాజ్యభారమతనియందుంచుమనియు జెప్పెను.[8]

తరువాత నీప్రతాపరుద్రుడు యౌవరాజ్య పట్టాభిషిక్తుడు కాకముందే దిగ్విజయార్థముబయలు వెడలెను. మొదట తూర్పుదిక్కుకు బయలుదేరి కళింగదేశమును జయించెను. కళింగదేశమనగా నిప్పటి యుత్తరసర్కారులు. పిదప దక్షిణముగా బయలుదేరి పాండ్యదేశమును వశపర్చుకొనెను. పాండ్యదేశమిప్పటి మధుర. పిదప బశ్చిమదిక్కును గెలిచెను. అనంతరము నర్మదదాటి యుత్తరదిక్కునకు బోయెను. అచట నంగవంగ మాళవరాజులు ముగ్గురేకమై యతని నెదిరించిరి. అందుపై ప్రతాపరుద్రుని సేనాధిపతులు స్వరాభువులై వారిని నిందించిరి. ఈయుద్ధమునందు ఘూర్జ

---

7 "చలానాం రణభీతానాం మర్త్యానాం గండః స్థూలోపల ఇవ ద్వన్ద్వాకారః యద్వా చలా స్థిరా పృథ్వీ తస్యా రాజా వా భావాచ్చలమర్త్యగండ ఇతి అభియుక్తోపలబ్ధిః". కొన్నిచోట్ల చలమర్త్యగండ యనికూడ బ్రయోగమున్నది. "కుర్వంత్యశేషాల మర్త్యగండినృపతే ద్వైతాః ప్రయాంత్యద్య మాః"

8 "స్వీకృతే పుత్రభావేన దౌహిత్రే పాద్మమాజ్ఞయా। అస్మిన్ని ధేహి ధారేయే గుర్వీ ముర్వీధురామితి"

(నాటకప్ర—29 శ్లో)

రులు, లంపాకులు, వంగదేశస్థులు, కొంకణులు, హూణులు, మహారాష్ట్రులు, గెల్వబడిరి. చోళ కాశ్మీర నేపాళ సుహ్మకాంభోజ సేవన (నాసిక మొదలుకొని దేవగిరివరకు వ్యాపించిన దేశమునకుపేరు) గాడలాట.సింహళ కర్ణాట భోజ కేరళ పాంచాల కీకట దేశములను ప్రతాపరుద్రుడు జయించెను [9]

యాదవవంశపు రాజులకు శిరోరత్నమైన సేవనుడనురాజు మహాపరాక్రమవంతుడైనను ప్రతాపరుద్రుని రణభేరీధ్వనిని విని పారిపోయెనని వర్ణింపబడినది.

ఈసందర్భమున జెప్పబడిన సేవణరాజే ప్రతాపరుద్రుని సైనికులచే నధిక్షిప్తుడై పారిపోవుట గొప్పమినదికూడ నెరిగియున్నదని మఱియొకచోట వర్ణింపబడియున్నది.[10]

యాదవరాజు ఏకశిలానగరమువద్ద గౌతమీనదినిదాటి వచ్చుచుండగా వీరరుద్రుని సేనాధిపతి తిరిగి యానదినిదాటి తనరాజ్యములోనికిబోవునట్లు చేసెను. ఈయాదవరాజు పేరు రామచంద్రుడు లేక రామదేవుడు. ఇతడు దేవగిరిలోనేలిన యాదవరాజులలో నారవవాడు వీనికాలము 1271—1309.

గణపతిరాజు గణపేశ్వరుని విగ్రహమును ప్రతిష్ఠచేయించెనని ప్రతాపరుద్ర కళ్యాణ నాటకములో జెప్పబడియున్నది. [11]

నాటక ప్రకరణములో గనపర్చబడిన ప్రతాపరుద్రుని వంశవృక్ష మీరీతిగానున్నది.

గణపతి (సోమను పెండ్లియాడెను)
|
రుద్రాంబిక (రుద్రయని ప్రసిద్ధి)
|
ముమ్మడంబ (మహాదేవునిభార్య)
|
ప్రతాపరుద్రుడు



---

9 నాటక—ప్ర॥ 14 శ్లో॥ రేరేగూర్జర జర్జరోసి Etc.

10 రాజ్ఞో యాదవవంశపార్థివమణేః ప్రఖ్యాతశౌర్యశ్రియః। స్త్వంగత్తుంగతురంగసైన్యమహతో మూర్తైకవిత్తస్య చ। సద్యో రుద్రనరేంద్రనాయకచమూనాథేన కేనాప్యధిక్షిప్తస్యాచరితాని సేవణపతే ర్గానాతిసాగాతిమి॥

11 నాటక—ప్ర—21 శ్లో॥ యస్త్వద్గోత్రమహాత్తరస్య జగతాం త్రాతు స్స్వయంభూవిభోః స్తత్తాద్భ్యకృతాద్భుతోగ్రమహిమా స్వీయైర్విశేషై రభూత్। దేవోఽసౌ గణపేశ్వరః ప్రతికలం స్వాగ్రప్రసాదోన్ముఖో। వస్తు స్తే కులమందనస్య మహతీం పుష్ణాతు రాజ్యశ్రియమ్॥

# ఓరుగల్లు చరిత్ర.

మౌల్వీ సయ్యద్ అహమదుల్లా ఖాదిరీసాహెబ్ గారు.

౧

ఓరుగల్లు దక్షిణహిందూస్థానమందు గొప్ప ప్రసిద్ధి వహించినట్టి చారిత్రకనగరము. ఈ నగరమును కాకతిప్రోలరాజు క్రీ. శ. (1150 1163) నిర్మించెను. ఇతనికనేకశతాబ్దములపూర్వ మీ రాజ్యము ఆంధ్రరాజులచే బాలింపబడినది. తర్వాత కాకతీయులు దాని నాక్రమించుకొనిరి.

ఓరుగల్లు ప్రకృతము నిజామురాష్ట్రమునకు దక్షిణభాగమందున్నది. దీనిచుట్టును చాందాజిల్లాయు, కృష్ణాగోదావరీ నదులు, నల్లగొండ, అత్రాపుబల్దాజిల్లాలును, మెదకు కరీంనగరు జిల్లాలును గలవు. ఇది సముద్రమునకన్న సుమారు ౨౦౦౦ అడుగులయెత్తుననున్నది. తర్వాతికాలములో ముసల్మానులు దీనిని వారంగల్ అని పేర్కొనినను ప్రాచీనమున దీనిని ఓరుగల్లు అనియే వ్యవహరించిరి. రఘునాథభాస్కరుని కోశములో దీనిపేరు సంస్కృతమున ఏకశిలానగరమని భాషాంతరీకరణమొనర్చిరి. ఏకశిలయన "ఒకగుండు" అనియర్థము. ఓరుగల్లుయొక్క శంకుస్థాపన మొకపెద్దగుండుపై చేసినందున నీపేరువచ్చినదని యూహింపబడుచున్నది. యూరపు ఖండమున సుప్రసిద్ధుడగు డాక్టర్ లాసేనుగారు తనభూగోళములో దీని ప్రాచీననామము 'అరణ్యకొండ' అని వ్రాసినారు. ఇదిపొరపాటు. వలనన బహుకాలము క్రితము బెంగాలురాయల్ ఏషియాటిక్ సొసైటీ జర్నలులో దీని విషయమై గొప్పచర్చజరిపి తుదకు దీనిప్రాచీననామము అన్మకొండ (అనమకొండ లేక హనుమకొండ) అని నిర్ణయించిరి. బట్లీమూసుయొక్క భూగోళములో పేర్కొనబడిన "కోరంకోల" అనునదియే యీ ఓరుగల్లు అని జనరల్ కన్నింగుహాముగారు నుడివియున్నారు.

౨

దక్షిణ హిందూస్థానమందు ఆంధ్రుల యధికారము క్షీణించినకాలమందు కాకతీయగణపతివంశము ఓరుగల్లు పై రాజ్యము చేయదొడగెను. ఇదొక్కవంశమే దక్కనులో మామూలుకన్న నెక్కుడు ప్రఖ్యాతివహించినట్టిది. ఆంధ్రులయొక్కయు చాళుక్యులయొక్కయు ప్రభుత్వముల యనంతరము, ముసల్మానుల యాక్రమణానంతరముసహిత మీ సామ్రాజ్య మొకవిధముగా తనశక్తిని నధికారమును నిలుపుకొనగలిగెను. దీనిస్థాపన విషయమై చరిత్రకారులలో బహు భేదాభిప్రాయములు కలవు. కొందఱిది క్రీస్తుశకము ౧౨ వ శతాబ్ద మధ్యకాలమందు వృద్ధిపొందెనందురు. అనేకులు దీనియత్యంత ప్రాచీనత నొప్పుకొందురు. ఈరెండవ పక్షమువారి యభిప్రాయమున నీసామ్రాజ్య ప్రారంభము క్రీ. శ. ౭వ శతాబ్దికన్న పూర్వమునుండియే కలదని వాదింపబడుచున్నది. వలన క్రీ. శ. ౭వ శతాబ్దమందు సుప్రసిద్ధుడగు చీనాయాత్రికుడగు హ్యూయాన్‌సాంగ్ హిందూస్థానమందు

సంచారముచేసి దక్కనులోని రాజ్యములను గురించి చెప్పుచు నొకచో "దానా కాకతీయ వంశము"యొక్క సూచన చేసియున్నాడు. దీనిప్రాచీనతకు రెండవసాక్ష్య మేమన హిజిరీ ౧౨వ శతాబ్దిలో ప్రఖ్యాత చరిత్రకారుడగు "బదీవానీ" దీనిప్రారంభము క్రీ. శ. ౭వ శతాబ్దముకన్న మున్నేయని నుడివియున్నాడు. ఇతడీవంశము తనకాలమువరకే ౭౦౦ ఏండ్లనుండి రాజ్యముచేసినట్లు చెప్పియున్నాడు.

ఈ వంశమునుగురించి తెనుగు అరవ భాషలలో నేప్రకారము విశేష చర్చ కలదో యట్టి దేయితరభాషలందును లేనట్లు తోచుచున్నది అయినను హిజిరీ ౧౩ వ శతాబ్దమధ్యాంత్యకాలములలో తెనుగు అరవము కన్నడములోనుండి ఉర్దూ, ఫార్సీభాషలలోని కనువదింపబడిన యీవంశచరిత్ర కొంత విపులముగా లభ్యమగుచున్నది. ఎట్లన ౧౨౪౫ హిజరీలో మున్షీఖాదిర్ ఖాన్ (బిద్రీ)అనునతడు ఖుతుబుషాహీ సుల్తానుల చరిత్ర నొక దానిని వ్రాసెను. దానిపేరు "తారీఖెఖాదిరీ."ఇందు వరంగల్ రాజుల విషయములు కూడగలవు. నిజమేమన, నీచరిత్ర తెనుగులో నుండిన "ప్రతాపచరిత్రము" నుండి గ్రహింప బడినది. ఈవంశము యొక్క ప్రారంభమును గురించి యిట్లు వ్రాయబడినది—

"నందగిరి (ప్రకృతపునాందేడు) లో నందడను పేరుగల యొక రాజుండెను. అతనియనంతరము యతని రాజ్యమును తన యిద్దఱు కుమారులు పంచుకొనిరి. ఒకడు "హనుమంతగిరిని" (ఇదియే హనుమకొండ) పాలించెను. ఇంకొకడు ఖందహారును తనరాజధానిగా జేసికొనెను (ఈఖందహారు నిజామురాష్ట్రమందలి నాందేడు జిల్లాలోని పశ్చిమదిశయందలి తాలూకామైయున్నది) మొదటి రాజు వంశము సంతానహీనమై నిలచిపోయెను. రెండవ వాని వంశము బాగుగా వర్ధిల్లెను. వీని ప్రతాపమును కటకము రాజు విని వీనిపై దండెత్తివచ్చెను. ఈ యుద్ధములో ఖందహారు రాజు సైన్యమోడెను. రాజుచచ్చెను. తదనంతర మాతని భార్య గర్భవతి యచ్చటి నుండి హనుమకొండకు పారిపోయి యొక బ్రాహ్మణు నింట దాగి యచ్చటమాధవవర్మ యను బాలుని గనెను. ఇతడే కాకతీయవంశ మూలపురుషుడు." "తారీఖెఖాదిరీ" గ్రంథకర్త ప్రతాపచరిత్రనాధారముగా గొని యీవంశ విషయమై యిట్లు చెప్పుచున్నాడు—

"ఓరంగల్ రాజుల వంశమని పేరుగాంచిన యీవంశము చోళవంశముతో సంబంధము కలది. దీనిమూలపురుషుడు మాధవవర్మ చోళరాజులయింటి కన్యనొకదానిని వివాహమాడెను."

డాక్టర్ బర్నెల్ యీవంశనామమగు "కాకతీయ" పదమును గురించి బాగుగా చర్చించి యిట్లువ్రాసియున్నాడు—

"కుమారస్వామిగా రనినట్లుగా యీవంశనామము దుర్గాదేవియొక్క నామము ననుసరించి యేర్పడినది."

3

మొదట వరంగలురాజులు సామంతరాజులుగా నుండిరి. విటపిరాజ్య మంతమొందినపుడు దానిని రాష్ట్రకూటు లాక్రమించుకొనిరి అదేసమయమున వరంగల్ రాజులు తమస్వాతంత్ర్యమును ప్రకటించుకొనిరి. క్రమేణ వారిసామ్రాజ్యము చాలవిస్తృతి నొందగా కొలదికాలములోపలనే దక్కను భాగమున కంతకు సమ్రాటులయిరి. ఈవంశపు మొద

టిరాజు త్రిభువనమల్లుడు. ఈతని ప్రశంస చరిత్రలో చాలకొలదిగా గానవచ్చుచున్నది. మఱియు అనేకచరిత్రకారు లితఁడీ వంశముతో సంబంధము లేదనియే నిర్ణయించినారు.

ఇతనియనంతర మితనికొడుకు ప్రోలరాజు (౧౧౫౦—౧౧౬౩ క్రీ. శ.) రాజ్యాభిషిక్తుడయ్యెను. ఇతడు చాళుక్యరాజగు తృతీయ తైలపుని యుద్ధమందోడించెను. ఇతని కాలమందే వరంగల్ అపూర్వాభివృద్ధి నొందెను. ఇతనిజీవనము విశేషభాగము యుద్ధములందే వినియుక్తమయ్యెను. ఇతని విజయములపట్టిక చాలపెద్దది. తనకుప్రతికూలుడై యాచరించిన గోవిందరాజును సంపూర్ణముగా పాదాక్రాంతునిగా జేసి, యతనిజెగపట్టి, వాని రాజ్యమును యాదవరాజు కొకనికిచ్చెను. అతని రెండవయుద్ధము ఇప్పుడు విస్తృతమైనట్టి "మండకోట" (మాన్యఖేట ?)పై జరిగెను. ఈప్రోలునే కాకతీయులలో బ్రథమునిగా నెంచుచున్నారు. ఇతడే వరంగలు రాజ్యస్థాపన గావించెను.

ఇతనియనంతరము ప్రథమ రుద్రదేవుడు రాజయ్యెను. ఇతడే వేయిస్తంభముల దేవాలయమును గట్టినవాడు. ఇతనిచరిత్రాంశములు హనుమకొండలోని శాసనమున గననగును. యాదవవంశమందు పదునారవరాజగు "మల్లుగి" రాజుయొక్క ముఖ్యపట్టణమగు "సీనదేశ" మును నితడు జయించెను. మరియు పాలవాసిరాజు నొకగొప్పయుద్ధమందు నిర్జించెను. చోళచాళుక్యరాజ్యములపై ప్రభుత్వము చేయుచుండిన భీమరాజు నోడించి యతని రాజ్యమందలి కొంతభాగమును తనరాజ్యములో గలుపుకొనెను.

ఇతనికాలములో గొప్పగొప్ప దేవళములు సుందరమైన మందిరములు నిర్మింపబడెను. ముఖ్యముగా నితడు వరంగలు సరిహద్దుల నే విధముగా విస్తరింపజేసెనో యావిషయమితని నెల్లప్పుడును స్మరింపజేయునట్టిది. ఇతడు చనిపోయినప్పు డితనికి సంతానము లేకుండెననియు, మహాదేవుడను నొకతమ్ము డుండెననియు ప్రతాపచరిత్రమందు వ్రాయబడినది.

మహాదేవునియనంతర మతని కుమారుడు గణపతిదేవుడు రాజ్యమును బాలించెను. అది నుండియు దేవగిరి యాదవులకును కాకతీయులకును మనస్తాపములుండుచు యుద్ధములు జరుగుచుండెను. కాని యిప్పుడీ గణపతి శాంతిప్రియుడై యాదవులతో సంప్రతించియుండెను. స్నేహమును వృద్ధిపఱచు నిమిత్తమై యాదవుల కన్యను బెండ్లాడెను. ఈరాజు పరిపాలనమందును దిగ్విజయమందును ప్రథమరుద్రదేవునితో సమానుడు. ఇతడు పరదేశములజయించి వానిని నాశనము చేయనొల్లడు. ఎందుజూచినను సుందర నిర్మాణములనుజేసి శిల్పకళలకును సంగీత సాహిత్యములకును పోషకుడయ్యెను. ఇతనికి సాహిత్యమందు మంచిఅభినివేశముండెనని ప్రతాపచరిత్రకారుడు వ్రాసినాడు. ఇతనియాస్థానమందు గొప్ప గొప్ప పండితులు గుమికూడియుండిరి. ఇతడే ఓరుగల్లు చుట్టును దిట్టమైన (జబర్దస్తు) కోటను నిర్మించెను. ఓరుగల్లు కోటలో నిప్పుడసంపూర్ణమై శిథిలమై యుండు దేవాలయ మితనిరసికతకు నిదర్శనము. ఇది అసంపూర్ణమైనను నేటికాలమందును నీదేవాలయము దక్కనులోని వ్రేళ్లలెక్కింపదగిన శిల్పరాజములలో ముఖ్యమైనది. ఇతని కాలములో వరంగల్లు రాజ్యవిస్తీర్ణము మరింత వృద్ధిగాంచెను. దక్షిణగుజరాతు రాజ్యము

ను బెంగాలురాష్ట్రమును నితనికి లోబడిపోయెను. ఇతనిరాజ్యపు సరిహద్దు దక్షిణమున నెల్లూరు వఱకు వ్యాపించెను. తూర్పుదిక్కున నుండు రాజ్యములును ఇతనికి లోబడెను. ఇతడు క్రీ. శ. ౧౨౫౭ లో మరణించెను. కాని కొందఱుచరిత్రకారు లితడు ౧౨౬౧ లో చనిపోయెననివ్రాసిరి. ఈరాజుకు సహితము సంతానములేకుండెను. ఇతని యనంతర మితని భార్య(?) రుద్రమదేవి (క్రీ. శ. ౧౨౬౧-౧౨౯౪) రాజ్యముచేసెను. ఈమె విషయమై మార్కోపోలో తనగ్రంథమందిట్లు వ్రాసెను. "ఈరాణి రాజ్యమందీమె భర్తకాలమందునులేని వ్యవస్థ యేర్పాటుచేయబడియుండెను" ఈమె 32 ఏండ్లురాజ్యము చేసెనని డాక్టరు హేగువ్రాసినాడు. గణపతి ౧౨౬౧ లో చనిపోయెనని నిర్ణయించిన నీమె 33 ఏండ్లురాజ్యముచేసినట్లు నిశ్చయమగును. ౧౨౯౪ లో నీమె రాజ్యభారము వదలుకొనెను. ప్రతాపరుద్రుడు రాజయ్యెను. ఇతనికాలములో రాజ్యవిస్తీర్ణము పాలేరు గోదావరీ నదులమధ్యభాగమునుగూడికొని పడమటికనుమలవరకు వ్యాపించెను. ప్రతాపరుద్రుని కాలమున వరంగల్లు రాజ్యముక్షీణత నొందజొచ్చెను. మొట్టమొదటి మారు ౧౩౦౩ క్రీ. శ. లో ముసల్మానుల దాడిప్రారంభమయ్యెను. కాని ముసల్మానులు జయముపొందజాలరైరి. 7 వత్సరముల తర్వాత మరల క్రీ. శ ౧౩౧౦ లో మలిక్ కాఫూర్ దండెత్తివచ్చి యీరాజు సామంతుడగుట కొప్పుకొనుటచే నీతని విడిచిపుచ్చెను. కాని తర్వాత నీరాజు తనపేరు ప్రతిష్ఠలు నిలుపుకొనుటకై తనస్వాతంత్ర్యమును బ్రకటించికొనెను. అందుచే మరల రెండవమారు సుల్తాన్ మహమ్మదుతొగ్లకు అమీర్ గయాసుద్దీన్ యొక్క అనుమతిచే దాడివచ్చి, ప్రతాపరుద్రుని జయించి, వరంగల్లును ఢిల్లీసామ్రాజ్యములో కలుపుకొని, రాజును బందీకృతునిజేసి ఢిల్లీకి పంపెను. కాని గయాసుద్దీనంతటిగొప్పరాజు నీస్థితియందుజూడ నొల్లక త్వరలో నాతని వదలిపెట్టెను. మరియు వరంగల్లునుగూడ వాపసుఇచ్చెను. ఈ కారణముచే వరంగల్లు కళాహీనమై దానియంగము లాకురాలిన వృక్షమువలె నొకటొకటిగా జారిపోయెను.

ప్రతాపరుద్రుని యనంతరము వీరభద్రుడు లేక కృష్ణుడు అనునతడు రాజయ్యెను. ఇతడీ వంశసంబంధీకుడు. కాని యితడు కొంత కాలములోపలనే రాజ్యకాంక్షవదలి విస్మృతుడయ్యెను. ఇతనియనంతర మీవంశముయొక్క విషయములు మనకేమియు తెలియవు. అయినను తెలింగానా హిందువులు క్రీ.శ. ౧౩౨౩-౧౩౪౪ ప్రాంతములలో మహమ్మదు తుగ్లకు యొక్క అంత్యకాలములో తిరుగుబాటు చేసినట్లు కనబడుచున్నది. ఈవంశమువాడగు కన్నయ్య నాయకుడనువాడు ముసల్మానుల పారతంత్ర్యమును ద్రోసిపుచ్చి తన స్వాతంత్ర్యమును బ్రకటించికొనెను. తుగ్లకు ఈతని మరలజయించి తన యధికారమును పునస్థాపన చేసెను. కాని మహమ్మదుతుగ్లకు వంశమందు సామర్థ్యము క్షీణింపగా, అలాఉద్దీన్ హసన్‌బహామనీ వరంగలురాజులను ఢిల్లీసుల్తానులకు మారుగా దనకే కప్పముకట్ట నిర్బంధించెను. అటుపిమ్మట క్రీ. శ. ౧౪౨౨ లో బిదరులోని బహామనీసుల్తానులకు వరంగలు వశమయ్యెను. తర్వాత నిది గోలకొండ ఖుతాబుషాహీలకు లోబడెను. ఇప్పుడిది అసిఫియావంశమువారి పరిపాలనలో నున్నది.

# పాలకురికి సోమనాథకవి

శ్రీయుత బండారు తమ్మయ్యగారు.

ఉ॥ తేనియ సోనలం జిలుకు ♦ తేటగు జాను దెనుంగుఁబల్కులన్
వీనులఁ దన్పు కబ్బముల ♦ నిక్కపు దేసి తెనుంగుఁ గైతలన్
బ్రాణము వోసినట్టి బుధ ♦ వంద్యుని శ్రీబసవేశచింతనా
సూనృతచిత్తుఁ బాల్కురికి ♦ సోమకవీంద్రుని సంస్మరించెదన్॥

కాకతీయులు శిల్పకళతోపాటు కవితా శిల్పమునుగూడ ననల్పముగఁ బోషించిన మహనీయులు ఆంధ్రగీర్వాణవాఙ్మయములకు వారొసంగిన యవలంబము చిరస్మరణీయము. రెండవప్రతాపరుద్రుని యాస్థానకవిగా నుండిన విద్యానాథుఁడు రచించిన ప్రతాపరుద్రయశోభూషణమను నలంకారగ్రంథ మా ప్రతాపరుద్రచక్రవర్తి కీర్తి రమకేగాక సంస్కృతాలంకార వాఙ్మయలక్ష్మికెల్ల శాశ్వతామూల్య విభూషణమయి వెలుఁగొందు నట్లే, మొదటి ప్రతాపరుద్రుని యాశ్రయము నొంది పాలకురికి సోమనాథుఁడు రచించిన బసవపురాణ పండితారాధ్య చరిత్రము లాంధ్రకవితాసతి కనుపమానాలంకారము లయి విరాజిల్లుచున్నవి. కాకతీయులనాఁటి గీర్వాణ వాఙ్మయమునకు విద్యానాథుఁ డెట్టివాఁడో యాంధ్రవాఙ్మయమునకు సోమనాథుఁ డట్టివాఁడు.

కాని యీ సుకవిసోముఁడు వీరశైవవ్రతశీలుఁడయి కేవలము తన్మతగ్రంథములనే రచించినవాఁ డగుటచే జనసామాన్యమున కాతనినామ మంతగాఁ బరిచితము కాకపోయెను. భాషావిశేషములు, చారిత్రక విషయములు తెలిసికొనఁగోరు నేకొలఁది భాషాసేవకులకో తప్ప వీరశైవ మతాంతరులలో నెవరికి నీతని గ్రంథములను జదువు నాసక్తి లేకుండుటయు, ఆంధ్రభాషాభిమానమున కవలంబములయిన యిప్పటి శుద్ధాంధ్ర మండలములలో వీరశైవ మతమిప్పుడు విశేషవ్యాప్తిలో లేకుండుటయు, ఆమండలములలో స్వల్పసంఖ్యాకులయి యున్న తన్మతస్థులయినను బహువు రిప్పుడు విద్యామతములు రెంటియందును వెనుకఁబడి యుండుటయు, రానురా నాంధ్రవాఙ్మయమున నిరసనమునకు గుఱియయిన ద్విపదలో నీతఁడు తన ప్రధాన గ్రంథములు వ్రాసియుండుటయు, అచ్చుపడిన యీతని గ్రంథములయినను బరిశుద్ధముగ ముద్రింపఁ బడకుండుటయు, నీతఁడును నీతని కావ్యములును వెనుకఁ బడుటకు ముఖ్యకారణము లయినవి. వీరశైవ మతాభిమానులొక్కరికేగాక యాంధ్ర భాషాభిమానులందఱకుఁగూడ నీకవివరుని గ్రంథము లవశ్యపఠనీయములని విన్నవింపఁ దగియున్నది. తేనెలొలుకు తెలుంగుబాన నుడికారపు సొంపును, సహజమాధుర్య విలాసములను జవిచూచి, యాంధ్రకవితాసతి యథార్థ స్వరూపమును దిలకింపఁ గోరువారెల్ల నీ సు

కవిచంద్రుని బసవపురాణ పండితారాధ్య చరిత్రములను జదివినఁగాని కృతార్థులు కాఁజాలరు. తెలుంగుకవితను మూఁడుపాళ్ళు సంస్కృతపదములతో నిర్మించిన నన్నియభట్టారకుని మార్గమునకు వన్నియ వెట్టఁదలంచి, తెలుంగుకవిత నిక్కంపువిన్నాణము, పొందము, తేఁటయలోలుకు తెలుఁగుఁబలుకు బడుగల లోనే కలదని గ్రహించి, మూఁడుపాళ్ళు రసోచితములగు జానుతెనుంగు నుడులతో నాంధ్రీకరణ యుగారంభముననే స్వతంత్ర కావ్యరచనమునకుఁ గడంగి, యాంధ్రకవితా మహౌషధికి జీవనము వోసిన కళానాథుఁడు పాలకురికి సోమనాథుఁడే. అసదృశ నైపుణ్యముతో రస మొలుకు దేశీయపదజాలమును గూర్చి జాతీయకవితా నిర్మాణమొనర్చిన నన్నెచోడ, తిక్కన, నాచన సోమనాథాది మహాకవులకెల్ల మన సుకవిసోముఁడే మార్గదర్శకుఁడనుట సత్యదూరము కాదు. సిక్కమగు తెలుఁగుకవితకు మూలస్తంభమయి వెలసినవాఁడయ్యు నీమహానీయుఁడు పూర్వోక్త కారణములచే విస్మృతిపాలయ్యుఁ దగుటచే గవిచరిత్రకారులగు శ్రీవీరేశలింగముపంతులుగారు తమ గ్రంథమున నీతని కర్హగౌరవ మొసంగి యీతని కవితావిశేషాదికములను దగువిధమున వెలయింపరయిరి శబ్దరత్నాకరకారు లీతని గ్రంథములను దలస్పర్శముగఁ బరిశీలించి యాంధ్రవాఙ్మయమున నీతనికిఁగల స్థానమును గుర్తింపనేరక తమనిఘంటువునం దీతని నామాన్యకవులతో పాటు కడపటి తరగతిలోఁ జేర్చిరి. కావున నీతనిజీవితమును గవితావిశేషాదికములను లోకమున కుచితరీతిని దెలియఁజెప్పి యీతని గ్రంథములు సత్వరముగఁ బండితపరిష్కృతములయి పరిశుద్ధముగఁ బ్రకటింపఁబడవలసిన యావశ్యకతను హెచ్చరించుటకయి ఆంధ్రపత్రిక దుందుభి సంవత్సరాది సంచికలో నొకచిన్న వ్యాసముఁ బ్రకటించితిని. ఈకవివరుని బసవపురాణమును, వృషాధిపశతకమునుమాత్ర మిప్పటికిఁ బరిశుద్ధముగఁ బరిష్కృతము గావించి ప్రకటించిరి. చరిత్రాభిమానులకు నీమహాకవి చరిత్రాదికములు మఱింత విపులముగఁ దెలియుటకయి యిప్పుడీవ్యాసమును బ్రకటించుచున్నాను.

సోమనాథుని స్థలము:—ఈతఁడు కాకతీయ రాజధానియగు నేకశిలానగరమునకు సమీపమందున్న పాలకురికి గ్రామవాస్తవ్యుఁడయినట్లు లీతని గృహనామమును బట్టియు, నీతని శిష్యప్రశిష్యుఁడగు పిడుపర్తి సోమనాథకవి యీతని కంకితముగా రచించిన పద్య బసవపురాణము యొక్క యవతారికనుబట్టియుఁ దెలియనగును. ఈతని శిష్యప్రశిష్యకోటిలోఁ జేరిన మరియొక కవి యీతనికంకితముగా రచించిన అన్యవాద కోలాహలమను సీసశతకము నందలి పద్యమువలనఁగూడ నీవిషయము విశదము కాఁగలదు.[1] పాలకురికియందు వెలసిన శివలింగ

---

1 సీ॥ భవవిదూర సంబంధ బంధురంబయ్యెనే। భాగ్యంబు చేసినో పాలకురికి
భవదంఘ్రిపూజనా పరులకిమ్మయ్యెనే। భాగ్యంబు చేసినో పాలకురికి
యుష్మద్విహారసంయుక్తమై వెలసెనే। భాగ్యంబు చేసినో పాలకురికి
యుష్మదీయాశ్రితా త్యున్నతిఁ బొందెనే। భాగ్యంబు చేసినో పాలకురికి
గీ॥ పాలకురికి యెట్టి భాగ్యంబు చేసెనో నీస్వనామపూర్వ నిహితమయ్యె
నీహితానుషంగ! యోగామ్రిగురుచిత్త నలినభృంగ! సోమనాథలింగ॥

మునకు సోమేశ్వరుఁడనిపేరు. ఆదేవుని నామము బట్టియే మనకవి తలిదండ్రు లాతనికి సోమనాథుఁడని పేరిడినట్లు కాననగును. ఈసోమేశ్వరస్వామి కంకితముగానే సోమనాథస్తవమను చిన్న ద్విపదకృతి యొకటి సోమనాథుఁడు తన ప్రథమవయస్సులో రచించియున్నాఁడు.

సోమనాథునికాలము:—సోమనాథుని యనంతరము రమారమి మూఁడువందల సంవత్సరముల కనఁగా క్రీ. శ 1530 ప్రాంతమునను౦డిన పిడుపర్తి సోమనాథకవి తన పద్యబసవపురాణావతారికలో మన పాలకురికిసోమనాథుఁడు రచించిన ద్విపదబసవపురాణము నోరుగల్లులో స్వయంభూదేవు మంటపమున నొకనాఁడు భక్తులు చదువుచుండగాఁ గాకతిప్రతాపరుద్రుఁ డచ్చటికేతెంచెననియు, నప్పుడు ధూర్తవిప్రుఁడొకఁ డాగ్రంథమును నిందింపఁగా నీవార్త విని, సోమనాథుఁడోరుగంటి కేతెంచి బ్రాహ్మణులనోడించి ప్రతాపరుద్రునిచే సత్కారముల నొందెననియుఁ జెప్పినాఁడు. మఱియు సోమనాథుని శిష్యుఁడును బ్రతాపరుద్రుని మంత్రియునగు ఇందుఁలూరియన్నయచేఁ దనపూర్వులగు శివరాత్రి కొప్పయ్య మున్నగు సోమనాథుని శిష్యులకు దోకిపఱ్ఱుగ్రామము నగ్రహారముగా నిప్పించెననియు, దేశము త్వరలోఁదురుష్కాక్రాంతము కానున్నదనియు, చెప్పి సోమనాథుఁడు తన యాచారవ్యవహారముల కచ్చట భంగము వాటిల్లునని తలఁచి యటనుండి వెడలి కర్ణాటదేశమున శివగంగకు సమీపమునను౦న్న కలికెమను గ్రామమున సమాధి నేర్పఱచుకొని, కొన్నాళ్ల కచ్చట సిద్ధినొందెననియు వ్రాసియున్నాఁడు. ఈకథను బట్టి సోమనాథుఁడు రెండవప్రతాపరుద్రుని (క్రీ. శ. 1290—1326) కాలమువాఁడనుట సంగతముగా నుండును. ఈప్రతాపరుద్రుని యనంతరమే కాకతీయసామ్రాజ్య మస్తమించి దేశము తురుష్కుల యధీనమయ్యెను. ఇందులూరి యన్నయదేవుఁడు రెండవప్రతాపరుద్రుని మాతామహియగు కాకతి రుద్రమదేవి కొమరిత రుయ్యాంబికను వివాహమై రుద్రమదేవి కాలమునను రెండవప్రతాపరుద్రుని కాలమునను దన యవక్రవిక్రమంబున గాకతి సామ్రాజ్యమును విస్తరింపఁజేసిన పరాక్రమశాలి. ఈతనిశాసనములు క్రీ. శ. 1290—1295 ప్రాంతమునఁ గానవచ్చుచున్నవి. కావునఁ బయికథనుబట్టి సోమనాథుఁడు రెఁడవ ప్రతాపరుద్రుని కాలమువాఁడని పలువురు తలంచుచుండిరి. శ్రీవీరేశలింగము పంతులుగారు కవులచరిత్ర మొదటిముద్రణములో నట్లేలిఖించిరి. కాని యటుతరువాత రచింపఁబడిన కర్ణాటకవి చరిత్రములోఁ దచ్చరిత్రకారులు, శాలివాహనశకము 1144 (క్రీ. శ. 1222) సంవత్సరమునఁ దనగ్రంథమును రచించితినని విస్పష్టముగాఁ జెప్పికొనిన యుద్భటకావ్యకర్తయగు కన్నడకవి సోమరాజు తన గ్రంథములో "నముదంచద్భవమభస్తవామరమహీజారామనం సోమనం" అని పాలకురికి సోమనాథుని నుతించినట్లు ప్రమాణమును జూపి, సోమనాథుఁడు మొదటి ప్రతాపరుద్రుని కాలముఁ క్రీ. శ. 1195ప్రాంతమున, నుండియుండునని నిరూపించిరి. దీనితో సోమనాథుఁడు రెండవప్రతాపరుద్రుని కాలమువాఁడను పూర్వాభిప్రాయము పరాస్తమయ్యెను. కర్ణాటకవి చరిత్రకారుల యీనిర్ణయము ననుసరించి శ్రీవీరేశలింగముగారు 1917 సంవత్సరమునఁ బ్రకటించిన కవులచరిత్ర పునర్ముద్రణములో సోమనాథుఁడు మొదటిప్రతాపరు

డుగ్రని కాలమున క్రీ. శ. 1195 సంవత్సరమునకించుకపూర్వమే, క్రీ. శ. 1180 సంవత్సర ప్రాంతమున నుండియుండునని లిఖించిరి. క్రీ.శ. 1222 నాఁటికిఁ గవిస్తుతికెక్కిన సోమనాథుఁడు మొదటిప్రతాపరుద్రుని (క్రీ. శ. 1140–1196) కాలముననుండి యుండవలెననుటయే సర్వవిధములను సంగతముగానుండును. కాని కర్ణాటకవిచరిత్రకారులు సోమనాథుని పండితారాధ్యచరిత్రమును స్వయముగాఁ జూడక నందుకు గురురాజకవియొనర్చిన సంస్కృతానువర్తనమునందలి[2] శ్లోకముల నుదాహరించి, వానినయినను సరిగా నర్థముచేసికొనక, కింకరుఁడను నర్థమిచ్చు భుజిష్యశబ్దమును శిష్యశబ్ద పర్యాయముగా భ్రమించి, క్రీ. శ. 1168 ప్రాంతమున లింగైక్యమయిన బసవేశ్వరునికి శిష్యపుత్రుఁడయిన సోమనాథుఁడు క్రీ. శ. 1195 ప్రాంతమువాఁడయి యుండునని తమ నిర్ణయమును సమర్థించుకొనిరి. శ్రీవీరేశలింగముగారు కూడఁ బయిశ్లోకములకు మూలములగు సోమనాథుని పండితారాధ్య చరిత్రమందలి ద్విపదపంక్తులను జూడక కర్ణాటకవి చరిత్రకారుల వాక్యములనే యనువదించుట శోచనీయము. సోమనాథునకు వీరశైవ మతోద్ధారకుఁడగు బసవేశ్వరునందలి భక్తిపారవశ్య మపారము. బసవశబ్దశ్రవణమాత్రముననే యాతఁడొడలు మఱచును. పండితారాధ్యచరిత్రము నీతఁడు బసవేశ్వరునకే యంకితమొనర్చినాఁడు.[3]

పురాతన వీరశైవులకుఁ దాముపుత్రులమని, బంటులమని, దాసులమని, తద్గోత్రులమని, ఇత్యాదిగా భక్తిభావమునఁ జెప్పుకొనుట వీరశైవులకు మతసంప్రదాయము. బసవేశ్వరునిగూడ నీతఁడిట్లే వృషాధిప శతకములో బురాతనశివభక్తులకుఁ బుత్రునిగాను, సేవకునిగాను బహువిధములుగా వర్ణించియున్నాఁడు. ఇంతియేగాదు బసవేశుని పుత్రుఁడనని చెప్పికొనుటయేగాక "మునుబసవపురాణమున నెన్నఁబడిన। పెరుపారుభక్తుల పెంపుడుకొడుక" ననికూడ సోమనాథుఁడు చెప్పికొనినాఁడు. కావున బసవేశ్వరునియెడ నీతఁడు చెప్పికొనిన సంబంధములఁ బట్టి యీతని కాలనిర్ణయమొనర్చుట ప్రమాదమని వేఱచెప్పనక్కఱలేదు. కర్ణాటకవి చరిత్రకారులుగ్రహించిన "బసవేశభుజిష్యాత్మభవః" అనునది "బసవన యిలుపుట్టు బాసినకొడుక" అనుదానికి గురురాజకవియొనర్చిన సంస్కృతీకరణము. సోమనాథుఁడు బసవేశ్వరపండితారాధ్యులను స్వయముగా సేవించిన తత్సమకాలీనుఁడు కాఁడనియే నాయభిప్రాయము. బసవనిచరితమును దాను భక్తులచేవిన్నవిధమునఁ బురాణముగా

2 "గురులింగార్యస్య దక్షహస్త గర్భసముద్భవః। బసవేశస్య తనయః బసవేశ్వర గోత్రకః। బసవేశభుజిష్యాత్మభవో బసవకింకరః"

3 "బసవనిపుత్రుండ బసవగోత్రుండ। బసవేశు శ్రీపాదపద్మషట్పదుఁడ। బసవనిఁబొగడఁ బాల్పడు కవీంద్రుండ। బసవని బొగడ బాల్పడు పాఠకుండ। బసవన్న దూత నే బసవన్నబంట। బసవన్న యిలుపుట్టు బాసినకొడుక। బసవన్న లెంక నే బసవన్న తొంగి। బసవన్న మన్నల మన్నగా పుత్రుఁడ। బసవన్న పేరిడఁ బ్రాప్తవ్యుఁడగుట। మహదనుకూలచెన్న మల్లికార్జునుని। బసవనామంబిది భక్తి పెక్కువ। బసవలింగంబుఁ బ్రణుతించువాఁడ"

రచించితినని శ్రీసోమనాథుఁడే చెప్పికొనినాఁడు.[4] కావున నీపరిస్థితులనెల్ల బర్యాలోచించి, సోమనాథుఁడు బసవేశ్వరుఁడు లింగైక్యమయిన క్రీ. శ. 1168 వ వత్సరమున కించుకముందో తరువాతనో జననమొంది, మొదటి ప్రతాపరుద్రుని రాజ్యావసాన కాలమున క్రీ. శ. 1192 ప్రాంతమునాఁటికిఁ బ్రసిద్ధుఁడయి యుండునని దుందుభిసంచికలో నొకవ్యాసమున వ్రాసియుంటిని. ఇట్టియీతఁడు ప్రథమ ప్రతాపరుద్రునికాలమున నుండెననుట నిర్వివాదాంశమనియు, పిడుపర్తి సోమనాథుఁడు మనసోమనాథునకుఁ దరువాత మూఁడువందల సంవత్సరములకు వెలసినవాఁడవుటచే నాతఁడు తన విశికిడిని బట్టి పద్య బసవపురాణావతారికలో వ్రాసిన సంగతులలోఁ గొన్ని వ్యత్యాసములు చేరియుండునుగావున నవి ప్రమాణములు కావనియుఁ బలువురు తలంచుచున్నారు. కానినామిత్రులు శ్రీ నిడదవోలు వెంకటరమణగారు సోమనాథుఁడు మొదటి ప్రతాపరుద్రుని కాలములో క్రీ. శ. 1192–1195 ప్రాంతములకే ప్రసిద్ధుఁడయి యుండఁడనియు, క్రీ. శ. 1190 ప్రాంతమున జనించి 1228 వ సంవత్సరప్రాంతములకు బసవపురాణాదికరచనములచేఁ బ్రసిద్ధుఁడయి సమకాలీనుఁడగు కన్నడకవి సోమరాజుచే నుతింపఁబడి యుండెననియు, నాతని కాలము క్రీ. శ. 1190–1250 అని నిర్ణయించుట సమంజసమనియు, రక్తాక్షిసంవత్సరములో సారస్వతసర్వస్వము (సం 1 సం 11&12) లోఁ బ్రకటితమయిన "శ్రీపాల్కురికి సోమనారాధ్యుల కాలము" అను వ్యాసమునందు లిఖించిరి. వీరిట్లుతలంచుటకు ముఖ్యకారణము కీ. శే. శ్రీకొమఱ్ఱాజు వెంకటలక్ష్మణరావుపంతులుగారు శివతత్త్వసారపీఠికలో మల్లికార్జున పండితారాధ్యుని కాలము క్రీ. శ. 1120–1190 అని నిర్ణయించుట యే యనితోఁచుచున్నది. పండితారాధ్యుఁడు క్రీ. శ. 1190 వఱకు జీవించియున్నప్పుడు సోమనాథుఁడు క్రీ.శ. 1192 నాఁటికే ప్రసిద్ధుఁడయినచో నితర గురువుల నాశ్రయించుటమాని పండితారాధ్యుని యొద్దనే విద్యనేర్చియుండఁడాయని, శ్రీలక్ష్మణరావుపంతులుగారు పండితారాధ్యుఁడు క్రీ. శ. 1190 వఱకు జీవించెనని తలంచుటకుఁ దగిన యాధారములు లేవు. బసవేశ్వరుని నిర్యాణకాలము క్రీ. శ. 1168 అని వారంగీకరించిరి. అట్టిచోఁ బండితారాధ్యుఁడు బసవేశ్వరుని యనంతరము 22 సంవత్సరములు వఱకు జీవించెనని వారుతలంచుట యసంగతము. బసవేశ్వర పండితారాధ్యులఁ గూర్చి తెలియుటకు వారియనంతర మతిసమీప కాలముననే రచింపఁబడిన సోమనాథుని గ్రంథములకంటెఁ బ్రబలప్రమాణములు లేవు. పండితారాధ్యుఁడు వెలనాటిచోడుని యాస్థానములో బౌద్ధులను జయించి మహిమాదికములఁ గనఁబఱిచి బసవేశ్వరుని దర్శించుటకుఁ గల్యాణపట్టణమునకేఁగుచు వనిపురమను గ్రామమున నుండఁగా నప్పటి కెనిమిది దినములయి బసవేశ్వరుఁ డవతారమును జాలించి సంగమేశ్వరునం దైక్యమయ్యెనను సంగతిఁ దెలియవచ్చి మిక్కిలి ప్రలాపించెననియు, అటుతరువాత నటనుండి కదలి శ్రీశైలమునకేఁగుచు

4 "ప్రస్తుతింపంగ సద్భక్తి విస్ఫురణఁ। బ్రస్తుతికెక్కిన బసవనిచరిత। చెప్పితిభక్తులచే విన్నమాడ్కిఁ। దప్పకుండంగను దాకక్కఁజేసి"

వెల్లటూరునందు నివసించి, నిజశిష్యుఁడగు దోనయ్యను శ్రీశైల ప్రదక్షిణముసేయ నియమించి, శివరాత్రి మహోత్సవము నాతనిచే నిర్వర్తింపఁజేసి, శ్రీశైల యాత్రాఫలమును గాంచెననియు, బసవేశ్వరుఁడు వెడలిపోయినప్పుడు తానీప్రపంచమున నుండియుఁ బ్రయోజనము లేదుఁగావునఁ దన్నుఁగూడ బసవేశ్వరునివలె నైక్యమొనర్చు కొమ్మని శ్రీశైల మల్లిఖార్జునునిఁ బ్రార్థించి, భార్యాపుత్రసహితముగ నామహాదేవునం దైక్యమయ్యెననియుఁ బండితారాధ్య చరిత్రమున వర్ణింపఁబడినది. దీనినిబట్టి బసవేశ్వర పండితారాధ్యుల నిర్యాణకాలములకు మధ్య నొక్క శివరాత్రియేగాని పెక్కు శివరాత్రులు గడచియుండ నేరవని స్పష్టమగును. కావునఁ బండితారాధ్యుఁడు బసవేశ్వరుని తరువాత నత్యల్పకాలములోనే క్రీ. శ 1169_1170 సంవత్సరములలో శివైక్యమయ్యెనని తలంపనగును. వెలనాటి చోడుఁడును నాతనిసంతతియుఁ బండితారాధ్యుని శాపమహిమచే నిర్మూలమయిరని పండితారాధ్య చరిత్రములో నున్నది. వెలనాటిచోడుని శాసనములు క్రీ. శ. 1163_1180 వఱకును నాతనిసంతతి వారి శాసనములు 1185 వఱకును గానవచ్చుటచే వారందఱు నశించువఱకుఁ బండితారాధ్యుఁడు జీవించియుండవలెనని యెంచి శ్రీలక్ష్మణరావుగారతనినిర్యాణకాలము క్రీ. శ. 1190 వఱకుఁ బొడిగించినట్లు తోచుచున్నది. అట్లుతలంచుట యనవసరము. అతని శాపమహిమచే వారు తరువాత నశించినను బండితుఁడు వారికంటె ముందుగనే బసవేశ్వరుని నిర్యాణవార్త విని తానుగూడ సత్వరముగనే నిర్యాణము నొందెనని యెంచుట కెట్టియభ్యంతరమును లేదు. కావున బసవేశ్వరపండితారాధ్య లించుమించుగ నేకకాలముననే లింగైక్యమయియుండురనియు, సోమనాథుఁడు వారిరువురిలో నెవరినిగూడ స్వయముగ నెఱింగియుండఁడనియుఁ దలంచుటయే సమంజసము. సోమనాథుని గ్రంథములలోఁ బండితారాధ్య చరిత్రమే కడపటి గ్రంథముగాఁ గాననగును. అప్పటికిఁ బండితారాధ్యుని మనుమలు మనుమపండితుఁడు మున్నగు పలువురును, పండితారాధ్యుని పుత్రుఁడగు కేదారయ్య శిష్యుఁడు ఇవటూరి సోమనాథయ్యయు, నాతని పుత్రులు సూరీశ్వరుఁడు మున్నగు ముప్వురును శైవ ప్రపంచమునకు గురుపట్టమునొంది వెలయుచున్నట్లు గ్రంథాంతమునఁ జెప్పబడినది. మఱియు సోమనాథుఁడు గురుప్రశంసలో "పేరెన్నబడిన శ్రీ చెలిదేవవేమ|నారాధ్యుఁడను పర మారాధ్యదేవు| మనుమనిశిష్యుఁడ" నని చెప్పికొనినాఁడు. చెలిదేవ వేమనారాధ్యుఁడు బసవేశ్వర పండితారాధ్యులకు సమకాలీనుఁడయినట్లు పండితారాధ్య చరిత్రమున వర్ణితమయిన యాతని చరితమునుబట్టి గాననగును. మఱియు సోమనాథుఁడు బసవపురాణ కథాసూత్రములఁ దనకెఱిఁగించి యాగ్రంథమును రచించుట కాజ్ఞయొసంగిన పెద్దలలోఁ గరస్థలి సోమనాథయ్యగారిని గూడఁ జేర్కొనుచు బసవపురాణావతారికలో నాతనిని బ్రశంసించినాఁడు.[5]

---

5 "జంగమరత్నంబు శోగణసమ్మతుఁడు| లింగైక్యకర్తృ గతాంగవికారి| పండితారాధ్యకృపా సమార్జితుఁడు | మండితసద్భక్త మార్గప్రచారి | విలసితకరుణా సం విత్సుఖాంభోధి| నలిఁగరస్థలి సోమనాథయ్యగారు"

అందలి "పండితారాధ్య కృపాసముద్గతుఁడు" అనుదానికిఁ బండితారాధ్యునివలన దీక్ష నొందిన శిష్యుఁడని యర్థము. ఈపండితారాధ్యుఁడు మల్లికార్జున పండితుఁడే కాఁదగును. ఆతనిశిష్యుఁడగు కరస్థలి సోమనాథయ్య బసవపురాణ రచనాకాలమునకు వృద్ధుడయినట్లు కాననగును. ఈతఁడు సోమనాథుని కవితా గురువగు కరస్థలి విశ్వనాథుని జ్యేష్ఠసోదరుఁడు కానోపును. కావునఁ బయిసంగతుల నెల్లఁ బర్యాలోచింపఁ బండితారాధ్యుని శిష్యునకు, మనుమలకును, పండితారాధ్యుని సమకాలీనుఁడగు చెలిదేవ వేమన మనుమనికిని, సమకాలీనుఁడయిన మనసోమనాథుఁడు క్రీ. శ. 1160 ప్రాంతమున జన్మించి, బసవేశ్వర పండితారాధ్యుల నిర్యాణకాలమునకు బాలుఁడయి, క్రీ. శ. 1192_1195 ప్రాంతముల మొదటి ప్రతాపరుద్రుని రాజ్యకాలమున బసవపురాణాదికములను రచించి, యటుతరువాత వయస్సు గడచినకాలములో క్రీ. శ. 1230 ప్రాంతమునఁ బండితారాధ్య చరిత్రమును రచించి, యటుపిమ్మటఁ గొలఁది కాలములో సిద్ధినొంది యుండునని తలంచుటయే సర్వవిధములను సమంజసముగా నుండునని నాయభిప్రాయము. సోమనాథుఁడు తనగ్రంథములలో అనుభవసారమునకు గోడగిత్రిపురారిని, బసవపురాణమునకు గొబ్బూరి సంగనామాత్యుని, పండితారాధ్య చరిత్రమునకుఁ బొల్కుటికి నూరనామాత్యునిఁ గథాశ్రోతలుగాఁ గూర్చికొనినాఁడు. వీరికాలములు మనకుఁ దెలిసినచో సోమనాథుని కాలమును నిర్బాధకముగ నిస్సందేహముగ నిర్ణయింప వీలుండును. కాని యందు కాధారములు గానరావు. వీరా కాలమున దృఢవీరవ్రతముచే వన్నెకెక్కిన వారయ్యుఁ జారిత్రకముగఁ బ్రసిద్ధినొందిన వారుకారు. కావున సోమనాథుని గ్రంథముల మూలముననే మనకెఱుకవడినవారయినారు. కాకతీయ శాసనము లిప్పటికిఁ జాలవఱకు లబ్ధములయినను మనసోమనాథునకుఁ బ్రతాపరుద్రునకుఁ గల సంబంధమును బ్రకటించు శాసనప్రమాణ మొకటియు నింతవఱకు లభింపకుండుట శోచనీయము. కొండవీటి దండకవిలెలో మాత్రము శకసంవత్సరము మున్నగు వివరములు లేని యొకశాసన ముదాహరింపఁ బడినది.[6]

సోమనాథుని కులగోత్రములు:—సోమనాథుఁడు బ్రాహ్మణుఁడని కొందఱు, ఆరాధ్యబ్రాహ్మణుఁడని కొందఱు, సహజవీరశైవుఁడగు జంగముఁడని కొందఱు తలంచుచున్నారు. ఈతఁడు సహజవీరశైవుఁడగు జంగముఁడనఁగా వీరశైవమతస్థులగు లింగాయతులకు గురుస్థానమును వహించు మఠస్థులు లేక మాహేశ్వరులని వ్యవహరింపఁబడు శాఖకుఁజెందినవాఁడని నాదృఢాభిప్రాయము. ఆరాధ్యబ్రాహ్మణులు లింగధారణాది వీరశైవ ధర్మములను స్వీకరించినను లింగముతోపాటు యజ్ఞోపవీతమును ధరించి యుపనయన సంస్కారమును గ్రహింతురు. లింగధారులుకాని బ్రాహ్మణులు చెప్పికొను ఋషిగోత్ర సూత్రములనే వీరును జెప్పుకొందురు. వీరిలో నిప్పటికి

6 శ్లో॥ తదా ధరణికోటాఖ్యం। బ్రహ్మపీఠాత్త్య పురం తదా-చంద్రార్ధమకుటపీఠాత్త్యా। చంద్రపాదిపురం తదా। శేశవార్పణ బుద్ధ్యాస్తై। తదావిత్తు పురంభువి। సోమనారాధ్య గురవే। పిడపర్తి పురం దదౌ। అదౌ ప్రతాపరుద్రాఖ్యో। భూపాలో ధర్మపూర్వకం। సప్తర్షిసంఖ్యయా గ్రామాన్। దదౌ సద్ద్విజాయ తే......ఏవం ప్రతాపరుద్రాఖ్యః। కృతవాన్ రుద్రసంఖ్యయా॥

నిట్టి గోత్రసూత్రవ్యవహారమే జరుగుచున్నది. ఇఁక కేవల వీరశైవులగు లింగాయతులకు జంగములకు లింగమే యజ్ఞోపవీతము. లింగముతోపాటు వేఱొక జందెమును వారు ధరింపరు. కేవలము పంచాక్షరీమంత్రమునే గాని గాయత్రిమొదలగు నితరమంత్రములను వీరు జపింపరు. వీరికి గోత్రకర్తలు గౌతమభారద్వాజాది మునీశ్వరులుగాక శివుని పంచవదనములనుండి యుద్భవించిన వృషనందీశ్వరాది పంచాచార్యులు. సూత్రములు కూడ దత్సంబంధికములే. ఇందుకయి సుప్రబోధాగమ ప్రమాణములను జూడవచ్చును.[7] అందుదాహరింపఁబడిన వృషుఁడు, నంది, భృంగి, (భృంగిరిటి) వీరుఁడు, స్కందుఁడు, అను నయిదుగురే వీరశైవ గోత్రకర్తలగు పంచాచార్యులు. వీరికే యుగభేదములఁబట్టి నామభేదము లేర్పడినవి. రేవణసిద్ధ, మరుళసిద్ధ, ఏకోరామ, పండితారాధ్య (మల్లికార్జున పండితుఁడు కాఁడు) విశ్వారాధ్య అనునవి క్రమముగ వీరికలియుగవ్యవహారనామములు. రంభాపురి (కొలనుపాక), ఉజ్జయిని, కేదారము, శ్రీశైలము, కాశి అను క్షేత్రములందున్న పంచసింహాసనములకు వీరధీశ్వరులు. ఇందుచే వీరిగోత్రజులగు కేవల వీరశైవులు తాము శివకులీనులమనియు, ఈశ్వరకులజులమనియుఁ జెప్పికొనెదరు. ఇందుకనుగుణముగనే మన సోమనాథుఁడు తనకు బసవేశ్వరుని సంగతి యంతగాఁ దెలిసి యాతనియందు భక్తిపారవశ్యము కలుగని ప్రాథమిక వయస్సులో రచించిన అనుభవసారమను చిన్న కృతియందుఁ దనకులగోత్రములను చెప్పికొనినాఁడు.[8] దీఁనిబట్టియే యాతని శిష్యప్రశిష్యకోటిలోఁ జేరి యాతనిని కులగురువుగా నారాధించుచు నీతనిద్విపద బసవపురాణమును బద్యకావ్యముగా నొనర్చిన జంగమఁడు. పిడుపర్తి సోమనాథకవి యాతనిని దనగ్రంథములో "భృంగిరిటి గోత్రసంభవ। జంగమ పాదార్చనా విశారద విలస। త్సంగీత శాస్త్రపారగ। గంగోత్పత్తి ప్రకార కావ్యధురీణా" అని స్తుతించినాఁడు. అన్యవాద కోలాహల శతకకర్త యాతనిని "ఏకామ్రగురు చిత్తనలినభృంగ సోమనాథలింగ" అని సంబోధించినాఁడు. కలియుగమున వీరశైవ పంచాచార్యులలోఁ దృతీయాచార్యుఁడగు ఏకోరామాచార్యుఁడు భృంగిగోత్రజులకెల్ల గురువు. పయిశతకకర్త యుపయోగించిన "ఏకామ్ర" శబ్దము "ఏకోరామ" శబ్దమునకుఁ బద్యమున నరిపడునట్టు లాతఁడు చేసికొన్న ప్రాస్వీకరణమని నాయభిప్రాయము. ఇట్లు సోమనాథుఁడు నాతని శిష్యప్రశిష్యులు నాతఁడు శివకులీనుఁడు, భృంగిగోత్రజుండునని స్పష్టముగఁ జెప్పియుండఁగా నాతఁడు బ్రాహ్మణకులీనుఁ డనియుఁ నారాధ్య బ్రాహ్మణుఁడనియు వాదించుట వట్టి వెలితనమని చెప్పనక్కరలేదు. తరువాతఁదరువాత నీతనికి బసవేశ్వరునందు భక్తిపారవశ్యము గలిగినపిమ్మట రచించిన బసవపురాణ

7 శ్లో॥ సద్యోజాతశ్చ ప్రథమో । వామదేవో ద్వితీయకః । అఘోరస్తు తృతీయశ్చ । తత్పురుషశ్చతుర్థకః ఈశానః పంచమశ్చైతి । ముఖానిమమ సర్వశః । తాన్యానవాని గోత్రాణి । వేదోక్తాని న సంశయః । వృషోనందీచ భృంగీ । వీరశ్చస్కంద ఏవచ । మత్స్వరూపాశ్చ తుష్పన్నాః పంచగోత్రాధికారిణః ॥

8 క॥ భృంగిరిటి గోత్రుండను గురు। లింగకనూజుండ శివకు వీనుండను ర్యాఖ్య। సంగవివర్జిత చరితుండ। జంగమ లింగప్రసాద సత్పాత్రుండన్॥

పండితారాధ్య చరిత్రములలో "ధరనుమామాతా పితాశుద్ర యనఘ। శరవురాణోక్తి వీశ్వర కులజుండ" అని చెప్పికొని బసవనిపుత్రుండ, బసవగోత్రుండ, బసవనిదూత, బసవనిబంట, బసవనయిలుపుట్టి బానిసకొడుక, ఇత్యాదిగాఁ జెప్పికొనినాఁడు. బసవగోత్రమనునది వీరశైవులలో వ్యవహారమున లేనేలేదు. పైనిజెప్పిన యయిదు గోత్రములుఁదప్ప వేఱుగోత్రములు వారికిలేవు. సోమనాథుఁడు బసవనికి సమకాలీనుఁడే కాఁడనియు నాతనియెడఁ జెప్పికొనిన యీయీ సంబంధములన్నియు నాతనియందలి భక్తిపారవశ్యమునఁ జెప్పికొనినవేగాని మఱొకటి గాదనియు వెనుకనే నిరూపించియుంటిమి గదా! సోమనాథుఁడు సహజవీరశైవుఁడగు జంగముఁడని తలంచుటకాతని యద్వితీయ పాండిత్యము, వేదవేదాంగాది వైదుష్యము, కూడఁ బెద్దబాధకములని ప్రతిపక్షులవాదము. ఇట్టివి యాకాలమునందు అబ్రాహ్మణులకందరానివిగా నుండెనని వారితలఁపు. ఇది కేవలమవిచారమూలకము. వీరశైవులకు లింగమే యజ్ఞోపవీతమని మొదటనే మనవిచేసియుంటిని బ్రాహ్మణుల కుపనయనాదికముతోఁ గలుగు వేదాధికారములు మున్నగునవి లింగధారణ దీక్షతోఁ దమకును గలుగునని వీరశైవుల సిద్ధాంతము. బ్రాహ్మణులు కర్మపాశబద్ధులనియుఁ దాము వారికంటె నధికులమనియు వారి మతము. కావుననే సోమనాథుఁడు తన గ్రంథములలో బ్రాహ్మణులను బతితులయు, త్రాటిమాలలనియు, పచ్చిమాలలనియుఁ గర్మచండాలురనియుఁ బలుతావుల నిరసించినాఁడు. శివుని నిశ్వాస జనితములని చెప్పఁబడు నిగమములకును, ఆతని వదనసంజనితులమని చెప్పికొను వీరశైవులకును సాజాత్యము స్వతస్సిద్ధము. శివార్చనమున కవసరమయినంతవఱకు వీరు వేదమంత్రములను గ్రహింతురు. కావునఁ బయివాద మసంగతము. జంగములలోఁ బూర్వకాలమున వేదవిద్యాసంపన్నులనేకులుండెడివారు. అందునను మతప్రచారమునకు దొరకొను సోమనాథుఁడుమున్నగు వారలకు వేదవేదాంగములేగాక నితరమతవాఙ్మయములుఁగూడ సవిమర్శముగఁ జదివి తెలిసికొనుట యావశ్యకముగనుండెడిది. ఇప్పటికిని కర్ణాటదేశమున వీరశైవులలో వేదవిద్యాసంపన్నులు పలువురున్నారు. వారుస్థాపించి నిర్వహించుచున్న వేదపాఠశాలలున్నవి. లింగాయతశ్రేష్ఠుఁడు శివతత్త్వ రత్నాకరకర్తయునగు కెలది బసవప్పనాయకుని యప్రమేయపాండిత్యము జగద్విశ్రుతము. సోమనాథుఁడు పండితారాధ్యుని, ఆపస్తంబసూత్రుఁడనియుఁ హారితస గోత్రుఁడనియుఁ జెప్పి యాతనిని శ్రోత్రిగాఁ గూర్చికొనిన కారణములను వివరించినాఁడు.[9]

అందులో నారాధ్య బ్రాహ్మణుఁడగు సూరనామాత్యునిఁ దనమఱఁదియని చెప్పుటచే సోమనాథుఁడు కూడ నాతనివలెనే యారాధ్య బ్రాహ్మణుఁడని వాదింపఁ జూచెదరు. కాని

9 "గిరిజాచేశ్వర విశ్రుతాచార్య - కారుణ్యామహాసాబ్జ గర్భసంభవుఁడ - చరలింగ గురులింగ సాహిత్య లింగ - చిరసమనిష్ఠిత శీలవర్ధనుఁడ - కడుమించి శివునకుఁ గన్నులర్పించి - పడసిన దృఢవీరభక్తివర్ధనుఁడ - నీవృగర్పిత పుర రాదాన రతికి - నీదాన ధర్మవినీతికి మెచ్చి - బసవేశు తక్కిన భక్తుండవయ్య నసదృశలీల మాకనుగలండనియు। మచ్చిక నా ముద్దుమఱఁది వనియు - నెచ్చెలికాఁడవు నీవకావనియు - చాతుర్యసాహిత్య శాలివీవనియు - శ్రోత్రియ్యమునకుఁ బాత్రుండవీవనియు"

యిదియు వట్టిభ్రమయే. "శ్రీనృపాధీశ సంచిత దయాపాంగ। భావుకమంత్రీశ పాల్కుర్కి-సూర। శ్రీగురులింగ సంచిత దయాపాంగ। భాగమహోదార పాల్కుర్కి-సూర" అను సంబోధనములచే నీసూరనామాత్యుని యింటి పేరుగూడఁ బాల్కురికివారని స్పష్టమగును. సోమనాథ సూరనామాత్యు లిరువురు నేకవర్ణస్థులయి సంబంధబాంధవము నెఱపికొన్న నిక్కంపు మఱఁదులయినచో నొక్కయింటి వారెట్లగుదురు? సోమనాథుఁడు తనకు శివగోత్రమును జెప్పికొని సూరనామాత్యునకు ఋషిగోత్ర సూత్రములఁ జెప్పనేల? వీనినెల్లఁ బర్యాలోచింప వీరిచ్చిపుచ్చుకొను సంబంధమున నయిన మఱఁదులుగాక యఱలేని మచ్చికకలిమి బావమఱఁదుల వరుసను బిలిచికొనెడి నెచ్చెలికాండ్రనియు, ఈసంబంధము తిక్కన మనుమసిద్ధుల మామయల్లుర సంబంధమువంటిదే యనియుఁ దెల్లమగును. మచ్చిక నా ముద్దుమఱఁది వనుటయు, నెచ్చెలికాఁడ వనుటయు, మరల మహిమప్రకరణాంతమున, అఱలేని సఖుఁడ సూరార్య నాముద్దు మఱఁదివి మహిని అని సంబోధించుటయు నీయర్థమునే తేటపఱుపఁగలవు. ఆకాలమున నారాధ్యబ్రాహ్మణు లుపనయనమునువీడి బసవేశ్వరుని వలెఁ గేవల వీరశైవులలోఁ గలియకపోయినను, భవులగు బ్రాహ్మణులతో నెట్టి సంపర్కమును లేక సహజవీరశైవులగు జంగములతోడనే యెక్కువ సాహచర్యమును గలిగియుండిరి. అందుచేతనే వీరొకరివలన నొకరు విద్యలను బడయుచుండిరి. సోమనాథుఁ డారాధ్యపదసంకలితుఁడుగఁగూడ వ్యవహరింపఁబడుట యాతని యారాధ్య బ్రాహ్మణత్వమునకు సాధకమనియు జంగములకారాధ్యపద మెప్పుడు వర్తింపలేదనియుఁ గొందఱివాదము. ఇదివట్టియబద్ధము. వీరశైవ పంచాచార్యులందఱు నారాధ్యపద సంకలితులు కావున వారివంశజులగు జంగములకే యారాధ్య నామము మొదట వ్యవహరింపఁబడు చుండెడిది. అట్టియారాధ్యుల మతధర్మములను స్వీకరించినవారవుటచే మామూలు బ్రాహ్మణులనుండి వివక్షింపఁబడుటకయి యారాధ్య పదమును యారాధ్య బ్రాహ్మణులుకూడ గ్రహించిరి. శిష్యసంతతిచే నారాధింపఁబడు ధర్మ మీయిరుశాఖలవారికిని సమానమే. ఇప్పటికిని జంగములలోఁ "ఆరాధ్యుల, పరమారాధ్యుల" అనుగృహనామములు కలవారుకూడ నున్నారు. శ్రీశేషాద్రిరమణకవులు వరంగలు ప్రాంతముననున్న వేల్పుకొండ వాస్తవ్యులు కౌండిన్యసగోత్రులు, ఉత్తమరాజు వారను నియోగిబ్రాహ్మణులు సోమనాథుఁడు మొదటఁ దమవంశమువాఁడనియుఁ, దరువాత శిఖాయజ్ఞోపవీతముల విడనాడి జంగములలోఁ గలిసిపోయెననియుఁ దమతోఁ జెప్పిరట్లువ్రాసిరి. శ్రీకాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు సోమనాథుఁడు మొదట నారాధ్య బ్రాహ్మణవంశజుఁడయి, బసవేశ్వరుని యందు వ్యామోహ మెక్కువయి జ్ఞానము హెచ్చినకొలది జంగములలోఁ గలసిపోయి, అనుభవసార రచనమునాఁటికి ప్రథమ గణపరమయిన భృంగిగోత్రమును జెప్పికొనియుండునని యభిప్రాయపడిరి. శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు సోమనాథుఁ డాజన్మాంతము బ్రాహ్మణుఁడుగనేయుండెనను

డి వింతసిద్ధాంతమును బ్రకటించిరి. అసలు సోమనాథుని యింటిపేరు ఉత్తమరాజావారయినచో నాతఁడు వీరశైవమును స్వీకరించి నంతమాత్రమున నాతనిగృహనామముపాల్కురికివారని మాఱుట యసంభవము. సోమనాథుఁడు మొదట వ్రాసిన గ్రంథములలో ఋషిగోత్రాదికములను, యొకగృహనామమును జెప్పికొనియున్నచో నిట్టి యూహాల కవకాశముండునేమోగాని యట్టి గ్రంథములేమియుఁ గానరావు. సోమనాథుఁడు తన కులగోత్రములను గృహనామముతోఁగూడ జెప్పికొన్న యనుభవసారమను చిన్నకృతియే యుపలబ్ధములయిన యాతని కృతులలో మొదటిదని నాయభిప్రాయము. దానినాతఁడు తన ప్రథమ వయస్సులో రచించియుండెను. దానిలోనాతఁడు మల్లికార్జున పండితుని మూఁడుపద్యములలో స్తుతించియు బసవేశ్వరునిపేరయిన నెత్తలేదు. కారణము విస్పష్టము సోమనాథుఁడాంధ్రుఁడు. బసవేశ్వరుఁడు కర్ణాటుఁడు. అనుభవసారమును రచించునాఁటి కీతఁడష్టభాషాకవితాప్రవీణుఁడుకాఁడు. కర్ణాటాదిభాషల నేర్వలేదు. బసవేశ్వరుని కర్ణాటగ్రంథములఁజదువుటగాని యాతనినిగూర్చి యంతగాఁదెలిసికొని యాతనియెడ భక్తి కుదురుటగాని సోమనాథుని కప్పటికిఁ గలుగలేదు. కావున సోమనాథుని ప్రథమకృతియగు నీగ్రంథమువలననే పయియభిప్రాయముల యప్రామాణ్యము వ్యక్తముకాఁగలదు.[10] మహాకవు లేకులమువారయినను వారి కవితాగౌరవమును బట్టి యందఱకును బరమపూజ్యులు.

సోమనాథుని తలిదండ్రులు, గురువులు:— అనుభవసారపద్యమున సోమనాథుఁడు "గురులింగతనూజుండ" ననివ్రాయుటచే బలువురీతనితండ్రి గురులింగార్యుఁడని భ్రమించిరి. గురులింగమనునది తమ దీక్షాగురువులకు వీరశైవులు వ్యవహరించు విశేషణము. గురువే లింగము, లింగమేగురువు, ఇరువురకు నభేదము. అంతేకాదు. చరలింగము అనగా జంగమము (భక్తుఁడు) నకుఁగూడ నభేదమని వారి మతము.[11] గురువుదీక్షయొసంగునపుడు హస్తమస్తకసంయోగమొనర్చి భౌతికశరీరమును లింగశరీరముగ మార్చినంతనే తమకు వేఱొకజన్మము కలుగుననియుఁ, గావున గురుఁడే జనకుఁడనియు, నాతని హస్తాంబుజమే తమకు జన్మభూమి యనియుఁ దలంచుట వీరశైవుల మతసంప్రదాయము. సోమనాథుఁడు బసవపురాణమున[12] జెప్పికొనిన వాక్యములఁ బట్టి పైయర్థము తేటపడి గురులింగమనునది దీక్షాగురువు

10 ఇందుఁగూర్చి విశేషాంశములు తెలియఁగోరువారు, ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక సం 19 సంచిక 3,లో బ్రకటింపబడిన "పాలకురికిసోమనాథకవి; కులగోత్రపరిశంస" అనువిపులవిమర్శనావ్యాసమును జదివిన సకల సంశయనివారణము కాఁగలదు.

11 ఉ॥ శ్రీగురులింగ జంగమవిశిష్ట మహామహిమంబు వేదదర్
శ్రీగురులింగ జంగమముఁ జెప్పఁ ద్రిమూర్తి నిగూఢమై చనున్
శ్రీగురులింగ జంగమవిశేషము లేకముగాఁదలంచి యా
శ్రీగురులింగ జంగమ వశీకృతమా మదిఁగొల్చి సమ్మతిన్॥
క॥ పరమ శివుం బరమేశ్వరుఁ బరమానంద స్వభావు భక్తి నుతింతున్
గురులింగము హరలింగముఁ జరలింగము శాంత్యతీతు శంభుని శరణున్॥ ॥అనుభవసారము॥

12 "శరణగణాశ్రయ సకలస్వరూప । గురులింగ వరకరోదర జనితుండ" ననియు, పండితారాధ్యచరితమున "మద్గురులింగ । ఘనకరుణాహస్త గర్భసంభవుఁడ" ననియుచెప్పబడినది,

స కాతఁడు ప్రయోగించినవిశేషణము మాత్రమేయని విశదముకాఁగలదు. పలువురు భక్తులనాతఁడు గురులింగకరోదర జనితులనియే వర్ణించినాఁడు. ఇఁక సోమనాథుని విద్యాగురువులు శ్రీయాదేవి విష్ణురామదేవులని బసవపురాణమందలి వాక్యములవలనఁ దెలియనగును.[13] ఈతని కవితాగురువు కరస్థలి విశ్వనాథకవీంద్రుఁడయినట్లు, అనుభవసారమందలి, "విమలచిత్ప్రస్ఫూర్తి విశ్వేశుమూర్తి వినయువర్తి భువనవినుతకీర్తి, విభుకరస్థలంబు విశ్వేశుకారుణ్య జనిత వినుత కావ్యశక్తియుతుఁడ" అను పద్యమునుబట్టియు, "సుకృతాత్ముఁడగు కరస్థలివిశ్వనాథ వరకటవరప్రసాద కవిత్వయుతుఁడగు" నను బసవపురాణవచనమును బట్టియు, బసవపురాణాశ్వాసాంతగద్యము లందలి "చరలింగ ఘనకరస్థలి విశ్వనాథ వరకృపాంచిత కవిత్వస్ఫూర్తిఁజేర్చి" అను ద్విపద పాదములను బట్టియు స్పష్టపడును. "ఖ్యాతసద్భక్తిమెఁగల కట్టకూరి। పోతిదేవరపదాంబుజషట్పదుండ" అను బసవపురాణ వాక్యమును బట్టియు, "పరమారాధ్య దేవు।మునుమని శిష్యుండ" నను పండితారాధ్య చరిత్ర వాక్యమునుబట్టియు, కట్టకూరి పోతిదేవరయు, బెలిదేవ వేమనారాధ్యునిమనుమఁడునుగూడ నీతని గురువులయినట్లు తెలియనగును. సోమనాథుఁడు వీరియొద్ద వేదవేదాంగాది విద్యలను నేర్చియుండును.

సోముని యాచారవ్యవహారములు:—ఈతని వీరమహేశ్వరాచారసంపత్తి వర్ణనాతీతమయినది. వీరశైవ సమ్మతమగు చతుష్షష్టి శీలముల యాచరణ మీమహనీయునితో నంతరించెనని పలువుర యభిప్రాయము. వీరశైవ పరిభాషలో లింగధారి కానివానిని భవియని వ్యవహరింతురు. అట్టివారి ముఖదర్శన స్పర్శనాదులనయిన నీతఁడొప్పెడివాఁడు కాఁడఁట. మతాంతరులతో మతవివాదము లొనర్చునపుడు ముఖావరణ మొనర్చుకొని కాండపటము వెనుకనుండి వాదించెడివాఁడని చెప్పెదరు. పిడుపర్తి సోమనాథుఁ డీతని వర్ణించుచుఁ దనపద్య బసవపురాణమునను,[14] పండితారాధ్య చరిత్రమున సోమనాథుఁడు స్వయముగను వ్రాసిన వాక్యములనుబట్టి యీతనిశీల మూహింపఁదగును. ఈతఁడిట్టి మహాఘోర వీరశైవాచార ధౌరేయతమైఁ గాలము గడపుచు వృద్ధదశలోఁ గర్ణాటభూమియందలి కలికెము గ్రామమున సమాధి నేర్పఱచుకొని బసవపదధ్యానాంతరంగుఁడయి తపమొనర్చుచు శివసాయుజ్యము నొందెనని చెప్పుదురు.

సోమనాథునిగ్రంథములు; వానిపౌర్వాపర్యము—పిడుపర్తి సోమనాథకవి తనపద్యబసవపురాణావతారికలో సోమనాథుఁడు రచించిన

13 "ప్రాజ్ఞిష్ణుఁడగు విష్ణు రామదేవుండు। జష్ణువగు శ్రీయా దేవి యమ్మయును। గారవింపఁగ నొప్పు గాదిలిసుతుఁడ। వీరమాహేశ్వరా చారతంత్రుండ".

14 "నిర్మలప్రపటీపట లావృత దేహు" "భవిజనసమాదరణ, సంభాషణాది, సంసర్గదూరగుఁడు"

(బసవపురాణము,)

"భవివృతా రంభసంభవధాన్యనిచయ। భవినిరీక్షణాపన్న పాకవితాన। భవిహస్తగతఫల పత్రికాశాది। భవిగృహక్షేత్రాది పథవర్జితుండ। భవిజనదర్శన స్పర్శనాలాప। వివిధదానాదాన విషయదూరగుడ"

(పండితారాధ్యచరిత్రము)

గ్రంథములను పేర్కొనినాఁడు.[15] శ్రీవీరేశలింగముపంతులుగారు తమకవులచరిత్రనూత్నముద్రణములో నీపద్యమును బేర్కొనుచుఁ గర్ణాటకవిచరిత్రకారుల వాక్యముల ననుసరించి కాఁబోలు "ఈకవి గ్రంథములలో బసవపురాణము, పండితారాధ్యచరిత్రము, అనుభవసారము తెలుఁగు; అన్యవాదకోలాహలము, బసవపంచగద్య, సోమనాథ భాష్యము, సంస్కృతము. తక్కినవి కన్నడము" అనిలిఖించిరి. ఇవి సోమనాథుని గ్రంథముల సరిగాఁజూడక వ్రాసిన వ్రాఁతలని చెప్పుట కెట్టిసంశయమును లేదు. కర్ణాటకచరిత్రకారులు నాంధ్రకవి చరిత్రకారులుఁగూడ సోమనాథుని గ్రంథములను సరిగాఁజూడక యాతని చరిత్రమును నిర్మించుట శోచనీయము. పయి పద్యములో అన్యవాదకోలాహల ముదాహృతముకాకపోయినను నది సంస్కృతమనియు సోమనాథకృతమనియుఁ బంతులుగారెట్లువ్రాసిరో? ఇట్టి సోమనాథకృతి కానరాదు సోమనాథుని శిష్యప్రశిష్యకోటిలోఁజేరిన కవియొకఁడు సోమునికంకితముగా అన్యవాదకోలాహలమను తెనుఁగు సీసశతకము రచించెనని వెనుకఁజెప్పితిని అదియే ముద్రితమయి ప్రచారములోనున్నది పయి పద్యమునఁ బేర్కొనబడిన కృతులలో బసవపురాణము, పండితారాధ్యచరిత్రము, అనుభవసారము, చతుర్వేదసారము, బసవరగడ, చెన్నమల్లుసీసములు, వృషాధిపశతకము తెలుఁగులోనే రచింపఁబడినవి. బసవోదాహరణయుగ్మములో నొకటితెలుఁగు రెండవది సంస్కృతము. సోమనాథభాష్యము, రుద్రభాష్యము, బసవాష్టకము, బసవపంచకము సంస్కృతభాషారచితములు. పంచప్రకారగద్య నమస్కారగద్య, అక్షరాంకగద్య యనునవి ఆంధ్రగీర్వాణకర్ణాట చ్ఛందస్సంప్రదాయముల ననుసరించి మాత్రాగణబద్ధములుగ రచింపఁబడిన విలక్షణాంధ్రకృతులని నాయభిప్రాయము. అక్షరాంకపద్యములు సంస్కృతశ్లోకములుగనే యించుమించుగఁ బరిగణింపఁదగినవి. బసవమధ్యరగడ, గంగోత్పత్తిరగడ, సద్గురురగడ తెనుఁగుకృతులో కన్నడకృతులో చెప్పజాలను. అవినాకు లభ్యము కాలేదు.

ఇఁక నీగ్రంథములేగాక మఱికొన్ని గ్రంథములనుగూడ సోమనాథుఁడు రచించియుండునని పయిపద్యమందలి "ఆదియగుకృతుల్" అను పదముచే గ్రహింపఁదగును. బసవపురాణపీఠికలో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారుదాహరించిన బసవాష్టోత్తర శతనామ గద్యము, వృషభాష్టకము, అనునవి యిందుకుదాహరణములు. ఇవిగాక "సోమనాథస్తవము" అను చిన్నద్విపదకృతియు, మల్లమదేవి

15 సీ॥ బసవపురాణంబు ♦ పండితారాధ్యుల చరితంబు ననుభవ ♦ సారమును జ
తుర్వేదసారమూ ♦ క్స్తుతం సోమనాథభాష్యంబు శ్రీరుద్రభా ♦ ష్యంబు బసవ
రగడ గంగోత్పత్తి ♦ రగడ శ్రీబసవాఖ్య రగడయు సద్గురు ♦ రగడ చెన్న
మల్లు సీసములు న ♦ మస్కార గద్య వృషాధిపశతకంబు ♦ వక్షరాంక।
గీ॥ గద్యపద్యము ల్పంచప్ర ♦ కారగద్య యష్టకము పంచకము నుదా ♦ హరణయుగ్మ
మాదియగు కృతులు భక్తిహి ♦ తార్థబుద్ధిఁ జెప్పె నవి భక్త సభలలోఁ ♦ జెల్లుచుండు॥

ఆంధ్రపత్రిక ప్రజోత్పత్తి, అంగీరస, శ్రీముఖసంవత్సరాదిసంచికలలో వీనిని బ్రకటించుచు నేను వ్రాసిన వ్యాసములనుగూడ జూచునది.

పురాణమను నాలుగాశ్వాసముల ద్విపదకావ్యముగూడ సోమనాథుని కృతులుగా దెలియవచ్చుచున్నవి. ఈ రెండవగ్రంథమును నందికొటుకూరులో నొకలింగాయతుని యింటఁ జూచితిమని నామిత్రులు శ్రీ పెండ్యాల వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు వ్రాసినారు. "సోమనాథస్తవము" పాల్కురికి సోమేశ్వరస్వామిపయిఁ జెప్పఁబడినది. దానిలోఁ గర్త పేరునాఁకు రాదు. కాని యిదిమన సోమనాథకృతమేయని పలువురు తలంచుచున్నారు. ప్రభాకరశాస్త్రిగారు మాత్రము తగుకారణములను జూపకయే యిది సోమనాథకృతము కాదనిరి. ఈ గ్రంథమును సోమనాథుఁడే అనుభవసారమును రచించిన తరువాతఁ గొలదికాలమునకుఁ బసవేశ్వరునిఁ గూర్చియు నాతని సమకాలికులగు కొందరుభక్తులఁ గూర్చియుఁ దనకుఁ దెలియవచ్చినరీతిని సులభశైలిని రచించియుండునని నాయభిప్రాయము.[16] ఉపలబ్ధములయిన సోమనాథుని గ్రంథములలోనెల్ల అనుభవసారమే మొదటికృతియనుటకుఁ గలకారణముల నీవఱకే కొంతవివరించియుంటిని. ఆగ్రంథముయొక్క శైలియు పదలాలిత్యముగూడ నీ విషయమును నిరూపించఁగలవు. ఆగ్రంథమును సోమనాథుఁడు క్రీ. శ. 1180—1185 ప్రాంతముననే రచించియుండును. అప్పటి కాతఁడు సంస్కృతాంధ్రములను, వేదపురాణములను గొంతవఱకభ్యసించి, మల్లికార్జున పండితుని శివతత్త్వసారాదులను జదివి యాతనియెడ భక్తి గలిగియుండును. అప్పటి కతనికి బసవేశ్వరుని సంగతి యంతగాఁ దెలిసినట్లు కానరాదు కావుననే మల్లికార్జున పండితుని నీ గ్రంథములో మూఁడుపద్యములలోఁ బ్రశంసించియు బసవేశ్వరుని పేరయిన నెత్తలేదు. తన యితరకృతులవేనిని నిందుఁ బేర్కొనలేదు. తరువాత బసవేశ్వరుని యొక్కయు నాతని సమకాలీనులగు భక్తుల యొక్కయుఁ జరిత్రములు తనకుఁ దెలియవచ్చిన తొలుదొలుతటి దినములలోఁ దన గ్రామమందలి సోమేశ్వరస్వామి కంకితముగాఁ బయినిబేర్కొనిన సోమనాథస్తవమును రచించి, బసవేశ్వరునిమీఁద భక్తి ముదిరినకొలఁది నీతఁడు సంస్కృతపద భూయిష్ఠములగు పంచప్రకారగద్య మున్నగు గద్యకృతులులలోను, ఉదాహరణము, అష్టకము, పంచకము, రగడ మొదలగు గేయకృతులలోను బసవస్తోత్రముల నేర్చిన, నవి జనసామాన్యమునకు సుబోధకములయి తనమతప్రచారమున కంతగా నుపకరింపనందున దేశీయచ్ఛందమగు ద్విపదలోఁ దనప్రధానగ్రంథములను వ్రాయనెంచినట్లు కానఁగును.[17]

కావున సోమనాథస్తవ రచనమునకు బసవపురాణ రచనమునకు మధ్యకాలమున గద్యకృతులు, రగడలు, అష్టకములు, పంచకములు మున్నగు బసవస్తోత్రములు రచింపఁబడి యుండును. తరువాత క్రీ. శ. 1192—1195

16 ఈవిషయమునఁగల సాధకబాధకములు, ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సం 21 సంచిక 3 లోఁబ్రకటితమయిన "సోమనాథస్తవము" అనువ్యాసమునఁ దెలియనగును.

17 "ఉరుతరగద్యప । ద్యోక్తులకంటె సరసమై పరఁగిన । జానుతెనుంగు
చర్చింపఁగా సర్వ । సామాన్యమగుటఁ గూర్చెద ద్విపదలు । గోర్కెదైవార॥ [బసవ పు॥]
అరూఢగద్య పద్యాది ప్రబంధ పూరితసంస్కృత । భూయిష్ఠరచన
మానుగా సర్వసా । మాన్యంబు గామి జానుతెనుఁగు విశే । షము ప్రసన్నతకు [పండి॥ చ॥]

ప్రాంతమున బసవపురాణ రచనము జరిగి యుండును. అవిమ్మటఁ గ్రమముగ వృషాధిప శతకము, చతుర్వేదసారము, రుద్రభాష్యము, సోమనాథభాష్యము నను గ్రంథములు బసవపురాణ రచనమునకుఁ బండితారాధ్య చరిత్రమునకు నడుమ రచితములయి యుండును. "బసవఁడు ప్రీతిఁ గైకొనియె భక్తిమెయిన్ రచియింప నాఁడు ముక్తి! బసవపురాణ మంచు నను బ్రస్తుతిసేయుదు రట్లుగాన......" అను వృషాధిప శతకవాక్యమును, "నూతనంబుగ జగన్నుతముగా మున్ను-బసవపురాణ మొప్పగ రచించితివి......వరవీర భక్తిస-వైదికంబుగను-విరచించితివి చతుర్వేదసారము-బసవన్నమహిమ శుంభద్భక్తియుక్తి-బ్రసరించితివి గద్య పద్యాదికృతుల......"అను పండితారాధ్య చరిత్రవాక్యములు నిందుకు నిదర్శనములు. పండితారాధ్య చరిత్ర రచనమునాఁటికి సోమనాథుఁడు వయస్సు మీఱినవాఁడయి యుండును. అదియే యాతనికడపటికృతి. చెన్నమల్లు సీసముల నీతఁడు తనసిద్ధిసమయమునఁ జెప్పెనని కొందఱు వచింతురు. కాని యాపద్యములనుబట్టి యట్టియూహ కవకాశము గానరాదు.

సోముని పాండిత్యము, బిరుదములు:—సోమనాథుఁ డసాధారణ ప్రతిభా సమన్వితుఁడు, చతుర్వేదపారగుఁడు, అష్టభాషా కవితాప్రవీణుఁడు, స్మృతిశాస్త్ర పురాణాగమేతిహాసాదులను నిశితమతి సిద్ధాంతములను సంపూర్ణముగ నాకళించిన విద్యావిశారదుఁడు. ఈతని ప్రతిభాపాండిత్యములకు సర్వతోముఖములగు నీతని గ్రంథములే నిదర్శనములుగ నున్నవి.[18] వృషాధిపశతకమందలి బహుభాషాస్తుతు లీతని యష్టభాషాకవితాప్రావీణ్యమును మెచ్చుచూపనేర్చును. నందీశ్వరావతారమగు బసవేశ్వరుని చరిత్రమును లోకమున వెలయింప నీశ్వరాజ్ఞచే భృంగియే యీతఁడయి యవతరించెనని వీరశైవుల విశ్వాసము.

అసదృశ పాండితీవిభవంబున నీతఁడాకాలమందలి ప్రతివాదులకెల్లఁ బ్రక్కలోని బల్లెమై, బౌద్ధ జైన చార్వాకాద్వైత మాయావాదులనెల్ల నుద్భటవివాదముల నోడించి వీరశైవ మతస్థాపన మొనరించినాఁడు. ప్రత్యక్ష భృంగీశావతార, కవితాసార, తత్త్వవిద్యాకలాప, అన్యవాద కోలాహల మున్నగు బిరుదము లీతనికిఁగలవని కర్ణాటకకవి చరిత్రము నుడువుచున్నది. పిడుపర్తిసోమనాథుఁ డీతని శక్తిసామర్థ్యములను ప్రశంసించినాఁడు[19] సంగీత శాస్త్రమునందుఁగూడ

18 ఈతని చతుర్వేదపారగత్వమును "నవిఁబాల్కురికి సాధుఁడనంగ। వెలయువాఁడును జతుర్వేదపారగుఁడ" అని పండితారాధ్యచరిత్రమున నీతఁడు చెప్పుకొన్న వాక్యమును' అగ్రంథమున నసంఖ్యాకములుగ నుదాహృతములయిన శ్రుతిప్రమాణములును, బసవలింగ శతకమను నామాంతరముగల చతుర్వేదసారమును, బసవరాజీయమని వ్యవహరింపఁబడు సోమనాథభాష్యమును నీతనిగ్రంథములు బ్రకటింపఁగలవు.

19 సీ॥ లిపిలిఖింపకమున్న ♦ యపరిమితార్థోక్తి శక్తియాతని జిహ్వ ♦ జరుగుచుండు
ఛందోధికరణాది ♦ చదివిచూడకమున్న మదినుండుఁగావ్యని ♦ ర్మాణశక్తి
భాష్యసంతతులం చె ♦ ప్పంగఁజూడకమున్న, రుద్రభాష్యక్రియా ♦ రూఢి వెలయు
తర్కశాస్త్రాదివి ♦ ద్యలు పఠింపకమున్న, పరపక్షనిగ్రహ ♦ ప్రౌఢి వెలయు
గీ॥ అతనినుతియింప నాబోటి ♦ కలదియగునె, "శైవమస్తకవిన్యస్త ♦ శాతశూల
కవితబిజ్జలతలగుండు ♦ గండ" బిరుదశోభితుఁడు పాల్కురికి సోమ ♦ నాథుఁడుండు॥

నీతఁ డపారపాండిత్యము గలవాఁడు "విలసత్సంగీత శాస్త్రపారగ" అను పిడుపర్తి సోమనాథుని సంబోధనమును, బసవపురాణమందలి సకలేశ్వర మాదిరాజయ్యగారి కథయు నీవిషయమును వ్యక్తమొనర్చును. వేయేల! ఆంధ్రకవులలో నిట్టి యపారపాండితీ విక్రమ సంపన్నులు మిక్కిలి తక్కువయనుట సత్యదూరముకాదు. నన్నెచోడకృత కుమారసంభవపీఠికలో శ్రీ మానవల్లి రామకృష్ణకవిగా రాంధ్రకవులలో సర్వజ్ఞులనఁదగినవారు నన్నెచోడుఁడు, నాచన సోమనాథుఁడు, తిక్కన, ఎఱ్ఱాప్రగ్గడ, పలువురుమాత్రమే యని వ్రాసి మనసోమనాథుని విస్మరించుట ప్రమాదము. కవితాపథమున వీరందఱకు మార్గదర్శకుఁడయి, సర్వజ్ఞానుచరుఁడగు భృంగి యపరావతారమయి, తనసర్వజ్ఞతను గ్రంథముఖమునను, ఖండితవివాద రూపమునను బహువిధములఁ బ్రదర్శించిన యీవిద్వత్కవీంద్రునిఁగూడఁ జేర్చినఁగాని రామకృష్ణకవిగారిపట్టిక పరిపూర్ణముకానేరదని నామనవి.

సోమనాథుని కవితావిశేషములు:— తెలుంగుకవిత తీయందనము, జాతీయములు, రసోచితములగు తెలుఁగుఁ బలుకుబడులలోనే కలదనియెంచి, నన్నియభట్టారకుని మార్గమునకు వన్నియవెట్టి, నిక్కమయిన తెలుంగు కవితను వెలయించి, జాతీయకవితా నిర్మాణ విషయమునఁ దిక్కనాది మహాకవులకు మార్గమును దీర్చినది యీసుకవి సోముఁడేయని వెనుక విన్నవించితిని. సోమనాథుని కాలము నాఁటికి సంస్కృత పదభూయిష్ఠములగు గద్యపద్య రచనలు పొందుకొని, దేశీయచ్ఛందోనిబద్ధములు, జాతీయతా విలసితములునగు పదరచనముల (ద్విపదలు, తుమ్మెదపదములు మున్నగునవి) పయి నొకకరణి నిరసనము ప్రజలలోఁ బ్రబలినట్లు కానవగును. సోమనాథుఁడుకూడ మొదట సంస్కృత భూయిష్ఠములగు గద్యపద్యరచనల కలవడి, యవి జనసామాన్యమునకు సుబోధకములయి తనమత ప్రచారమున కంతగా నుపకరింపకపోవుటచే జాతీయచ్ఛందమగు ద్విపదలో జానుతెనుంగుఁ గవితను నిర్మింపదొరకొనిన తెలుంగు నీవఱకుఁ గొంతవివరించితిని. ద్విపద కావ్యములపయిఁ బ్రజలలో నప్పటికే గలిగిన నిరసనభావమును నిరసింపనెంచి "అల్పాక్షరముల ననల్పార్థరచన| కల్పించుటయకాదె కవి వివేకంబు" అని ఘోషించి, సత్కృతిలక్షణముల కనువగునట్లు "తొమ్మిదిరసనలు తొలకాడుదాని| నిమ్మడి వర్ణన లెసగంగ ద్విగుణ| మగునలంకారంబుల నలారుదాని| ద్విగుణార్థభావముల్ దీటుకొనంగ| దేటతెనుంగున ద్విపద రచింతు" నని వచించి "అదియునుగాక హి కాముష్మికాది పదహేతువగుట ద్విపదనాఁగఁబరఁగు" అని తనద్విపదకావ్య రచనమును సమర్థించినాఁడు. "క్రియాసిద్ధి స్సత్త్వేభవతి మహతాం నోపకరణే" అనుసూక్తి యెంతయు సమ్మతమయినది. కావుననే సోమనాథుని ప్రధానకావ్యములగు బసవపురాణ పండితారాధ్య చరిత్రములు ద్విపదలోఁ గూర్పఁబడినను నాతని యసాధారణ నైపుణ్యముచేఁ బయినిఁజెప్పినట్లు తొమ్మిదిరసములు, పదునెనిమిది వర్ణనలు, ముప్పదియాఱలంకారములు, డెబ్బదిరెండు భావములు చిప్పిలఁగ సత్కృతులలో నగ్రగణ్యములయి మనయాంధ్రభాషలోఁ దరువాత వెలసిన కావ్యపు పొలుంగులకెల్ల జీవనౌషధులయి విలసిల్లినవి. కావ్యవ్యాకరణజ్ఞులు శ్రీపంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు

ఆంధ్రపత్రిక పదియవ సంవత్సరాది సంచికలో "ద్విపదకవిత్వము" అను వ్యాసమున నీగ్రంథములనిట్లు బ్రశంసించియున్నారు.

"ఈరెండు గ్రంథములు నెక్కడఁజూచిన నక్కడ నవసరములు పొంగి పొరలిపోవునట్టి రసోదంచితములుగ ద్విపదలలోఁ గూర్పఁబడినవి. హిమవద్భూధర గుహాగ్రములనుండి యనర్గళముగా దుమికివచ్చెడు గంగాప్రవాహముంబోలె నీమహామహుని కవిత్వము పాఠకులమనంబుల నానందపూరమున నోలలాడించుచుండును. భక్తశిరోమణియగు పోతన భక్తిపారవశ్యపుఁ గవిత్వమునకును, కవిసార్వభౌముఁడగు శ్రీనాథ మహాకవి సుడికారముల గడుసుఁదనంపుఁ జిన్నెలకును, కర్ణాటరాజ్యరమానాథుఁడు నాంధ్రభోజుఁడు నాంధ్రకవియునగు కృష్ణదేవరాయ మహారాజుల యాముక్తమాల్యద మున్నగు కృతులలోని యద్భుతవర్ణనా పటిష్ఠములగు సందర్భములకును, దీనికి దానికనియేల, ఇంతదనుక మనయాంధ్ర సారస్వతమునఁగల హృద్యములగు రసవద్వర్ణనోదంచితములగు కావ్యపుమెఱుంగు లన్నిటికిని, ఈరెండు ద్విపదకావ్యములే మార్గదర్శకములయి రాజిల్లినవనుటలో నేమియు సందియములేదు." బసవపురాణ తృతీయాశ్వాసమందలి రుద్రపశుపతి, బెజ్జమహాదేవి, గొడగూచి, కన్నప్పమున్నగు ముగ్ధభక్తుల చరితములఁ బరికించిన నీయంశము తేటపడును. ఈ గ్రంథమిప్పుడు పరిశుద్ధముగ ముద్రితమయినది కావునఁ జదువరుల నాయాతావులఁ దిలకింపఁ బ్రార్థించి స్థలసంకోచమున వానినిచ్చుట నుదాహరింప మానుచున్నాను.

బుద్ధికెంతయో శ్రమదెచ్చుకొని యుత్ప్రేక్షాద్యలంకారములతో, అల్లసానిపెద్దన, రామరాజభూషణుఁడు, పింగళిసూరన కోఁడికూఁతను వర్ణించుచు వ్రాసినపద్యము లాంధ్రవాఙ్మయమున సుప్రసిద్ధములు. కాని వీనికంటె మనసోమనాథుఁడు జిలిబిలిపలుకులతోఁ గూర్చిన స్వాభావికవర్ణన మెంతయు మనోహరముగ నున్నది.

స్వాభావికములగు ప్రకృతివర్ణనము లీతనికి మంచినీళ్లప్రాయములు. కవితచిత్రకళయని యెఱిఁగి చిత్తరువులందు లిఖించినట్లు పాత్రముల రూపవర్ణన మొనర్చి చదువరులహృదయఫలకములు వానిని జిత్రించు విజ్ఞాన మీతనికలవడినట్లు మఱియొకనికిఁ గలుగలేదనుట యతిశయోక్తి కాదు. సోమనాథుని సర్వజ్ఞత వెల్లడించు వర్ణనములను గ్రంథవిస్తరభీతిచే నిచ్చుట వివరింపమానితిని. చౌర్యము, ద్యూతము, విటత్వము, రసవాదము మొదలగు ననేకాసాధారణవిషయములను సందర్భోచితముగ వర్ణించు పట్టులను జూచిఁ జదువరులీతని సర్వంకషప్రతిభకాశ్చర్య చకితులు కాకమానరు. పండితారాధ్య చరిత్రమున వాదప్రకరణమున వివరింపఁబడిన వివిధమతవాదఖండనము లీతని యపారపాండిత్యమునకాదర్శకములయి యున్నవి. చక్కని లోకోక్తులను జాతీయములను సందర్భోచితముగ నుపయోగించువిజ్ఞానమునం దీతఁడు నెఱజాణయని చెప్పవచ్చును. సోమనాథుని కవితయందలి ముఖ్యగుణము లనన్యసామాన్యములగు సౌందర్య మాధుర్యములు. అతఁడు తన గ్రంథములను భక్తిరసపరవశుఁడయి రచించుటయు, భావమునే ప్రధానముచేసికొని శ్లేషయమకాద్యలంకారములకయి తడవులాడకుండుటయు, జాతీయతనే యెక్కువగ గణించి దేశీయచ్ఛందమగు ద్విపదలోఁ దీరుతీయను

లుగల తెలుఁగుఁ బలుకుబళ్లను మేలుగజాలు వాడుటయు నిందుకుఁ బ్రధానకారణములు. సరసమయినజానుఁ దెనుఁగుపయి నతఁ డెక్కువగ వలపుగొనినను, సహజగంభీరతాప్రసన్నములగు సంస్కృతపదములపయిఁ గూడ నాతఁడు వ్యామోహము విడువలేదు. జాతీయత వలసిన పట్టుల నాతఁడు నూటికిఁ దొంబది పాళ్లు జానుఁదెనుగును బ్రయోగించును, గాంభీర్య ప్రకటన మవసరమయిన మతవివాదములు మున్నగుతావుల సంస్కృత పదబాహుళ్యమును బ్రదర్శించును. మఱికొన్నిసందర్భములఁ దెలుఁగుపదములనుసంస్కృతపదములను సమాసముగఁ బ్రయోగించును. అతఁడు రసైకపరతంత్రుఁడు. రసవిజృంభణమునకయి మెచ్చుట నట్టి పదజాలమును బ్రదర్శింపవలెనో యాతఁ డెరింగినట్లు మన మెఱుంగఁ జాలము. శబ్దాలంకారములలో, అనుప్రాసముకయి సోమనాథునికి మక్కువమెక్కువ. బసవపురాణ పండితారాధ్యచరిత్రము లందలి యాశ్వాసాంతభాగములను, పంచప్రకారగద్య మున్నగు గద్యకృతములును, వృషాధిపశతకమును నీయంశమును వ్యక్తమొనర్చును. ఈ యనుప్రాసములయినను భావావేశములో వానియంతటనవి సహజముగ దొరలివచ్చినట్లే గోచరమగును గాని ప్రత్యేకదృష్టితో వానినాతఁడు బ్రయత్నపూర్వకముగఁ బ్రవేశపెట్టినట్లు గానరావు. ఈతని తరువాత వెలసిన బమ్మెరపోతన మున్నగు నిజామురాష్ట్రకవులయనుప్రాసప్రియత్వమున కితఁడే మార్గదర్శకుఁడు కానోపును.

తిక్కన నాచనసోమనాది మహాకవుల జాతీయకవితానిర్మాణమునకు మనసోమనాథుఁడెంతవఱకు మార్గదర్శకుఁడయినది యాతని గ్రంథములను వారికావ్యములను సూక్ష్మముగఁ బరిశీలించినఁ దెల్లమగును. కుమారసంభవకర్తయగు నన్నెచోడుని కాలమింతవఱకు నిర్వివాదముగ నిదమిత్థమని నిర్ణయింపఁబడలేదు. నన్నెచోడుని కావ్యమును మనసోమనాథుని పండితారాధ్యచరిత్రమును తెన్నుగాఁ బరికించిన నొకరినొక రనుకరించిన పట్టుల నన్నెచోడుఁడు సోమునిద్విపదలనే సులువుగఁ బద్యములలోఁ బెట్టుకొననేమోయని నాయనుమానము. నన్నెచోడుఁడు క్రీ శ. 1170 ప్రాంతమువాఁడగును. అనఁగా మనసోమనాథున కించుమించుగా సమకాలీనుఁడన్నమాట. కుమారసంభవము క్రీ శ. 1170–1180 ప్రాంతమునఁ బాకనాటిసీమలో నన్నెచోడునిచే రచింపఁబడియుండునని తలంచినను దానిప్రతులు నలుబదియేండ్లలోనే సోమనాథుఁడు తనవార్ధకదశయందు వసించిన కర్ణాటదేశమున వ్యాప్తమగుటయు, నందలి పద్యములను క్రీ॥ శ॥ 1220 ప్రాంతమున రచించిన పండితారాధ్యచరిత్రమున సోమనాథుఁడు ద్విపలదలలోఁ గూర్చికొనుటయు జరగియుండునాయని నాసందేహము. సోమనాథునియెడ భక్తి గౌరవముల నెఱపుచు నాతనితరువాత వెలసిన సుప్రసిద్ధకవులొనర్చిన యనుకరణములకుఁ గొన్ని స్థూలదృష్టాంతములమాత్ర మొసంగెదను. శ్రీనాచన సోమనాథునకుఁగూడ మనపాల్కురికి సోమనాథుఁడే మార్గదర్శకుఁడని పాఠకులెఱుంగుదురుగాక! శతకకవులుగూడ నీమహాకవిగ్రంథములను జదివి యాతని ననుకరించిన జాడలు పెక్కులు చూపవచ్చును. శతకవాఙ్మయములో నద్వితీయమగు నీతని వృషాధిపశతక మటుతరువాత వెలసిన భక్తిరసపూరితములగు దాశరథీశతకము మున్నగు పెక్కుశతకములకు

మార్గదర్శకములునవిధము నాయాశతకముల నవిమర్శముగఁ దిలకించినఁ దెలియనగును.[20] నీతిపద్యశతకములను వ్రాసిన కవులుగూడఁ బలువురు సోమనాథుని రచనముల ననుకరించిరి. ముఖ్యముగాఁ గాకతిరుద్రాంబికకు సామంతుఁడును సుప్రసిద్ధశతకరాజమగు సుమతిశతకమునకు గర్తయునగు బద్దెన యాతని ననుకరించిన విధము చూడవచ్చును.[21]

మఱియు సోమనాథుని యనుభవసారమందలి కందపద్యములు పెక్కులు బద్దెననీతిసారము సుమతిశతకములలోని కందపద్యములకు మార్గదర్శకములయినట్లు కాననగును. వేమన యోగిగూడఁ దన పద్యములలో సోమనాథుననుకరించిన జాడ లనేకములుగలవు.

వేయేల! శ్రీ ఆదినారాయణ శాస్త్రిగారు చెప్పినట్లు మనభాషలో హృద్యములును రసవద్వర్ణనోదంచితములు నగు కావ్యపు మెఱుంగుల జూపిన మహాకవులకెల్ల నీసుకవిసోముని గ్రంథములే జీవనౌషధములని నిరూపించుట కసంఖ్యాకములగు దృష్టాంతములను జూపవచ్చును.

ద్విపదలలోఁ బ్రాసయతిఁగూర్చుటయు, వ్యాకరణ విషయములలోఁ గొంత స్వాతంత్ర్యమును గొనుటయు సోమనాథుని బహుభాషాసంప్రదాయజ్ఞతను, స్వాతంత్ర్యప్రియమును బ్రకటించి యాతని పాండిత్యమునకు మఱింత వన్నె పెట్టునేగాని దానినించుకయుఁ గొలదిపఱుపనేరవు. ద్విపదలలోఁ బ్రాసయతి నంగీకరించుట ప్రాచీనకవిసమ్మతమే. "అనియతగణైః" "యతిర్వా" "ప్రాసోవా" అని సోమనాథుఁ డుదాహరించిన ప్రాచీన సూత్రములిందుకు నిదర్శనములు. సోమనాథుని శిష్యుఁడును సమకాలీనుఁడునగు రంగనాథునిచే రచింపఁబడిన రంగనాథ రామాయణములోఁ

---

20 సోమనాథ నన్నెచోడుల యాశ్వాసాంత గద్యములను, పండితారాధ్యచరిత్రము 121 పుటలోని "నెట్టన నేలకు" మొదలగు ద్విపద పంక్తులనిరువదిని, "నేలయు నింగియు" నను నన్నెచోడుని సీసపద్యముతోడను, తిక్కన విరాటపర్వము రెండవ యాశ్వాసములోని "నేలయు నింగియు" నను పద్యము తోడను, పరిపోల్చునది. సోమనాథుని చతుర్వేదసారమునందలి "రాకామల జ్యోత్స్న" మొదలగు నాల్గుపంక్తులకును, పోతనరచించిన "మందారమకరంద" యను పద్యమునకును పోలికకలదు. శ్రీనాథుని హరవిలాసము 3వ ఆశ్వాసములోని "అనుపమప్పిరినొచ్చి" యను సీసమునకును, శివరాత్రిమాహాత్మ్యము 4వ ఆశ్వాసమునందలి "విచ్ఛిన్న బాహూరుచరణ" యను పద్యమునకును నాచన సోముని యుత్తర హరివంశమునందలి "ఇరువురు మెయిమఱచి" మొన్నగు పట్టులకును, బసవపురాణము అ 7 పుటలు 189, 190, 216, పండితారాధ్యచరిత్రము పుటలు 83, 134, 135, లలోఁగల సోమనాథుని పద్యములకును సామ్యముగలదు.

21 "కనుఁగాయఁ దెంచినఁ గాయగుఁ గాక। పననిపండగునయ్య ప్రాంతిఁబొందినను"

(బ॥ పు॥ పే 98)

క॥ కనుఁగాయ కఱచిచూచిన। మనలక యది వగరుఁగాక మధురంబగునా॥ (సుమతిశతకము)

"వల్లవో ఖాముల యుల్లంబెఱుంగక। గొల్లవాఁడైనను గోయకె కలియ
గొల్లనివెలయాలి గొల్లని నృపతి। గొల్లనిచెలిఁబాయ గొల్లఁడేనియును
గొల్లండువాఁడుగా కొల్లడుజాతి। గొల్లఁడు గొల్లండె గొల్లఁడేనియును"॥ (పండి॥ చ॥ పుట 115)

క॥ ఒల్లనిపతి నొల్లనిసతి। నొల్లని చెలి కానియధిక నొల్లనివాఁడే
గొల్లండు గాకధరలో। గొల్లండును గొల్లవాని గొఱియున సుమతీ॥ (సుమతిశతకము)

గూడఁ బ్రాసయతిప్రయోగములు క్వాచిత్కముగఁ గాననగును. ఇంతకు సోమనాథునికాలమునాఁటి యాంధ్రచ్ఛందోవ్యాకరణాదికలక్షణగ్రంథము లింతవఱకు లభింపలేదు. ఆంధ్రశబ్దచింతామణీకర్తృత్వవిషయ మింకను గందరగోళములోనే యున్నదికదా! బసవపురాణపీఠికలో శ్రీ ప్రభాకరశాస్త్రిగారు సోమనాథుఁడు యతిప్రాసాదికవిషయములలోఁ గొన్నియెడల నన్నయాదుల మార్గము నతిక్రమించెనని వ్రాసిరి. అది యవిచారమూలకము. వారి వ్రాతలసంగతములుఁ[22].

భాషావ్యుత్పత్తియందు సమధికుఁడయి, పాండితీవిక్రమంబున నజేయుఁడయి, జాతీయకవితానిర్మాణమున నగ్రేసరుఁడయి, రసపోషణము నందసమానుఁడయి, యాంధ్రీకరణయుగారంభముననే స్వతంత్రగ్రంథరచనమునకుఁ గడగిన యీమహాకవి కావ్యగుణములను గూర్చి యెంతవ్రాసినను దనివితీఱదు. కవితాప్రశస్త్యమున నీతఁడు తిక్కనాదులతోఁ దులఁదూఁగి మొదటి తరగతిలోఁ జేర్పఁదగినవాఁడు.

కాకతీయ యుగాంధ్రకవినాథుఁడగు సోమనాథుఁడు మనభాషకొనర్చిన మహోపకారము పారము, అద్వితీయము, చిరస్మరణీయము. అయినను నాతని గ్రంథములలో బసవపురాణవృషాధిపశతకములు దక్కఁ దక్కినవి యింకను గూడ బరిశుద్ధములుగఁ బరిష్కృతములయి ప్రకటింపఁబడకుండుట శోచనీయము. ఆంధ్రసోదరులు, కాకతీయ చరిత్రాభిమానులు శ్రద్ధవహించి యీలోపమును నివారించి సోమనాథుని గ్రంథములను బఠనపాఠనయోగ్యముగ బహుళప్రచారమునకుఁ దెచ్చి యాతని ఋణమును దీర్చికొందురుగాక యని ప్రార్థించుచున్నాను.



22 “పాలకురికి సోమనాథకవి- కావ్యవిశేషములు” అను పేర ది 30-7-32, 3-8-32 6-8-32 తేదుల సమదర్శనీపత్రికలోఁ బ్రకటితమయియున్న వ్యాసమును జదివినఁ దెలియఁగలదు.

# కాకతీయ నాణెములు.*

శ్రీయుత ఎస్. టీ. శ్రీనివాసగోపాలాచార్యులుగారు ఎం. ఎల్.

ఈవిషయమై మనకు విశేషసామగ్రి లభింపకున్నను, లభ్యమగు దానిని బరిశీలించుటతోనే తృప్తినందవలసియున్నది. కాకతీయుల నాణెములనుగూర్చి చేయబడిన మొదటి పరిశీలన 1844–47 సంవత్సరములలో గాంచనగుచున్నది. ఆకాలపు బొంబాయి రాయల్ ఏషియాటిక్ సొసైటీవారి పత్రికలో[1] దక్షిణ కొంకణదేశమున వాలల్ అనుగ్రామమున దొరకిన 10 నాణెములనుగురించి యొకవ్యాసము వ్రాయబడియున్నది. ఈనాణెముల కొకవైపున 'శ' 'చ' యను సాంకేతికాక్షరములును, మధ్యలో నొక వలయమును నుండినవనియు, రెండవప్రక్క సాధారణముగా నొక వలయములో 'రుద్ర' యను శాసనము, ఒకదానిపై మాత్రము త్రిశూలమును 'శ్రిమన్యదేవయ' యను వ్రాతయు నుండినవనియు జెప్పి యీ వ్యాసకర్త యీనాణెములు వారంగల్ రాజులగు కాకతీయులవనియు, వారిలో ముఖ్యుడగు రుద్రదేవునికిని చెందునని వ్రాసియున్నారు.

పిమ్మట సర్ వాల్టరు ఎలియట్ అను పండితుడు 1886 లో ప్రకటింపబడిన "దక్షిణహిందూదేశపు నాణెములు" అను తనగ్రంథములో కాకతీయనాణెముల పరిశీలన చేసినాడు.[2] అందొక రాగినాణెము వర్ణింపబడియున్నది. దానిపై నొకప్రక్క గూర్చుని యున్న నందియు, రెండవవైపున "శ్రీమత్ ...క...క తి......ప్రతాప... ర...య" లేక "కకత...శక...2" అను శాసనము నున్నవట. పై ఎలియట్ పండితుడు ఒకప్రక్కను లింగమును నందియు, మరియొకవైపున తెనుగువ్రాతయుగల మరిరెండు నాణెముల నుదహరించెను. కాని యివి కాకతీయులనాణెములు గావనియు, 17, 18 శతాబ్దములనాటి మధుర, తిరునెల్వేలి నాయకుల నాణెములనియు స్పష్టముగ దెలియుచున్నది.[3]

తరువాత నాణెములను బరిశోధించినవారు గూడ కాకతీయ నాణెముల బరిశీలన చేసిరి. రాప్సన్‌గారు ఎలియట్ వ్రాతలనే బరిగ్రహించిరి.[4] జాక్సన్ గూడనటులే చేసెను.[5] బ్రౌన్ దొరగారు "హిందూదేశపునాణెములు" అనుపుస్తకములో[6] "ఒకప్రక్క నాసీ

---

*J. A. H. R. S VI-3&4. లోని యాంగ్లవ్యాసమునకు అనువాదము—(సంపాదకుడు)

1 J. Bo. B. R. A. S. II P. 63.

2 Elliot—Coins of Southern India Pl. iii nos 93—95.

3 I. A. 1903 P. 315. Loven Holl--Coins of Tinnevelly vol IV nos 92—123

4 Rapson—Indian Coins P. 38

5 Br. Numis. Jour 1912, P. 314—315

6 Browne—The Coins of India. P. 60

నమైన నందియు, మరియొకవైపున నాగరీవ్రాతలుగల పగోడాలును, ఫణములును, రాగి నాణెములును కాకతీయుల వని నిశ్చయింపవచ్చును'' అనివ్రాసిరి. కానియీవ్రాత కాధారములు కానరావు.

ఇటీవల Indian Antiquary పత్రికలో నొకరు[7] బ్రాడోరగారి నిర్ణయమును నిరసించిరి. కాకతీయులకు వరాహముద్రిక యుండుటచే, వారినాణెములపై నందియుండుటకు వీలులేదని పై వ్యాసకర్త వాదము. కాని కాకతీయులు శివభక్తులయు, శివాలయనిర్మాతలనియు జ్ఞప్తికి దెచ్చుకొనినచో, వారినాణెములపై నందివిగ్రహముండుట యసంభవము కాదని దెలియగలదు. పై వ్యాసకర్త నెల్లూరు జిల్లా కైవల్యదవల్లిగ్రామమున నొకబంగారునాణెము దొరకినదనియు నదికాకతీయులదనియు వ్రాసియున్నాడు. అందు వలయముమధ్యగా నొక యడ్డుగీతగలదనియు, దాని కిరుపార్శ్వములను 'శ్రీ' యను నక్షరములును, పైభాగమున 'కతి' యనుమాటయు, క్రిందిభాగమున "గణ" యనుమాటయు గలవనియు, తక్కినచోటులో తెరచిననోరును, మెత్తనపంజాను, తిరిగిన తోకను గలసింహములో పెద్దపులిలో గలవనియు, వ్రాసియున్నాడు. ఈ సింహ(వ్యాఘ్ర?) లాంఛనము పల్లవకదంబాదివంశములకు జెందినదైయైనను, కాకతీయులు పూర్వీకుల నాణెములనుగైకొని వానిపై దమ చిహ్నములను ముద్రించి, వాడుకలో బెట్టిరని యూహింపనగునని పై వ్యాసకర్త యభిప్రాయము. కాని యీవిషయమున జాగరూకులమై యుండవలెను. నందివిగ్రహముగల నాణెములను చోళ[8] విజయనగర[9] సేతుపతి[10] వంశీయులు వాడియుండిరి.

పై చర్చనుండి యింతవరకును మనకు విశ్వసనీయములగు గాకతీయనాణెములు దొరకియుండలేదని స్పష్టమగుచున్నది.



7 I. A. vol 66. P. 186—194.
8 Elliot—Pl Iv nos 167, 169, 173
9 I. A. Sep. 1891 pl II no 23
10 MDS, Jour. Lit. Sc. Fig nos 1,2, 3, 4, 6.

# కాకతీయులు—ద్రవిడవాఙ్మయము.

శ్రీయుత సోమసుందరదేశికగారు.

౧

అమూల్యములగు చరిత్రాంశములను దెల్పునవయ్యు నింతవరకును సరిగా బరిశీలింపబడని ద్రవిడగ్రంథములలో 'నావలర్ చరిత్రై' అనునదొకటి. అందు సుమారిరువదినల్గురు కవులచరిత్రములు గాంచనగుచున్నవి. అట్టివారిలో కంబకవిముఖ్యుఁడు. ఈతని రామాయణము సువిఖ్యాతము ఇయ్యది వాల్మీకిగ్రంథముకంటె గొప్పదిగ నెంచబడుచున్నది. ఇందలి యొకపద్యమును ఓరుగంటిరుద్రుని బ్రశంసించుటకై కంబకవి రచించెనని ప్రతీతి గలదు. ఈకవియెడ దనకుగల భక్తి గౌరవములను జూపుటకై రుద్రుఁడాకవితో చోళరాజాస్థానమున కేతెంచెనని దీనిభావము.

పైపద్యమునందలి విషయము సవగతము జేసికొనుటకు కంబనిజీవితచరిత్రము దోడ్పడగలదు ఈకవి "ఒచ్చ" యను పూజారికుటుంబమున జన్మించెను. చిన్నతనముననే తలిదండ్రులను గోల్పోవుటజేసి యాతను సదయుడనువాని పోషకత్వమున దంజావూరు మండలమున బెరిగెను. కాలక్రమమున నీతడు ద్రవిడవాఙ్మయమున విశేషపరిచయమును గల్గించుకొని వాణీప్రసాదమునుగూడ బొందెను. అనతికాలముననే కంబడు కవిచక్రవర్తియై చోళరాజుల యాస్థానకవి యయ్యెను. కొన్నికారణములచే గొంతకాలము పాండ్యులకడ నుండినను కంబకవి తిరిగి చోళులజేరెను. ఒకనాడు విలాసప్రసంగ మొనర్చుచు రాజు హాసోత్తుంగనవ్వెనట. కంబకవి దానికి గారణమడుగగా రాజు "నేనొక సామాన్యమానవుడనైనను, నాకు నిరంకుశమగు రాజ్యాధికారము లభించినది చూడు"మని సగర్వముగ బదులుపల్కెనట. అంతట కంబడు "ఓయీ! అట్టినీవు సామాన్యకవినగు నాకు లోబడియుంటి"వని చెప్పెనట. దీనికి గుపితుడై రాజు కంబకవిని దేశమునుండి బారదోలి యాతని యాస్తి నాక్రమించెనట. ఇట్లవమానింపబడి సకవి "ఈరాజునకు రాజగువానిని నా యనుచరునిగా గొనివచ్చిగాని నేనీచోళరాజ్యమును దిరిగి బ్రవేశింప"నని ప్రతిజ్ఞచేసి వెడలిపోయెనట అనంతరమీతడు చేరదేశమున కేగెనని కొందరును, పాండ్యరాజ్యమున కేగెనని కొందరును చెప్పుదురు.

మహావిద్వాన్ రాఘవయ్యంగారు కంబనిగూర్చి మరిరెండుగాథలను దెల్పియున్నారు. అందొకదానినిబట్టి, అంబికాపతియను కంబనిపుత్రుడు చోళరాజపుత్రికను బ్రేమించెననియు, దానికై యాతనిశిక్షించు నుద్దేశ్యముతో రాజు గవికుమారుని ముక్తినిగూర్చి యాశువుగా నూరుపద్యములుజెప్పి తనప్రాణ ను గాపాడు కొమ్మనెననియు, నీపద్యములను వినుచు బ్రార్థనాశ్లోకమునుగూడ లెక్కించి 99 వ పద్యమునే 100 వ దానిగా బరిగణించి రాజపుత్రిక సోత్సాహముగ నాస్థానమున దొంగిచూచెననియు, నంత నంబికాపతి శృంగారరసమును వర్ణింపమొదలిడ రాజాతని నచటనే జంపించెననియు, నీచోళరాజు మూడవరాజరాజ చోళుడనియు, తెలియుచున్నది. మఱి

యొక్క గాథవలన కంబనికూతురగు కావేరి యనునామెను మోహించి చోళరాజపుత్రు డామెకై ప్రయత్నించెననియుఁ నామెదీనికి ప్రతీకారముగ నాత్మహత్య చేసికొనెననియు, నీయుదంతము దెలిసి కంబకవి రాజును దూషించి, చోళరాజ్యమును వదలి కాకతీయుల యాస్థానమున కేగెననియు స్పష్టమగుచున్నది.

'నావలర్ చరిత్తై' నుండియుదాహరింపబడిన పైపద్యభావము నీరెండవగాథయు నొకేవిధమున నున్నవి. రాఘవయ్యంగారు కాకతీయులు చోళులకు ప్రభువులనియు, నప్పటి చోళరాజు మూడవ రాజరాజనియు, కంబకవి దర్శించినది కాకతీయులలో మొదటిరుద్రుడనియు, నాతడు కంబనితో చోళరాజధాని కేతెంచుట క్రీ. శ. 1162—97 నడుమ జరగియుండుననియు నభిప్రాయపడి యున్నారు.

ఈయభిప్రాయము నంగీకరించుటకు గొన్ని ప్రతిబంధకములు గలవు—(1) కంబకవి కాంధ్రభాషయందును గాకతీయులకు ద్రవిడభాషయందును విశేషమగు పరిచయము, అనగా రామాయణమంతటి యుద్గ్రంథమునకు బాఠప్రవచనముల జేయుటకు సరిపడునంత, ఆకాలమునందుండియుండవలెను. కంబకవి "అక్కటా" "ఉండు" మున్నగు కొన్ని తెలుగుపదములను ప్రయోగించియుండినను గూడ నయ్యవి పాండితీద్యోతకములనుట కాధారములు లేవు. (2) మూడవ రాజరాజు 1146—1162ల నడుమ రాజ్యమేలి, తనయంత్యకాలమున ప్రాచీనదాక్షిణాత్య చోళవంశీయుడగు నల్లమార్క అనువానికి రాజ్యము నప్పగించెను. పిమ్మట నల్లమాను సోదరుడగు కుమార మహీధరుడనువాడు తృతీయ కులోత్తుంగాభిధుడై రాజ్యమేలెను. రాజరా జుత్తరసర్కారులపైనను తుంగభద్రాకన్యాకుమారీమధ్య దేశముపైనను రాజ్యమేలెను. కులోత్తుంగుడు దక్షిణదేశమునంతటిని జయించి త్రిభువనవీరదేవుడను బిరుదము నందెను. అట్టిచో చోళులు గాకతీయుల కీసమయమున సామంతులుగనుండుట పొసగనేరదు. (3) కంబకవి తనరామాయణములో చోళరాజును పేర్కొని యుండలేదు అట్టిరాజొకడుండినచో నాకవి నామమును దప్పక చెప్పియుండును. దీని కుత్తరముగ గొందరు కిష్కింధాయుద్ధకాండముల లోని రెండు పద్యములను జూపవచ్చును. గాని అందొకటి 'సెన్నియ్' అని చోళుని సామాన్యముగ బేర్కొనును. మరికొందరు రామాయణము వైష్ణవగ్రంథమనియు, చోళులు శైవులనియు నందుచే చోళప్రశంస యాగ్రంథమున లేదనియు జెప్పుదురు ఇదియు నసమంజసమే. రాజరాజు వైష్ణవమతోద్ధారకుడుగ ప్రశంసింపబడి యున్నాడు. నావలర్ చరితమున కంబకవి చోళరాజ్యము 240 మైళ్ళువైశాల్యముగలదియని చెప్పియున్నాడు. దీనిని బట్టి రామాయణ రచనాకాలమునకు చోళులు దమ ప్రాముఖ్యతను గోల్పోయి యనామధేయులుగనుండిరని తోచుచున్నది. (4) 1158-1195 నడుమ రాజ్యమేలిన కాకతిరుద్రుడు తన రాజ్యము నాంధ్రదేశముదాటి విస్తరింపలేదు. అట్టిచో నాతనికి చోళుల సంపర్కముండుట కల్ల (5) ఈచోళ కాకతీయ సంబంధమును జేర్కొను పద్యముగల నావలర్ చరితము గాథాసమూహము. ప్రాచీనమగు సంగకాలము నుండి 16 శతాబ్దమువరకు నాగాథలకు బరిమితిగలదు. అది యవిశ్వాస్యము. (6) కంబకవి కాలమునుగూర్చి యభిప్రాయ భేదము లున్నవి. కొందరీతడు 12 వ శతాబ్దమునందుండె

ననితలంచినను, సాధారణముగా 9 వ శతాబ్దమే యాతని జీవితకాలమని పండితులంగీకరించుచున్నారు. (7) పై నావలర్ చరిత్రైలోని పద్యమునకు కంబకవినిగూర్చిన గాథలను జేర్చినచో యీచోళకాకతీయ సంబధమేర్పడును గాని స్వతంత్రముగ నయ్యది యాసంబంధమును జూపుటలేదు.

౨

కుమారసరస్వతి, తత్వప్రకాశ అను నిరువురు ద్రావిడకవులు చెప్పియొక పద్యమును ఓఢ్రులు దక్షిణదేశమును పీడించుటను, కృష్ణదేవరాయలు వారిని జయించుటను బ్రశంసించియుండిరి. క్రీ. శ. 1575లో రాయలోఢ్రులను జయించుట చరిత్రవిదితము. నిజమిటులుండినను దాక్షిణాత్యులు కృష్ణదేవరాయలు కాకతీయులను జయించెనని నమ్ముదురు.

3

“నేను మూఢుడనుగాను” అనుటకు అరవమున “నాన్ కాకటియన్ పొక్కట్టియన్ అల్ల” అను నొక సామెతగలదు దానికి “నేను కాకతీయుడను అనగా నిస్సహాయుడనుగాను” అని యర్థము. ఈసామెత యెట్లువచ్చినదో తెలియదు.



# గణపతి దేవప్రశంస.

శ్రీయుత నేదూరి గంగాధరం గారు

సీ॥ కాకతి సద్వంశ ♦ కమలాకరమునకు, నుదయభానుండయి ♦ యొప్పమీరె
రాజన్మహాదేవ ♦ రాజబయ్యమగర్భ, పాథోధిచంద్రుఁడై ♦ ప్రభవ మొందె
పశితనంబున యాద ♦ వన్నృపులచెరజిక్కి, పదివత్సరంబులు ♦ బాములందె
గణపరుద్రాంబికా ♦ ఘనవీరనారుల, కడుపార నర్మిలి ♦ గాంచిమించె
ఆ॥ వె॥ పెద్దతండ్రి రుద్ర ♦ పృథ్వీశు త్రైలింగ్య, రాజ్యవృద్ధిజేసి ♦ రాజదరుల
మండలేశ్వరులను ♦ దండించి రణరంగ, భీష్ముఁడనగ నితఁడు ♦ పేరునందె॥

సీ॥ గెలిచెను కొలనిమాండలికుల జాయసే, నానిని నాజి వె ♦ ల్నాటిసీమ
కొలనిసోమయమంత్రి ♦ బలముచే గాంగుల, భంగించి గొనగ క ♦ ళింగసీమ
కొణిదెన పొత్తపి ♦ తెనుగుచోడుల బట్టి, వీరుడై గెల్చె న ♦ ల్లూరుసీమ
ఘనమహారాష్ట్రగాం ♦ గయుల నోర్చి మనుమ, సిద్ధింబ్రతిష్ఠించె ♦ సింహానగరి
తే॥ గీ॥ పల్లవుల గూల్చి పాండ్యుల ♦ భంగపరచి, కంచికృష్ణానదీమధ్య ♦ గలుగురెడ్ల
దరిమి నెల్లూరుసింహాభూ ♦ ధరసమస్త, వేంగిదేశము పాలించె ♦ వీరుడగుచు॥

గీ॥ పద్మనాయకకాయస్థ ♦ వంశభవుల, నరయగా నిందులూరుమ ♦ ల్యాలవారి
మానధనులైన పిల్లల ♦ మర్రిరెడ్ల, నిలిపె సలచమూపతులుగ ♦ నేర్పునంగ
పోతమంత్రియు తిక్కచ ♦ మూపతియును, అన్నభాస్కరమంత్రులు ♦ నర్కనములు
మేచగోవిందనాయకుల్ ♦ మేరుధైర్య, శౌర్యగాంభీర్యధనులునా ♦ సచివులరయ॥

సీ॥ తెగువ దేశీయవి ♦ దేశీయవాణిజ్య, సంస్థల పేర్మితో ♦ సంఘటించె
జైనమతమణంచి ♦ శైవంబువెలయించి, హాణిగట్టించె శి ♦ వాలయములు
సత్రముల్ చెరువులు ♦ చలిపందిరులు బాట, లధ్వగులకు నిల్పె ♦ సటవులందు
గోళగిరామవ్వ ♦ పాలము పేటల, గట్టె గుళ్లను నోరు ♦ గల్లునందు
ఆ॥ అరువదొక్కయేడు ♦ లవనిబాలించుచు, నెనుబదేండ్లు బ్రతికె ♦ నింపెలర్ప
వసుధ పదియురెండు ♦ వందలర్వదియేట, స్వర్గమేల జనియె ♦ శౌర్యధనుడు.

మ॥ కలధాత్రీశులు మౌళిరత్నమకుటా ♦ గ్రిస్తోమముల్ సోక నం
ఘ్రిల సేవింపగ సత్కవుల్ వొగడ ది ♦ క్కుల్ కీర్తి నిండారగా
కళలం బెంచి యపూర్వశౌర్యమహిమన్ ♦ గర్వారులన్ గూల్చి యాం
ధ్రిల బాలించిన కాకతీయకులచం ♦ ద్రుల్ భక్తి గీర్తించెదన్.



# కాకతీయులనాటి సాంఘికచరిత్ర.

శ్రీయుత సురవరము ప్రతాపరెడ్డిగారు బి.ఏ., బి.ఎల్.,

కాకతీయసామ్రాజ్యమును గూర్చిన సాధనములు—శాసనములు, తాళపత్రగ్రంథములు, ప్రబంధములు, శిల్పములు, విదేశచారిత్రకుల ప్రశంసలు, నాణెములు—మున్నగునవి అప్పుడప్పుడు మనకు లభించుచున్నవి. ఈవంశపురాజుల రాజ్యకాలమునందు ప్రజలయొక్క రాజకీయ, నైతిక, విద్యావిషయక, సాంఘికజీవనములెట్టివో మనకు కొంతకొంత విశదమగుచున్నది. కాకతీయవంశరాజులు శాలివాహన శకారంభమునుండి వరంగల్లుప్రాంతమందే రాజ్యము చేసిరని స్థానికచరిత్రయగు ప్రతాపరుద్రచరిత్రమను గ్రంథము చెప్పుచున్నది. కాని యదివిశ్వసనీయము కాదు. ఏది యెట్లున్నను, ఈవ్యాసమందు ప్రోలరాజు కాలమునుండి ప్రతాపరుద్రుని యనంతరము వరకు, అనగా క్రీ. శ. ౧౧౦౦ నుండి ౧౪౦౦ వరకు కాకతీయసామ్రాజ్యమునందలి జనుల సాంఘికజీవన మెట్లుండెనో చర్చింపబడును.

మతము:— మొదలాకాలమందలి జనుల విశ్వాసము లెట్టివో పరికింతము. కాకతీయుల కాలమున నాంధ్రదేశమందు జైనశైవమతములు విశేషముగా ప్రచారమందుండినవి. ఒకకాలమం దాంధ్రభూభాగమంతయు జైనమతమునకు లోబడియుండెను. కాకతిప్రోలరాజు కాలమువరకు కాకతీయులు జైనులై యుండిరి. వారియింటిపేరు కాకతియను జైనదేవతనుండి యేర్పడెను. కాని జైనవాఙ్మయమందు కాకతియను దేవతపేరు కానరాదు. అయినను కాకతి జైనదేవతయేయని యూహింపవచ్చును. ఆకాలమందలి వాఙ్మయమందును కాకతియనునొక శక్తియని పేర్కొనబడియున్నది. ప్రతాపరుద్రీయమను గ్రంథమునందును, "కాకత్యాః పరశక్తేః కృపయా కూష్మాండవల్లికా కాచిత్। పుత్రిమహోత తదేత త్కుల మనఘం కాకతిసంజ్ఞ మభూత్" అని అనితల్లి కలువచేరు శాసనము నందును గాకతిప్రశంస గలదు.

కాకతీయులు మొదట హిందువులై యున్నప్పుడు క్షత్రియులై యుండిరి. కాని జైనులైనతర్వాత శైవులైనందున నీయుభయమతములందును చాతుర్వర్ణ్యవ్యవస్థ యంగీకారము కానందున వీరిని చతుర్థవర్ణస్థులనుగా శాసనములందును, ప్రబంధములందును చేర్కొనిరి. ప్రతాపరుద్రీయకర్త యటు వీరిని క్షత్రియులని చెప్పనొల్లక; యిటు శూద్రులని చెప్పజాలక; గోడమీదిపిల్లివలె "అత్యర్కేందుకులప్రశస్తిస్పృజ ద్వ్యం కాకతీయాన్వయః" అని రెంటికిని తప్పినవారనుగను సర్థముగూడ దోచ వక్రోక్తిగా వర్ణించెను. ప్రోలరాజుతో జైనమతావలంబనము నిలచిపోయెను. అతనిపుత్రుడు శైవుడయ్యెను. నాటినుండి తర్వాతిరాజులందఱును శైవులై శైవనామములనే స్వీకరించుచు శైవవాఙ్మయమును, శైవదేవాలయములను, శైవసాంప్రదాయములను వృద్ధిచేయుచు వచ్చిరి. కాకతీయరాజులు శైవులైనతర్వాత జైనమతము క్షీణించిపోయెను. మఱియు శై

న జైనమతములకేకాక శైవబ్రాహ్మణ మతములకును ప్రతిస్పర్ధలేర్పడెను. కాకతీయులు శైవుల యనుయాయులై జైనులను పీడించుట కాకతీయసామ్రాజ్యపతనమున కొక హేతువని చెప్పుదురు. శైవులు వర్ణాశ్రమాచార పద్ధతి నంగీకరింపక సర్వవర్ణస్థులనుగూడ లింగవంతులనుగా జేయుచుండుటవలన పూర్వాచారులగు హిందువుల కది సరిపడకుండెను. పిడుపర్తి సోమనాథుని బసవపురాణములోని "ఒకనాడుశివభక్తు లోరుగంటను" అను పద్యమునుండి యాకాలమున శైవపురాణములందు శివభక్తుల కాదరమును, విప్రులకు నిరసనము నుండెననియు, ద్విపదకవిత్వమాదరణీయముగా నుండలేదనియు, విశదమగును.

"అనుమకొండనివాసులైనట్టి బౌద్ధ జనుల రావించి వారి దిక్కైన మసీషి| తోడవాదింపజేసిన..." అను సోమదేవరాజీయమునందలి పద్యమునుండి తిక్కన సోమయాజి అనుమకొండకు వచ్చెననియు, బౌద్ధజైనులతోడ వాదించెననియు దెలియుచున్నది. అప్పుడు బౌద్ధదేవాలయముల గూలద్రోయించి గణపతిదేవరాజు సోమయాజుల పటువాక్యశక్తికి మెచ్చుకొనెను. జైనబౌద్ధులు హింసింపబడిరనుట కింకొక నిదర్శనము "జినసమయార్థుల శిరముల దునిమి, విద్వేషబౌద్ధుల విలుమాడి "యను సిద్ధేశ్వరచరిత్రలోని ద్విపదపాదము. ఓరుగల్లుసామ్రాజ్యమును శైవుల కాటపట్టయ్యెను. బసవేశ్వరుడు, పండితారాధ్యుడు, పాల్కురికి సోమకవి-మున్నగువారు నసామాన్యశక్తియుక్తులు. వీరి సామ్రాజ్యమందు చాల ప్రచారము చేసిరి.

ఈకాలమందలి జనుల మతవిశ్వాసముల గురించి క్రీడాభిరామమునుండి మరికొన్ని విషయములు లభించుచున్నవి. ముఖ్యముగా నప్పుడు పూజలొందుచుండిన దేవతలలో నీక్రిందివారు పేర్కొనదగియున్నారు

(1) ఏకవీరాదేవి-ఈదేవత జైనదేవతయో యెవరో చెప్పశక్యముగాదు. తర్వాత శైవదేవతయైనట్లున్నది. ఏలసన వల్లభరాయుడు "కాకతమ్మకు సైదోడు యేకవీర" అని వర్ణించినాడు. ఈమెగుడి "ని బవల్లవనికురంబ సంధానిత వందనమాలికాలంకృతద్వారంబు"గా వర్ణింపబడినది. ఈదేవిని మాహూరమ్మయనియు పిలచిరి. మాహూరమను గ్రామమందు నిలచినదగుటచేత నీపేరువచ్చెను. ఈమె "యథోహీంకారమధ్యయు" "వ్రీడాశూన్యకటీరమండల" యునట. ఈమె యే రేణుకయట. ఈనగ్నత జైనసాంప్రదాయమునుండి వచ్చియుండును.

(2) మైలారుదేవుడు—ఇతడును ఏకవీరవలెనే జైనదేవుడై తర్వాత శైవుడైనట్లున్నది. "భైరవునితోడుజోడు మైలారదేవు" డని వల్లభరాయుడు వర్ణించినాడు (3) ఇతరదేవతలు—భైరవుడు, చముడేశ్వరీశక్తి, వీరభద్రుడు, బౌద్ధదేవుడు, మసానమ్మ, కుమారస్వామి, పాండవులు, కేశవశ్రీస్వయంభుదేవులు. ఇంతియకాదు, ఆకాలమున వీరపూజలు గ్రామ గ్రామమందు జరుగుచుండెడివి. పల్నాటి వీరుల కొకయాలయముకూడ ఓరుగంటి పట్టణమున నుండెను. మఱియు నావీరుల పటములను పలకపై చిత్రించి యుండిరట. ఈ వీరులను గురించినకథలు ద్విపదగీతములతో బాడుచుండిరి.

కాకతీయులకాలములో హిందువులలో ౧౮ కులముల వారు ప్రాధాన్యము వహించిన వారుగానుండినట్లు తెలియవచ్చెడి. నాగులపాటి, శాసనములో "అయ్యూరి షదు

నన్నిది సమయాల సమస్తప్రజాను రంగ భోగానకై" అని యున్నది అందిక్రింది జాతులు పేర్కొనబడినవి "కోమట్లు" "ఈదఅవారు" "గొల్లవారు" "అక్కలవారు" (అగసాల) "సాలెవారు" "మంగలులు" "కుమ్మరవారు".

సంఘసంస్కారము:—ప్రతిశతాబ్దమందును మన దేశమున జైనమతప్రారంభము నాటినుండియు సంఘసంస్కారము లేదో యొకరీతి జరుగుచునే యుండినవి. కాకతీయుల కాలమందును సంఘమందనేక మార్పులు కలిగినవి. జైనశైవసాంప్రదాయములు కట్టుబాట్లను త్రెంచుచుండినవి. అనులోమ ప్రతిలోమ వివాహములును, సర్వవర్ణసంక్తిభోజనములును జరుగుచుండినట్లు కొన్ని నిదర్శనములు కానవచ్చుచున్నవి. ఇందులూరువారను సుప్రసిద్ధకుటుంబమువారు కాకతీయుల మంత్రులు. అందు రుద్రమదేవిమంత్రియగు అన్నయదేవుడు ఆరాజ్ఞి రెండవ బిడ్డయగు రుయ్యమ్మను వివాహమాడెను. బ్రహ్మనాయుని సైన్యములో యుద్ధసమయములందు పంక్తిభేదములేక అందఱును గలసి భుజించుచుండిరి. ఈవిషయమే కాబోలు రెడ్లకును వెలమలకును భేదము కలిగించినది. అంతకుపూర్వము రెడ్లును వెలమలును నొకతెగవారై యుండియుందురు. పల్నాటి యుద్ధవీరులలో నానాజాతులవారు నుండిరి. మాదిగయైన కన్నమనాయుడు వెలమలతో గలసి భుజించుచుండెను బ్రహ్మనాయుని దండ్రిగా జెప్పుకొనియుండెను. పల్నాటియుద్ధమునకు "చాపకూడు" ఒక కారణమయ్యెను. "ఇచ్చోట భుజియించి లేక కార్యస్థులై సామంతనృపతులు చాపకూడు" అని యొకపద్యమున క్రీడాభిరామకర్త స్థలనిర్దేశము గూడ చేసియుండెను. పూర్వకాలమందు పాలెగార్లు అనువారు రాష్ట్రపుసరిహద్దులందు కోటలు గట్టికొని సైన్యయుతులై శత్రువులు లోపలికి రాకుండునట్లు సామ్రాజ్యమును గాపాడెడివారు. ఈపాలెగార్ల సైన్యమందువిశేషముగా మాలమాదిగలును, బోయలును, నుండెడివారు. నేటికిని మాలమాదిగలగోత్రములలో 'పింజలవారు' 'తప్పెటవారు' 'కొమ్మువారు' 'కటారివారు' ఇత్యాదిపేరులున్నవి. మొన్నమొన్నవరకును బ్రిటీషువారి సామ్రాజ్యముస్థాపితమై, పాలెగార్లుమాయమగువరకు నీమాలమాదిగలేవీరభటులు. అందుచే వారిలో తక్కినహిందువులకన్న నెక్కుడు క్షాత్రగుణ మిప్పటికిని గనబడుచున్నది.

శైవమతమందు చాకలి, మంగలి, మాల, మాదిగమున్నగు జాతులువారందఱును గలరనుటకు పాల్కురికిసోమనాథకృతమగు బసవపురాణమం దనేకనిదర్శనములుకలవు. మన కాలములో సత్రభోజనము సాధారణముగా బ్రాహ్మణులకే పెట్టబడుచున్నది. కాకతీయుల కాలమున కొన్నితావుల సర్వవర్ణములవారికిని భోజనములు పెట్టబడుచుండెనని మల్కాపుర శాసనమువలన దెలియుచున్నది. శైవసాంప్రదాయరీత్యా చండాలురకుగూడ సన్నవస్త్రదానము సత్రములందు జరుగునేర్పాట్లు చేయబడియుండెను. ఆకాలమందు బ్రాహ్మణులకును శూద్రులకునుగల నైతికసంబంధమును గుఱించి యొకయంశము గమనింపదగియున్నది.

"మరియు కొక్కనాడు సంతూరను గ్రామంబున కృష్ణమాచార్యులతమ్ముడనంతాచార్యులు రజకస్త్రీతో గూడెను. ఆరజకుడిద్దరిని బాడిచెను. అంత వారు మరణించిరి. ఆపురి విప్రులదికూడ్రపీముగుతో గూడియున్నది

కనుక మేము మొయ్యమనిరి. అది విని కృష్ణమాచార్యులు తనమదిని విచారించి వాసుదేవమూర్తిని కీర్తించెను. శవంబు దనంతటతాను కాష్ఠంబువరకు జరిగిపోయెను" ఇదిప్రతాపచరిత్రమందున్నది. సుమారురెండు సంవత్సరముల క్రితము ఓరుగల్లుకోటలో నొక భూగృహము బయలుపడినది. అందు ప్రతాపచరిత్రలో రజకసంబంధపుకథ గోడలపై వ్రాయబడియున్నది.

కాకతీ

ఏజాతియైనను తనశిల్పములచేతను వాఙ్మయముచేతను శాస్త్రాభివృద్ధిచేతను గుర్తింపబడును. కాకతీయులకు ఖ్యాపట్టణమైన ఓరుగల్లా కాలమున అద్వితీయమైన నగరముగా సమకాలికులచే వర్ణింపబడినది. గణపతిదేవుడు మొదట ఓరుగంటికోటను కట్ట బ్రారంభించెను. రుద్రమదేవి దానిని బూర్తిచేసెను. లోపలి రాతికోటను "పెద్దకోట" యనియు బయటి మట్టిప్రాకారమును "భూమికోట" యనియు బిలుచుచుండిరి. ఈభూమికోట మట్టితో కట్టబడినదైనను సామాన్యమైనదికాదు. సుల్తాన్ అల్లావుద్దీన్ ఖిల్జీ (౭౧౯)హిజీరికి సరియగు క్రీ. శ. ౧౩౦౯ లో మలిక్ నాయబ్ కాఫర్ అను సేనానిని తెలంగాణాపై (ఓరుగల్లుపై) దాడివెడల నియోగించెను. అతనిసైన్యము మట్టి కోటపైబడి దానిని బడగొట్టచూచిరి. కాని "ఉక్కుబల్లెములతో దానిని బొడిచినను చీటకూడ రాలకుండెను. పాశ్చాత్యవడిసెల్లతో గుండ్లను దానిపై విసిరిన నవి పిల్లలాడు గోలీలవలె వెనుకకు తిరిగి వచ్చుచుండెను. (హా. ఖజానులుఫ్తూహ్—అమీర్ ఖుస్రూ) ఈకోటగోడ పైకొల్యము ౧౨౫౪౯ అంగుళాలు. తురుష్కులతో యుద్ధములందు పయోగించిన సాధనములుకూడ కొన్ని మనకు తెలియవచ్చుచున్నవి. ఓరుగల్లుకోటనుండి నిప్పుతో కరిగినవేడిద్రవమును తురుష్కసేనపై పోయుచుండిరట. తురుష్కులు "మాంజనీకు" లుపయోగించిరి. ఓరుగల్లువారు అరడ్డలుపయోగించిరి. ఈరెండును రాళ్లను రువ్వుటకై యేర్పాటుచేసిన వడిసెలలవంటివి కావచ్చును. ఏలనవ ఖుస్రూ వాటినిగురించి యిట్లు వ్రాసియున్నాడు. "మునల్మానుల రాళ్లు వేగముతో నాకాశమున దెగురుచుండెను. హిందువులగుండ్లు బ్రాహ్మణుల జందెములనుండి వినరబడినవానివలె బలహీనములై యుండెను." (తారీఖ ఫిరోజ్ షాహి—బర్నీ) ఈ మంజనీకులు పాశ్చాత్యదేశమునుండి వచ్చినవి. ఉభయసైన్యములవారునుపయోగించిరి. అగ్నితో యుద్ధముచేయుట ఓరుగల్లు ముట్టడితోనే ప్రారంభమయ్యెను. తర్వాత నేర్పడిన తుపాకులకిది ప్రస్తావమైయుండును.

"అతిష్ బిరారేఖ్తండి" (ఉభయులు అగ్ని సెగరగొట్టుచుండిరి) యని పార్సీచరిత్రకారుడు వ్రాసినాడు. యుద్ధకాలములందు హిందూసైన్యములో స్తోత్రపాఠకులును తమనేర్పును జూపుచుండిరి. వారిని "బర్దులు" అనుచుండిరట. (అతాబా తె హిందూకె గోయంన్ బర్దష్ )

ఆకాలమున ద్వంధ్రులెట్టియుద్ధపరికరములుపయోగించుచుండిరో ప్రతాపరుద్రీయమునుండియు, తద్వ్యాఖ్యానమునుండియు బోధపడగలదు. రత్నాపణవ్యాఖ్యాన మిట్లున్నది. తోమరః=దండవిశేషః, కౌక్షేయకాః=ఖడ్గాః ముసుందయః=దారుమయా యుధవిశేషః, కార్ముకం=ధనుః, గదా := ప్రసిద్ధాః ప్రాసాః, కుంతాః=వరంపరాయాక్షేపణీయా ఆయుధవిశేషాః, పట్టసః=లోహదండో యః తీక్ష్ణధార

# కాకతీయులనాటి సాంఘికచరిత్ర.

శ్రీయుత సురవరము ప్రతాపరెడ్డిగారు బి.ఏ., బి.ఎల్.,

కాకతీయసామ్రాజ్యమును గూర్చిన సాధనములు—శాసనములు, తాళపత్రగ్రంథములు, ప్రబంధములు, శిల్పములు, విదేశయాత్రికుల ప్రశంసలు, నాణెములు— మున్నగునవి అప్పుడప్పుడు మనకు లభించుచున్నవి. ఈవంశపురాజుల రాజ్యకాలమునందు ప్రజలయొక్క రాజకీయ, నైతిక, విద్యావిషయక, సాంఘికజీవనము లెట్టివో మనకు గొంతకొంత విశదమగుచున్నది. కాకతీయవంశరాజులు శాలివాహన శకారంభమునుండి వరంగల్లుప్రాంతమందే రాజ్యము చేసిరని స్థానికచరిత్రయగు ప్రతాపరుద్రచరిత్రము గ్రంథము చెప్పుచున్నది. కాని యది విశ్వసనీయము కాదు. ఏది యెట్లున్నను, ఈవ్యాసమందు ప్రోలరాజు కాలమునుండి ప్రతాపరుద్రుని యనంతరమువరకు, అనగా క్రీ. శ. ౧౧౦౦ నుండి ౧౪౦౦ వరకు కాకతీయసామ్రాజ్యమునందలి జనుల సాంఘికజీవన మెట్లుండెనో చర్చింపబడును.

మతము:— మొదలా కాలమందలి జనుల విశ్వాసము లెట్టివో పరికింతము. కాకతీయుల కాలము నాంధ్రదేశమందు జైనశైవమతములు విశేషముగా ప్రచారమందుండినవి. ఒకకాలమం దాంధ్రభూభాగమంతయు జైనమతమునకు లోబడియుండెను. కాకతిప్రోలరాజు కాలమువరకు కాకతీయులు జైనులై యుండిరి. వారియింటిపేరు కాకతియను జైనదేవతనుండి యేర్పడెను. కాని జైనవాఙ్మయ మందు కాకతియను దేవతపేరు కానరాదు. అయినను కాకతి జైనదేవతయై యుండునని యూహింపవచ్చును. ఆకాలమందలి వాఙ్మయమందును కాకతియను నొక శక్తి యని పేర్కొనబడియున్నది. ప్రతాపరుద్రీయము గ్రంథమునందును, "కాకత్యాః పరశక్తేః కృపయా కూష్మాండవల్లికా కాచిత్। పుత్రమసూత తదేశ [illegible] మనఘం కాకతిసంజ్ఞ [illegible]" అని యనితల్లి కలువచేరు శాసనము నందును గాకతిప్రశంస గలదు.

కాకతీయులు మొదట హిందువులై యున్నప్పుడు క్షత్రియులై యుండిరి. కాని జైనులైనతర్వాత శైవులైనందున నీయుభయమతములందును చాతుర్వర్ణ్యవ్యవస్థ యంగీకారము కానందున వీరిని చతుర్థవర్ణస్థులనుగా శాసనములందును ప్రబంధములందును పేర్కొనిరి. ప్రతాపరుద్రీయకర్త యటు వీరిని క్షత్రియులని చెప్పవాల్లక, నిటు శూద్రులని చెప్పజాలక; గోడమీదిపిల్లివలె "అత్యర్కేందుకులప్రశస్తి యసృజద్ద్వ్యాం కాకతీయాన్వయః" అని రెంటికిని తప్పినవాక్యమును నర్థముగూడ దోప వక్రోక్తిగా వర్ణించెను. ప్రోలరాజుతో జైనమతావలంబనము నిలచిపోయెను. అతనిపుత్రుడు శైవుడయ్యెను. నాటినుండి తర్వాతిరాజులందఱును శైవులై శైవనామములనే స్వీకరించుచు శైవవాఙ్మయమును, శైవదేవాలయములను, శైవసాంప్రదాయములను వృద్ధిచేయుచు వచ్చిరి. కాకతీయరాజులు శైవులైనతర్వాత జైనమతము క్షీణించిపోయెను. మఱియు శై

వ జైనమతములకే కాక శైవబ్రాహ్మణ మతములకును ప్రతిస్పర్ధ లేర్పడెను. కాకతీయులు శైవుల యనుయాయులై జైనులను పీడించుట కాకతీయసామ్రాజ్యపతనమున కొక హేతువని చెప్పుదురు. శైవులు వర్ణాశ్రమాచార పద్ధతి నంగీకరింపక సర్వవర్ణస్థులనుగూడ లింగవంతులనుగా జేయుచుండుటవలన పూర్వాచారులగు హిందువుల కది సరిపడకుండెను. పిదుపర్తి సోమనాథుని బసవపురాణములోని "ఒకనాడుశివభక్తు లోరుగంటను" అను పద్యమునుండి యాకాలమున శైవపురాణమందు శివభక్తుల కాదరమును, విప్రులకు నిరసనము నుండెననియు, ద్విపదకవిత్వమా దరణీయముగా నుండలేదనియు, విశదమగును.

"అనుమకొండనివాసులై పట్టి బౌద్ధ జనుల రావించి వారి దిక్కన మనీషి తోడ వాదింప జేసిన..." అను సోమదేవరాజీయమునందలి పద్యమునుండి తిక్కన సోమయాజి అనుమకొండకు వచ్చెననియు, బౌద్ధజైనులతోడ వాదించెననియు దెలియుచున్నది. అప్పుడు బౌద్ధదేవాలయముల గూలద్రోయించి గణపతిదేవరాజు సోమయాజుల పటువాక్యశక్తికి మెచ్చికొనెను. జైనబౌద్ధులు హింసింపబడిరనుట కింకొక నిదర్శనము "జినసమయార్థుల శిరముల దునిమి, విద్వేషబౌద్ధుల విలుమాడి"యను సిద్ధేశ్వరచరిత్రలోని ద్విపదపాదము. ఓరుగల్లుసామ్రాజ్యమును శైవుల కాటపట్టయ్యెను. బసవేశ్వరుడు, పండితారాధ్యుడు, పాల్కురికి సోమకవి-ఈముగ్గురును నసామాన్యశక్తియుక్తులు. వీరి సామ్రాజ్యమందు చాల ప్రచారము చేసిరి.

ఈకాలమందలి జనుల మతవిశ్వాసముల గురించి క్రీడాభిరామమునుండి మరికొన్ని విషయములు లభించుచున్నవి. ముఖ్యముగా నపుడు పూజలొందుచుండిన దేవతలలో నీక్రిందివారు బేర్కొనబడగియున్నారు

(1) ఏకవీరాదేవి-ఈదేవత జైనదేవతయో యెవరో చెప్పశక్యముగాదు. తర్వాత శైవదేవతయైనట్లున్నది. వల్లభరాయడు "కాకతమ్మకు సైదోడు యేకవీర" అని వర్ణించినాడు. ఈమెగుడి "నిబవల్లవనికురంబ సంధానిత వందనమాలికాలంకృతద్వారంబు"గా వర్ణింపబడినది. ఈదేవిని మాహూరమ్మయనియు పిలచిరి. మాహూరమను గ్రామమందు నిలచినదగుటచేత నీపేరువచ్చెను. ఈమె "యధోహ్రీంకారమధ్యయు" "వీడాశూన్యకటీరమండల"యునట. ఈమె యే రేణుకయట. ఈనగ్నత జైనసాంప్రదాయమునుండి వచ్చియుండును.

(2) మైలారుదేవుడు—ఇతడును ఏకవీరవలెనే జైనదేవుడై తర్వాత శైవుడైనట్లున్నది. "భైరవునితోడుజోడు మైలారదేవు" డని వల్లభరాయుడు వర్ణించినాడు (3) ఇతరదేవతలు—భైరవుడు, చముడేశ్వరీశక్తి, వీరభద్రుడు, బౌద్ధదేవుడు, మసానమ్మ, కుమారస్వామి, పాండవులు, కేశవ శ్రీస్వయంభుదేవులు. ఇంతియకాదు, ఆకాలమున వీరపూజలు గ్రామ గ్రామమందు జరుగుచుండెడివి. పల్నాటి వీరుల కొకయాలయముకూడ ఓరుగంటి పట్టణమున నుండెను. మఱియు నావీరుల పటములను పలకపై చిత్రించి యుండిరట. ఈ వీరులను గురించినకథలు ద్విపదగీతములతో బాడుచుండిరి.

కాకతీయులకాలములో హిందువులలో ౧౮ కులముల వారు ప్రాధాన్యము వహించిన వారుగానుండినట్లు తెలియవచ్చెడి. నాగులపాటి శాసనములో "అయూరి పదు

నెన్మిది సమయాల సమస్తప్రజాను రంగ భోగానకై" అని యున్నది. అందిక్రింది జాతులు పేర్కొనబడినవి "కోమట్లు" "ఈడ ఆవారు" "గొల్లవారు" "అక్కలవారు" (అగసాల) "సాలెవారు" "మంగలులు" "కుమ్మరవారు".

సంఘసంస్కారము:— ప్రతిశతాబ్దమందును మన దేశమున జైనమతప్రారంభము నాటినుండియు సంఘసంస్కారము లేదో యొకరీతి జరుగుచునే యుండినవి. కాకతీయుల కాలమందును సంఘ మందనేక మార్పులు కలిగినవి. జైనశైవసాంప్ర దాయములు కట్టుబాట్లను ద్రెంచుచుండినవి. అనులోమ ప్రతిలోమ వివాహములును, సర్వ వర్ణపంక్తిభోజనములును జరుగుచుండినట్లు కొ న్ని నిదర్శనములు కానవచ్చుచున్నవి. ఇందు లూరువారను సుప్రసిద్ధకుటుంబమువారు కా కతీయుల మంత్రులు. అందు రుద్రమదేవిమం త్రియగు అన్నయదేవుడు ఆరాజ్ఞి రెండవ బిడ్డయగు రుయ్యమ్మను వివాహమాడెను. బ్రహ్మనాయుని సైన్యములో యుద్ధసమ యములందు పంక్తిభేదములేక అందఱును గలసి భుజించుచుండిరి. ఈవిషయమే కాబోలు రెడ్లకును వెలమలకును భేదముక లిగించినది. అంతకుపూర్వము రెడ్లునువెలమలు నొక తెగవారై యుండియుందురు. పల్నాటి యుద్ధవీరులలో నానాజాతులవారు నుండిరి. మాదిగయైన కన్నమనాయుడు వెలమలతో గలసి భుజించుచుండెను బ్రహ్మనాయుని దం డ్రిగాజెప్పుకొనియుండెను. పల్నాటియుద్ధము నకు "చాపకూడు" ఒక కారణమయ్యెను. "ఇచ్చోట భుజియించి రేకకార్యస్థులై సామంత నృపతులు చాపకూడు" అని యొకపద్య మున క్రీడాభిరామకర్త స్థలనిర్దేశమును గూడ చేసియుండెను. పూర్వకాలమందు పా లెగార్లు అనువారు రాష్ట్రపుసరిహద్దులందు కోటలు గట్టికొని సైన్యయుక్తులై శత్రువులు లోపలికి రాకుండునట్లు సామ్రాజ్యమును గాపాడెడివారు. ఈపాలెగార్లసైన్యమందువి శేషముగా మాలమాదిగలును, బోయలును, నుండెడివారు. నేటికిని మాలమాదిగలగోత్ర ములలో 'పింజలవారు' 'తప్పెటవారు' 'కొ మ్మువారు' 'కటారివారు' ఇత్యాదిపేరులు న్నవి. మొన్నమొన్నవరకును బ్రిటీషువారి సామ్రాజ్యముస్థాపితమై, పాలెగార్లుమాయము గువరకు నీమాలమాదిగ లేవీరభటులు. అందు చే వారిలో తక్కినహిందువులకన్న నెక్కుడు క్షాత్రగుణ మిప్పటికిని గవబడుచున్నది.

శైవమతమందు చాకలి, మంగలి, మాల, మాదిగమున్నగు జాతులువారందఱును గల రనుటకు పాల్కురికిసోమనాథకృతమగు బసవ పురాణమం దనేకనిదర్శనములుకలవు. మన కాలములో సత్రభోజనము సాధారణముగా బ్రాహ్మణులకే పెట్టబడుచున్నది. కాకతీయుల కాలమున కొన్నితావుల సర్వవర్ణములవారికిని భోజనములు పెట్టబడుచుండెనని మల్కాపుర శాసనమువలన దెలియుచున్నది. శైవసాంప్ర దాయరీత్యా చండాలురకుగూడ వన్నవస్త్ర దానము సత్రములందు జరుగునేర్పాట్లు చేయ బడియుండెను. ఆకాలమందు బ్రాహ్మణుల కును శూద్రులకునుగల నైతికసంబంధమును గుఱించి యొకయంశము గమనింపదగియున్నది.

"మఱియు కొక్కనాడు సంతూరను గ్రామంబున కృష్ణమాచార్యులతమ్ము డనంతా చార్యులు రజకస్త్రీతోగూడెను. ఆరజకుడి ద్దరిని బాడిచెను. అంత వారు మరణించిరి. ఆపు రి విప్ర లదిశూద్రపీనుగుతో గూడియున్నది

కనుక మేము మోయ్యమనిరి. అది విని కృష్ణమాచార్యులు తనమదిని విచారించి వాసుదేవమూర్తిని కీర్తించెను. శవంబు దనంతటతాను కాష్టంబువరకు జరిగిపోయెను" ఇదిప్రతాపచరిత్రమందున్నది. సుమారు రెండు సంవత్సరముల క్రితము ఓరుగల్లుకోటలో నొక భూగృహము బయలుపడినది. అందు ప్రతాపచరిత్రలో రజకసంబంధపుకథ గోడలపై వ్రాయబడియున్నది.

### నాగరికత

ఏజాతియైనను తనశిల్పములచేతను వాఙ్మయముచేతను శాస్త్రాభివృద్ధిచేతను గుర్తింపబడును. కాకతీయులముఖ్యపట్టణమైన ఓరుగల్లా కాలమం దద్వితీయమైన నగరముగా సమకాలికులచే వర్ణింపబడినది. గణపతిదేవుడు మొదట ఓరుగంటికోటను కట్ట బ్రారంభించెను. రుద్రమదేవి దానిని బూర్తిచేసెను. లోపలి రాతికోటను "పెద్దకోట" యనియు బయటి మట్టిప్రాకారమును "భూమికోట" యనియు బిలుచుచుండిరి. ఈభూమికోట మట్టితో కట్టబడినదైనను సామాన్యమైనదికాదు. సుల్తాన్ అల్లావుద్దీన్ ఖిల్జీ (౭౦౯)హిజ్రీకి సరియగు క్రీ. శ. ౧౩౦౯ లో మలిక్ నాయబ్ కాఫర్ అను సేనానిని తెలంగానాపై (ఓరుగల్లుపై) దాడివెడల నియోగించెను. అతనిసైన్యము మట్టికోటపైబడి దానిని బడగొట్టచూచిరి. కాని "ఉక్కుబల్లెములతో దానిని బొడిచినను బీటకూడ రాలకుండెను. పాశ్చాత్యవడిసెల్లతో గుండ్లను దానిపై విసిరిన నవి పిల్లలాడు గోలీలవలె వెనుకకు తిరిగి వచ్చుచుండెను. (చూ. ఖజాయనుల్ఫుతూహ్—అమీర్ ఖుస్రు) ఈకోటగోడ వైశాల్యము ౧౨౫౪౬ అడుగులు. తురుష్కులతో యుద్ధములం దుపయోగించిన సాధకములుకూడ కొన్ని మనకు తెలియవచ్చుచున్నవి. ఓరుగల్లుకోటనుండి నిప్పుతో కరిగినవేడిద్రవమును తురుష్కసేనపై పోయుచుండిరట. తురుష్కులు "మాంజనీకు" లుపయోగించిరి. ఓరుగల్లువారు అరద్దలుపయోగించిరి ఈరెండును రాళ్లను రువ్వుటకై యేర్పాటుచేసిన వడిసెలలవంటివి కావచ్చును. ఏలనన ఖుస్రో వాటినిగురించి యిట్లు వ్రాసియున్నాడు. "ముసల్మానుల రాళ్లు వేగముతో నాకాశమం దెగురుచుండెను. హిందువులగుండ్లు బ్రాహ్మణుల జందెములనుండి విసరబడినవానివలె బలహీనములై యుండెను." (తారీఖ ఫిరోజ్‌షాహి—బర్నీ) ఈ మంజనీకులు పాశ్చాత్యదేశమునుండి వచ్చినవి. ఉభయసైన్యములవారునుపయోగించిరి. అగ్నితో యుద్ధముచేయుట ఓరుగల్లు ముట్టడితోనే ప్రారంభమయ్యెను. తరాత నేర్పడిన తుపాకులకిది ప్రస్తావమైయుండును.

"ఆతిష్‌మీరేఖ్తండి" (ఉభయులు అగ్ని నెగరగొట్టుచుండిరి) యని ఫార్సీచరిత్రకారుడు వ్రాసినాడు. యుద్ధకాలములందు హిందూసైన్యములో స్తోత్రపాఠకులును తమనేర్పును జూపుచుండిరి. వారిని "బర్దుః" అనుచుండిరట. (ఖతాబా తె హిందూకె గోయంన్ బర్దష్)

ఆకాలమం దాంధ్రులెట్టియుద్ధపరికరము లుపయోగించుచుండిరో ప్రతాపరుద్రీయము నుండియు, తద్వ్యాఖ్యానమునుండియు బోధపడగలదు. రత్నాపణవ్యాఖ్యాన మిట్లున్నది. తోమరః=దండవిశేషః, కాక్షేయకాః=ఖడ్గాః ముసుందయః=దారుమయా యుధవిశేషః, కార్ముకం=ధనుః, గదాః= ప్రసిద్ధాః ప్రాసాః, కుంతాః=పరంపరాయాక్షేపణీయా ఆయుధవిశేషాః. పట్టసః=లోహదండో య స్తీక్ష్ణధార



వరంగల్లుకోట — ఖుష్మహాల్ లోభాగము.

[By courtesy of H. E H. The Nizam's Archaeological Department.]



వరంగల్లుకోట—సూర్యద్వారము

[By courtesy of H. E. H The Nizam's Archeological Department.]

త్రురోపమః॥ (నాటకప్రకరణము 11 శ్లోకము) ఈయాయుధములన్నియు నుపయోగింపబడు చుండెనో లేక కవికపోలకల్పితములో చెప్ప జాలము. కొన్నియైనను వాడుకలోనుండి యుండును.

ఇట్టి యోరుగల్లుకోట మునల్మానులుధ్వం సముచేయకపూర్వము బహువిస్తారము కల దై సర్వనాగరికచిహ్నములతో కూడినదై యుండెను. క్రీ. శ.౧౩౨౧లోతురుష్కసేనాని అలఃఖ్ఖాన్ యొక యున్నతస్థానముపైనెక్కి ఓరుగల్లు కోటలోని విశేషములు చూడగా నాతని కిట్లు కనబడెను. "ఏదిక్కు చూచినను రెండుమైళ్లపొడవున నీటినాళములు (fountains) తోటలు నుండెను.వానిలో మామిడి, అరటి, పనసపండ్లుండెను. పుష్పములన్నియు హిందూపుష్పములే. చంపక, మొగలి, మల్లె పూలుండెను. (నూహె సిపెహార్_అమీర్ ఖుస్రూ) ఓరుగల్లునగరమందు "రాజ మార్గంబు వారణఘటా ఘోటకశకటికాభ టకోటిసంకులంబు" గానుండెను. మరియు నగర మనేకపేటలుగా విభజింపబడియుండెను. ఒకచోట అక్కలవాడ (పూటకూళ్ల యిండ్లు) ఉండెను. ఇంకొకచోట వేశ్యవాటిక యుండె ను. వెలిపాళెము అని యొకపేట యుండెను. అం దు శూద్రులు నివసించుచుండిరి. నగరిబయటి ప్రదేశమందు మైలసంత జరుగుచుండెను. ఇది వెలిపాళెముసమీపమున జరుగుచుండె ను. దాని సమీపమున మేదరవాడయుండెను. నగరములో మోహరివాడ యని యొకపేట యుండెను. ఈతీరుగా నానాజాతుల కుపయో గములగు స్థలములు నిర్ణయింపబడి యుం డెను. మహారాజుగారి మొగసాలపై గడియార ముండెను. ఆకాలమున ౬౦ గడియలలెక్క ప్రకారము పగలు ౩౦ రాత్రి ౩౦ గంటలు కొట్టుచుండిరి. దూరదూరప్రదేశవార్తలను తెచ్చువారుండిరి. వారిని జాంఘికులని (జంఘయా చరతి ఇతి జాంఘికా వార్తాహారాః) అని ప్రతాపరుద్రీయకర్త వర్ణించినాడు.

పరిపాలనాపద్ధతి:— ఓరుగల్లుప్రభువులు తమ ప్రజలకెన్ని సౌకర్యములవసరమో వా నిని జేసి యుండిరి. ఈకాలములో ప్రభుత్వము వారు చికిత్సాలయములు మున్నగునవెట్లు స్థాపించిరో ఆకాలమందును కాకతీయమహా రాజులు ఆరోగ్యశాలలను, ప్రసూతిశాలలను, సంస్కృతభాషను వేదవేదాంగముల బోధిం చుటకై కళాశాలలను, స్థాపించియుండిరి. శా. శ ౧౧౯౩ లోరుద్రమదేవిచే దానము చేయబడిన వెలగపూడిగ్రామములో గావిం చిన ఏర్పాటులు మల్కాపుర శాసనము [J. A. H. R. S. సం. 4. పే. 147_162] లోకలవు. ఈశాసనము చాల ముఖ్యమైన ది. ఈగ్రామమందొక మఠము, సత్రము, స్థా పింపబడెను. సత్రభోజనము సిద్ధపఱచుటకై ౬ బ్రాహ్మణపాచకులుండిరి. గ్రామములో కాయ స్థవైద్యు డేర్పాటుచేయబడెను. గ్రామరక్షణ కై ౧౦ వీరభద్రులుండిరి. ౨౦భటులు (తలారు లు)ండిరి. వీరిని వీరముష్టివారని పిలుచుచుండి రి. వీరభద్రులు నేరములు చేసిన వారికి నా నావిధశిక్షలను ఆజ్ఞాప్రకారమువిధించుచుండిరి.

కాకతీయ చక్రవర్తులు తమప్రజల యార్థి కాభివృద్ధికి చాలతోడ్పడిరి. నాటికిని నేటికిని మ న దేశమందు వ్యవసాయమే ప్రజల ప్రధానజీ వనోపాధి కాకతీయులును, వారి సామంతులు ను, అధికారులును, రాజ్యమం దనేకస్థలముల లో చెరువులు కుంటలుత్రవ్వించి వ్యవసాయాభి

వృద్ధి చేయించిరి. గణపతి సేనానియగు రుద్రుడు పాఖాల చెరువు నుద్ధవింపచెను. జగిత్యాల సమీపపు చెరువు, కాటసముద్రము, చౌడసముద్రము అను చెరువులుకూడ నీకాలములో కట్టింపబడినవి. కాటసముద్రము కాటచమూపతి చేతను, చౌడసముద్రము చౌడచమూపతిచేతను నిర్మింపబడెను. మరియు నాగులపాటి(నల్లగొండజిల్లా) శాసనములో "చింతల చెరువును" "నామసముద్రమును" "విశ్వనాథ సముద్రమును" పేర్కొనబడినవి. ఈ చెరువుల క్రింద "చెరుకు తోటలు" "అరుంతోటలు" ఉన్నట్లు అదే శాసనమున కలదు. సోమపర శాసనములో "ఒరపాలాంగాం చెఱ్వు" పేరుకలదు. పిల్లలమఱ్ఱి శాసనములో నామిరెడ్డి సబ్బిసముద్రమనునొక పెద్దచెరువును, గౌరసముద్రము, కోమటి చెరువు అనువానిని కట్టించి వృత్తులొసంగినట్లున్నది. ఎఱ్ఱక్క సానమ్మ తనపేర యెఱకసముద్రమును కట్టించినట్లు పిల్లలమఱ్ఱిలోని ఎఱ్ఱక్కసాని శాసనములో నున్నది. అంబదేవుడు అను కాయస్థుడు కాకతీయసామ్రాజ్యములో భూమిని కొలతవేయించి పన్నులనేర్పాటుచేయించెను. ఆకాలమందు భూమిని గొలుచుటకు "పేరంబొకమానదండము" అనునదియు ప్రసిద్ధమైయుండెను. (చూ. మల్కాపుర శాసనము)

కాకతీయుల కాలములో బంగారు వెండి నాణెములుండెను. అవియెట్టివో యింతవరకు నూహాప్రపంచమందే యున్నను, సుమారు 80, 90, సంవత్సరములకు పూర్వము కొన్ని "రుద్రదేవుని" ముద్రలుగల బంగారు నాణెములు లభించినవి. ఆకాలపుకావ్యాదులలో నాణెముల చర్చ యచ్చటచ్చట కనబడుచున్నది. కాని ఆ నాణెముల విలువయెంతనో, యవి యెట్టి పోలికను సరిగా తెలిసినది కాదు. స్థానిక చరిత్రయగు ఏకామ్రనాథుని ప్రతాపరుద్రచరిత్రములో "సువర్ణనిష్కము"లమాట పలుతావులకలదు. ప్రోలరాజు కాలమందు తూకముల పద్ధతి యిట్లుండెను.

౧౨౦ గురిజలు = ౧ తులము

౧౨౦ తులములు = ౧ వీసె

౧౨౦ వీసెలు = ౧ బారువ

మరియు పై గ్రంథమందే వరహాలచర్చయు కలదు. క్రీడాభిరామమందు మంచనశర్మ టిట్టిభసెట్టి యొక్క వ్యవహారములందు "శాటీహాటక నిష్కములను" కర్ణాటవేశ్యనేకరించినది ఒక రూకకు నానావిధములగు భోజనములు పూటకూటింట దొరకుచుండెను. జారవ్యవహారములకు రెండు సాన్నాటంకములిచ్చిరి. వరహాలను గురించిన సూచన నాగులపాటిశాసనము (నల్లగొండజిల్లా) లో కలదు.

భూములను కొలుచు పెట్టుటలో రూకలతో వ్యవహారములు జరుగుచుండెననుటకు క్రీడాభిరామములోని "ఆటలెట్టితి జొన్నగడ్డాగ్రహారవృత్తి యేనూరురూకల వృత్తమునకు" అను వాక్యమే ప్రమాణము.

మరియు చిన్నము అను నాణెముకూడనుండెను. ఖాజాపేటబుర్జుకోటలోని శాసనములో సుంకములవిధించుచో చిన్నము రెండుమూడుమారులు పేర్కొనబడియున్నది.

ప్రజల వినోదములు:— ఓరుగల్లుపట్టనమున నాగరికునికి గావలసిన సామగ్రియంతయునుండెను. మేదరవాండ్లుకలరు. కుట్రపువారుకలరు. వేశ్యలుతమరవికలను కుట్టుపని వారిచేతనే కొలతలిచ్చి కుట్టించుచుండిరి. జూదములాడు వినోదస్థానములుండెను. గాండ్లవారుకలరు తందానకథలు, సోములు,నుద్దులు

చెప్పెడివారుకలరు. చిత్రరువులు వ్రాయువారుకలరు. పాములాటలు, కోడిపందెములు పొట్టేళ్లయుద్ధములు, స్త్రీలబంతులాటలునుండినవి. గ్రామములందలిజనుల జీవితపద్ధతి మనకంతగా తెలియకున్నను క్రీడాభిరామమందలి యొక పద్యము కొంత తెలుపుచున్నది. సాధారణముగా ప్రతిగ్రామమందు దశవిధ శిల్పులుండిరి ధనికులైనవారు అందలముల (పల్లకీల)లో వెడలుచుండిరి తిక్కనసోమయాజి గణపతిసభకు పల్లకీలో వెడలెను.

ప్రతాపరుద్రుని యుద్యోగులు "దేవస్థానంబుల కధికారులు పచ్చలపాలకీలెక్కి చనుదెంచిరి". మరియు ధనికులగువారు "గాలాగుర్వనులేపనములు", "నూలుదివ్యత్రిపిటావకుంఠనములు" "దట్టపునున్మృగనాభియు జారును" "కస్తూరి" మున్నగు వస్తువుల నుపయోగించుచుండిరి. బ్రాహ్మణాదిజాతులవారు "క్రొత్తమలక వాళ్లకిఱ్ఱుచెప్పులు" దొడగుచుండిరి. స్త్రీలు తాటంకము, "ముత్యాలకమ్మలు" "కంచీనూపురకంకణములు" "త్రిసరములు" "వెలదిమొలవంకకడియములు" మున్నగునవి ధరించుచుండిరి.

వేశ్యలు:—ప్రాముఖ్యతను బట్టి యిచ్చట వారినిగురించి చెప్పవలసియున్నది. ఓరుగల్లులోని వేశ్యలవాడ సామాన్యస్థలముకాదు "అవి విద్వేషిభువనజిగీషారంభ విజృంభమాణ రఘుమధ్వజభుజవరాక్రమసముత్సాహ నాటకప్రస్తావనాప్రథమనాందీ శ్లోకంబులగు వేశ్యవాటి కానికటంబులు".

కాకతీయులకాలములో నాంధ్రులే దైశికాధికరణమందు మంచి ప్రవేశముకలవారుగా గన్పట్టుచున్నారు. ఆకాలమువారువేశ్యాసంబంధమును బ్రకటించుకొనుట లేక పొగడించుకొనుట మంచిపురుషలక్షణమని భావించినట్లున్నది. ప్రతాపరుద్రమహారాజునొక్క యుంపుడుగత్తెమాచల్దేవి. ఆమెవైష్ణవము కవిహృదయైకవేద్యము. "చందనంబున గలయంపిచల్లినారు ముగ్గులిడినారు కాశ్మీరమున ముదమున వ్రాసినారిందు రయమున రంగవల్లి కంబముల దోరణంబులగట్టినారు." ఆమెపై "గలప్రసిద్ధి ఢిల్లీసురత్రాణికీని లేదు" మఱియునగరమండలియొక వేశ్య తనబిడ్డను గురించియిట్లనుచున్నది. "నీకుంజేసిన శాస్తియెట్టిదియొ తుండీరద్విజశ్రేష్ఠమా రాకాచంద్ర నిభాస్య కాకతి మహారాజేంద్రు బుత్తెంచినం గైకోదట్టులునేమిసేయుదును.

రాజులేయిట్టి శృంగార పురుషులు గానున్నప్పుడిక మంత్రి సామంతులు వారికి దీసిపోవుదురా? నాగన్నమంత్రి "ప్రతాపరుద్ర దేశసామ్రాజ్యవర్ధన స్థిరవిస్తీకరణ కుశలుండు" "అంగనాహృదయ సరోజషట్పదము" అని తనకవిచే పొగడించినాడు. హిందువులలో దేవాలయములలోని దేవతల వినోదార్థమని వేశ్యల నేర్పాటుచేసి వారికి మాన్యములిచ్చు నాచారము బహు ప్రాచీనమునుండి వచ్చుచున్నది. నేటికిని పూర్వపు రాజులిచ్చిన మాన్యముల ననుభవించు వేశ్యలకుటుంబములున్నవి. రుద్రమదేవియిచ్చిన మల్కాపుర దానశాసనములో సహితము ౧౦ మంది వేశ్యలు దేవాలయమువద్ద నాడుటకు, ౧౮ మంది పాడుటకు నేర్పాటు చేయబడియుండిరి. బహుదూరదేశమునుండి (తుండీరసీమనుండి) యొకండు ఓరుగంటిలో వేశ్యబాందు నేర్పాటు చేసికొనుటయు వేశ్యమాత కాంట్రాక్టునకు విరుద్ధముగా నడచుటయు నందుపై తలవరులకు వా

రి నప్పంగించుటయు, జారధర్మానసనమునతీర్పు చేయుటయు మున్నగు విషయములు క్రీడాభి రామమున వర్ణింప బడినవి.

ఓరుగల్లు నగరమున "అగణ్య వస్తువాహన శోభితంబైన వేశ్యాగృహంబులు ౧౨౦౦౦ కుండినవట. ఇది అతిశయోక్తియే. అయిన నీ సంఖ్య వీరి ప్రాముఖ్యతను దెలుపును

చేతిపనుల వ్యాపారము:—మనదేశము పూర్వము పరిశ్రమలకును, వ్యాపారమునకు ను చాలప్రసిద్ధి వహించి యుండినది. కాకతీయ చక్రవర్తులును పరిశ్రమల పోషించునెడ మి కల ఖ్యాతివహించిన రు. మట్టెవాడ యను ది ఓరుగంటి సమీపగ్రామమునకు చేరువ. ందు కాకతీయులకాలములో మట్టెలు అ య్మచుండిరనియు నందుచే దానిని మట్టెలు గాడయని వాడుచుండిరనియు రానురానా దము మట్టెవాడ యయ్యెననియు జనులు చెప్పుదురు

ఆకాలములో నాంధ్రదేశమందు నానా ధములగు వస్తువులు సిద్ధమగుచుండినవి. ఓ గల్లునగరమందు మంచి యున్నికంబళము ను జంఖానములును నేయబడుచుండెను. విషయమునే క్రీడాభిరామమందలి "హా! ! నృపాలసింహాసనాధిష్ఠాన రత్నకంబళ భిరామరోమ" అనుపద్యము తెల్పుచున్న

ఈకంబళములనేయువృత్తిని ఓరుగల్లును ముంచి యటనే నిలచిపోయిన ముసల్మాను స్వీకరించిరి. వారిసంతతి నేటివరకును దా చేతనే జీవించుచున్నది.

క్రీ. శ. ౧౨ శతాబ్దాంతమందు హిందూ నమందు సంచారముచేసిన మార్కోపోలో ట్లు వ్రాసియున్నాడు. "ఈ(కాకతీయుల) రాజ్యము లో శ్రేష్ఠమై సన్నమైనట్టి వస్త్రము లు నేయబడుచున్నవి. వీనిక్రయము చాల ప్రియము. నిజముగా నాబట్టలు సాలీపురుగు జాలెవలె నుండును. ఆవస్త్రముల ధరింపనొ ల్లని రాజుగానిరాణిగాని ప్రపంచమందుండరు. "మచిలీపట్టణము, చుట్టుపట్లప్రాంతములును మ స్లిన్ బట్టలకును, రంగులచీటీ బట్టలకును బ హుకాలమునుండి ప్రసిద్ధివహించియుండెను. ఓరుగల్లుజిల్లాలోనుండు నిర్మలసమీపమందు కూనసముద్రమను గ్రామముకలదు. అచ్చట బహుశతాబ్దములనుండి ప్రసిద్ధివహించిన డెమ స్కస్ ఉక్కు కత్తులకు కావలసిన ముడియిను ము సిద్ధమగుచుండెను.

కాకతీయుల కాలములో నాంధ్రదేశవ్యా పారము హిందూస్థానమందేకాక విదేశము లందును విశేషముగా వ్యాపించియుండెను. ఓరుగల్లు దక్షిణాపథమం దద్వితీయనగరరాజ మగుటచేతను, మహారాజుల నివాసస్థానమగు టచేతను, నగరమందు గొప్పవ్యాపారము జ రుగుచుండెను. నగరముబయట గొప్పసంత జరుగుచుండెను. అది ప్రతివారము (దేశాచార రీత్యా) జరుగుచుండెనేమో చెప్పజాలము. ఆసంతను మైలసంతయనుచుండిరి. ఏసలమందా సంతజరుగుచుండెనో యాస్థలములో నొకశా సనము చెక్కించి నిల్పియుంచిరి. ఆశాసనమి ప్పటికి నదేస్థలమందున్నది. ఆశాసనము చాల ముఖ్యమైనది.

ఆస్థలము నిప్పుడు "ఖాన్‌సాహెబుతోట" యందురు. ఆశాసనమందీవిషయములుకలవు. "దేశివరదేశిబేహారులు" విశేషముగా సల్కా లువ్యాపారముచేయుచుండిరి. "ఆకులు కూర గాయలు" "నారికేళములు మాదీఫలములు "మామిడిపండ్లు" "చింతపండుమొదలు గాగల

ఫలములు, "నువ్వులు, గోధుమలు, పెసలు, వడ్లు,జొన్నలు" మొదలుగాగల బుసిబండాలు, నూనె, నెయ్యి, ఉప్పు, బెల్లము, ఆవాలు మిరియాలు, తగరము సీసము రాగి, చందనము, కర్పూరము, జవాది కస్తూరి, మంజిష్టి,దంతము,పట్టు,పసపు,ఉల్లి, అల్లము" మున్నగు వస్తువులపై సుంకము ఎంతెంతతీసికొనవలెనో వివరముగా వ్రాయబడియున్నది. ఈ శాసనములో తులములు, మాడలు, పణక, ఆయము, చిన్నము వీసము, పలము మొదలగు వ్యవహారపదములు గమనింపదగినవి. ఈమైలసంతలో "నుసిరభేత్తను" వస్తువు యమ్మబడుచుండెను.ఇందు "పెద్దయేనుగుదంతంబు పెట్టె" గమనింపదగినది. అల్పక్రయముగలమందును పెద్దదంతపు పెట్టెలో బెట్టికొని యమ్ముటనుజూడ నాకాలమందు దంతపువస్తులుచాల చౌకగా దొరకుచుండెనేమో. "ఓరుగంటి పురంబులో నోరగ్రింత పెద్దమెలుంగుననమ్మె సంపెంగనూనె" అనియు వర్ణింపబడినది.

మోటుపల్లియు మచిలీపట్టణమును నాకాలములో సుప్రసిద్ధమగు నోడరేవులు. అచ్చటికి పర్షియా, అరేబియా, చీనాదేశపుసరకులు వచ్చుచుండెను. ఓరుగల్లుమైలసంత శాసనమునకు తోడుగా మోటుపల్లిశాసనము చాలప్రాముఖ్యమైనది ఆశాసనమందు ఓడరేవులద్వారా విదేశములనుండి వచ్చు సరకులపై యెంతెంతపన్నుతీసికొనవలెనో యందఱకును దెలియనటుల వ్రాయించబడినది. ఈశాసనమువలన నాంధ్రదేశమునకువిదేశములకును కర్పూరచందనాది సుగంధ ద్రవ్యములలోను, దంతము, ముత్తెములుమున్నగు వస్తువులలోను, పట్టు మున్నగు వస్త్రములలోను వ్యాపారము విశేషముగా జరుగుచుండెనని విశదమగును. ఈశాసనము గణపతికాలములో స్థాపింపబడినది.

శిల్పములు. ఈయంశము ముఖ్యమైనది. కాకతీయులకాలమందు శిల్పము నానా ముఖములనభివృద్ధినొందెను. వాఙ్మయమందు, దేవాలయాది నిర్మాణములందు, చిత్రలేఖన మందు కాకతీయులు చాల యభివృద్ధి కలిగించిరి.

కాకతీయులకాలములో సంస్కృతాంధ్ర వాఙ్మయము వృద్ధినొందెను. ప్రతాపరుద్రుడు స్వయముగా సంస్కృతపండితుడు. అతడు రచించిన గ్రంథములు మాత్రము లభించినవి కావు. అతని యాస్థానమం దనేక పండితులుండిరి. అందు విద్యానాథుడు ప్రతాపరుద్రీయమును రచించెను. అదినేటికిని పండితజనాదరణీయమైయున్నది. శైవవాఙ్మయము చాల యభివృద్ధినొందెను. ముఖ్యముగాపాల్కురికిసోమనాథుడు పేర్కొనదగినవాడు. అతడుబహుగ్రంథకర్త. వేదవేదాంగపారగుడు. తిక్కన సోమయాజి యనుగు శిష్యుడగు మారన మార్కండేయపురాణమును ప్రతాపరుద్రుని సేనానియగు నాగయమంత్రి కంకితమిచ్చెను బద్దెనసీతిశాస్త్రముక్తావళినివ్రాసెను. సుమతీ శతకమతనిదేయందురు. ఇతడు కాకతీయులసామంతరాజు.

చిత్రలేఖన మా కాలమందు సర్వసామాన్యవిద్యగా నుండినట్లున్నది. ఓరుగల్లున "చిత్తరువువ్రాసే ఇండ్లు ౧౫౦౦" అని ఏకామ్రనాథుడు నుడివియున్నాడు. చిత్రలేఖనమును గురించి క్రీడాభిరామమందు మంచిపద్యములుకలవు. ప్రతాపరుద్రుని యింపుడుగత్తె చిత్రశాలను సిద్ధముచేయించి దానిప్రవేశమహోత్సవము అతివైభవముతో జరిపెనట! ఇకప్రతాపరుద్రుని చిత్రశాలలెట్లుండెనో యేమో! కేవలము వేశ్యలకేయాచిత్తరు

వులు ప్రాముఖ్యముగానుండెనని తలపజనదు. దేవాలయములం దాకాలము చిత్తరువులవ్రాయుచుండిరి.

మహమ్మదీయుల యాక్రమణానంతరము జనులకీకళపై యభిమానముపూర్తిగానశించిన టులభావింపనగును.

కాకతీయులువాస్తు శిల్పముపై జాలయభిమానము కలవారు. మొదట జైనమతానుయాయులగు కతన జైనదేవాలయములు, పార్శ్వనాథాది దేవతలవిగ్రహములు విరివిగా నిర్మించిరి. తర్వాత శైవులగుటచేసి శైవాలయములు విశేషముగా నిర్మించిరి. రాజులనుజూచి రాజాశ్రితులుకూడ మంచిమంచి నిర్మాణములను గావించిరి. అవిముసల్మానుల యాక్రమణానంతరము శైథిల్యమొంది యునశిష్టములైన విప్పటికిని సుందరములై దర్శనీయములై యాశ్చర్యము గలిగించుచున్నవి. అందు ముఖ్యమైనది హనుమకొండలోని వేయిస్తంభముల దేవాలయము. దీనిని రుద్రదేవుడు శా. శ. ౧౦౮౪ (క్రీ. శ. ౧౧౬౨) లో కట్టించెను. మఱియు ఓరుగల్లునకు సుమారు ౪౦ మైళ్ళదూరములో నుండునట్టి "రామప్పగుడులు" అనుదేవాలయములు వర్ణించుటకు మారుగా చూచియేతీరవలయును. ప్రధాన దేవాలయ మంటప స్తంభములపై నాట్యశాస్త్రము నుదహరించు ప్రతిమలు నాట్యముయొక్క నానాంగములను నిరూపించునవై యున్నవి. ఈవిగ్రహములు కాకతీయుల కాలమందలి యొకపండితునిచే విరచితమైన నాట్యశాస్త్రము ననుసరించి చెక్కబడినవందురు. ఆశాస్త్రమిప్పుడు తంజావూరు గ్రంథాలయములో నున్నదందురు. ఇచ్చటి దేవాలయవిగ్రహముల కుపయోగించినరాయి నల్లరాయి. అవి మెరుగుగలది. చూచువారిప్రతిబింబము లందుగానవచ్చును. విగ్రహములు చాలసుందరములైనవి. అందుముఖ్యముగా "త్రిభంగీ" విలాసమును బ్రకటించు స్త్రీవిగ్రహములు (అవి నన్నముగానే యున్నవి.) సచేతనులను గూడ మోహింపచేయుననుటకు ముఖ్యనిదర్శనమేమున ౨౫ సంవత్సరములకుబూర్వము ఓరంగల్లుజిల్లా తాలూకాకు Collector గా నుండిన నొకముసల్మాను యుద్యోగి యొక విగ్రహమును దానిస్థానమునుండి యతిప్రయాసముతో లాగించి తనయిల్లు జేర్చికొన, కొందరుమతాభిమానులు పూర్వపు నిజాముప్రభువులతో మొరబెట్టుకొన మరల యావిగ్రహమా దేవాలయమం దుంచునటుల చేసిరి. ఈ దేవాలయములయొక్క గోపురముల కుపయోగించిన ఇటికెలు విచిత్రమైనవి. అవికొన్నికొన్ని సుమారొక యడుగు చౌకమును నాలుగంగుళముల మందమును కలవై యున్నను నీటిలోవేసిన పైకితేలునేకాని మునుగవు.

ఓరుగల్లుకోటలో నాలుగుదిశలందు నాలుగుద్వారములు గణపతిచే నిర్మింపబడెనందురు. ఆద్వారములు చాల సుందరములైనవై శిథిలావస్థయందున్నవి. ఒకదానిపైనుండిన హంసలు మొన్నటివరకు జాగీర్దారగు నొకముసల్మానునింటిముంగిట నలంకరించియున్నవి. ఈశిథిలమైన యాంధ్రనగరమం దిప్పుడు వ్యవసాయముకూడ జరుగుచున్నది. అందందు అప్పుడప్పుడు శిథిలములైన శిల్పశకలములు బయటికి సిక్కచూచుచున్నవి. కాని యాదరించువారులేరు. ఇటీవలనే ప్రభుత్వమువారు ఈనగరమందలి దిబ్బలత్రవ్వింప నిశ్చయించినారని వినుటకు సంతోషము కలుగుచున్నది.

ప్రస్తుతము నల్లగొండజిల్లాలో చేరిన సు-



రాయచూరు దుర్గము—మూలములను మోసికొనిపోవుట.



రాయచూరు దుర్గము—రథయాత్ర.

[By courtesy of H. E. H. The Nizam's Archaeological Department]

ర్యాపేట తాలూకాకు ౮ మైళ్లదూరములో పిల్లలమఱ్ఱియను స్థలముకలదు. ఈపిల్లలమఱ్ఱి వాడే పినవీరన. ఈనల్లగొండజిల్లా యంతయు కాకతీయుల సామ్రాజ్యమందు చేరియుండెను.

ఈపిల్లలమఱ్ఱిలో నామిరెడ్డియను వెలమ ప్రభువుచే నిర్మితమైన దేవాలయము శిథిలావస్థలోనుండినను నందలిశిల్పములు అత్యంత సుందరములై యున్నవి. ఇట నుపయోగించిన రాయియు నల్లనిది, నునుపైనది.

ఇదేవిధముగ నాగులపాటిలోని శిల్పములును యున్నవి. కాకతీయుల శాసనములు త్రిపురాంతక మందును గానవచ్చుచున్నవి. అందువీరు "విమాన"మును నిర్మించినటుల నిదర్శనములు కలవు.

ఇంకొకయంశము ముఖ్యముగా పేర్కొనదగినది. కొండిపర్తిలోను, బూదుపురములోను నిదేకాలములో సుందరములగు దేవాలయములు నిర్మింపబడెను. బూదుపురము ప్రస్తుతము నిజాంరాష్ట్రములోని మహిబూబు నగరము (జిల్లాస్థానము) నకు ౮ మైళ్ళదూరములోనున్న చిన్నగ్రామము. ఇందొక్క దేవాలయమే యిప్పుడు చాలశిథిలావస్థయందున్నది. ఈగ్రామములో ననేకశాసనములున్నవి.

ఇట్లు నానాప్రాంతములందు శృంగారమైన శిల్పములచే నలరారు నిర్మాణముల కాకతీయులు గావించి కీర్తినిగడించిరి. మొత్తముపై కాకతీయుల కాలమందలి జనుల సాంఘిక చరిత్ర చాలముఖ్యమైనభాగము. ఈచరిత్ర భాగమును బాగుగా పరిశోధనచేసి వ్రాసిన చరిత్రకారులకు జాలయుపయోగ మగుననుటలో నేమియుసందేహములేదు.

---

# వినుకొండ వల్లభరాయని క్రీడాభిరామము.*

శ్రీయుత చేకుమళ్ళ అచ్యుతరావుగారు ఎం. ఏ. ఎల్. టి.

మహమ్మదీయుల దండయాత్రలకుపూర్వము దక్షిణహిందూస్థానములో కాకతీయ రాజ్యమునకు ముఖ్యపట్టణమగు ఓరుగల్లును, భల్లాణరాజ్యమునకు రాజధానియగు ద్వారసముద్రమును గొప్పప్రతిష్ఠననుభవించుచుండెను. ఓరుగల్లు సంగీతసాహిత్యాదిలలితకళలకును, ద్వారసముద్రము రాజనీతిశాస్త్రములకును పేరొందియున్నట్లు పదమూడవ శతాబ్దియంతమందుండిన కొలని గోపరాజు అను ఆంధ్రకవివరుడు తన సింహాసనద్వాత్రింశికకథలను ప్రబంధములో అభివర్ణించెను.[1]

ఇట్టి యోరుగల్లుపురముయొక్క వైభవమును, రాజకీయసాంఘిక మతపరిస్థితులును పౌరులయొక్క వర్ణభేదములును, కులాచారవిషయములును, దైనిక జీవితమును, వినోదములును, ఆటపాటలు యిత్యాది విషయ

---

* క్రీడాభిరామమును గురించి యింకను యెక్కువ విషయములు తెలిసికొనగోరువారు నా 'విజయనగర సామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయచరిత్రము' ప్రథమభాగమందలి అయిదవయధ్యాయమును చదువుకొనవలెను. చే. అ.

1. ఆం. సా. ప. పత్రిక, సంపుటము 22 సంచిక 4

ములను వినుకొండ వల్లభరాయుడను ఆంధ్రకవివరుని సహాయమున క్రీడాభిరామమందు మనకండ్లకు కట్టినట్లు చూడగలుగుచున్నాము.

వినుకొండవల్లభరాయుడు కడపజిల్లా పులివెందల తాలూకాలోని మోపూరుగ్రామమునకు అధిపతిగానుండెను. ఈతని తండ్రియగు తిప్పన్న గుంటూరుజిల్లాలోని వినుకొండకు ప్రభువుగానుండి[3] విజయనగరరాజైన రెండవ హరిహరరాయలయొద్ద రత్నభాండాగారాధిపతిగా నుండెను. వీరి పూర్వులు విజయనగర రాజులయొద్ద గొప్ప యుద్యోగములుచేసిన వారే. క్రీ. శ. 1404-22 వఱకు రాజ్యము చేసిన మొదటి దేవరాయలకును, అతని పౌత్రుడగు రెండవదేవరాయలకును (1423-46) సమకాలికుడైన వినుకొండ వల్లభరాయుడు దేవరాయలచే కనకాభిషేక గౌరవముబొందిన శ్రీనాథునికినిగూడ సమకాలము వాడని నిర్ణయింపవచ్చును. వల్లభామాత్యుడు కామకాయనస విశ్వామిత్రగోత్రము వాడు, మోపూరు భైరవస్వామి భక్తుడు.[4]

ఇతడు క్రీడాభిరామమను వీధినాటకమును నాంధ్రమున రచించెను. ఈగ్రంథమందలి ప్రస్తావన పద్యములవలనఁ దత్కవి గొప్పపండితుడనియుఁ జక్కని కవిత్వముఁజెప్పగలవాడనియు తెలియవచ్చుచున్నది. ఇంతియెగాక ఋగ్వేదము కరతలామలకముగా పఠించి భైరవస్వామికృపవలన సారస్వతసిద్ధియనగాఁ గ్రంథకర్తృత్వ సంపత్తిబొందెను.

క్రీడాభిరామము.

క్రీడాభిరామమొక వీథినాటకము. వీథియనగా దశరూపకములలో నొకటియైన చిన్ని నాటకస్వరూపము. దానియందు నొకరుగాని యిద్దరుగాని విలాసపురుషులగు నాయకులు శృంగార విహారపరులై యొకానొక పట్టణమందును, దత్పరిసరమందును దిరిగి యచ్చటచ్చట బొడసూపెడు ఆటలు, వినోదములు, యుత్సవములు యిత్యాది విశేషములను దిలకించి మోదమొందుచు శృంగార భోగపరాయణులై వేశ్యవాటికాపరిభ్రమణమున మదనావిష్టమానసులై యారేయి గడపి మరునాడు తమదారిని దాఁబోదురు. ఇట్టివీథి నాటకములను పదునాల్గు పదునేనుశతాబ్దములలోని మనదేశమందలి గీర్వాణకవులు వ్రాసి ప్రదర్శించి రాజులను, ప్రజలను సంతోషపెట్టుచుండిరి,

రావిపాటి త్రిపురాంతకదేవుడనుకవీశ్వరుడు ప్రేమాభిరామమను నాటకమును సంస్కృతమున రచించెను.[5] దాని ననుసరించి వల్లభరాయఁడు తెలుగున క్రీడాభిరామమనురూపకమును రచియించెను. ఏతద్గ్రంథము వల్లభామాత్యుడు రచించినట్లు గ్రంథమందలిప్రస్తావన బట్టియు దెలియవచ్చుచున్నది. అయిన మఱికొందఱు లాక్షణికులు ఈ యభిప్రాయమునకు భిన్నముగాఁ దమ గ్రంథములయందు కవిసార్వభౌముఁడగు శ్రీనాథుడే యీనాటకమును రచించెనని సూచించియున్నారు. ఇట్లాంధ్రలక్షణ గ్రంథములలోనున్న భిన్నాభిప్రాయములమూలముననుమఱికొన్ని కారణములవల్లను యీగ్రంథకర్తృత్వము విషయము వాదప్రతివాదముల కాస్పదమయ్యెను.

2. క్రీడాభిరామము (వే॥ ప్ర॥ శా ప్రకటితము) పుట 8
3. Ibid పుట 8
4. Ibid పుట 12

తోలుతల్లి యీగ్రంథమును ముద్రించిన శ్రీమానవ రామకృష్ణకవిగారు ఉభయపక్షములం జెప్పదగిన హేతువులను వారికి సహజమగు నిష్పాక్షికమగు బుద్ధితోం జెప్పిరి. బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'శృంగార శ్రీనాథ' మందు అనేక నుపపత్తులను జూపుచు క్రీడాభిరామకర్త శ్రీనాథుడని తెలియజేసిరి. ఈయుభయుల యభిప్రాయములను ఖండించుచు కొన్ని నూతన విశేషములను గనపరచుచు బ్రహ్మశ్రీ వేమూరి విశ్వనాథశర్మగారు 1927 సం॥ ఏప్రిల్ భారతిలో క్రీడాభిరామకర్త వల్లభామాత్యుడేయని కంఠోక్తిగా నుడివిరి. ఈపండితుల వాదప్రతివాదముల నిచ్చట సంక్షేపముగా తెలియజేయుచున్నాను.

1. పూర్వకవిలాక్షణికులగు చిత్రకవి పెద్దన ముద్దరాజు రామన, గణపవరపు వెంకటకవి, పెదపాటి జగన్నాథకవి మొదలగు వారు క్రీడాభిరామమునుండి తమ గ్రంథములలో నుదహరించిన పద్యములు వల్లభరాయునివేయనిచెప్పినట్లు శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు వ్రాసినారు. కాని అప్పకవి, లింగమగుంట తిమ్మకవి మున్నగువా రీపద్యములు శ్రీనాథునివని నుడివినారు.

2. క్రీడాభిరామములోనున్న ఒకటిరెండు పద్యములు శ్రీనాథుని గ్రంథములో నున్నవి. మఱియు క్రీడాభిరామములోనివైన కొన్ని వాక్యములు, వర్ణనలును శ్రీనాథుని వాక్యముల ను వర్ణనలను గాఢముగా ననుకరించుచున్న వనియు, కావున శ్రీనాథుడే యేతద్గ్రంథకర్త యని సిద్ధాంతీకరింపబడవచ్చుననియు, ఋజువు చేయుటకు శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు చాలవఱకు శ్రీనాథుని గ్రంథములనుండి సామ్యశబ్దసామగ్రిని సేకరించి విపులముగ విశదపరచినారు.

క్రీడాభిరామ ప్రస్తావనయందున్న కృతిపతిస్తుతియు, గ్రంథాంతమునందున్న భరతవాక్యమును వల్లభరాయుని గుణగణములగుఱించి స్తోత్రపాఠములగుటచే వల్లభరాయడే తన్నుతా బొగడుకొనునాయని సందేహింపదగియున్నదని శ్రీప్రభాకరశాస్త్రిగారివాదము. ఈపద్యములన్నియు సూత్రధారుడు పల్కినవిగాన ననౌచిత్యదోషములేదని శ్రీశర్మగారివాదము. ఉభయపక్షముల వాద ప్రతివాదముల సారాంశ మిదియేయని నాయభిప్రాయము.

గ్రంథమునుగుఱించి యొండు రెండువిషయములకు బ్రాముఖ్యమివ్వక పోవుటచే నీయభిప్రాయభేదమున కవకాశము గలిగెనని యూహించుచున్నాను. ఈగ్రంథము రూపకముగాని కేవలము ప్రబంధముగాదు. ఇది హాస్యరస ప్రధానమైన క్షుద్రకావ్యముగాని యున్నతాదర్శముగల యుత్తమమైన కావ్యముగాదు. దీనిని అట్లు పలక్షించినయెడల శ్రీనాథుడు గాక శ్రీనాథుని భాషావేషము గొంతవఱకును ధరిపగల మరియొక కవి రచించి యుండునని మనకుం దోచును. శ్రీప్రభాకరశాస్త్రిగారి వాదములో ముఖ్యాంశమేదన శ్రీనాథుడును, వల్లభరాయుడును సమకాలికులగుటయు, శ్రీనాథునివాక్యచయ మెంతయేని యీగ్రంథమునగాన్పించుటయు నీరెండుకారణములచేతనే తద్గ్రంథము శ్రీనాథుడే రచించి యుండెనని తలంపు.

గ్రంథమందున్న సాక్ష్యము రెండువిధములుగా నున్నది. 1. గ్రంథకర్తను గుఱించియు 2. గ్రంథశైలిని గుఱించియు.

గ్రంథకర్త.

కృత్యాదినున్న యవతారికపద్యములలో

వల్లభమాత్యుఁడు తన్నుగుఱించియే అధికముగ జెప్పుకొనెను. వల్లభమాత్యుఁడే ఈగ్రంథమును వ్రాసినయెడల నిట్లు తన్నుఁదా బొగడికొని యుండునాయని కొందఱిచే యాక్షేపింప బడినది. ఈయాక్షేపణకు రెండుసమాధానములు. 1. ఈగ్రంథము వీథినాటకముగా నుండునట్లు వ్రాయబడినది. కాన కృతికర్తస్తవము నాటకప్రస్తావనయందు సూత్రధారుడు చెప్పినట్లు గానూహింపవలసియున్నది. సూత్రధారునిద్వారా యెంతెంత విపులముగాను విపరీతముగాను నాటకకర్తలు తమ్ముదాఁ గొండాడుకొనియుండిరో మనసంస్కృత నాటకములఁ జదివినఁ దెల్లమగును.

వల్లభామాత్యుఁడే యీగ్రంథమును రచించియుండనియెడల సూత్రధారుడతని కవితాస్వారస్యమును, భాషావైదుష్యమును గుఱించి కడుంగడు నుత్ప్రేక్షించి సంస్తవించుట యసందర్భముగా నుండును. ఈగ్రంథమును వల్లభామాత్యుఁడే ప్రత్యేకముగ రచియించెనని స్పష్టముగా సూత్రధారుడు ప్రేక్షకులకు జెప్పుచున్నాడు. కాన ప్రభాకరశాస్త్రిగారు దీనివిషయమై వ్యతిరేకముగాచెప్పుట సమంజసముగా కన్పడదు.

ఈవీథినాటకమునకు భరతవాక్యమని చెప్పదగిన కృత్యంత పద్యములో మోపూరిభైరవస్వామి యీ "కవీంద్రకాంక్షితత్రిదశమహీరుసారమైన" వల్లభరాయనిబ్రోచుగాతయని చెప్పబడినది. ఈపద్యమును వల్లభరాయఁడే వ్రాసిన యెడల తుమ్ముకొని తానేశతాయువమకొన్నట్లుండునని శ్రీప్రభాకర శాస్త్రిగారాక్షేపించిరి. అయితే వల్లభరాయఁడాపద్యమును వ్రాయనియెడల శ్రీనాథుడు వ్రాసెనని చెప్పుటకు దగినహేతువున్నదాయని విచారింపదగినది. ఏనాటకమందైనను భరతవాక్యమందును కృతిభర్తను గుఱించి వ్రాయుట శాస్త్రసమ్మతముగాని సంప్రదాయసిద్ధముగాని యైయుండలేదు. కనుక ఈఅశాస్త్రీయమైన వనియు, సాంప్రదాయ విరుద్ధమైన వనియు శ్రీనాథుడు చేసెననుటకంటె వల్లభరాయడు చేసెననుటయే సబబు.

గ్రంథశైలి

శైలీ సామ్యమునుబట్టి ఈగ్రంథము శ్రీనాథునిదే అని కొందఱి వాదము. దీనికి నేజెప్పునదే మన ఏగ్రంథముయొక్కశైలి ఆగ్రంథస్వభావమునుబట్టియు, ఆగ్రంథకర్తప్రతిభను బట్టియు నిర్ణయమగునని సర్వవిదితమే. క్రీడాభిరామము క్రీడావిషయములుగల హాస్యగ్రంథము కావున హాస్యరస ప్రతిపాదనకొఱకు హాస్యవిషయము లేగాక హాస్యరసజనకపరిభాషకూడ వాడుక చేయవలసియుండును. లేనియెడల హాస్యరసము జనింపదు.[6]

ఈగ్రంథమందలి శైలి సంస్కృతభూయిష్ఠము. ఇట్టి పదకాఠిన్యము కేళీవినోదముల గుఱించియు నీచసందర్భములగుఱించియు వినియోగింపబడినది. ఈగ్రంథశైలియందలి యీ తద్వైపరీత్యమునకు రెండుహేతువులుండవచ్చును. ౧. ప్రథమమున రావిపాటి త్రిపురాంతకుడు తనప్రేమాభిరామమును సంస్కృతమున వ్రాసెనుగాన నాపద్యములను దెనిగించిన కవి సంస్కృతసమాసముల నట్లేదిగవిడచియుండవచ్చును. ౨. లేదా, ఎవరోయొకకవి కీర్తికాముడగు సామాన్యుడు తనభాషావైదగ్ధ్యమును బ్రకటించుటకు నౌచిత్యపరిజ్ఞానము లేకుండ పదబంధము క్లిష్టతమముగఁ జేసియుం

6. చూ. క్రీడాభిరామము (వే॥ ప్ర॥ శా ప్రకటితము) పుట 21



వరంగల్లుకోట — ఖుష్మహల్ ద్వారము.

[By courtesy of H. E. H. The Nizam's Archaeological Department.]

డవచ్చును. తనవాగ్వైభవమునుగుఱించి మహాతిశయముగఁ జెప్పికొనిన వల్లభామాత్యుఁడే యీయప్రశస్తమైనట్టియు, అప్రశస్తమైనట్టియు శైలీదోషమునకుఁ గారణభూతుడయ్యెను గాని యుచితజ్ఞుఁడగు మహాకవి శ్రీనాథుఁడు గాడని యూహించుట యెక్కువ న్యాయము గాదా?

ఈగ్రంథములో శ్రీనాథుని పద్యములు, వర్ణనలు గానంబడుచున్నవనుట వాస్తవము. అయిననా కారణమున శ్రీనాథుఁడే యీగ్రంథమును వ్రాసెననుట మాత్రము సాహసము. శ్రీనాథుని శైలి ననేకమంది మహాకవులనుకరించిరి. అట్టియెడ వల్లభరాయఁడుగూడ శ్రీనాథుని శైలిననుసరించెనని చెప్పినచో నాశ్చర్యమేమియు లేదు.

ఈవిధముగ నీగ్రంథము శ్రీనాథకృతమని గాక వల్లభరాయని కృతమని యంగీకరించుటయే యెక్కువ న్యాయమని యూహించుచున్నాను. వల్లభరాయఁడీ గ్రంథమునుఁ దెనిగించి తనస్నేహితుఁడగు శ్రీనాథునిచేఁ గొంతసాయము బొందియుండవచ్చుననికూడ మనమూహించినను తప్పులేదు.

కథాసారము.

కాసలనాటి గోవింద మంచన్నశర్మయును శ్రోత్రియబ్రాహ్మణుఁడును, అతనిచిన్నతనపు చెలికాఁడగు టిట్టిభశెట్టియను వైశ్యుఁడును ఆంధ్రనగరమను బ్రసిద్ధివహించిన యోరుగంటి పురవీథులలో విలాసార్థము విహరించి, యచ్చటగోచరించెడు క్రీడావినోదములను, ఆటపాటలను సావకాశముగ దిలకించి, యానందించవలెనను నుద్దేశముతో నొకనాఁడు శుభముహూర్తముజూచుకొని ప్రభాతమున బయలుదేరిరి.

మున్ముందుగ నోరుగంటి పురపరిసరముననున్న వెలిపాళెము బ్రవేశించి యచ్చటనున్న నొక మేదరిసానిని, తర్వాత నొకచండాలాంగనను, యటుపైని నొకకర్నాటస్త్రీని వారు చూచిరి. అటుతర్వాత మరికొంత దూరము బోవ, నొక 'కాపు' కులాంగనయు, కర్ణాట వేశ్యయును వారిదృష్టి నరికట్టిరి. వీరినిజూచి సంతసించుచుండగ సంపెంగనూనెనమ్ముచున్న తేలియువతి వారికన్నుల కగుపడెను. ఆమె సొబగును వీక్షించి మోహరివాడలోనికి బ్రవేశించుటకై చుట్టునున్న యగడ్తను దాటి, పైడితలుపులు బిగించిన వంకరదారిగుండ రాజమార్గముఁ జేరిరి. ఆ "రాజమార్గము వారణఘటాఘోటక, శకటికాభటకోటిసంకులంబు గాన నందు బోవవలదు, క్రంతత్రోవల కలకలంబులులేక సుఖవినోదములు గలుగును" అని సందుచాయలబోవుట సుఖమని వారు నిశ్చయించి యాదారినిబట్టిరి. అటుబోవంబోవ వారియెదుట పల్నాటి వీరపురుషుల కథనమును పాడుచున్న వేటగాండ్రి నుపలక్షించి కొనియాడి, ముందుకుసాగ నేకవీరాదేవి దేవళమును, మాహురమ్మగుడియుఁ గాన్పించినవి. ఈదేవతల సేవలనుజూచియు, జక్కులవాండ్రును, మైలారభటులును జేయుచున్నజాతరలను వీక్షించియు, చముడేశ్వరీయాలయమును, బౌద్ధవిహారమును, ముద్దరాలుముసానమ్మ నివాసమును, కుమారస్వామిదేవళమును, పాండవులగుడియు, కర్తారుని మఠిదును మున్నగు వివిధదేవాయతనములనుఁ దిలకించి, యెదుటనున్న స్వయంభూకేశవ స్వాములకు గేల్మోడ్చి, మహాభైరవేశ్వరునకు నమస్కరించి, నిరీక్షించుచుండ నాంధ్రేశ్వరుని మొగసాలపైనున్న గడియారము పదునారు ఘడియలుగొట్టెను. ద్వరపడి బ్రాహ్మవీథికేగి లక్ష్మణయొజ్జ

లయింట నొక్కొక్కరూకనిచ్చివారు మృష్టాన్నముభుజించి తిరిగి పురవీథులకు మొగము ద్రిప్పిరి.

పూలయంగడికిబోయి పుష్పలావికలప్రౌఢవచోవిలాసములనాకర్ణించి వేశ్యావాటికం బ్రవేశించి, యచట నేదోయొక యుత్సవంపు కలకలము వీక్షించి, ప్రతాపరుద్ర మహారాజుగారి యుంపుడుకత్తెయగు మాచలదేవి వారాంగన చిత్రశాలాప్రవేశముజేయుచున్నయదిగాన పుణ్యాహావచన సమయమిదియని దెలిసికొనిరి. అచ్చటకొంతకాలమునిలిచి యారారాజు మన్నించు వన్నెలాడిని సందర్శించి కొంతతడవు సంభాషించి వెండియు బోవంబోవ మంచనశర్మయొక్క పూర్వంపుగారాబు వెలవెలందియగుగాంధారి యగుపడెను. ఆమెయొద్ద గొంతసేవువారు సేదదీర్చికొని తిరిగి బయలువెడలి నాగస్వరమును బాడుచున్న నాగులవానిని, యటుతర్వాతగొఱ్ఱెపందెములను, కోడిపందెములను జూచి, యుత్సాహమును బొంది మంచనశర్మ ప్రియురాలగు కామమంజరిగృహము బ్రవేశించిరి. అచ్చట నారేయియంతయు సుఖనిద్రను గడపి తరువాత తమ దారిని దాబోయిరి.

గ్రంథవిమర్శనము.

ఈ గ్రంథము క్రీడావిషయములతో నిండియున్న చిన్ననాటకము. ఆనాటి సాంఘిక జీవిత మిందులో పూర్తిగా వర్ణింపబడినది. గోవిందమంచన శర్మయు, టిట్టిభ శెట్టియు చూడదలచినది యుత్కృష్టజీవితముగాక ఆదర్శవిహీనమైన జఘన్యజీవితము. కావుననే బయలుదేరునపుడు టిట్టిభశెట్టి తనయనుంగు చెలికానితో నోరుగంటిపురమునందలి మన్మథుని విజయచిహ్నములను బ్రస్ఫుటముగ వర్ణించెను. ఈవిధమైన నికృష్టజీవితమును తనివిదీరజూచుచు పోవుచున్నను మధ్యమధ్యను మరికొన్ని సాంఘిక స్వరూపములువారిదృష్టికి పొడసూపినవి. మనయదృష్టవశమున వారి క్రీడాపరాయణత్వము ఇట్టి దృశ్యములపైనగూడ బ్రసరించినది. పల్నాటివీరుల వర్ణనము, మైలారభటుల వర్ణనము, ఏకావీరాదేవి సేవాప్రసంగము ఇత్యాది విషయములు వర్ణింపబడినవి. ఎఱిగియో యెఱుగకయో వల్లభామాత్యుడు తనచిన్ననాటకమును కేవలము హాస్యశృంగారరసపూరితముగ జేయక యచ్చటచ్చట నుదారభావస్ఫురితముగంగూడ జేయగలిగెను.

శిష్టాచారసంపత్తిలో నగ్రస్థానమలంకరించినను కొందఱు బ్రాహ్మణులు నీతిబాహ్యమగు కాముకవ్యాపారమునందుగూడ నగ్రస్థానము నలంకరించియుండ మతమునకును, శీలమునకునుగల వైరుధ్యము నేటికాలమునందుండినట్లే యాకాలమునందుసహిత ముండెను. ఈగ్రంథమందలి కవిత ధారాళమై రసపుష్టికలిగియున్నది. శృంగారవిషయముల నత్యుత్కటముగ స్పృశింపకపోయినయెడల నిది సర్వజనాదరణీయమగు గ్రంథములలో జేర్చుకొన దగినదే. కాని శైలియెంతమనోహరముగనున్నను విషయములు నిరంకుశములై రసభావములు చాలవఱకు వ్రీడావిహీనములై యుండుటచే గొంత యేవగింపుగలిగించుచున్నది. తత్కారణమున నీగ్రంథమున కున్నతస్థానమిచ్చుటకు వలనుపడదు. ఐనను మేలైన యాంధ్రచారిత్రకవిషయముల నెక్కుడుగనిచ్చుటచే నీగ్రంథమాంధ్రుల కనూనమగు సాయమొనరించుచున్నది. కాన దీనిని నమూల్యాంధ్రగ్రంథములలో నొకటిగాం బరిగణింప దగును.

# ప్రతాపచరిత్రము.

శ్రీయుత కె. రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. ఎల్.

దేశచరిత్రరచనమునకు కేవలము శాసనాదికములేగాక స్థానికచరిత్రములు, వంశావళులు, కావ్యములు మున్నగునవికూడ ముఖ్యమయినయాధారములుగ గన్పట్టుచున్నవి. వీనిలోని చరిత్రాంశము లతిశయోక్తులతోడను, కల్పనములతోడను గూడియుండుటచే మనము చారిత్రక దృష్టితో విమర్శించి నిజమును గ్రహింపవలసి యున్నది. కాకతీయసామ్రాజ్యచరిత్రమున కుపకరించుగ్రంథములలో ప్రతాపచరిత్రము, సోమదేవరాజీయము, సిద్ధేశ్వరచరిత్రమును ముఖ్యములయినవి. అందు సోమదేవరాజీయము కూచిమంచి జగన్నాథకవిచేతను, సిద్ధేశ్వరచరిత్రము కాసెసర్వప్ప చేతను ప్రతాపచరితము ననుసరించి వ్రాయబడినవి. ప్రతాపచరిత మేకామ్రనాథునిచే రచియింపబడినది. అతనికాలము నిదమిత్థమని నిర్ణయించుటకు దగినయాధారములు గానరావు. అతడు ప్రతాపరుద్రుని నిర్యాణమును, యాతని కొమరుడగు వీరభద్రుడు ఓరుగల్లు పురమును వదలి పురజనులతోను నరపతిరాయలతోను కొండలపైనుండుటను, నేకశిలానగరము ఢిల్లీసుల్తాను వశమగుటను, వర్ణించియుండుటచే నీగ్రంథము ప్రతాపరుద్రుని యనంతరము రచియింపబడి యుండవలెనని తోచుచున్నది.[1] ఏకామ్రనాథుడు ప్రతాపరుద్రుని కాలమువాడనుటకు దగిననిదర్శన మేదియును లేదు.

శాసనాదికములవలన గాకతీయులచరిత్రము మొదటి ప్రోలరాజు (సుమారు క్రీ. శ. 1050) కాలమునుండియే తెలియుచున్నది. అంతకు పూర్వవృత్తాంతములు తెలియుటలేదు. ప్రతాపరుద్రదేవుడు క్రీ. శ. 132 వరకు కాకతీయసామ్రాజ్యమును పాలించినటుల నిశ్చయింపనగును. కాకతీయులు ప్రథమమున మాండలికులుగనుండి కాకతి ప్రోలుని యనంతరము సామ్రాజ్యస్థాపన మొనర్చిరా? యను విషయము విమర్శింపవలసియున్నది. బేతరాజీ వంశమునకు మూలపురుషుడుగాడనియు నతని తండ్రియగు ప్రోలరాజు మోటుపల్లి మున్నగు శాసనముల బేర్కొనబడెననియు మనకు దెలిసిన విషయమే. బేతరాజు పశ్చిమచాళుక్య చక్రవర్తియు, త్రిభువనమల్ల బిరుదాంకితుడు నగు నాఱవ విక్రమాదిత్యుని (క్రీ. శ. 1076—1137) కాలమున నాతనికి సామంతుడై సబ్బిసాయిరమండలము నేలుచుండెనని యనుమకొండలోని కన్నడశాసనమున గలదు.[2] ప్రతాపచరిత్రమున గాకతీయులపూర్వచరిత్రము గూడ వర్ణింపబడినది. దానిని సంగ్రహముగ వివరింతును. కృష్ణా గోదావరీ మధ్య దేశంబున హనుమద్గిరిప్రాంతమును హను

---

1 ప్రతాపచరిత్ర మాంధ్రసాహిత్య పరిషత్కార్యాలయము వారిచే బరిషత్పత్రిక 6, 7 సంపుటములలోను యిటీవల వరంగల్ శైవప్రచారిణీగ్రంథమాలయందు మూడవయనుబంధముగను బ్రకటింపబడినది. కాని యీరెండు ప్రతులకును కొన్ని స్థలముల భేదములు గలవు.

2 Ep. Ind. vol, ix. p. 256.

ముడు, కొండదుమున్నగు వెలుకరాజులు 180 సంవత్సరములు పాలించిరి. వీరి యనంతరము కాకతి రాజులు వేయేండ్లు పాలించి, యేకశిలానగరమును నిర్మించి పెక్కు శాత్రవుల నిర్జించిరి. వారి వంశక్రమ మీ విధము. చంద్రవంశంబున జనమేజయుండు, నతనికి శతానీకుడు, నాతనికి క్షేమాంకుడును గల్గిరి. (క్షేమంకరుడని ఓరుగల్లు ప్రతియందు గలదు.) అతనికి విజయాంకనాథుడు (విజయార్కుడు) సోమేంద్రుడు నను పుత్రులు జన్మించిరి. అందు సోమేంద్రునకు విష్ణువర్ధనుడు జనించి ధర్మపురిప్రాంతమున రాజ్యమొనర్చెను. అతని కుమారుడగు నందుడు నందగిరిపురంబు రాజధానిగా రాజ్యము పాలించెను. అతడు తన కూతురగు వసుమతిని యదువంశతిలకుడగు సత్యభానునకు వివాహమొనరింప వారలకు వృషసేనుండను కొమరుడు కలిగెను. వృషసేనుని వంశంబున కన్నమదేవుడు జన్మించి కందారంబు రాజధానిగా రాజ్య మొనర్చెను. అతని కుమారుడగు సోమదేవుడు పెక్కుసారులు కటకేంద్రునితో బోరి నిహతు డయ్యెను. అతని భార్యయగు సిరియాలదేవి గర్భవతి యగుటచే దనశిశువును రక్షించుకొనుటకై హనుమద్గిరిలో నుండు వెలుకరాజుల శరణంబువేడ, వారు గజపతి నెదిరింప ధైర్యముచాలక సిరియాలదేవిని యామెతో నుండు బ్రాహ్మణులను పురి వెడల నడచిరి. అంత సిరియాలదేవి వెలుకరాజుల పురోహితుండగు మాధవశర్మను శరణువేడి యతనియింట వసింపుచుండెను. మాధవశర్మయు నామెను దన కుమార్తె యని ప్రకటించి, యామె వడ్డించిన దానను మిగిలిన బ్రాహ్మణులును భుజియించి, గజపతిని కటకంబునకనిపి యామెను రక్షించెను. కొంతకాలమున కామెకు మాధవవర్మయను పుత్రుడుదయించి, పద్మాక్షీ వరప్రసాదంబున రాజ్యాభిషిక్తుడై, దిగ్విజయమొనర్చి, కటకేంద్రుని జంపి పగదీర్చుకొనెను. మాధవవర్మకు పద్మసేనుండును, నతనికి వెన్నమరాజు, నతనికి గుండమరాజునుజనించిరాజ్యపాలన మొనర్చిరి. గుండమరాజు తరువాత నాతనిపుత్రుడగు ఎఱుకదేవరాజు రాజయ్యెను. అతడు బాలుడగుట నాతని మేనత్తయగు కుంతలిదేవి కొంతకాలము రాజ్య మొనర్చెను. ఎఱుకదేవరాజునకు భువనైకమల్లుడు, నతనికి త్రిభువనైకమల్లుడును గల్గిరి. త్రిభువనైకమల్లునకు గాకతిదేవి వరప్రసాదంబున ప్రోలరాజుదయించెను. ఈతడే చరిత్రకారులచే బేర్కొనబడిన రెండవ ప్రోలరాజు. ఈతని తండ్రియగు త్రిభువనమల్లుడే పశ్చిమచాళుక్య చక్రవర్తియగునాఱవవిక్రమాదిత్యుని సామంతుడై యాతని త్రిభువనమల్లబిరుదమును వహించిన బేతరాజు.

ప్రతాపచరిత మీరాజుల వృత్తాంతమును దెల్పుటయేగాక వారి రాజ్యపాలనకాలముల దెల్పుచున్నది. కాకతీయులు మాధవవర్మ మొదలు ప్రతాపరుద్రునివరకు వేయిసంవత్సరములు రాజ్యముపాలించిరని గలదు. కాని యిందుదహరింపబడినకాలనిర్ణయము సరికాదు. ప్రతాపచరితాదులవలన మనమీక్రిందివిషయములు గ్రహింపవలసియున్నది.

(1) ఓరుగల్లు ప్రతియందలి పొరికివెన్నమరాజు పరిషత్ప్రతియందు గానబడుటలేదు. సోమదేవరాజీయమున నుండుటచే నిదిప్రమాదవశమున విడువబడినదని తోచుచున్నది. మరియు నీగ్రంథముల బ్రతాపరుద్రుడు దిగ్విజ

యమునకేగ నాతనిసోదరుడగు అన్నమదేవుడు 12 సంవత్సరములు రాజ్యపాలన మొనర్చెనని కలదు. దీనిని నిర్ణయించుటకు దగినయాధారములులేవు. మాధవవర్మ శా. శ. 291 సంవత్సరమున రాజ్యమునకు వచ్చెననియు, ప్రతాపరుద్రదేవుడు శా. శ. 1282 వరకు రాజ్యమొనర్చి శా. శ. 1291 లో స్వర్గస్థుడయ్యెననియు నోరుగల్లుగ్రంథమున గలదు. శాసనాధారములవలన బ్రతాపరుద్రుడు క్రీ. శ. 1326 వరకున్నటుల నిర్ణయింపబడినది.[3] ప్రతాపచరిత్రాదులందుగల కాలనిర్ణయము ప్రమాదభూయిష్ఠము. చరిత్రకారులు బేతరాజుమొదలు ప్రతాపరుద్రునివరకు నేర్పరచిన రాజ్యకాలములు ప్రతాపచరితమునందుగలవానితో సరిపోవుటలేదు. శాసనములవలన క్రీ. శ. 1050 మొదలు 1326 వరకే కాకతీయులకాలమని నిర్ణయింపబడినది.[4] కుతుబుసాహీ సుల్తానుల చరిత్రమును (తారీఖెఖాదిరీ) రచించిన మున్షీ ఖాదరుఖాను నందునియొక్కయు మాధవవర్మయొక్కయు వృత్తాంతమును దెల్పియున్నాడు. ఇది స్థానికచరిత్రలపై నాధారపడి యుండనోపు. మఱియు మహమ్మదీయ గ్రంథకారులు కాకతీయులు మహమ్మదీయుల దండయాత్ర నాటి కేడువందలసంవత్సరములనుండి రాజ్యముచేయుచున్నట్లు వ్రాసియున్నారు. ప్రతాపచరితాదులవల్లను స్థానికగాథలవల్లను మనము తెలిసికోదగిన విషయము కాకతీయులు మాండలికులుగనైననేమి, స్వతంత్రరాజులుగనైననేమి సుమారు వేయిసంవత్సరములు అనుమకొండరాజ్యమును పాలించిరనుటయే.

(2) త్రిభువనైకమల్లుడు బేతరాజనియు నాతడు దనయేలికయగు విక్రమాదిత్యుని బిరుదమును వహించెననియు దెల్పియున్నాము. ఆతని తండ్రియగు భువనైకమల్లుడే మొదటి ప్రోలరాజు, ఇతడు రెండవసోమేశ్వరునివలె భువనైకమల్ల బిరుదమును వహించెను. వేంగీ చాళుక్యరాజగు రెండవఅమ్మరాజు కాలము నాటి తామ్రశాసనములో[5] గాకర్త్యగుండ్యన యొకడు పేర్కొనబడెను. (క్రీ. శ. 956) ఈతని కాలము గుండమరాజుకాలమునకు సరిపోవుచున్నది. కాని గుండముని తండ్రితాతలు వెన్నమరాజు, పోరికివెన్నమరాజు అని స్థానికచరిత్రములయందుండ, శాసనమున ఎఱియ, గుండియ రాష్ట్రకూటులని గలదు. ఈగుండ్యన యెవరో[6] యింకను నిర్ణయింపవలసియున్నది. మఱియు ఖాజీపేటశాసనమునం దొకదానిలో మొదటిప్రోలరాజుతండ్రి బేతరాజని యున్నదట.[6] ప్రతాపచరితమున నెఱుకదేవరాజని కలదు. ఇదియు విమర్శనీయము. బెజవాడ మల్లేశ్వరాలయమునగల శాసనమున శా. శ. 1171 ప్రాంతమున నొకమాధవవర్మ గలడని వ్రాయబడినది. అతడే కాకతీయుల మూలపురుషుడనుటకు దగినయాధారము లింకను దొరకియుండలేదు. మాధవవర్మకాలము శా. శ. మూడవశతాబ్దమని ప్రతాపచరితాదులయందు గలదు.

---

3 ఈ సంచిక ౭౫ పుటను చూచునది.

4 J. A. H. R. S. vi—2 p. 124.

5 C P No. 1 of 1916-17- Ep Report-1917

6 ఈ శాసనమూలము J.A.H.R.S. Vol. vii. p. 2. p. 115 లో నాచే బ్రకటింపబడినది-

(సంపాదకుడు)

(౩) కాకతీయుల కాపేరెందులకు వచ్చినదో, కాకితమ్మ (కాకతమ్మ) యననెవరో, మనము విచారింపవలసియున్నది. ఈసందర్భమున జరిత్రకారులు పెక్కువిషయముల సిద్ధాటించుచున్నారు. మనకు దెలిసినవిషయముల జర్చించి యామె జైనదేవతయా? కాదా? యని విమర్శింపనగును. అనితల్లికలువచేరుశాసనమున[7] "కాకత్యాః పరశక్తేః కృపయా కూష్మాండవల్లికా కాచిత్ పుత్రమసూత, తదేతత్కులమనఘం కాకతీయసంజ్ఞమభూత్" అని కలదు. రెండవప్రోలరాజు పద్మాక్షీ దేవాలయశాసనమునందలి జినేంద్రస్తుతిచే జైనమతావలంబకుడని యూహింపబడుచున్నాడు. ఇరువది రెండవ తీర్థంకరుని దేవి కూష్మాండీ యని జైనగ్రంథములు దెలుపుచున్నవి. వీనినొకదానితో నొకటి ముడివెట్టి, కాకతి జైనదేవత యనియు, నామెయే కూష్మాండిని యనియు, గాకతియన గుమ్మడితీగ యనుట దీనిని బలపఱచుచున్నదనియు వ్రాయుచున్నారు. కాకత (కాకిత) యనునది జైనదేవత యని యెచటను దెల్పబడి యుండలేదు. జైనగ్రంథముల గాకతి యను పేరుగానరాదు. కాకతియన గుమ్మడితీగయని నిఘంటువులగాని మరి యే యితర గ్రంథముల గాని లేదు. విద్యానాథకృత ప్రతాపరుద్రీయమున 'కాకతీయకులదుర్గాదేవీసమారాధనేనవిజయప్రస్థానమంగళం కృత్వా' అని కలదు. రత్నాపణ వ్యాఖ్యానమున 'కాకతిర్నామదుర్గాశక్తి రేకశిలానగరేశ్వరాణాం కులదేవతా, సాశక్తిర్భజనీయా అస్యేతి కాకతీయః' అనియున్నది. క్రీడాభిరామమున నీమె ఏకవీరకుకై దోడని వర్ణింపబడినది. ప్రతాపచరిత్రమున తమయిలువేల్పయిన కాకితమ్మకు ఉత్సవములుచేయించి, 'కాకితదేవివరప్రసాదంబున ఒక్కసుతునిం గని కాకితిప్రోలరాజు అను నామకరణ మొనర్చి' అని వ్రాయబడినది. కలువచేరుశాసనమున గూడ నీమె శక్తిస్వరూపిణి యని కలదుగదా. వీనివలన గాకతియనునది దుర్గకపరనామధేయమనియు, నామెయే కాకతీయుల కులదేవత యనియు స్పష్టము. మఱి కూష్మాండవల్లరి నుండి కాకతీయు లుద్భవించిరను శాసనభాగమును బరిశీలింప నది స్థానికగాథలపై నాధారపడియున్నట్లు తోచుచున్నది. మాధవవర్మకుమారుడు పద్మసేనుడు సంతానంబులేమి బుధానుమతంబున సిద్ధేశ్వర శ్రీమన్మహాదేవుని నిత్యంబును గూష్మాండ ఫలంబుల బూజింప దత్ప్రసాదంబున నొక్కసుతుడు గలిగెనని ప్రతాపచరితాదుల గలదు. ఇదియే కూష్మాండవల్లరీ గాథకు మూలమని తోచును. పై విషయముల బరిశీలింప గాకతి జైనదేవత యనుటకు తగిన యాధారములు లేవు. అవి దొరకువరకు నామె దుర్గయే యనియు, నామెను భజించుటచే గాకతీయులకా పేరు గలిగెననియు మనమూహింపవలసియున్నది. కాగతియను గ్రామమునుండి కాకతిశబ్దము పుట్టినదనియు కొందరు వ్రాయుచున్నారు.[8] అది సరికాదని తోచుచున్నది. నా మిత్రులలో నొకరు బౌద్ధవాఙ్మయమున గాకతియను దేవతయున్నదని తెల్పియున్నారు. ఇదియు భావివిమర్శనము వలన దేలవలసియున్నది. ప్రోలరాజు రాజైను

---

7 ఆం. సా. ప. vol II -పు96-112.

8 ఈసంచికలోని నా వ్యాసమున ౭ వ పుటను గాంచునది. (సంపాదకుడు.)

డగుటచే గాకతియు జైనదేవతయైయుండు నని విల్సనుగా రభిప్రాయపడియున్నారు.[9]

(4) ఈసందర్భమున మరియొకవిషయము ను మనము విమర్శింపనగును. ప్రతాపచరిత మున గణపతి రుద్రునికుమారుడనియు, మహాదేవరాజీతనికి పినతండ్రియనియు వ్రాయబడి నది. కొన్నిశాసనముల గణపతి మహాదేవరాజు కుమారుడని యుండుటచే జరిత్రకారులు రుద్ర దేవునికి సంతానములేదనియు, నతనితరువాత మహాదేవరాజు నాతనియనంతర మతనికుమా రుడగు గణపతిదేవుడును రాజ్యపాలన మొన ర్చిరనియు నిశ్చయించియున్నారు. కరీంనగర మండలమునందలి యుస్వరపల్లె శాసనమున గణపతిదేవుడు రుద్రనరేంద్రుని పుత్రుడని స్పష్టముగ దెలుపబడినది.[10] మహాదేవరాజు రుద్రునిజంపి రాజ్యమాక్రమింపబోవ బ్రజలా తని యన్యాయమునుగాంచి రుద్రునిసుతుండగు గణపతికి పట్టముగట్టి యువరాజై యుండుమని యతనికి బోధించిరనియు, యతడట్లే గణపతి సహితంబుగా మూడువత్సరములు రాజ్యమొ నర్చి, దేవగిరిరాజులతో యుద్ధముచేసి సమసె ననియు బ్రతాపచరితమున గలదు. ఈవిషయ మింకను విమర్శింపవలసియున్నది.

(5) కాకతిప్రోలరాజు తన యవసానకాల మున బ్రమాదవశమున గుద్రన్నృపునిచే జంప బడెననియు, రుద్రదేవుని రాజ్యకాలమున నా తనిసోదరుడగు మహాదేవరాజాతని నెదిరించి యతని జంపెననియు స్థానికచరిత్రాదులవలన దెలియుచున్నది. ఇందలి సత్యాసత్యములింకను పరిశోధకులు నిర్ణయింపనగును.

(6) కాకతీయులకు బ్రథమమున ననుమ కొండయే రాజధానియైయుండెను కాకతిప్రోల రాజు ఓరుగల్లుపురమును నిర్మించెననియు, గణ పతిదేవు డాపట్టణమునకు బ్రాకారములను నిర్మించి యోరుగంటికోటను గట్టించెననియు బ్రతాపచరితాదులయందు గలదు. శివయోగ సారమను గ్రంథమున రుద్రదేవుడనుమకొండ నుండి యోరుగల్లునకు రాజధానిని మార్చినట్లు వ్రాయబడినది. కొన్నిశాసనముల గణపతిదేవు డు ఓరుగంటిపురాధీశ్వరుడని యుండుటచేతను, యంతకుపూర్వము హనుమకొండయే రాజ ధానియని యుండుటచేతను, ఓరుగల్లు క్రీ. శ. 12·4 ప్రాంతముననే రాజధానియయ్యెనని తెలియ నగును. ప్రతాపచరితాదులవలన ఓ రుగల్లుపుర మదివరకే నిర్మింప బడెననియు, గణపతికాలమున గోటనిర్మింపబడుటచే నాతని కాలమునుండియే శాసనముల నది రాజధాని యని యుదహరింపబడినదనియు మనమూహిం చుట యుక్తియుక్తము.

స్థానికచరితములనుండియు, ప్రతాపచరిత ము సోమదేవరాజీయము మున్నగు గ్రంథము లనుండియు, జెక్కుసమస్యలు బయలుదేరుచు న్నవి. ప్రతాపచరితాదుల సహాయమువలన మనము త్రిభువనమల్ల బేతరాజునకు బూర్వపు కాకతీయరాజ్యచరిత్రమును నిర్మింపవలసి యున్నది.



9 Mackenzie collection vol. I Intro. P. 128. Edited by H. H Wilson (1828).

10 Hyderabad Archaelogical Series No. 3.

# కాకతీయులచరిత్రము—విశేషాంశములు.

శ్రీమాన్ దూపాటి రమణాచార్యులుగారు.

కాకతీయు లాంధ్రదేశమునకు సంఘమున చేఁ గావించినసేవ యనల్పము. క్రీ. శ. 1076 మొదలు 1127 వఱకు రాజ్యమేలిన త్రిభువనమల్ల విక్రమాదిత్యుని యనంతర మీవంశజులు స్వతంత్రులైరని చరిత్రవిదులవిశ్వాసము.

కాకతీయులమత మెద్ది? కూటస్థుఁడెవఁడు? వీరలవంశ మెద్ది? యనుసంశయములు సందిగ్ధములుగ నున్నవి. వీరికులమునుగూర్చి ఇదమిద్థమను నిర్ణయమింకను జరుగలేదు. కొన్ని శాసనములు దుర్జయవంశజుఁడగు బేతరాజును గూటస్థునిగను, మఱికొన్ని దుర్జయునితావున బేతరాజునుజెప్పి అతనిపుత్రుఁడగు ప్రోలరాజును గూటస్థునిగఁ జేర్కొనినవి. ఈప్రోలునివంశమున రుద్రదేవుడు జనించెననుటచే బేతరాజునకు ముందొక ప్రోలరాజీవంశమున గలఁడనుట సత్యము. మొత్తముమీఁద నీభిన్నభావములు సమన్వయించి చరిత్రచతురాననులగు శ్రీవీరభద్రరావు పంతులువారు ఈక్రిందివిధమునఁ జరిత్రమును నిర్ణయించిరి—

“దుర్జయునితరువాత కాకతీయవంశమున మొదటి ప్రోలరాజు జనించెను. అతఁడు అరికేసరియను గొప్పచెఱువు త్రవ్వించెను. ఇతనికిఁ త్రిభువనమల్ల బేతరాజు జనించెను. త్రిభువనమల్లుఁ డనునది బేతరాజునకు బిరుదనామము .....మహామండలేశ్వర కాకతిబేతరాజునకు పిమ్మట రాజ్యభారము వహించినవాఁ డతని కుమారుఁడైన ప్రోలరాజు......ఈకాకతిప్రోలరాజు శాసనమునందు మొదట త్రిమూర్తులయిన బ్రహ్మవిష్ణుమహేశ్వరులలో నెవరిని స్తుతింపక శ్రీమజ్జినేంద్రునిమాత్రమే స్తుతించియుండుటచేత నితఁడు జైనమతావలంబియని స్పష్టముగా బోధపడుచున్నది.”

కాకతీయవంశములో రుద్రదేవుని తండ్రియగు ప్రోలరాజునకుఁ బూర్వచరిత్రము చరిత్రకారుల కింతవఱకుమాత్రమె లభించినది. దీని ననుసరించి శ్రీ మారేమండ రామారావుగారు కాకతీయులు మైసూరురాజ్యములోని కాకతిఅనుగ్రామమునుండి వచ్చియుందురనియు, ఈవంశమున కాకర్త్యగుండన కూటస్థుఁడనియు, నతఁడు క్రీ. శ. 980 ప్రాంతమువాఁడు కానోపుననియుఁ గొన్ని సిద్ధాంతములు గావించిరి. కాకతీయవర్ధంతికి ముందు హనుమకొండ ప్రాంతములందలి శాసనముల నన్నింటిని బరిశోధించితిమి. ఇంతకుమించినచరిత్రాంశములుగాని, ఈసిద్ధాంతమును దారుమాఱుచేయు శాసనములుగాని లభింపలేదు.

అదృష్టవశమున ఖాజీపేటలో నొక సమాధియందు రెండుశాసనశిలలు స్తంభములుగా నుపయోగింపఁబడినవని తెలియవచ్చెను. పోయి పరిశీలింప నందపూర్వ చరిత్రాంశము లున్నట్లు నవి చరిత్రమున కమూల్యవరికరములనియుఁ దెలిసెను.

ఈ రెండుశాసనములకును బయిని ఒక మూరపొడవు గలభాగము విరుగఁగొట్టఁబడుటచే శాసనశిలలయందలి యాద్యంతములకుఁ బొత్తు కుదురకున్నది.[1]

తెలిసినభాగమువలన రాష్ట్రకూట వంశజుఁడగు అమోఘవర్ష పృథ్వీ వల్లభ దేవుఁడు మనకుఁ బరిచితుఁడైనాఁడు. ఈతఁడు తనకుఁ బ్రతినిధిగ అనుమకొండ రాజ్యమునకు సత్యాశ్రయవంశజుఁడు చాళుక్యుఁడునగు భీమరసును నుంచెను. అమోఘవర్షపృథ్వీవల్లభదేవుఁడు క్రీ. శ. 878 ప్రాంతమున అనుమకొండ రాజ్యమును బాలించుచుఁ దన ప్రతినిధి నుంచుటచేఁ దొమ్మిదవ శతాబ్దమునఁ బశ్చిమ చాళుక్యులనుండి రాష్ట్రకూటులు త్రిలింగ సామ్రాజ్యమును హరించి యొక పశ్చిమచాళుక్యవంశజుని రాజప్రతినిధిగనుంచిరని తెలిసినది. ఆ కాలమున అనుమకొండకు వ్యవహారనామము "అమ్మఁకొండ".

రెండవశాసనము కాకతిబేతరాజుది. నాలుగువైపుల నీశాసనము వ్రాయఁబడియున్నది. తలభాగము ఒకమూరవరకుఁ దెగఁగొట్టఁబడుటచే ఒకచివరగల యంశము వేఱొకప్రక్కతో జతకుదరకయున్నది. ఇది యొక శాసనమా, రెండుశాసనములా? యను సందియముఁగూడఁ గలుగుచున్నది. ఇందొకభాగము కన్నడపద్యములతో నున్నది. మఱియొకభాగము శ్లోకములతో నున్నది. తొలుత శ్లోకభాగములోని సారాంశము వివరించెదము. ఇందు మొదట బేతరాజు, తరువాత ప్రోలరాజు, పిదప బేతరాజు వరుసగాఁ బేర్కొనబడిరి.[2] ఇందలి చివరబేతరాజే త్రిభువనమల్లబేతరాజు. ఇతని కుమారుఁడే ప్రోలరాజు, త్రిలింగరాజ్యనిర్మాత. శాసనమునఁ బయిభాగము పోవుటచే ముందుఁగల యంశములు దుర్గ్రాహ్యములైనవి. ఉన్నంతలో బేతరాజు కాకతిపురాధినాథుఁడు, చోళరాజుల సేనాసముద్రమును మథించి లక్ష్మి నార్జించినాఁడు. ఈబేతరాజు త్రిభువనమల్ల బేతరాజునకుఁ దాత. క్రీ. శ. 975-1025 వఱకితని రాజ్యకాలము. పాలెంకుటశాసనమునందును పిల్లలమఱ్ఱి శాసనమునందును రేచర్లబ్రహ్మసేనాని కాంచీనగరమును జయించి కాకతీయరాజుల కర్పించినటులఁ గలదు. కాంచిరాజులు చోళులుగానను ఈబేతరాజు తాను చోడవార్ధి జయించి లక్ష్మిని గడించితిననుటచేత నీతఁడు రేచెర్లబ్రహ్మనాయని సహాయమున కాంచి జయించిన వీరుఁడని నిశ్చయింప వచ్చును.

పైఁజెప్పిన మొదటి బేతరాజుకుమారుఁడు మొదటి ప్రోలరాజు. ఈయన మహావీరుఁడు. కొడ్వత్తిదుగ్గరాజు కుమారుఁడగు గొన్న

---

1 " • • • • నన్దనయె

1 మ్బసంవత్సరమాగ క
2 స్నెయోళ్ బ్రహస్పతిప్రవ
3 ర్తిఁసే స్వస్త్యమోఘవ
4 ర్షఁశ్రీపృథువీవల్లభ
5 మహారాజాధిరాజపర
6 మేశ్వరభట్టరర పాద
7 పద్మోపసేవిత లబ్ధ
8 సమధిగతపఞ్చమ
9 మహాశబ్ద మహాసామన్తా
10 ధిపతి సత్యాశ్రియ
11 శ్రీమద్భీమరుస స్సర్వఁగు
12 ణజనసంస్తూయమానధ
13 మ్మఁసారతి చతుస్సమ
14 యాశ్రియ సకళభువ
15 నవిఖ్యాతకీర్తి శ్రీమ
16 దమ్మఁ కొణ్డొగె శ్రీవణ-

2 ఈ శాసనము అనుబంధమున 1 నవంబరుశాసనముగా బ్రకటింప బడినది.

రాజును జంపి పరక్షూదేశము నాక్రమించెను. ఈ ప్రోలరాజు మహావీరుడుగాననే పాకాల శాసనము నందుఁ గాకతీయవంశమునకుఁ గూటస్థుఁడుగాను, చేబ్రోలు, ఖాజిపేటనాకా, అనుమకొండ వెలిపాలము శాసనములలో నీతఁడు ప్రఖ్యాతుఁడుగను జెప్పఁబడినాఁడు. ఈతఁడు నిర్మించిన అరికేసరి తటాక ప్రశంస చేబ్రోలు శాసనమందె గాక ఖాజిపేటనాకా శాసనమునందు సైతము గలదు. క్రీ. శ. 1075–1076 ఈతని కాలము కానోపును. చక్రకూటవిషయము నీతఁడు జయించినాఁడు. భావిపరిశోధనమున నీతని వీరచరిత్రము గోచరింప వచ్చును. ఈతనికాలమునఁ గల త్రైలోక్యమల్ల భూవిభుని చరిత్రమింకను శోధింపవలసి యున్నది. ఈ రెండవ బేతరాజే హనుమకొండ రుద్రదేవుని శాసనమున త్రిభువన మల్లదేవుఁడని కేవల బిరుదనామము తోడనే వ్యవహరింపఁబడినాఁడు. ఈయన కట్టించినది బేతేశ్వరాలయము. ఇపు డది నశించినది. ఈయన గట్టించిన శివపురప్రశంస కిదె నుదాహరింపఁబోవు వేఱొకశాసనమునందుఁ గూడఁ గలదు. ఇపు డీగ్రామము రూపుమాసెనో, పేరు మాసెనో యెఱుంగుట దుష్కరము. బేతభూపతికి 'పరశు' అను బిరుదము గలదు. ఇంతియే గాక విక్రమచక్రియను బిరుదుసైతము గలదు. ఈబిరుదము హనుమకొండ వెలిపాలము నందలి పుట్టుకొతి పయిగల యొకశాసనమునందు జెప్పఁబడినది.

పై శాసనశ్లోకమునందలి విక్రమచక్రిపదము పాశ్చాత్యచాళుక్య చక్రవర్తి త్రిభువనమల్లుని దెల్పునదియని కవిగారు వ్రాసిరి. అది సరి గాదు. బేతభూపతినిగూర్చినది గాకున్నచో అన్వయము కుదురదు. పూర్వోదాహృతమగు మాశాసనశ్లోకములోని విక్రమచక్రిపదము బేతభూపతికి బిరుదుగాన నిదియు బిరుదమనియే నిశ్చయింపవచ్చును. బేతభూపతికాలము క్రీ. శ. 1025 మొదలు 1076 వఱకుఁ గావచ్చును లేదా 1090 వఱకు నైనను గావచ్చును.

ప్రకృతశాసనమునఁ గొంత కన్నడభాగము గలదని తెలిపియుంటిమి. అందు బహిఃపటి వైపున శాసనకాలము ౧౦౧౨ ప్రమోద సంవత్సరము కార్తిక బహుళ ౧౫ అదివారము సూర్యగ్రహణకాలమని కలదు. అచటనే కాలాముఖతపోధనాచార్యుఁడును, శ్రీశైల మల్లికార్జున శిలామఠాచార్యుఁడును నగు రామేశ్వర భట్టారకుని ప్రశంసయుఁ గలదు. బేతభూపతి మల్లికార్జునునకు రామేశ్వర భట్టారకునకును బాద ప్రక్షాళనము గావించి యొనరించిన ధర్మము చెప్పఁబడినది. 4 ఇంతియు గాక దుగ్గనృపతియే త్రిభువనమల్లుఁడనియుఁ బేర్కొనఁబడినది. ఈశాసనమునందు బేత భూపతి ప్రశంసఁ గలదు.

---

4 10 స్వస్తిశ్రీ సమస్త భువనాశ్రయ
11 శ్రీ పృథ్వీవల్లభ మహారాజా
12 ధి రాజ పరమేశ్వర పరమ
13 భట్టారక సత్యాశ్రయకుల
14 తిలక చాళుక్యాభరణ శ్రీమ
15 త్త్రిభువనమల్లదేవర విజ
16 యరాజ్యాభ్యుదయ మాచం
17 ద్రార్క్క తారం సలుత్తమిరె తత్పాద
18 పద్మోపజీవి సమధిగత పంచ
19 మహాశబ్ద మహామణ్డలేశ్వర
20 నమ్మకొండపురవరేశ్వరం పరమ
21 మహేశ్వరం పతిహితచరి
22 తం వినయవిభూషణం శ్రీ
23 మన్మహామణ్డలేశ్వరం కాకతీ
24 య బేతరసన నమ్మకొండపుర

'పరమమాహేశ్వరం' అను నితని బిరుదము ప్రత్యేకించి పరిశీలింపఁదగినది. బసవేశ్వరుని వీరశైవమతము ఉద్భవింపకముందునుండియు కాకతీయులు శైవమతమువారనుమాట సత్యము. బేతభూవల్లభుని గురువగు రామేశ్వరపండితుఁడు, మల్లికార్జునుఁడును శైవమతాచార్యులుగానఁ గాకతీవంశజులు శైవులనియే తోఁచుచున్నది. బేతభూవిభుని శాసనము లిప్పటికి మూఁడుగోచరించినవి. ఇవి యన్నియు శివాలయములకు కొసఁగఁబడిన దానములను దెలుపునవేగాన బేతభూవల్లభునినాటనుండి కాకతీయులు శైవులనియు, సంతతము మున్ను శైవులని విశ్వసింపఁదగిన యాధారముల నాస్త్రంపవచ్చుననియు మాతలంపు. కాకతీయ వంశమునఁ గూటస్థుఁడు దుర్జయుఁడు. అతని యన్వయమునఁ దొలుత మొదటి బేతరాజు నతనికి మొదటిప్రోలరాజును జనించిరి. మొదటి ప్రోలరాజునకు రెండవబేతరాజును, ఆతనికి రెండవప్రోలరాజునుక్రమము ఖాజీపేటరోడ్డు ప్రక్కను, వడ్డెపల్లిచెఱువుకొమ్మునఁగల శిలాశాసనమునందును గలదు.[5] కేసరితటాకనిర్మాతయగు మొదటిప్రోలరాజే ఈశాసనధర్మకర్తయంట్రి. కేసరితటాకనిర్మాణమునే ఈ శాసనముచెప్పుచున్నది గానఁ గ్రిందఁజెప్పఁబడు ప్రోలరాజు మొదటి ప్రోలరాజనుట నిస్సంశయము. తరువాత త్రిభువనమల్లదేవుని పాదపద్మోపజీవులగు(రెండవ) బేతరాజు,(రెండవ) ప్రోలరాజుగావించిన వరుణప్రతిష్ఠ చెప్పఁబడినది. ఈరెండుశాసనము లీయంశమును నిర్ణయింప నాధారవడుచున్ననుఁ దొలుతఁజెప్పిన దరగాశాసనము విపులముగను చరిత్రాత్మముగ నుంటచే దానికి రెండవశాసనము బలము కలుగఁజేయునదిగా నున్నది. కాకతీయవంశవృక్ష మీనూతనాధారములతో రుద్రదేవుని వరకు నీక్రిందివిధముగా నిర్ణయింపవచ్చును.

దుర్జయవంశము

|

బేతరాజు I క్రీ.శ 975–1025

|

ప్రోలరాజు I క్రీ.శ 1025–1076

|

బేతరాజు II క్రీ.శ. 1076–1126

|

ప్రోలరాజు II క్రీ.శ 1126–1140

|

రుద్రదేవుఁడు. క్రీ.శ 1140–1196

రుద్రదేవుని యావలివంశక్రమమును కాలములను రూఢములగుటచే నుదాహరించుట మానితిని.

కాకతీయులలో రెండవప్రోలరాజు పద్మాక్షిగుడియుండెడి శాసనమున జైనస్తుతి గావించుటచే జైనుఁడని వీరభద్రరావుగారు తలంచిరిగాని యాస్తుతి ప్రోలునిదిగాదు. అతని మంత్రిభార్యయగు మైళమాంబ గావించినది. మైళమయు, అమెపుట్టినింటివారును, భర్తయు జైనులని యాశాసనమున స్పష్టముగఁ గలదు. దీనితో ప్రోలరాజునకు సంబంధములేదు. అందుచే నీశాసనము రెండవప్రోలుని మతని రూపణమున కుపకరింపదని మున్నే చెప్పియుంటిని. ఇపుడు రెండవ ప్రోలుఁడేకాక ఆతని పూర్వులుసైతము ఆర్యమతమువారను బలవత్తరములగు ప్రమాణాలు లభించినవి.

రెండవ బేతరాజునకు రెండవప్రోలరాజునకు గురువగు రామేశ్వరదీక్షితులచరిత్రము కొంత యీసందర్భమునఁ దెలిసికొనఁ గొన్ని యవకాశములు లభించినవి. రుద్రదేవుని యనుమకొండశాసనములో రామేశ్వరదీక్షిత

5. అనుబంధము 5వ నంబరు శాసనము.

ప్రశంసగలదు. స్థూలదృష్టి నీభాగమునుగాంచి పల్వురుశాసనగ్రంథకర్తలు రామేశ్వరుడనిభ్రమపడిరి. రుద్రదేవునకుఁ జాలకాలమునకు ముందే రామేశ్వరదీక్షితుఁ డుండెను. శాసనగ్రంథకర్త రామేశ్వరదీక్షితునికుమారుడు సద్వయామృతయతి శిష్యుఁడునగు అచింతేంద్రవరుఁడు. శాసనగ్రంథకర్తయగు అచింతేంద్రవరుడు రుద్రదేవుని సమకాలికుఁడుగాన నతని తండ్రి రామేశ్వరదీక్షితుఁడు ప్రోలరాజుకాలమువాఁడనుట స్పష్టము. రెండవబేతరాజు ఉత్తరకాలమునను, రెండవప్రోలుని మధ్యకాలమున నీరామేశ్వరదీక్షితుఁ డుండుటవలననే దరగాశాసనమున రామేశ్వరదీక్షితునకుఁ బాదప్రక్షాళనము గావించి రెండవబేతరాజు దానము లొనరించుట పొసఁగినది. రామేశ్వరదీక్షితుఁడు వైదికమతమువాఁడుగావున నాతని పాదములను గడిగి దానమొనర్చిన రెండవబేతరాజును వైదికమతమువాఁడే. కాన రెండవ బేతరాజుకాలమునుండి కాకతీయులు తప్పక వైదికమతము వారనియే విశ్వసింపవలయును. రామేశ్వరదీక్షితుని చరిత్రము ఒకశాసనఖండమున వ్రాయబడియున్నది.[6] ఈశాసనము కాకతి రెండవప్రోలునినాఁటిది. మాదిరెడ్డికుంటయను ననుమకొండ చెఱువునందుఁగల ఱాళ్ళు పరిశోధించుతఱి నీశాసనశిల మాకు గోచరించినది. స్థానికప్రముఖులసహాయమున ఱాయి నిలువఁబెట్టి ప్రతిగైకొంటిమి. ఈశిలయొక్క పయిభాగము విఱుగఁగొట్టఁబడుటచే ముందుఁగల చరిత్రాంశములు తెలియకున్నను రామేశ్వరదీక్షితుని చరిత్రము, వైదుష్యము, కాలము గ్రహింప నీశాసన మెంతయో సహకారికాఁగలదు. రామేశ్వరదీక్షితుఁడు మహావిద్వాంసుఁడు. ఈయన యొకయాలయము గట్టింపఁగ దానికి త్రిభువనమల్లుఁడు (బేతరాజు) తండ్రిగాఁగల వాఁడు (ప్రోలరాజు) దానముగా శివపురము సమర్పించినాఁడు. రామేశ్వర దీక్షితుఁడు మాహేశ్వరగ్రామణి, అనఁగా శైవుఁడు. శాస్త్రసిద్ధాంతమున కాయన ప్రమాణభూతుఁడు. ఈయనశిష్యుఁడే కాకతీయప్రోలరాజు. ఈప్రోలరాజు చలమర్తిగండబిరుదాంకుఁడు. ఈయన స్తంభమును స్థాపించినాఁడు.

ఇందుఁ బేర్కొనఁబడిన ప్రోలరాజు రెండవ ప్రోలరాజే. రామేశ్వరదీక్షితుని కుమారుఁడు రుద్రదేవునికాలమునందుండుటవలనను, రెండవ బేతరాజుకాలమునఁగూడ రామేశ్వరదీక్షితుఁ డుండి యతనివలనఁ బాదపూజలు గాంచుటవలనను, ఈశాసనము రుద్రదేవుని శాసనలిపిని సర్వవిధములఁ బోలినందునను, వక్ష్యమాణ ప్రోలరాజు రెండవప్రోలరాజనుట నిర్ధారితము. ఇంతకుఁ దేలిన నిర్ధారణాంశము బేతరాజు కాకతి (రెండవ) ప్రోలరాజు శైవులు. వీరలు శివాలయములకు శైవమతాచార్యులకు విశేషించి తోడ్పడి ఆలయప్రతిష్ఠలు గావించిరి. ప్రోలరాజు బ్రాహ్మణశిష్యుఁడుగానను, ఆబ్రాహ్మణుఁడగు రామేశ్వర దీక్షితుఁడు మహేశ్వరగ్రామణి కావునను, బేతరాజునకుఁ రామేశ్వరదీక్షితునకు సంబంధముగలదు గానను, కాకతీయులు రెండవబేతరాజు కాలమునుండి

6. శ్లో॥ భారద్వాజకులశ్రియః పరివృఢశ్రౌతక్రియాకర్మఠః
శ్రీ రామేశ్వర దీక్షితో జనయితా యస్య క్షితౌ వగ్రిణీః
సోఽచింతేంద్రవరోఽద్వయామృతయతేశ్శిష్యో యుతశ్రద్ధయా
శ్రీమద్రుద్రనరేశ్వరస్య సుమతేర్వంశావళిం వ్యక్తయో॥

శైవులని నిష్కర్షగాఁ దెలుపవచ్చునని మా తలంపు.

కాకతీయవంశము విచ్ఛిన్నమగుటచే సేనానులు తమబిడ్డల నొవంగి రాజవంశము నిలిపినటులఁ గూడూరుమాటేరుశాసనములలోఁగొన్ని సూచనలు కలవు.[7] వీనిలోని రెండవబేతరాజును గామమ్మసాని కని కాకతీయ సామ్రాజ్యమునకు రాజునుజేసెననియుఁ, బేతని రాజుచేతఁ బెట్టి, పల్లవులవిజృంభణము నడంచెననియుఁ, దన కాన్పును కాకతి రాజునుజేసి కాకతీయవంశము నిల్పుట కోటిసేయుననియుఁ దోఁచుభావము విమర్శింపవలసియున్నది.

ఎట్లైన నేమి ఉపలబ్ధశాసనాధారములవలనఁ గాకతీయచరిత్రమునఁ గొందఱుప్రసిద్ధుల వృత్తములు దెలసినవి. ఈవంశమున రెండవబేత రాజునకుఁ బూర్వముఁ గూడ రాజ్యప్రతినిధిత్వము గలదనియు, వీరల చరిత్రములోఁ జాళుక్యరాజుల కెంతకాలమునుండియో సంబంధము గలదనుటయు వాస్తవము. కాకతీయులెన్నఁడు జైనులో ఎన్నఁడు శైవులో గ్రహించుట కింకను శాసనపరిశోధన మవసరము. కాకతిపురము అనునామము తొలుతఅనుమకొండకును, బిమ్మట రాజధాని మారినపిదప వరంగల్లునకును నున్నటుల శాసనములందు గలదు. ఈనామాంతరము కాకతీయు లేర్పఱచినదే. తొమ్మిదవశతాబ్దమునకుముం దీభాగమును రాష్ట్రకూటులు, పశ్చిమచాళుక్యులు పాలించుచున్నందునను, రెండవబేత రాజుకాలమునుండి కాకతీయులు శైవులని తెలియుటవలనను, కాకతిపురము వ్యవహారము తొమ్మిదిపదిశతాబ్దములలోనిదేయనియు, గణపతిదేవాదులు పరంపరగ నామమునే వ్యవహరించిరనియుఁ, ప్రతాపరుద్రదేవుని కాలమున నాపేరు ఆకారణముననే ప్రతాపరుద్రయశోభూషణమునఁ గూడఁ జేర్పఁబడెననియుఁ దెలియుచున్నది.

కాకతీయుల కులనిరూపణమున కిదివఱకు లభించిన సందిగ్ధాంశములేగాని కొత్తవి లభింపలేదు. రెండవప్రోలరాజునకు చలమర్తిగండబిరుదము గలదు. ఇది [రెండవ] ప్రతాపరుద్రునివఱకుఁ బరంపరగా వచ్చినటుల గ్రంథాంతరములందును, శాసనాంతరములందును నాధారములు గలవు.

మొదటిప్రోలరాజు త్రైలోక్యమల్లదేవునకు లోఁబడినవాఁ డనుసూచన ఉదాహృతశ్లోకములయందుఁ గలదు. త్రైలోక్యమల్లదేవునిశాసనములు ఆలంపూరులో మూఁడును, గంగాపురములో నొకటియుఁ, డాకూరులో నొకటియుఁ గనిపెట్టినారము. ఇందొకటియగు డాకూరులోని త్రైలోక్యమల్లునిశాసనము శా.శ. ౧౦ ౧వ త్రైలోక్యమల్లరాజ్యసంవత్సరములు ఆంగీరస అనుకాలనియతి గలది. ఈత్రైలోక్యమల్లదేవుఁడు చాళుక్యపెమ్మాడియని యుపనామముగలవాఁడు. శాసనకాలము ఆంగ్లమానముచే ౧౦౫౧ అగును. ఇది దాదాపుగ మొదటిప్రోలరాజు కాలమునకుఁ గలియునుగాన త్రైలోక్యమల్లునకు మొదటి ప్రోలునకు సంబంధము సరిపడుచున్నది.

రెండవ బేతరాజుచే సర్చితుఁడగు రామేశ్వరుని చరిత్రము కొంత గ్రహించితిమి. అష్టేయాచార్యుఁడగు మల్లికార్జున కాలాముఖాచార్యుని వివరములు గూడఁ గొంత గ్రహింపవలసి యున్నది. తపోరాశి శిష్యుఁడును, కారా

7. ఈ శాసన ప్రతిబింబము మం.లివారొద్ద గలదు. దీని మూలము J. A. H. R. S. VIII- Pt I P. 32. లో ప్రకటింపబడినది. సంపాదకుడు.

ముఖమఠాధికారియునగు మల్లికార్జునుఁ డను ప్రసిద్ధుఁ డొకఁడు గలఁడు. ఈయన క్రీ.శ. 1050 ప్రాంతమున వనవాసియందు మఠము నెలకొల్పెను పశ్చిమచాళుక్యులు, చోడులు మల్లికార్జునుని సాదరగౌరవములతోఁ బూజించిరి. ఈయనగురుడగు తపోరాశివిగ్రహము అలంపురియందుఁ గలవు. అచటిశాసనములలో విశేషించి సూర్యరాశి, తపోరాశి, తేజోరాశి మున్నగు కాలాముఖాచార్యుల ప్రశంసయు, వారిని చాళుక్యులు పూజించినవిధము పేర్కొనఁబడినది. రెండవబేతభూవల్లభుని కాలమున మిగులబ్రసిద్ధుఁడుగనున్న కాలాముఖాచార్యుడగు మల్లికార్జునుఁ డీయనయనియే విశ్వసింపవచ్చును. దాదాపుగ సీబేతనృపుని కాలముతో నీతనికాలము గూడ సరిపోవుచున్నది. ఈమల్లికార్జునునిగూర్చి యుదాహరించిన యంశములు కుమారసంభవపీఠికనుండి రచించితిమి.

అజ్ఞాతముగానున్న కాకతీయచరిత్రమున గొన్నియంశము లిప్పటికి నిర్ణీతములైనవి. ఇంక దెలిసికొనవలసిన యంశము లివి- కాకతీయులు రాజప్రతినిధులుగ నెన్నటినుండి ఓరుగల్లు ప్రాంతమునందుఁ బేరొందిరి? వీరలకు రాష్ట్రకూటులతోను చాళుక్యులతోనుగల సంబంధము లెట్టివి? దుర్జయునకును మొదటిబేతరాజునకును మధ్యగల పురుషాంతరములెన్ని? వారి ప్రసిద్ధియెట్టిది? కాకతీయు లేనాఁడు జైనులు, ఏనాడు శైవులు? కాకతిపురము అనుపురిని నివసించుటచేతనే వీరు కాకతీయులుగా బరిగణింపఁ బడిరా? కాకతిదేవతను గూర్చి జైనగ్రంథము లేమని చెప్పుచున్నవి? మున్నగునవి.





రాయచూరు దుర్గము—మరియొక దృశ్యము.

[ Bycourtesy of H. E. H. The Nizam's Archaeological Department.]

# గద్వాల సంస్థానము.*

శ్రీయుత మారేమండ రామారావుగారు ఎం. ఏ., బి. ఇడి.,

## I. చరిత్రము.

అనేకవందలసంవత్సరములనుండియు విద్వత్పోషణమునకును, వితరణా విభవమునకును, విశేషవిఖ్యాతి గాంచిన గద్వాలసంస్థానమాధునికాంధ్రసంస్థానములలో నగ్రగణ్యము. ఇయ్యది ప్రకృతమున నైజాంరాజ్యాంతర్గతమై కృష్ణాతుంగభద్రానదుల మధ్యగలభాగమునందున్నది. దీని కుత్తరమున మహబూబునగర మండలమును, తూర్పున కృష్ణయు, దక్షిణమున తుంగభద్రయు, పశ్చిమమున రాయచూరు మండలమును నెల్లలు. ఈ సంస్థానపు వైశాల్యము 1200 చదరపు మైళ్ళు. జనసంఖ్య 110000. ఈ యాంధ్రరాజ్యము సుప్రసిద్ధపాకనాటికులజులగు రెడ్డిరాజులవరిపాలనమునందున్నది.

### ఉత్పత్తి.

గద్వాల సంస్థానము కాకతీయ సామ్రాజ్యమునుండి యుద్భవించినది. క్రీ. శ. 1290 ప్రాంతమున గాకతిరుద్రాంబయు బ్రతాపరుద్రుడును గలసి రాజ్యముచేయుచుండిన కాలమున రాయచూరు దోఆబ్‌ను, గర్నూలు మండలము నరణ్యావృతములై యుండగా, నీప్రాంతమునందలి కాకతీయసామంతులును, సేనాలు నీభూభాగమును కృషియోగ్య మొనర్చిరి. ఇట్టివారిలో గోనవంశీయులు ముఖ్యులు. వీరిలో మువ్వురు సోదరులీకాలమున గాకతీయసామ్రాజ్యపు దక్షిణదిశనధికారము చేయుచుండిరి. గన్నయరెడ్డి వర్ధమానపురమునను, విఠ్ఠలనాథుడు రాయచూరు బళ్ళారి మండలములను, కాటరెడ్డియు నాతని పుత్రుడగు ఇమ్మడి కాటారెడ్డియు రాయచూరు దోఆబ్‌పైనను అధికారులై యుండిరి. వీరందరును కాకతీయసామంతులే. అడవులను నిర్మూలించి భూమిని వాసయోగ్యముగ జేయుటలో ఇమ్మడికాటారెడ్డికి ఐజగ్రామనివాసియగు బుద్ధారెడ్డి లేక పోలవిరెడ్డియను నతడు మిక్కిలి సహాయమొనర్చెను. అందుచే నీ కాకతీయసేనాని ప్రతాపరుద్రునిచే క్రీ. శ. 1290 లో పై బుద్ధారెడ్డికి మానవ, బెళుదోణి, రాయచూరు, మోసలకల్లు, అలంపురము, ఆదోని, ఐజ అను ఏడుసీమలపై నాడగౌడరికము నిప్పించెను. ఇంతటినుండియు బుద్ధారెడ్డియు నాతని సంతతివారును 'ఐజనాడ గౌడు'లని ప్రసిద్ధి నందిరి.

### నాడగౌడరికము.

క్రీ. శ. 1323 లో కాకతీయ సామ్రాజ్యము నశించినపిమ్మట నాంధ్రదేశమునందెన్నియో చిక్కులు గల్గినవి. అప్పుడచ్చటి సామంతులచటనే స్వతంత్రులైరి. ఆసందర్భమున నీ యైజనాడగౌడులు స్వస్థలమును వీడి, కర్నూలు మండలములోని గోసునూరనంతాపురమునకు బోయి, యచటి పాలకులగు విడెము వంశీయులకు సామంతులైరి. ఈ కర్నూలు మండలమున నంద్యాల మున్నగు దక్షిణభాగ

*శ్రీ గద్వాల మహారాణీ సాహేబావారి యాజ్ఞానుసారము నేను రచించిన "గద్వాలసంస్థాన చరిత్రము" నకీవ్యాసము సారాంశము. ॥మా । రా॥

ము విజయనగరరాజుల స్వాధీనమయ్యెను. క్రీ. శ. 1344 లో హరిహరుడును, ప్రతాప రుద్రుని పుత్రుడగు కృష్ణనాయకుడును ఏక శిలానగరమును ముట్టడించి స్వాధీనము చేసి కొనినప్పుడు పై ఐజనాడగౌడులుగూడ వారికి దోడ్పడిరి. దానికి ప్రతిఫలముగ కర్నూలు మండలమున పశ్చిమమున గొన్నిగ్రామముల పై వీరికి నాడగౌడరికము హరిహరునిచే నొసంగబడెను. కాని క్రీ. శ. 1347 లో బహమనీసుల్తానులు బయల్వెడలి రాయచూరు దోఆబ్‌ను, కర్నూలు మండలమునందలి పడమటి భాగమును జయించుటచే ఐజనాడగౌడులు బహమినీ సుల్తానులకు సామంతులైరి. ఇప్పటినుండి సుమారు క్రీ. శ. 1500 వరకును సుల్తానులకును, విజయనగరరాజులకును దోఆబ్‌నుగూర్చి యనేక యుద్ధములు జరిగియుండినను, మహమ్మదీయులే ఆభూమిపై దమయధికారమును సాగించుచుండిరి. క్రీ. శ. 1489 లో బిజాపురరాజ్యము బయల్వెడలి యాప్రాంతమును స్వాధీనముచేసికొనుటచే నీ ఐజనాడగౌడు లారాజ్యమునకు సామంతులైరి. క్రీ.శ. 1500 నాటికి వీరు తిరిగి ఐజప్రాంతమునకేగి పూర్వపు నాడగౌడరికమును సంపాదించిరి. హరిహరుడు వీరికి కర్నూలులో నొసంగిన యధికారములు బిజాపురసుల్తాను లాగికొనెను. క్రీ. శ. 17 వ శతాబ్ది ప్రారంభమున పెద్దారెడ్డి యను నతడు ఐజకందనూలు (కర్నూలు) సీమలకు నాడగౌడుగానుండెను. ఇతడు పూడూరు సీమకు నాడగౌడుగ నుండిన వీరారెడ్డియను నతని కూతురు బక్కాంబను బెండ్లాడి యా సీమకుగూడ నధిపతి యయ్యెను.

పెదసోమభూపాలుడు.

క్రీ. శ. 1663-1713 నడుమ పెదసోమభూపాలుడు తనతండ్రి పెద్దారెడ్డియనంతరము నాడగౌడరికమునకు వచ్చెను. బుడ్డారెడ్డి యైజనాడగౌడరికమును సంపాదింప నీశూరుడు ప్రకృతగద్వాలసంస్థానమును నిర్మించెను. ఆకాలపుపాళెగాండ్లలో నీతడు ప్రబలుడు నగ్రగణ్యుడునై యుండెను. మాతృకమగు పూడూరుగ్రామమునందలి కోటను బాగుచేయించుచుండగా నితని కొకనిక్షేపము దొరకెను. గురవ్వయ్యయను తనగురువుసాయముతో నీరాజు దానిని బొందెను. పేరునకుమాత్ర మీతడు బిజాపురసుల్తానుకు సామంతుడుగనుండినను, స్వాతంత్ర్యమును బ్రకటింప నుద్యుక్తుడై యుండెను. అదేసమయమున మొగలుచక్రవర్తియగు ఔరంగజేబు దక్కనులోని అహమద్‌నగర్, బిజాపూర్, గోల్కొండమున్నగు మహమ్మదీయరాజ్యములను సంపూర్ణముగ జయించుచుండెను. అందు ప్రబలమగు బిజాపురమును ధ్వంసమొనర్చుటలో నారాజ్యసామంతుడగు సోమభూపాలునితో ఔరంగజేబు మైత్రి యొనర్చుకొనెను. దీనిని యూతగగొని సోమభూపాలుడు 1686-87 ప్రాంతముల దన స్వాతంత్ర్యమును బ్రకటించెను. ఇంతటితో దృప్తి నందక నీరాజు బన్గానిపల్లె, సిరివెళ్ళ, నంద్యాల, సిరిగుప్ప, సిద్ధాపురం, భండాత్మకూరు, అహోబిలము, అదవేని మున్నగు సీమలను జయించి తనయధికారమును విస్తరించెను. దీనితో నతనికి శత్రువులెక్కుడైరి. అంత నితడుశిథిలమగు పూడూరుదుర్గము క్షేమకరముగాదనియెంచి క్రీ. శ. 1698-1705 నడుమ పూడూరునకైదుమైళ్ళ దూరమున విశాలమగుబయలులో బలిష్ఠమగు నొకకోట నుగట్టించి, దానికి 'గద్వాల' యనిపేరిడి తనని వాసము నచటికి మార్చుకొనెను. అప్పటికి బిజాపురరాజ్యము ఔరంగజేబుచక్రవర్తిచే పూర్తిగ జయింపబడెను. ఆసందర్భమున దనకొనర్చిన

యుపకారమునకుబదులుగ నాచక్రవర్తి సోమభూపాలునికి "రాజ" బిరుదమును లాంఛనములనేగాక, నదివరలోనాతడు జయించిన బంగానిపల్లె, కర్నూలుసీమలలో ఆరుమహాలులపై సర్వాధికారము నొసంగెను. ఇందుమూలమున రాయచూరుదోఅబ్‌లోని తూర్పుననుండుసగముభాగమేగాక కర్నూలుమండలమునందలి విశేషభాగముగూడ సోమభూపాలునికి స్వాధీనమయ్యెను. ఇట్లుండగా ఔరంగజేబుచక్రవర్తి మరణించెను. అతనివెనుక మొగలుసింహాసనమునకువచ్చిన బహదూర్షా బలహీనుడుగనుండుటచే దక్కనులో మొగలుల సుబేదారుగనుండిన నైజాముల్‌ముల్కు విజృంభింపసాగెను. క్రీ. శ. 1709-1712 నడుమ రెండున్నరసంవత్సరములకాలము కర్నూలుదుర్గము సోమభూపాలుని యాధీనమునందుండెను. నైజాముల్‌ముల్కు దీనిని స్వాధీనముచేసికొనుటకై దిలీల్‌ఖానను సర్దారునుబంపెను. ఈభామకును సోమభూపాలునికిని నిడుమూరుమిట్టలవద్ద యుద్ధముజరిగి క్రీ. శ. 1712. నందనసంవత్సర జ్యేష్ఠ శు౮ నాడు గద్వాలసోమభూపాలుడందుమరణించెను. ఈవీరశిఖామణికి మతవిషయములలోగూడ మిక్కిలిశ్రద్ధయుండెడిది. మాతామహస్థలమగు పూడూరులో నుండగనే యితడచటి కేశవస్వామియాలయము నుద్ధరించెను. గద్వాలదుర్గమును నిర్మించినపిమ్మట నీరాజచటను మరియొకకేశవాలయమునుగట్టించెను. మున్నితడు నిక్షేపమును బొందుటకై కేశవుడనుబ్రహ్మచారిని బలియొసగిన దోషమువోవుటకై యాదేవళము నిర్మింపబడెనని కొన్ని యాధారములలో గలదు. ఏమైనను సోమభూపాలుడు తన సర్వస్వమును కేశవునికర్పించి యాతని పక్షమున దాను రాజ్యకార్యములను నిర్వహించుచుండెను. వీరధర్మమునను రాజకీయములయందును, భగవద్విషయములలోనేగాక యీరాజుకు కవిత్వమునగూడ ప్రశంసనీయమగు ప్రావీణ్యతయుండెడిది. జయదేవకవి సంస్కృతమున రచించిన గీతగోవిందకావ్యము నీతడు తెనుగుచేసి, ప్రతిశ్లోకమునకు నొకపద్యమును, ప్రతియష్టపదికి నొకచూర్ణికను రచించెను. ఈవిధమున పెదసోమభూపాలుడు గద్వాలరాజ్యమును స్థాపించి దానిని తాత్కాలిక సంస్థానములలో సగ్రగణ్యముగ నొనర్చెను.

### లింగమ్మరాణి

ఈతని యనంతర మీతని పుత్రుడు తిరుమలరాయుడు బాలుడగుటచే వెంకన్న, రమణయ్య యను నుద్యోగులు నటుపై నీతని భార్యలగు అమ్మక్క, లింగమ్మ యను రాణులును రాజ్యకార్యములను నిర్వహించిరి. క్రీ. శ. 1725-1738 నడుమ గద్వాలనేలిన లింగమ్మరాణి కాలము మిగుల ముఖ్యమైనది. ఇప్పటి కీమెయధికారము కర్నూలుమండలములోని మరికొంతభాగమునకును, బళ్ళారిలోని ఆదోనిసీమకును వ్యాపించినది. మొగలులింకను గద్వాలవారి సాహాయ్యమును గోరుచునేయుండిరి. ఈకాలమున గొప్పకాటకమొకటి సంభవింపగా జనులెందరో లింగమ్మరాణి దానధర్మములను, దయామయత్వమును గూర్చి విని, గద్వాలకు వలసవచ్చిరి. ఈదీనులనెల్లర నీరాణి యాదరించి యనేక సౌకర్యముల నొనగూర్చెను. క్రీ. శ. 1723 లో దక్కను సుబేదారగు నైజాముల్ ముల్కు స్వతంత్రుడై హైదరాబాదులో "నైజాం" అను బిరుదముతో నొక ప్రత్యేకరాజ్యమును స్థాపించెను. తమ కింతవరకును మిత్రులుగనుండిన మొగలులు క్షీణించుటను, పరిసరములనేలు కర్నూలు సవనూరు నబాబులు మున్నగు

వారు శత్రువులుగనుండుటను గుర్తించి, యీ రాష్ట్ర నైజాముతో మైత్రిని బాటించి, యాతని యధికారము నంగీకరించెను. ఈమెకు పిమ్మట నీమె పుత్రుడు తిరుమలరాయుడు మూడేండ్లు పరిపాలించెను.

రామరాయుడు

పిమ్మట తిరుమలరాయుని తమ్ముడగు రామరాయుడు రాజ్యమునకు వచ్చెను. గద్వాల రాజ్య మీతనికాలమున (క్రీ.శ. 1746-1761) మిక్కిలి యభివృద్ధినందెను. 1745 ప్రాంతమున కర్ణాటకసింహాసనమును గూర్చి యొదవిన అర్కాటుముట్టడిలో బాల్గొనిన నైజాముకు రామరాయుడు సాయముచేసెను. ఆయుద్ధమునుండి మరలునపుడు నైజాము సేనానియు, గర్నూలునబాబు నొకరినొకరు హత్య చేసికొనిరి. ఈయదనున క్రీ.శ.1746 లో గద్వాల రామరాయుడు కర్నూలుదుర్గమును స్వాధీనముచేసికొని, యథాపూర్వముగ నాడగౌడు, సర్నాడగౌడు, సర్ సర్నాడుగౌడు రుసుములను వసూలుచేయుచుండెను. క్రీ. శ.1752 లో నైజాముచే పంపబడిన మహమ్మదలంకు రామరాయుడు కర్నూలును స్వాధీనముచేసెను. కాని యీక్రొత్తనబాబు తనదివాను ప్రేరణచే గద్వాలవారి నాడగౌడగి మున్నగు హక్కులను త్వరలోనే లాగికొనెను. దీనికి ప్రతీకారమొనర్ప నవకాశమునకై రామరాయుడు వేచియుండెను. ఇంతలో మరణించిన కర్నూలునబాబు తమ్ముడు రణమస్తుఖానను నతడు గర్నూలుపై దండెత్తి, పూర్వపుటధికారముల నొసంగెదననియు, గర్నూలుదుర్గమును స్వాధీనము చేయుమనియు రామరాయునికి రాయబార మంపెను. ఈరాజునట్లొనర్చెను. ఇందుమూలమున గద్వాలరాజులకు కర్నూలు జిల్లాలోని జేతంచెర. రంగాపురము, కొలుమలపల్లి, ముద్దవరం. బుగ్గానిపల్లె, ఎర్రగుంట్ల, ఎంబావి మున్నగు 19 నూతన గ్రామములపై నాడగౌడరికము లభించెను. ఈరామరాయడు క్రీ. శ. 1761 లో మరణించెను.

చిన్న సోమ భూపాలుడు

పిమ్మట రామరాయుని యన్న తిరుమలరాయుని పుత్రుడగు చినసోమ భూపాలుడు రాజ్యమునకు వచ్చెను. ఈ రాజు మహావీరుడును, రాజ్యతంత్రజ్ఞుడునై యుండెను. తన పినతండ్రి రాజ్యకాలముననే యీతడు తన సైన్యములతో నైజామునకు దోడ్పడి యాతనివలన 2000 రూప్యములను బహుమానముగ బొందెను. రాజ్యాభిషిక్తుడయిన పిమ్మట నితనికి నైజాంసలబత్ జంగు కర్నూలులో 2 మహాలుల పైనను, ఆదోనిలో రెండిటిపైనను, నంద్యాలసీమలో 15 పైనను, మొత్తము 19 మహాలులపై నాడగౌడు, సర్నాడగౌడు, సర్సర్నాడగౌడు అధికారముల నొసంగెను పిమ్మట సోమభూపాలుడు తనరాజ్యమును విశేషముగ విస్తరింపజేసెను. అమరచింత సంస్థానములోని కొన్ని గ్రామముల నీతడు యుద్ధసమయములలో విశేషసాహాయ్యము చేయు పద్ధతిని గుత్తకు దీసికొని తన కతిసమీపమునందున్న రాజోళిసీమ నాక్రమించెను. క్రీ. శ. 1773 లో నైజామునకును పోరాపుర రాజునకును జరిగినయుద్ధములో నైజాము సేనానియగు అమీర్ ఉల్ ఉమ్రాకు మిక్కిలి తోడ్పడెను. ఇందుమూలమున నైజామునకు సోమభూపాలునియెడ గౌరవ విశ్వాసములు పెరిగి యాతడు రాయచూరు, బళ్ళారి, సుబేదార్లు మున్నగువారికి సోమభూపాలుని యాజ్ఞలను వారు చెల్లింప వలెననియు, నతడు వారితో జేయు నొడంబడికలకు దాను బద్ధుడగనుండుననియు పర్వానాలను బంపించెను. ఇటు

పైన గద్వాల సంస్థానమునకు గొన్ని యిబ్బందులు గలిగినవి. ఇప్పటికి మహారాష్ట్రులు దక్కనులో ప్రబలిరి. నైజాముగూడ వారితో సంధిచేసికొని తనరాజ్యమున చౌతును వసూలుచేయు నధికారము వారి కొసంగెను. ఇందు మూలమున నైజాంరాజ్యమున ద్వంద్వప్రభుత్వమేర్పడినది. సోమభూపాలుని కీ మహారాష్ట్రులు ప్రక్కలోని బల్లెమువలెనుండిరి. ఇదే సమయమున కర్నూలునవాబు గద్వాలవారి నాడగొడగి మున్నగు హక్కులను రద్దు చేసి క్రీ.శ. 1773_1775 నడుమ ఎంబాయి, రంగాపురము, సిరివెళ్ళ, ఎల్లగుంట్ల, బేతంచెర్ల, కోములపల్లె, బుగ్గానిపల్లె మొదలగు గ్రామముల నాక్రమించెను. వ్యాధిగ్రస్తుఁడుగ నుండుటచే చినసోమభూపాలు డిందులకు ప్రతీకారము జేయులే కుండెను. ఈ రాజు క్రీ. శ. 1794లో మరణించెను.

ఆంధ్రవాఙ్మయాభివృద్ధికి చినసోమభూపాలుని రాజ్యకాలము మిక్కిలి ముఖ్యమైనది. సమకాలికు లీతని నభినవభోజుడని కొనియాడుచుండిరి. ఈరాజు రచించిన రతిరహస్యమను శృంగారగ్రంథము ప్రశంసనీయము. ఈతని యాస్థానమునం దెందరో కవులుండి చక్కని గ్రంథములను రచించిరి. వారిలో నెన్మండుగురు ముఖ్యులు. (1) కాణాదము పెద్దన సోమయాజి యనునత డాత్రేయసగోత్రుడు. వేదశాస్త్రపురాణములను కరతలామలకములజేసికొనిన యీకవి ఆశు, చిత్ర, బంధ, గర్భములను చతుర్విధకవితలను జెప్పనేర్చినవాడు. భోజుని చంపూరామాయణమునకు వ్యాఖ్యానమునురచించెను. సురపుర సంస్థానమునుండి యాంధ్రమత్స్యపురాణమును, గద్వాలసంస్థానమునుండి భద్రాపరిణయమును, ఆధ్యాత్మరామాయణమును, యథాశ్లోకతాత్పర్యరామాయణమునందలి బాలకాండమును, రచించెను. (2) కిరీటి వెంకటాచార్యుడను శ్రీవైష్ణవకవి "సర్వతంత్రస్వతంత్ర కవితార్కికకంఠీరవ, శ్లేషయమకచక్రవర్తి" యను బిరుదములు గలవాడు. అలంకారకౌస్తుభము, జంఝామారుతము, శృంగారలహరి, భావశతకమున్నగు సంస్కృతగ్రంథములును, అచలాత్మజాపరిణయమను నాంధ్రద్వ్యర్థికావ్యమునీతని గీర్వాణాంధ్రభాషాపాండిత్యమును దెల్పుచున్నవి. (3) కొత్తపల్లి రామాచార్యులను మఱియొక శ్రీవైష్ణవకవి యథాశ్లోకతాత్పర్య రామాయణమునందలి యయోధ్యాకాండమును రచించెను. (4) గార్గేయపుర సుబ్బశాస్త్రి యనుకవి "ఉభయకవితాసన్నాహయసాహితీధురణ" బిరుదాంకితుడు. ఇతడు రామాయణారణ్యకాండమును తెనుగుచేసెను. (5) "విద్వత్కవికుంజర" బిరుదాంకితుఁడగు కామసముద్రం అప్పళాచార్యుడు వివిధబంధముల కవిత్వమును జెప్పి సంస్కృతప్రాకృతముల లో కావ్యములను రచించినవాడు. యథాశ్లోకదాత్పర్యరామాయణమునందలి కిష్కింధకాండమును రచించెను. (6) తిరుమల కృష్ణమాచార్యుడనుకవి "అష్టభాషాకవితాదురంధరుడు". రామాయణ సుందరకాండము నాంధ్రీకరించెను. (7) బోరవెల్లి శేషకవి రామాయణ యుద్ధకాండమును రచించెను. (8) సోమనాథశాస్త్రికవి. ఈవిధమున చినసోమభూపాలుని కాలమున నాంధ్రగీర్వాణ వాఙ్మయము లభివృద్ధి నందినవి.

రెండవ రామరాయడు.

పిమ్మట రెండవరామరాయడు గద్వాలరాజ్యమునకు వచ్చెను. ఇతడు క్రీ. శ. 1794-1806

నడుము రాజ్యమేలెను ఈకాలమున గొన్ని ముఖ్యకార్యములు జరిగినవి. ఇతడు రాజ్యమునకు వచ్చుటకు గొంచెము ముందుగ మనూరుద్దౌలా యను నైజాంసేనాని, గద్వాలసంస్థానములోని గట్టుదుర్గముపై దాడివెడలెను. ఇందులకు గద్వాలవారు కొంతకాలము నుండి పేష్కషును చెల్లింపకుండుటయేకారణము. అప్పుడు రామరాయుని దివాను హైదరాబాదుకుపోయి 11 లక్షలరూపాయిలను పాతబాకీగానిచ్చి, యటుపై సంవత్సరమునకు 2 లక్షలనొసంగుట కంగీకరించి, గట్టుదుర్గమును తిరిగి సంపాదించెను. దీనికి ఫలితముగ క్రీ. శ. 1800లో నైజాము రామరాయునికి "రాజా, భూపాల్, బహద్దర్" మున్నగు బిరుదములను, వస్త్రాభరణాదులను బంపించెను. మరి యారుసంవత్సరములకీ రాజు మరణించిన పిమ్మట వారసత్వమునుగూర్చి కొన్నివివాదములును, కల్లోలములును జరిగినవి. తుదకు రామరాయుని యంత్యశాసనము ననుసరించి, యతని మేనమామపుత్రుడగు సీతారామరెడ్డి గద్వాలరాజ్యమునకు సీతారామ భూపాలుడను పేరుతో వచ్చెను.

రాజరామభూపాలుడు.

క్రీ. శ. 1807-1840. నడుమనుగల సీతారామభూపాలుని రాజ్యకాలము ప్రశాంతముగ జరిగిపోయెను. గద్వాలపేష్కషును గూర్చి యితనికిని నైజామునకును గొంత చర్చ జరిగి తుదకది 115000 రూపాయలుగ నిర్ణయింపబడెను. పిమ్మట నీరాజు దత్తపుత్రుడగు మూడవసోమభూపాలుడు రాజ్యమునకు వచ్చెను. నైజాము నిందులకంగీకరించెను. ఈరాజసమర్థుడును విషయలోలుడునునైయుండెను. సైనికులతోనితడు వివాదపడుటచే వారు 3—6—1840 తేదీని దర్బారులో బహిరంగముగ నీరాజును కాల్చివేసిరి. అంత నీతని తల్లియగు రాణీవెంకటలక్ష్మమ్మ రాజ్యభారమును వహించి, క్రీ. శ. 1845లో తన మేనల్లుని దత్తుచేసికొని రామభూపాలుడనుపేరుతో గద్వాలసింహాసనమెక్కించెను. ఈరాజుకాలమున కృష్ణా తుంగభద్రానదుల మధ్యనున్న భాగముపై పేష్కషును నైజాం బ్రిటిషువారికొసగుటచే గద్వాలవారికి బ్రిటిషువారితో సంబంధమేర్పడెను. సిపాయీలకలహమిదేసమయమున జరిగినది. రాజు యువకుడైనను, పరిస్థితులుద్రేకజనకములుగ నుండినను, రాజమాతయగు రాణీ వెంకటలక్ష్మమ్మగారు స్థైర్యము వహించి తనపుత్రుని యీ విద్రోహమునం దేజోక్యమును గల్గించుకొననీయకుండెను. ఈకాలమున సంస్థానికుల పోలీసు, సివిల్, రెవిన్యూ అధికారములనుగూర్చి కొంత చర్చ జరిగినది గాని తుదకది సంస్థానికుల కనుకూలముగనే పరిష్కరింపబడినది. రామభూపాలుని కాలమున సంస్థానమెక్కుడుగ నభివృద్ధినందినది. ఈయన దోమకొండసంస్థానాధీశ్వరులగు శ్రీరాజా సోమేశ్వరరావు బహద్దరువారిపుత్రికయగు రామక్కమ్మగారిని మొదటి భార్యగను, మహబూబు నగరుజిల్లా తాటికొండ గ్రామములోని లక్ష్మీదేవమ్మగారిని ద్వితీయభార్యగను స్వీకరించి, వారివలన సంతతిగల్గకుంటచే తనసోదరపుత్రులగు వెంకటరామారెడ్డిగారిని పెంచుకొనెను. ఇందు రాణీ లక్ష్మీదేవమ్మగారు నేటికిని జీవించియున్నారు.

మహారాజా సీతారామభూపాల్.

క్రీ. శ. 1901 సంవత్సరములో పై వెంకటరామారెడ్డిగారు నైజామువారి యనుమతితో "మహారాజాసీతారామభూపాల్ బహా

ద్దర్" అను పేరుతో గద్వాల సింహాసన మధిష్ఠించిరి. వీరి పరిపాలనమున గద్వాలసంస్థానమనేకవిధముల నభివృద్ధి జెందినది. విద్వత్కవులెందరో వీరి యాదరమునకు బాత్రులైరి. అందు తిరుపతి వేంకటకవులును, కొప్పరపు కవులు నగ్రగణ్యులు. క్రీ. శ. 1912 లో జరిగిన ఢిల్లీదర్బారులో వీరికి గొప్ప సన్మానము జరిగెను. మహారాజావారు కర్నూలుజిల్లా ఉల్సలగ్రామములోని యొకగౌరవ నీయమగు రెడ్డికుటుంబమునుండి శ్రీ ఆది లక్ష్మీదేవమ్మ యను నామెను పరిణయమైరి. వీ రిర్వురకును శ్రీలక్ష్మీదేవమ్మ, వరలక్ష్మీదేవమ్మ యనుసిర్వురు పుత్రికలు జన్మించిరి. మహారాజాసీతారామ భూపాల్ బహద్దరువారు 1924 సంవత్సరము మేనెల 12 వ తేదీని దివంగతులైరి.

మహారాణీ శ్రీ ఆదిలక్ష్మీదేవమ్మ బహద్దర్ వారు.

అంతటినుండియు మహారాణీశ్రీ ఆదిలక్ష్మీదేవమ్మ బహద్దరువారు గద్వాల రాజ్యభారమును వహించుచున్నారు. కాకతీయ సామ్రాజ్యాంతర్గతమగు రాజ్యము నేలుచుండుటవలననో లేక నాంధ్రుల పూర్వపుణ్యవశముననో యీమహారాజ్ఞి యన్నివిధములను నాంధ్రరాజ్ఞీవతంసమగు కాకతిరుద్రాంబికను పోలియున్నారు. ఈమె సంస్థానకార్యములయందెక్కుడు శ్రద్ధవహించి స్వయముగ నెల్లవిషయములను చూచుకొనుచున్నారు. వీరు తమ ప్రథమపుత్రికను దోమకొండ సంస్థాన యువరాజగు శ్రీరాజా సోమేశ్వరరావు బహద్దరు వారికిచ్చి వివాహము చేసిరి. వీరికి శ్రీరాజా కృష్ణరామభూపాలరావ్ బహద్దర్ అను దౌహిత్రులు కలిగిరి. కాకతీయ రుద్రాంబికవలె మహారాణీవారీదౌహిత్రుని పుత్రవాత్సల్యముతో పెంచి విద్యనేర్పించుచు, ప్రతాపరుద్రదేవుని వలెనే వీరిని భావిగద్వాల పాలకుని జేయనై యున్నారు.

మహారాణీవారి శీల మాదర్శప్రాయము. సంస్థానాధీశ్వరియయ్యు నీమె సదా శ్రీచన్నకేశవపాదారవింద మధుకరాయమానమానసయై దినమున విశేషభాగము నాముష్మికచింతతో గడపుదురు. వీరిదర్శన మెల్లరకును సులభము. కష్టసుఖముల జెప్పికొనగోరు ప్రజలును, ఆశ్రయము నభ్యర్థించు విద్వాంసులును, సాహాయ్యము నపేక్షించు పరోపకారపరాయణులును, మహారాణీవారిసమక్షమున కసంఖ్యాకులుగ వచ్చుచు బోవుచుందురు. ఇందసంతృప్తులుగ మరలువా రుండరనుటలో నతిశయోక్తి యెంతమాత్రమును లేదు. కార్తికమాసమున విద్వాంసులకును, మాఘమాసమున కవిగాయకులకును జేయబడు సన్మానములీ మహారాజ్ఞి కాలమునందపూర్వతను గాంచినవి. వీని వైభవమును చూడవలెనుగాని వర్ణింప నలవిగాదు. ఈమెకాలమున గద్వాలకు "విద్వద్గద్వాల" యను నామము సార్థక మైనది.

ఇట్లు ప్రజానురంజకముగ రాజ్యము నేలుచు, సకలవిద్యలకును గల్పతరువై, సదా శ్రీ చెన్నకేశవ పాదారవింద మధుకరాయమానసయై,యాంధ్రరాజ్ఞీతిలకమై,యాంధ్రగౌరవాధినేతయై యొప్పు శ్రీ మహారాణీవారికిని, వారి ప్రియ దౌహిత్రులగు శ్రీరాజా కృష్ణరామ భూపాల్ బహద్దరు వారికిని, వారి కుటుంబమునకును సర్వేశ్వరు డాయురారోగ్యైశ్వర్యముల నొసంగుగాక.

## II. సంస్థానీకుల అధికారములు.

గద్వాల సంస్థానాధీశ్వరులకు స్వతంత్రపరిపాలనాధికారముగలదు. వీరికిని నైజాంరాష్ట్రమునందలి యితరులకును గల సంబంధముల

న మాత్రము నైజాంవారు పరిష్కరింతురు. సంస్థానన్యాయశాఖలోని యున్నతోద్యోగములు మాత్రము హైదరాబాదు హైకోర్టువారామోదింతురు. ఇతరోద్యోగు లందరిని సంసంస్థానికులే నియమించుకొందురు. కొలదికాలమువరకును "గద్వాలరూపాయలు" వ్యాప్తిలోనుండినవి. ఇటీవలినుండి బ్రిటిషురూపాయలు వాడబడుచున్నవి. నేటికి సిదియే ప్రమాణనాణెము. సంస్థానములోని భూస్వాములందరికిని సంస్థానమే Court of Wards అగును. 1895 వరకును సంస్థానమునకు ప్రత్యేకచట్టము లుండెనని. అప్పటినుండియు నైజాంప్రభుత్వమువారి చట్టములే యిచటను వర్తించుచున్నవి. రివిన్యూవిషయమునకూడ వీరికి విశేషమగు నధికారమున్నది. 1906వ సంవత్సరమువరకును వీరికి ఆబ్కారీహక్కులు పూర్తిగనుండెను. అప్పటినుండియు వానిని నైజాంవారు నిర్వహించుచు గద్వాలకు 13000 రూపాయిలను పరిహారముగా నిచ్చుచున్నారు. కోర్టుస్టాంపులను సంస్థానికులు తామే వేయించుకొనుచున్నారు. సుంకములను(Customs) నైజాంవారే వసూలుచేసి వీరికి సుమారు 20000 రూపాయలనిచ్చెదరు. పన్నులు విధించి వసూలుచేయు నధికారము పూర్తిగ సంస్థానము వారిదే. గద్వాలలో 300 మంది రాజపుత్రులసైన్యమును, అరబ్బుల అంగరక్షకబలమును గలదు. ఈ నియోగమునకై యేటేటను 30000 రూపాయిలు ఖర్చగును. నేరస్తులను శిక్షించుటలో సంస్థానికులకు పూర్ణాధికారమున్నది. ఉరిశిక్షలుమాత్ర మిటీవల నైజాంవారిచే నామోదింపబడుచున్నవి. ఈ సంస్థానమున ప్రబలమగు పోలీసుశాఖ పూర్వము నుండియు నున్నది. పై నిబంధనలును,ఏటేటను నైజాంవారికి నియమితమగు పేష్కసును చెల్లించుటయును దప్ప నితరవిషయములలో గద్వాల రాజులకు పరిపూర్ణాధికారముగలదు.

ఈరాజులయెడ జూపబడు విశేషగౌరవములనుగూర్చి యిచ్చట దెల్పుట సమంజసముగ నుండును. వీరికి రాజ్యాభిషేక కాలమున నైజాంవారు తమ సమ్మతిని దెల్పుచు నొక ఖిల్లతును, తురాయి, చీగా, హారములు, దస్తుబంద్, భుజబంద్, మున్నగు నాభరణములను, దస్తార్ (ఉష్ణీషము) దుశ్శాలువ, ఉత్తరీయము, అంగీ మున్నగు వస్త్రములను బంపుదురు. అదే విధమున రాణులకును చీరలును, రవికెలును, ఆభరణములును బంపబడును.

## III. ప్రాచీన శిథిలములు.

ఈసంస్థానము పూర్వకాలమున బశ్చిమ చాళుక్యసామ్రాజ్యమునను, పిమ్మట గొంత వరకును తెలుగుచోడుల రాజ్యములందును, దర్వాత కాకతీయ సామ్రాజ్యమునను చేరి యుండినది. అటుపై నిందు ఐజ, దరూరు, పూడూరు, గట్టు, వల్లూరు మున్నగు సీమ లేర్పడి యనేక నాడగౌడులచే పాలింపబడినవి. ఈ రాజవంశముల శాసనములును, కట్టడములు నీసంస్థానమునం దెన్నియోగలవు. వీనివలన నీరాజ్యపు ప్రాముఖ్యత స్పష్టమగును. గాన వీని నిట సంగ్రహముగ వర్ణించుట యుక్తము.

### గద్వాల.

ఈసంస్థానమునకు గద్వాలముఖ్యపట్టణము. ఇది కృష్ణానదికి మూడుమైళ్ళ దూరమునసికింద్రాబాదు-కర్నూలు రైలుమార్గమునందున్నది. ఇందు సువిశాలమగు దుర్గమొకటి గలదు.దీనిని గద్వాలరాజులలో నగ్రగణ్యుడగు రాజా పెదసోమభూపాలుడు (క్రీ.శ.1663-1712) లేక శోభనాద్రి గట్టించెను. ఈదుర్గనిర్మాణ

కాలము క్రీ. శ. 1700-1706 అయినటుల వాఙ్మయము నుండియు స్థానిక చరిత్రముల నుండియు దెలియుచున్నది. వలయాకారము గనున్న యీదుర్గమున నిరువదియొక్క బురుజులు గలవు. కోటలోపలియావరణము రెండు భాగములుగనున్నది. అందు దక్షిణమున కేశవాలయము రామస్వామియాలయమును, రాజసౌధము నున్నవి. సౌధప్రాంగణమున కేడంకశాల సోఫాయనిపేరు. దానిసదుమ నలుచదరముగానున్న తిన్నెగలదు. ఇదియే గద్వాల దుర్గమునకు శంకుస్థాపన చేయబడిన స్థలమని తెలియుచున్నది. ఇచటిగోడలపై కొన్నివర్ణచిత్రములున్నవి. వీనిలో గద్వాల దుర్గకర్తయగు రాజా పెదసోమ భూపాలుని నుండి యారుతరముల రాజుల చిత్రములు గలవు. చరిత్రమున కీచిత్రములు మిగుల ముఖ్యములైనవి. ఇచటగల యితరచారిత్రకవస్తువులలో సుమారు ముప్పదియడుగుల పొడవుగలతుపాకి యొకటియు, మహమ్మదీయుల చంద్రధ్వజమొకటియు ముఖ్యములు. వీనిని తమయధీనములోని దరూరుపై బిజాపురసైన్యములు దండెత్తినపుడు గద్వాలరాజులు వశపరచుకొనిరట.

పూడూరు.

గద్వాలసంస్థానమునందలి గ్రామములలో నెల్ల పూడూరు మిక్కిలి ముఖ్యమైనది. ఈ యూరు 9వ శతాబ్దినుండియు నభివృద్ధిలో నుండెనని యిచటి యొక కన్నడశాసనమునుండి తెలియుచున్నది. ఈ గ్రామమున జూడవలసినవి మూడుదేవాలయములు. అందు మొదటిది కేశవస్వామియాలయము. ఇది యాధునికము. ఆలయమునకు శిఖరములేదు. దీని యావరణలోగల సింహద్వారము ప్రాచీనచాళుక్యశిల్పపద్ధతి ననుసరించి నిర్మింపబడినది. పొలమును దున్నునపుడిది భూగర్భమునుండి బయల్పడెనని తెలియుచున్నది. పిమ్మట పేర్కొనదగినది పూడూరుదుర్గము. గ్రామమునకు చుట్టును వలయాకారమగు నొక మట్టిగోడగలదు. ఇది పూర్వదుర్గమునకు బహిరావరణమునునంశము. ఈయూరి మల్లిఖార్జున గుడివద్దగల శాసనములోని "పుడ్రసంజ్ఞేపురే" "దుర్గేయుశస్సోదరే" యను మాటలవలన స్పష్టమగుచున్నది. మల్లికార్జునగుడి మట్టిగోడకు ముప్పదిగజముల దూరముననున్నది. దీనికి సమీపమున నొకగోడనుజేరి కొన్నివిగ్రహములున్నవి. ఇందు ఒక స్త్రీవిగ్రహమును, ఒక పురుషవిగ్రహమును, తలపై నేడు పడగలసర్పముగల్గి ధ్యానముద్రలో నాసీనుడై యున్న జైన తీర్థంకరుని విగ్రహమును ముఖ్యములు. ఇవి గాక మరిమూడు తీర్థంకరవిగ్రహములు గూడ నిచట గలవు. మల్లిఖార్జునగుడి కొకఫర్లాంగుదూరమున వీరభద్రాలయమున్నది. ఇందు నందిగల ముఖమంటపము నటుపై త్రివేశ మంటపమును దానివెనుక గర్భాలయమును గలవు. ఆలయముపై శిఖరము మెట్లు మెట్లుగా నిర్మింపబడి పోనుపోను సన్నమగును. దీని యగ్రము తలక్రిందులుగ బోర్లింపబడిన కలశమువలె నున్నది. ఇది జైనాలయ శిఖరమని యీవర్ణనమునుండి తెలియుచున్నది. ఈ యాలయమున నొక శివలింగమును వీరభద్రుని విగ్రహమును గలవు. ప్రత్యక్షముగ జైనాలయముగ గన్పడు నిందు శైవ విగ్రహములుండుటనుబట్టి యిందేమియో విశేషముండవలెనని తోచుచున్నది. శైవులకును జైనులకును 12 వశతాబ్దములో ప్రబలమగు శాత్రవమేర్పడి తత్ఫలితముగ జైనులు క్షీణించుటయు వారి గ్రంథములు నశించుటయు, వారికట్టడ

ములు మార్పునందుటయు శాసనవాఙ్మయాదులనుండి తెలియుచున్నవి. ఈ సుప్రసిద్ధ చారిత్రిక విషయమును పైన పేర్కొనబడిన జైనాలయమున శైవవిగ్రహము లుండుటయందలి వైరుధ్యముతో సమన్వయించినచో పూడూరుగూడ శైవజైనసంఘర్షణమున కొక ముఖ్యరంగస్థలమై యుండెనని యూహింపనగుచున్నది. ఈ యూహను బలపరచుట కీయూరనే యీక్రింది ప్రమాణములు గాంచనగుచున్నవి. (1) ఇచటి మల్లిఖార్జునగుడివద్ద చెదరియున్న విగ్రహములలో పార్శ్వనాథుని యొక్కయు మరియిర్వురు తీర్థంకరులయొక్కయు విగ్రహము లున్నవి. (2) ఈ యాలయమున కనతిదూరమునందున్న నల్లరాతిపై మూడు వైపుల 12వ చాళుక్య విక్రమసంవత్సరమునాటి కన్నడ శాసనము మొదట కూర్చొనియున్న ధ్యాని జైనవిగ్రహమును,జినుని ప్రశంసయు,పల్లవజినాలయప్రశంసయు గలవు. మొదటిప్రక్క చిగురుభాగమున పుండ్రపుర దుర్గమును, ద్రవిళసంఘమునకు జెందిన కాంచనసేనపండితుడును పేర్కొనబడి యున్నారు. (3) వీరభద్రాలయమున కుత్తరముగ నున్న యొక సత్రముయొక్కగోడలో నొక రాతిపైన మొదటి వరుసలో శివలింగమును ధ్యానిజైన విగ్రహమును, రెండవ వరుసలో జైనునికిక్రింద కత్తితో పోరాడుచున్న రౌతుగుఱ్ఱమును శివలింగము క్రిందనున్న పదాతియొకడు యీటెతో పొడుచుచున్నట్లును, మూడవవరుసలో రౌతుక్రింద తలక్రిందుగ పడుచున్న మనుష్యుడును, నాల్గవవరుసలో నొక మృతదేహమును చెక్కబడియున్నవి.

ఈ శిల్పములనుండి నేటి వీరభద్రాలయమే పూర్వపు పల్లవజినాలయ మనియు, నందు మల్లికార్జునగుడివద్దగల పార్శ్వనాథుడు నాతని యక్షిణీయక్షులు నుండెడి వారనియు,వీరశైవమతము విజృంభించినపుడు పైన పేర్కొనబడిన సత్రపుగోడలోని శిల్పము సాంకేతికముగ దెల్పు శైవజైనమతసంఘర్షణ మిచ్చటగూడ జరిగి జైనులోడిపోయిరనియు, నటుపిమ్మట నిచట పల్లవజినాలయమున శివలింగమును వీరభద్రుని విగ్రహమును స్థాపింపబడినవనియు స్పష్టమగుచున్నది.*

వల్లూరు.

ఈగ్రామము హైదరాబాదు- కర్నూలు రైలుదారిపైనున్న చాగాపురమునకు రెండు మైళ్ళ దూరమునందున్నది. ఇచటి గోపాలస్వామి యాలయము సుప్రసిద్ధము. ఈయాలయావరణలో భూమిలో పాతుకొనియున్న రాతిమీద మిక్కిలియరిగిపోయిన శాసనమొకటిగలదు. ఆంధ్రచోళుల కొక వల్లూరు రాజధానిగ నుండెడిదనియు, కాకతీయ గణపతిదేవుని సామంతుడగు గంగయసాహిణి వల్లూరుపురము రాజధానిగా పానుగల్లుమొదలు మార్జవాడివరకునుగల దేశము నేలెననియు శాసనములనుండి తెలియుచున్నది. రుద్రాంబాప్రతాపరుద్రుల సామంతుడగు త్రిపురాంతకుడు నిటనుండియే రాజ్యమేలెను. ఈయూరనొకదుర్గముయొక్క చిహ్నములు గాంచనగుచున్నవి. పై చరిత్రప్రసిద్ధమగు రాజధాని ప్రకృతగద్వాలసంస్థానములోని యీవల్లూరేయని చెప్పవచ్చును.

బోరపల్లి.

ఈగ్రామము వల్లూరు కెనిమిదిమైళ్ళ దూర

* వివరములకు J. A. H. R. S. vol VIII pts 2 & 3. లోని 'The Antiquities of Pudur' అను నావ్యాసమును జూచునది.

మునందున్నది. ఇటబలిష్ఠమగుదుర్గమొకటిగలదు. ఒకప్పుడీగ్రామ మొకసీమకు ముఖ్యస్థానముగ నుండినటుల స్థానికచరిత్రములనుండి తెలియుచున్నది. "అలంకార శిరోభూషణ"మను సంస్కృతగ్రంథమున నీయూర ముష్టిపల్లికులజులును, మినిమళ్ళగోత్రజులునగు పాకనాటి రెడ్లు పాలించుచుండిరని చెప్పబడియున్నది. ఈ వంశపాలకులలో కడపటిదగు గిరెమ్మయను రాణి దత్తపుత్రుడగు రాజా రామరాయుడు 18 వ శతాబ్దమధ్యభాగమున గద్వాల కేలికయగుటచే నీబోరవెల్లిసీమయు దుర్గమును గద్వాలరాజ్యములో గలసిపోయినవి.

రాజోలి

గద్వాలసంస్థానమునందలి ముఖ్యగ్రామములలో నిదియొకటి. ఇది తుంగభద్రాతీరమునందున్నది. నది యిట రెండుపాయలై యొకలంక యేర్పడగా బ్రిటిషుప్రభుత్వమువారొకయానకట్టనుగట్టి యావలియొడ్డునకు జలసౌకర్యమును గల్గించిరి. ఈగ్రామమున బలమగు దుర్గమొకటి గలదు. ఇందలి రాజసౌధములలోని భాగములింకను గన్పించుచున్నవి. దుర్గముమధ్య వీరనారాయణస్వామి యాలయమున్నది. ఇది మనోహరమైనది. గ్రామమునకు రెండుమైళ్ళ దూరమున నదియొడ్డున రామేశ్వరాలయము గలదు. చిన్నదైన నీయాలయము చక్కనిది. ఇందొక లింగమును కొన్ని భిన్నశిల్పములును గలవు. ఆలయము ముంగిట నొకతెల్లరాతిపైన చాళుక్యభూలోకమల్లుని శాసనమొకటి యున్నది.

ఐజ

ఐజ మిగులముఖ్యమైనది. సంస్థాన మూలపురుషుడగు బుడ్డారెడ్డి యీగ్రామనివాసి. ఈతడు శా. శ. 1212 వ సంవత్సరమున కాకతీయ ప్రతాపరుద్రునివలన ఐజ మున్నగు నేడు సీమలపై నాడగౌడరికమును బొందెను. ఇందువలన నతని సంతతివారికి 'ఐజ నాడగౌడు' లను పేరేర్పడినది. ఇట పూర్వమొక దుర్గముండెడిదని తెల్పుటకు నేటికి నొక మట్టిబురుజును, గోడలలోని భాగములును నిలచియున్నవి. ఇందు మూడు ప్రాచీనాలయములు గలవు. అందలి యాంజనేయాలయము ప్రక్కనున్న దిగుడుబావిమెట్లలో బిగింపబడిన యొక రాతిపై నొక శాసనభాగమున్నది. దానిలో "స్వస్తి శ్రీ మన్మహామండలేశ్వర కాకతీయ ప్రతాపరుద్రదేవ మహారాజులు ఒరుగంటను సుఖసంకథా వినోదంబున రాజ్యము సేయుచుండగా" అని యున్నది. ఈశాసనశకలము పై బుడ్డారెడ్డికి నాడగౌడరికము వచ్చినవిధమును దెల్పుచు, గద్వాల సంస్థానము కాకతీయ సామ్రాజ్య భవమని నిరూపించు స్థానికులవద్దగల సన్నదును బలపరచు చున్నది.

ఉత్తనూరు

ఇది ఐజకు రెండుమైళ్ళలోనున్న గ్రామము. ఈగ్రామమునకు భాగణ్ణదాసులను కర్ణాటక భక్తుడు శాశ్వతమగు కీర్తిని గల్గించెను. ద్వైతమతభక్తులు గొందరు తమమత సిద్ధాంతములను పామరులకు సుబోధ్యముల నొనర్చుటకై కన్నడభాషలో కీర్తనలను రచించిరి. ఈకీర్తనలను పాడుచు భక్తిపరవశులై యనేకాద్భుత కార్యముల నొనర్చిన యాభక్తుల సంఘమునకు 'దాసకూట' మనిపేరు. భాగణ్ణదాసులను నత డీకూటమున ముఖ్యుడు. ఉత్తనూరు గ్రామ మీతని జన్మస్థానము. క్రీ. శ. 1722—52 నడుమ జీవించిన యీమహానీయునిగూర్చి కర్ణాటకమున పెక్కుగాథలు గలవు. నేటికిని ఉత్తనూరులో "భాగణ్ణదాసర భావి" యని యొక బావిగలదు.

కుచినెర్ల.

ఈగ్రామము గద్వాల-రాయచూరురోడ్డుపై రాయచూరుకు 11 మైళ్ళ దూరమునందున్నది. ఊరి కరమైలుదూరమున పొలముల మధ్య సోమప్పగుడియని యొకచిన్నగుడిగలదు. ఇందొకరాతిమీద నాయుధహస్తుడై గుఱ్ఱముపై స్వారిచేయుచున్న యోధునివిగ్రహమున్నది. ఇదియొక "వీరకల్" అని తోచుచున్నది. ఈగుడికెదురుగ నొకసల్లని రాతిస్తంభము భూమిలో పాతబడియున్నది. దీనికి మూడువైపులను మూడుశాసనములు గలవు. అందొకటి చాళుక్యత్రిభువనమల్లుని సామంతుడగు నొకతెలుగుచోడుని ధర్మమునుదెల్పును మరియొకటి పైరాజుయొక్క మంత్రియు దండనాథుడునగు పద్మనాభరస 14వ చాళుక్య విక్రమవర్షమునజేసిన దానములనుపేర్కొనును.

దరూరు.

ఈగ్రామము గద్వాలకారుమైళ్ళలో నున్నది పూర్వమిదియొకసీమకు ముఖ్యస్థానము. ఐజసీమతోపాటు దరూరుసీమకుగూడ గద్వాలసంస్థానికులపూర్వుడగు బుడ్డారెడ్డి నాడగౌడరికమును సంపాదించెను. ఈయూరి చెరువుగట్టునసున్న యాంజనేయాలయములోని విగ్రహము క్రీ. శ. 15, 16 శతాబ్దములలో విజయనగర రాజులచే "కులదైవతముగ" నారాధింపబడినవాడును, ద్వైతమతాచార్యులలో సుప్రసిద్ధుడునగు శ్రీవ్యాసరాజస్వామిచే ప్రతిష్ఠింపబడెనని పరంపరాగతమగు స్థానికుల గాథలు తెల్పుచున్నవి.

బీచిపల్లి.

ఈగ్రామము గద్వాలకు దూర్పుగా పదిమైళ్ళదూరమున గృష్ణాతీరమునందున్నది. ఇచటి యాలయము ముఖ్యమైనది. ఇందలి యాంజనేయవిగ్రహము దర్శనీయము. దీనినిగూడ శ్రీవ్యాసరాజస్వామి ప్రతిష్ఠించెనట. ఉత్తరదక్షిణముగా ప్రవహించునదిలో నిచట ప్రాకృతికముగా నొకద్వీపమేర్పడినది. ఇందలి యొకగుట్టపై బలిష్ఠమగు కోటగలదు. దీనికి నైజాంకొండయని పేరు. దీనికనతిదూరమున సీతారామస్వామి జీర్ణాలయమున్నది. పైయాంజనేయాలయము వెలుపల నొకచింతచెట్టుక్రింద భూమిలో చాలభాగముపూడియున్న శిలాస్తంభమొకటి గన్గొనబడినది. దీనికి మూడువైపుల నొకశాసనముగలదు. ఇందు చాళుక్య భూలోకమల్లుని రాజ్యకాలమున శా. శ. 887 వ సంవత్సరమున నారాజు సామంతుడగు బిద్దంచోళమహారాజు చేసిన ధర్మము వర్ణింపబడినది. "కాశ్యపగోత్ర, ఒరయూర్పురవరాధీశ్వర" మున్నగు బిరుదములనుండి యీసామంతుడాంధ్రచోడవంశీయుడని నిర్ణయింపవచ్చును.

ఇంతవరకును వర్ణింపబడిన శిథిలములుగాక గద్వాలసంస్థానమునం దెన్నియో ప్రాచీన దుర్గములును, దేవాలయములును గలవు. ఇందలి శాసనములనుండి యీభూభాగము గొంతకాలము పశ్చిమచాళుక్య సామ్రాజ్యమునను, పిమ్మట నాంధ్రచోళుల వశమును, పిదప గాకతీయచక్రవర్తుల పరిపాలనమునుండి, యటుపై ననేకసీమలుగ విభజింపబడి కాలక్రమమున ప్రకృత గద్వాలసంస్థానమయ్యెనని తెలియుచున్నది.



కాకతీయ సప్తశతాబ్ద్యుత్సవము—ప్రతినిధులు, ప్రేక్షకులు.



కాకతీయవర్ధంత్యుత్సవము—ఆహ్వానసంఘము, స్వచ్ఛందసేవకులు.

# కాకతీయ వర్ధంత్యుత్సవము.

ఆంధ్రదేశపు ప్రాచీనగౌరవమును పరిశోధనామూలకముగ బయల్పరచి, దేశీయచరిత్రమునం దభిరుచినిగల్పించి, భారతీయచరిత్రమును బరిశోధించు నితరసంస్థలకును, పరిశోధకులకును దోడ్పడుట ఆంధ్రేతిహాసపరిశోధకమండలి యొక్క ముఖ్యోద్దేశ్యము. పరిశోధకులసిద్ధాంతములను వెల్లడిచేయుటకై యొక త్రైమాసికపత్రిక నాంగ్లమున ప్రకటించుటయేగాక ప్రత్యేక రాజవంశముల యొక్కయు, విభాగముల యొక్కయు, చరిత్రమును గ్రంథరూపకముగ సేకరించుటగూడ మండలి కార్యక్రమములో గలదు. దీని ననుసరించి రాజరాజసంచికయు, కళింగదేశచరిత్రమును బ్రకటింపబడినవి.

1925 ప్రాంతముననే మండలివారు కాకతీయోత్సవమును జరుపనిశ్చయించిరి గాని కారణాంతరములచే నాపట్టున కళింగవర్ధంతి జరుపబడినది. 1930 లో కళింగసంచిక ప్రకటింపబడుటయు, నటుపై మరియొక వర్ధంతి జరుపుటావశ్యమగుటయును, నిదేసమయమున గాకతీయుల చరిత్రమునుగూర్చి మదరాసు విశ్వవిద్యాలయమున గొంతపరిశోధనచేసియుండిన నేను, నైజాం రాష్ట్రమందలి గొన్ని నూతనశాసనములతో బరిచయము చేసికొని, రాజమహేంద్రవరముచేరి, మండలివారి త్రైమాసికపత్రికలో పైశాసనముల యాధారముపై నిర్మింపబడిన కాకతీయులచరిత్రమును బ్రకటించుటయు జరిగినవి. ఇంతలో నేను, అప్పటి మండలి కార్యదర్శిగారగు సుబ్బారావుగారును, మండలివారు కాకతీయవర్ధంతి జరపినచో బాగుండుననియు, దానిని కాకతీయరాజధానియగు నోరుగల్లులోనే నిర్వహించుట సమంజసమనియు నిశ్చయించుకొని మండలికార్యనిర్వాహకవర్గమునం దీవిషయమును బ్రవేశపెట్టితిమి. మండలివారు నిందుల కంగీకరించి, యాయుత్సవమునకు గావలసిన యేర్పాటులను జేయుడని మమ్ములను గోరుచు, వర్ధంత్యనంతరము బ్రకటింపబడు సంచికకు నన్ను సంపాదకునిగను, శ్రీ జయంతి రామయ్యపంతులు, రాళ్ళబండి సుబ్బారావు, భావరాజు వేంకటకృష్ణారావు, చిలుకమళ్ళ అచ్యుతరావుగార్లను, సంపాదకీయసంఘసభ్యులుగను నియమించిరి.

1931 డిసెంబరు నెలలో నేనును సుబ్బారావుగారును హైదరాబాదున కేగి యచ్చటి యాంధ్రప్రముఖులను జూచితిమి. స్థానికులు నైజాంరాష్ట్రమునం దిట్టివర్ధంతులను జరపుటకు నై ప్రభుత్వమువారి యనుమతి గావలెననియు, నయ్యది దుస్సాధ్యమనియు జెప్పుటచే ము గొంచెము నిరుత్సాహత జెందితిమి. కాని యీసమయమున నైజాం ప్రభుత్వమున Director of Records అను నున్నతోద్యోగము నందుండువారును, పర్షియను భాషాకోవిదులునగు సయ్యద్ ఖుర్షిద్ ఆలీ బి. ఏ. గారు మాకు అమూల్యమగు సాహాయ్యము నుత్సాహము నొసంగిరి. వారిమూలమున మాకు ప్రభుత్వమువారి Deputy Home Secretary గారితో సమావేశము గలిగినది. మండలియొక్క ఆశయములను, మేము తలపెట్టిన కాకతీయోత్సవము

యొక్క కార్యక్రమును విని యాయుద్యోగి కొన్ని షరతులపై మాకుత్తరువు నొసంగ నంగీకరించెను. అటుపై మేము హనుమకొండ కేగి, స్థానికులగు మాదిరాజు రామకోటేశ్వరరావుగారిని, ఇతర న్యాయవాది ప్రముఖులను, వర్తకప్రముఖులను గాంచి వారి సానుభూతిని పొందితిమి. ఈయుత్సవ మచటనే జరుగవలెననియు, దానినిర్వహణభారమును తాము వహింతుమనియు, వారుత్సాహముతో దెల్పిరి. ఈసందర్భమున శ్రీదూపాటి రమణాచార్యులు, రామకోటేశ్వరరావు, ఒద్దిరాజు రాజేశ్వరరావుగార్లు విశేషసాహాయ్యమొనర్చిరి. అనంతరము మేము ఒరంగల్లులోని సుబేదారుమున్నగు నున్నతోద్యోగులను గూడ దర్శించి తిరిగి హైదరాబాదు చేరితిమి. అచట శ్రీరాజా కొత్వాలు వేంకటరామారెడ్డిబహద్దరువారు, సురవరము ప్రతాపరెడ్డి, మాడపాటి హనుమంతరావు, పింగళి వెంకటరామారెడ్డి దేశముఖుగార్ల సాహాయ్యమున మేముమిగిలిన యేర్పాట్లను చేయగల్గితిమి. నైజాంకళాశాలలో చరిత్రాచార్యులును, విద్యావిషయములలో నగ్రగణ్యులునగు యస్. హనుమంతరావుగా రుత్సవమునకును, పి. వెంకటరామారెడ్డిగారు ఆహ్వానసంఘమునకును, నధ్యక్షులుగనుండుటకును, ధర్మవీర్ వామనాయక్ జాగీర్దారుగారు చారిత్రికవస్తుప్రదర్శనమును తెరచుటకు నంగీకరించిరి. కాకతీయోత్సవము మార్చి 25, 26, 27 తారీఖులలో జరుపబడునని మేము నైజాం ప్రభుత్వమునకు దెలియపరచితిమి. వారును హనుమకొండలో కళాశాల నారోజులలో మూయించి సభలను జరుపుకొనుటకై మాకొసంగెదమనియు, వారియార్షశాఖ (Archaeological Department) వారిసాహాయ్యమును గూడ నొసంగెదమనియు, దయతో దెల్పిరి. ఈయేర్పాటులను చేసికొని మేము రాజమహేంద్రవరమునకు మరలితిమి.

హనుమకొండలోని ప్రముఖులందరు నధికోత్సాహముతో కార్యమునకు గడంగి పెక్కుమంది విద్యాధికులును, శ్రీమంతులునుగల ప్రబలమగు నొక యాహ్వానసంఘము నేర్పరచికొనప్రయత్నములు చేయుచుండిరి. వారి సహకారముతో నొక కార్యక్రమము నేర్పరచి, మండలివారు తమత్రైమాసిక పత్రికామూలమునను, వార్తాపత్రికల మూలమునను గాకతీయోత్సవమును గూర్చిన వివరములను, కార్యక్రమమును బ్రకటించి పండితుల తోడ్పాటును కోరిరి. రాబోవు కాకతీయసంచికకు వ్యాసములను బంపుటకై పండితులకును, ఉత్సవకాలమున జరుపబడు చారిత్రికవస్తుప్రదర్శనమునకు సామగ్రిలను బంపుడని వ్యక్తులకును, సం... ను గూడ లేఖలు పంపబడినవి.

కాని మార్చి 20 వ తారీకున నైజాం ప్రభుత్వమునుండి మండలి కార్యదర్శి కొక తంతి వార్త వచ్చినది. అంతట కార్యదర్శి తొందరగా హైదరాబాదునకుపోయి ...గొనగా కాకతీయ సభకేగాని కాకతీయవర్ధంతి కుత్తరువొసంగబడలేదని నైజాం ప్రభుత్వమువారు తెలిపిరి. తిరిగి యుత్తరువు జారీయగుట కాలవ్యయమయ్యెను. స్థానికుల ప్రయత్నము... పూర్తికాలేదు. అందుచే గాకతీయోత్సవమును ఏప్రిలునెలకు మార్చవలసి... ఈమార్పుననుసరించి 12 ఏప్రిలుతేదీని సభాకార్యక్రమమును దెల్పుచు మరియొక కరపత్రిము



కాకతీయ సభ—వ్యవస్థాపకులు.

మండలివారిచే ప్రకటింపబడినది. దేశీయప్రముఖులకును, పరిశోధకపండితులకును, విద్యావిషయక సంస్థలకు నాహ్వానములు పంపబడినవి.

మండలికార్యదర్శిగారు ఏప్రిలు 20 వ తేదీకి హనుమకొండ చేరి యచ్చటి యాహ్వానసంఘముతో కలసి యవసరములగు నేర్పాటులను గావించిరి. అతిథులకు వసతియు భోజనసౌకర్యములును ఉస్మానియా కాలేజీహాస్టలులో నేర్పరుపబడినవి. తోరణములతోడను, పతాకములతోడను దానిని స్థానికప్రముఖులు చక్కగ నలంకరించిరి. సభాప్రతినిధులు చాలమంది 24 వ తారీకు సాయంకాలమును, మిగిలినవారు 25వ తారీకు ఉదయమునకును వచ్చిచేరిరి.

సభాప్రారంభము.

25 వ తారీకు ఉదయం పదిగంటలకు ప్రతినిధులు, ప్రేక్షకులు, స్థానికప్రముఖులు మున్నగువారందరును ఉస్మానియా హాస్టలులో సమావేశమైరి. అంతట మంగళవాద్యములతో నొక యూరేగింపు బయల్వెడలి కళాశాలాభవనమును చేరినది. 11 గంటలకు సభ ప్రారంభమయ్యెను. సభాభవనము క్రిక్కిరిసి యుండినది. ఎల్లెడల నమితమగు నుత్సాహము గన్పట్టినది. సభ నలంకరించినవారిలో నీక్రిందిముఖ్యులు గలరు.

వారంగల్ సుబేదారగు దరబ్జీ బాపూజీచినోయిగారు, తాలూక్దారు మహమ్మద్ అబ్దుల్ బసిత్ ఖాన్ గారు, పూర్వము హైదరబాద్ హైకోర్టు జడ్జిగనుండిన పండిత కేశవరావుగారు, బారిస్టరు శ్రీనివాసరావుశర్మగారు, ధర్మవీర్ వామననాయకుగారు జాగీర్దారు, పింగళి వెంకటరామారెడ్డిగారు దేశముఖ్, కె. యస్. వైద్య ఎం. ఏ., ఎల్. ఎల్ బి. గారు, పోలీసుసూపరెంటు సర్దారు నిరంజనసింగుగారు, తాహశిల్ దారు గోవిందరావుగారు, ఉస్మానియా కళాశాల ప్రిన్సిపాలగు అబ్దుల్ అజీజ్ ఖాన్ బి. ఏ. గారు, నార్మల్ స్కూలు సూపరెంటు ఏ. వెంకటరమణయ్యగారు, వకీలు శ్రీరామారావుగారు, కళాశాలోపన్యాసకులగు అబ్దుల్ అజీజ్, ఎ. గోపాలరావు, ఎ. రామచంద్రరావుగార్లు, ప్రొఫెసరు తెలికిచర్ల వెంకటరత్నంగారు, ఎం .ఏ. గుంటూరు, ఎ. శ్రీనివాసరావుగారు, ఎం. ఏ., హైదరాబాదు ఆర్షశాఖప్రతినిధి జోషీగారు, డాక్టరు చిలుకూరి నారాయణరావు ఎం. ఏ. ఎల్. టి. పి. హెచ్. డి. గారు, భావరాజు వెంకటకృష్ణారావు బి. ఏ. బి. ఎల్. గారు, మాడపాటి హనుమంతరావుగారు హైకోర్టువకీలు, అడవి బాపిరాజుగారు బి. ఏ, శ్రీ శేషాద్రిరమణకవులు, మాదిరాజు రామకోటేశ్వరరావుగారు వకీలు, ఆకారపు చిన్నయ్యగారు, కొమరవెల్లి కాశయ్యగారు, బి. కృష్ణమూర్తిగారు, ఆహ్వానసంఘ సభ్యులు; స్వచ్ఛందసేవకులు.

శ్రీ మాదిరాజు రామకోటేశ్వర రావుగారి ప్రార్థనతో సభాకార్యక్రమ మారంభింపబడినది. పిమ్మట ఆంధ్రేతిహాస పరిశోధకమండలి గౌరవకార్యదర్శియగు రాళ్ళబండి సుబ్బారావు యం. ఏ., యల్. టి. గారీక్రింది ప్రారంభోపన్యాసము నొసంగిరి—

1922 సంవత్సరములో చిలుకూరి వీరభద్రరావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ, భావరాజు వెంకటకృష్ణరావు, చిలుకూరి నారాయణరావుగార్లు ఆంధ్రేతిహాసపరిశోధకమండలిని రాజమహేంద్రవరమున స్థాపించిరి. అదే సంవత్సరమున రాజరాజనరేంద్రపట్టాభిషేకనవమశ

తాబ్దవర్ధంతిని రాజమండ్రిలో జరపి, భా. వెం. కృష్ణారావుగారి సంపాదకత్వమున, మండలివారు రాజరాజ పట్టాభిషేకసంచికను ప్రకటించిరి. 1926 నుండియు త్రైమాసికపత్రిక ప్రారంభింపబడినది. ఇంతవరకును 32 సంచికలు వెలువడినవి. జమీందారులును, పండితులు నెందరో యీ సందర్భమున సాహాయ్య మొసర్చిరి. వారికి మావందనములు. 1927 సంవత్సరము జూన్ నెలలో మండలివారు ముఖలింగములో కళింగవర్ధంతిని జరపిరి. దీనికి పర్లాకిమిడి కళ్ళికోట జమీందారులును, సర్. ఎ. పి. పాత్రో, శ్రీరాజా విక్రమదేవవర్మగార్లును పోషకులుగనుండిరి. దీనిఫలితముగ 1931లో కళింగదేశచరిత్రయను గ్రంథము నా సంపాదకత్వమున ప్రకటింపబడినది. ఇప్పుడు మండలివారు ఏకశిలానగరమున కాకతీయోత్సవమును జరపి మరియొకసంచికను ప్రకటింపదలచియున్నారు. దానికి నామిత్రులగు మారేమండ రామారావు బి. ఏ. అనర్సుగారు సంపాదకులుగ నెన్నుకొనబడిరి. ఈనగరము కాకతీయులకు రాజధానియగుటయు, వారి చరిత్రమును వ్రాయబోవువారు తత్కాలీనములగు శిథిలములను సందర్శించుట సమంజసమగుటచేతను, నైజాంరాష్ట్రమునందలి చారిత్రికసామగ్రిని బయల్వెడలింపజేయు నుద్దేశ్యముతోడను మండలివారీయుత్సవము నిచ్చటజరుప సంకల్పించిరి. స్థానికులగు శ్రీమంతులును, పండితులు నుద్యోగులు నీసందర్భమున మండలికి తోడ్పడుదురని మాయాశయము. ఉత్సవమును జరుపుట కుత్తరువొసంగుటయేగాక, కళాశాలాభవనమునొసంగియు, ఆర్కియాలజీ శాఖవారిని చారిత్రికవస్తుప్రదర్శనమునకు సాయమొనర్పజేసియు ననేకవిధముల మండలికి దోడ్పడిన శ్రీ నైజాం ప్రభుత్వమువారికి మాకృతజ్ఞతాపూర్వక వందనములు.

పిమ్మట కాకతీయ సభాహ్వానసంఘాధ్యక్షులగు శ్రీయుత పింగిలి వెంకటరామారెడ్డి దేశముఖ్‌గారీక్రింది యుపన్యాసమును జదివిరి—

సోదరీ సోదరులారా!

నిజాంరాష్ట్రాంధ్రులచరిత్రలో నత్యంతప్రాచీనమును, అత్యంతౌన్నత్యస్థితియుం దుండినదియునగు కాకతీయవంశముయొక్క చారిత్రికోత్సవమును జరుపుసందర్భమున మిమ్ముల నందరను ప్రేమపురస్సరముగా నీప్రాచీనచారిత్రకనగరమం దీనాటి సభకు ఆహ్వానించు గౌరవము నాకొసగబడి నందులకు నేనెంతయు ధన్యుడనని విశ్వసించుచున్నాను. ఈసభను ప్రారంభించుటకు మొదలు ఈసభోద్దేశములను కాకతీయసామ్రాజ్యవిశేషములను నా తెలిసినంతవరకు మీతో విన్నవించుకొందును.

రాజమహేంద్రవరమందలి ఆంధ్రచారిత్రికపరిశోధకమండలివారు ఇదివరలో రాజరాజనరేంద్ర వర్ధంతిని, కళింగవర్ధంతిని జేసి చాళుక్యసంచికను, కళింగసంచికను ప్రకటించి ఆంధ్రులకు మహోపకారము చేసియున్నారు. ఇప్పుడును అదేపద్ధతిపై యీనగరమందును కాకతీయసంబంధమగుసభను జేసి త్వరలో కాకతీయవర్ధంతిసంచికను ప్రకటింపనున్నారు.

ఈపద్ధతివలన మన విస్మృతమైనట్టి ఏకశిలానగరసామ్రాజ్యచరిత్రయు, కాకతీయుల కాలమునాటి యాంధ్రులచారిత్రిక, సాంఘిక, సారస్వతాదిస్థితియు మనకు విశదముగా తెలియగలదు. మఱియునిట్లు చేయుటవలన నాంధ్రులు తమ స్థితిగతులనుగుర్తించి తమ విధ్యుక్త

మేమిదియో, తమభావికర్తవ్యమేమిదియో నిర్ణయించుకొను నవకాశము కలుగగలదు.

ఏ వర్ధంతియైనను, ఎచ్చటనైనను జరుగనీ జరుగకపోనీ యీవర్ధంతి మాత్రము ఇచ్చట నిప్పుడైనను జరుగుట చాల సమంజసము. కొన్ని సంవత్సరముల క్రిందట కీ. శే. కే. వి. లక్ష్మణరావు పంతులువారు సందర్భాంతరమున మన హైద్రాబాదు రాష్ట్రములో ఆంధ్రుల చారిత్రకసంబంధమయిన వాఙ్మయము, శాసనాదికములు, శిల్పములు, పరిశోధనార్హములుగా వేనకువేలుగా నున్నవనియు, వానిని పరిశోధించుట చాల యవసరమనియు, తెలిపియుండిరి. వారియాశయములు నేటివరకును నెరవేరలేదు. ఈ రాష్ట్రములో చోళచాళుక్య శాసనములవలె కాకతీయశాసనములు వందలకొలది మూలమూలలందును గలవు. వానిస్థితి దినదినము హీనమై పోవుచున్నది. అనేకస్థలములలో భూమిలో పూడిపోయి తామింకను పనికిరాగలమని తలలుమాత్రము చూపుచున్నవి. మఱికొన్ని స్థలములలో వానిని ప్రజలు దుర్వినియోగము చేయుచున్నారు. కొన్ని తావులలో శాసనములు పగిలిపోయి తలయో తోకయో మిగిలినవై యున్నవి.

మనరాష్ట్రములో గ్రామగ్రామమందు తరచినకొలది తాటియాకులగ్రంథములును దిబ్బదిబ్బయందు త్రవ్వినకొలది ప్రాచీన నాణెములును, నిక్షేపములును, దొరకగలవు. మన ఆర్కి శాఖవారును యెంతయో పరిశ్రమచేసి మద్రాసు పండితులచే వ్యయమునకోర్చి పరిశోధింపజేసి ప్రకటించిన మూడు కాకతీయశాసనములు చదివినవారికి కాకతీయుల చరిత్ర కొంతవఱకెఱిగియే యుండును.

అయినను ఆ కాకతీయుల విషయములో రెండుమూడుమాటలను జెప్పదలచినాఁడను. మనలో చరిత్రలు తక్కువని కొందఱు సులభముగా విమర్శింతురు. మనదేశ పరిస్థితు లెట్లుండెనో, ఆకాలమందలి యల్లకల్లోలములలో గ్రంథములు నాశనమగుటకు అవకాశము లెట్లుండెనో విచారించక వీరిట్లు నూట్లాడుదురు. ఇటీవల కొన్నియేండ్లనుండి యనేక కావ్యాదులనుండి,శాసనములనుండి,స్థానిక కైఫీయతులనుండి కాకతీయచరిత్రలోని బహుభాగము గుర్తింపబడి వ్రాయబడి యున్నది.

ఈ ఓరుగల్లు నగరమును, హనుమకొండ పట్టణమును సుప్రసిద్ధస్థలములైనవి,మనకే కాదు ఖండాంతర వాసులైన మార్కొపోలోవంటి వారికిని నాఁటికిని నేటికిని చిరపరిచితములైనవి. ఈఓరుగల్లు సామ్రాజ్యమువలన ఆంధ్రులభాషయేకాక,ఆంధ్రుల సర్వకళలునభివృద్ధినొందెను. ఆంధ్రులప్రతిభ దిక్కుదిక్కులకు వ్యాపించెను. ఈ పరిసర ప్రదేశము లన్నియు చారిత్రిక స్థలములే.

కాకతీయులు రెడ్లా కమ్మలా యని యనేక పండితులు చర్చించి యిదమిత్థమని నిర్ణయింపక విడిచిపెట్టి యున్నారు. నాయభిప్రాయములో కాకతీయుల కాలములో రెడ్లు, కమ్మలే కాక వెలమలునుండిరి. ఈ మూడుతెగలును మొదట రెడ్లుగానుండి తర్వాత ఆచారభేదముల చేతనేమి, రాజకీయద్వేషములచేతనేమి భిన్నులై పరస్పర ద్వేషములను బెంచుకొని తుదకు చేతులార నిమ్మహాసామ్రాజ్యవినాశమునకును, తద్ద్వారాయాంధ్రులదైన్యమునకును కారకు

లైరి. ఈ మఱువాడ సీమయందలి రెడ్లనే మఱువాడ రెడ్లనిరి. వారినే తర్వాత మోటాటిరెడ్లనిరి. ఓరుగంటిరాజులీమోటాటిశాఖవారేయై యుందురు. ఇట్టిరెడ్డివంశమందుద్భవించిన కాకతీయులవంశ మవిచ్ఛిన్నముగా ౧౦౦౦ సంవత్సరముల వరకు నిత్యాభివృద్ధిలో నుండెనని "ప్రతాపచరిత్ర"మను నొక ప్రాచీనవచనచరిత్ర చెప్పుచున్నది. కాని మనకు చారిత్రకాధారము లంతగా కనబడనందున నిశ్చయముగా నిర్ణయింపజాలము.

ఈకాకతీయులలో మొదట ప్రఖ్యాతివహించి శాసనములందు గాన్పించునట్టివాడు ప్రోలరాజు. ఇతనికాలమునుండి ప్రతాపరుద్రచక్రవర్తికాలమువఱకు మనకు చరిత్రాధారములు కావలసినన్ని దొఱకియున్నవి. ఇంకను దొఱకుచున్నవి.

రుద్రదేవునికాలమువఱకే సామ్రాజ్య మతివిస్తారమయ్యెనని మన యీనగరమందలి సహస్రస్తంభదేవాలయశాసనమే తెలుపుచున్నది.

తూర్పున సముద్రతీరమును, దక్షిణమున శ్రీశైలమును, పశ్చిమమున కటకమును, ఉత్తరమున మాల్యవంతమును నీరుద్రదేవుని రాజ్యమునకు హద్దులయ్యెను. ఈహద్దు లింతటితో నిలువలేదు. ప్రతాపరుద్రుని కాలమునకు దక్షిణమున కాంచీనగరమువరకు నుత్తరమున దేవగిరివరకును వ్యాపించి అంతరించుటకు పూర్వము మహోన్నతదశ నందియుండెను.

ఈఓరుగల్లురాజులకాలమందే ఆంధ్రులు మహాశూరులనియు, గొప్పగా విదేశ వ్యాపారములు జేయువారనియు ప్రసిద్ధికెక్కియుండిరి. గణపతిదేవమహారాజు మోటుపల్లిరేవులో చెక్కించిన శాసనమువలన నానాడు ఓడరేవులందెట్టెట్టి సుంకములు తీసికొనుచుండిరో, సముద్రవ్యాపార మెంతవిరివిగ సాగినదో విశదమగుచున్నది. ఈసామ్రాజ్య మాకాలమందెట్టి మహోన్నత దశలో విలసిల్లుచుండెనో యూహించికొనుడు.

తొలుత ద్రవిడ కర్ణాట మహారాష్ట్రదేశముల గలుపుకొని చాళుక్యు లాంధ్రదేశమును బాలించుచుండిరి. కాలక్రమమున చాళుక్యరాజ్య మంతరించుటచే వారి సేనానాయకులగు కాకతీయులు క్రొత్తగ నొక రాజ్యమును స్థాపించిరి. అదియే కాకతీయ సామ్రాజ్యము. కాకతీయు లాంధ్రులు. ఆంధ్ర భాషాభిమానులు. ఆంధ్ర వ్యక్తిత్వము గల వీరులు. కాననే సమయ మెఱింగి తాత్రానుగుణముగ సామ్రాజ్య నిర్మాతలైరి. ఆంధ్రదేశ మీసామ్రాజ్య కాలమున శిల్పమునందును దుర్గనిర్మాణమునను, పరిపాలనమునను, వాఙ్మయమునను, విజ్ఞానమునను. సాటిదేశములకుం దలమానికమై పేరొందెను.

కాకతియను దేవి జైనదేవతయనియు ఆదేవతను బూజించుటచే కాకతీయులు జైనులనియునుం గొందఱందురు. కాకతి యన దుర్గ, కాకతీయులు దుర్గోపాసకులని విద్యానాథుఁడు నిర్వచించినాఁడు. ఉపలబ్ధములగు నాధారములకతన కాకతీయవంశము ప్రోలరాజువఱకు జైనమతము నవలంబించెననియు, రుద్రదేవునికాలమునుండి వైదికమతముల నభిమానించి యవలంబించెననియు నెఱుంగవచ్చును. కాకతీయులకాలమున శిల్పము మహోన్నత స్థితికి వచ్చినది. హనుమకొండ, ఓరుగల్లు, రామప్ప, పిల్లలమఱ్ఱి, నాగులపాడు మున్నగుతావుల ఆంధ్రశిల్పము వెల్లివిరిసినది. ఆంధ్ర జాతీయత అందు అనివార్యముగ

బ్రిసరించినది. ఆనాటి నాట్యకళలు, లలితకళాభిమానము, పురాణాభిరుచియు శిల్పములలో లగ్నమై దేశమున నభిమానము సంపాదించుకొనెననుట సత్యము. ప్రోలరాజు ఆంధ్రసామ్రాజ్యనిర్మాతగాన నాతని స్మరణము ఆంధ్రచరిత్రవిదులకుఁ బ్రథమ కర్తవ్యము. ప్రోలుని యనంతరము రుద్రదేవుఁడు హనుమకొండలో రత్నసింహాసన మధిష్ఠించి చిరకాలమురాజ్యము పాలించెను. ఈతనికాలమున ఆంధ్రకవులకవితకు మంచిదోహదము లభించెను. ఆంధ్ర సామ్రాజ్యము మహోన్నతికి వచ్చెను. అద్వితీయపరాక్రమశాలియగు రుద్రదేవుని జీవితము ఆంధ్రసామ్రాజ్యవృద్ధికి వినియోగింపఁబడినది. ఈ రుద్రదేవుఁడు తన రాజధానిని అనుమకొండనుండి ఓరుగంటికి మార్చినాఁడు. అది మొదలుకొని కాకతీయసామ్రాజ్యము మహావిస్తృతమై శత్రుజనాభేద్యమై పేరొందినది. అనంతరమురాజైన గణపతిదేవుఁడు ధర్మమూర్తి. ఇతఁడు సముద్రవ్యాపారమునకు మంచి అవకాశములు కలిగించెను. సముద్రమునకుఁ దీసిపోని పాకాల, రామప్ప, లక్నారము,గణపురము తటాకములఁ ద్రవ్వించెను.వీరశైవవాఙ్మయమును మిగుల బెంపొందించెను. అనేకవిధముల ఆంధ్రత్వమును నిలువఁబెట్టెను. ఈతఁడొనరించిన ధర్మములకు మేఱలేదు. తిక్కనసోమయాజికాశ్రయమొసఁగి యతని కామితము సఫలమొనరించిన గణపతి దేవుని రసికతకుఁ బ్రమాణము లనవసరములు. ఈయన తనయనంతరము పరిపాలించుటకు కుమారికకు రాజకీయతంత్రముల నేర్పినాఁడు. అతిచతురుఁడగు విశ్వేశ్వర శివదేశికునికడ తనపుత్రికకు విద్యాభ్యాసముచేయించి తన యంతిమదశలో నాయమను రాజ్ఞిగ నొనరించి యాంధ్రసామ్రాజ్యవైభవము కనులజూచినాఁడు.

రుద్రమదేవి చరిత్రము అద్వితీయమైనది. శత్రురాజులు దండెత్తివచ్చినవేళ స్వయముగా స్వారియై యుద్ధముచేసి శత్రువుల నోడించిన దీవీరవనిత. రాజ్యపరిపాలనము చేయుతఱి పురుషవేషముచే సింహాసన మలంకరించి సామంతులను, ప్రజలను, పండితులను, ఆశ్రితులను, ఎవ్వరెవ్వరి నెట్లుమన్నింపవలెనో అట్లు మన్నించి, యందఱ మెప్పువడసి, ఖండ ఖండాంతరములందు తన కీర్తిని నాటి యాంధ్రులకీర్తిని సహితము వ్యాపింప జేసెను.ఇట్టి యామెచరిత్రమును ఆంధ్రులే సరిగా నెఱుగరుఁడుట యెంతటిశోచనీయస్థితియో యూహించుఁడు.

ఈ ప్రాంతములన్నియు చాలపవిత్రములైనవి. ఈప్రాంతములందే వీరశైవము తన జయభేరినిమ్రోయించి దక్షిణాపథము నాక్రమించుకొనెను. ఈప్రాంతమందే జైనమతము విజృంభించి శైవ వైష్ణవ ప్రచారముల యొత్తిడిని "యుద్ధతులమధ్య పేదలకుండ దరమె?" అన్నట్లు నిర్వీర్యమై క్షీణించి నశించిపోయెను. ఈప్రాంతమందే పోతనాది మహాకవులు, పండితారాధ్య పాల్కురికిసోమనాథ, బసవరాజాదిపండితులును, మతకర్తలును నివసించియుండిరి.

ఈ ప్రాంతములందే రుద్రాంబ తన పవిత్రప్రజాపాలనము జగద్విఖ్యాతముగా శత్రుభయంకరముగా ప్రజానురంజకముగా జేసెను. ఈరుద్రాంబ యాంధ్రస్త్రీలలో ననసేల హిందువులలోనెల్లను విఖ్యాతయైన మహారాణి. ఈయమ నా జన్మస్థానమగు వడ్డెపల్లికి సహితము తనమాతు సంతానకాంక్షిణియై యచ్చటి వినాయకు నారాధింపవచ్చి కొన్నిదివసము లుండెనని చరిత్రకారులు వ్రాసియున్నారు,

కాకతీయసామ్రాజ్యమునఁ దుదివాఁడు ప్రతాపరుద్రదేవచక్రవర్తి. ఈయన ప్రతిష్ఠాదికములు చెప్పు ప్రతాపరుద్రీయము అద్వితీయమగు అలంకారశాస్త్రము. కాకతీయ రాజులచరిత్రము ఆనాటి రాజ్యపాలనము, ప్రజల విజ్ఞానము ఆంధ్రసామ్రాజ్యవైభవము గ్రహించుటకు అందనేకాధారములుకలవు. ఈయుత్తమగ్రంథమును కాకతీయచరిత్రమునకుఁ బరమ ప్రమాణముగా గ్రహింపవచ్చును.

ఓరుగల్లు రాజ్యచరిత్రము పల్లెవాండ్రు, శారదకాండ్రు పాటలుగా బాడుచున్నారు. స్థానికచరిత్రమున దీనిగూర్చినవివరములు కొన్ని కలవు. కొన్ని కొన్ని కావ్యములలో కాకతీయుల చరిత్రములు వివరింపఁ బడియున్నవి. వీనిని సమన్వయించియు నూతనాధారములు సేకరించియు నొక చరిత్రగ్రంథము ప్రకటించుట యత్యవసరము. ఈకృషి ఆంధ్రేతిహాసపరిశోధకసంఘమువారు ప్రకటింపబోవు కాకతీయసంచికరూపమున సఫలముకాగలదని యాశించుచున్నాఁడ.

కాకతీయ సామ్రాజ్యము మిగుల విశాలమైనది. దీనికి సరిహద్దులు ఆంధ్రదేశమున కావలనున్నవి. దేవగిరి యాదవులు, వెలనాటి చోడులు, పాండ్యులు, హతశేషులగు చాళుక్యులు వీరికి ప్రత్యర్థులుగానుండి పలుతావులఁ దాము కాకతీయులజయించితి మని చెప్పికొనిరి ఆవిజయములు తమవని కాకతీయులు చెప్పుకొనిరి. చరిత్రమునకుఁ గలవరము గూర్చు స్థానికచరిత్రములు సమన్వయించినగాని యథార్థచరిత్రములు బయలువెడలఁ జాలవు. ఆంధ్రులు నిష్పాక్షిక భావముతో ఆంధ్రసామ్రాజ్యచరిత్రము ప్రకటించుటలోఁ గృతార్థులగుట వారల ప్రథమధర్మము.

కాకతీయులకు సంబంధించిన శాసనము లనేకములు మదరాసుశాసనశోధకశాఖవారు ప్రకటించినారు. హైదరాబాదులోని లక్ష్మణరాయపరిశోధకమండలివారును దొరతనమువారి శాసనపరిశోధకులును విలువగల శాసనములు ప్రచురించుచున్నారు. ప్రజలలోఁ జరిత్రము నెఱుంగుటలోఁ గొంత కొంతయుత్సాహము తలసూపుచున్నది. ఆంధ్రదేశేతిహాససంఘమువారీసుసమయమున ప్రబోధకరమగు పరిశోధనముతో సర్వాంగసంపూర్ణమగు సంచికను బ్రచురింపనెంచుట భావిశుభసూచకము.

ఈ యుద్యమమునెడ నభిమానముజూపి వస్తుప్రదర్శనశాల నీసభాసమయమున నేర్పరచినందులకును, ఈ యుద్యమమున కెంతయో సహాయము గావించినందులకును ఈశాఖవారికి హృదయపూర్వకముగా గృతజ్ఞత దెలుపుకొను చున్నాఁడను.

ఆనాహూతముగా "కాకతీయసభ" ఈ చరిత్రప్రదేశమున సలుప సంకల్పించి దొరతనమువారికడ ననుజ్ఞబొంది సభానిర్వహణమునకు మన నేటి సమావేశమునకును గారకులగు నీపరిశోధకసంఘమునకు కార్యదర్శులైన శ్రీయుత రాళ్ళబండి సుబ్బారావు పంతులు ఎం. ఏ. యల్. టి. గారికిఁ గృతజ్ఞత దెలుపుట నాప్రథమ కర్తవ్యము. వారి తీవ్రకృషివలన చాళుక్య, కళింగ సంచికలవంటి కాకతీయసంచిక అచిరకాలమున దర్శింపఁ గలుగుదుమని ఆశించుచున్నారము. చరిత్రాధారములతో నిండిన పరిశోధనవ్యాసములతో సంచిక నలంకరించు

పరిశోధకులును మనకృతజ్ఞతకు పాత్రులు.

ఇట్టి మహాసభకు అధ్యక్షులుగా నుండుటకై ప్రొఫెసర్ యస్. హనుమంతరావు ఎం. ఏ., ఎల్. టీ గారిని మేము ప్రార్థింపగా వారు వెంటనే యంగీకరించియున్నారు. వారు నిజాముకాలేజిలో చారిత్రకపండితులు. ఈరాష్ట్రములో వీరికన్న చారిత్రకజ్ఞానముగల్గిన పండితులు అరుదుగా నున్నారు. కావున అట్టి యీప్రొఫెసరుగారిని అధ్యక్షస్థానపీఠ మలంకరించుటకై మాపక్షమున ప్రార్థించుచు మరల నొకతూరి మీకు మా సంఘముపక్షమున కృతజ్ఞతావందనము లర్పించుచు నింతటితో సెలవు తీసికొనుచున్నాను.

కాకతీయసభాధ్యక్షోపన్యాసము.

పిమ్మట ప్రొఫెసరు సిరుగూరిహనుమంతరావు పంతులు ఎం. ఏ, ఎల్, టి గారధ్యక్షపీఠము నలంకరించి యీక్రిందియుపన్యాసము నొసంగిరి.

సభ్యులారా!

ప్రాచీనమైన ఏకశిలానగరమున నేడు చేయఁబడుచున్న కాకతీయవర్ధంత్యుత్సవసందర్భమున నన్నధ్యక్షునిగ నియమించినందులకై ఆంధ్రేతిహాసపరిశోధకమండలికి వందనము లర్పించుట నాప్రథమకర్తవ్యమైయున్నది. ఆంధ్రచరిత్రమునందు నాంధ్రవాఙ్మయమునందును నిరుపమానపాండిత్యముగలిగి నేటిసభ కగ్రాసనమలంకరింపనర్హులగు విద్వాంసులనేకులుండ నన్నేల నేటికార్యమున కధ్యక్షునిగనియమించిరో యూహింపజాలకున్నాను. ఆలోచించిచూడగా రాజమహేంద్రవరమున జేయుబడుచున్న ఆంధ్రపరిశోధనకును నైజామురాష్ట్రమున నాబోంట్లు కొందఱచే యథాశక్తి జేయబడుచున్న పరిశోధనకార్యమునకు నొకవిధమైనసంబంధ మేర్పరుచుటకు నన్ను నియమించియుందురని తోచుచున్నది. గనుక నేటియుపన్యాసమందు ప్రధానాంశము,ఘనతవహించిన శ్రీనిజాముగారిరాష్ట్రమున దొరతనమువారిచేతను,ఇతరసంస్థలచేతను, పండితులచేతను జరుపబడుచున్న పరిశోధనాక్రమమును నిరూపించుటయైయున్నందులకు క్షమించవలసియున్నది. ఆంధ్రచరిత్రమునకు మనదేశమందుదొరతనమూలాధారములపరిశోధన మిటీవలనారంభింపబడినది. కర్జనుప్రభువుగారిసంస్కరణములను ప్రవేశపెట్టినతరువాత ఇండియాదొరతనమువారు ఆర్షశాఖను సంస్కరించిరి. హిందూదేశచరిత్రమును పరిశోధించుటకు గావలసినసదుపాయములుచేసి, ఆర్షశాఖవలన సేకరింపబడిన సాధనముల నన్నిటినిగైకొనిహిందూదేశచరిత్రమందలి పూర్వమధ్యమయుగములనిర్మాణమున కుపయోగించుటకు విశ్వవిద్యాలయములారంభించి పదునైదువత్సరములైనది. తదుపరి ఇండియాదొరతనమువారిని దృష్టాంతముగగొని ఎందరోదేశీయరాజ్యాధిపతులు తమతమరాష్ట్రములలోను ఆర్షశాఖల నేర్పాటు చేసియున్నారు. 1914 సంవత్సరమున మహాఘనతవహించిన నిజాముప్రభువుగారు దయతో నొక ఆర్షశాఖనేర్పరచి దానికి శ్రీయాజ్దానీగారిని డైరెక్టరుగనియమించిరి. 1914 సంవత్సరమునకు బూర్వము నైజామురాష్ట్రమందున్న వివిధప్రాచీనవస్తువులు బొంబాయిఆర్షశాఖాధికారికి లోబడియుండెను. దక్కనుఆర్షశాఖకు హిరిగ్రంగుహామదొరసానిగారును, ఫెర్గుసన్, బర్జెస్, గ్రిఫీత్ దొరగార్లును మార్గదర్శకులయి యున్నారు. 1834 సంవత్సరమునప్రచురిం

పబడిన బొంబాయిగెజటీరు, క్రీ. శే. నవాబుసయ్యదుహుసేను బిల్గ్రామిగారును విల్మాటుగారును వ్రాసిన "The Historical and descriptive sketches of the Nizam's Dominions" అను సమూల్యగ్రంథములయందు నైజాము రాష్ట్రమందున్న వివిధప్రాచీనవస్తువులవిషయమై విపులముగ వ్రాయఁబడియున్నది. బొంబాయియందున్న ఇండియాదొరతనపురార్షశాఖాధికారియైన కజెన్సుగారు నిజాము రాష్ట్రమందలి ప్రాచీనవస్తుజాతమున కొక పట్టీ తయారుజేసినారు. కజెన్సుగారు బీజాపూరుశిల్పమును గురించియు, చాళుక్యశిల్పమునుగురించియు రెండుత్తమమైనగ్రంథముల రచించియున్నారు. శ్రీయుతరామకృష్ణకవిగారు నిజాము రాష్ట్రశాసనము లను శీర్షికక్రింద నొకనివేదిక వ్రాసిరి.

ఇరువదవశతాబ్దారంభముతో భాగ్యనగరమం దొక నూతనశక మేర్పడినది. ఆర్షశాఖానిర్మాణ మీనూతన శకచిహ్నములలో నొకటియని చెప్పవచ్చును. నిజాం రాష్ట్రమందంతటను విరివిగగన్పట్టు ప్రాచీనవస్తువులు 'New Stone Age' మొదలు కొని నేటివరకును చరిత్రయందుగన్పట్టు వివిధయుగముల మానవులయొక్కయు, రాజవంశములయొక్కయు వృత్తాంతమును, నాగరికతను ఉన్నతిని తెలుపుచున్నవి. కెయిరన్సు (Cairns) అను సాంకేతికనామములుగల అజ్ఞాతయుగపుసమాధులు నైజాంరాష్ట్రమునందంతటను, ముఖ్యముగ తెలుఁగు జిల్లాలయందును సమృద్ధిగ జూపట్టుచున్నవి. నల్లగొండజిల్లాయందలి రాయగిరి, పాల్వంచ తాలూకాలోని జానంపేట, హైదరాబాదు సమీపముననున్న మౌలాలి మొదలగుప్రదేశముల సమాధులు పరిశీలింపదగినవి. ఈసమాధులఁగన్పడుకుండలకును మదరాసుమ్యూజియములోని అదైచెనల్లూరికుండలకును ఎక్కుడుసామ్యము వెల్వడినది. నిజాము రాష్ట్రమునఁజూపట్టు కోయలు, కురుంబలు, బంజారులు మొదలగు ఆదిమజాతివారు క్రొత్తరాతియుగపునివాసులసంతతివారై యున్నారు. ఆంధ్రపరిశోధకసంఘకార్యదర్శియు సత్యోత్సాహమూర్తియునగు శ్రీయుత సుబ్బారావుగారు పౌనఃపున్యముగ ఆదిమవాసులనుగురించి వ్యాసముల వ్రాసి ప్రచురించియున్నారు. ఇంకను జిల్లాలలో నిట్టి పనికత్యంతావకాశముకలదు.

ఇఁక అజ్ఞాతయుగ ప్రశంసవదలి, జ్ఞాతయుగమునందు క్రీస్తుశకమునకుఁబూర్వము 300 సంవత్సరములు, క్రీస్తుకుఁదరువాత 300 సంవత్సరములనాటి చరిత్ర, విజ్ఞానము, నాగరికత మొదలగువవి తెలిసికొనుటకు దక్కను ఎంతవఱకుఁ దోడ్పడుచున్నదో తెలిసికొనవలసియున్నది. రాయచూరుజిల్లా మస్కియొద్ద దొరకినశాసనము మౌర్యులు దండెత్తివచ్చి దక్కనుమీఁదపడిరను యుక్తిని దృఢముచేయుట కుపకరించుచున్నది. అశోకుని శాసనముల నిర్ధారణచేయుటకు సామాన్యముగ "దేవానాంపియ" 'పియదశి' యను ఆతనిబిరుదములే యాధారములు. కాని మస్కి శాసనమందుమాత్ర మశోకుని పేరు వ్రాయఁబడినది. శిథిలమైన హంపికిఁ బశ్చిమమున నిరువది యొక్క మైళ్లదూరమున శ్రీనిజాముగారి సరిహద్దుననున్న కొప్పల్ కడ రెండుశాసనములు దొరకినవి. ఇవి నైజాము పరిశోధనశాఖచేఁ బ్రచురింపఁబడుచున్నవి. ఈశాసనములును, గుత్తికనతిదూరమునఁ బయల్పడిన కొంతసామగ్రియు దక్కనుపై మౌర్యులు దండెత్తివచ్చిరను యుక్తిని ధ్రువపరచుచున్నవి.



పాలంపేట దేవాలయము:—ముఖమంటపము.

By Courtesy of H. E. H. The Nizam's Archaeological Department.

ఆంధ్రశాతవాహనుల 'పైఠను' "టాగర" అను ముఖ్యమైన రెండుపట్టణములు నిజాము రాష్ట్రములోనివే. పరిశోధనశాఖవారు పైఠనును త్రివ్వుటకు కేంద్రస్థానముగ జేసికొను న్నారు. ఈరాజవంశమువలన హిందూదేశనాగరికతకే కాక విశాలవిశ్వమానవజాతికికూడ సం క్రమించినసొత్తు అమూల్యమగును. అజంతాఅనుశబ్దమును, అజంతాగుహాలయములును, అ జంతా వాస్తుశాస్త్రము, శిల్పనైపుణ్యము, చిత్తరువులువ్రాయువిధానమునుగూడ నిరుపమా నములు. ఇటాలియను రినైసాన్సు కాలమువఱకును అజంతాచిత్తరువులబోలిన మెచ్చటను ప్రపం చమందు లేకుండెను. అజంతాగుహలిరువదితొమ్మిది. కొన్ని అజంతాగుహాలు ఆంధ్ర, వాకాటక, పూర్వచాళుక్యుల కాలమునకు దరువాతికాలపునాటివై యున్నవి. మొదటిగుహ జగద్విఖ్యాత మైనది. దానితో చెక్కబడిన హిందూదేశములోని ఆలయములలో దీనినిమించిన దేదియు లేదు. ఇటీవల పరిశోధనశాఖవారిచే ప్రచురింపబడిన సంచికయందు బోధిసత్త్వ పద్మపాణి యొక్క దివ్యమైనచిత్తరువు. మఱికొన్నినలుబది చిత్తరువులు కన్పట్టుచున్నవి. ఈసంచికకు యాజ్దానీగా రత్యుత్తమమై శాస్త్రీయమైన వివరము వ్రాసిరి. 1200 సంవత్సరములక్రిందట బౌద్ధప్రపంచమునుండి దీర్ఘప్రయాణములుచేసి రాజకుమారులు, యాత్రావరులును, ప్రధాన యాత్రాస్థలములును విశ్వవిద్యాలయములునగు అజంతాగుహల సందర్శించుటకై వచ్చుచుండె డివారు. కొంతకాల మివి విస్మృతములయ్యును మరల ప్రపంచదృష్టి నాకర్షించుచు నత్యం తాశ్చర్యసంజనకము లగుచున్నవి. ఈ గుహలలో నొక చోట ఆంధ్రవర్ధంతిని జరుపుటసమంజ సముకాదా!

మొదటి చాళుక్యులకును కల్యాణిచాళుక్యులకును మధ్యకాలముననున్న రాష్ట్రకూటుల కాలముకూడ దక్కనుయొక్క ఘనతకును, ఉన్నతికిని, నాగరికతకును మిగుల ముఖ్యమైనది. అజంతాగుహల విస్తీర్ణముకంటె ఎల్లోరాగుహల విస్తీర్ణమధికము. ఎల్లోరాగుహలు ఆనాటి బౌద్ధ, జైన, శైవమతము లన్యోన్యముగ వర్ధిల్లెననుటకు ప్రమాణము. ఎల్లోరాశిల్ప మతిదివ్యము. మఱియు నేకశిలానిర్మితమును దేదీప్యమానమునగు కైలాసాలయము ప్రపంచమునకెల్ల నత్యం తవిస్మయముగొల్పు కట్టడములలో నొకటి. ఎల్లోరాగచ్చుగోడలపై వ్రాయబడిన చిత్తరువు లజంతాచిత్తరువులంత పనితనముకలవికావు. కే. శే. గోపీనాధ్రావుగారు, బి. సి. భట్టాచార్యు లగారు, కృష్ణశాస్త్రిగారు, బి.సి.గంగూలిగారు, టి. జీ. అంవముత్తను మొదలగు పండితుల ప్రయత్నమూలమున ఆధునిక కాలమందు ఉత్తరహిందూస్థానమందలి బౌద్ధులయొక్కయు, దక్షిణ హిందూస్థాన బ్రాహ్మణులయొక్కయు విగ్రహశిల్పశాస్త్రము (Iconography) యందు ప్రజల కత్యంతాదర మేర్పడినది. ఎల్లోరాగుహలలోని విగ్రహములనుగురించి యొక ప్ర త్యేకగ్రంథము వ్రాయబడినచో పురాతనకాలపు శైవవిగ్రహములనుగూర్చిన మన జ్ఞానమును వృద్ధిచేయుటకు ఎంతయు తోడ్పడగలదు.

రాష్ట్రకూటులరాజధానియైన మల్ఖేడు నైజాంరాష్ట్రమునందున్నది. ఇది త్రవ్వుటకు దగియున్నది. బోధన్ (ఇప్పుడిది నైజామాబాదుకు 14 మైళ్ళదూరమున నిందూరనివ్యవహరిం పబడుచున్న యొక గ్రామము) రాష్ట్రకూటరాజగు మూడవయింద్రునికి (915—917) రాజ

ధానియై యింద్రపురమని వ్యవహరింపఁబడుచుండెనని కల్యాణిచాళుక్యుల యొకశాసనము వలనఁదెలియుచున్నది.

11, 12 వ శతాబ్దములలోఁజాళుక్యరాజనిర్మితములగు కొన్ని దేవాలయము లానాటి యత్యుత్తమమయిన ఆలయశిల్పచిత్రముల నైపుణ్యమునకు నిదర్శనములై యున్నవి. ఏకశిలానగరమునకును భాగ్యనగరమునకును మధ్యస్థమైన కొల్లిపాక, దోర్నకల్లున కనతిదూరముననున్న గార్ల, వాడికిసమీపముననున్న నాగై, రాయచూరుమండలముననున్న అలంపూరుమొదలగు ప్రదేశములలోఁగల్యాణిచాళుక్యులదేవాలయములు శిథిలములై జూపట్టుచున్నవి. ఈ ఆలయములలో గొన్నింటినిరక్షించుటకు దగినయేర్పాట్లుచేయబడినవి. ప్రచురింపబడిన గల్యాణిచాళుక్యులశాసనములలో మొట్టమొదటిది రెండవజయసింహజగదేకమల్లునిది. ఇది దౌల్తాబాదునకుసమీపమునదొరకినది. మొదటిసోమేశ్వరునిశాసనములు రెండు(1056,1058 A.D )బోధనుయొద్దను నాగై యొద్దను దొరకినవి. ఆరవవిక్రమాదిత్యునిశాసనములు రెండు రాయచూరుజిల్లాము నిరాబాదుయొద్ద సంపాదింపబడినవి. రెండవజగదేకమల్లునిశాసనము నాగైసమీపమునగాన్పించెను. కల్యాణిచాళుక్యులలో నారవవిక్రమాదిత్యుని రాజ్యకాల మతి దీర్ఘమైనది. సంస్కృతకవితల్లజుడగు బిల్హణకవి యీతనిచరిత్రమును వ్రాయుదటస్థించుట కడుంగడు ప్రశంసార్హము. విక్రమాదిత్యునిరాజధానియై, ఇండియాయొక్క వివిధభాగములనుండి విద్వాంసులనాకర్షించినట్టి కల్యాణి, నైజామురాష్ట్రములోనిదే. పైనిపేర్కొనబడిన నాగై శాసనములు ఆరవవిక్రమాదిత్యుని" రామనారాయణ, రాయకంఠీరవ"అను అపూర్వబిరుదములరెంటిని వెల్లడిజేయుచున్నవి. మరియు నాగై శాసనములవలన 252 మందివిద్యార్థులకు భోజన వస్త్ర పుస్తకభాండాగారాదిసౌకర్యములకై విరాళమొకటియొసంగబడినట్లు తెలియనచ్చుచున్నది.

హైదరాబాదు మ్యూజియమునందు సంగ్రహింపబడి రక్షింపఁబడుచున్న నాణెములు 25000 లకు మించియున్నవి. ఈనాణెములు బహుప్రాచీనకాలముమొదలుకొని నేటికాలమువఱకు నుపయోగములోనుండినవి. కొన్ని నాణెములు క్రీస్తుకు పూర్వము రెండవశతాబ్దమునాటివి. అత్యాధునికకాలమునకుసంబంధించియున్న కొన్ని నాణెములు కరీంనగరు(త్రిలింగజిల్లా)లో లభ్యమైనవి. ఈనాణెములకు బూరణములు, లేక కార్షాపణములనియుపేరు. ఈనాణెములపై చిహ్నములుతప్ప తేదీలుగాని పేరులుకానఁబడుటలేదు. చాళుక్యులనాణెములలో [illegible] పూర్వచాళుక్యరాజగు కుబ్జవిష్ణువర్ధనుని కాలమునాటివి నల్లగొండ జిల్లాయందు సంపాదింపబడినవి. కల్యాణిచాళుక్యులనాణెము లనేకములు గుల్బర్గా బిదరు జిల్లాలనుండి తేబడినవి. వీనిలో నొకటిరెండు బంగారునాణెము లారవవిక్రమాదిత్యునివని(1075—1126 A.D.) ఊహింపబడుచున్నవి.

కాకతీయు లనేక కట్టడములు కట్టియున్నారు. 12 వ శతాబ్దమున ప్రోలరాజుచేనిర్మింపబడిన అనుమకొండదేవాలయము కాకతీయప్రథమస్మారక చిహ్నమని చెప్పనచ్చును. ఇదియిప్పుడు పదిలముచేయబడినది. వరంగల్లుకోట రెండవది. ఇది కాకతీయకులాబ్ధిచంద్రుడగు గణప

తిదేవునిచే ప్రారంభింపబడెను త్రిలింగమునందంతటను గణపతిదేవునిశాసనములు జూపట్టుచున్నవి. గణపతిదేవు డనేకదేవాలయముల గట్టించిన విఖ్యాతపురుషుడు. అనుమకొండకు నలుబదిమైళ్ళదూరముననున్న పాలంపేటదేవాలయములు మధ్యమయుగహిందూదేవాలయములలోనగ్రగణ్యములనివర్ణింపఁబడినవి. గణపతిదేవునిచేతను తదనంతరనృపపుంగవులచేతను గట్టింపబడిన యాలయములు కరీంనగరంజిల్లాలోని ఉప్పరపల్లె, నగునూరు, మంథెన, నల్లగొండజిల్లాలోని పిల్లలమఱ్ఱి, నాగులపాడు, త్రిలింగయందంతటను, ముఖ్యముగ నల్లగొండజిల్లాలోని పానగల్లు, రాజకొండ మొదలగు స్థలములదృశ్యములు ఈయాలయములశిల్పనైపుణ్యముమిగుల కొనియాడదగినది. పిల్లలమఱ్ఱిదేవాలయమున యాజ్దానీగారు కనిపెట్టిన గచ్చు గోడపైని మూడుచిత్తరువులలోనొకటి శేషరజ్జువుతోను, మంథరగిరిమంథనదండముతోను దేవాసురులు సముద్రమథనము చేయుచున్నట్లు ప్రదర్శించుచున్నది.

గణపతిదేవుఁడుజగద్విఖ్యాతములగు దేవాలయములగట్టించుటయగాక దివ్యతటాకముల ద్రవ్వించెను. ఈతటాకములన్నియు తరువాతియేలికలచే మరమ్మత్తు చేయింపఁబడుచువచ్చెను. రామప్ప తటాకము పేర్కొనఁదగినది. ఇది ఎనిమిదిచదరపుమైళ్ళ విస్తీర్ణముకలది. దీనికొకవంక అత్యున్నతమైనగట్టకలదు. పాకాలతటాక మనదృశమని చెప్పవచ్చును. దీనివిస్తీర్ణము 13 చదరపుమైళ్లు.

కాకతీయులు తమరాజ్యమందంతటను గిరిదుర్గములు కట్టించిరి. ఈగిరిదుర్గములు కాకతీయులయుగమునను, భామినీకుతుబుషాహీల కాలమునను కడుప్రాముఖ్యత నొందెను. గోలుకొండ ఏకశిలాగిరిదుర్గములలో నొకటి. మఱియు కాకతీయచిహ్నమగు రెండుతలలగండభేరుండపక్షి రెండేనుఁగుల ముక్కున గఱచుకొని వాలాహిస్సారునందు దర్బారుహాలుకెదుటనున్న హిందూదేవాలయముయొక్క గోడపై నేటికిని స్పష్టముగానుండుట కడుచోద్యము. తెలగందలయను తెలుఁగుకవికి వాసస్థానమయిన కరీంనగరుజిల్లాలోని ఏల్గందల్, భోనగిరి, రాచకొండ, నల్లగొండ, పానగల్లు మొదలయినవి త్రిలింగయందలి మధ్యమయుగపు గిరిదుర్గములలోకొన్ని. ఇవిశిథిలములుకాకుండుటకై తగుప్రయత్నములుచేయబడినవి. కాకతీయశాసనములు ప్రచురింపబడినవి. వీనిలో నొకదానియందు తేదివేయలేదు. గణపతిదేవునివఱకు కాకతీయవంశావళిమాత్రము కన్పట్టుచున్నది. 1213 స॥ నాటిపాలంపేటశాసనము కాకతీయచరిత్రమున ప్రాముఖ్యతను వహించిన రేచర్లసామంతరాజవంశావళియొక్క ఘనతను తెలుపుచున్నది. 1236 స॥ ఉప్పరపల్లిశాసనము గణపతిదేవుని ఉత్తరదిగ్విజయములను వివరించుచున్నది. పిల్లలమఱ్ఱి నాగులపాడు గ్రామములయందలి గణపతిదేవునిశాసనములనుగుఱించి సంక్షేపముగ శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారి యాంధ్రచరిత్రమున వ్రాయబడియున్నది. ఈశాసనములు చక్కఁగఁ బరిశీలింపబడి ప్రచురణమునకు నిపుణులగుపండితులకుఁ బంపఁబడుచున్నవి. ఈశాసనములు రేచర్ల రెడ్డివంశముయొక్క ప్రాముఖ్యతను వెల్లడిచేయుచున్నవి.

రుద్రాంబకాలమున 1273 లిఖింపబడిన శాసనమొకటి నేను ప్రచురించియుంటిని. దీనియందు విర్యాలవంశమును కొత్త సామంతరాజవంశము వర్ణింపబడియున్నది.

ఆంధ్రచరిత్రపరిశోధకసంఘ ప్రధానకార్యస్థానమయిన రాజమహేంద్రవరములో నొక ప్రాముఖ్యమైన మసజీదు బహిర్ద్వారముపై నొక పర్ష్యనుశాసనము కలదు. దీనిని మొట్టమొదట యాజ్దానీగారు ఎపిగ్రాఫికాఇండోమాసమికాలో ప్రచురించిరి. ఈశాసనము వలన 1324 A.D లో నీమసజిదును ఘియాజుద్దీను తుగ్లకుగారిసేనానాయకుడయిన ఉలుఘ్ ఖానుగారు కట్టించిరని స్పష్టమగుచున్నది! ఘియాజుద్దీను తుగ్లకుగారు 1324 సం॥రమున నేకశిలానగరమును స్వాధీనముచేసికొనిరి.

ఏకశిలానగరపతనానంతరము తుంగభద్రానదీతీరమున విజయనగరరాజుల వంశమొకటి క్రొత్తది స్థాపింపబడెను. విజయనగరసామ్రాజ్యమునకు పూర్వము ఆనెగొంది యొక ప్రాచీన హిందూరాజ్యమై యుండెను. ప్రస్తుతము ఆనెగొంది శ్రీనిజాముగారి సామంతరాష్ట్రములలో నొకటి. ఆనగొందియం దనేకపాతదేవాలయములను, గచ్చుగోడలపై నేత్రపర్వమైన ర్ఛు చిత్రములను గనిపెట్టుచున్నారు.

సితాబ్ ఖాను పదునేనవ శతాబ్దాంతమున బహమనులపరిపాలనలోనున్న ఏకశిలానగరమునకు రాజప్రతినిధిగనుండెను. ఇతడు వరంగల్లు కోటయందొక దర్బారుహాలుకట్టించెను. ఈహాలు పదిలముచేయబడినది. సితాబ్ ఖానుయొక్క శాసనమొకటి కీ. శే. కే. వీ లక్ష్మణరావుగారిచే విపులోపోద్ఘాతముతో ప్రచురింపబడి ప్రకృతము పరిశోధనశాఖవారిచేప్రకటింపబడు చున్నది.

గోలుకొండ కుతుబుషాహీరాజులలో నొకడు ఆంధ్రులకు ప్రధానపోషకుడయ్యెను. అద్దంకిగంగాధరకవిని, పొన్నగంటితెలగనార్యుని ఇతడుపోషించెను. ఇతడు చిరకాలము విజయనగరవాసియగుటచేతను, ఆంధ్రసామంతుల సాహాయ్యమున సింహాసనమునధిష్ఠించిన వాడగుటచేతను ముఖ్యముగ నాంధ్రు లీతని యనుగ్రహమునువడసిరి. మహబూబునగరుజిల్లాలోని కొల్లకొండ ఆంధ్రులచే నధిష్ఠింపబడిన దుర్భేద్యదుర్గమైయుండినది. కుతుబుషాహీకు ఆంధ్రులు మిగుల దోడ్పడి నట్లొకశాసనమువలన తేటపడుచున్నది.

భక్తాగ్రేసరుడగురామదాసుచరిత మాంధ్రులకందరకును విశదమేకదా! గోలుకొండ దుర్గముపై గుహయొకటి రామదాసుకారాగారస్థానమనిచూపబడుచున్నది.

ఈపై ప్రసంగమువలన తేలినసారాంశమేమనగా హైదాబాదుగవర్నమెంటు ఆర్షశాఖవారిచే రక్షణము (Conservation) శాసనపరిశోధనము, (Epigraphy) నాణెములపరీక్ష (Numismatics) మొదలగువివిధఆర్షశాఖారూపములచేయబడినకృషి దక్కను చరిత్రమునకు ముఖ్యమనుట. ఇట్టిసమాచారములు ఆర్షశాఖవారి పోటోలయందును వేదికయందును మఱుగుపడియుండవలసినదేకాని ప్రజలకు వానినిచదివి తెలిసికొనునంతటి యవకాశముకాని శ్రద్ధకాని లేకుండుట విచారకరమైన సంగతి. పురాతనవస్తువులయందు ప్రజలకభిరుచిపుట్టించుటకు శోధకసంఘమునకు దోడు మ్యూజియమొకటి దాని సిటీవల హైదాబాదులో మంచిసాధనసామగ్రితో శ్రీనివాసముగారు స్థాపించిరి. దీనియందు అమరావతినుండి తెప్పించిన సుందరమైన 87విగ్రహములును, మెదకుజిల్లా పటంచేరునుండి తెప్పించిన 10- 14 అడుగులయెత్తై నజైనవిగ్రహములు విశేషముగ త్రిలింగనుండి తెప్పించిన హిందూ శైవ వైష్ణవవిగ్రహము



ఇత్తగిదేవాలయ శిఖరము.

By Courtesy of H. E. H. The Nizam's Archaeological Department.

మును, చాళుక్యులయొక్కయు కాకతీయులయొక్కయు శిలాశాసనములును అజంతా ఎల్లోరా చిత్తరువులున్న తాటియాకు గ్రంథములును ఇట్లువిచిత్రమై ప్రాచీనచరిత్రాధారములగు వస్తుజాలము సందర్శింపబడుచున్నది.

దొరతనమువారు ఎంతద్రవ్యము వ్యయముచేసినను, ఎంతపరిశోధకసామగ్రి సంపాదించినను పరిశోధన సంపూర్ణముగజరుగవలెనన్న విద్వత్ సంస్థలయొక్కయు ఇతరవిద్వాంసులయొక్కయు సాహాయ్యమత్యవసరము. పూనాభండార్కర్ ఇన్‌స్టిట్యూటు, బెంగుళూరు మిథిక్ సొసైటి, రాజమహేంద్రవరమండలి యాంధ్రపరిశోధకసంఘము ఇట్టివి జనులయొక్క చరిత్రవృద్ధికి మిగుల దోడ్పడినవి. దాదాపు పదిసంవత్సరముల క్రిందట నైజాంరాష్ట్రాంధ్రుల కొరకు పరిశోధకసంఘము స్థాపించిన శ్రీయుత మునగాల రాజాగారికి నితరనిజాంరాష్ట్రాంధ్రప్రముఖులకును వందనశతములు. ఈఆంధ్రపరిశోధకసంఘముయొక్క శాఖాస్థానము హైదరాబాదునందలి శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయమే. కృష్ణదేవరాయాంధ్రభాషానిలయము స్థాపింపబడి ముప్పదిసంవత్సరములయినవి. దీనియందు 4000 గ్రంథములేర్పడినవి. ఈ భాషానిలయము భాగ్యనగర నివాసులగు ఆంధ్రులప్రజ్ఞావిశేషమునకును అత్యుద్ధతికిని మిగులదోడ్పడుచున్నది. ఈపరిశోధకసంఘపక్షమున సుప్రసిద్ధపండితులయిన శేషాద్రిరమణకవులపుడపుడు జిల్లాలయందుఁ బర్యటనము చేసి, ప్రాచీనలిఖితగ్రంథముల సంపాదించియు, శాసనములకు బ్రతిబింబములదీసియు, యీ ఆంధ్రపరిశోధకసంఘమునకు జేసిన మహోపకారము చిరస్మరణీయము. ఈయాంధ్రపరిశోధకసంఘమునకై సంపాదింపఁబడిన యమూల్యతాళపత్రగ్రంథములు, కయిఫియ్యతులు, నాటికాలపు చరిత్రలు, శాసనప్రతిబింబములు మొదలగునవి యీభాషానిలయమున సంరక్షింపబడుచున్నవి. శాసనబింబములకు ప్రతులువ్రాసి స్థానికపత్రికలలో సంగ్రహముగ బ్రచురించియున్నారు. మదరాసువిశ్వవిద్యాలయమువనుండి కాకతీయచరిత్రపరిశోధించినవిద్యార్థియగు శ్రీమారేమండ రామారావుగారు కాకతీయశాసనములను గురించి యొకనివేదికనువ్రాసిరి. మఱియు నిజాము రాష్ట్రాంధ్ర పరిశోధనసంఘముచే సేకరింపబడిన శాసనప్రతిబింబములకు నకళ్ళు వ్రాసియు పని పూర్తిచేసినారు. ఈప్రతులారితేరిన పండితులకు సవరణనిమిత్తము పంపబడుచున్నవి. రామారావుగారి పరిశోధనకార్య మాంధ్రపరిశోధకసంఘసంచికలయందుఁ గన్పట్టుచున్నది. ఇంతకు పూర్వమాంధ్రపరిశోధకసంఘకార్యదర్శిగనుండిన శ్రీయుత బి. వి. కృష్ణారావుగారు మాశాసనములు తెప్పించుకొని భారతియందు బ్రచురించిరి. శ్రీ శేషాద్రిరమణకవులు స్వానుభవమునను నకురికార్డుల యాధారమునను వ్యాసములు ప్రచురించియున్నారు.

అయిఁ
అలోక
లనే

నిజాము రాష్ట్రాంధ్ర పండితులలో కీ. శే. కే. వీ. లక్ష్మణరావుగారు గొప్పమార్గదర్శకులు. వీరి యకాలమరణమువలన నాంధ్రదేశమునకు వచింపరాని నష్టము సంభవించినది. వీరాంధ్రచరిత్రపరిశోధనారూపమున నాంధ్రులకు జేసిన యమూల్యసేవాచిహ్నముగ మాపరిశోధకసంఘము లక్ష్మణరావు గారిపేరవ్యవహరింప బడుచున్నది.

హైదరాబాదునగరమున రెడ్డివిద్యాలయమువారు ప్రాచీనవస్తుసంపాదన చేసి కాపాడుచున్నారు. వీరియుద్యమము కొనియాడదగినది. కాకతీయులకాలమునసున్న రెడ్డిప్రభువుల సతాం

ప్రదాయములు, వారిమహాభాగ్యము, వారితేజస్విత, వారిధార్మికత్వాది గుణములు భాగ్యనగర నివాసులగు రెడ్డిదొరలయందు మూర్తీభవించినవి. భాగ్యనగరపుపోలీసుకమీషనరుగారును, నేటి ఆహ్వానసంఘాధ్యక్షులగు శ్రీయుత వేంకటరామా రెడ్డిగారును మొదలగు రెడ్డిప్రముఖులు కడుంగడు వంద్యులు. హైదరాబాదునందొక పెద్దహాలును గట్టించి అందొకపుస్తకభాండాగారమేర్పరచిరి సుప్రసిద్ధమంత్రిపుంగవులగు అక్కన్న మాదన్నల పటములును, గద్వాలసంస్థానము వారిచే నొసగఁబడిన సచిత్రమహాభారతపర్వమొకటియు, పూర్వకాలమునఁ జేతివ్రాతయందు లిఖింపబడి నైపుణ్యమునుచాటు కొన్ని వ్రాతప్రతులును రెడ్డివిద్యాలయమునగలవు. అవిమిగుల సందర్శనీయములు. హైద్రాబాదుమ్యూజియమునందు పూర్వుల చేతివ్రాతయందలికౌశలమును ప్రకటించునవియు, కుతుబుషాహీలకాలమున శిలాఫలకములపై వ్రాయబడినవియు నగు శాసనములు, చేతితో వ్రాయఁబడిన కురాను పా మొదలగునవియు చూడఁదగినవి.

భాగ్యనగరవాస్తవ్యుడును, యూనాని వైద్యుఁడునగు మహమ్మద్ కాసిముగారి స్వాధీనమున కన్నడభాషలో వ్రాయఁబడి యనేకవిషయములతో నిండిన తాళపత్ర గ్రంథములుకలవు. పరిశోధింపబడనందున నీగ్రంథముల ప్రాముఖ్యత బయల్పడలేదు. ఇవి మొత్తముపై కన్నడములో వ్రాయబడియుండుటచేతను కన్నడజిల్లాలలో వీరశైవమతము సర్వజనాదరణీయమగుటచేతను ఈగ్రంథములు వీరశైవమత గ్రంథములని తోచుచున్నవి. నైజాముదొరతనమువారీగ్రంథములను కొనుటకు సంసిద్ధులై యున్నను డాక్టరుగారిష్టపడుటలేదు. ఈహేతువువలన నీగ్రంథములన్నియు గూఢనిక్షేపమనదగును.

విశేషముగ నిట్టి నిక్షేపములు నైజామురాష్ట్రములోని జాగీరుదారులయొక్కయు, ఇతరప్రభువులయొక్కయు, స్వాధీనముననున్నవి. యుద్ధారంభమునకు బూర్వము జర్మనీసామ్రాజ్యమందెంతప్రాముఖ్యతగలజమీందారీలుండెడివో అట్టి ప్రాధాన్యతగల గద్వాల, వనపర్తి, పాల్వంచ, పావన్నపేట మొదలగుసంస్థానములు మననైజామురాష్ట్రముననున్నవి. ఈసంస్థానాధిపతులందఱు విద్వాంసులును ప్రభావంతులై తమతమ పూర్వసాంప్రదాయములను, సౌజన్యమును ఘనతను దెలిసికొనుటకు సాభిలాషులై యున్నారు. ఈజాగీరుదారులు మొదలగువారు తమ స్వాధీనమందున్న అమూల్యములగు రికార్డులను లిఖితగ్రంథములను (ఇవిప్రచురింపఁబడినచో దమకును రాష్ట్రమునకును ప్రత్యవాయములేనిచో) పబ్లికు లైబ్రరీలకును మ్యూజియము[illegible]నెరువిచ్చిన గొప్పపండితులచే నవిపరిశోధింపబడుటకు వీలగునని యూహించుటకు నే[illegible] వచ్చునా? ప్రాతరికార్డులు ప్రచురించుటవలన చరిత్రకు గొప్ప ఆధారములు బయలు ప[illegible] బొంబాయిదొరతనమువారు మదరాసుగవర్నమెంటువారి కార్యాలయములయందలి రికార్డులను, ఇటీవల పీష్వాలకార్యాలయములలోని రికార్డులను ప్రచురించుటవలన చరిత్రమునకమూల్యములయినయాధారములనేకములుదొరకినవి. కుతుబుషాహనృపాలుని అమాత్యులయినఅక్కన్నమాదన్నలను గుఱించి దొరకినయాధారములన్నియు మదరాసురికార్డులలోనుండియే బయల్వెడలినవి. మదరాసు దొరతనమువారిచే ప్రకటింపబడిన అనందరంగపిళ్ళెగారిదినచర్యగ్రంథము 12 సంపుటములకు గౌరవముప్రాధాన్యముచేకూరినది. దేశీయరాజులు బ్రిటిషిండియాదొ

రతనము వారును ఇతరప్రభువులును ప్రాచీనస్మారకచిహ్నములను సంరక్షించుటకు ద్రవ్యమును విపులముగ వ్యయపరచిచేయు వివిధప్రయత్నములకు పండితబృందము సాహాయ్యమొసర్చినగాని శీఘ్రముగ జ్ఞానాభివృద్ధి కానేరదు. ఆంధ్రదేశమున చరిత్రపరిశోధనకు ప్రథమభిక్ష పెట్టిన శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగారు కీ. శే. కే. వీ. లక్ష్మణరావుగార్ల ప్రజ్ఞ సర్వతోముఖమని చెప్పవచ్చును. వీరిరువదవశతాబ్దమునాటి యాంధ్రులవికాసమునకును అభ్యుదయమునకును మిగుల దోడ్పడిరి. ఆంధ్రార్షశాఖాధ్యక్షులయిన శ్రీ జయంతి రామయ్యపంతులుగారు ఉద్యోగకాలమంతయు చేసిన భాషాసేవ అనన్యసామాన్యము. ఉద్యోగమునుండి విరమించినదాదిగ రామయ్యపంతులుగారు ముక్తేశ్వరమున నొక యాశ్రమమున ప్రశాంతముగ గూర్చొని ఆంధ్రపరిశోధన కార్యమునకై తమయావచ్ఛక్తిని వినియోగించుచున్నారు. నేటియువకులకీముువ్వురు పండితులును గొప్ప యాదర్శకపురుషులును ప్రోత్సాహకులు నై యున్నారు. నైజాముకాలేజి నుండియు, ఉస్మానియా విశ్వవిద్యాలయము నుండియు బట్టభద్రులైనవారిలో బరిశోధక శాఖయందు బనిచేయుచున్న యేకొలదిమంది పట్టభద్రులో తప్ప ఇతరులెవ్వరును స్వతంత్రమైన పరిశోధనచేసినట్లు వినము. శాసనములు బరిశోధించుటకేమి, వాఙ్మయాధారముల విమర్శించుటకేమి, దేశభాషలయందు సంపూర్ణప్రజ్ఞాతిశయ మత్యావసరమై యున్నది. సంస్కృత కన్నడ మహారాష్ట్రాది భాషాజ్ఞానము సమగ్రముగ లేనిచో మూలాధారముల ననుసరించి దక్కనుచరిత్రమందలి ఘనతను, నాగరికతను వివరించుటకు వీలుపడదు. ఈహేతువువలననే ఉస్మానియా విశ్వవిద్యాలయాధికారులు దేశభాషలయందు సంపూర్ణ పాండిత్యమును సంపాదించుటకు విద్యార్థివేతనముల నేర్పఱచియున్నారు. ఆట్టివిద్యార్థు లచిరకాలమున స్వయముగ పరిశోధనజేయ సమర్థులు కాగలరు.

సభ్యులారా! నాఉపన్యాసము ముగియనున్నది. చరిత్రవలన మనము గ్రహించునదేమనగా మన సాంప్రదాయములు, మనఘనత, మననైతికదృష్టి, మనసంస్థలు మనపూర్వులవలన మనకెట్లు సంక్రమించెనో అట్లే మనసంతతివారి సాంప్రదాయములకు, వారిఘనతకు, వారినైతికప్రవర్తనకును మనము బాధ్యులము కాగలము. ఏదేశీయులైనను, ఏజాతివారైనను, దమపూర్వసంస్కారములను బూర్తిగ దుడిచివేయజాలరనుట నిర్వివాదాంశము. అయితే మనపూర్వులవలన మనకు సంక్రమించిన సంస్కారములయందు లోపములున్నచో ఆలోపములదూరీకరించి నీరక్షీరన్యాయమున మనపూర్వుల సత్సాంప్రదాయములను, సద్గుణములనే మనము గ్రహింపవలసి యున్నది. పరమతద్వేషము చూపని నాగరికతలే చిరకాలస్థాయులుగ నుండగల్గినవి. చరిత్రము నిందాప్రచారముకాదు. ఇదిమనకు విదితమే. చరిత్రమునుపరిశీలించువానియొక్క దృష్టి ననుసరించి చరిత్రము యొక్క ప్రయోజనములే మారుచుండును. సాంఘికవాదియగువాడు చరిత్రమునొకదృష్టిచే బరిశీలించును. అయితే ఉభయుల దృష్టులును సరియైనవే యని వారియుభయుల యభిప్రాయము. కనుక ప్రపంచముయొక్క యోగక్షేమ మభిలషించు మనకందఱకును చరిత్రమునకు ఉత్కృష్టప్రయోజనము కల్పింప వలసిన భారము కలదు. ప్రతిమనుజుడును పూర్వాచారాగతమైన తనసాంప్రదాయములను, తనఘనతను స్మరించుకొని ఎట్లు గర్వించు

చునో అట్లే తనపొరుగు వారియొక్కయు, ఇతరమానవులయొక్కయు, ఇతరజాతీయులయొక్కయు ప్రాచీనసాంప్రదాయములను ఘనతను విన్నంతమాత్రమున నుప్పొంగిన శరీరముతో నతడు గర్వపడవలసియున్నది. మనకు టీరములో ముక్కుమూసికొని కూర్చుండి మనపొరుగువాని నమ్మక, స్వార్థపరులమై యుండుకాలము మ్మారినది. సర్వప్రపంచమునకును అపూర్వమైన ఐక్యత ఏర్పడినది. కనుక మానవునకు సంక్రమించినప్రాచీనాదర్శములు సార్వజనీనములనియు సర్వజనో ద్రేకసంజనకములనియు చాటుచు, విశాలదృష్టిని బ్రసాదించునంశములు చరిత్రమందుకలవో ఆయంశములే మనకు పునః పునః సంస్మరణీయములని నాయభిప్రాయము.

అధ్యక్షోపన్యాసము ముగిసినపిమ్మట శ్రీదూపాటి రమణాచార్యులవారీక్రింది స్వాగత పద్యములను చదివిరి.

ఓం.

# కాకతీయసభాస్వాగతపద్యములు.

ఉ॥ స్వాగత మాంధ్రులార! భుజశక్తిధురంధరకాకతీయరా
టాప్తిగనవద్యకీర్తివిభవప్రకటీకృత మోదబాష్పధా
రాగమనేత్రులార ! మహితైక శిలానగరీ మహోత్సవా
భ్యాగతులార ! మీ కిదియ స్వాగత మిద్ది పరిగ్రహింపరే ॥
సీ॥ ప్రసరించె నీవీటి ప్రస్తరాంచలముల జినదేవతాంకమౌ శిల్పలక్ష్మి
క్రాలె నీవీటిదుర్గద్వారములనుండి కాకతీయనృపాలకౌశలంబు
అలరె నీవీటి మహాసభాముఖమున కనువివిద్యానాథు సూక్తిసుధలు
తనరె నిచ్చటిమహీధరసానువులపయి ఆంధ్రజాతీయధ్వజాదికంబు
తే.గీ॥ ఇది త్రిలింగమహారాజ్యపదవి. యిదియ విస్మృతాంధ్రమహారాజ్యవీరభూమి,
ఇదియు యీనాటిమోరుగ, ల్లిచ్చ మీకు స్వాగతం బందుకొనుండు మహాంధ్రులార॥
సీ॥ పాడైన యీకోటగోడలలో నెందుఁ గనుమొఱంగినదో మాకాకతమ్మ
భూగర్భమున నెందుఁబూడిపోయెనో దేశమేలినతల్లి మాయేకవీర
అవతార మెట విడనాడెనో కాకతి భూమికల్పము స్వయంభూవిభుండు
ఏమయ్యెనో దేశహితమెంచి యవతారధారియైచనిన మైలారువిభుఁడు
తే.గీ॥ పూర్వవిఖ్యాతిచిహ్నముల్ భూమిగతము లగుట నిచ్చటఁ బాఁగెనో యాంధ్రమాత
శిథిలములఁగాంచి తెలియఁగాఁ జూచు సోద ! రాంధ్రమణులార ! మీకును స్వాగతంబు.
సీ॥ నవలక్షధానుష్కనాథులు మండలాగ్రములెత్తి రాజమార్గములనడువ
కవిగృహాంగణములు కావ్యగీతములచే మాఘుతేఁ ఘోరేవ మాఱుమ్రోయ

రత్నసింహాసనాగ్రమున రుద్రమదేవి వసియించి విక్రమపటిమ నెఱప
ఆకాశమొఱయుచు నాంధ్రసామ్రాజ్యపతాకిక లింటింటఁ దాండవింప
తే గీ॥ మణిగణాలంకృతమనోజ్ఞమదగజాధి । రోహియై కాకతికుమారరుద్రదేవ
చక్రవర్తి చరించు నీస్థలమహత్త్వ । మరయు బుధులార మీకుసుస్వాగతంబు॥
సీ॥ కనుమూయలేదింకఁ గాకతీయనృపాల శేఖరకల్పిత శిల్పలక్ష్మి
మఱపురాలేదింక మహితవిద్యానాథ కవిరాజగంభీర కావ్యగీతి
చెదరలేదింక లక్ష్మీభారతీవిలా సాకరద్వార బంధాదికంబు
తరుగలేదింక సుదృచ్ఛిలాప్రాకార కల్పితదుర్గవర్గప్రశస్తి
తే.గీ॥ కలమ ప్రత్యణువున నిటఁ గాకతీయ । రాజకోటీరమణిఘృణీ రక్త రేఖ
కనుఁగొనుం డాంధ్రసామ్రాజ్యగౌరవంబు । ఆంధ్రమణులార! మీకు సుస్వాగతంబు.

పిమ్మట మండలి కార్యదర్శిగారు హైకోర్టుజడ్జి రాజా గిరిరావు బహదూర్, రెసిడెంటుగారి కార్యదర్శి, రావుబహదూర్ డాక్టరు ఎస్. కృష్ణస్వామి అయ్యంగారు, బారిస్టరు రామచంద్రనాయక్, రావుసాహెబ్ గిడుగురామమూర్తి పంతులు, రాయబహదర్ పండిత హీరాలాల్ బి. ఏ, గొర్తి వెంకటరావు ఎం. ఏ. ఎల్. ఎల్. బి, రాయబహదర్ ప్రొఫెసర్ కిబె ఎం. ఎ, సర్ ఎ. పి. ప్రాత్రో, జయంతిరామయ్యపంతులు బి. ఏ. బి. ఎల్, ప్రొఫెసరు పొత్ దార్, సయ్యద్ ఖుర్షీద్ఆలీ బి. ఎ, జేర య్స్రాక్టె ఏం. ఎ, డీ. డీ. డాక్టరు బుర్రాశేషగిరిరావు, న్యాపతి కామేశ్వరరావు. బి. ఏ, బి. ఎల్, మల్లంపల్లిసోమశేఖరశర్మగార్లు సభకురాజాలనందుకుచింతించుచు కార్యక్రమము జయప్రదముగ గొనసాగుగాకయని యాశీర్వదించుచు బంపిన లేఖలను జదివిరి. ఇంతటితో నాటియుదయము సభముగిసినది.

చారిత్రక వస్తుప్రదర్శనము.

సాయంకాలము 4 గంటలకు తిరిగి ప్రతినిధులును ప్రేక్షకులును ఉన్నానియాకళాశాలలో సమావేశమైరి. అందు మూడుగదులలో చక్కని చారిత్రకవస్తుప్రదర్శన మొకటి నిర్మింపబడినది. ప్రదర్శన మీక్రిందివిధమున నేర్పరుపబడినది—

i నైజాం ప్రభుత్వాన్వేషకశాఖ—ఫోటోలు

1. శిథిలాలయము—పాలంపేట
2. పెద్దదేవళము— డిటో
3. మరియొకయాలయము.
4 కరీంనగర దేవాలయము
5. నాగులపాడు ముకుందదేవాలయ ద్వారము
6. సహస్రస్తంభ దేవాలయ ద్వారము హనుమకొండ
7. డిటో డిటో శిల్పములు
8. రామప్ప దేవాలయ ద్వారము
9. సూర్యాపేటదేవాలయము
10. ఉప్పరపల్లి దేవాలయము
11. రామప్పగుడి—నర్తకివిగ్రహము
12. పంచమహాశివాలయస్తంభము—పానగల్లు
13. శివాలయము— డిటో
14. స్తంభములపై శిల్పములు—రామప్ప
15. డిటో —హనుమకొండ
16. గణపతివిగ్రహశిల్పము—పానగల్లు
17. శితాబ్ ఖాన్ కచేరి—వరంగల్లు
18. దేవాలయముద్వారము.—డిటో
19. దుర్గద్వారము.—డిటో

బొమ్మలుగలకార్డులు

1. గుహాలు, చిత్రములు—అజంతా
2. డిటో —ఎల్లోరా,
3. దౌలతాబాదుదుర్గము

అశ్మశాఖాప్రకటనలు

1. అశోకశాసనము—మాస్కీ
2. జగదేకమల్లుని దౌలతాబాదుశాసనము
3. పాలంపేట, ఉప్పరపల్లి కాకతీయశాసనములు
4. కాకతీయగణపతిదేవుని పాఖాలశాసనము
5. త్రిభువనమల్లుని మునిరాబాదు శాసనము
6. కాకతిరుద్రాంబ కోటగిరితామ్రశాసనము
7. త్రైలోక్యమల్లుని బోధాన్ శాసనము
8. నాగై శాసనము
9. సాంవత్సరికనివేదికలు 1325—1338. ఫసలీలు

తామ్రశాసనములు.

1. కోటగిరితామ్రశాసనము

నాణెములు.

30. పశ్చిమచాళుక్యనాణెములు.

ii లక్ష్మణరాయపరిశోధక మండలి, హైదరాబాదు—

లిఖితగ్రంథములు.

1. యాదగిరినరసింహశతకము
2. నిరోష్ఠ్యసీతాకల్యాణము
3. ధంసాచరిత్రము
4. హైదరాబాదుకైఫీయతు
5. ప్రతాపరుద్ర చరిత్ర
6. రామదాసుచరిత్ర(పర్షియన్)
7. భువనగిరి చరిత్ర(ఉర్దు)
8. చరిగొండ కైఫీయతు
9. బ్రహ్మకైవర్తము

తాళపత్ర గ్రంథములు.

1. ధనంజయవిజయవ్యాయోగము
2. బ్రహ్మోత్తరఖండము
3. రామాయణచంపు
4. శాలివాహనసప్తశతి
5. పావులూరి గణితము
6. అశ్వలక్షణసారము
7. శశాంక నందినీపరిణయము
8. కొల్లిపాక మాహాత్మ్యము
9. శతారివైభవము
10. నారాయణ శతకము
11. ప్రభు లింగలీల
12. బసవపురాణము
13. సప్వా నందము
14. శివయోగసారము
15. కచ్ఛపుట తంత్రము
16. భైరవతంత్రము
17. శాల్మలీకందనందనవిలాసము
18. శ్రీకృష్ణశతానందీయము
19. అధ్యాత్మరామాయణము
20. అనంగ మంగళము
21. బ్రహ్మవైవర్తము
22. కవిగజాంకుశము
23. సూరినాధనందన విలాసము
24. బిలువపడిగరేని పేరణము
25. మధురవాణీవిలాసము
26. నలచరిత్ర
27. లక్షణా పరిణయము
28. సీతా వివాహము



కాకతీయవర్ధంత్యుత్సవ చారిత్రిక వస్తుప్రదర్శనము—స్థానికశాఖ.



కాకతీయవర్ధంత్యుత్సవ చారిత్రికవస్తుప్రదర్శనము— నైజాంప్రభుత్వ ఆర్ఘశాఖ.

# కాకతీయవర్ధంత్యుత్సవము

## ప్రచురణములు.

1. పరిశోధక నివేదికలుసం. 1—7.
2. ...ప్రకటనలు....1—4
3. శాసనపట్టిక
4. గ్రంథములపట్టిక

## iii కృష్ణదేవరాయాంధ్రభాషానిలయము, హైదరాబాదు.

1. రామరాయుల చిత్రపటము—
2. రజతోత్సవ సంచిక. భా 1 + 2
3. పూసపాటివారి కైఫీయతు
4. సామర్లకోట కైఫీయతు

## iv రెడ్డివిద్యార్థివసతిగృహము హైదరాబాదు.

1. సచిత్రభారతము
2. వరంగల్లు చరిత్ర(పర్షియన్)
3. జలాలుద్దీను చిత్రపటము
4. విల్లు ౬బాణములు
5. బల్లెపు తల
6. అమర సింగి
7. బల్లెపు తలలు పెద్దవి
8. తాబేటి బొరుసుతో చేసినడాలు
9. అప్రకటిత గ్రంథములు
10. వీరభద్ర విజయము
11. సారంగధర చరిత్రము
12 రంగనాథ రామాయణము
13. భాగవతము
14. తోలు డాలులు

## v. డాక్టరు నారాయణరావుగారు తెచ్చినవి

1. శాసనములలోని వాడుక భాష—పటము
2. దక్షిణదేశ లిపిపరిణామము—
3. సంఖ్యాపరిణామము—
4. ఆంధ్రవిజ్ఞాన విస్తృతి—

[illegible] ఎఱ్ఱగుడిశాసనములు—ప్రతిబింబములు

## vi ఆంధ్రసాహిత్యపరిషత్తు - కాకినాడ

1. ముల్కాపురశాసనము—ప్రతిబింబము
2. సర్వలోకాశ్రయుని పెద్దచెరుకూరు శాసనము
3. క్రొత్తరాగి నాణెములు.30

## vii అబ్దుల్ బసీత్ ఖాన్ సాహెబుగారొసంగినవి

1. వరంగల్ దుర్గ.శిథిలములు—పటము
2. కాకతీయుల చరిత్ర—ఉర్దు భాష.

## viii. ఆంధ్రేతిహాసపరిశోధకమండలి, రాజమహేంద్రవరము

.1 కళింగగాంగ, వేంగీచాళుక్య తామ్రశాసనములు. ,,

2. విజయనగరరాజుల రాగినాణెములు.
3. మహమ్మదీయ నాణెములు
4. గాంగ, యాదవ, విజయనగర రాజవంశముల బంగారు నాణెములు
5. పద్మనాయకుల చరిత్రము—తాళపత్రప్రతి
6. రాజమండ్రిలోని కాకతీయశాసనములు—ప్రతిబింబములు.
7. కాకతీయ సామ్రాజ్యము—చిత్రపటము.
8. రాజు శిరస్సు—శిల్పము.
9. పద్మాక్షిగుడి దగ్గరనున్న జైనశిల్పములు.

ఈ చారిత్రక వస్తుప్రదర్శనమును తెరచుచు ధర్మవీర్ వామనరాయక్ జాగీర్దారు గారీ క్రింది యుపన్యాసమునొసంగిరి.

సోదరులారా,

చారిత్రక గౌరవమునకు స్థానమైయున్న హనుమకొండయందు జరుపబడుచున్న కాకతీయవర్ధంత్యుత్సవ సందర్భమున, నిరుపమానప్రభావంతమగు ఆ వంశస్థుల కాలపు చారిత్రిక వస్తువుల ప్రదర్శనమును ప్రారంభించుకీర్తిప్రదమగు కార్యమునకు ఆంధ్రుడను కాకపోయినను తమవానిగ దలచి నన్ను నియోగించినందుసకు ఆంధ్రేతిహాసపరిశోధకమండలివారికి నేనుమనః పూర్వకముగా నాకృతజ్ఞతను దెలుపుచున్నాను. యథార్థమువిచారించినచో, మండలివారు, ఐతిహాసిక పరిశోధనమున విఖ్యాతినిసంపాదించిన దిగ్దంతులగు పండితులనేకులుండ, నాకీగౌరవము కలిగించుట నన్నుధన్యునిగా జేయుటకేయని విశ్వసించుచున్నాను.

## ప్రదర్శనాదుల ప్రాముఖ్యత

ఇట్టి పురాతన వంశముల యుత్సవములను, చారిత్రిక వస్తుప్రదర్శనములను జరుపుట వలన కలుగు ప్రయోజనము లమూల్యమని చెప్పవలసిన పనిలేదు. పరిశోధకుల దృక్పథము ప్రకారము ఇట్టి యుత్సవాదుల ప్రాముఖ్యత ఏమన, యథార్థమగు చరిత్రను ప్రజలజ్ఞానాభివృద్ధికై బయట బెట్టుట. అనగా మూఢవిశ్వాసములు, కల్పితకథలు అను కలుపులోనుండి చరిత్రాంశములను విడదీసి వానివిలువను హెచ్చించుటయని సాధారణముగా చెప్పుచున్నారు. ఈ యుద్దేశ్యమును నేనుగాదనువాడనుకాను. కాని, సోదరులారా! నేను సాధారణపరిశోధకుల కంటె కొంత ఎక్కువ అసగొట్టును. ఎంతో శ్రమతోను, ఎంతో ధనవ్యయముతోను, పరిశోధించి సంపాదింపబడిన, బడుచున్న ఈచారిత్రిక సాధనములను రత్నములు జ్ఞాన ప్రదములు మాత్రమే యనుకొనినచో నాహృదయము సంతసించుటలేదు. మన పురాతన రాజవంశముల గౌరవ చిహ్నమగు ప్రతియంశము మనపూర్వుల ఔన్నత్యమును ప్రకటించుచు, మనవర్తమాన కాలపు హీనస్థితిని చూపుచు, మనభవిష్యత్తునుకాంతివంతముగా జేసికొనుటకై మనస్సు ప్రేరేపించుచు మార్గదర్శకమగు చున్నదని నామనోనిశ్చయము. ఇట్టిఫలితమును కలిగింపని చారిత్రిక పరిశోధనము నిష్ప్రయోజనమని నాతలంపు.

## కాకతీయ సామ్రాజ్యము

ఏమహా సామ్రాజ్యముయొక్క వర్ధంత్యుత్సవము జరుపుటకు మనము కూడియున్నామో, ఏప్రకాశవంతమగు చరిత్రము కాలగర్భమున లీనమైపోయిన తరువాత ఆరుశతాబ్దముల కు,-అతిదీర్ఘములగు ఆరువందల వత్సరములు గడచిన తరువాత,-దానియశోగానమును మనము కలువరించు చున్నామో, అట్టికాకతీయులను గురించిన చరిత్రము కొంచెము ఈసందర్భమున అప్రస్తుతముకాదని తలచుచున్నాను.

కాకతీయులు ఆరంభమున పశ్చిమచాళుక్యులకు మండలాధిపులుగానుండి బహుశః ౧౨ వశతాబ్దమున స్వతంత్రమువహించిరి. ప్రోలరాజు, శ్రీరుద్రదేవ మహారాజు (క్రీ.శ.౧౧౪౦ నుండి ౧౧౯౬) మహాదేవరాజు (౧౧౯౬--౧౧౯౯) గణపతి దేవచక్రవర్తి (౧౧౯౯-౧౨౬౦) రుద్రమదేవి (౧౨౬౫-౧౩౨౩) మహావైభవముగ మొదట అనుమకొండయు, తరువాత ఇప్పుడు వరంగల్లుఅని పేర్కొనబడు ఓరుగల్లు రాజధానిగా బరిపాలించిరి. వీరిచరిత్రము అవక్రపరాక్రమ ప్రసంగములతోను, ఉదారభావోపేతములగు చారిత్రిక కథానకములతోను; అజరామరఖ్యాతి గడించిన విద్యావిభూషణత్వముతోను, నిరుపమానమగు రాజనీతివిశారదత్వముతోను దాదాపు మూడుశతాబ్దములవరకు ప్రకాశించినది. సాధారణమాండలికత్వమునుండి మహాసామ్రాజ్యము ఏర్పడినదని చెప్పినచో వీరి రాజ్యవిస్తారము నూహింప వచ్చును! ఊహింప వలసిన పనియేమి? ఈ హనుమకొండలోని సహస్రస్తంభ దేవాలయములో శ్రీరుద్రదేవుని వలన వేయించబడిన శాసనములో ఆసామ్రాజ్యముయొక్క రాజ్యవిస్తార మిట్లు వర్ణింపబడినది:-

> ప్రాతీచ్యాన్తాకటకసికట స్థాయినీరాజ్యలక్ష్మీః
> కాబేరాశా తటవిలసితా మాల్యవంతప్రపేదే,
> రాజ్యం ప్రాచ్యాంలవణజలధే స్త్రీ రపర్యన్త మస్య
> శ్రీశైలాంతం ప్రచరతి సదా దక్షిణాస్యాంసమగ్రం.

ఇట్టియున్నతిగాంచినవంశము క్రీ.శ.౧౩౨౩లో, మహమ్మదీయులదాడులమూలమున పతనముచెందెను. తరువాతకొంతకాలమువరకు ప్రతాపరుద్రునికుమారుడు ఓరుగల్లు పాలించెనని చెప్పెదరు. క్రీ శ. ౧౩౪౪ లో కాకతీయప్రతాపజ్యోతి తుదిమారు ప్రజ్వలించి మలిగిపోయినట్లు చరిత్ర వక్కాణించుచున్నది.

### రుద్రమదేవి

కాకతీయవంశయశమును గానముచేయువా డెవడైనను, మహారాణి రుద్రాంబనుగూర్చి ప్రత్యేకముగ ప్రశంసింపక ఊరకుండజాలడు. ఈమె కాకతిగణపతిచక్రవర్తికుమార్తె. అనన్యసామాన్యమగు తేజముతో ౩౫ సంవత్సరములు పాలనమొనర్చి, యోధురాలుగను, రాజనీతిజ్ఞురాలుగను, మహాయోధాగ్రేసరులగు దేవగిరియాదవసామ్రాట్టులు మున్నగుదేశీయులచే తనేకాక, ఆకాలమున ఇటలీ దేశమునుండి వచ్చియాశుపాలనాప్రౌఢిమనుఓరుగల్లుననుండి పరిశీ

లించిన మార్కోపోలో (Marcopolo) వంటివారిచేతను మిక్కిలి శ్లాఘింపబడినది.‡

చరిత్రకాలమున భారతవర్షమునందు రాజ్యపాలన జేసినహిందూస్త్రీలలో ఈమెయే మొట్టమొదటిదని చెప్పవచ్చును. స్త్రీయై సింహాసనమునధిష్ఠించిన మహమ్మదీయ యువతి, రజియాబేగము (క్రీ. శ. ౧౨౩౬-౧౨౪౦) ఈమెకంటె ౨౦ సంవత్సరములు పూర్వముండెననుట విశ్చయము. అయినను, భారతీయ విదుషీమణిగా నుండుటయు, పరిపాలనాకాలము దీర్ఘముగ నుండుటయు, నిష్కలంకమగు చరిత్ర కలిగియుండుటయు, అవసానము విషాదాంతము కాకుండుటయు శ్రీమహారాణి రుద్రమదేవి జీవితమునకు భూషణములై యొప్పుచున్నవి. ఈమహారాజ్ఞి స్త్రీజాతికి ఆదర్శపాత్రియగా నెన్నదగినది. శ్రీప్రతాపరుద్రచక్రవర్తి కంకితమీయబడిన విఖ్యాతిమగు ప్రతాపరుద్రీయములో విద్యానాథకవియొక్క యమృతవాక్కు క్రింద యుల్లేఖించుట ఈవిషయమున జాలును.

♦ యోఽభూద్ద్రో రజతాచలే స్థితి మగా దర్ధాంగనారిః పురా సోయం సంప్రతి కాకతీశ్వర కులే పర్యాంగనారిఃస్థితః

కాకతీయాస్తమయము

పదమూడవ శతాబ్దాంతమున దక్కనులో విఖ్యాతిగాంచియుండిన ప్రతిభావంతములగు మూడురాష్ట్రములలో, దేవగిరియాదవ వంశము ౧౨౯౪లోను, ద్వారసముద్రములోని బల్లాలవంశము ౧౩౧౦ లోను, ఓరుగల్లులోని కాకతీయవంశము ౧౩౨౩లోను, మొత్తమమీద ౩౦ సంవత్సరముల కాలములో పరసుతస్థుల దాడికి ఆగలేకస్వాతంత్ర్యమును కోల్పోయెను. అనగా, మహారాష్ట్ర, కర్ణాటక, ఆంధ్రరాజ్యములు ఈవిధముగ నాశనదేశతపాలై స్వీయసభ్యతను గోల్పోయి, వానిలోమొదటిదియు చివరదియు నేటివరకు తలయెత్తలేని స్థితియందుండుట చారిత్రిక వైచిత్ర్యములలో నొకటిగా గాన్పించుచున్నది!

నిజాంరాష్ట్రము.

పైన పేర్కొనబడిన మహారాష్ట్ర, కర్ణాటక, ఆంధ్ర, ప్రాంతభూభాగము కలిసియే యిప్పటి నిజాముర్రాష్ట్రము ఏర్పడియున్నది. దీనిని మహాఘనతవహించిన నిజాముప్రభువు పరిపాలించుచున్నాడు. ఈరాష్ట్రములోని సగముకంటె ఎక్కువభాగము ఆంధ్రదేశము. ఇదియొకప్పుడు కాకతీయుల పాలనములోనుండుటయే కాక దీనిలోనే వారిరాజధానియుండుటచే నేటివరకు ఉత్సవము ఇచ్చుచున్నది.

"‡ ఈ మెతనపూర్వులవలెనే ధర్మమును, నీతినిగాపాడి దేశమునకు శాంతిని గలిగించి తనప్రజలచే మిక్కిలి భక్తిపూర్వకముగాగౌరవింపబడి ప్రేమింపబడుచుచిరకాలము పరిపాలనముచేసెను" మార్కోపోలో

♦ అర్ధాంగనారియై కైలాసమునందున్న రుద్రుడు కాకతివంశమున పూర్ణముగ స్త్రీశరీరముతో ధరించియున్నవాడు.

ఈరాష్ట్రములో అసంఖ్యాకములగు పురాతనచారిత్రికసాధనములును, చిహ్నము లును కలవు. దుర్గములు, దేవళములు, శిలాశాసనములు, తామ్రశాసనములు, తాళపత్రగ్రంథములు, వివిధనాణెములు, ఇవియపియనేల నిజామురాష్ట్రైశ్వర్యమనదగిన యమూల్యనిధులు పరిశోధకులశ్రద్ధకై నిరీక్షించుచున్నవి. ముఖ్యముగా ఆంధ్రప్రాంతమున కాకతీయచరిత్రకు సాధనము లెన్నియేని లభించగలవు. శిలాశాసనములలో భూగర్భమున కొన్నియు, భిన్న భిన్నమై కొన్నియు, గృహసోపానములుగ కొన్నియు, గోరీలపై కొన్నియు నున్నవని శోధించిన వారు వక్కాణించుచున్నారు.

## ప్రభుత్వమువారి అర్షశాఖ

గడచిన ౧౫ సంవత్సరములనుండి యవిశ్రాంతముగ, పురాతనవస్తుసంగ్రహణమును తత్పరిశోధనమును ముఖ్యకర్తవ్యముగా పనిచేయుచున్న మాప్రభుత్వమువారు కాకతీయుల మూడునాల్గుశిలాశాసనములను మిగులవ్యయప్రయాసలతో పరిశోధించి ముద్రించియున్నారు. వీ రెన్నియోపురాతనదేవాలయములను మందిరములను నాశనముకాకుండ సురక్షితి మొనర్చియున్నారు. విశ్వవిఖ్యాతములగు ఎల్లోరా, అజంటాగుహాలనుచూచుటకై ప్రపంచములోని వివిధదేశములనుండివచ్చుయాత్రికులకు సర్వవిధములగు సౌకర్యములు చేయుటలో అద్భుతమగు శ్రద్ధను వహించుచున్న మాప్రభుత్వమువారు ప్రశంసార్హు లని చెప్పవలసినవని లేదు. వీరెన్నియోచారిత్రికసాధనములను సేకరించి ప్రదర్శనశాల (Museum) లోనుంచియున్నారు. మా అర్షశాఖ ఇప్పటికంటె ఎక్కువ కృషిచేసినచో, రాష్ట్రమునడాగియున్నసాధనములు బయటకువచ్చి కాకతీయవర్ధంత్యుత్సవముయొక్కయుద్దేశ్యము నెరవేర్చుటలో తోడ్పడగలవనుట నిస్సంశయము.

## ఇతర ప్రయత్నములు

చారిత్రికసాధనములు సమకూర్చుటలో ఈరాష్ట్రమున ప్రయత్నముచేయుచున్న సంఘము లక్ష్మణరాయపరిశోధకమండలి. వీరు గత ౧౦ సంవత్సరములలో వందలకొలది అముద్రిత శాసనములను, నాణెములను, తాళపత్రగ్రంథములను, కొన్నిపటములను సంపాదించియున్నారు. వీరి శాసనప్రతులు గ్రంథరూపమున త్వరలోనే వెలువడనున్నవని తెలియుచున్నది. హైదరాబాదులోని రెడ్డిగ్రంథాలయమువారుకూడ తాళపత్ర గ్రంథములను, అనన్యలభ్యములగు పటములను, కాకతీయులకాలపు ఆయుధములను సేకరించియున్నారు. ఇట్టిప్రయత్నములు ఇంకను ఎన్నియేని జరుగవలసియున్నవి. ప్రభుత్వము వలనను, ప్రజలవలనను ప్రోత్సహింపబడవలసి యున్నవి!

## ప్రదర్శింపబడు వస్తువులు

నేడు మనము ప్రారంభింపనున్న ప్రదర్శనములో, నిజాముప్రభుత్వముయొక్క అర్షశాఖవారివలనను, లక్ష్మణరాయ పరిశోధకమండలివలనను, రెడ్డిగ్రంథాలయనిర్వాహకులవలన

ను సంపాదింపబడినవేకాక ఎయ్యది కాకతీయవర్ధంత్యుత్సవమునకును ఈ ప్రదర్శనమునకును కారణమైనదో అట్టి ఆంధ్రేతిహాసపరిశోధకమండలి (రాజమండ్రి) యొక్క నిర్వాహకులు సంగ్రహించిన శాసన ప్రతులు, బంగారునాణెములు మున్నగునవియునుకలవు. వానిమూల్యమును మనము నిర్ణయించుట కష్టము! వానివిలువను కాలమును పరిశోధనమే నిర్ధారణచేయగలదు.

## ముగింపు

సోదరులారా! ప్రదర్శింపబడనున్న వస్తుసంచయమునుజూచి యానందించుటకు కుతూహలపడుచున్న మీహృదయములలోని యుత్సాహమునకడ్డమునిల్చి, దీర్ఘోపన్యాసముచేయుచున్న నన్ను క్షమింపవేడుచున్నాను. నిశ్చయముగా నేడు మనకందరకు సుదినము, చారిత్రిక దివసము. ఇట్టి సదవకాశమును వరంగల్లువాసులకేకాక, ఈరాష్ట్రములోని వారందరకు కల్పించిన ఆంధ్రేతిహాసపరిశోధకమండలి (రాజమండ్రి) వారును అందునుముఖ్యముగా ఈకార్యమున ఈరాష్ట్రములోని ప్రత్యేకపరిస్థితులమూలమున విశేషశ్రమకుపాలుపడిన ప్రొఫెసరు రాళ్ళబండిసుబ్బారావు ఎం. ఏ., ఎల్‌టి., కార్యదర్శిగారును, ఈయుత్సవమునకై వచ్చువారికి తగిన పరిచర్యలుచేయుచున్న హనుమకొండయందలి ఆహ్వానసంఘమువారును మనకు వంద్యులై యున్నారు. చారిత్రికపరిశోధనరూపమునసేయుగుగాక ఈవిధముగా మనపూర్వుల యశోగానము చేయు నవకాశము మనకు తరచుగా లభింపజేసి, దేశముయొక్క భావిభాగ్యోదయమునకు మార్గమేర్పరచుగాకయని భగవంతుని ప్రార్థించుచు, ఈప్రదర్శనమును బహిరంగపరచితినని ప్రకటించుచున్నాను.

సాయంకాలము 6 గంటలకు ఉస్మానియకాలేజీ ముందుభాగమున సభాప్రతినిధులు, ప్రేక్షకులు, ఆహ్వాన సంఘసభ్యులుమున్నగువారు సమావేశమైరి. అప్పుడొకఛాయాపటము తీయబడెను. పిమ్మట నాహ్వానసంఘముయొక్కయు, సభావ్యవస్థాపకులయొక్కయు, వస్తుప్రదర్శనముయొక్కయు, ఛాయాపటములు గైకొనబడినవి.

రాత్రి 8 గంటలకు గానవిద్యాప్రదర్శనమును, పురాణపఠనమును జరిగినవి. 9-30 గంటలకు శ్రీజగదీశనాట్యమండలివారు వరవిక్రయనాటకమును ప్రదర్శించి చక్కనివినోదమును గల్పించిరి.

## రెండవ రోజు.

ది 26-4-1932 ఉదయము 8 గంటలకు హనుమకొండ రాజరాజనరేంద్రగ్రంథాలయసభ్యు లాంధ్రేతిహాసపరిశోధకమండలిసభ్యులను గ్రంథాలయమున కాహ్వానించి, స్వాగతమొసంగి యాకొందిపత్రము నొసంగిరి.

# వినతిపత్రము

—:•:—

ఆంధ్రదేశీయేతిహాసపరిశోధకమండలీ నిర్వాహకులారా!

మీకందరకు మాహృదయ పూర్వక వందనములు.

దేశచరిత్ర సంపాదనలాలసులై తాము ఆంధ్రవాఙ్మయమునకుంగావించుసేవ యపార ము. విస్మృతమగు దేశచరిత్రము నుద్ధరించుటలో మీరొనరించు స్వార్థత్యాగమును, శ్రమయు నుమేమెఱుంగుదుము. చాళుక్య, కళింగసంచికలు మీవిజ్ఞానమునకుం, గార్యదీక్షకుం, బరిశ్ర మకుం బ్రబల దృష్టాంతములు. మీపరిశ్రమకతన మాకుం జిరవిస్మృతమగుకాకతీయసామ్రా జ్యమునకు సంబంధించిన యపూర్వచరిత్ర లభింప నున్నదని యానందించుచున్నారము.

ఆర్యవతంసులారా!

మాధవవర్మ, ఎఱుకదేవరాజు, త్రిభువనమల్లుడు, కాకతిప్రోలరాజుమున్నగురాజేంద్రు లకు మాయనుమకొండ రాజధాని. పద్మాక్షిదేవి యాంధ్రులయభ్యున్నతియుం బతనమును గాంచిన లోకమాత. నాటిచరిత్రములు విస్మృతప్రాయములైనవి. రుద్రదేవునికాలమున రాజ ధాని ఓరుగల్లునకుమాఱినది. సర్వవిధముల వైభవములనందిన యీపురలక్ష్మి రాజరాజనరేం ద్రగ్రంథాలయముఖమున మీకీవినతిపత్రము సమర్పించుకొనంగల్గుట యదృష్టము.

పరిశోధక వతంసులారా!

దేశీయచరిత్రప్రకరణముల నన్నింటినో ఉపేక్షాదృష్టితోం జూచితిమి. అమూల్యమ గుదేశచరిత్రము సేకరించుటకు మేము కృషిచేయకున్నను, చరిత్రపఠనమున మాత్రమువిశ్వఖ్యా రుచుంటిమి. కాకతీయసామ్రాజ్యము విస్మృతమై ఆరువందలసంవత్సరములైనది. ఇంతవర కిట్టి స్మృతిసభయేని, చరిత్రపరిశోధనసంఘమేని ఈచారిత్రకస్థలమునం బరిశోధనపతాకమునిలుప లేదు. ఆంధ్రసామ్రాజ్యవిజయగీతముల నింకం గాకతీయసంచిక యచిరకాలమున గానమొనరిం పంగలుగుట మాసుకృతవిశేషము.

పరిశోధకమణులారా!

నిష్పాక్షికబుద్ధితో ఆంధ్రవాఙ్మయసేవగావించుటలో మీర లప్రతిమానులు. ఈప్రా చీననగర ప్రశస్తిచిహ్నములు శిథిలదశలోనున్నవి. మీవంటిదేశసేవకులయాగమన హేతు వూ హించి ప్రాచీనపరికరముల సేకరింపలేకపోతిమి. కాకతీయచరిత్రమునం గ్లిష్టసమస్యలెన్ని యొక

లవు. ఇంతవఱకు ఆంధ్రసామ్రాజ్యచరిత్రము సమగ్రముగ లిఖింపబడలేదు. మేము చారిత్రిక కృషిలో వెనుకబడియున్నను అయాచితముగ మానగరమునఁ గాకతీయసభ జరిపి దేశమున విస్మృతమగు సామ్రాజ్యచరిత్రము బ్రకటించు మీకు మావందనములు.

హనుమకొండ, 21-7-41

ఇట్లు విధేయులు,
రాజరాజనరేంద్ర గ్రంథాలయసభ్యులు.

పిమ్మట 9 గంటలకు ప్రతినిధులెల్లరును, ఆహ్వానసంఘమువారేర్పరచిన మోటారుబండ్లపై రామప్ప గుళ్ళను చూచుటకై వెడలిరి.

సాయంకాలము 4 గంటలకు సభ తిరిగి సమావేశమయ్యెను. అప్పుడుసభకేతెంచిన పండితులు తమతమవ్యాసములను పద్యములను జదివిరి. అందు డాక్టరు నారాయణరావు, ప్రొఫెసరు సోమయాజులు గార్ల కాకతిశబ్దవిచారములును, కాకతీయసంచిక సంపాదకులగు మారేమండ రామారావుగారు కాకతీయ చరిత్రమునుగూర్చి యొసంగిన దీర్ఘోపన్యాసమును, సురవరము ప్రతాపరెడ్డిగారి కాకతీయులనాటి సాంఘికజీవితమును గూర్చిన యుపన్యాసమును ముఖ్యములు. రాత్రి 8-30 గంటలకు సభముగిసినది.

మూడవ రోజు.

ది. 27-4-1933 ఉదయమున 8 గంటలకు సభ్యులెల్లరును హనుమకొండ ప్రాచీన శిథిలములను జూచుటకేగిరి. పిమ్మట వరంగల్లు శబ్దానుశాసనగ్రంథాలయ సభ్యుల యాహ్వానముపై సభికులెల్లరు నాగ్రంథాలయమునకేగిరి. అచట నీక్రిందినన్మానపత్రమాదరపూర్వకముగ నాంధ్రేతిహాసపరిశోధక మండలివారి కొసంగబడెను.

# వినతిపత్రము

ఆంధ్రదేశీయేతిహాసపరిశోధక మండలీనిర్వహణ ధూర్వహులారా! మీకుమాకృతజ్ఞతా వందనములు.

ఆర్యులారా!

మగధ సామ్రాజ్యానంతరము ఆంధ్రుల ప్రశస్తికిని ఆంధ్రత్వమునకును ఆలవాలమైనది మాకాకతీయాంధ్ర సామ్రాజ్యమే! కాకతీయనృపాలుర యకుంఠిత కార్యదీక్షకును, జాతీయాభి

మానమునకును, వాఙ్మయప్రీతికిని నెలవగు ఓరుగంటిశిథిలములం దిలకించి బాష్పమలీమసదృష్టితో నరుదెంచిన మీకించుక వినతిపత్రరూపమున నుపచరించెదము.

పరిశోధకాగ్రణులారా!

ఓరుగల్లు ఏడుకోటలనడుమ గట్టబడిన దుర్గమమగు మహానగరము. శిథిలమగు దుర్గద్వారము మొదలుకొని చుట్టును ఆఱుక్రోశములవఱకు నగరస్మృతికలదన నిదియెంతటివిశాల పట్టణమో మీర యూహించుకొనుడు. కాకతిప్రోలరాజీనగరమును నిర్మించెననియు, రుద్రదేవచక్రవర్తియిటకు రాజధానిమార్చెననియు, ననంతరమీనగరము మహావైభవములతోఁదులతూగి మార్కోపోలోవంటి పాశ్చాత్యులను సైతము విభ్రమము గూర్చెననియు దామెఱింగియున్నారు. సప్తమచక్రవర్తి యనిపించుకొన్న గణపతిదేవుడును, అపరదుర్గామూర్తియగు రుద్రమదేవి మహారాజ్ఞియు, అవతారమూర్తియగు ప్రతాపరుద్రదేవుడును ఈవిస్మృతాంధ్రనగర మందిరమునకు మూలస్తంభములని మాత్రము మనమెఱుంగుదుము. వీరలసంపూర్ణచరిత్రము ప్రాక్తన కాకతీయ సామ్రాజ్యచిహ్నముల దనగర్భమున నిముడ్చుకొని తనయపూర్వ మహోన్నత వైభవముల మాటుపఱచుకొన్నది. ఈజీర్ణసామ్రాజ్య చరిత్రమునుద్ధరింప బద్ధకంకణులగు మీకెల్లరకు మేమెగాదు ఆంధ్రలోకమంతయు కృతజ్ఞతజూపుట స్వధర్మ నిర్వహణమెసుండీ!

విజ్ఞానభూషణులారా!

కాకతీయుల ప్రశస్తతరమగుఆంధ్రశిల్పము కాలగర్భమున నిమిడిపోయినది. ఆనాటియుత్తమ గ్రంథములెన్నియో నశించినవి. అత్యాశ్చర్యకరములగు మహానగరములెన్నియో అరణ్యములలో మాటుపడియున్నవి. చరిత్రమునకు బరమప్రమాణములగు శాసనములెందెందో పడిపోయినవి. నేడు పూర్వచరిత్రోద్ధరణమునకు బాటుపడుమీకృషి మ ఆంధ్రసామ్రాజ్యవిస్మృతచరిత్రమును స్వర్ణాక్షరములతో లిఖింప నవకాశముగల్గింపగలదనియాశించుచున్నారము. మీకందఱు కాతిథ్యమొసంగి నాటిచారిత్రిక చిహ్నములజూపుటయే మేమొనరించినపని. ఆవలికార్యభారమంతయు మీతలపైననే కలదు.

వాఙ్మయ సేవకులారా!

తిక్కన సోమయాజి, విశ్వేశ్వరశివ దేశికులు, సోమనాథకవి, మారన,విద్యానాథుఁడు బమ్మెరపోతరాజు మున్నగుమహాకవుల పాదరేణువులచే మాశిథిలాంధ్రనగరము పావనమైనది. ఈచరిత్రస్థలమునందలి ప్రత్యణువును ఆంధ్రదేశీయేతిహాసమునఁ బరమప్రమాణముగగ్రహింపఁదగినదే. ప్రతిశిలాశకలముగూడ ఆంధ్రరాజాధిరాజ కోటీరకోటిమణిఘృణిసంశోభితమే. చరిత్రవేత్తలగు తమకృషివలన నాకయపూర్వ చరిత్రముపఠించి మామాతృభూమిపొందిన మహోన్నతి గ్రహింపఁగల్గుదుమని యాశించుచున్నారము.

సోదరాంధ్ర వతంసులారా!

దుర్భేద్యముగనున్న కాకతీయసామ్రాజ్యచరిత్రమును సప్రమాణముగనిరూపించిమీర లచిరకాలమున వెలువరింపఁబోవు కాకతీయసంపుటముకొఱకు మేము నిరీక్షించుచుందుము. ఆంధ్రవాఙ్మయనిర్మాతయగుశబ్దానుశాసనుకీర్తిచిహ్నమగు నీయాంధ్రగ్రంథనిలయముమీయందఱ యాగమనముచేఁ బావనమైనది. మీయపూర్వ చారిత్రకకృషిలో నీగ్రంథనిలయముగూడ గొంతసేవగావించి కృతార్థతనొందఁగటాక్షింపుఁడు. మీకెల్లరకును కృతజ్ఞతావందనములు

వరంగల్లు.
22-7-41 ఫ.

ఇట్లు భవదీయులు
శబ్దానుశాసన గ్రంథాలయ సభ్యులు.

పిమ్మట సభ్యులు వరంగల్లుదుర్గమును జూచుట కేగిరి. గ్రామమున నొకమైలులో నొక విశాలమగు నగడ్తయు నటుపై మట్టిగోడల వరుసలుగల నొక వలయమును గలవు. ఈ యావరణలో కందక పరివృతమగు నొక శిలాప్రాకారమున్నది. దీనిలోభాగమున శితాబ్ ఖాన్ కచేరీ, కాకతీయుల కులదైవతమగు శ్రీస్వయంభుదేవుని యాలయము, భైరవునిగుడి, విష్ణుగుడి, వీరభద్రగుడి, వెంకటేశగుడి మున్నగునవియు, మనోహరములగు నాల్గుశిలాద్వారములును, కోట మధ్యభాగమందొక పెద్దశిలయు గలవు. శితాబ్ ఖాన్ కచేరీలో కొన్ని శిల్పములును, శిల్పఖండములును గలవు. వల్లభామాత్యవిరచితమగు క్రీడాభిరామము, విద్యానాథుని ప్రతాపరుద్రీయము, ఏకామ్ర నాథుని ప్రతాప చరిత్రము మున్నగు గ్రంథములందలి కాకతీయులకాలపు ఏకశిలానగరవైభవమును దలంచుకొనుచు, బహిష్కృత శిథిలములలో తాత్కాలిక జీవితవైభవములను నిరూపించుకొనుచు ప్రేక్షకులు విస్మయానందముల ననుభవించిరి.

సాయంకాలము 4 గంటలకు తిరిగి సభ సమావేశమయ్యెను. మిగిలిన వ్యాసములు చదువ బడినవి. ఉపన్యాసములును, పద్యపఠనమును జరిగినవి. 6 గంటలకు ఆహ్వానసంఘపక్షమున శ్రీరామకోటేశ్వరరావుగారు తమకీయుత్సవమును జయప్రదముగ నిర్వహించుటలో తోడ్పడిన వారికి వందనముల నర్పించుచు, మండలివారిని బ్రశంసించుచు నుపన్యసించిరి. అటుపై సభాధ్యక్షుల యంత్యోపన్యాసముతో సభ ముగిసినది.

ఈసభ జయప్రదముగ జరుగుటకు మండలివారికి సాభిమానముగ దోడ్పడిన హనుమకొండ హైదరాబాదు పట్టణములలోని ప్రముఖులకును, సంస్థలకును, దీనిని జరుపుటకు దయతో నుత్తరవొసగిన శ్రీనిజాము ప్రభుత్వమువారికిని, సభలో వ్యాసములను పద్యములను జదివి యుపన్యాసముల నొసంగిన పండితశ్రేష్ఠులకును మండలివారి కృతజ్ఞతా పూర్వక వందనములు.

మారేమండ రామారావు, ఎం. ఏ., బి. ఇడి.
సంపాదకుఁడు.

# కాకతీయసంచిక - అకారాదిసూచిక.

## అ

కాకతీయసంచిక.

## కాకతీయ సంచిక-అకారాది సూచిక.

## ప

## భ

## య



## ర

## ల



## వ

త్రాణై ర్యత్పరితోషమేతి సతతం కిం త్వేత దత్యద్భుతం।
పీతేన ప్రతిపక్షపార్థివయశః క్షీరేణ గౌరత్విషా
యత్సంవర్ధయతి త్రిలోకభరితాం త్వత్కీర్తిలక్ష్మీసుధాం॥ ॥ శ్లో 33 ॥ ౮

నాటకప్రకరణం — ప్రథమోఽఙ్కః

యో రుద్రో రజతాచలే స్థితిమగా దర్ధాంగనారీః పురా
సోఽయం సంప్రతి కాకతీశ్వరకులే సర్వాంగనారీ స్థితః
స్థానే యద్విషమావలోకనకలామాత్రేణ భస్మీకృతా
న్యాసక్త స్త్వైరిపురాణి చిత్రమధునా ఖడ్గే విషం ధార్యతే॥ ॥ శ్లో 20॥ ౯

తదస్మిన్నేవ మహీయసి మహే మహీమండలాఖండలం చలమర్తిగండ ముపశ్లోక
యితు మానయో రయమే వా వసరః॥ ॥ పే 141 ॥ ౧౦

సోమాన్వాభిజనం తమద్య జయతి శ్రీకాకతీయాన్వయః
పాతివ్రత్యముపైతి సాంప్రత మహో ష్వస్మాసు విశ్వంభరా।
అస్మాభి ర్నిజదోః ప్రసూతి మధునా ధన్యా మజో మన్యతే
యత్కర్తవ్య ముపాదిశ త్కులపతి ర్వేద స్స్వయంభూ స్స్వయం॥
॥ శ్లో 21 ॥ ౧౧

సైవోమా చేతి నిర్దిష్టా సోమా చేతి ప్రథా మగాత్।
తవమాతా శివా సాక్షా ద్దేవో గణపతిః పితా॥ ॥ శ్లో 22 ॥ ౧౨

అన్యథా కథ మీశ్వరప్రసాదాదృతే నిరంకుశం స్త్రీవ్యక్తి విశేషస్య లోకాధిపత్యం?
ఏవం మానుషశంభునా గణపతిమహారాజే నాభ్యంతర స్వానుభవమహిమ్నః
సదృశమతి పుత్రి ఇతి వ్యవహారః కృతః. తదనుగుణా చ రుద్ర ఇత్యాఖ్యా॥ ౧౩

స్వీకృతే పుత్రభావేన దౌహిత్రే ప్రాజ్ఞమాజ్ఞయా।
అస్మి న్నిధేహి ధౌరేయే గుర్వీ ముర్వీధురా మితి॥ ॥ శ్లో 28 ॥ ౧౪

కిం తు కాకతీయనరేంద్ర వృద్ధోచిత మాచారమనువర్తమానస్య దేవస్య నగర
నివాసనైముఖ్యం తథా కులధురంధరస్య వీరరుద్రస్య విశ్వరక్షాక్షమే బాహుపరి
ఘే రాజ్యధురావిశ్రాంతిరితి చ విషాదహర్షయో స్సీమాంతం స్పృశ త్యస్మాకం
మనః॥ ॥ పే 147 ॥ ౧౫

కాకతీయకుల దుర్గాదేవీ సమారాధనేన విజయప్రస్థానమంగళం కృత్వా తత్ర హ
నుమదచలపర్యంత బహిరుద్యానే నివేశితస్కంధావారః అమాత్యపరివృతో యువ
రాజ స్తిష్ఠతి॥ ॥ పే 152 ॥ ౧౬

ద్వితీయోఽఙ్కః

విద్యావధూనా మధికం దృష్ట్వైవ పత్యౌ ప్రణయ విస్రంభం।
క్షోణీ లక్ష్మీశ్చ కథం విలంబితం సహతాం యువరాజే॥ ॥ శ్లో 7 ॥ ౧౭

తృతీయోఽఙ్కః

యుద్ధాయ సమనహ్యంత కళింగా స్స్ఫుటపౌరుషాః।

మాద్యద్ద్విపఘటోద్దామ సంభ్రమాడంబరోద్ధతాః॥ ॥ శ్లో 7 ॥ ౧౭

పీత్వా మాంసోపదంశం ద్విరదగలగలద్రక్తమైరేయధారాం
మత్తో మస్తిష్కలగ్న గ్రథిత నృపవపుః కీకసైస్స్పృష్టదంష్ట్రైః।
బిభ్రద్రౌద్రాంత్రమాలాం జనితజనభయో భైరవాకారఘోర
స్సంగ్రామోర్వ్యాః కళింగైర్బలివిధి మకరోద్వీరరుద్రస్య ఖడ్గః॥
॥ శ్లో 8 ॥ ౧౮

అనంతరం పాండ్యప్రముఖాన్ దాక్షిణాత్యాన్ క్షితీశ్వరాన్ శరణముపాగతాన్ కాకతీయః వీరరుద్రః స్వ చమూపతీన్నిగ్రహశేషం సంభావ్య తైస్సహ ప్రతీచీం దిశం ప్రచలితః॥ ॥ పే 173 ॥ ౨౦

సాధుసాధు సమాచరిత మాత్మనీనం పాండ్యైర్యత్పూర్వమేవ దేవస్య చరణ మూలం ప్రాప్తాః॥ ॥ పే 124 ॥ ౨౧

రేరే ఘూర్జర! జర్జరోసి సమరే లంపాక! కింకంపసే?
వంగ! త్వంగసి కింముధా ? బలరజఃకాణోఽసి కిం కోంకణ।
ప్రాణ త్రాణపరాయణో భవ మహారాష్ట్రాప రాష్ట్రే స్పృహా
యోద్ధారో వయమి త్యరీ నభిభవం త్యంధ్రక్షమాభృద్భటాః॥
॥ శ్లో 14 ॥ ౨౨

అంగా స్సంగర భీరవ స్సమభవం శ్చోళాః పలాయాకులాః
కాశ్మీరా స్మరణీయవిక్రమ కథాస్థూణా సిరీణాశ్రియః।
లంపాకా భయకంపమానవపుషో వంగా నిరంగీకృతాః
నేపాలాః పరిపాలనవ్యసనినస్సింహాశ్చ సీరంహసః॥ ॥ శ్లో 16 ॥ ౨౩

కాంభోజా క్షతకుంభినీపరిచయాః ప్రాప్తవనా స్సైనికాః
గౌడాః పీడితవిగ్రహాః శ్రితకులగ్రామాంకణాః కొంకణాః।
లాటాః పాటితమూర్తయః పరిగళద్భీవిహ్వలా స్సింహలాః
కర్ణాటాః పరిపూర్ణవేపథుభృత స్తంద్రాళవో మాళవాః॥ ॥శ్లో 17॥ ౨౪

భోజాః వ్యర్థభుజాయుధాః క్షతనిజశ్రీకేళయః కేరళాః
పాండ్యాః ఖండితవిక్రమాః ప్రకటితశ్రీంజర్జరా ఘూర్జరాః।
పాంచాలాః ప్రణతిప్రపంచితభియ శ్చాటూత్కటాః కీకటాః
కాంపిల్యాః శ్రితపల్లయః కృతయశోభంగాః కళింగా అపి॥ ॥ శ్లో 18 ॥ ౨౫

అనంతరం తత్ర ప్రలీనాత్మనః ప్రతిపక్షభూపాలా నన్వేష్టుకామా స్త్రీలింగసైనికా స్తత్తద్దేశవేష భాషాదిక మావిష్కుర్వాణా స్సర్వతః పర్యటంతిస్మ జీవగ్రాహం గృహీత్వా సమానయంతి స్మ యువరాజాంతికం ॥ పే 176 ॥ ౨౬

చగః శ్లో ఉబ్బ ॥

పూర్వైః కాకతివంశజైర్నృపతిభి స్సమ్యగ్ధృతా యా చిరం
యస్యా మానుషశంభునా గణపతిక్షోణీభుజాఽభూత్ప్రథా।

## ప్రతాపరుద్రీయమ్

మృద్బృందైరివ దంష్ట్రాగ్రే యస్యాలక్ష్యత మేదినీ॥ ॥ శ్లో 234 ॥ ౩౮
రమ్యా మేకశిలాభిధాన నగరీ మాసేదివాంసో బుధాః
సౌవర్ణేషు గృహేషు రత్నరచితద్వారస్థలేషు స్థితాః।
ఆరుహ్యాంగణ మేదినీషు కలభాః క్రీడోత్సుకా నర్భకా
న్నోన్మీలంతే యదవేక్ష్య రుద్రనృపతే స్త్యాగలీలాయితాః॥ ॥ శ్లో 243 ॥ ౩౯
జగత్సు వసుధా భాతి తస్యా మేకశిలాపురీ।
కాకతీయాన్వయ స్సత్రే తస్మిన్ రుద్రనరేశ్వరః॥ ॥ శ్లో 255 ॥ ౪౦

---

## అనువాదము.

౧. కాకతీయ రాజుయొక్క గుణములను ప్రశంసించుటకై రచియింపబడిన యీగ్రంథము విద్యానాథుని కృతి.

౨. స్పృహణీయములగు భాగ్యవిభవములతో నొప్పు మనుష్యలోకమున గొంతకాలము నివసింప నిచ్ఛగల యింద్రాదిదేవతలచే చిరకాలము ప్రార్థింపబడి, బ్రహ్మ సూర్యచంద్ర వంశములను మించిన కాకతీయాన్వయమును సృష్టించెను. అందు నేడు శ్రీవిష్ణుమూర్తియే వీరరుద్రమహారాజుగా జన్మించినాడు

౩. పూర్వము శ్రీవిష్ణువునకు లక్ష్మీదేవియందు బుట్టిన మన్మథుడే నేడు మహాదేవునకును రాజపుత్రికును జన్మించి ప్రతాపరుద్రుడను పేరుతో సర్వసంపదల ననుభవించుచున్నాడని యెల్లరును దలంచుచున్నారు.

౪. శ్రీవీరరుద్రుని చాతుర్యము నెటుల వర్ణింపవలెను? సహజముగా నన్యోన్య విరోధముగల లక్ష్మీసరస్వతులితనివద్ద గలసిమెలసియున్నారు. వీరలక్ష్మితోడను భూదేవి నిగూఢ యథార్థ్యమగునట్లుగౌరవించుచు, దిగ్జేతయై యీరాజు రాజిల్లుచున్నాడు.

౫. శ్రీవిష్ణువునకు మొదట గౌశల్యయు, పిమ్మట దేవకియు, నటుపిమ్మట ముమ్మడంబయు దల్లులైరి. అతడును త్రేతాయుగమున రాముడుగను, ద్వాపరయుగమున శ్రీకృష్ణుడుగను, కలియుగమున వీరరుద్రుడుగను నవతరించెను.

౬. "ఈతడు శౌర్యముచే బ్రకాశించుచున్నాడు. అడ్డులేనివాడు. శత్రువుల నందరను గూడ నణంచినాడు. భూమి వీనియందు పాతివ్రత్యమును నెరపును. ఈతడు సాక్షాత్తు శివుడే అందువలననే యీతడు యువరాజుగనుండియే రాజ్యభారము నంతటిని వహించినాడు" అని నిత్యమును కాకతీయరాజు (ప్రతాపరుద్రునిగూర్చి ప్రశంసించుచు) సంతసించుచుండును.

౭. మందరపర్వతమునందలి నల్లనిరాళ్ళతో రాపిడి గల్గుటవలన చంద్రునియందేర్పడిన నలుపు, లేడియని యందరిచేతను దలంపబడుచున్నది. కాని సంపదచేతను

కీర్తి చేతను వీరరుద్రునిచే జయింపబడి యీరాజుముద్రికయగు వరాహమును చంద్రుడు ధరించుచుండుట వలననే వానియందు నలుపు మనకు గాంచనగుచున్నది.

౮. చలమర్తి గండ బిరుదాంకితుడనగు నోరాజా! నీఖడ్గమనుపాము నిన్ను ద్వేషించువారి ప్రాణములనుగ్రోలి సంతృప్తిబొందుననుటలో సద్భుతమేమియునులేదు. శత్రురాజుల కీర్తియను పాలనుద్రావి త్రిలోకవ్యాప్తమయిన నీకీర్త్యమృతము తెల్లని కాంతి నీనుచున్నది.

౯. పూర్వము కైలాసపర్వతమున సగముబురుషుడుగను సగముస్త్రీగను విహరించిన శివుడే నేడు కాకతీయవంశమున స్త్రీరూపమున జన్మించినాడు. నాడు మూడవ కంటితో చూచినమాత్రముననే శత్రుపురములను దహించిన యాతడు నేడు ఖడ్గములో విషమును ధరించుచున్నాడు.

౧౦. భూలోకదేవేంద్రుడను, చలమర్తి గండడనగు నీరాజును స్తుతించుటకు మనకిదియే మంచిసమయము.

౧౧. కాకతీయవంశము సూర్యచంద్రవంశములను జయించుచున్నది. మీయందు భూమి పాతివ్రత్యమును నెఱపుచున్నది. మేముండుటచేసి బ్రహ్మక్షత్రియవంశము ధన్యమైనదని తలంచుచున్నాము. అందువలననే మాకులగురువగు శివుడు స్వయముగా నాకు కర్తవ్యము నాజ్ఞయిచ్చినాడు.

౧౨. ఉమ యనునామ మొసంగబడి, యుమవలెనే కీర్తిగాంచిన నీతల్లి నిజముగ నుమాదేవియే. గణపతిదేవుడు నీతండ్రి.

౧౩. ఈశ్వరప్రసాదము లేకుండినయెడ నొకస్త్రీకి నిగంకుశమగు లోకాధిపత్య మెటుల గల్గును? అందువలననే మనుష్యరూపమున నవతరించిన గణపతిమహారాజు సదృశప్రజ్ఞగల నిన్ను బుత్రినిగా నెంచెను. తదనుగుణముగా రుద్రుడను నామమునుగూడ నిచ్చెను.

౧౪. పూర్వము నాయాజ్ఞచే బుత్రునిగా నీచే స్వీకరింపబడినవాడును, సమర్థుడునగు యీ నీదౌహిత్రునియందు రాజ్యభారము నుంచుము.

౧౫. కాకతీయరాజులు వార్ధక్యమున జేయుచుండినట్లు నీవును నగరమునందు నివసించుట కిష్టపడకుండుటవలన మిక్కిలి విషాదమును, నీకులము నుద్ధరించుటకు బుట్టినవాడును, యువకుడును, సమర్థుడునగు వీరరుద్రుడు పరిపూర్ణ రాజ్యభారమును వహించుననుటచే మిక్కిలిసంతోషమును మామనస్సులలో గల్గుచున్నవి.

౧౬. యువరాజు కాకతీయులకు గులదేవతయగు దుర్గాదేవి నారాధించి, దిగ్విజయమునకై బయల్వెడలుట కామె మంగళాశీర్వాదములను బడసి, హనుమకొండవరకును గల తోటలో తనసైన్యములతో విశ్రమించి, మంత్రులతో గూడియున్నాడు.

౧౭. పతియగు వీరరుద్రునియందు విద్యాకాంతలకు గల విశేషప్రణయమును గాంచి, యాతడు చేయునాలస్యమును భూదేవియు లక్ష్మీదేవియు నెట్లుసహింతురు?

౧౮. మహాపౌరుషముతోడను, మదగజములతోడను, మిక్కిలి యాడంబరముతో కళింగులు యుద్ధమునకు సిద్ధపడిరి.

౧౯. ఏనుగులయొక్క మెదడుమాంసము నూడదీయుచు, కారుచున్న రక్తధారలను ద్రావుచు, రాజులపేగులను త్రెంచుచు భయంకరమై, భైరవునివంటి యాకారముతో రణభూమియందు వీరరుద్రుని ఖడ్గము కళింగులను బలియిచ్చెను.

౨౦. పిమ్మట శరణుకొచ్చిన పాండ్యాది దక్షిణదేశపు రాజులను, వారిమంత్రులను, గౌరవించి వారితోగూడ పశ్చిమదిశకు బయలుదేరెను.

౨౧. ముందుగనే వీరరుద్రుని శరణుకొచ్చుటచే, పాండ్యులు స్వార్థమును చక్కగ గాపాడుకొనిరి.

౨౨. ఆంధ్రరాజసైనికులు "ఓరిగూర్జరరాజా! యుద్ధములో నీయొడలు చితుకకొట్టబడినది. లంపాకపాలకా! పోరుపనికేదవు? వంగభూపాలా! యేటికి యెగిరెదవు? (గంతులువేసెదవు) కొంకణా! నీయొడలు దుమ్మైనది. మహారాష్ట్రభూపాలకా! నీరాజ్యము పోయినపోయె ప్రాణమునైనను రక్షించుకొనుము" అని శత్రువులను హేళనచేయుచున్నారు.

౨౩. అంగదేశీయులు యుద్ధమునకు భయపడిరి. చోళులు పలాయితులైరి. కాశ్మీరదేశీయుల ధనధైర్యములు నామమాత్రములైనవి. లంపాకులు గడగడవణకిరి. వంగదేశీయుల శరీరములు నశించినవి. నేపాలరాజు పరిపాలనమనిన వ్యసనమువలె భయపడుచుండెను. సింహళదేశీయులు నిర్వీర్యులైరి.

౨౪. కాంభోజులు చచ్చినయేనుగులవలెనైరి. సేవణులకు ఒడలంతయు చీల్చబడినది. గౌడులు పీడింపబడిరి. కొంకణులు పర్వతములకుబారిరి. లాటులు దళితులైరి. సింహళులకు భయముతో మతిచెడినది. కర్ణాటులును, మాళవులును కంపించుచుండిరి.

౨౫. భోజుల బలశౌర్యములు వ్యర్థములైనవి. కేరళుల స్త్రీలయుత్సాహము నశించినది. పాండ్యుల విక్రమము ఖండింపబడెను. సిగ్గుచే గూర్జరులు తలలువంచిరి. పాంచాలురు భయముచే శరణుజొచ్చిరి. కీకటులు స్తుతిచేయసాగిరి.

౨౬. పిమ్మట నెందొదాగియుండిన శత్రురాజులను వెదకుటకై త్రిలింగసైనికు లాయాదేశముల వేషభాషలను ధరించి యనేకస్థలముల దిరుగుచు, నారాజులను సజీవులనుగా బట్టుకొని యువరాజునొద్దకు దెచ్చుచుండిరి.

౨౭. ఇంతవరకును కాకతీయరాజులచే చక్కగ ధరింపబడి, మనుష్యరూపమును ధరించిన శివుడగు గణపతిదేవునివలన ప్రసిద్ధిగాంచి, నాభుజములపైనుండుటచే కులపర్వతములను సహితము మరచిన యీభూమి వీరరుద్రునికి సంక్రమించి శాశ్వతమగు కీర్తిని బొందునుగాక.

౨౮. కాకతీయకుల గౌరవమును పెంపొందించు మాచే సూర్యచంద్రవంశముల విఖ్యాతి తక్కువచేయబడినది.

౨౯. అయ్యా! మంత్రులందరును కులపెద్దలతో కలసి ప్రతీహారునివద్ద వేచియున్నారు.

3౦. తనయద్భుతమహిమలచే నీకులదైవమగు శివుని కపరావతారమయిన యోగణపేశ్వరుడు సుముఖుడై, యెల్లప్పుడును నీవంశోద్ధారకుడును, మనుమడునగు వీరరుద్రుని రాజ్యము నభివృద్ధిచేయుగాక.

3౧. ఏముగ్గురిచే నీదేశము త్రిలింగమను ఖ్యాతినిగాంచెనో, యెవరికి కాకతీయరాజుల కీర్తివైభవములు కైలాసశైలములవలె చేయబడినవో, యెవరు చెల్లనివారో, యట్టిశ్రీశైల, కాళేశ్వర, ద్రాక్షారామములలోనుండు దేవతలు ప్రతిదినమును నీకు శ్రేయోభివృద్ధిచేసి రక్షింతురుగాక.

3౨. ఓ రాజులారా! మీరు మీమీసుఖమును గోరినచో గాకతీశుని యాజ్ఞను వక్షమునను, దలపై వరాహముద్రికను ధరింపుడు.

33. సముద్రమువలె గంభీరమగు యాదవరాజమనస్సు కాకతీశ్వరుని సేనయను పర్వతముచే గలంచబడినది.

3౪. లక్ష్మికి నివాసస్థానమని రాజులెల్లరును, శౌర్యమునకు గనివంటిదని శత్రువీరులును, వాణి విహరించు భూమియని బందీశులును, గాకతీయరాజధాని నెప్పుడును స్మరించుచుందురు.

3౫. తనశిఖరమున జంద్రుడుండగా మేరుపర్వత మెట్టులుండునో యట్టుల తెల్లనిగొడుగుతో గాకతీయరాజు ప్రకాశించుచున్నాడు.

3౬. వాణి కాకతీశ్వరునియందు అలంకారములతోడను, చక్కనివర్ణములతోడను, రసవంతమును సద్భావయుతమునునై యొప్పుచున్నది.

3౭. యాదవవంశ చంద్రుడును, ప్రఖ్యాతశౌర్యుడును, మహాసైన్య సమేతుడును, మానధనుడునగు సేవణరాజు వీరరుద్రుని సైన్యాధిపతులలో నెవడో యొకసాధారణునిచే నోడింపబడి, చెందినకష్టముల నా గోదావరీనది యెఱుగును.

3౮. ఎవని కోరయొక్క చివరన భూమి యొకమట్టి చుక్కవలెనుండెనో, అట్టి హరి కాకతీశ్వరుని జెండాపైన వెలుంగుచున్నాడు.

3౯. పండితులు ఏకశిలానగరమునుజేరి, రత్నములతో జేసిన తోరణములుగల బంగారుమేడలలో నివసించుచు, ముంగిలిసాలలలోనుండి, యేనుగుపిల్లలను, గ్రీడించుబాలురను జూచుచు నానందించుచు రుద్రరాజు త్యాగబుద్ధిని గొనియాడుచున్నారు.

౪౦. లోకములన్నిటిలోన నీభూలోకమును, అందేకశిలాపురమును, అందు కాకతీయకులమును, అందు రుద్రనరేశ్వరుడును ప్రకాశించుచున్నారు.

---

పైసంస్కృత గద్యపద్య భాగములన్నియు వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారు 1971 లో ప్రకటించబడిన "ప్రతాపరుద్రీయము" నుండి యెత్తి వ్రాయబడినవి. కా॥ సం॥ సం॥

# హేమాద్రి వ్రతఖండము—రాజప్రశస్తి

## I

. . . .

అభవ దవనిపాలో జైత్రపాలః కరాలః
ప్రహరణ రణరంగ త్తుంగ దుత్తుంగ ఖడ్గః ॥ శ్లో 40 ॥ ౧

. . . .

త్రిలింగాధిపతేః పశో ర్వ్యసనం రుద్రస్య రౌద్రాకృతేః
కృత్వా పురుషమేధ యజ్ఞవిధినా లబ్ధస్త్రిలోకీజయః ॥ శ్లో 41 ॥ ౨

. . . .

పరిత్రాతా భూమేః సమజని జగజ్జిత్వర మహా
మహాదేవః సేవారసిక సకల క్ష్మాభృత్నుతః ॥ శ్లో 47 ॥ ౩

త్రిల్ల జ్ఞత్క్షితిపాల తూలనిచయ ప్రక్షేపచండానిలో
. . . . ॥ శ్లో 48 ॥ ౪

యస్తస్య స రణే జహార కరిణ స్తత్పంచ శబ్దాదికాన్
య స్తత్యాజ వధూవధా దుపరతి స్తద్భూభుజం రుద్రమాం ॥ శ్లో ॥52॥ ౫

## II

అయం శిశుస్త్రీశరణాగతానాం హంతా మహాదేవనృపో నజాతు
ఇత్థం వినిశ్చిత్య తతో బిభ్యద్భి రంధ్రైః పురంధ్రీ సహితా నృపస్తే॥
॥శ్లో 14॥ ౬

## అనువాదము.

౧. యుద్ధములో పదేపదే శత్రువులను గొట్టుచే పైకెగసెడి ఖడ్గముగలవాడును, భయంకరుడునగు జైత్రిపాలుడు బుట్టెను.

౨. (అతడు) త్రిలింగదేశాధిపుడగు రుద్రుని బశువునుజేసి యాతని శరీరమును వేల్చి పురుషమేధమను యజ్ఞమునుజేసి త్రిలోకములను జయించెను.

౩. పిమ్మట భూమికి రక్షకుడును, దిగ్జేతయును, సేవచేయుటలో కుశలులైన రాజులచే స్తుతింపబడిన వాడునగు మహాదేవరాజు బుట్టెను.

౪. (అతడు) త్రిలింగరాజను దూదికుప్ప నెగురగొట్టునెడ పెనుగాలియైయుండెను.

౫. అతడు యుద్ధములో త్రిలింగులనోడించి, వారి యేనుగులను పంచశబ్దములను హరించియు, వారియేలికయగు రుద్రాంబను స్త్రీయగుటచే విడిచిపుచ్చెను.

౬. "ఈమహాదేవరాజు శిశువులను, స్త్రీలను, శరణుజొచ్చినవారిని చంపడు" అని నిశ్చయించుకొని భీతులగు నాంధ్రులు స్త్రీని దమ కేలికగా నొనర్చుకొనిరి.

---

34 ంతనాయకాఖ్యాయా .... ....
35 చ నివర్తనం।తస్యార్ధ మధ్య
36 తాఖ్యాయ నాయకాయ చ శా
37 సనం॥(28)సత్ ప్రోక్తవతే చ శ్రీరామా
38 య్యార్యాయ త్రిపాదికా(।)తత్ర భోగక్రమ
39 ంచైవం దేవస్యా ద్రి(?)త్ర వర్ణ్యయం॥(29)

(4) వేదములకు నిదానమైన వాని నాభిపద్మమునుండి బుట్టిన బ్రహ్మభుజములనుండి దుర్జయులు బుట్టిరి వారి వంశమున తమభుజములను ప్రాకారముచే జగమును రక్షించు కాకతీయులు కల్గిరి. (5—7) అందు ప్రోలరాజు, మహాదేవరాజు, గణపతి యనువార లుద్భవించిరి. (8) గణపతికి పాలసముద్రమునుండి లక్ష్మివలె, రుద్రదేవి కూతురై జన్మించెను. (9) ప్రపంచముయొక్క భాగ్యము వలన నామెకు వీరభద్రుడనునతడు భర్తయయ్యెను. (10) చాళుక్యవంశమను సముద్రమునకు జ్యేష్ఠుడు. (11) మహాదేవరాజునకు లక్కాంబ యందు, ఇందుశేఖరుడను రాజకుమారుడు బుట్టెను. (12) ఇందుశేఖరుని కుమారుడు (వీరభద్రుడు?) సంతోషముతో, పండితులకు దానములను శత్రువులకు యుద్ధము నిచ్చుచుండగా (13—16) ఇందుశేఖరుని సేవకుడును, మహావీరుడును, మాచయనాయకుడు మాడచి యను వారి పుత్రుడునగు పోతినాయకుడు కొల్లిపాకపురమున వంశవర్ధనయను కాల్వను త్రవ్వించెను. (17) ఇందు కాకతీయరాజులకు సేవకుడగు (పోతినాయకుడు)...(22) సోమనాథునికి ప్రమాది సంవత్సరమున... బహుళపంచమినాడు మకరసంక్రాంతి నిమిత్తము (దానముచేసెను).

---

# 31. మల్కాపురశాసనము.

[J. A. H. R. S. IV, Pts. 3 & 4]

మొదటి వైపు

1 ఓం స్వస్తి శ్రీః *వితరతు భగవా నసౌ శ్రియం వః కరిన
2 దనో హరినీలభాసి యస్య।ద్యుతివరసరసిస్ఫురత్
3 రంగశ్రియ మధికా మళిపం క్తయో వహంతి॥(1)జయ
4 తీందోః కలాకేల తు(త్)గంగాంభఃకణదంతురైః।క రైః కరోతి యాః
5 ంభో మూర్ధ్ని ముక్తావళిశ్రియం॥(2)హరి రవతుకిరితను ర్వ
6 (భు)వ ముద్వోఢుం గతస్య వరుణపురీ।యస్యా ఖిలజలధిజ
7 ం పాద్యాయాభూ దనర్ఘ్యార్యం॥(3)జయతి భగవాను(?)స్వయ
8 భూ గ్గణపతినృపతే హ్యాది స్థిత స్సతతం।యత్కారుణ్యకటా
9 క్షైద్ధిం ప్రాప్తా ంధ్రదేశశ్రీః॥(4)అస్తిస్వస్తిమతీ తను ర్భగవతో
10 దేవస్య విష్ణో స్ఫుర న్నాభి(భీ)పంకజంభవస్య భుజతో భూవల్లభా జ
11 ... తేషాం ంగమరీచిసంతతిభువో యేదుర్జయాః క్షత్రియా స్తేషా

12 మస్తి కులం కలంకరహితం శ్రీకాకతీభూభుజాం॥(5)వీర స్తస్మా ద
13 జని రజని(నీ)నాథవ ద్దుగ్ధసింధోః కీర్త్తిజ్యోత్స్న(త్స్నా)త్స్నాభరితభువనః ప్రోలభూపాల
14 నామా।రాజ న్యస్మి న్నమపి నృపతిం రాజశబ్దాభిధేయ ము న్నైవవాసో(శౌ)
15 వ్మ త్రిజగతి వినా యామినీకామినీశం॥(6)కీర్త్తి ర్యస్య హిమేందుకుందవిశ
16 దా మూర్త్తి ర్జ్జనానందినీ దానం విశ్వజనార్త్తిహారి చరితం గంగాపయః
17 పావనం। చిత్తం శంభుపదారవిందయుగళధ్యానామృతక్షాళితం శౌ
18 ర్య్యం విష్వగరాతిదుర్మ్మదహరం ధామాపి ధామ శ్రియః॥(7)రుద్ర
19 దేవ స్తతో జాతో యత్కీర్త్యా భూ రలంకృతా।ప్రతిపక్షమహీపా
20 లయశోనిర్మ్మాల్య ముజ్ఝతి॥(8)రాజానః కతివా న సంతి సుభటా స్స
21 ంక్రాంతవిక్రాంతయ స్తే తిష్ఠంతు త మేకమేవశ్రృణుమ శ్శ్లాఘ్యేషు రుద్రం
22 నృపం।యస్యాసీ దసిదారితారినృపతిశ్రేణీశిరఃకందుకక్రీడాంబేడి
23 తవిక్రమా యుధి జయశ్రీః ప్రేయసీ స్థేయసీ॥(9)ఏక ఏవ ధను ర్వ్వీరో రుద్రదేవో మ
24 హీభుజాం।సురేశ్వరాణాం సర్వ్వేషాం పినాకీవ ధనుష్మతాం॥(10)అగ్రానుజ
25 స్తస్య మహీం శశాస ధీరో మహాదేవనృపో మహాజాః ప్రతాపదీపాః
26 ప్రతిపక్షభాజాం శామ్యంతి య త్సైన్యకథానిలేన॥(11) కుందేందుచందన
27 సఖః కుముదస్య మిత్రం స్వస్సింధుసింధురతురంగరుచాం సనాభిః।
28 కర్పూరహారహరహాసపయఃపయోధిబంధు ర్వ్విభాతి యదుదార
29 యశోవిలాసః॥(12)తస్యా యం తనయ స్త్రయీమయతనో ర్దేవాద్భవానీపతే ర్లబ్
30 (బ్ధః)క్ష్మాం సమపాలయతు(త్) గణపతిః క్ష్మాపాలచూడామణిః।యస్మి
31 న్విస్మయకారి విక్రమకథాధారాముచి శ్రీఘనే వ్యర్థీదుష్టదురీశదావదహ
32 నప్రాప్తాం రుజం ముంచతి॥(13)దర్ప్పే ధన్వని మత్సరో గణజయే ధార్ష్ట్యం ద్విపారో
33 హణే(క్రౌ)ర్యం శౌర్యవిధౌ తురంగదమనే చాపల్య మాశాయుధ(క్రో)ధో దుష్ట
34 జనే భయం ద్విజధనాలో(ల్లో)భశ్చ ధర్మ్మార్జ్జనే పూజా కర్మ్మణి శాంకరే గణపతిక్షోణీ
35 పతే రాగ్రహాః॥(14)కోనందోచ్చండవేగవ్యథితకరిహయవ్రాతపృథ్వీశసైన్యం కిం బ్రూమ
36 శ్చండిమానం గణపతినృపతే ర్బాహుదండద్వయస్య।అద్యాప్యుద్దామదర్ప్ప దుపర
37 తపృతనాకోటికంకూ(కా)లకూట(కోటి)ప్రక్రీడత(త్)ప్రేత యూథవ్యతికర
విషమ(మా)భూ
38 మయో ఽషయంతే॥(15)కతికతి నసంతి భూపాః కతి కతి గుణగణాభ
39 రణాః గణపతినృపతిస్త్వేకో నరపతిశత పోషకః క్షోణ్యాం॥(16)నిస్సాణరవ
40 వంత్రస్తాః కుణా ద్గణపతే న్నృపాః। అపి త్యజంతి దుర్గ్గాణి న దారానేవ కేవ
41 లం॥(17)రుద్రదేవి(వీ)సముద్రభూ త్సగణ్యా త్సర్వభూభృతాం। గంభీరా స్మహాత
42 స్తస్మా ల్లక్ష్మీ రత్నాకరా దివ॥(18)సర్వోర్వీశకిరీటకుట్టిమతటీవిన్యస్తపాదాంబుజా శా
43 స్త్యేషా చతురంబురాశిరశనాం శ్రీరుద్రదేవీ భువం।యస్యా జన్మమహోత్సవో

44 గణపతేః క్ష్మాపాలచూడామణే ర్వ్వర్ణ్యాజ్ఞ్యాత్క లికాలకల్మషక(ఘా) ధ్వాంతౌఘ
45 తేజోః ధేః॥ (19) సాంబ్రాజ్యే ఖలవర్జ్జితే విరచితే శ్రీరుద్రదేవ్యా స్వయం చాతుర్వ్వ
46 ర్ణ్య నిజస్థితి వ్వ్ర్జయతే విద్రాతి కాలః కలిః। ధర్మ్మా సాభగవా న్విభాతి దురితం
47 దూరే ద్విజానాం ద్విష స్తన్నా మగ్రీహాభీప్సితా నిజపురా న్నియ్యాంతి పర్యాకు
48 లాః॥ (20) ఆక్రామంతి తరత్తరంగవిగళద్దుగ్ధాబ్ధిఫేనావళీ రాచామంతి శరత్ప
49 శాంకవిసరజ్జ్యోత్స్నాప్రవాహామృతం। ఆకర్షంతి సురేంద్రదంతిదశన
50 ప్రాగ్భారలగ్నాం శ్రియం మాక్తాహారగతాయితాః ప్రతిదిశం రుద్రాంబికా
51 కీర్త్తయః॥ (21) శ్రీవిశ్వేశ్వరదేశికే ప్రశివహాస్తోద్భాసి దోర్వ్వీ కృమస్త్రిక్షోణీశ
52 జగద్రక్షప్రతిబలప్రధ్వంసి జన్మోత్సవః। యస్యాః కాకతివంశమా కిశ
53 మణే శ్రీరుద్రదేవస్సుత స్తస్యాః కిం కథయామ వైభవ మత శ్రీరుద్రదేవ్యా
54 ః పరం॥ (22) అస్తి విశ్వంభరాసారః కమలాకులమంద్దిరం। భాగీరథీసమ్మర్ద
55 మా మ్మర్ద్యం డహాలమండలం॥ (23) ఉగ్రం తత్ర తపశ్చర న్నియమయు
56 తా పే వ్యదియకీడనం సాంద్రానంద్దమయే సమాధిసమయే
57 ధ్యానేన లీన శ్శివే। నీత్వా కాల మనంత మంతకజయీ సద్భావశంభు
58 గ్గురు ద్దుర్వాసోన్వయసంభవ స్సుచరితః ప్రాబుద్ధపుణ్యే న్నృణాం॥ (24) శైవానా
59 ం ప్రథమాయ శంకరపదధ్యానామృతాంభోనిధి క్రీడాంబో)డనకర్మ్మనిమ్మ
60 లతరస్వాంతాయ శాంతాత్మనే। తస్మై నిస్పృహచేతసే గళచురిక్ష్మాపాలచూ
61 డామణి గ్గామాణాం యువరాజదేవ నృపతి ర్భ్రక్షాం త్రిలక్షీం దదౌ॥ (25) కృత్వా
62 న శైవముని రద్భుతశీలమూర్త్తి శ్రీగోళకీమఠము దార ముదాత్తచిత్తః।
63 (త)స్యాకరస్య నృపదేశికమాక్తశానాం వృత్తిం చకార సకలామపి తాం త్రిలక్షీం
64 ॥ (26) ప్రాచీనపుణ్యపరిపాకవశా త్ప్రజానా మావిర్బభూవ భగవా నిహ సో
65 మశంభుః। నామ్నా నిజేన సకలాగమసింధుసేతుం యః పద్ధతిం కరుణ
66 యా ప్రతిమాం బబంధ॥ (27) అథ నృపశేఖరమాలాలాలితపాదో త్ర వామశ
67 ంభు రభూత్। అద్యాపి కలచురీశా యచ్చరణారాధకాః ప్రశస్యంతే॥ (28) లబ్ధ
68 దేశికపదా మనోహరా భూరిదానపరితోషితార్థినః। యత్ర మత్తకరి
69 ణోపి కుర్వ్వతే ప్రాశభేద మిహ భద్రజాతయః॥ (29) తస్మిన్నస్మత్ తస్య గురో ర్బభూవు
70 శ్శిశ్యాః(ష్యాః) ప్రశిశ్యా(ష్యా)శ్చ పర స్సహస్రాః। వినిగ్రహీతుం సమనుగ్రహీతుం క్షోణి
71 శ్వరా న్దక్షకటాక్షపాత్రైః॥ (30) ఇత్థం కాలే యాతి సత్సంప్రదాయే సంతానే స్మిన్న
72 ర్థిసంతానకల్ప(ల్పే) శైవాంభోధే శ్శక్తిశంభో రుదారా చ్ఛిష్య శ్రీమా న్కీర్త్తిశంభు
బ్బభూవ॥ (31)

73 చిల్పి ఆచార్యులు శాంత్తోజుకొడుకు గుడ్డోజునకు ఖ అక్కసాల బెయ్య
74 పోజుకొడుకు ప్రోలోజునకు ఖ ౧ శ్రీమతు రాచగురుదేవార అనతిక్రమమున శ్రీమ
75 తుకాళేశ్వరశివా అయ్యంగరు సానిపిత్తులు పెటిన వైయినము॥ ప్రోలాండిసెట్టి కుంతుల్లు



కామ్మలఅక్క

76 సానికి ఖ ౧ తు ౧౦| నల్లదేవిసెట్టి కుంతులు నలమరానని కి ఖ౧ తు ౧౦| సమయమంత్రికుంత్తు
77 లు విశ్వేశ్వరమణిఖ్యానకు ఖ ౧తు ౧౦| అందరికుంత్తులు గోళగిరిమణిఖ్యానకు ఖ ౧ తు ౧౦|
78 వీరభద్రి వై యిరగి అందరికి ఖ ౧ తు ౧౦| సంకు (వె) న్నజీయుకు మలెకు తు ౧౮|వేమన
79 జీయునికుంతులు కొనునని కి ఖ (౧) తు ౧౦| ప్రోలెబోయకుంతులు కొనుసానికి ఖ౧ తు ౧౦| తుప్రిట్ట
80 (పా) ముకొమ్మసానికి ఖ౧తు ౧౦| త్రుట్టపామగుడ్డసానికి ఖ౧ తు ౧౦| (వెన్న) సానికూంతు
81 లు తల్లసానికి విప్రిత్తి ఖ౧ న ౧౦| నడపల్లె మ (న) మయమఅలు పాత్రటసాని
82 కి ఖ ౧ న ౧౦| సూర్య్యదేవని కూంతులు తిరు ముత్తసానికి ఖ౧ న ౧౦| వెలంక హాండి
83 శ్రీ సోమనతదేవరకుఖ...త్త నపచితిపురచియ పిల్లప్రిదింపిచిన గణేశ్వరునికి న 3
84 శ్రీ విశ్వనతదేవరగుడిపనిచేసి కో
85 పి ఆ (సో) జునకు ఖ౧ నన్నపోజు
86 నకు ఖ౧ పోన్నోజునకు ఖ౧
87 ......ండికూంతుర్లు మొదలమకు గోకననోం
88 ......కన న ౧౦ శ్రీవిశ్వనాథదేవర
89 ......మాండికి కేసరి ఖ ౧ విరిగో
90 ......నికి కేసరి ఖ౧ లోకో

రెండవ వైపు

1 ప్రిగామమవ్యాలోల త్కలచురిమహీపాలపరిమత్కిరీటప్రకీర్ణిదత్కిరణకలికాలా
2 లితపదాః|యశఃపూరస్స్వైరస్తబకితదిశః కేరలభవా స్తతః పద్మావాసా విమ
3 శశివపాదా స్సమభవన్|| (82) నివైర్వర ముఖ్యానాం కలికాలమధ్యే స్థాతుంపదాభ్యా(ం)
4 కుతుకీవ ధర్మ్మః| శిష్యః కృపాకందలితాంతరాత్మా తేషా మభూ ద్ధర్మ్మశివో మునీ
5 ంద్రః|| (83) యం కృపానిధి ముదారవైభవం ధర్మ్మశంభు మఖిలార్త్తిభంజనం| ఏకవ
6 క్త్రికమలం సదాశివం సంకథా సుకృతినః ప్రచక్షతే|| (84) అధ్యేతా నిగమస్య ధర్మ్మనగత
7 య శ్శ్రీగౌడరాఢోల్లసత్పూర్వ్వగ్రామశిఖామణి ర్గ్గణపతిక్ష్మాపాలదీక్షాగురుః|
8 క్షీరాబ్ధే రివ చంద్రమాః శ్శశికలామాలే ర్యథా షణ్ముఖః శ్రీవిశ్వేశ్వరశంభు రు
9 గ్రతపస్తశిధర్మ్మశంభోరభూత్||(85)చిరంపృథ్వీపాలావలిమకుటఘృష్టాంఘ్రికమలద్వయో
10 విద్యావల్లీవలయకలనాకల్పకతరుః|సదా దాంతస్స్వాంతస్థిరతరో(ర) లసద్ధూర్జటి
11 మహా మహాశాంతః కాంతో జయతి భువి విశ్వేశ్వరశివః| (86) శ్రీచోళేశ్వరమాళవ
12 క్షితిపతీ రాజన్యచూడామణీ యచ్ఛిష్యౌ కి మతః పరం గణపతిక్ష్మోణీపతి ర్యస్య
13 తుష్యతః|నస్యా త్కస్య ముదే స దేశికవర శ్శైవాగమాంభోనిధి శ్శ్రీవిశ్వేశ్వరదేశికః కల
14 చురిక్ష్మాపాలదీక్షాగురుః|| (87) గౌడాః పూర్ణ్ణమనోరథాః కతి కతి ప్రాప్తశ్రియ
15 స్తావసా సంతుష్టాః కవిపుంగవాః కతి కతి ప్రధ్వస్తపాశా నృపాః| యేతస్మిన్

16 గణపత్యధీశగురుతాసింహాసనాధ్యాసిని శ్రీవిశ్వేశ్వరదేశికే శివపురీవిశ్రా
17 ణనశ్లాఘిని॥ (38) త్వంగత్తుంగజటాకిరీట ముదయత్స్మేరారవిందాననం ముక్తాకుండల
18 తాడితాంసశిఖరం హారై ర్మ్మనోహారిణం। విద్యామండపవర్త్తినం గణప
19 తిక్ష్మాపాలదీక్షాగురుం శ్రీవిశ్వేశ్వరశంభు మీక్షితవతాం తే చక్షుషీ చక్షుషీ
20 ॥ (39) లోహాః కోయం శకస్యాబ్దే దుర్మ్ముఖౌ వత్సరే శుభే చైత్రాసితేతరాష్టమ్యాం వా
21 రే శుక్రాభిధానకే॥ (40) విషయే వెలినాడాఖ్యే కండ్రవాట్యాం విశేషతః। యదుత్త
22 రేణ వహతి కృష్ణవేణీ మహానదీ॥ (41) శ్రీవిశ్వేశ్వరశంభవే గణపతిక్షోణీశ్వరేశా
23 దరా ద్గ్రామం మ్మందరనామధేయ మఖిలై ర్వ్వర్గ్గైః ద్దత్త మాయైస్సమం। తత్పు
24 త్రీ తదనుజ్ఞయా పశుపతేః శ్రీరుద్రదేవీపురః ప్రాదా ద్గ్రామ వెలంగపూడిస
25 హితం సీమాష్టకేనావృతం॥ (42) అష్టస్వామ్యసహితం ధారాపూర్వ్వకం సకర్షకం।కృ
26 ష్ణవేణీ దీమధ్యగతయా లంకయా సహ॥ (43) తస్యగ్రామస్య సీమానః కథ్యం
27 తే పూర్వ్వతః క్రమాత్ పరిజ్ఞానాయ సర్వ్వేషాం భాషయాం ద్ర్యా స్ఫుటార్థ్థ
28 యా (44) పూర్వ్వస్యాం। పెనుంబాకదిక్కు మొదలిఱువుగాల్వ పొలమెర। ఆ
29 గ్నేయాం। తాండినుండివచ్చిన మద్దిమడ్గుకాల్వ పొలమెర। దక్షిణస్యా
30 ం। కట్టుంగొమ్ముకాల్వ పొలమెర। నైరుత్యాం। ఉప్పలపాటి చెఱువ్వపడమ
31 టికొమ్ము గావిపూండి వెలంగపూండి పొలము సందు పొలమెర। పశ్చి
32 మాయాం। మందరానకూను వెలంగపూండికిని పడుమటి రావి
33 పూండిపొలములోని నల్లందుమ్మ। ఉత్తరము పెనుంబడియపొలము
34 సందు పొలమెర। వాయువ్యాం। పెరకమ్మనుండి నెడ్లిన ఇనుమ్మంగాలికాల్వ
35 తల పొలమెర। అది మొదలు ఈశానపర్య్యంతము కృష్ణవేణియే పొలమెర।
36 అయిశాన్యాం। కృష్ణవేణినుండి పెనుంబాకరడ్డిత్రివ్వించిన కాల్వ తల పొలమెర।
37 రావిపూండికి ఐశాన్యము మందరానకూను వెలపూండికిన్ని వాయువ్య
38 ము పెరకమ్మనుండివచ్చిన పాయేటితల పడుమటి సీమగాను మందర
39 పులంకః॥ శ్రీవిశ్వేశ్వరదేవ మిందుకలికాచూడం మఠం శాశ్వతం సత్రం
40 విశ్వజనాగ్రహారసహితం సుస్థాప్య సంత్యోజ్జ్వలం। శ్రీవిశ్వేశ్వరగోళకీ త్యభిధ
41 యా తం గ్రామ మత్యాదరాత్ శ్రీవిశ్వేశ్వర (దేశిక) స్సమయుజ త్త్రిభగాడచూ
42 డామణిః॥ (45) నానాగోత్రసముద్భూతా ద్రావిడా యే ద్విజోత్తమాః। వరస్ప
43 రం ప్రకుర్వ్వాణాః క్రయవిక్రయ మాదికం॥ (46) షష్టిసంఖ్యావిశిష్టేభ్యః ప్రత్తే(త్యే)కం
44 పుట్టికాద్వయం। పెనుంబాకప్రసిద్ధేన మానదండేన సమ్మితం॥ (47) స్థిత్యుపాధి మ
45 దాత్తేభ్య శ్రీవిశ్వేశ్వరదేశికః। ఏతతు(త్) క్షేత్రంతు పుట్టీనాం వింశత్యాభ్యధికంశ
46 తం॥ (48) వెలంగపూండి సహితం దత్త్వం మందరనామని। త్రిధా విభజ్య తత్సి
47 ష్టమేకం భాగం పినాకినే॥ (49) విద్యార్థిభ్యో పరం భాగం శుద్ధశైవమునిత్రాయ
48 చ(ప)సూత్యారోగ్యశాలాభ్యాం విప్రసత్రా)య చేతరం (50) ప్రాదా ద్విశ్వేశ్వరశి

49 వ। శైవసిద్ధాంతపారగః। ఋగ్యజుస్సామవేదానాం సమ్యగధ్యాపకాస్త్రి
50 యః॥ (51) పదవాక్యప్రమాణానాం సాహిత్య స్యాగమస్యచ। పంచవ్యాఖ్యాతృ
51 తో వైద్యః కాయస్థో ద్వావిచక్షణౌ (52) దశానామపి చైతేషాం ప్రత్యేకం పుట్టికా
52 ద్వయం (53) శ్రీవిశ్వేశ్వరదేవస్య నర్తకో దశసంఖ్యయా। ముఖరీద్వయసంయుక్తా
53 అష్టౌమద్దలవాదకాః॥ (54) అష్టాదశానా మేతేషాం ప్రత్యేకం సార్ధపుట్టికా। ఏ
54 కః కాశ్మీరదేశీయో గాయిన్యశ్చ చతుర్దశ॥ (55) కరడావాదనాద్యేషు కృత్యేషు రస
55 సంఖ్యయా। పాచకౌ ద్వౌ ద్విజన్మా(న్మా)నౌ చత్వారః పరిచారకాః॥ (56) ఇత్యేవ షట్సమా
56 ఖ్యాతా బ్రాహ్మణా మఠసత్రయోః। చాతుర్వర్ణ్యసముద్భూతా జటిలా శ్చోడదే
57 శజాః॥ (57) బీరచ్ఛేదకశిరచ్ఛేదకపత్రచ్ఛేదాదికర్మభిః। వీరభద్రసమాఖ్యాతా దశ గ్రా
58 మస్య రక్షకాః॥ (58) భటాస్యు రపరే భక్తా వింశతి ర్వీరముష్టయః। సువర్ణతామ్ర
59 పాషాణవంశాయస్కుంభకారకాః॥ (59) ఏతే స్థపతిసంయుక్తాః కారునామిత
60 శిల్పినః। దశ స్వకృత్యం కుర్వాణా భటాస్యు ర్వీరముష్టిభిః॥ (60) త్రిసప్తతి (యుష్మా
నుక్తా)
61 నాం కల్పితా త్వేకపుటికా। ప్రత్యేకం పూర్వముక్తానా మారామార్థం చ సర్వ(శః)
62 తః॥ (61) ప్రదాత్ షోడశకంభాగ న్నివర్తనమితక్షితేః। గౌడదక్షిణరాఢీయపూ
63 ర్వగ్రామసముద్భవాః॥ (62) శ్రీవత్సగోత్రిణో యేస్యు ర్బ్రాహ్మణా స్సామవేదినః।
64 ఏతేభ్య స్త్రిశతం పుట్టి రదా ద్రాజగురు స్తథా॥ (63) ఏతా ఏతే ప్రభుంజానా
65 గ్రామ స్యాయవ్యయాదికం। అనుసందధతాం సర్వం సమ్య గ్లేఖనపూ
66 ర్వకం॥ (64) ఇత్యాహత్య శతం సార్ధం పుట్టికానాం ప్రకల్పితం। తిష్ఠతామేవ స
67 ర్వేషాం స్వే స్వే కర్మణి వృత్తయః॥ (65) భవన్త్య (త్యా) చంద్రతారార్క మన్యథా
న భవంతి వా।
68 పుత్రాభావే స్త్రియో ప్యేషాం కులాచారసమన్వితాః॥ (66) కారయంత్య స్వకర్మాణి క్షే
69 త్రారామాది భుఞ్జతాం॥ (67) క్షేత్రాణి శిష్టా న్యఖిలాని దేవదేవాంగభోగాలయ
70 ముఖ్యకృత్యే। ఉపేయుషాం శైవతపోధనానాం కాలాననానాం శివశాసనానా
71 ం (68) విద్యార్థినాం పాశుపతవ్రతానా మప్యన్నవస్త్రాదిసమర్పణాయ। ఆ
72 గభ్య విప్రా ననివారితానాం చండాలపర్యంత ముపాగతానాం (69) అన్న
73 ప్రదానాయ చ సర్వకాల మకల్పయ ద్రాజగురు ర్మహాత్మా దేవస్య సత్రి
74 స్య మఠస్య తస్య గ్రామస్య సర్వస్వ చ సో ధికారీ॥ (70) యో గోళకీవంశ్యకృతాభిషే
75 క శ్శాంత శ్శుచి శ్శైవరహస్యవేదీ। శైవాగమానా మపి పారగామీ సంతాన
76 పాల స్సమలోష్టహేమా ॥(71) సర్వాణి భూతా న్యనుకంపమాన స్సమస్త విద్యా
77 సు కృతావగాహః। మహీసురి శ్శీలవతాం పురోగో భవత్తరాం నైష్టికదేశి
78 కేంద్రః (72) విశ్వేశ్వరశివాచార్యో ధీమా న్రాజగురు స్స్వయం। ఏవ మాజ్ఞాప॥
79 యద్ధీరశ్శైవాచార్యా శశ్వదైర్వృతః॥(73)ఆంధ్రదేశస్థానపతయష్షట్కర్మాణస్తపోధనాః

మూడవ వైపు.

80. సాంతానికాశ్చ సర్వే త్రిసాక్షిభూతా భవంతు తే॥(74)శ్రీవిశ్వేశ్వరగోళకా
81. మాచార్య్యైస్తత్ర ప్రతిష్ఠితః। ఏత త్సర్వం సదాచారః పరిపాల్యో జితం
82. సదా॥ (75)విప్రాణాం శత మాచార్య్య భోగం భుంజీత దేశికః।ఉపే
83. క్షకే స్మి న్దుర్వృత్తే ప్రతి × × భక్త × స్తు। + + స్తం పరిత్యజ్య సా
84. ంతానిక మథాపరం॥ (76)ధ + + + త × × తా × × హాయారక్షకా
85. స్తథా। సర్వతీర్థఫలం సర్వజపహోమఫలం తథా॥ (77) సర్వదేవార్చ్చ
86. నఫలం ప్రాప్నువం త్యత్ర మానవాః। విరుద్ధా విఘ్నకర్త్తారః క్షేత్రవి
87. ర్ప్యాపహారిణః॥(78)తిరిస ప్తకులజై స్సార్ధ మన్నపానా ద్యభావతః।దరి
88. ద్రాః ప్రేతత్వ రాదీర్ఘ్య ప్రాప్య ప్రాదశదుర్గతీః॥(79)దుఃఖా న్యనుభవిష్యంతి
89. మహాంతీని మహాతపాః।విశ్వేశ్వరశివాచార్య్య స్సదాచా రై స్తపోధ
90. నైః॥(80)బ్రాహ్మణై రప్యనఘైన్యై గ్రస్తై స్వభానునా రవౌ సే।కృష్ణవేణ్యా ము
91. హేనద్యాం స్నాత్వా చమ్య విధానతః॥(81)ఏవం ప్రాసకృతాం శాసం ప్రాదా త్పుణ్యకృతా
92. ం వరం॥కృత్వా కాళీశ్వ రాఖ్యే పురే ఉపలమఠం స్వోన్న గామాగ్రహారం క్రీత్వా
93. విశ్వేశ్వరశివ ఉరుధీ ర్దత్తవా న్సర్వసాక్షి।విమ్మార్య స్వాఖ్యలింగ మ్మఠం మపి
94. నగరే మంద్రకూటాభిధానే మానే పల్యాళ్లునల్లిద్వయ మదదత స్ద్వేవస
95. త్రద్వయాయ॥(82)నామ్నా స్వేన స చంద్రవల్లినగరే లింగం ప్రతిష్ఠాప్య సత్కంచం
96. పల్లితటాకసేతు మధికం కృత్వా ద్ధ మస్మా అదాత్।కృత్వా నందపదే స్వనామనగ
97. రం ప్రతిష్ఠాప్య చా ప్యానందం మునికూటము స్వాధ పురం దేవ స్య భుక్త్యై
98. అదాత్॥(83)కొమ్ముర్గ్రామే స్వాఖ్యలింగప్రతిష్ఠాం కృత్వా త్రింశత్ఖండిమానాం మ
99. హీం సః।నిమ్మక్షేత్రం పంచఖారీమితం చ ప్రాదా ద్దేవాయాంగరంగోపభు
100. క్త్యై॥(84)శ్రీశైలే శాన్యేలీశ్వరపురి స మఠం చ షోడశావరకం।అకరో త్తచ్ఛిష్యోదార్గ్గా
101. మం గణపతి రవారిసత్రాయ॥(85)విషయే పల్లినాడాఖ్యే కంద్రకోటాభిధాన
102. కం।ఆచార్య్యదక్షిణారూపం తస్మై భక్త్యాసమార్పయత్॥(86)లింగ న్నివృత్తాని
103. మాయ త ద్వేల్లాలాంతరస్థలిం। దుద్యాలగ్రామవన్యాంశం పూనూరుగ్రామ
104. మ ప్యదాత్॥(87)ఉత్తరసోమశిలాయాం లింగం వై శ్వేశ్వరం ప్రతిష్ఠాప్య।ఏత్రపోల్నా
105. మానం గ్రామం ప్రాదా త్స దేశికశ్రేష్ఠః॥(88)సామాన్యోయం ధర్మసేతుర్నృపాణా
106. ం కాలే కాలే పాలనీయో భవద్భిః।సర్వానేతా న్భావినః పార్థివేంద్రాన్భూ
107. యో భూయో యాచతే రామచంద్రః॥(89)స్వదత్తాం పరదత్తాం వా యోహ
108. రేత వసుంధరాం।షష్టింవర్షసహస్రాణి విష్టాయాం జాయతే క్రిమి
109. ః॥(90)అస్యసర్వస్యధర్మస్యపాలకస్యపదద్వయం।విశ్వేశ్వరశివాచార్యోవహత్య
110. న్యాం స హాత్యలం ॥(91) మంగళమహాశ్రీశ్రీ

# అనువాదము.

మొదటి వైపు.

(5) విష్ణువు నాభీకమలమునుండి యుద్భవించిన బ్రహ్మభుజములనుండి భూవల్లభులు పుట్టిరి. అందు సూర్యవంశీయులును దుర్జయులునగు క్షత్రియులలోనివారగు కాకతీయులది నిష్కళంకమగు కులముగలదు. (6) అందు వీరుడగు ప్రోలభూపాలుడు క్షీరసముద్రమునుండి చంద్రునివలె బుట్టెను. (7) అతని చరిత్రము పావనమైనది. దానము జనుల కష్టములను హరించునది. చిత్తము శంభుపాదారవిందముపై లగ్నమైనది. (8) అతనికి రుద్రదేవుడు పుట్టెను. (9) గొప్పగొప్ప సైన్యములుగలరాజు లెందరోయున్నను రుద్రుడే శూరుడని విందుము. అతని శత్రురాజుల తల లనుబంతులతో నాటలాడు జయశ్రీ యతని ప్రేయసి. (11) అతని తమ్ముడగు మహాదేవరాజు తర్వాత భూమినేలెను. శత్రురాజుల ప్రతాపమను దీపము లీతని కీర్తియను గాలివలన నారిపోయినవి. (13) ఆమహాదేవరాజును శివునికృపచే గల్గిన గణపతిదేవుడు పిమ్మట రాజ్యమేలెను. (16) సద్గుణములుగల రాజులెందరులేరు. వారందరిలో గణపతిదేవుడే రాజులెల్లరను పోషింపగలవాడు. (17) గణపతి జయఘోషనువిని శత్రురాజులు తమభార్యలనేగాక దుర్గములనుకూడ వదలి పారిపోవుచున్నారు.

(18) గంభీరుడగు నతనికి సముద్రమునకు లక్ష్మివలె రుద్రదేవి జన్మించెను. (19) ఈరుద్రదేవి రాజులకిరీటములపై తనపాదములనుంచి రాజ్యమేలుచున్నది. (20) రుద్రదేవి తనసామ్రాజ్యములో దుర్మార్గులు లేకుండునట్లు చేయుగా వర్ణధర్మము సరిగాసాగుచుండెను. కలికాలము పరిగెత్తిపోవుచున్నది. బ్రాహ్మణులకు శత్రువులు దూరముగానున్నారు. ఆమెపేరు విన్నచో శత్రువులు తమనగరములను వీడుచున్నారు. (21) రుద్రాంబిక కీర్తులు పాలసముద్రములోని వచ్చుచు, పోవుచుండెడి కెరటములచేనెగురగొట్టబడు నురుగు నాక్రమించుచున్నవి. శరదృతువులోని వెన్నెలయమృతము నాచమనము చేయుచున్నవి, ఐరావతము కోరల చిగురునునుండు శ్రీని లాగుచున్నవి. (22) శ్రీవిశ్వేశ్వర శివునిచేతితో ప్రకాశింపబడినదియు, ముగురురాజుల బలములను నాశనము చేయునదియునగు జన్మోత్సవముగలవాడును, కాకతీయవంశమునకు మౌక్తికమువంటివాడునగు శ్రీరుద్రదేవుడవలెను కుమారుడో అట్టిరుద్రదేవి యొక్క వైభవము నింతకంటెనేమని వర్ణింతుము.

(23) భాగీరథీనర్మదానదులకు మధ్య లక్ష్మీకాటపట్టగు డహాలమండలము గలదు. (24) అచ్చట నుగ్రమగు తపస్సును చేయుచు, బహిఃప్రవృత్తి నరికట్టును, సమాధిలో శివునిలో లీనమగుచు, నెంతయోకాలమును గడపిన, దుర్వాసగోత్రుడగు సద్భావశంభువు జనుల పూర్వపుణ్యమువలన చాలకాలము వసించుచుండెను. (25) శైవులలో మొదటివాడును, శివపదధ్యానాసక్తుడును, వాంఛారహితుడునగు నతనికి కలచురిరాజగు యువరాజదేవుడు మూడులక్షల గ్రామములను భిక్షగా నొసగెను. (26) ఆశివముని గోళకియను మఠమును నిర్మించి యామూడు లక్షల గ్రామములను దానికి వృత్తిగా నిచ్చెను.

(27) జనుల యదృష్టముచే సోమశంభువు అవతరించెను. అతడు తనపేరుతో శై

ాగమములను సులభసాధ్యములనొనర్చు నొకపద్ధతిని నిర్మించెను (29) పిమ్మట రాజులచే చరణముల నొత్తించుకొనిన వామశంభువు వచ్చెను. నేడుకూడ కళచురిరాజులాతని చరణముల నారాధించు చున్నారు. (30) తమ క్రీగంటి చూపులచేతనే రారాజులను సహితము అను గ్రహించుటకు నాగ్రహించుటకును సమర్థులగు వేనకువేలు శిష్యులును ప్రశిష్యులును వామ శంభువున కామఠమున గల్గిరి. (31) ఇట్లు కాలము జరుగుచుండగా శక్తిశంభువను నతనికి కీర్తిశంభువను శిష్యుడు గల్గెను.

రెండవ శాఖ.

(32) కళచురిరాజుల సభలో నమస్కరించువారి కిరీటములయొక్క చంచలములగు కాంతులచే నలంకరింపబడిన పాదములు కలవారును, దిక్కులన్నిటికిని వ్యాపించిన కీర్తిగలవారును, కేరళదేశజులునగు శివగురువులుండిరి. (33) కలియుగములో పాదములతో నిర్భయముగా సంచరింప నిచ్ఛగల ధర్మదేవత మోయగ, వారి శిష్యుడగు ధర్మశివుడావిర్భవించెను. (35) సర్వవేదములను జదివినవాడును, ధర్మపవిత్రుడును, గౌడరాఢమండలములోని పూర్వ గ్రామనివాసియు, గణపతిదేవుని దీక్షాగురువునగు శ్రీవిశ్వేశ్వరశంభువు పాలసముద్రమునుండి చంద్రునివలె ధర్మశంభువునకు గల్గెను. (36) చిరకాలము రాజులకిరీటములచే స్పృశింపబడిన పాదములగలవాడును, విద్యకు కల్పవృక్షమువంటివాడును, దాంతుడును, ధూర్జటివంటివాడును నగు విశ్వేశ్వరశివుడు జయించుచున్నాడు. (37) రాజులలో నగ్రగణ్యులగు చోళమాళవరాజులెవరి శిష్యులో, గణపతిరాజు యెవని సుతుడో అట్టి శైవాగమములకు సముద్రమువంటివాడును, కలచురిరాజునకు దీక్షాగురువునగు విశ్వేశ్వరదేశికు డెవరి కానందము నీయడు. (38) ఈదేశికుడు గణపతిదేవునిగురుపీఠమునలంకరింప నెందరుగౌడదేశీయుల యభీష్టములో నెరవేర్పబడినవి, తాపసులెందరో ధనమును బొందిరి, యెందరోరాజులు తమపాశములనుండి తొలగింపబడిరి. (39) కదలుచున్న జటలతో చేయబడిన కిరీటముగలవాడును, అప్పుడే వికసించిన తామరపువ్వువలె నగుమోముగలవాడును, ముత్యపుకుండలములచే తాకబడిన భుజాగ్రములు, గలవాడును, చక్కని హారములు ధరించినవాడును, గణపతిదేవుని దీక్షాగురువును, విద్యామండపమునందుండువాడునగు నావిశ్వేశ్వరశంభువును చూచినవారి కన్నులే కన్నులు. (40) ("లో, హ, కో, యం" అను నక్షరములచే సూచింపబడిన) శకసంవత్సరమున, దుర్మతివర్ష చైత్ర బహుళ అష్టమి శుక్రవారమునాడు /(41) వెలినాడు విషయములో కండ్రవాటి యందు, ఉత్తరమున కృష్ణానది ప్రవహించు (42) మందరమను గ్రామము, అన్నిఆయములతోను విశ్వేశ్వరశంభువునకు గణపతిదేవునిచే వాగ్దత్తము చేయబడినది. అతని పుత్రికయగు రుద్రదేవి యతనియనుజ్ఞతో వెలంగపూండియను మరియొక గ్రామముతోకలపి (43) అష్టస్వామ్యములతోడను, పంటలతోడను, కృష్ణలోగల లంకతోను చేర్చి దానము చేసెను.

(45) విశ్వేశ్వరదేవుని, శాశ్వతమగు మఠమును, అందరికి నుపయోగించు నగ్రహారముతో గూడిన సత్రమును స్థాపించి, విశ్వేశ్వర దేశికుడారెండు గ్రామములను గలిపి శ్రీవిశ్వేశ్వరగోలకియనిపేరు బెట్టెను. (46-47) అనేక గోత్రములవారును, ఒకరితో నొకరు క్రియ

విక్రయములను జేసికొనువారునగు నరువదిమంది ద్రావిడబ్రాహ్మణులకు ఒక్కొకరికి ఒక్కొకపెనుంబాక మానెడు వంతున తిండికై యేర్పాటు చేయబడెను. (48-53) వెలంగపూండిమందరగ్రామములలో 120 పుట్లభూమి యొసంగబడెను. అందు మిగిలినదానిని మూడుగా విభజించి యొకభాగమును శివునికిని, రెండవదానిని విద్యార్థులకును, శుద్ధశైవమఠమునకును, ప్రసూత్యారోగ్యశాలలకును, సత్రమునకును గలిపియు విశ్వేశ్వరదేశికుడొసంగెను. ఇతడు శైవసిద్ధాంతములు పూర్తిగా దెలిసినవాడు. (ఈయూరిలో విద్యార్థుల సౌకర్యముకొరకై) ఋగ్యజుస్సామవేదములను చెప్పువారు ముగ్గురును, పదవాక్యప్రమాణ సాహిత్యాగమములకు వ్యాఖ్యానము చేయువారేదుగురును, ఒకవైద్యుడు నొకకాయస్థుడు నేర్పరుపబడిరి. ఈపదిమందికి నొక్కొక్కరికి రెండు పుట్లొసంగబడినవి. (54-57) విశ్వేశ్వరునికి పదిమందియాటకత్తెలును, ఇద్దరు ముఖరులును, ఎనమండ్రుగురు మద్దెల వాయించువారును, ఈపదునెనిమిది మందికి నొక్కొకరికి పుట్టిన్నర యీయబడినది. కాశ్మీరదేశీయుడొకడును, పదునాల్గురు పాటకత్తెలును, కరడామున్నగువానిని వాయించువారారుగురును, నలుగురువంటచేసెబ్రాహ్మణులును, స్థలసేవకులును, మఠమునకును సత్రమునకును గలపి యార్గురు బ్రాహ్మణులును, (58) చోడదేశీయులును, బీజచ్ఛేద శిరచ్ఛేద కుక్షిచ్ఛేదములను పనులజేయుచు, గ్రామమును రక్షించు పదిమంది వీరభద్రులను వారును, (48-60) వీరముష్టులను మరిపదిమంది భటులును, బంగారు రాగి యినుము రాయి వెదురు కమ్మరిపనివారును, శిల్పులు, మంగళ్ళును, స్థపతియునను పదిమందియు మరికొందరు భటులు. (61) ఈ 73 మనుష్యులకును, ముఖ్యముగా పైనచెప్పినవారు తోటలువేసుకొనుటకుగాను ఒకపుట్టి యొసంగబడెను. (62-63) కానదక్షిణరాఢదేశమునందలి పూర్వగ్రామనివాసులును శ్రీవత్సగోత్రులును, సామవేదపారగులునగు బ్రాహ్మణులకు రాజగురువు 80 పుట్లనిచ్చెను. (64-65) వీరు వీనిననుభవించుచు గ్రామముయొక్క ఆదాయవ్యయముల లెక్కలను జాగ్రతగా వ్రాయుచుండవలెను అని శాసింపబడి 150 పుట్లొసంగబడినవి. ఎంతకాలము వారివారి పనులను చక్కగా నెరవేర్చుదురో అంతకాలమును వారికి వృత్తులు నడువగలవు. (66-67) పుత్రులులేనియెడల స్త్రీలు తమపనుల నితరులచే జేయించుచు , భూమిని తోటలను అనుభవింపవచ్చును. (68-70) మిగిలినభూములను దేవునికిని ఆగంతుకులగు కాలానన శైవులకును, విద్యార్థులకును, పాశుపతులకును భోజనముపెట్టుటకును, చండాలురు మొదలు బ్రాహ్మణులవరకునుగల జాతుల కెల్లరకు నన్నప్రదానము చేయుటకునై రాజగురువు ఏర్పరచెను. (70) దేవునికిని, సత్రమునకును, మఠమునకును, గ్రామమునకునుగూడ నతడే సర్వాధికారి. (71-72) గోలకీమఠమునకభిషిక్తుడును, శాంతుడును, శైవరరహస్యముల నెరిగినవాడును, లోభరహితుడును, భూతదయగలవాడును, మహావిద్వాంసుడును, (75) రాజగురువునగు విశ్వేశ్వరశివాచార్యుడు నూర్గురు శివాచార్యులతోగూడి యిట్లాజ్ఞాపించెను.

(84) ఈతడు కాళేశ్వరపురమున ఉపలమఠమును స్థాపించి [illegible] దాని కగ్రహారముగా నొసంగెను. మందరకూటనగరములో తనపేర నొకలింగ[illegible] నెల

కొల్పి మానేపల్లి ఊటుపల్లియను గ్రామములను వానికొసంగెను.(83-84) చంద్రవల్లి నగరము లో తనపేర మరియొకలింగమును స్థాపించి కంచంపల్లిచెరువుమీది వంతెనను పెద్దదిచేసి యందుపగమీదేవుని కొసంగెను. నందపదములో నొకయూరిలింగమును ప్రతిష్ఠించి, మునికూటపురమునాదేవునికిచ్చెను. కొమ్మూరులో నొకలింగమును స్థాపించి 30 భూరిమల మెట్టభూమిని 5 భూరిమల పల్లపునేలను యిచ్చెను. (85-86) శ్రీశైలమున కీశాన్యభాగమున సలీశ్వరపురిలో నీరాజగురు వొకమఠమును కట్టించగా నతని శిష్యుడగు గణపతిదేవుడు పల్లినాడు విషయము లోని కంద్రికోటయను గ్రామమును దానమిచ్చెను. (87) రాజగురువు వెల్లాలస్థలములోని దుద్యాలగ్రామములో భాగమును, పూనూరు గ్రామము నిచ్చెను. (88) ఉత్తరసోమశిల లో విశ్వేశ్వరలింగమును బ్రతిష్ఠించి విశ్వేశ్వరదేశికుడు ఐతపోలను గ్రామము నాదేవుని కొసంగెను.

---

# 32. కోటగిరితామ్రశాసనము.

(Hyd. Arch. Series. No. 6.)

1. స్వస్తి శ్రీమతు॥ వారా
2. శీంతను రమ్యతస్య జగ
3. తా మవ్యా ఛ్షమాకర్ణనే యస్యాః క(ం)ర
4. విలోలనహా క్తికలతాలీలా మవాప
5. (ణ్ణ)వః। నానావిభ్రమ భూషణాస్పదలస
6. ద్దంష్ట్రాశిలాశాగ్రిమస్తేయః సంఘటితేంద్ర(నీ)
7. లఘటికాం లక్ష్మీం చ ధాత్రీ(ం) దధౌ॥(1)
8. గణేశో వతు వ(ః) సర్వే కార్యకార్యసిద్ధి మ వాప్నుమ।
9. యత్పాదపంకజద్వంద్వవందనానందసుందరాః॥ (2)
10. స్వస్తి శ్రీకాకతీశో గణపతినృపతి
11. స్తస్య శౌ(సా)రుద్రమాంబా పుత్రీ లోకైకవీరా
12. జని రజపతేర్నిష్కలంకా కలేవ। త
13. స్యాం పృథ్వీ ముదగ్రై రరిదమన(భయో)వేజైత్రైర
14. ర్జయన్యాం। లోకోద్దీప్తైః ప్రతాపై రకృత సుకృతి
15. నా మగ్రణే రగ్రహారం॥ (3) శ్రీమాన్వియ్యాలవంశాబ్ధి(ల)
16. క్ష్మీ చురాత్రి కుమా(ర)కా । సంశిక్షయతి మాతేవ విద్యా
17. [illegible] గుణాతిభిః॥(4)భక్తి స్వామిని శక్తి రర్థి (ని) గుణే రా(గో)
18. [illegible] తాం కామ్యుం మంత్రిణి ధైర్య × త్రినికశే
19. [illegible] శ్రీమా[illegible] సత్యం వాచి సుధాముచి

20. ప్రియకరో ధర్మః సదా చేతసి ప్రేమో యత్ర విద్భం
21. భతే గుణగణః క్షీరాంబుధేః సోదరే॥(5)
22. తత్రాభూ దృద్రభూపః ప్రథితపృథుతిరత్నా
23. భృదుత్తుంగరంగశృంగారోదగ్రరా(జ)న్య
24. శికిరణ (జ)టాపాటలోపాంతభూమిః।ప్రత్యుద్యద్దం
25. తదంతావలకరటతటీవిక్షరద్దానధారా
26. పూరాపాతక్రమాపంకిలగలితరజోభి(జ)
27. రక్తాంతభూమిః॥(6) క్షుభ్యంత్యంబుధయశ్చ
28. లంతి గిరయ స్త్రుట్యంతి భూసంధయః ప్ర
29. భ్రస్యం త్యరయ స్ఫుటప్రవిఫల(ం) త్యుద్దామదిగ్భిత్తి
30. యః। కిం త త్యంచదుద వవంచితఫణాఘాతప్రపాతత్రుట
31. త్రాడిస్కంధవిసంధిబంధనపరః శేషోపి యద్ధాటిషు॥(7)
32. శ్రీరుద్రుద్రమహీపతే రుదభవ చ్చంద్ర స్సుధాబ్ధేరివ
33. శ్రీమా రామగుణవ్రజస్య (స్స) గణపత్యుర్వీశ
34. చూడామణిః। గాఢధర్మతమో నభోమణి
35. రపి ప్రాప్తార్థిచింతామణి స్వామిశ్రీపదరే ణు)
36. శేఖరమణి గ్గాంభీర్యపాథోనిధి॥(8)త్మా
37. చక్రే బలిశః ప్రినంనగిరిశః ప్రిద్వేష్టిదుష్టాం
38. కుశః పోద్యద్దుర్నయమీనపోతబడిశ(ః) సః(స)
39. ద్ధర్మచింతావశః।సీత్యానీతదివానిశ(ః)
40. కవిజనవ్రాతై స్తుతః సర్వ(త)స్వామిద్రోహ
41. జనప్రమర్దకులిశః సంగ్రామభూకర్కశః॥(9)
42. ధీరోదాత్తతరస్య తస్య మహిషీ ప్రాణాధికప్రేయసీ
43. వెంకాంబేతి సతీ సుతేవజలధే ర్నారాయణస్య స్వయం త
44. స్యాం తేనశమేనిశావతీవ ప్రేఢప్రతాప స్స్వయం
45. సూర్యః శూరకుమారవీరతిలకో లోకై కవీరో జని॥(10)
46. సత్యే ధర్మసుతః పరే రవిసుత స్త్యాగే పృథాయాఃసుతః
47. శౌర్యే ధైర్యగుణే సుమేరురపి సౌందర్యే స్స్వయం మన్మథ(ః)
48. భర్గశ్చండిమణిః ప్రభుగతిమణిః స్రోతక్షితీనాం
49. గురు ద్గావావీధిమనీతి మార్గ ఉశనా దాక్షి
50. ణ్యదీక్షాగురుః॥(11)యుద్ధాటీకోటిప్రఖర
51. ఖురపుట (క్షో)టిటంకప్రనాడిక్షుణ్ణక్షోణి (ణీ) ప్ర
52. దేశత్రు(తృ)టదణురజస్థాపితా

రెండవ రేకు.

53. శావకాశాః। దృప్యత్కల్పాం
54. తహేలాహతహారడమరు(రూ)ఢా
55. మరన్వర్గభేరీభాంకారోద్భిమ
56. భూరిభ్రమణభయభృతారాతిభూపా
57. భ్రమంతి॥(12) వరబలభీమ ఉదాత్తో
58. భువనే దుష్టాంకుశః సతామీశః। గణపతి
59. నరపతితనయః శ్రీమాన్ సామంతశూర
60. పృ(పృ)థ్వీశః॥(13) సోయం శూరమహీపతిః ప్రతిదిి
61. నస్వారాధిత × × × శ్రీమత్కోటగిరా
62. పురే ప్రతివర్ష వర్షే(1)పిచి శ్రీముఖే విప్రేభ్య
63. స్థిరచారువింశతిమితేభ్య(ః) శ్రీయ
64. సః సిద్ధయే ధారాపూర్వ మదత్త వేన్కలపురీం
65. వైనాయకాఖ్యాంతికాం ॥ (14) శకవర్షా
66. ణి ౧౧౯౫ శ్రీముఖాబ్దే పుష్యమాసి
67. కృష్ణపక్షే శుభావహే । షష్ట్యాంతిథౌ భా
68. నువారే వైనాయకఖరీమదా
69. ౯(త్)॥(15)తృణకాష్టాంబుసంపూర్ణాచతుఃసీ
70. మావిభావితాం । రమ్యాం పుణ్యాం మష్ట
71. భోగతేజఃస్వామ్యాదిపూర్వకం॥(16)*

మూడవ రేకు.

98. శ్రీమద్వీర్యాలసామంతశూర
99. పృథ్వీభుజాకృతః। అగ్రహా
100. రోయముత్కృష్టో వర్ధతా ముత్త
101. రోత్తరం॥ పాలయంతుమహీపా
102. లా అగ్రహారం ద్విజైః కృతం।దాతురభ్య
103. ధికంయస్మాత్పాలకా వా ఫలంబరాః॥♦

## అనువాదము.

(2) శ్రీకాకతీయగణపతిదేవుని పుత్రిక రుద్రాంబ. ఆమె శత్రుభయంకరముగా రాజ్య ముచేయుచుండగా, నొక యగ్రహారము నిర్మింపబడినది. (3-4) తనకుమారులకు విద్యను నం

* 72—97 పంక్తులలో దానప్రతిగ్రహీతలను గూర్చిన వివరములు గలవు.

♦ 104—139 సాధారణముగా శాసనాంత్యభాగముల గాంచనగు ధర్మవచనములు గలవు.

వదల నిచ్చునదియు,సద్గుణగణాలంకారులగువారి కాలవాలమునగు శ్రీ విర్యాలవంశము గలదు. (5) అందు మహాశూరుడు ననేకమందిరాజులచే నమస్కరింప బడినవాడు నగు రుద్రిరాజు జన్మించెను. (7) పాలసముద్రమునకు చంద్రునివలె నతనికి ధర్మానురక్తుడును, స్వామిభక్తిపరాయణుడునగు గణపతిరాజు గల్గెను. (9) అతనికి సద్గుణవతియగు వెంకాంబవలన శూరుడనుకు మారుడు పుట్టెను. (13) ఈ సామంతశూరుడనురాజు కోటగిరియను నగరములో నివసించుచు శ్రీముఖసంవత్సరమున నిరువదిమందిబ్రాహ్మణులకు తన శ్రేయస్సుకొరకై వైనాయకపురియను వేన్కలపురిని ధారాపూర్వకముగా నిచ్చెను. (14) శా. శ. ౧౧౮౫ యగు శ్రీముఖసంవత్సర పుష్య బహుళ షష్ఠి ఆదివారమునాడు వైనాయకపురిని దానమిచ్చెను.

# 3. రాయచూరుశాసనము.*

———:O:———

మొదటి రేకు

1. స్వస్తి సమస్త గుణగణాకార । సత్యరత్నాకర । సౌజన్యగౌర (వ) । అతిగండభైరవ । సాహసోత్తుంగ । కాకతీయ కటకసంనాహ। వీరవితరణోత్సాహ । కుముపులూరి పురవరాధీశ్వర । వీరలక్ష్మీనిజేశ్వర । మ

2. నుమకులకమల మార్తాండ । కదన ప్రచండ । మీసరగండ । ఉభయబలగండ। గండరగండ । అభంగ । గండభేరుండ । హన్నిబ్బరగండ । హదిమువరగండ । లాడకువరపిండార । చోళజగజాళవీర।

3. కాంతికాఅగళమాళి । సంతతాచిఀతశశిమాళి । కామినిజయంత । దుష్టతురగరేఖారేవంత । సమరసమయ । దుర్వారవీరావతార । కోసగిమైలితలగొండగండ । ఉప్పలమన్నితలగొండగండ । ప

4. ౦దిభూపాలుని తలగొండుగండ । అక్కినాయకుని తలగొండుగండ । మేడిపలికాచెయనాయకుని శిరఖండ।కందూరి కేసినాయునితలగొండుగండ । ఆసాకభీమనిర్ధూమధామ।ని

5. రుపమ ! సంగ్రామరామ । తెఅలకాట దిశాపట్ట । ఏరువతొండ గోధూమఘట్టనఘరట్ట । చేడ చెలుకి యిని నిసాహుణాపహారణ । సహజకార్యాభరణ । కోటపెమ్మార్డిరాయకంఠాభ।

6. రణమూలకాఱ । బొడ్డఒడయపట్టసూత్రి తురంగాపహార । రుద్రిదేవ దక్షిణభుజాదండ । నిజకీర్తి పూరిత బ్రింహ్మాండకరండ । వరబలోద్దండ।శ్రీసోమనాథ దేవదివ్య।శ్రీపాద

7. పద్మారాధక । పరబలసాధక । నామాది సమస్తప్రిసస్తిసహితం । శ్రీమతుమీసియరగండ గోనగంనయరడ్డి వారు వర్ధమానపురమునందు సుఖసంకథావినోదంబు (న) ప్రిథువిరాజ్యము

---

* నావద్దగల శాసన ప్రితిబింబమునుండి— (సంపాదకుడు)

8. సేయుచుండగాను । తదాశ్రిజ్యరక్షామణిఅయిన । శ్రీనారాయణదేవదివ్యశ్రీపాదపద్మారాధక । సకలజనప్రీతిపాలక । పరబలసాధక । సకలధర్మ్మసాధక। పుణ్యగుణసహిత।

9. వితాలనాథ భూనాథుండు॥ అదపని తుంబుళము । మాలువ హాలువ। దుర్గ్గాలు సాధించి । తదనంతరంబు । రాచూరివట్టణప్రవేసాభిముఖుండై । సుఖసంకథా వినోదంబు న ప్రిసువిరాజ్యము

10. సేయుచునుండి । శకవర్షంబులు ౧౨౧౬ । అగు । జయసంవత్సర । మార్గ్గసిరసుద్ధ ౭ రు । నందు సర్వ్వ రాష్ట్రసమస్త ప్రజారక్షణార్థంబై దుర్గ్గము రచియించెను॥ మంగళమహా శ్రీ శ్రీ శ్రీ

# 34. తెరాలశాసనము *

1. స్వస్తి సమధిగతపంచ మహాశ్బాలం . .
2. దాళగజకేసరీ లాంఛనభ్రాజి . .
3. సకలదేశాధిపతియును నరేం . .
4. చక్రవర్తియునునైన శ్రీకాకతీ (య)
5. కుమారరుద్రదేవ మహారాజు (ల)
6. దివ్యశ్రీపాదపద్మారాధకుండు
7. (ను) సకలసేనాధిపతియును
8. సముద్ధృత ప్రతిపక్షసమూహా
9. . . . హతోపాయలక్ష్మీ పతియు . .
10. . (వి) ఖ్యాతరాజనీతి చాణక్యుండును
11. . . . జగద్ధితమితసమధురవాక్యుండును
12. . . పరచక్రప్రదా . . కరపాడ్గుణ్య
13. . . పుణ్యుండును భయార్తరిపునిప్రశరణ్య
14. . . ండును బతిరాజ్యసముద్ధరుణుండును
15. . . జగద్భరిత కీర్త్తివిభూషణుండునునైన
16. . . శ్రీసోమయాజుల రుద్రదేవయంగారి
17. కింబుణ్యముగాను వారి బావ రుద్రయ
18. పెద్దింగారు స్వస్తి శకవర్షంబులు ౧౨౧౩
19. గు ఖరసంవత్సర పుష్య బ ౧౫ సో (అ?) ర్ధోదయ
20. సూర్య్యగ్రహణకాలంబున తేరాలసిద్ధేశ్వర
21. ంబున రుద్రగుండంబున తీర్థస్నానంబుచేసి

* శ్రీ జయంతి రామయ్యపంతులుగారు మండెలికిచ్చిన నకలునుండి.

22. సిద్ధేశ్వరమహాదేవర దీపంబునకు ఆ
23. తేఱాలంగల మగమాను సుంకమును
24. తలారికమూను మరిని ఒండెమిఆయ
25. పేరను అడుగలేదు సర్వమాన్యము
26. దాతాపూర్వముచేసి ఆచంద్రార్కముగా
27. నిచ్చె... ... ... ... ...

---

# 35. గణపవరముశాసనము.

(గుజాత సం. 2 సంచిక 4)

1. స్వస్తిశ్రీజయాభ్యు
2. దయశకవరుష
3. ములు ౧౨౧౪అవు
4. నేంటి నందనసంవ
5. త్సరచైత్రశుగు
6. శ్రీమన్మహామండ
7. లేశ్వరప్రతాపకుమా
8. రరుద్రదేవమహారా
9. జులు పృథివిరాజ్యము
10. సేయుంగాను శ్రీ
11. మన్మహాప్రధాని గంగి
12. దేవనింగారి
13. కటము

# 36. కారెంపూడిశాసనము. *

మొదటిప్రక్క.

1. స్వస్తి నిజనామాంకమాళికాప్రశస్తి
2. సహితం స్వస్తి శ్రీమన్మహామండ
3. ళేశ్వర కాకెతియ్య ప్రయపరుద్రదేవ
4. మహారాజులు అనెకదెశం
5. బు లెలుచుం నుఖసంపదా
6. వినోదంబులం బ్రిథ్విరాజ్య
7. ంబు సెయుచుండగాను
8. స్వస్తి శ్రీసకవరుషంబులు
9. ౧౨౩౯ అగు నెంటి శొభకృ
10. త్ సంపత్సర ఆశ్వెజ సు ౧౧

---

* శ్రీ జయంతి రామయ్యపంతులుగారు మంపలికిచ్చిన నకలునుండి.

రెండవ ప్రక్క.

11. గు స్వస్తి శ్రీమతు స్వామిద్రో
12. హరగండ్డ స్వామివంచ్చకర గం
13. డ్డ ఇంమ్మడి నిస్సంఖవీర నర
14. మమహేశ్వరసమయచ
15. క్రవర్తి కలియుగవీరభద్ర
16. కీర్తిసముద్ర జమళిక బొగలి
17. ంగ శ్రీమతు మాంచయనా
18. ఇనింగారికిం బుణ్యముగా
19. ను వారి అడపము పోచూపెం
20. క్కంగారు కారెంపూడిని శ్రీనూరె
21. శ్వర దేవరగుడికి కేశవపెరుమాళగు
22. డికిని ఆమంటపమందు......
23. లైపడ్డ...డలూను ఆమం..

మూడవప్రక్క.

24. ముకోటను గర్భగృహముకు మం
25. టపముకూను ద్వారబంద్దసహితమైన
26. తలుపులు కట్టించి ఆచంద్రార్క్క
27. ముగాను సుంన్నము వెట్టించెను

---

# 37. ఉకుమాలశాసనము.

( సంజాత సం. 3 సంచిక ౧ )

1. నమ స్తుంగశిరశ్చుంబి
2. చంద్రచామర చారవే
3. త్రైలోక్యనగరారంభమూ
4. లస్తంభాయ శంభవే॥
5. స్వస్తి శ్రీ జయాభ్యుదయ
6. శకవరుషంబులు ౧౨౩ం అ
7. వు నేంటి కీలకసంవత్సర ఆ
8. షాడబ ౫సో కాకతీయవ్రి
9. తాపరుద్రదేవమహారాజు
10. లు పృథ్వీ రాజ్యము సేయుచుం
11. డంగాను స్వస్తి శ్రీమం న్మహా
12. ప్రధాని పురవరిమహాదే
13. వనాయంకులు॥

## 38. కలవకొలనుశాసనము.*

1 ఓం స్వస్తిశ్రీ జయాభ్యుదయ శకవర్షాలు ౧౨౮౩ అగు దు
2 ర్మతి సంవత్సర భాద్రపద శు॥ ౧౧ గురువారాన । స్వస్తిశ్రీ (మ) స్మ
3 హా మణ్డలేశ్వర కాకతీయ్య ప్రతాపరుద్రదేవ మహారాజు
4 లు పృద్ధిరాజ్యంబు సేయుచుండంగాను । స్వస్తిశ్రీ మ
5 న్మహాసామంతచేఱకు జగదాళు ఇమ్మడి దేవరంగా
6 రి సుపుత్ర(తు్ర)లు పోలయరెడ్డివారు తమకు ఆయురా
7 రోగ్యైశ్వర్యాభివృద్ధిగాను కలువకొలని శ్రీప్రసన్న
8 వల్లభదేవరకు అంగిరంగభోగార్థమై అష్టాదశప్రజ
9 లను అనుమతించి దారబోసి ఇచ్చినపత్రము కలు
10 వ కొలని సుంకానకు వచ్చిచూడబడిసర్వద్రవ్యాలవల
11 నను మాడబడి అమ్మబడి వీసం లెక్కనిచ్చిరి మరిన్నితమ
12 వర్తా...... త్తరిసియోగముజ......వ...............
13 బడి యాడబడి వీసం లెక్కనిచ్చిరి॥ ఈధర్మము ఆ చంద్రార్క
14 స్థాయిగానిచ్చిరి ................................

## 39. మాదిరెడ్డికుంటశాసనము.♦

1 యో రామేశ్వరపండితో యమిత దిగ్వ్య
2 ప్తో యశశ్చంద్రికా జాత్రై ర్వో
3 గుణరత్నరోహణగిరి ర్మాహేశ్వ
4 రగ్రామణీః । ఏతేషాం సురసద్మనా
5 చ కృతవాన్ పుంజం ఘృణాతత్పరో
6 దాతాన్నం వికలా ర్త్తదీనమునివిప్రే
7 భ్య స్తపోవిశ్రుతః॥ (1) కృత్వా నై
8 జనపల్యాః శివపురనామ త్రిపురు
9 షతీర్థం । స్వదత్తం యస్య భక్త్యా
10 త్రిభువనమల్లావనీశజనకేన॥(¹)
11 వేత్తా యా (యో)లకులేశ్వరాగమమ
12 హాసిద్ధాం స్తసారామృతం యే
13 నాస్యం(స్యాం) ప్రకటీకృ[illegible] పనుమ[illegible]
14 ధర్మ స్య(శ్చ) యస్యోత్త[illegible]
15 శిష్యో సౌ చలమత్తి[illegible]
16 తః పోలావనీవల్లభః [illegible]
17 స్థాపితవాన్ సుకీర్తి[illegible]
18 భాయితః శాశ్వతం॥ (3)

*ఈ శాసనము యొక్క నకలు శ్రీ దూపాటి వేంకట రమణాచార్యులవారి[illegible]

♦ మండలివారివద్దనున్న ప్రతిబింబమునుండి.





పాలంపేట దేవాలయము.—ఒకపార్శ్వము



పాలంపేట దేవాలయము—ఒకస్తంభము

By Courtesy of H. E. H. The Nizam's Archaeological Department.

# అనువాదము

(1)ఎవని "నితడు రామేశ్వరదీక్షితుడ" ని యన్నిదిశలను చెప్పుకొందురో, ఎవడు సద్గుణము
కు నిధియో, ఎవడు మాహేశ్వరులలో నగ్రగణ్యుడో, ఎవడు పరమదయాంతరంగుడై వికల
లకును, బాధితులకును, దీనవారికిని, సాధువులకును, బ్రాహ్మణులకు నన్నదానము చేయువాడ
అట్టి యతడీ దేవాలయమును గట్టించెను. (2) అతడు త్రిభువనమల్లరాజు తండ్రి తనకు భక్తి
తో నిచ్చిన జనపల్లెకు శివపురమని పేరిడి యందు త్రిపురుషతీర్థము వేయించెను. (3) అతడు లకు
లేశ్వరాగమసిద్ధాంతవేది. ధర్మసంస్థాపకుడు. అతని యుత్తమశిష్యుడగు చలమర్తి గండ ప్రో
రాజు శాశ్వతమగు కీర్తిస్తంభమును స్థాపించెను.

---

# కాకతీయసంచికానుబంధము

## అకారాదిసూచిక

—:o:—

# క

మ ——— ——